శ్రీశివాయగురవే నమః.

శ్లో॥ చరితం రఘునాథస్య, శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు శ్రీరామచంద్రమూర్తి చారిత్ర మును మహానుభావులగు కవివరేణ్యు లనేకు లనేక భాషలలోఁ గృతిగూర్చి యున్న వారు. అందఱకు నగ్రగణ్యుండగు వాల్మీకి మహర్షిసత్తముఁడు దేశికవరేణ్యుండగు నారదమహామునిచే సముపదిష్టుండై శ్రీరామాయణ మనుపేర నిద్దానిని గీర్వాణ భాషలో నిరువదినాలుగువేల శ్లోకంబులతోఁ బ్రప్రథమమున రచించెను. వెండియు నధ్యాత్మరామాయణ మనుపేర విశ్వామిత్రమునీంద్రుఁడు పార్వతీ పరమేశ్వర సంవాదరూపముగ నధ్యాత్మతత్త్వపూరితముగ విరచించి యలంకరించెను. పదంపడి బాదరాయణ మహామౌనిశేఖరుండు తన పురాణోప పురాణములయందును భార తామ్నాయమందును శ్రీభాగవతంబునను నీ సుచరిత్రమును వివరించియున్నవాఁడు. మఱియు వాశిష్ఠానందాది రామాయణము లనేకములు గలవు. అనంతరకాలమున నాంధ్రభాషలో భాస్కరకవీంద్రుఁ డీచరితమును దనపేర రామాయణ మనియే వ్రాసియున్నాఁడు. నన్నయభట్టారకుండును బోతనకవినాథుండునుఁ దమ యాంధ్ర మహాభారత భాగవత గ్రంథములలో నిద్దానిని సంక్షేపయోగ్యముగా నుల్లేఖించి యున్నారు. మొత్తముమీఁదఁ గవులని పేర్కొనంబడిన యేవారును శ్రీరామచరిత మును నాటకరూపముగాఁ గాని చంపూప్రబంధముగాఁ గాని కావ్యముగాఁ గాని సాధారణ గ్రంథముగాఁ గాని వ్రాయనివారు గాన్పింపరు.

శ్రు॥ "భద్రోభద్రయాసచమాన ఆగాత్స్వసారంజారో అభ్యేతిపశ్చాత్" అను నిది మొదలగు శ్రుతియు, రామతాపినీ, రామహృదయాద్యుపనిషత్తులును రామ చరిత్ర ప్రశంస నొనరించుచుండుటయు, నభినవగుప్త పాదాదులగు నలంకారవేత్తలు సూ॥ "బ్రహ్మానందాదప్యతి రిచ్యతే కావ్యరసః" అనియు "నాయకో యదివర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః" అనియు, "ఉత్తమోత్తమ నాయకస్తు శ్రీరామప్రభురేక ఏవ" అనియు, వక్కాణించి యున్నారు. మురారిభట్ట కవీంద్రుండును, దన నాటక మున "యదిక్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్యచరిత మిత్యాది ప్రస్తావమున, రామచరితమును రచింపని కవుల యగతికత్వమును నిరూపించియున్నాఁడు. ఇట్టిహేతు పరంపరలు ప్రబంధరచనా కుతూహలియగు నా హృదయమునఁ బ్రవేశించి ప్రేరేప శ్రీరామకథాఽమృత మను పేర నే నీ యాంధ్రప్రబంధమును రచియింప దొరఁకొని

శ్రీవాల్మీకి సంయమివరకృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మరామాయణ ఘట్టములిందుఁ జేర్చుచు ననుబంధివర్ణనాంశముల స్వతంత్రించుచు నీగ్రంథము నుత్తరకాండంబుతోడం గూడ, గాయత్రీచతుర్వింశతి వర్ణాంకితచతుర్వింశతి సహస్ర గద్యపద్యాత్మకంబుగ మునిభావరహస్య వివరణంబొప్పఁ దత్ప్రసాద విశేషంబునం బూరింపఁగలిగితిని. గురుకులవాస సమయముననుండియు నుభయభాషా కవితాభ్యాసము గలిగియుండుటచే శ్రీశైల తీర్థసారము మున్నగు సంస్కృత గ్రంథములును మఱికొన్ని మిశ్రభాషా ప్రబంధములును రచించితిని. అన్నియుఁ బరమేశ్వరార్పితములే, అసూయాగ్రస్త హృదయులకుఁ దక్క నా రచించిన పొత్తములు సహృదయులగు పండిత కవిరాజ హంసంబులకు మహితానంద దాయకంబులు గాకపోవని నా నమ్మకము. ఎట్లైన నేకకర్తృకంబగు మత్కవితా పరిశ్రమముం గూర్చి కృతి కథానాయకులు సుసంప్రీతులరగుదురనుట సర్వథా నిశ్చితార్థము. తక్కంగల యెల్ల యంశంబులకు నీప్రస్తుత గ్రంథరాజమే సత్కవితాధురంధరుల చిత్తస్థానంబున కెక్క సాక్ష్యమీయఁ గలయది యనియు, నాచేఁ బ్రకటింపఁబడఁబోవు శ్రీ రామాయణ ప్రశంసాఖ్య సమాహృతియం దశేషవిశేషంబులు నిరూపింపఁ బడఁగలవనియు విన్నవించుచు నీ యుపోద్ఘాతమునింతటితో ముగించుచున్నాడను.

గ్రంథకర్త:

శ్రీముఖ : పంచమి<br>జ్యేష్ఠము.

తాడేపల్లి వేంకటప్పయ్యాశాస్త్రి,<br>గుంటూరు మండలి, చందవోలు.

చదువరులు శుద్ధాశుద్ధ పత్రికలోని సవరణలను గ్రంథమందుఁ జేర్చుకొనం బ్రార్థితులు.

తా॥ వెం॥ శా॥

శ్రీశివాయగురవేనమః

# శ్రీరామకథామృత ప్రబంధ విషయసూచిక.

## బాలకాండము

—:(o):—

### ప్రథమాశ్వాసము

పుట సంఖ్యా.



### ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.

## సప్తమాశ్వాసము.

పుట సంఖ్యా.

## అష్టమాశ్వాసము



## నవమాశ్వాసము



## దశమాశ్వాసము.

శ్రీశివాయగురవేనమః.

# శ్రీ రామ కథామృతము

## బాలకాండము.

:o:

### ప్రథమాశ్వాసము

:o:

శ్రీయున్గౌరియు వాణియున్గొలువ స ♦ చ్చిత్తత్వమయ్యున్మహా
మాయారూఢి నతండితండను భిదా ♦ త్మత్వంబు గూపించి యెం
దే యోగీంద్రులు స్వాత్మరాముఁడనఁ దా ♦ నే వెల్గునే వెల్గు న
న్బాయంజాలని ప్రేమ నా హరిహర ♦ బ్రహ్మంబు రక్షించుతన్. ౧

సీ॥ బ్రహ్మత్వమున సర ♦ స్వతినాగ నారాయ, ణత్వంబునను లక్ష్మిగా ♦ నామహేశ్వ
రత్వంబుననగాద్రి ♦ రాజకన్యక నాగ, భానుత్వమునఁ బ్రభా ♦ ప్రథితినగ్ని
రూపునస్వాహాస్వ ♦ రూపంబునను యజ్ఞ, మగునెడ దక్షిణ ♦ యన జగన్మ
యత నిట్లు వివిధపుం ♦ వ్యక్తిభాసిలు నీశు, నకుఁదోనె స్త్రీవ్యక్తి ♦ నాతిభాతిఁ
దనరి సర్వంబుఁ దానయై ♦ తత్త్వయుక్తిఁ, జే నతద్భిన్నయగుచు ని ♦ శ్శ్రేయసాత్మ
నమరు భువనేశ్వరీదేవి ♦ ననుదినంబు, బ్రస్తుతించెద భవపాశ ♦ బంధమెడల. ౨

తే॥ ఒకరొకరిమేలి తపముల ♦ కొక్కరొకరు, ఫలములై లోకజనకులై ♦ పరఁగియాత్మ
గురువులై ప్రోచు తొల్లింటి ♦ గొనబువేల్పు, టాలుమగలఁ దలంతు న ♦ త్యంతభక్తి.

చ॥ కుడుమిడునంతఁ బండువని ♦ కొంచుఁ దలంచెడువారి గోరము
ల్గెడపుచు వేల్పులెల్లఁ దనుఁ ♦ గీర్తనసేయ నమేయలక్ష్మి నె
ప్పుడు మునుమున్నె లోకములఁ ♦ బూజ్యత కెక్కియు దూర్వపూజ మె
చ్చెడు దొర గూర్చు మత్కృతికి ♦ శ్రీరుచిరత్వమనంతరాయమున్. ౪

తే॥ సరవిద్విముఖ చతుర్ముఖు ♦ ల్షణ్ముఖుఁడు స
హస్రముఖుఁడు మఱియు నా స ♦ హస్రముఖుఁడుఁ
బంచముఖ శేషులై యుంటఁ ♦ బ్రాంజలినయి
కొలుతు దీర్ఘాయువిడుఁడని ♦ కోరివారి. ౫

తే॥ ముజ్జగమువారు స్రష్టయ ♦ మూల్యరత్న, సారములఁగూర్చె నీపల్కు ♦ చానమిన్న
ననఁజెలువు కీర్తిచెలువునఁ ♦ దనరునలువ, చెలువ మత్ప్రజ్ఞనిలువఁ గాం ♦ క్షించుఁగాత.

తే॥ మున్ను జగమెల్లఁదానయై ♦ పన్నగశయు, యోగమాయ యనందగి ♦ యోజవేద
వతియనందోఁచి సీతయై ♦ భక్తవరుల, మనుచు నాతల్లి లక్ష్మి క్రనే ♦ మదిఁదలంతు.

ఉ॥ అంజనగన్ననోముఫల ♦ మర్కఫలీకరణోద్యతుండు మృ
త్యుంజయ వీర్యుఁడస్తకలి ♦ శోద్ధతిదేవవరాంచితుండు ధీ
రంజిత భానుసూనుఁడిత ♦ రామపదుండవనీ సుతావిప
ద్భంజనుఁడస్రపాంతకుఁడు ♦ పావనిపావనమూర్తి బ్రోవుతన్. ౮

శా॥ పుట్టంబుట్టిన దిట్టకావ్యరమకుం ♦ బుట్టిల్లుపాపౌఘముల్
న్మట్టంజాలినమేటి పున్నెముల వి ♦ న్నాణంపు బన్పెట్టె మే
ల్పుట్టంబాగమరాశికంచిత తప ♦ స్తోమాత్మ దృక్కన్య కే
ల్చెట్టంబట్టిన సామినాఁజెలఁగు వా ♦ ల్మీకిన్మదిం గొల్చెదన్. ౯

క॥ దేశికవరేణ్యుఁడై యుప, దేశించెన్మునికి రాము ♦ దివ్యకథ నెవం
డాశాస్యచరిత్రుఁ డయ్యఘ, నాశకరసత్కృష్టినింతు ♦ నారదుఁగొలుతున్. ౧౦

తే॥ వందనము లాచరింతు సం ♦ క్రందనాది, దివిజవరులకు సనకాది ♦ దివ్యమునుల
కగ్రగణ్యులు కాళిదా ♦ సాది కవుల, కెంతయుఁ బ్రపత్తినెపుడున్ని ♦ యేలిమార్లు.

సీ॥ అఖిలరక్షణ పరా ♦ యణుని నారాయణుఁ, బ్రథితలోకోద్భవుఁ బద్మభవుని
బ్రియతపోనిష్ఠాగరిష్ఠు వశిష్ఠుని సన్నివిష్టాధ్యాత్మ ♦ శక్తి శక్తి
స్వగతసంహృత పరా ♦ శరునప్పరాశరు ♦ లాలితవిద్యావిలాసు వ్యాసు
నమలామృతఫలరసా స్వాదశుకు శుకు ♦ గలితనిత్యామోదు గౌడపాదు
విమల విజ్ఞాన భోగి గో ♦ విందయోగి, శ్రితశుభంకరు శంకర ♦ శ్రీయతివరు
భవ్యసంధాని శ్రీపద్మ ♦ పాదమౌని, లబ్ధపరమేశుహస్తామ ♦ లకయమీశు. ౧౨

ఆ॥ పరమతాటవీవి పాటకుఁ దోటకు, మండితాఖిలాఖ్య ♦ మాధవాఖ్య
మఱియు నన్యులైన మద్గురువర్యుల, బూజసేయుదు నెదఁ బొదలుభక్తి. ౧౩

సీ॥ సరసులఁ దేర్చి హం ♦ సప్రకాశముఁ గూర్చి పంకౌఘమెల్లెడఁ ♦ గ్రుంకనార్చి
రాజుఁగలాస్ఫూర్తి ♦ రాజిల్లఁగ నొనర్చి పద్మప్రసన్నతఁ ♦ బరఁగ నెఱపి
జాతిసిద్ధాంతమ్ముఁ ♦ జక్కగాఁ బ్రకటించి చపలోపలబ్ధి శాసన మడంచి
విద్విషద్ఘనులవె ♦ ల్వొలఁబాఱఁ బోఁదోలి దిశలను విజయశో ♦ వశలఁజేసి
వఱలుశంకర సద్గురు ♦ వరుని పేరి, శరదృతు విభుండు కువలయో ♦ త్సవ కరుండు
దాసమానస పుష్కర ♦ తలమునందు, జ్ఞానఘటజన్ము వెలయింపఁ ♦ బూనుటరుదె.

ఆ॥ బ్రహ్మతత్త్వమంది ♦ పరచిదానంద య, తీంద్రసంజ్ఞఁ దనరి ♦ యెలమి నన్నుఁ
బ్రోవఁజాలినట్టి ♦ పుణ్యసంద్రుశు వ్యాస, సద్గురుశు గురువరేణ్యు ♦ సంస్మరింతు.

సీ॥ తనుఁబరీక్షింపఁబూ ♦ నినత్రిమూర్తుల నర్భ ♦ కులఁ జేసె నెవ్వాని ♦ కులపురంధ్రి
శాపోక్తిశతమఖై ♦ శ్వర్యగర్వస్ఫూర్తి ♦ వనరాశిఁగలిపె నె ♦ వ్వానిసుతుఁడు
నిఖిలజగత్ప్రీతి ♦ నెఱప్రు వెన్నెలఁ దేనిఁ గనియె నెవ్వాని దృ ♦ క్కంజలక్ష్మి
స్వతపఃప్రభావ మో ♦ హితముక్తి కుచతటా వరణోత్తరీయమె ♦ వ్వానిసుయశ
మాసుగుణరాజధాని మ ♦ హావధాని, వేదవేద్యైకసన్మాని ♦ వినతమాని
హర్షవేణీస్నపితమౌని ♦ యత్రిమౌని,పోసఁగుకారుణ్యమున మమ్ము ♦ బ్రోచు నెపుడు

ఆ॥ ఆత్రిమూర్తికీర్తు ♦ లడియాలములుఁగఁ దద్ద త్తమూర్తి యగుచుఁ ♦ దానతోఁచె
నత్రిమౌని కనఘు ♦ కనసూయకమ్మహా, త్రేయ యోగివరు స్మ ♦ రింతు నెపుడు. ౧౭

ఆ॥ అమ్మునీంద్రగోత్ర ♦ మందు జన్మించి బ్ర,హ్మాత్మకేవలత్వ ♦ మవధరించి
ప్రథితిగన్నరామ ♦ భట్టారకుమదన్వ, యప్రధానపురుషు ♦ నభినుతింతు. ౧౮

సీ॥ అఖిలవేదాంగ వి ♦ ద్యావదాన్యుఁడు సింగధన్యుఁ డేకృతి బ్రపి ♦ తామహుండు
శ్రుతిచయోచ్చారణా ♦ రూఢతాబ్రహ్మసు బ్రహ్మణ్యుఁడే భవ్య ♦ భావుతాత
యాగమరత్న ర ♦ త్నాకరుండలబుచ్చయార్యుఁ డేసత్కళా ♦ ధుర్యుతండ్రి
లలితలక్షణయక్క ♦ లక్ష్మాంబతులితాంబ కడుపారనేయన్న ♦ గన్నతల్లి
శ్రీపదాంతరోప ♦ జీవితనారాయ, ణాహ్వయుఁడేయుదారు ♦ నన్నగారు
హర్షమూర్తినమ్మ ♦ హామహుమాతండ్రి, హనుమదాఖ్యుసంస్త ♦ వన మొనర్తు.

తే॥ తారకబ్రహ్మపదము ని ♦ త్యము రసజ్ఞ, నమరమున్నాంజనేయుఁ డె ♦ ట్లవధరించె
నట్లభిన్నతమన్న మా ♦ యన్న నెపుడుఁ, దత్తదాత్మతమది చివు ♦ రొత్తఁ దలఁతు.

ఆ॥ కన్నతండ్రియయ్యెఁ ♦ గరుణాబ్ధినామన్చెఁ, గళలఁ బెన్చెబోధ ♦ ఘటనఁ దేర్చె
నట్టిప్రవరు లక్ష ♦ మాంబికేశ్వరుగురు, నలవియగునెపొగడ ♦ హనుమదార్యు.

క॥ తులనావిరహితు విద్యా, నిలయుఁ గారుణ్యమూర్తి ♦ నిర్మలుమన్మా
తులునిఁ బ్రథమాచార్యుని, దలఁతుఁ లక్ష్మీనృసింహుఁ ♦ దనరుప్రపత్తిన్ ౨౨

సీ॥ పెంచెనేఘనుఁడు సం ♦ ప్రీతిమత్ప్రీతిభాల, తికఁ గృపారసమునఁ ♦ దెలివిఁబొదలఁ
గాచెనేద్విజరాట్టు ♦ కళలఁబ్రోదియొనర్చి, నవనవత్వంబు వి ♦ న్నాణముగను
వీచెనేసద్గతి ♦ విలసద్గుణస్థితి, దాక్షిణ్యమెవ్వేళఁ ♦ దఱుఁగకుండఁ
జూచెనేయనఘుండు ♦ సొంపుమైదోహద, ఘటననిక్కువుఁ బ్రేమ ♦ గడలుకొనఁగ
నమ్మహాత్ముల యజ్ఞ నా ♦ రాయణైక, నాముఁ గోటీశ్వరుని సోమ ♦ నాథు వేంక
టార్యు మద్గురువర్యుల ♦ నలఘుభక్తిఁ, బూజఁగావింతు వాక్సుమం ♦ బులఁ బొసంగ

తే॥ వర్ణగురు దండినాము స ♦ ద్వర్ణనీయు, వర్ణనమొనర్తువర కరు ♦ ణార్ణవమని
తెలివిమీఱంగ వేదాంత ♦ దేశికేంద్రుఁ, గోటనరసింహ మునిమదిఁ ♦ గూర్తునెపుడు.

ఉ॥ వాగను శాసనుం దలఁతు ♦ వాఁడగుఁ బ్రొద్దన జోడుకోడె స
ర్వాగములం దొలంచు పని ♦ యాతనికైతదె కుండలీంద్రుఁడే
తాగురుఁ డెట్లుగాఁడు జన ♦ తానతు శ్రీనుతుఁ దిక్కనార్యు న
ల్లేగుణ వత్ప్రబంధ పర ♦ మేశ్వరు నెట్టన సన్నుతించెదన్. ౨౫

ఆ॥ పోతవోసె నేమొ ♦ పొసఁగు సువర్ణముల్, పోతనాఖ్యుతనకుఁ ♦ బొనరె నెట్టు
లట్లుగాకయున్న ♦ ననఘుఁడాంధ్ర కవీంద్ర, వర్ణనీయపదుఁడు ♦ వఱలునతఁడు ౨౬

క॥ శ్రీనాథ ప్రభృతుల నటు, శ్రీనాథ ప్రకృతులన్ భ ♦ జించెద మదిలో
నేనా న్మాషిఃకురుత ఇ, త్యా నీతోక్తిప్రచార ♦ మారసి నిరతిన్ . ౨౭

ఆ॥ అజున కెక్కుడగుచు ♦ నలరు సత్కవిరాజ, హంసరాజిఁ బొగడ ♦ నలవియగునె
తప్పనీటిన వలఁ ♦ దలఁగఁద్రోయుచు నొప్పు, పాలుగొనుచుఁ బ్రీతిఁ ♦ బ్రబలుఁగాన.

క॥ అని యిష్టదేవతా వం, దనమును గురుసేవ సుక వి ♦ తతి ప్రార్థనముల్
బొనరుపడ సత్ప్రబంధం, బొనరింపఁ దలంపు పుట్టి ♦ యున్నట్టియెడన్. ౨౯

ఆ॥ ముజ్జగములఁ గీర్తి ♦ మొనసి వెలుంగుము, రాఁదిసుకవి కావ్య ♦ మందుమున్న
జరిపినట్టి రామ ♦ చరిత ప్రశంసయుఁ, దక్షిణంబ యొడఁదఁ ♦ దవిలి వెలయ. 30

తే॥ పసులఁగాచెడు వారల ♦ పగిదిఁ గట్టు, వట్టిపాలింపఁబోరు దే ♦ వతలు ప్రీతి
నెపుడెవనిఁ బ్రోవనెమ్మది ♦ నెంతు రతని, కసదుగాని తెలివిగూర్తు ♦ రను తెఱంగి

వ॥ ఏను మునుమున్న శ్రీరామభద్ర చరిత్ర పవిత్రితంబగు నొక్క ప్రబంధరాజంబు
రచియింపం దొరఁకొంటి.

ఆ॥ వెలయు వ్యాకృతి శిక్షాది ♦ వివిధశాస్త్ర, లలితపాండిత్య లక్ష్మిలో ♦ జ్వలతఁగానఁ
దరుణ ధవళకిరణ కలా ♦ భరణ చరణ, సరసిజాజస్రకైంకర్య • సరణి దక్క. 33

చ॥ అనఘులు నాకుజ ప్రముఖు ♦ లారఘువర్య కథార్ణవంబు హె
చ్చినమతి మందరాకలనఁ ♦ జేరి మథించి రసాప్తిమించి యొ
య్యన జగమెల్లఁ బ్రోచిరటు ♦ లారయఁగల్గునె నన్ను బోంట్లకి
ట్లని విరమింతుమన్నఁ దమ ♦ కాఁగవు కుత్తుక బంటి కోరికల్. 34

ఆ॥ నీటఁదేలె గిరులు ♦ నేలఁద్రొక్కిరి సురల్, పూరి బ్రహ్మశరతఁ ♦ బొల్చెతాయి
మగువయయ్యె దేని ♦ మహిమనీయదెతన, కట్టి రాము చరిత ♦ మభయమిపుడు.

క॥ అని పూనితి నిప్పనిఁ దె ♦ ప్పనిఁ దన్మని మథిత చరిత ♦ మున సారాంశం
బనునిది రామకథాఽమృత ♦ మను సంజ్ఞం దనరియుంట ♦ కర్ణంబెకదా 35

ఆ॥ చేనికాఁపు చెఱకు ♦ చెట్టుపెట్టి రసంబు, గాఁచి యచ్చుపోసి ♦ ఘనతఁ బెట్టఁ
జాకవిదులు దాని ♦ బహుభక్ష్యభేదాప్తి, ననుభవింపఁజేయు ♦ టసదు పనియె ౩౭

ఉ॥ ఏప్రభు సత్కృపాగరిమ ♦ నీకృతి యాకృతిఁగాంచె నాయెడన్
భావము పొంగ నాభువన ♦ పావనమూర్తికి దీనినిచ్చెదన్
దైవత వల్లభాదులకు ♦ దత్పరిపాలిత సస్య హేతుకం
బై విలసిల్లు హవ్యమెటు ♦ లయ్యజమానుఁ డొసంగు నట్లుగాన్ ౩౮

క॥ పరమేశ్వరార్పితంబై, పరఁగెడు నర్థమెదియేనిఁ ♦ బరమార్థంబై
పనతత్త్వయోగ ఘటనా, పరమగునని పెద్దలెల్లఁ ♦ బలుకుదు రెపుడున్. ౩౯

సీ॥ యత్ప్రకాశమున ♦ నియ్యఖిలంబునకు జన్మ, నిష్ఠావినాశము ♦ ల్నివ్వటిల్లు
నెత్తావువలనుండి ♦ యెదగూడి వాక్కులు, మలయలే కూరక ♦ మఱలివచ్చు
నేపదం బసదుగా ♦ నెఱుఁగు వాఁడెందు, లే నే లేఁడటంచు శ్రు ♦ త్యాలివలుకు
నెచ్చోటు గన్నఁదా ♦ సచ్చిదానందాత్మ, నొప్పారు చున్నట్టి ♦ యుక్తిదోఁచు
నే సవితృమూర్తి మనబుద్ధు♦లెపుడుధర్మ, ముఖ్యగోచరములు గాఁగ♦మోహరించు
నప్పరాత్పరు నవ్యయు ♦ నభవు భవ్యు, నిత్యుపరమేశు నియతిధ్యా♦నించిమించి

వ॥ తత్సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీరామ కథాఽమృతంబను మహా
కావ్యంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

## —♦ కథా ప్రారంభము ♦—

క॥ తపమున స్వాధ్యాయంబున, సుపరము వాగ్విద్వరేణ్యు ♦ శుద్ధాత్ము మునీ
శపదాఢ్యు నారదుంగని, తపస్వి వాల్మీకి పలికెఁ ♦ దద్దయు భక్తిన్. ౧

సీ॥ అర్థివేఁడెద నిన్మహర్షిసత్తమగూర్పు, మీప్రశ్న యోగార్థ ♦ మెలమిదోనఁక
నీలోకమున నెవ్వఁ ♦ డిక్కాలమునను స్తు, గుణరత్ననిధినాఁగ ♦ గొమకుమిగులు
నెవ్వానిదగు బీర ♦ మీరేడుజగముల, కెక్కె నెక్కొనఁజాలి ♦ యెసకమెసఁగు
ధర్మజ్ఞుఁడు కృతజ్ఞ ♦ తాసంశ్రయుఁడు సత్య, వాక్యరతుఁడు దృఢ ♦ వ్రతనిరతుఁడు
చారుచారిత్రయుక్తుండు♦సర్వభూత,హితుఁడు విద్వాంసుఁడు సమర్థు♦డెక్కటిప్రియ
దర్శనుండాత్మవంతుండు♦తాల్మిఁగ్రోధు,మలఁచె నెవ్వాఁడెవఁడుద్యుతి♦మత్ప్రవరుఁడు

క॥ అనసూయకుఁడన నెగడిన, తనకోకయెడ రోసమొదవఁ ♦ దలఁకుదు రమరుల్
ఘనసంగరరంగంబున, ననఘుఁదథాభూతుఁ బురుషు ♦ నరసి తెలుపవే. ౩

ఆ॥ వేడ్కతోడిదగుచు ♦ వెలసెను శ్రవణేచ్ఛ, గానననుఁ గృతార్థుఁ ♦ గానొనర్పు
మెల్లమెఱుఁగుదీవ ♦ నీదృశమహిముఁడ, విట్టినిన్నుఁజేరి ♦ యెలయువాఁడ ౪

క॥ అని వేఁడఁ ద్రిలోకజ్ఞుఁడు, మునివర్యుఁడు నారదుండు ♦ ముని వాల్మీకిం
గనుఁగొని ప్రహృష్టుఁడై యిట్లనె వినుమో యన్న యను స♦ మాహ్వానముతోన్.

తే॥ తాత! నీచేతసంకీర్తి ♦ తంబులైన, గుణములు సుదుర్లభములవి ♦ గణనసేయ
శక్యములుగావ యైనఁద♦త్సహితునొక్క, పురుషునారసి తెలిపెదఁ♦బొసఁగవినుము.

తే॥ పావనేక్ష్వాకువంశప్ర ♦ భవుఁడు రాముఁ,డన జనులచేసుసంశ్రుతుం ♦ డైనవాఁడు
వెలయునియతాత్మకుఁడుమహా ♦ వీర్యుఁడుద్యుతి,మంతుఁడటు ధృతిమంతుఁడు ♦
[న్మనుఁడు వశియు. ౭

వ॥ మఱియు నమ్మహామహుండు బుద్ధిమంతుండు నీతిమంతుండు వాగ్మియు శ్రీమం
తుండును శత్రునిబర్హణుండును విపులాంసుండును మహాబాహుండునుఁ గంబుగ్రీ
వుండును మహాహనుండును మహోరస్కుండును మహేష్వాసుండును గూఢ
జత్రుండు నరిందముండు నాజానుబాహుండు సుశిరస్కుండు సులలాటుండు
సువిక్రముండు సముఁడు సమవిభక్తాంగుండు స్నిగ్ధవర్ణుండు ప్రతాపవంతుఁడు పీన
వక్షుండు విశాలాక్షుండు లక్ష్మీవంతుండు శుభలక్షణుండు ధర్మజ్ఞుండు సత్య
సంధుండుఁ బ్రజాహితరతుండు యశస్వియు జ్ఞాన సంపన్నుండును శుచియు
వశ్యుండును సమాధిమంతుండునుఁ బ్రజాపతిసముండును శ్రీమంతుండును ధాతయు
రిపునిషూదనుండును జీవలోక రక్షితయు ధర్మపరి రక్షితయు స్వధర్మ రక్షితయు
స్వజనరక్షితయు వేదవేదాంగ తత్త్వజ్ఞుండును ధనుర్వేద నిష్ఠితుండును సర్వ
శాస్త్రార్థతత్త్వజ్ఞుండును స్మృతిమంతుండును బ్రతిభానవంతుఁడును సర్వలోక
ప్రియుండును సాధువు నదీనాత్ముండును విచక్షణుండునునై యొప్పారుచుండు.

తే॥ సింధువులతో సముద్రంబు♦చెలువుమీఱ, సతతముగా సజ్జనులతోడ♦సమభిగతుఁడ
యగుచు నెగడొందు వాఁడార్యుఁ♦డఖిలసముఁడు, తా నెసర్వదైకప్రియ♦దర్శనుండు.

క॥ ఆ సర్వగుణోపేతుఁడు, కౌసల్యానందవృద్ధి ♦ కరుఁడై పరఁగున్
భాసురగాంభీర్యంబున, నా సరితాంపతియు స్థైర్య ♦ మం దగపతియున్ ౧౦

ఆ॥ విష్ణు సదృశుఁ డతఁడు ♦ వీర్యంబునను బ్రియ, దర్శనుండు తుహిన ♦ ధామునట్లు
క్రాలు క్రోధమునను ♦ గాలాగ్ని సన్నిభుం, డౌక్షమన్ క్షమాక్ర ♦ మాంచితుండు

ఆ॥ త్యాగమున నతండు ♦ ధనద సదృక్షుండు, సత్యమునను ధర్మ ♦ సహభువుండు
నాఁదనర్చునెందు♦ననుచు నాఘనుఁబోలఁ, గలఁడెయొండు మూఁడు ♦ లోకములందు

సీ॥ అటు గుణసంపన్నుఁ ♦ డైన రాము మహాత్ము, సత్యపరాక్రము ♦ సహితు జ్యేష్ఠు
శ్రేష్ఠగుణాఢ్యు సు ♦ శీలుఁ బ్రియున్సుతుఁ,బ్రకృతిహితాంచితుఁ ♦ బరముఁగాఁగ
నెంచియాదశరథా ♦ ధీశుండు సంప్రీతిఁ, బ్రకృతిసంప్రియకామ్య ♦ పరఁగుచుండె
యౌవరాజ్యరమా స ♦ మన్వితుఁబొనరింప, నెంచియన్నెఱిఁబ్రవ ♦ ర్తించుచుండ

నకు కుమారవర్యు ♦ నభిషేకసంభార, ములను గాంచి దేవి ♦ మోహనాంగి
భార్య పూర్వదత్త ♦ వర భర్తనిట్లని, యడిగెఁ గైకయుక్తి ♦ యనువుపడఁగ. ౧౩

క॥ మునుఁ దనకీవు వరద్వయ, మునుఁ బ్రీతినొసంగి తందు ♦ మొనకొనుసద్దా
నను రాముఁ బనుపు మడవికి, ననువుపఱుపు మొంట భరతు ♦ నభిషేచనముల్.

ఆ॥ అనిన సత్యవచను ♦ డాజనేశుఁడు ధర్మ, పాశబద్ధుఁడగుచు ♦ బనిచె వనికి
రాము సన్మనోభి ♦ రాముఁ బ్రియాత్మజు, స్త్రీజితుండ ననుచు ♦ సిగ్గుపడుచు. ౧౫

క॥ జనకువచన నిర్దేశం, బును జననియభీప్సితమునుఁ బోద్రోవక యు
న్మనుఁడక్షీరుఁడు సంగర, మను పాలించుచు వనమున ♦ కరిగెం బ్రీతిన్. ౧౬

ఆ॥ అట్టులరుగు నన్న ♦ నాసుమిత్రానంద, వర్ధనుండు ప్రియత ♦ వఱలు భ్రాత
లక్ష్మణుండు వినయ ♦ లక్ష్మీసఖుండు సౌ, భ్రాత్రముల్లసిల్ల ♦ బలసి చనియె. ౧౭

తే॥ రామునకు నభిరామ భా ♦ ర్యాత్వనిత్య, ప్రాణసమహిత జనకజ ♦ ప్రహిత దేవ
మాయనా సర్వలక్షణ♦మహిత స్త్రైణ, మణి వధువు సీతయను పేర♦మాన్య వెలయు.

క॥ ఆయమయు రాముఁ జంద్రుం, డోయము రోహిణియపోలె ♦ దొరసి యరిగె సు
శ్రీయుతుఁ బౌరజనులు భూ, నాయకుఁడుం బెరసిరాస్థ ♦ నలువొందంగన్. ౧౯

ఆ॥ అట్లు దూరమొరయు ♦ నవ్వారి డిగనాడి, గంగయొడ్డుసేరి ♦ శృంగిబేర
పురి నిషాదనాథుఁ ♦ బుణ్యుఁ బ్రియుం గుహుఁ, నెనసి సూతుఁ బనిచె ♦ నెలయఁ బలికి.

క॥ సీతయు లక్ష్మణునుఁ ద, న్నాతత భక్తిమెయిఁ గొలువ ♦ నటు సహాయుఁడై
నేతి? వనములన్నదులం, బ్రీతిఁ గడచి పెరసె రామ ♦ పృథ్వీధరముల్. ౨౧

ఆ అల్ల చిత్రకూట ♦ మందు భరద్వాజ, శాసనమున నిలిచె ♦ సతియు ననుజుఁ
డునుముదాత్ముఁ దన్ను♦మొనసి కొల్వందగు, కూటమొకఁడుగూర్చు ♦ కొనిప్రసక్తి

తే॥ దేవగంధర్వ నిభులను ♦ భూవరుండు, వీడి పుత్ర శోకాక్రాంతి ♦ వివశుఁడగుచు
దశరథుఁడు స్వర్గతుండయ్యెఁ♦దడవుపనవి, రామ రామా యటన్నని♦ప్రాపిదమొప్ప.

ఆ॥ ఆతఁడట్లు చనిన ♦ నలవశిష్ఠాదులౌ, గురులు దెలుపనైన ♦ గూర్పఁడయ్యె
నెడఁద రాజ్యలక్ష్మి ♦ నీరేడు జగములు, మెచ్చ భరతుఁడన్న ♦ నిచ్చఁ జేర్చి. ౨౪

క॥ పరికరముఁ గొంచు వనమున, కరిగెన్ భ్రాతృ ప్రసాద ♦ నార్థిత పొసఁగన్
గురుభక్తి వేఁడెఁ బ్రబలుఁడు, పరాక్రమోపేతు, రామ ♦ భద్రు, మహేచ్ఛన్.

ఆ॥ ధర్మ విదుఁడ వీవె ♦ తగుదు రాజ్యశ్రీకి, ననుచు దోసిలొగ్గి ♦ యడిగె భరతుఁ
డిచ్ఛగింపఁడయ్యె ♦ నెంత వేఁడిన రాముఁ, డయ్యె యొసఁగినట్టి ♦ యాజ్ఞఁ దలఁచి.

క॥ సుముఖుఁడు పరమోదారుఁడు, సుమహిత యశుఁడునగు రామ♦సుత్రాముఁడు రా
జ్యము సుమహాబలుఁ జెన్నియుఁ, దమ గురునానతి తొలఁగఁ ♦ దగదనువృత్తిన్.

తే॥ పాదుకల రాజ్యమొసరింప♦భరతునకొగి, న్యాసముగనొప్పనిడి భర♦తాగ్రజుండు
పొసఁగమరలించె నాతని♦ బొమ్ము తమ్ముఁ, డా! ప్రజలనేలుమని మాటి♦కనువదించి.

క॥ తనయిచ్ఛదీఱకున్నన, తని యిచ్ఛమెయిన్ మెలంగు ♦ తలఁపున రఘురా
మునకెఱఁగి తరలినేమ, మ్మున నందిగ్రామసీమ ♦ మునినుతుఁడెన సెన్. ౨౯

క॥ రామాగమనంబెన్నుచు, నామహితుండపట రాజ్య ♦ మరయుచునుండెన్
శ్రీమంతుఁడు రాముని యు, ద్దాముని పాదుకలదృష్టి ♦ తద్దయు నెఱయన్. 30

తే॥ నాగరజనాగమంబందు ♦ ననుచు నదియు,కాఁగఁదలపోసి నైకాగ్ర్యి ♦ కలనపోసి
శ్రీయుతుఁడు సత్యసంధుఁడు♦సేరెభరతుఁ,బనిచి దండకారణ్యము ♦ య్యనకులుండు.

తే॥ రాముఁడమ్మహారణ్యంబు ♦ రాణిఁబెరసి, సూచనంబొప్ప రాజీవ ♦ లోచనుండు
ఘనువిరాధాఖ్యురాక్షసుఁ♦గాలపురము,మార్గమొనయించి శరభంగ♦మౌనిఁగాంచె.

ఆ. అటు సుతీక్ష్ణయోగి ♦ నయ్యగస్త్యు నగస్త్యు, భ్రాతఁజూచికొలిచి ♦ పరఁగుపూజ
లంది కలశసంభ ♦ వాభ్యనుజ్ఞగ్రహించె, నైంద్రఖడ్గశరశ ♦ రాసనములు. 33

క॥ అమ్మెయి నక్షయతూణీ, రమ్ములు ముదితాత్ముఁడగుచు ♦ రాముఁడు గొనియెన్
సమ్మతి మునిమండలమా, యిమ్మారసి యతనిఁ గొలువ ♦ నేతెంచె ధృతిన్. 3౪

ఆ. అగ్నినిభులు దండ ♦ కారణ్యవాసులు, తాపసప్రవరులు ♦ దైత్యబాధ
లర్థిఁదెలిపివేఁడ ♦ నర్థిప్రియుఁడొనర్చె, సంగరమ్ము దనుజ ♦ సమితి దునుమ. 3౫

క॥ ఆ నెలవున నుండ జన, స్థాననివాసిని పిసాచి ♦ స్వైరిణి యొఱుమన్
రానెంచి కామరూపిణి, దాని విరూపితనొనర్చె ♦ తగననుచుటయున్. 3౬

ఆ॥ అల్ల శూర్పణఖ క ♦ దథ్వగ్రపేరేప, సకలరాక్షస ప్ర ♦ జంబు పొదువ
ఖరుని దూషణుం ద్రి ♦ శిరుని మున్నుగఁ ద్రుంచె, నెల్లవారలం ది ♦ నేంద్రకులుఁడు

తే॥ దురమునఁ జతుర్దశసహస్ర ♦ వరబలములు, గూలెరామునిచే నని ♦ ఘూర్ణమాన
మానసుఁడు రావణాఖ్యుండు♦దానవేంద్రుఁ, డడరి మారీచుసాహాయ్య♦మర్థిగోరె.

క॥ ఆ మారీచాఖ్యాసురుఁ, డేమిటికిది రాముతోడ ♦ నే వైరము నీ
వేమెయి సేమము గోరవొ, భూమిపయి న్నిలువఁ దలఁపు ♦ పుట్టదొ యనినన్.

తే॥ రావణుఁడు కాలచోదితుం ♦ డై వితర్క, మడర హితవాది నుడుల న ♦ నాదరించి
యతనిఁ దర్జించి లోఁగొని♦యరిగెరాము, నాశ్రమపదమ్ముఁ బెరయంగ♦నశ్రమమున

ఆ॥ వాఁడు మాయలాఁడు ♦ వన్నె చిన్నె లొనర్చి, యానృపాత్మభవుల ♦ నచటువాప
రావణుండు రాము ♦ రామహరించె జ, టాయువనెడు గృధ్ర ♦ మడఁచివైచి.

క॥ అరుదెంచి రాముఁ డచ్చట, ధరణీసుత లేమికలికి ♦ తద్దయుఁ గెలనుల్
పరికించి గృధ్రనాథుఁ, బరిక్షతుంగాంచి శోక ♦ పరితప్తుండై. ౪౨

క॥ అల గృధ్రరాజు నోటం, బలాళిహృత సీత యనెడు ♦ పలుకు వెడల నా
వల మృతునతని దహించియు, జలాంజలుల నిడియు యువతి ♦ చర్చాపరతన్ ౪౩

ఆ॥ తరలి వికృతుఘోర ♦ దర్శను దనుజుఁ గ, బంధనాముఁగాంచి ♦ బాహుబలము
పరఁగ వాని దీర్ఘ ♦ బాహువు ల్నఱికి ద, హింపనసుర స్వర్గ ♦ మెనయునగుచు.

ఆ॥ శ్రమణి ధర్మనిపుణ ♦ శబరిఁ జేరుము తెల్పు, నఖిలవృత్త మాపె • యనుచుఁ దెలిపి
దనుజుఁ డరుగ నరిగె ♦ దశరథాత్మజుఁడను, జుఁడుభజింప శత్రు ♦ సూదనుండు ౪౫

క॥ కడుభక్తి శబరి పూజలు; నడుప సతిఁ గృతార్థఁ జేసి ♦ ననుచు తదుక్తిన్
దొడరి చని పంపయొద్దునఁ, బడసెను హనుమంతుఁడను ప్ర ♦ బలు హరివరునిన్.

క॥ ఆ వానరునుడిగొని సు, గ్రీవునిఁ గని యెల్లవార్తఁ గీర్తించెను స
ద్భావుఁడగు రామదేవుఁడు, భావిని వృత్తంబుతోడఁ ♦ బరఁగుచు నుండన్ ౪౬

క॥ అంతయు విని యాతఁడు హను, మంతుఁడు మేలనఁ బొనర్చె ♦ మహిపాలునితో
నెంతయుఁ బ్రేముడి సఖ్యము, సంతమసము విరియ నగ్ని ♦ సాక్షిగ వెలయన్ ౪౭

తే॥ తనదు వృత్తాంత మట్టుల ♦ య్యిన సుతుండు, దెలుప వినకులుఁడా ♦ తని తీరెరింగి
దుఃఖమెడలించి యవ్వాలి ♦ ధూర్తుఁగూల్తు, నని ప్రతిన సేసె నచటివా ♦ రలరుచుండ

ఆ॥ శంకితాత్ముఁ డగుచు ♦ శక్రసూను నిబల, మర్కజుండు వినిచి ♦ యధిపు వేడ్క
తొడరఁగానుపించె ♦ దుందుభికాయము, త్తమము పర్వతమ్ము ♦ తరముదాని ౫౦

ఆ॥ అస్థిపంజరమ్ము ♦ నటుగాంచి నగి రాముఁ, డంగుటమునఁజిమ్మె ♦ నదియుఁ బదియు
యోజనములదూర ♦ మోజవోఁబడి చది, యంగభానుజుఁడు త ♦ థా స్తనంగ. ౫౧

అ॥ సప్తసాలములఁ బ్ర ♦ శస్తుండు భంజించె, బ్రత్యయార్థ మొక్క ♦ బాణ మనిచి
పరఁగ నది నగంబుఁ ♦ బాతాలపుంగూడ ప్రక్కలించి తూణ ♦ వరము సేరె. ౫౨

క॥ అమ్మిహిరజుఁ డనుసంబున, నమ్మితినని రాముఁగొంచు ♦ నగచరులొలయన్
సమ్మతిఁ జనెఁ గిష్కింధకు, నిమ్మరసివధించు వాలి ♦ నీతండనుచున్. ౫౩

ఉ॥ వాఁడటులేగి గర్జిలఁగ ♦ వాసవపుత్రుఁడు రోసమొప్పరాఁ
గూడ దటంచు దారప్రతి ♦ కూలవచస్స్థితిఁ దెల్ప నాపెఁ ద్రో
పాడి సహోదరార్థు నయ్యరిభ ♦ యంకరుఁ డేడ్తెఱ డొల్లనేయ వీఁ
డోడెడు నంచు రాముఁడలుఁ ♦ గొక్కఁడు వంచి వధించె వాసవిన్. ౫౪

ఆ॥ పలుకు సెల్ల నినజుఁ ♦ బ్రభుఁ జేసెఁ గిష్కింధ, కట్టువాలిఁగూల్చి ♦ యవలవాఁడు
పనిచెఁ బ్లవగవరులఁ ♦ బనిఁబూని దిశలకు, సీతవార్త దెలిపి ♦ సిద్ధిఁగూర్ప॥ ౫౫

ఉ॥ అందుబలీయుఁడౌ హనుమఁ ♦ డందఱుఁ జేరొకన గృధ్రరాజు ప
ల్కొందిది మహార్ణవంబు శత ♦ యోజన విస్తృతమొప్ప దాఁటిని

ష్పందిత రాక్షసేంద్రపరి ♦ పాలిత లంకఁ గడంకఁ జొచ్చి త
న్మందిరభూమ్యశోకవని ♦ మానిత సీత గనుంగొనెన్ధృతిన్. ౫౯

క॥ రామధ్యానపరాయణ, రామామణిఁ గాంచి పలుకు ♦ రాణదలిర్పన్
సేమ మెఱిఁగించి హృద్గత, మామయ ముడుగ నడియాల ♦ మాయమకొసఁగెన్.

ఆ॥ దేవినాశ్వసించి ♦ ధీవృత్తి యోజించి, వనముఁ బెఱికి వైచి ♦ వఱలుతోర
ణంబు డంబుఁ బాపి ♦ జంబుమాలిం బంచ, సైన్యపతుల ద్రుంచె ♦ శ్వసనసుతుఁడు.

ఆ॥ సప్తమంత్రిసుతుల ♦ సమయించి శూరున, క్షునిఁ గడంగి వాయు ♦ సూనుఁడలుక
నెఱయ ముట్టి పట్టి ♦ నిష్పేష మొనరించి, యింద్రజిద్గ్రహేచ్ఛ ♦ నియ్యకొనియె.

క॥ పైతామహవరమునఁ ద, న్నైతచ్ఛరముక్తుఁ గాఁగ ♦ నెంచియురక్షో
నేతఁ గనుంగొనఁ బ్రతిభో, పేతుఁడు మర్షించె వారి ♦ పెనకువ లెల్లన్, ౬౦

ఆ. తన్నుఁ గట్టి యధిపు ♦ దరిఁ జేర్ప వానికి, బుద్ధిసెప్పి వాఁడు ♦ పొలియఁ జేయుఁ
డనినఁ దోఁక గాల్చ ♦ నవ్వారిఁ దెగటార్చి, లంకగాల్చి మైథి ♦ లసుతఁ గాంచి.

క॥ ఆయమయానతిఁ గొని శ్రీ, మాయతనము, మణియొసంగ ♦ నయ్యాదివరా
మాయత్తమొనర్చెదనని, శ్రీయుతుఁ డరుదెంచెఁ బతికి ♦ సేమము దెలుపన్. ౬౨

ఆ॥ తఱిసి రామునకుఁ బ్ర ♦ దక్షిణంబొనరించి, యాయమేయమూర్తి ♦ యధిపుఁడలర
దృష్టసీత యనుచుఁ ♦ దెలివిమై వృత్తాంత, మెల్లఁ దెలిపె నెల్ల ♦ రుల్లసిల్ల ౬౩

క॥ ఆదట సుగ్రీవసహితుఁ, డై దయితుఁడు కపులఁ గొంచు ♦ నరిగి సముద్రం
బాదిత్య సదృశశరముల, నాదిత్యనిభుండు క్షోభ ♦ మందఁగఁ జేసెన్. ౬౪

ఆ॥ కానుపించి నిమ్న ♦ గాపతి తను వేఁడ, నతని వచనరచన ♦ నతనుమూర్తి
నలుని వలన సేతు ♦ వలరార నొనరించె, నబ్ధిపైని నమరు ♦ లబ్రమనఁగ. ౬౫

ఆ॥ దాన లంక సొచ్చి ♦ దానవేంద్రుం గూల్చి, సీతఁ జేర్చుకొనఁగ ♦ సిగ్గు దొనఁకఁ
బరుసములు వచింపఁ బావని జనసమ, క్షమున జ్వలను నందు ♦ సరగ నుఱికె.

క॥ సీతన్ సుగుణోపేతం, బాతకసంహర్త్రి వహ్ని ♦ పతికర్పింపన్
స్ఫీతానందుండాతఁడు, వీతాఘం గొనెఁ దదుక్తి ♦ విలసన మొలయన్.

ఆ॥ దేవిఁ గూడి దేవ ♦ దేవుండలరె సర్వ, దేవపూజ్యుఁ డగుచు ♦ ధృతి దలిర్ప
నమ్మహాత్ముకృతి జ ♦ గమ్మఖిలము సదేవర్షిగణము తుష్ట ♦ మయ్యె నపుడు.

తే॥ రాక్షసేంద్రు విభీషణు ♦ రాణవొనర, లంకయందభిషేకించి ♦ శంకదక్కి
విజ్వరుండయి రాముండు ♦ వెలసెఁ బ్రీతిఁ, దన్నుఁ గృతకృత్యునిఁగ నెద ♦ దలఁచు
[కొనుచు. ౬౯

ఆ॥ వరము దేవతాప్ర ♦ వరులొసంగంగొని, వానరులను జీవ ♦ వంతులుగ నొ
నర్చి పుష్పకమున ♦ నర్చనీయుఁడు సుహృ,ద్వ్యక్తుఁడై యయోధ్య♦కొప్పఁజనియె.

క॥ క్రమమొలయ భరద్వాజా, శ్రమమెనసి నయమ్ము కడుఁబొ ♦ సఁగ సత్యపరా
క్రముఁడు భరతాంతికమునకు, పిమలుం బవనసుతుఁ బ్రీతి ♦ వెలయంబనిచెన్. ౨౧

ఆ॥ అచటివార్తలెల్ల ♦ హనుమ క్రమ్మఱవచ్చి, తెలుపఁ బుష్పకమునఁ ♦ దేజరిల్లి
నందితుండు మోద ♦ మందినందిగ్రామ, మునకుఁజనియె సురలు ♦ మునులుఁబొగడ.

ఉ॥ తమ్ములతోడఁ గూడి స్వామ ♦ తమ్ము మతమ్మని యెల్లవారు నే
స్తమ్మున నుబ్బియాడ రభ ♦ సమ్మొసఁగన్ జడలుజ్జగించి సీ
తమ్మ నిజాంకపీఠి విన ♦ యాంచితలక్ష్మి నలంకరింప రా
జ్యమ్ము నయమ్మునం గొనె మ ♦ హిమ్మదె యంచమరుల్ ల్నుతింపఁగాన్. ౨౩

తే॥ ముజ్జగమ్ము ప్రహృష్టమ్ము ♦ ముదితమునయి
తనరెఁ దుష్టిపుష్టులను సు ♦ ధార్మికము ని
రామయమ్ము నరోగము ♦ నైతనర్చెఁ
దద్దుర్భిక్ష భయవర్జి ♦ తమ్మునయ్యె. ౨౪

తే॥ పుత్రమృతిఁ గనరెందునే ♦ పురుషులెప్పుడు, నారులపతివ్రతలుగారు ♦ లేరువిధవ
లగ్నిజము వాతజము భయం ♦ బాపజంబు, జ్వరకృతంబును లేవ్రుత ♦ చ్ఛాసనమున

తే॥ క్షుద్భయములేదు తస్కర ♦ సూచకాది
భయములునుఁ బెరయవు రామ ♦ పాలనమునఁ
గృతయుగమునందపోలె లక్ష్మీసమృద్ధి
నెగడుఁబురములు రాష్ట్రము ♦ ల్నియతివెలయ. ౨౬

క॥ నిత్య ప్రముదితులై యే, యత్యయములు లేక శుభము ♦ లందుదురు ప్రజల్
సత్యము దప్పి చరింపర, సత్యాగ్రహవృత్తులనుచు ♦ జాల్కాన రెందున్. ౨౭

తే॥ తతసువర్ణము లశ్వమే ♦ ధ శతములఁ బొ
నర్చు గోకోటులిచ్చు బు ♦ ధార్చితుఁడు మ
హాయశుఁ డసంఖ్యధనము బ్రా ♦ హ్మణులకొసఁగు
శతగుణసురాజవంశముల్ ♦ జగతినిలుపు ౨౮

క॥ చాతుర్వర్ణ్యంబును స్వ, స్వాతత ధర్మమునఁ గూర్చు ♦ నవహితమతియై
శ్రీతరుణీశుం డారఘు, నేత ప్రజాపాలనమ్ము ♦ నిర్ణయమొప్పన్ ౨౯

క॥ దశవర్ష సహస్రమ్ములు, దశవర్షశతములు రాజ్య ♦ ధర్మ తపస్యం
దశవదన నిధనకారి త్రి, దశ వందితుఁడూని యవలఁ ♦ దత్పదమెనయున్ ౩౦

తే॥ ఇది పవిత్రము పాపఘ్న ♦ మిఁచుపుణ్య
మఖిలవేదసమ్మతము రా♦ మాయణమ్మ
భక్తి నెవ్వాఁడు పఠియించుఁ ♦ బ్రాజ్ఞుఁడతఁడు
బంధనిర్ముక్తుఁడై ముక్తి ♦ పదముఁగాంచు. ౮౧

క॥ ఆయుష్యంబగు నీ రా, మాయణముం జదివి మనుజుఁ ♦ డఖిలైశ్వర్య
శ్రీయుతుఁడై మని చరమ, ప్రాయంబున స్వర్గమెనయు ♦ బంధుజనులతోఁ ౮౨

తే॥ ద్విజుఁడు వాగ్వృషభతఁగాంచి ♦ తేజరిల్లు
క్షత్రియుఁడు భూమిపతియౌఁ ♦ బ్రశస్త విభవ
మందు వైశ్యుండు శూద్రకుం ♦ డౌ మహత్త్వఁ
డించు నీ రాము చరితఁ బ ♦ ఠించునేని ౮౩

క॥ అని నారదుఁ డెఱిఁగించిన, వినివాక్య విశారదుండు ♦ విజ్ఞుఁడు ధర్మ్యం
డనితరుఁడు నాకుజుఁడు ముని, తనశిష్యులతోడ నతనిఁ ♦ దద్దభజించెన్ ౮౪

తే॥ అటు యథావిధి పూజితుం ♦ డై తనర్చి, దివ్యముని నారదుఁడు సేర ♦ దివికిఁబోదలి
యతనినామంత్రితుంజేసి ♦ యభ్యనుజ్ఞ, మలసి సంమోదవార్ధిని ♦ ర్మగ్నుఁడగుచు
ఆ॥ క్షణములోన దేవ ♦ సంయమి దివికట్టు, లరుగ నమ్మునీంద్రుఁ ♦ డబ్రమొదవ
జాహ్నవికి నదూర ♦ సంస్థితమైపొల్చు, తమసఁదటిసెనాహ్ని ♦ కముల్గానర్ప

క॥ ముని తమసాతీరమునకు, జని శిష్యుంగాంచి మాన ♦ సం బుప్పొంగన్
దన ప్రాజ్ఞభావకలనా, వినిర్మలత్వముతనర్చ. • విధినిట్లనియెన్ ౮౭

తే॥ ఓ భరద్వాజ యీతీర్థ ♦ ముత్తమంబ, కర్దమమునై ప్రసన్నాంబు ♦ ఘటనఁబొనరి
సన్మనుష్యులసన్మాన ♦ సంబపోలె, కడుమనోహరతం బొడ ♦ కట్టెఁగనుము ౮౮

క॥ ఉంచుము కలశము మామక, మంచితమగు వల్కలమ్ము ♦ నందిమ్మువెసన్
సంచితము లెడలనిమ్యోడ, నించుసలిలమందు స్నాన ♦ మేనొనరింతున్ ౮౯

క॥ అనిపలుక భరద్వాజుం, డనితరగురుభక్తి నియతుఁ ♦ డై యమ్మునికొ
య్యనఁ జీరవసనమొసఁగెన్, ఘనుడది గొని హృద్వికాస ♦ కలితుండయ్యెన్ ౯౦

ఆ॥ నెగడుగనినవాఁడు ♦ నియతేంద్రియుఁడుముని, విభుఁడుచూచె నచట ♦ విపులవిపిన
మొకఁడుదానిపొంత ♦ నొగిఁగాంచె ననపాయి, క్రౌంచమిథున ముదిత♦ కలరవమ్ము

తే॥ అందు రతిలాలసమ్మఁబు ♦ మండజమ్ము
నియతవైరుండు పాపని • శ్చయుఁడునగుని
పాదుఁ డొక్కండు పడవైచె ♦ సంయమీంద్రుఁ
డరయుచుండ నొక్కింతయు ♦ నడరులేక. ౯౨

క॥ నేలంబొరలుచు శోణిత, జాలంబొడలెల్లనెఱయ ♦ సమసెడు మగనిన్
సోలుచు వలగొని యేడ్చెను, లోలాక్షి తదీయజాయ ♦ లుప్తాశయయై ౯౩

ఆ॥ సహితమైన పత్రి ♦ సహచారి మత్తంబు
తామ్రచూడ మగుచు ♦ ధరణిఁ బ్రాలఁ
దద్వియుక్త యగుచుఁ ♦ దరతరంబఱచు న
య్యాడుపులుఁగు, గాంచి ♦ యమివరుండు. ౯౪

క॥ ధర్మాత్ముఁడు కరుణామయుఁ, డర్మిలి మొదమందు ఖగము ♦ నట్లడఁచిన యా
ధర్మేతరేచ్ఛు లుబ్ధుని, కర్మమరసి క్రౌంచినెంచి ♦ కడువడిఁబలికెన్ ౯౫

శ్లో॥ మానిషాదప్రతిష్ఠాంత్వ, మగమశ్శాశ్వతీస్సమాః.
యత్క్రౌంచమిథునాదేక, మవధీఃకామమోహితమ్.

తే॥ ఓ నిషాదుండ యీయిల ♦ నుండఁబోకు
మింక శాశ్వతులగు సమ ♦ లేల నీకుఁ
గ్రౌంచ మిథునంబు లోన నొ ♦ క్కండు కామ
మోహితముఁ బొరిగొంటివి ♦ మోసమనక ౯౬

ఆ॥ అనుచుఁ బలికి పలికి ♦ నంతలో తద్దశఁ, గూర్చి చర్చసేసెఁ ♦ గోవిదుండు
శకునిఁగాంచి శోక ♦ జనితార్తి నిట్లంటి, నేమినుడియొ యిదియు ♦ నెట్లొదవెనో.

తే॥ శ్రీనివాసుండ యీ యిల ♦ స్థితిఁ దలిర్చి
మింక శాశ్వతులై సమ ♦ లెలయుచుండఁ
గ్రౌంచ మిథునంబు లోన నొ ♦ క్కండు కామ
మోహితముఁ బొరిగొన్న య ♦ ప్పాన్నమునను ౯౭

క॥ అను నిర్వ్యర్థాంతరమునుఁ, గనుపట్టెడు స్పష్టముగనుఁ ♦ గష్టుఁడు మడిసెన్
సునియమయుతమై యీనుడి, దనరారెడు దీనికెద్ది ♦ తావలమొకొ౯ా ౯౮

క॥ అని మతిమంతుఁడు చింతిలి, ముని మతిఁగొని శిష్యుతోడ ♦ మునుకొని పలికెన్
తన మనమునఁ బొడకట్టిన, యను భావముదెలుప నుత్సు ♦ కాత్ముండగుచున్.

ఆ॥ అన్నపాదబద్ధ ♦ మక్షరసమము తం, త్రీలయాన్వితంబు ♦ తెఱఁగుపడియె
శ్లోకమనఁగఁజెల్లు ♦ శోకార్తుఁడననగు, నాదునోట వెడలి ♦ నని చెఁగాన. ౧౦౧

క॥ ఒండొకఁడు గాదనిన శి, ష్యుండునుఁ గడుసంతసిల్లి ♦ యోజనెఱపెనై
యుండక పోవదనుచు ముని, మండలపతి యుబ్బె ముదము ♦ మల్లడిగొనఁగన్.

ఉ॥ అంతటఁ దీర్థరాజమున ♦ యందు యథావిధి స్నాతుఁడై రసా
భ్యంతర మప్పదం బెద స ♦ మాహితుఁడై తలపోయుచున్ వనో

పాంతము సేరఁగా నరిగె ♦ నామునికాంతుఁడు ఛాత్రుఁ డట్లు ధీ
మంతుఁడు పూర్ణకుంభమును ♦ మాళమునం గొని వెంటనంటి రార్. ౧౦౩

క॥ ఆశిష్యునితో నట్లు మ, హాశయుఁ డాశ్రమమును సేరి ♦ యాశావిరతిన్
శ్రీశధ్యాన తదీయక, థాశంసాతత్పరాత్ముఁ ♦ డై యుండంగన్. ౧౦౪

—♦ శ్రీవాల్మీకి మహర్షికి బ్రహ్మ సాక్షాత్కరించుట ♦—

ఆ॥ బ్రహ్మలోకకర్త ♦ ప్రభుఁడు స్వయంప్రభుఁ, డా చతుర్ముఖుండుమ ♦ హామహుండు
తనకుఁదానె వచ్చె ♦ మునిఁగాంచఁ దచ్చింత, వాపి చిత్తశాంతి ♦ వఱలఁజేయ.

శా॥ పుట్టం బుట్టిన ప్రోడ ప్రాఁబలుకు పూ ♦ బోఁడుల్ప్రశంసించు నా
దిట్టం గాంచి సవిస్మయుం డగుచు భ ♦ క్తిస్ఫీమన్మై నెమ్మన
మిట్టట్టంచుఁ దలంపనేర కొదుఁగన్ ♦ హేతుక్రమం బెంచుచున్
జెట్టల్మోడ్చి నిలంబడెన్ బరవశ ♦ శ్రీలక్ష్మ్యభావోన్నతిన్. ౧౦౬

ఆ॥ కొంతవడికిఁ దెలిసి ♦ కోర్కులొప్పారఁ బా, ద్యార్ఘ్య ముఖ్యపూజ ♦ లందఁజేసి
యట్లు విధియుతమ్ము ♦ లౌ నమస్కారము, లార్చి సేమమరసి ♦ కూర్మిఁగొసరి.

చ॥ వలగొను మౌనిఁగాంచి భగ ♦ వంతుఁడు కంజభవుండు సంతసం
బొలయ సమర్చితాసనము ♦ నోజమెసంగ నలంకరించి మో
సల విలసిల్లు మేల్బ్రుసుల ♦ సంగతయౌనొకదానిపై ఋషిన్
నిలువ ననుజ్ఞ సేసెఁ బరి ♦ నిష్ఠితుఁ డయ్యెఁ దదాజ్ఞ నాతఁడున్. ౧౦౮

తే॥ ఎదుట లోకపితామహుం ♦ డెలయుచుండఁ
దద్గతమనస్కుఁడై ముని ♦ తలరుచుండెఁ
జారురవముఁ గ్రౌంచము నట్లు ♦ చంపు నెవఁడు
కష్టుఁడా వ్యాధునకె చెల్లెఁ గాక యనుచు. ౧౦౯

ఆ॥ మఱియుఁ గ్రౌంచి గూర్చి ♦ మహనీయుఁడు మహర్షి
శోచనీయ యనుచు ♦ శోకపరతఁ
దవిలి శ్లోకమదియె ♦ తద్దయు శ్లోకించు
చుండె నంతరాత్మ ♦ యుక్తినెఱయ. ౧౧౦

క॥ ఆమునిపుంగవునిం గని, యామునిసన్నుతుఁడు నలువ ♦ హాసాంచితుఁడై
యోముని! తత్కృతి బద్ధము, రాముని చరితమున శ్లోక ♦ రాజమెసుమ్మా.

ఆ॥ బ్రహ్మమూర్తి యలస ♦ రస్వతి నీదువా, గింద్రియమునఁ దోఁచె ♦ నిట్టదగుచు
నాదుఛందమున నె ♦ ననిచె ఛందోగత, యాట శ్లోకసంజ్ఞ ♦ నధిగమించె.

క॥ ధీమంతుఁడు ధీరుఁడు గుణి, రాముని చరితంబఖిలము ♦ రచియింపుము నీ
వేమెయి నారదు ముఖమున, నేమమలర వింటివట్టి ♦ నెఱిఁదనరారన్. ౧౧౩

సీ॥ ధర్మాత్ము చరితంబు ♦ తాత్పర్యమొప్పారఁ, గృతిగూర్పునీవు సం ♦ స్కృతిదలిర్ప
నఖిలవృత్తంబుఁబ్ర ♦ త్యక్షమయ్యెడుర హో, గతమయేని ప్రకాశ ♦ గతమయేని
విదితుండవౌట నవిదితమెందునులేదు, నీదువాక్కనృత కా ♦ నేరదెపుడు
శ్లోకబద్ధనౌనర్పు ♦ సారిదినిక్కథఁ బుణ్య, రామాయణాభిఖ్య ♦ రాణఁబొనర
నదులుగిరులు వనులు ♦ నక్షత్రములు రవి, శశిముఖగ్రహములు ♦ జగతినెంత
వట్టునెగడు నంత♦వఱకుఁద్వత్కృతకావ్య,బంధమఘములూడ్పఁ ♦ బరఁగుచుండు.

క॥ ఈరామాయణకృతి నీ, చేరచియింపఁబడి సకల ♦ సిద్ధిప్రదనాఁ
బేరొందు ముజ్జగంబులఁ, దీరొందుదు వీవుచాన ♦ స్థిరపుణ్యుఁడవై.

క॥ అనియానతిచ్చి ముని కీ, డ్కొని భగవంతుండు బ్రహ్మ ♦ కోరికవెలయం
జనె నిజసదనమునకు నె, మ్మన మతివిస్మితముఁగాఁగ ♦ మౌని తనర్చెన్. ౧౧౫

తే॥ మొనసి తచ్ఛ్లోకమామ్నాత ♦ ముంబొనర్తు
రబ్రపడుదురు తద్విపి ♦ స్వార్థమరసి
మలసి సంతోషవార్ధి ని ♦ ర్మగ్నులౌదు
రొంటఁదారుల కెఱిఁగింత్రు శి ♦ ష్యులు ప్రసక్తి ౧౧౬

ఆ॥ నాల్గు పాదములను ♦ ననుచు సమాక్షర, న్యాసమొప్ప నిది మ ♦ హర్షి చేత
గీతమైన దింకఁ • గీర్తింపఁబడు శ్లోక, సంజ్ఞ లోకములఁ బ్ర ♦ శస్తి తనర ౧౧౭

క॥ అంతట బుద్ధి జనించెను, సంతమసముపీడ ఋషికి ♦ సంతసమున ని
ట్లింతయు రామాయణ సము, దంతము రచియింతుఁ గాత ♦ మను వృత్తి తగన్

తే॥ అతి మనోరమోదార వృ ♦ త్తార్థపద స
మాక్షరశ్లోక శతముల ♦ న య్యుదార
ధీ ముని యశస్వి రచియించె ♦ రాము చరిత
మాద్యము యశస్కరము కావ్య ♦ మగుచు వెలయ ౧౧౯

క॥ ఉపగత సమాససంధి, ప్రపంచ యోగాంచితమ్ము • క్రమమధురత్వా
ప్తపదార్థవాక్యబద్ధము, తపస్వి కృత రామకావ్య ♦ తత్త్వమెనయుఁడీ ౧౨౦

సీ॥ మున్ను నారదమౌని ♦ సన్నుతించిన కథా, సామగ్రి సద్ధర్మ ♦ సంహితయుగ
నెఱిఁగి పుణ్యాత్ముండ♦ ధీశుసద్వృత్తమా, లోచించుఁ బ్రాంచితా♦ లోకమొలయ
నుదకముప స్పృశిం ♦ చి దిశోచితకుశాస్త్ర,తస్థలినిల్చియు ♦ తంద్రుఁడగుచు
నవహితాత్ముఁడు రచి ♦ తాంజలిబంధుండు, నై కావ్యగతము యో ♦ గానుసృతము

గా నొనర్చుచుండెఁ ♦ గల్యాణమూర్తి శ్రీ, రాము గతివిశేష ♦ శేముషీ ప్ర
కారభాషితాది ♦ కములు చేష్టితములుఁ, దపముశక్తికలనఁ ♦ దాపసుండు.

ఆ॥ కడమవారి భావ ♦ గతులు సకాంతు త్మా, కాంతు చింతితప్ర ♦ కారములునుఁ
బౌరరాష్ట్రిమోప ♦ పదజనపదజన, వర్తనములు నూని ♦ వర్యుఁడారయు

మత్త॥ శ్రీతృతీయుఁడు సత్యసంధుఁడు ♦ చిన్మయాత్ముఁడు రాముఁడా
ఖ్యాతతాతని దేశుఁడై వన ♦ మందతంద్రిత నుంటయుక్
సీత సద్గుణసంపదృద్ధియు ♦ సేవకావన దీక్షయుం
బాతకిప్రచయప్రశాంతియుఁ ♦ బావనుండరయుస్థ్రితిక్ ౧౨౨

ఆ॥ యోగనిష్ఠ తనర ♦ నుల్లసితాత్ముండు, ధర్మమూర్తి తపసి ♦ తత్త్వయుక్తిఁ
గరతలామలకము ♦ గాఁగనెల్లయెఱింగి, కావ్యభావ్యకౌతు ♦ కంబుపొసఁగ ౧౨౩

సీ॥ కృతిగూర్చె నమ్మహా ♦ ద్యుతియభిరాముని, రామునిచరితము ♦ ద్దామకలనఁ
గామార్థ గుణయోగ ♦ కలితము ధర్మార్థ, గుణవిశ్రుతంబు సా. కూతిసుభగ
మాసముద్రమపోలె ♦ నధిరత్నసంపన్న, మఖిలశ్రుతిమనోహ ♦ రాభిహితము
గాఁదొల్త నారదో ♦ క్తంబగు క్రమమున, నేలీలవిలసిల్లి ♦ యెలమిసూపె

నట్టులదియది విస్తరం ♦ బై తనర్చి, యందమానందము సమగ్ర ♦ మగుచు వెలయఁ
దనదురామాయణాభిఖ్య ♦ తద్దనెగడ, సకల సురమౌనివర్యులు ♦ సంస్తుతింప.

వ॥ వెండియు భగవంతుండగు నమ్మహర్షి సత్తముండు తనదు ప్రబంధ రాజంబున శ్రీరాముని జన్మప్రకారంబును సుమహితవీర్యంబును సర్వానుకూలతయు సకలలోక ప్రియత్వంబును క్షాంతియు సౌమ్యత్వంబును సత్యశీలత్వంబును విశ్వామిత్రసమాగమంబున నన్యంబులు ననన్యాదృశంబులు నగు నానా చిత్రచరిత్రంబులును జానకీవివాహ ప్రసంగంబును శివధనుర్విభేదనంబును రామరామ వివాదంబును దాశరథిగుణప్రస్తావంబును రామాభిషేక ప్రయత్నంబును గైకేయీ దుష్టభావత్వంబును నభిషేక విఘాతంబును రాఘవవివాసనంబును రాజశోక విలాపంబును బరలోకాశ్రయణంబును బ్రకృతివిషాదంబును బ్రకృతిజనతావిసర్జనంబును నిషాదాధిప సంవాదంబును సూతోపావర్తనంబును గంగాసంతరణంబును భరద్వాజమునిసందర్శనంబును దదభ్యనుజ్ఞానంబును జిత్రకూటదర్శనంబును వాస్తుకర్మ నివేశంబును భరతాగమనంబును రామప్రసాదనంబును బితృసలిల ప్రదాన విధానంబును బాదుకాగ్ర్యాభిషేచనంబును నందిగ్రామ నివాసనంబును దండకారణ్య గమనంబును విరాధపరిమథనంబును శరభంగమహర్షి దర్శనంబును సుతీక్ష్ణ సమాగమంబు నత్రిమౌని సమావేశంబు సీతానసూయా సహాసనంబు

నంగరాగ సమర్పణంబు నగస్త్యసందర్శనంబును జటాయురభి సంగమంబును బంచవటీ గమనంబును శూర్పణఖాభియాతంబును దత్సంవాదంబును దద్విరూప కరణంబును ఖరదూషణత్రిశిరస్సంహారంబును రావణోత్థానంబును మారీచ మరణంబును వైదేహీహరణంబును రాఘవవిలాపంబును గృధ్రరాజవిధ్వంస నంబును గబంధాభి గమనంబును బంపాసరోనిరీక్షణంబును శబరీ సమాలోక నంబును హనుమత్ప్రవేశంబును ఋశ్యమూక గమనంబును సుగ్రీవసమాసత్తియుఁ బ్రత్యయోత్పాదనంబును వహ్నిసాక్షికసఖ్యంబును వాలిసుగ్రీవ విగ్రహంబును మహేంద్రసూనుమారణంబునుఁ దారావిలాపంబును సమయప్రతిజ్ఞానంబును వర్ష రాత్రనివాసంబును రాఘవసింహకోపంబును బలోపసంగ్రహంబును దిశా ప్రస్థానంబును బృథివీసన్నివేశనివేదంబును నంగుళీయకదానంబును ఋక్ష బిలదర్శనంబును బ్రాయోపవేశంబును సంపాతిసంపాతంబును బర్వతారోహణంబు సాగరలంఘనంబును సముద్రనియోగప్రాప్తమైనాక యోగంబును సింహికా నిధనంబును లంకామలయనిదర్శనంబును రాత్రికృతలంకానుప్రవేశంబును రహశ్చింతనంబును రావణాలోకనంబును బుష్పకావలోకనంబును నాపానభూమి గమనంబు నవరోధోపలక్షణంబు నశోకవనికాయానంబును సీతాసముపదర్శ నంబును నభిజ్ఞానప్రదానపరత్వంబును రావణాయానంబును రాక్షసీతర్జనంబునుఁ ద్రిజటాస్వప్నవృత్తాంతకథనంబును మైథిలీకృతమణిరత్నప్రదానంబును వృక్షభంజ నంబును రాక్షసీపలాయనంబును గింకరనిబర్హణంబును వాయుసూతిగ్రహణంబును లంకాదాహాభిగర్జనంబును బ్రతిప్లవనంబును మధ్వాహరణంబును రాఘవాశ్వాస నంబును మణినిర్యాతనంబును సముద్రసంగంబును నలసేతుబంధనంబును సాగర ప్రతారణంబును లంకావరోధనంబును విభీషణసంసర్గంబును వధోపాయనివేదనం బునుఁ గుంభకర్ణనిధనంబును మేఘనాదనిర్మథనంబును రావణవినాశంబును సీతా సంప్రాప్తియు విభీషణరాజ్యాభిషేకంబునుఁ బుష్పకావాప్తియు నయోధ్యాప్రయా ణంబును భరతసమాసత్తియు రామాభిషేకాభ్యుదయంబును సర్వసైన్యవిసర్జ నంబునను సీచారిత్రాంశంబుల నిబంధించి యత్కించిదనాగత సంచిత కథాసంచ యంబుం బ్రపంచితంబు గావించి యుంచువేడ్క సమభ్యంచితుండై తనరారు చుండె నిట్లు. ౧౨౬

తే॥ ప్రాప్తరాజ్యుండు రాముని ♦ ప్రథితచరిత
మంతయురచించె భగవంతుఁ ♦ డగు మహర్షి
వరుఁడు వాల్మీకి సువిచిత్ర ♦ పదము స్వరస
పదమునై యాత్మవత్తాను ♦ భావ్యముగను. ౧౨౭

చ॥ ఇరువదినాల్గువేలగుచు ♦ నించురుచిం దులకించు శ్లోకముల్
గరమునఁదంచుఁ బ్రాజ్ఞులనఁ ♦ గార్వొకఁను సర్గము లేనునూర్లఁ ద
ద్వరకృతి నాఱుకాండములు ♦ వావిరి నుత్తరకాండ సర్గముల్
సరణి రచింపఁ గూర్చె ముని ♦ సర్వమఖర్వరసోదయంబుగాఁ. ౧౨౭

తే॥ అటు ఘటించి మహాప్రాజ్ఞుఁ ♦ డమ్మహర్షి
యెడఁదఁ దలపోసుకొనెదీని ♦ నెవ్వఁడేని
నోజనెఱయఁ బఠించి ప్ర ♦ యోగయుక్తి
గూర్చి మెప్పించునో యను ♦ కోర్కెఁ నెగడ. ౧ ౨౮

మ॥ అని చింతించెడు భావితాత్ము మహానీ ♦ యాత్మున్మహర్షిం గనుం
గొని యిక్ష్వాకులమ పోలునంచు ముని ల ♦ క్ష్యుల్సేరి తత్పాదము
ల్గాని సేవించిరి భక్తిమైఁ గుశల వా ♦ ఖ్యు ల్రాజపుత్రు ల్వ్వకా
ననవాసు ల్వనవాప్త భాగ్యులు మహా ♦ నందాను సంధానులై. ౧౨౯

ఆ॥ వారిఁగాంచి మౌని ♦ వరుఁడు బలే తార, పోలువార లింకఁ ♦ బోలునెట్టు
లారుల సరయు కృత్య ♦ మోజమ్ము దేజమ్ముఁ, గలుగు వారియందు ♦ ఘనులువీరు.

తే॥ అన్నదమ్ములు నృపసుతు ♦ లాత్తనియము, లఖిలధర్మజ్ఞులు యశస్వి ♦ లాగమనిగ
మైక పరినిష్ఠితులు ధార ♦ ణాంచితమతు, లాశ్రమస్థులు స్వరసమ ♦ గ్రార్థవిదులు.

క॥ వేదోప బృంహణార్థం, బీదయితాత్మజుల కృతుల ♦ నెలయించెదసం
మోదమొదవ మచ్ఛిష్యులె, యాదృతులరె వీరలెటున ♦ నన్యులకారే. ౧౩౨

సీ॥ అనుచు రామాయణా ♦ ఖ్యము కావ్యమఖిలమ్ము, సీతామహా దేవి ♦ శ్రీచరిత సు
మహితమ్ము పౌలస్త్య ♦ మారణ ప్రథితమ్ము, చరితవ్రతుఁడు సర్వ ♦ సంయమివరుఁ
డాత్తకాముఁడు నిగ ♦ మాగమవేత్త ల, క్షిత పరతత్త్వ ల ♦ క్ష్మీలసితుఁడు
బోధించె నవ్వారి ♦ బోధపూర్ణులఁ జేయ, బుధవరేణ్యులుమెచ్చ ♦ భూరిమహిమఁ
దనరి రిరువురుఁ దద్దయుఁ ♦ దత్ప్రబంధ, బంధబంధురభావ సం ♦ బంధభావ్య
పాఠ్యగేయమాధుర్యోప ♦ పత్తులొలయ, గానమొనరించి రమ్మహా ♦ గానవిదులు.

తే॥ త్రిప్రమాణాన్వితముగ జా ♦ తి ప్రధాన, సప్తకాబద్ధముగ సుతం ♦ త్ర్యాప్తిలయస
మంచితంబుగ శృంగార ♦ హాస్యవీర, ముఖ్యనవరసభృతి జగ ♦ న్మోహనముగ.

సీ॥ గానంబొనర్చిరి ♦ కల్యాణమూర్తి రా, ముని చరిత్రంబు త ♦ న్ముని కృతంబు
గాంధర్వతత్త్వ వి ♦ ద్ఘనులు సుస్వరమూర్ఛ, నాస్పదకోవిదు ♦ లన్నదమ్ము
లటు సుస్వనులు కలా ♦ భ్యర్హితు ల్నరవేష, ధారి గంధర్వులు ♦ దార నాట్య
లక్షణజ్ఞులు రస ♦ లలితమధురభాషు, లంచిత రామబిం ♦ బానుబింబ

భావితులు రాజపుత్రులు ♦ భవ్యమతులు, తత్సమాఖ్యాన ముత్తమ ♦ ధర్మ్యమఖిల
మొలసి వాగ్విధేయంబుగ ♦ నుల్లసిల్లఁ, జేసి యాసిరి మోటులు ♦ చివురులిడఁగ.

చ॥ తవిలి యథోపదేశముగఁ ♦ దత్త్వవిదు ల్సమాహితుల్కవి
పరివరు లనిందితు ల్మహిత ♦ భావులు భాగులు సర్వలక్షణ
పరిణులు దాత్తవేషులటు ♦ పాఠమొనర్చిరి పాడిరెల్ల వి
పరివరులు మేలుమేలనఁ ద ♦ పస్వులు మెచ్చఁగ సాధులుబ్బఁగన్. ౧౩౬

ఆ॥ భావితాత్ములైన ♦ పరమర్షు లొక్కెడ, నరుగుదెంచి గోష్ఠి ♦ నమరియుండ
వారువారిదరిని ♦ వర్ణించి రిక్కృత, గానవిభవకలన ♦ కలుములీన. ౧౩౭

చ॥ అదివిని మానులెల్లరు ర ♦ సాలస వృత్తిఁదలిర్చ ప్రీతిమైఁ
బొదలుచు బాష్పజాలములఁ ♦ బొంపిరివోవు శుభేక్షణంబులన్
వదలఁగరాని స్నేహమున ♦ వారినెడం దఁగదించుకొంచుఁ గ
ద్గదికతగం, బళే! యనుచు ♦ గారొకొను విస్మయమోజ నెక్కొనన్. ౧౩౮

తే॥ పొగడఁజొచ్చిరి జ్ఞానసం♦ పూర్ణులొకట, ధర్మవాత్సల్యమునపార ♦ తంత్ర్యమొదవ
గతిగమకగీతరతుల స♦ త్కావ్యమతుల, నతులసౌజన్యయుతుల క్షి ♦త్యధిపుసుతుల

మ॥ అరరే! గీతి మరందమాధురి ధురీ ♦ ణాశాస్యకావ్యోక్తి వి
స్ఫురదాస్వాద్యత చాగురే! బళిరె! సం ♦ శుద్ధార్థగాంభీర్యమాఁ
జిరనిర్వృత్తమయోని నియ్యది రస ♦ శ్రీభావయోగోన్నతిం
బొరిఁ బ్రత్యక్షముకాఁబొనర్చిరి కలా ♦ పూర్ణోదయాభ్యంచితుల్. ౧౪౦

తే॥ మధురముగ రక్తముగ స్వర ♦మంజిమమ్ము, దనర సుష్ఠుభావమ్ముతా ♦త్పర్యమొప్ప
వెలయు నమృతమిూచదురున ♦ వెల్లిగొలిపి, రెనసిగానమిషమున నీ ♦యిరువురహాహా

ఆ॥ అటు తపోధను ల్మ ♦ హాత్ములా మునుల ప్ర, శంసలొలయ మించు ♦ సంతసమున
సరసగానగోష్ఠిఁ ♦ జరిపిరివారు సం, రక్తతరము సుమధు ♦ రంబుఁగాఁగ. ౧౩౨

చ॥ కలశమొసంగె నొక్క ముని ♦ గారొకొను ప్రేముడి నిల్పి సుప్రస
న్నలలితభావమొప్ప యమి ♦ నాథుఁడొకొండు మహాయశుండు వ
ల్కలమిడె నస్యులన్నెటి ర ♦ కంబగు మాల్యము యజ్ఞసూత్రమున్
విలసిత మౌంజియున్ బ్రుసియు ♦ వేడుక మీఱఁగఁగూర్చి రాదృతిన్. ౧౪౩

క॥ ఆయుష్మంతులరై మీ, రాయధిపుం బోలనెగడుఁ ♦ డని వారు శ్రుతి
ప్రాయాశీర్వాదాభి, ప్రాయము లెటిఁగించి రించు ♦ పలుకుల నొకటన్. ౧౪౪

సీ॥ ముని సంప్రకీర్తితం ♦ బనఘమిూ యాఖ్యాన, మఖిల కవిప్రథా ♦ నాశ్రయము ప్ర
కాండమియ్యది యథా ♦ క్రమము సమారబ్ధ, మై యట్టులెసమగ్ర ♦ మైతనర్చె

వివిధసంగీతకళో ♦ విదులరు మీచేత, నభినీత మీగీత ♦ మలరె మఱియుఁ
బురుషార్థదం బిష్టి ♦ పుష్టిసంధాయకం, బాయుష్యము శ్రుతీర ♦ ణాంచితమ్ము
ననుచు జనులువొగడ ♦ నధిరాజ పథముల, రథ్యలందు మేలి ♦ రాణనెగడు
వారిగాయకులఁ గు♦మారమణుల భర, తాగ్రజుండుగాంచి ♦ యద్ధిమించి ౧౮౪

కం॥ తన సభకుం దోడ్తేరం, బనిచి యపుడెవారిఁ జేర్చి ♦ భ్రాతల సమరూ
పనివేశులఁ బూజార్హుల, జనపతి పూజించె సత్ప్రి ♦ సాదము పొసఁగన్.

ఉ॥ రాముఁడు దుష్టరాక్షసవి ♦ రాముఁడు సర్వసుపర్వ వర్ణితో
ద్దామ సుధాముఁడాశ్రిత వి ♦ తానమనోరథపూరణామరా
రాముఁడు కాంచనప్రకృత ♦ రత్నమయాసనసీమఁ దమ్ములున్
శ్రీమహితుల్ప్రధానులునుఁ ♦ జేరి భజింపఁగ నిండు కొల్వునన్. ౧౮౫

కం॥ తనరాజిలు వైభవమునఁ, దనరారుచుఁ గుశలవులనుఁ ♦ దద్దయుఁ బేర్మిం
గనుఁగొని తమ్ములతోని, ట్లనెఁ దద్రూపాంచితత్వ ♦ మానసముఁ బెనుపన్. ౧౮౬

ఉ॥ వింటిరె ! వీరిగాన మతి ♦ విశ్రుత సర్వగుణాఢ్య మెందునుం
గంటిరె ! యిట్టి గాయకులఁ ♦ గావ్యరస ప్రతిభాసమానులన్
జంటివి గాని తేనియలు ♦ చొక్కఁపు రూపులు నిక్కఁపున్నడుల్
పంటవలంతి భాగ్యమనఁ, బాల్పడె నింతయు వింత యోజనన్. ౧౮౭

తే॥ అనుచు నవ్వారిఁ గనుచు ♦ హర్షాంచితాత్ముఁ, డగుచు నద్దేవుఁడిటులనె ♦ నన్నలార
యతి విచిత్రపదార్థము ♦ య్యాది రసోర్మ్ములడరు గీతాబ్ధి నెఱయింపుఁ ♦ డనువుపడఁగ

కం॥ అని బుజ్జగించి ప్రేరే, ప నవనవోల్లాసకలనఁ ♦ బ్రబలిరివారో
య్యన నాలాపింపం దొర, కొనిరి సుతంత్రికల వల్ల ♦ కుల రసమొలుకన్. ౧౮౯

తే॥ అతిమధురమయ్యె సంరక్త ♦ మనఁగనయ్యె స్వాంచితాయతనిస్వనం ♦ బించునిదియె
విశ్రుతార్థంబునానయ్యె ♦ సుశ్రుతిలయ, గీతికా కలనలవారు ♦ గీలుకొలుప. ౧౯౦

కం॥ ప్రంబె సకలాంగముల హృద, యంబుల నెమ్మనములం బ్ర ♦ యత్నంబున శ్రో
త్రంబుల గానరసంపుఁ బోఁ, తంబొంగి పొరలు సుఖంబు ♦ తాత్త్వికగరిమన్.

కం॥ ఆజనసభలో మేలి స, భాజనములు దనర గీతి ♦ పద్ధతి తగెఁద
ద్యోజనకై వలగొని యా, ద్యోజనమటు చదల నిలిచి ♦ యుద్యుక్తముగాన్.

ఉ॥ ఈశ్వరలక్షణాన్వితుల ♦ నీశ్వరులట్లు దనర్చువారు మా
నీశ్వరపుత్రులెట్టిదియ ♦ నీ దృశమైనది సత్తపస్యయున్
శాశ్వతి నాఁబొసంగెడుఁ బ్ర ♦ శస్యము సాధ్విచరిత్రమిందు స
ప్తాశ్వకులీన భూతికర ♦ మై విలసిల్లెడు జాడఁ గంటిరే. ౧౯౩

క॥ అని పొగడు రామునుడుల, న్మన ముప్పొంగంగ గాంగ ♦ మహితతరంగో
త్థనవీనార్భటి తనరం, బొనరారిరి వారు తద్భు ♦ భూషయుఁ బొసఁగన్. ౧౫౪

తే॥ చెఱకు గొననుండి మొదలంటఁ ♦ జేర్చి నమలఁ
దీపొదవు ననుటయు విప్ర ♦ తీపమయ్యె
రాము చారిత్ర మా గుణో ♦ ద్దాములు మొద
లిడి కొనకుఁ బాఱఁ గీర్తింప ♦ నించుకలిమి. ౧౫౫

క॥ మునిశిష్యులు వారలు రా, ముని చరితము మునికథితము ♦ మొనయించుటయా
మనితంబయ్యెను హిమగిరి, తనయేశ్వర వాదకలనఁ ♦ దద్దయు హితమై. ౧౫౬

—♦ పార్వతీ పరమేశ్వర సంవాద ప్రకారము. ♦—

క॥ తపమును స్వాధ్యాయంబును, బ్రపత్తితోఁగూర్చి లక్ష్య ♦ పరులై మను న
త్తపసులకు గమ్యమై తగు, సుపథము కైలాసనామ ♦ శుభపదమెపుడున్. ౧౫౭

చ॥ మునుకొని గౌరిఁగూర్చి తప ♦ ముం బొలివోక పొనర్చి తత్కృపం
దనరెఁ దదీయరూప భృతి ♦ దైవత శైలమటంచు శంకరున్
ఘనజపయుక్తి వేఁడి కుతు ♦ కంబునఁ గాంచెనొ తత్స్వరూపమం
చననగు వెండికొండపయి ♦ నచ్చఁపుఁగొల్వున శంభుఁడుండఁగాన్. ౧౫౮

సీ॥ ఏదేవి జగదుద • యాది వృత్తులకు ని, దానమై యొక్కటి దా వెలుంగు
నేలోకజనయిత్రి ♦ ప్రాలేయగిరికన్య, యై మాననీయాత్మ ♦ నతనిఁజేసె
నేమంగళాంగి త ♦ పోమూర్తియై సామి, సామేన నిలిచె ని ♦ ర్జరులుపొగడ
నేపరాత్మిక విరిం ♦ చీంద్రాదిదేవతా, పూజ్యమానాంఘ్రియై ♦ పొనరుచుండు
నట్టి యువతీమతల్లి ని ♦ జాశ్రితార్య
కల్పవల్లి వినాయకుఁ ♦ గన్నతల్లి
మగని యడుగుల పేరితా ♦ మరలవీక్ష
ణాళు లమరంగ మ్రొక్కి యి ♦ ట్లనియెఁ బ్రీతి. ౧౫౯

తే॥ దేవదేవ మహాదేవ ♦ దివ్య దేహ, భావనాదూర తారక ♦ బ్రహ్మమూర్తి
కేవలానందఘన దయా ♦ కీర్ణహృదయ, పావనాత్మ జగజ్జాల ♦ భవ్యనిలయ.

కందగర్భము తే॥ వనజభవముఖనతబుధా ♦ వనవిలసిత
మదనమథన, వరదసుధా ♦ మన్మునిజన
హృదయ నయనదన, లనిగ ♦ మదమలోచ్ఛ్వ
సితక, లాపదహీంద్ర, శా ♦ సిత మహేంద్ర. ౧౬౦

ఉ॥ అంజలిఁ గూర్తు దేవ కరు ♦ ణాకరమూర్తి జగన్నివాస మృ
త్యుంజయ సాధులోకహిత ♦ తోషితభక్త పరాత్పరా విప
ద్భంజన దుష్టశిక్షక శి ♦ వంకర శంకర యోగిగమ్య స
న్మంజులవేషభాషణ స ♦ నాతనభావన విశ్వమోహనా. ౧౬౨

చ॥ చెలువగు నీ పద ద్వయముఁ ♦ జేరి భజించుటఁజేసి మత్తప
మ్ములు ఫలియించె సాధ్వికిల ♦ ముక్తి రమాస్పదము ల్శుభావహా
మ్ములు పతిపాదపద్మములె ♦ పూజ్యములైనఁ ద్వదీయవాక్సుధా
కలనలఁ బ్రొద్దుపుచ్చుటకుఁ ♦ గా నొక విన్నప మాచరించెదన్. ౧౬౩

క॥ అరుసంబెసఁగఁగ నీనుడిఁ, బురుషోత్తము తత్త్వమెఱుఁగ ♦ బుద్ధి వొడమె నీ
శ్వర; యది యనన్య వాచ్యం, బురుగోప్యంబనుచుఁ బెద్ద ♦ లూహించుటచేన్.

తే॥ అభవ; పరమేశ్వరుఁడవు స ♦ ర్వాత్మదృక్కు,వైన నీ భక్తురాల నన్నాదరించి
పేర్మినాయడిగిన యది • విదితముగనో, నర్పమియ్యది వల్లభ ♦ నాకు హితము.

తే॥ మున్ను విజ్ఞానమును జ్ఞాన ♦ మునుఁ బ్రపత్తి
భక్తులు నొకింత వైరాగ్య ♦ యుక్తియునుఁ బొ
సంగు నెట్లైన నియ్యది ♦ చానయనక
తెలుపుము రహస్యమెంతయు ♦ వేటపడఁగ. ౧౬౬

క॥ నాకొఱకె కాక లోకు ల, నేకులిటుఁ దరింతురనుచు ♦ నే నిన్నడుగన్
గైకొంటి ధార్ష్ట్యమీనుడి, గైకొనవే చనవొసంగి ♦ కారుణ్యనిధీ. ౧౬౭

తే॥ అన్నిటికి నెక్కుడగు భక్తి • యందురు బుధు
లదియు హరి గోచరయ యేని ♦ నధికయందు
రదియె శ్రీరాము నెడనైన ♦ నమరు ముక్తి
యన్యయెది దీనికైనరా ద ♦ టందు రీశ. ౧౬౮

ఆ॥ అఖిల తత్త్వసారుఁ ♦ డస్త మాయాగుణ, సంప్రసారుఁ డొకఁడు ♦ స్వప్రకాశుఁ
డందు రభవ;కొంద ♦ ఱాత్మవేత్తలు రాము, నటు భజింత్రుభక్తి ♦ నహరహంబు.

ఉ॥ కొందఱు విద్యచే మఱపు ♦ గూరఁ బరాత్పరుఁడయ్యు రాముఁడా
నందఘనాత్మతత్త్వముగ ♦ నంబరబోధ కపేక్ష సేయునం
చందురు కానిచో నడవి ♦ నట్లడలం బనియేమి; సీతకై
యందునో, పెద్దలేల యటు ♦ లైన భజింతు రటందునో? యికన్. ౧౭౦

క॥ ఇందుధర; యిట్టి సందియ, ముందొలఁగింపు మిదెనీకు ♦ మ్రొక్కెద దయనీ
విందుత్తర మిడుటే నా, యందలి వాత్సల్యమని ప్ర ♦ హర్షము గాంతున్. ౧౭౧

ఆ॥ అనిన మందహాస ♦ మాననంబునఁ దోఁప, హరుఁడు శైలజాత ♦ కనియెనిట్లు
లెంతధన్యురాల ♦ వే! పరాత్పరతత్త్వ, మింతవట్టెఱుంగ ♦ నిచ్చపొడమె. ౧౭౨

చ॥ ఎవరిటు మున్ను నన్నడుగ ♦ రేనువచింప రహస్యమంచు నీ
సవతు గనంగనేర్తు రెటు ♦ చానలు చానరొ! రామతత్త్వమే
వివరణమొప్పఁ దెల్పెద వి ♦ వేకము మీఱ గ్రహింపు మాత్మ వి
త్ప్రవరులు మేలనంగ భవ ♦ బంధము వీడఁగ ముక్తిగూడఁగన్. ౧౭౩

సీ॥ పడఁతిరో రాముండు ♦ పరమాత్మప్రకృతిక, న్ననుఁ బరుఁడొక్కఁడా♦నందఘనుఁడు
పురుషోత్తముఁడు బోధ ♦ పూర్ణుఁడనాది స్వయంప్రకాశుఁడునిత్యుఁ♦డాత్తకాముఁ
డతఁడు స్వమాయచే ♦ నఖిలంబుపొడమఁదా, నంతర్బహిర్వ్యాప్తి♦నలరుచుండు
నంతటనిండియు ♦ నతినిగూఢుండగు, నిర్లేపుఁడయ్యు వి ♦ నేతయునగు

జుంబకము మ్రోలఁ దిరిగెడు ♦ సూదులట్లు
జగములు భ్రమించు నెవ్వాని ♦ సన్నిధాన
మున నెఱుంగ రవిద్యా వి ♦ మూఢ చిత్తు
లట్టి పరమేశు విభుఁ జిన్మ ♦ యాత్ము నెపుడు. ౧౭౪

తే॥ కానకుండురుగాక చి ♦ ద్ఘనుఁడు నిర్మ
లాత్ముఁడు నిరస్తమాయుఁడౌ ♦ నజుని యొందు
స్వీయ మజ్ఞాన మింతయుఁ ♦ జింతలేక
నాత్ము లారోపణమొనర్తు ♦ రంధులగుచు. ౧౭౫

క॥ తన కనులదోష మమ్మెయి, జన మన్యపదార్థమందుఁ ♦ జర్చించుగతిన్
దనుచిత్తాది వికారము, లెనయింత్రు పరాత్మునందు ♦ హీనవిచారుల్. ౧౭౬

చ॥ ఎఱుక యొకింత లేక పసు ♦ లెట్లటు సంసృతి కూపమగ్నులౌ
మొఱకులు హృద్గతుం బరము ♦ ముక్తుల నెక్కొనఁ జక్కఁగాంతురే
మెఱుఁగరు కంఠలగ్నమగు ♦ హేమమయాభరణంబు నన్ననే
మఱుజడులన్నఁ జిత్రమె ప్ర ♦ మాప్రవిలాపిత భక్త విభ్రమా. ౧౭౭

తే॥ అతివ; చిద్రూపుఁడు పరాత్ముఁ ♦ డైనరాము
నందవిద్య పొసంగునే ♦ యప్రకాశ
మెపుడు జ్యోతిస్స్వభావు న ♦ య్యినుని మొనయు
నే విచారింప రప్రాజ్ఞ ♦ లింతవట్టు. ౧౭౮

మ॥ రవికిన్ రాత్రి దివంబటన్న వ్యవహా ♦ రంబుండునే స్వప్రకా
శవిరామం బొకనాఁడు గల్గ కునికిన్ ♦ సర్వాత్మునందట్లు దోఁ

పవు జ్ఞానంబటు లజ్ఞ భావమును సం ♦ ప్రజ్ఞాన రూపత్వ ని
త్యవికాసిత్వములందు హేతువులు వి ♦ ద్యా వైభవోల్లాసినీ. ౧౨౯

తే॥ ఇంద్రజాలికుఁ డెవుడుఁ దా ♦ నాచరించు
నట్టి మాయకు లోనౌనె ♦ యరసిచూడ
నటు వశీకృతమాయుఁ బ ♦ రాత్ము డెనయఁ
బోవు మాయావికారము ♦ ల్పొందుతె? వినుము. ౧౩౦

—♦ శ్రీరామ హృదయము ♦—

క॥ ఈవిషయము నందెలి పెద, దేవి! రహస్యమది సదుప ♦ దేశ్యము సీతా
దేవీ రఘునాయకమణి, పావని సంవాదమనఁగఁ ♦ బరఁగు శుభదమై. ౧౩౧

ఉ॥ రాముఁడు దేవకంటకుని ♦ రావణు మున్వధియించి జానకీ
భామినితో నయోధ్యకటు ♦ భానుజముఖ్యులు గొల్వవచ్చి వి
ద్యామహితుల్మునీంద్రులు ము ♦ దంబునఁ బ్రాజ్యవిభూతిమించి చి
ద్ధామ సుఖాంబు రాశియయి ♦ పొల్చి సభాస్థలి నిల్చియున్నెడన్. ౧౩౨

తే॥ రత్నసింహాసనాసీను ♦ రజ్యమాన, మానసాంభోజు శతకోటి ♦ భానుతేజుఁ
గమలదలనేత్రుఁ గమనీయ♦గాత్రు నతనిఁ, గాంచిసభ్యులు రసతృ ప్తి♦మించిరపుడు.

శా॥ ఆశ్రాంతశ్రుతివాద మోది కృతకృ ♦ త్యత్వాధ్యుఁ డావిద్య కా
ర్తిత్రాస్వర్థి నిరస్తకాంక్షుఁడు ప్రశ ♦ స్తిప్రాంచితుం డార్య సే
వాశ్రీస్తుత్యుఁడునైన మారుతి నమి ♦ వ్యాపార మొప్పారఁదా
శుశ్రూషాస్థితినున్నఁ దద్గుణమణీ ♦ స్తోమంబులో నెన్నుచున్. ౧౩౪

తే॥ రాముఁడా నందమూర్తియై ♦ ప్రేమదొలఁక
సీతఁ గనుఁగొని భక్తి వి ♦ శిష్టుఁడమలుఁ
డస్సుడీతండు తత్త్వబో ♦ ధామృతాప్తి
కనిన నౌఁగాక యనిదేవి ♦ యతనిఁగాంచి. ౧౩౫

క॥ అవహితమతివై వినుమో, పవమానతనూజ! నాదు ♦ పలుకులు విద్వ
త్ప్రవరులు గాంక్షించెద రిటు, భవసాగర మీఁదఁగోరి ♦ ప్రజ్ఞాంచితులై. ౧౩౬

తే॥ వత్స! రాముఁడద్వయ పర ♦ బ్రహ్మమూర్తి
సచ్చిదానందరూపుఁడు ♦ స్వప్రకాశుఁ
డమలుఁడు నిరంజనుఁడు శాంతుఁ ♦ డఖిలగతుఁడ
నామయుఁడు పాపి ముక్త స ♦ త్తామయుండు. ౧౩౭

తే॥ ఆదిమధ్యాంతవిరహితుం ♦ డచలుఁ డతఁడు
తెలియుమీ భద్రమగుఁగాత ♦ ధీసమేత
నన్ను మూలప్రకృతిగాఁ గ ♦ నం గలిగిన
నజ్ఞభావం బెడలునయ్య ♦ యాంజనేయ. ౧౮౮

క॥ నామలఁచు మహాజాలము, లేమేనియుఁ గలవు తెలియ ♦ నెవ్వరితరమీ
సామి యెదుర నిలఁబడి నే, నామూలముగా సృజింతు ♦ నన్ని జగములన్.

క॥ పోషింతుఁ ద్రుంతు నాయీ, భీషణవృత్తులు గణింపఁ ♦ బెక్కులుగల వీ
తోషాత్మ నెడను దోషుల, దోషము దోషముల నెంచ దొరకొనుటరయన్.

సీ॥ శ్రీకరరవికుల ♦ సింధుశశాంకుండు, గా నితండిల జని ♦ గాంచుటయునుఁ
గౌశికసఖ్యంబు ♦ గ్రతురక్షసేతయు, మునిసతీ శాప వి ♦ మోచనంబు
భవధనుర్దలనమ ♦ త్పాణిగ్రహణలీల, లును భార్గవోద్ధత్య ♦ లోడనంబు
బురిసేరి నాతోడఁ ♦ బొలుపుగాంచుట దండ,కారణ్యగతి విరా ♦ ధాదివధయు
మాయిక కురంగమృతి మృషా ♦ మైథిలీహృ
తియు జటాయుఃకబంధము ♦ క్తిప్రసక్తు
లట్లు శబరీ కృతార్చ ఁ ♦ ర్యమతనూజ
మైత్రి శక్రతనూభవ ♦ మర్దనంబు. ౧౯౧

క॥ సీతాన్వేషణచర్యయు, సేతూత్పాదనము దైత్య ♦ సీమనిరోధం
బాతతబలుని సుతహితో, పేతుని రావణుని నాజి ♦ హింసించుటయున్. ౧౯౨

తే॥ శ్రీవిభీషణు రాజ్యాభి ♦ షేకవిభవ, మోజఁ బుష్పకమెక్కి యయోధ్యఁజేరి
చెలఁగి సామ్రాజ్యపట్టాభి ♦ షేకమంది, ప్రజలనేలుట యిటుమహా♦ప్రాభవమున

క॥ ఇవి మొదలగు కృత్యంబులు, పవనతనూజాత చేయ ♦ బడె నాచేతన్
బ్రవిమలుఁ డీచిద్ఘనునం, దవివేకులు సేయుచుందు ♦ రారోపణమున్. ౧౯౪

ఉ॥ ఏకడ నిల్వఁడెచ్చటికి ♦ నేగఁడు శోకము నొందువారితో
శోకము నొందఁడేక్రియలఁ ♦ జొచ్చి మెలంగఁడు కోరఁడెద్దియున్
గైకొనఁబోఁడు చేవిడఁడు ♦ కాదనిదేనియు హర్షమూర్తి ని
త్త్యైకవిభూతి రాముఁడన ♦ నట్టిఁడచూ పవమానసందనా. ౧౯౫

క॥ మద్గుణసంగతి నటులీ, సద్గురుమూర్తిదెస వితగ ♦ సంగితదోఁచున్
జిద్గురు లీయుక్తింగని, సద్గతిఁగనఁగాంతు రాత్త ♦ సంయములగుచున్. ౧౯౬

క॥ ఆశాతంతుత్రుటన, ప్రాశస్త్యము గూరనిట్లు ♦ పశుపాశవిమో
కేశాన పలికి హసితా, వేశము తనరారఁదాను ♦ విరమించుటయున్. ౧౯౭

క॥ అంతట శ్రీరాముఁడు హను, మంతు నుపస్థితునిఁగాంచి ♦ మహనీయ దయా
క్రాంతుఁడయి తనకుఁదానే, సంతస మొప్పారఁ బలికె ♦ సమ్ముఖుఁ డగుచున్.

సీ॥ వత్స! యాత్మానాత్మ ♦ పరమాత్మ తత్త్వంబు, వివరింతు వినుము వి ♦ వేకమలర
ననఘ! మహాకాశ ♦ మని తదవచ్ఛిన్న, మని ప్రతిబింబాఖ్య ♦ మనియునభ మొ
కండె జలాశయ ♦ గతిఁ ద్రివిధంబయ్యె, నెటు లట్లఖండమై ♦ యేకమైన
పరతత్త్వమే బుద్ధ్య ♦ వచ్ఛిన్నబింబాఖ్య, తత్త్వంబు లెనయఁద్రి ♦ త్వమునఁదోఁచెఁ
దివిరి సాభాసబుద్ధిక ♦ ర్తృత్వజీవ, భావములఁ దెల్వి లేమి వి ♦ భ్రాంతులైన
జడు లవిచ్ఛిన్నుఁడవికారి ♦ సాక్షియా ప, రాత్ము నందిడుదురు పర ♦ మంద లేరు.

క॥ సన్నుతమతి; యాభాసం, బన్న మృషాకల యవిద్య ♦ కదికార్య మవి
చ్ఛిన్నంబు బ్రహ్మమది వి, చ్ఛిన్నంబను తే వికల్ప ♦ శీలం బెపుడున్. ౨౦౦

తే॥ బోధఘన; యనవచ్ఛిన్న ♦ పూర్ణమైన, బ్రహ్మతత్త్వంబుతో నేక ♦ భావమిట్లు
తత్త్వమస్యాది శ్రుతి దెల్పుఁ ♦ దత్త్వవిదులు, గందురౌపాధికస్వాత్మ ♦ కలన నెపుడు

ఆ॥ ఐక్యబోధ మెప్పు ♦ డాత్మ పరాత్ముల, కావ నిపదశక్తి ♦ నమరు నపుడె
చెడు నవిద్య దాని ♦ చేయు కార్యములతో, సంశయంబు వలదు ♦ చారుచరిత.

తే॥ పరఁగ దీని నెఱింగి మ ♦ ద్భావమెనయుఁ, గందు రెలమి మద్భక్తులు ♦ గానివారు
శాస్త్రగర్తములంబడి ♦ సన్నలేక, చెడుదురు జనుశ్శతంబులఁ ♦ జెంది చెంది.

క॥ నాకై నేన యొసంగితిఁ, గైకొను మిది యింద్ర పదము ♦ కన్న నధికమే
ప్రాకృతుల కిడకు భక్తులు, గా కర్హులుగారు శఠులు ♦ కపికుల ముఖ్యా. ౨౦౧

క॥ అని రాముఁ డెఱింగించిన, విని వాయుసుతుండు యోగ ♦ విలసన మెసఁగన్
గనె బ్రహ్మతత్త్వమటఁ జి, ద్ఘనుఁడై లోకములఁ బ్రథితి ♦ గాంచె లతాంగీ.

క॥ శ్రీరామ హృదయ మిది సు, మ్మో రామామణి! రహస్య ♦ మురుసంసారో
త్తారకము వేదసారం, బారూఢిఁదలంపు దీని ♦ ననవరత మెదన్. ౨౦౨

మ॥ బలుదోసమ్ము లొనర్చి దుర్భవములం ♦ బాట్లొంది యేపున్నె మో
వెలయన్నాటి కొకప్పుడేని దృఢమా ♦ విజ్ఞాన మొప్పన్నిజా
విలభావంబుఁ దొఱంగి దీని మదిభా ♦ వింపంగ నాలో విని
ర్మలుఁడై కాంచు నతండు బ్రహ్మపద సా ♦ మ్రాజ్యంబుఁ బూజ్యాకృతీ. ౨౦౩

క॥ అని సర్వజ్ఞుఁడు దెలిపిన, విని జగదంబిక ప్రమోద ♦ వివశయగుచు నేఁ
గనఁగంటి సద్రహస్యం, బనఘా! కృతకృత్యనైతి ♦ నమలత తనరెన్. ౨౦౪

శా॥ ఆనందాంబుధి నోలలార్చి రుచిరం ♦ బై కర్ణపూరంబునై
తేనెల్చిల్కెడు పల్కుపల్కి ధృతియు ♦ త్సేకింపఁగాఁజేసి చి

ద్భానుస్ఫూర్తిఁ దమంబెడల్చి హృదయా ♦ బ్జంబట్లు విప్పార స్వా
త్మానాత్మస్థితిఁ దెల్పఁగా నొరులకా ♦ నా? దేవ సర్వేశ్వరా. ౨౦౯

ఉ॥ తావక సత్కృపా గరిమఁ ♦ దారక తత్త్వ మహత్త్వమెల్ల సం
భావితమయ్యె నామది శు ♦ భం బొదవెన్ రఘురామమూర్తివై
శ్రీవనితావిభుం డవత ♦ రించుట మున్నుగఁ దచ్చరిత్రమో
దేవ; మదీయకర్ణములఁ ♦ దీయదనంబెనయింప నింపవే. ౨౧౦

తే॥ రాముఁడన నల యాదినారాయణుం డ, నంగ వేద్వేఱ మదిఁ ♦ దలపంగనేల
దైవరాయ; మహాత్మ; యా ♦ తండితండు, నిఖిలజగదేకమూర్తివా ♦ నీవకావే.

క॥ అని భక్తివినయములు పెనఁ, గొనఁ దను వేఁడుకొనుచున్న ♦ కుధరేశ్వరనం
దన పలుకు లమృతధారల, కనురూపములైన మెచ్చి ♦ హరుఁ డిట్లనియెన్.

తే॥ చెలువ; బ్రహ్మాదులకునేనిఁ ♦ దెలియరాని,
పరము గుహ్యాతమమునైన ♦ బ్రహ్మతత్త్వ
మలవడియె నీ కయారే! యు ♦ నర్ఘ్య రత్న
మునకు శుభసౌరభభరంబు ♦ మొనసెననఁగ. ౨౧౩

క॥ తరుణీ! నను నీచే నా, దరమున నొనరింపఁబడిన ♦ దానవరిపుస
చ్చరిత ప్రార్థన మానం, దరసాంబుధి నోలలార్చెఁ ♦ దరమె నుతింపన్. ౨౧౪

తే॥ విబుధు లొకపరి రుచిచూచి ♦ విడిచినట్టి,
యమృతమటు లుండనిమ్మని ♦ త్యమ్ముఁ గ్రోల
సారెసారెకు రుచి సవి ♦ స్తార మగును
రామ చరితామృతము శైల ♦ రాజతనయా. ౨౧౫

క॥ వినవే వినిచెద నిక్కథ, ననవే మది రామనామ ♦ మనవరతముఁ గై
కొనవే బ్రహ్మానందము, ఘనవేణీ; వికచహల్ల ♦ కలసత్పాణీ. ౨౧౬

వ॥ అని యివ్విధంబున నెయ్యంబుదొలఁక నయ్యలికలోచనుం డమృతంబు చిలుకు పలుకుల నక్కలకంఠకంఠి హృదయారవిందంబునం దమందానంద రససాగరంబు వెల్లి విరియించి విరించి నందనప్రముఖనిఖిలమునిపుంగవజేగీయమానరఘునందన కల్యాణగాథాకథన ప్రవణతాప్రబోధ్యమాన మానస సారసుండై యిట్లనియె.

—♦ భూదేవి బ్రహ్మదేవుని సన్నిధి కరిగి మొఱపెట్టుకొనుట ♦—

మ॥ తరలాక్షీ; విను. రావణాదిఖలదై ♦ త్యశ్రేణుల న్మోవలే
క, రసానీరజ పత్రనేత్ర మొదవై ♦ కంజాసనున్వేఁడ ని

ర్జరులున్మౌనులు వెంటరా నరిగి రా ♦ జత్తత్పదాబ్జద్వయిన్
శిరమెంతేనియుఁ జేర్చి మ్రొక్కి జలరా ♦ శీభూతబాష్పాలియై. ౨౧౮

చ॥ శరణు తపస్విపాలన వి ♦ శారద; శారదచంద్రికద్యశా
శరణు లసత్త్వజావన వి ♦ చారణ; చారణభావనావశా
శరణు సురేంద్రవంద్య పద ♦ సారస; సారసబాంధవప్రభా
శరణు త్రయీశిరఃకుముద ♦ శార్వర; శార్వరలోకదుర్లభా. ౨౧౯

తే॥ భద్రమూర్తీ; సరస్వతీ ♦ ప్రాణనాథ, వివిధ విద్యావతారవి ♦ విక్తహృదయ
సద్గుణైకాశ్రయ; దయార్ద్ర ♦ సన్ననయన, యుత చరాచరసర్జనో ♦ ద్యోగనిపుణా.

సీ॥ నిజచిత్తభూమిపై ♦ నిగ్గునొండెడలేక, యనురక్తిసద్భావ ♦ మవధరింప
మోము తెల్విప్రభావ ♦ ముఁ గలాసమగ్రమై, సర్వతోముఖజల ♦ త్వ్యతఁ బొసంగ
బలుకుఁగన్నె యసంపుఁ ♦ జెలియొక్కరూపున, స్వరసజ్జ మహాసీయ ♦ సరణి నిలువ
వరగుణక్రమదిమ గ ♦ ర్భము సుకల్యాణమై, నవనీతవర్ణ్యత ♦ సనరణఁగన
భక్తపరత సొబగు సౌమ్య ♦ భావ మఖిల
సృష్టివివృతి విలాసవి ♦ శేష మగ్ర్య
ధర్మ మమలత్వ మీశ్వర ♦ త్వమ్ము నొలయ
వెలయు దొర నిన్నుఁబొగడ నా ♦ కలవియగునే. ౨౨౧

తే॥ పాలమున్నీటిపట్టిఁ జే ♦ పట్టినట్టి, మేటిదొర బొడ్డుదమ్మి జ ♦ న్మించి మించు
వెల్లదామరగద్దియ ♦ వెలసి ముజ్జ, గంబు లెక్కుడు దయనేలు ♦ కన్నతండ్రీ.

మత్త॥ నిక్కుఁపుంజగ మిక్కుగా నెటి ♦ నిల్చియెక్కటి తెల్వి పెం
పెక్కఁ జక్కటి మేటితాపసు ♦ లెల్ల మేలిమలుంగులన్
జొక్కి తెల్పఁగఁ దొల్లివిద్దెల ♦ జోటులౌనన ధర్మువం
దెక్కుడై మనుప్రొద్దునెన్నుదు ♦ రెక్కఁగూర్చెడి వేలుపా. ౨౨౩

క॥ కెలిపక్కి జక్కినెక్కెడు, తొలిదేవర; నీకు మ్రొక్కు ♦ దోసము లడఁపం
గల జేజే; నతి నీకం, జలి పాఱుఁ దపసులఁగన్న ♦ చక్కనియన్నా. ౨౨౪

శా॥ జేజే వెట్టెద గట్లచట్టుపలఁ జే ♦ చేఁజెక్కి పేరెక్కనే
జేజేయాదొర దొట్టివేల్పులిల జే ♦ జేలెల్లరుందారు ము
న్నోజంబైఁ గనుసన్నఁగాంచు పెడగా ♦ నుల్లంబులంగొల్తురే
తేజాప్రాఁజదువుం దిగమ్మఁగని కీ ♦ ర్తింగన్న నీకెన్నఁడున్. ౨౨౫

తోటకము॥ పెనుభూతములాదిగఁ బేరిమిము, న్నొనరించి ప్రపంచము ♦ నొక్కటఁద
ద్ఘనభారము నాదలఁ ♦ గైకొనఁగా, నను నిల్పినప్రోడవు ♦ న్యాయనిధీ

వసంతతిలక॥ అశ్శాకరీంద్ర కిరి ♦ పాహి మహీన కూర్మా
ధీశాదులెప్డు బల ♦ మెక్కుడి తోడ్పడంగన్
లేశంబులేదఱ స ♦ లీలకృతాఖిలేశా
నీశాసనం బెడసి ♦ నేటికి వింతదోఁచెన్. ౨౨౭

క॥ మావలనఁగాదు దుర్వహ, మీవిధి చెడగరములెంత ♦ యేనిఁ గలంపన్.
భావుకమూర్తి; తలంకం, గావలసె నిఁకెద్ది యెట్లు ♦ గావలయునొకో. ౨౨౮

క॥ కావవె కల్యాణనిధీ, కావవె జగదుదయ ముఖ్య ♦ గతి కారణధీ
కావవె కరుణారసధీ, కావవె దీనావన ప్ర ♦ కారసదవధీ. ౨౨౯

వ॥ అని యిట్లు పెద్దతడపు గొడవ పేర్మి నడరు గద్గదిక పెల్లున సన్నసెడ వాపోవుచు మున్నాడి తొడవుసిరిఁగన్న చిన్నారి తొడుకుమిన్న రూపున నందంబునుఁ జందంబునుఁ బెరసి మిన్నదనంబు విన్నదనంబు నొండొంటిఁ బెనఁగొనంజేయుఁ జెన్నటి సన్నవడియు వింతవిన్ననువుదోఁపనున్న యన్నెల కన్నియ గ్రన్న నందనుఁ గన్నవారికి నెన్నఁడేని నెన్నరానిదగు నిద్దంపుటక్కటికంబు పెనుపునం దనతోడిద నడవడి యగుచుండ గుట్టుసడల బిట్టడలిన— ౨౩౦

—♦ బ్రహ్మాదులు క్షీరసాగరమున కరుగుట ♦—

క॥ విని వనజగర్భుఁ డమ్మె, దిని యుమ్మలికమ్మెఱింగి ♦ తేఁకువ నద్దే
విని సురలందొడ్కొని ప, ద్మనయనుఁగన దుగ్ధవార్ధి ♦ దరిఁజేరి వెసన్. ౨౩౧

మ॥ కనుదమ్ముల్ముకుళింపఁజేసి మదిలోఁ ♦ గంజాక్షువిశ్వాత్ము నే
ర్పునఁ గీలించి ధృతిప్రయుక్తిఁబవను ♦ న్బోనీక బంధించి యా
నన పద్మావలిహంసతేజమున నం ♦ దంబంద నారాయణా
య నమస్తేపరమాత్మనే యనుచు ధ్యా ♦ నాగూఢిఁబెంపొందుచున్. ౨౩౨

వసంత తిలక॥ ఆనందబాష్పకణి ♦ కాంచితలోచనుండై
వ్యానద్ధ దద్గదికుఁ ♦ డై హరినాప్రజేశుం
డానమ్రవేదవచ ♦ నాగమ సంస్తవంబు
ల్జ్ఞానై రహింప విమ ♦ లస్థితిఁ బ్రస్తుతింపన్. ౨౩౩

—♦ విష్ణుదేవుండు సాక్షాత్కరించుట ♦—

సీ॥ శతకోటిభాస్కర ♦ ద్యుతులమిటారించు, ఘనకిరీటము మస్త ♦ కమున వెలయఁ
గ్రొక్కారుమొయిలుఁ బై ♦ కొనుబన్మెఱుంగునాఁ, బసిఁడిసాలువు మేన ♦ మిసిమిఁజెంద
మున్నీటికన్నె కై ♦ మ్మోవిచేవ్వగుణింపఁ, బడెదుక్రొంజిగిఁకౌస్తు ♦ భ మెదమెఱయఁ
దనుకాంతిర్ఝురమునం ♦ దు నయముఖనాభి, హస్తాంఘ్రికమలము ♦ లందగింప

హొసరుచులు తమము దెస ♦ లంటఁ దఱుమఁ
గెలన సనకాదియోగీంద్రు ♦ లెలమిఁ గొలువఁ
జిలువదిండిహుమాయిపైఁ ♦ జెలఁగి శేష
శాయి చతురాస్యునెదుట సా ♦ క్షాత్కరించె. ౨౩౪

సీ॥ చిద్ఘనస్ఫూర్తియో ♦ శృంగారపూర్తియో, మైమాఱుహత్తిల్ల ♦ మలయువాని
సౌజన్యసత్త్వమో ♦ చంద్రమస్తత్త్వమో, మోముతావునసిల్వ ♦ మురియువాని
శమదమార్థమ్ములో ♦ శంఖచక్రమ్ములో, కరయుగమ్మునమించఁ ♦ గాంచువాని
స్వనివిష్టలీలయో ♦ సద్వనమాలయో, గుణలక్ష్మినెదఁగూర్ప ♦ గులుకువాని
మఱియు బాహ్యాంతరమ్ముల ♦ మహితమూర్తి
కలన నొక్కండుగానిండి ♦ క్రాలు దివ్య
ధామపుంజమ్ము నమ్మేటి ♦ దైవతమ్ము
నలువ గన్నెమోల నబ్రమ్ము ♦ మొలువబాల. ౨౩౫

క॥ అమ్మహనీయమహానిధి, సమ్ముఖమునఁగని విరించి ♦ సత్వరమొదవన్
గ్రమ్మఱఁ గననేరక కను, దమ్ములు గేల్దమ్ములొక్క ♦ తఱియ మొగిడ్చెన్. ౨౩౬

శా॥ శ్రీమత్ప్రశ్రయహర్ష భక్తిభయము ♦ ల్చిత్తాబ్జమం దొక్కటన్
సామానాధికరణ్యమంద నజుఁడం ♦ చత్స్వేద రోమాంచుఁడై
భూమిశ్రీసహితుం బురాణపురుషుం ♦ బూజ్యుం ద్రయీవేద్యుఁ దే
జోమూర్తిం గనలేక కాంచి పొగడెన్ ♦ శ్రుత్యంత సూక్తంబులన్, ౨౩౭

సీ॥ పరఁగ నశబ్ద మ ♦ స్పర్శంబరూప మ, వ్యయమరసము నిత్య ♦ మటులగంధ
వంతమనాద్య మ ♦ నంతము మహతఃప, రము ధ్రువమగునెద్ది ♦ సమత నెఱుఁగఁ
బడిన మృత్యువు బారిఁ ♦ బడ రనఘుత బ్రహ్మ, విత్తమమహిత సం ♦ పత్తిగాంతు
రెల్లరునని శ్రుతి ♦ వెల్లడించెడు నింద్రి, యము లర్థములెద ధీ ♦ యాత్మ యమ్మ
హాత్తు వవ్యక్తమప్పురు ♦ షాఖ్యపదము, నొప్పఁబరమతనివి యుత్త ♦ రోత్తరమని
కడకునదె కాష్ఠయదె పర ♦ గతియునని యె, నరయ నాతత్త్వమీవె క ♦ ల్యాణమూర్తి.
తే॥ అంజలి ఘటింతు దేవనీ ♦ యంఘ్రికెవుడుఁ, బ్రాణబుద్ధీంద్రియాత్మల ♦ బరఁగ దేనిఁ
గర్మపాశంబువల ముము ♦ క్షుంబొసంగు, నదులెదనుతింతు రదెనాకు ♦ శరణమనుచు.

చ॥ గుణమయియైన మాయ తన ♦ కూర్మిమెయిన్నినుఁ జేరఁగాంచి ద
ర్పణ మరుణాంశుజాలముల ♦ భంగిఁ ద్వదీయ కళల్గ్రహించి కా
రణ మదిగా జగంబులఁ ది ♦ రంబుగఁ గూర్చునుఁ బ్రోచుఁ ద్రుంచు ల
క్షణములు నీయెడన్వెతగఁ ♦ గల్పన సేయుచు నుండునిచ్చలున్. ౨౪౦

క॥ స్వానందాను భవాత్ముఁడ, వైననినుం జెనయనేర ♦ వవినెట్టన న
జ్ఞానావృతులకు నమ్మెయి, ధ్యానంబొన గూర్పఁజాలుఁ ♦ బ్రజ్ఞాస్ఫురణన్, ౨౪౧

సీ॥ జగదేకమాంగల్య ♦ సంసిద్ధి కెద్దాని, కయ్యైస్వరూపాప్తి ♦ యనవరతము
నంతరంగస్థైర్య ♦ మలవడనేదాని, సాత్త్వికులగు మును ♦ ల్సంతరింతు
రానుపూర్విగఁ బూర్వ ♦ మాత్మ స్థితికినేము, సేవింపఁగంటిమి ♦ చెలఁగిదేని
నపరోక్షమనుభవ ♦ మందఁగాజ్ఞానులు, యద్భావనముమది ♦ నవధరింతు
రట్టితావకీన ♦ మంఘ్రియుగము నేఁడు, చేరఁగలిగెఁదిరుగఁ ♦ జిత్తదోష
శాంతియొదవె నిఁక న ♦ సాధ్యంబు గలదెద్ది, నీదుకరుణవెలయ ♦ నిత్యవిభవ.

క॥ తమకు మణికాంతియెడ మణి, భ్రిమ గలిగినవారపోలె ♦ భక్తులు నీత
త్త్వము గందురు కల్యాణో, ద్యమమగు నీమూర్తి జెంద ♦ మందిడి శౌరీ. ౨౪౩

తే॥ దాన మధ్యయనము నెన్నఁ ♦ దగిన క్రియలు
నెవియుఁ గాని శుద్ధిగాంతురే ♦ యెందు శఠులు
పావనులు నీదు యశమున ♦ భక్తి శ్రద్ధఁ
బొదలువారెట్టు లటులనో ♦ పుణ్యమూర్తీ. ౨౪౪

మ॥ అనుమేయంబగుఁగాదె దీన భవదీ ♦ యాంఘ్రిద్వయైకప్రపూ
జననిర్మాల్యగుణాఢ్యమూర్తి తులసీ ♦ ప్రక్రాంతపై నల్గున
కృనఁదాఁ జొక్కియు శ్రీసపత్నివలె నా ♦ స్గార్మిన్నినుంగొల్చు భ
క్తుని సామ్రాజ్యపదంబిఁ కేరికెటుఁ గై ♦ కో రామి సర్వేశ్వరా. ౨౪౫

ఆ॥ కాన సార వేదు ♦ లైన త్వద్భక్తులె, ద్దానిఁ గొందు రౌష ♦ ధంబటంచుఁ
దనకు సంసరణగ ♦ దప్రతాపనిహంత్రి, నీదు భక్తిలోన ♦ నెగడుఁ గాత.

సీ॥ కరుణింపవే; నిత్య ♦ కల్యాణకారుణ్య, లక్ష్మీనివాసతా ♦ లక్ష్య హృదయ
దయఁ జూడవే; మత్త ♦ దైతేయబి భ్యస్మ, నిస్వర్గసంశ్రయా ♦ నీకపోషి
పోషింపవే; యోగ ♦ పూర్వమాయైక్య ప్ర, సాధితలోకలో ♦ కాధిపాలి
పాలింపవే; నిజ ♦ భక్తసంస్మృతిసరి, త్పతికుంభసంభవ ♦ ద్భవ్యనామ
నామనవిఁగైకొనవె; పావనప్రమోద మోదమొసఁగవె; భావుక♦ములకుఁ బ్రోవ
ప్రోవవే; బ్రహ్మవాదిసం ♦ భావనీయ, నీయభిప్రీతి నామీఁద ♦ నిలుపవె; హరీ.

క॥ అకలంకవిభవ నీనా, భికమలమున నన్నొనర్చి ♦ విష్టపచయసృ
ష్టికిఁ గర్తగా విధించితి, వి కదా నావలని కరుణ ♦ వెలయ ముకుందా. ౨౪౭

తే॥ మఱియు భువనావనార్థమే ♦ మఱక ప్రతియు
గంబునను జన్మయోగంబు ♦ గందువజుఁడ

వయ్యు నీమహిమలఁ గాని ♦ యీడ నెంత
వాఁడ నీవాఁడఁ గావు మ ♦ న్నాడ నయ్యా. ౨౪౯

క॥ నను భవదీయదయాలస, దనుజ్ఞఁగొననీయ దేమి ♦ యాగడమో నె
మ్మనమాతురతన్వీరిడి, తనమేర్పడ దాననెట్లు ♦ తలఁకుదుఁబలుకన్. ౨౫౦

తే॥ దేవ; రావణుఁ డమిత త ♦ పోవశమున, నన్నుఁబ్రీతునొనర్చి కి ♦ న్నరసురాసు
రాదులకజేయుఁడై యుండ ♦ నాదువరము, గొనియలంచెదుఁజలముచే ♦ కొనిజగముల

సీ॥ కాళ్ళిల్వుకొననీక ♦ కడఁగిపోఁదోలె జే, జేలమన్నీనిఁబ్రో ♦ ల్చిన్నవోవ
నసువులూనఁగనీక ♦ కసరుమైఁ గదిమెన, క్కడలసాములసిరు ♦ లదలిచనఁగఁ
జేతులాడఁగనీక ♦ చిక్కించెముప్పొక, పోటుబంటులసిగ్గు ♦ పొల్లువాఱఁ
దోఁచితోఁచఁగనీక ♦ తొలిచెఁదపస్వుల, చిత్తభిత్తులధృతి ♦ స్థితి తొలంగఁ
గాఁపురము లుండఁగానీక ♦ కన్నెమిన్న, లున్నవెలవుల మేల్సన్న ♦ సున్నగాఁగ
నెమకిచెఱలుంచె నిఁకమీఁద ♦ నిలుచుజగతి, నెద్దిసెలవీవెసీవె భో ♦ గీంద్రశయన.

ఉ॥ జన్నమొనర్చువేళ భుజ ♦ సత్త్వసమగ్రుఁ డతండువిన్నఁదో
నన్నెలవంది తత్క్రియల ♦ నర్థసమప్తిగ వేదిఁబెట్టిపై
మన్నిడు దీనికూఱడిలు ♦ మానసమెవ్విధినైన నన్నఁదా
మిన్నకపోఁడు యజ్వకామ ♦ మిన్న వెసంగొనికాని యీశ్వరా. ౨౫౩

తే॥ వేయునేల జగత్త్రాల ♦ వెగడుగాంచి, రెల్లప్రజలది యట్లుండె ♦ నీధరిత్రి
తనకు నిలుకడ భరమని ♦ తలఁగసాగె, నింకసెలవెట్టిఁడైననే ♦ యిడుమలోకో

క॥ ఇనశశినయనా; నీయెఱుఁగనిదేలోకములనేనిఁ ♦ గానఁబడునె యై
నను విన్నవింతు వానికి, మనుజునిచేనంతగతి ని ♦ మంత్రితయయ్యెన్. ౨౫౫

వ॥ అదియెట్టులనిన వరంబులర్థించునాఁడల్లవాఁ డెక్కుడు మదోన్మాదంబునంజేసి నరవానరుల నెంతయుం దృణీకరించె నయ్యుపాధి మత్ప్రార్థనీయాంశంబున కనువుపడియుండె. ౨౫౬

తే॥ కాన మానుషమూర్తిమైఁ ♦ గడఁగిదేవ, రిపుఁదమోమయు మర్దించి ♦ ప్రీతిజగము
లనుఁ దమోనుద్విలాసంబు ♦ ననువెలయఁగఁ, జేయవే; భక్తవత్సల ♦ చిత్తయనిన

—♦ విష్ణుఁడు వరంబొసంగుట ♦—

క॥ ఎలనగవు మోము చందురుఁ, గలసి దెసలవెలుఁగఁజేయఁ ♦ గావలమురితా
ల్పు లలితగంభీరస్వన, కలనల మిన్నేఱు దోడు ♦ గా నిట్లనియెన్. ౨౫౮

ఉ॥ అన్న! యెఱుంగుదున్నిజజ ♦ నాదృతి సీయది యాట వాఁడు దా
న న్నినుఁగైవసంబుగ నొ ♦ నర్పఁదపంబునఁ గొన్న తెంపు ము

న్నెన్నఁడు నేరికీని వర ♦ మీతని కీవిడుచొప్ప శౌర్య సం
పన్నుఁడతండు ముజ్జగముఁ ♦ బాయని యేపున వేఁపు చెంతయున్. ౨౬౦

ఆ॥ సుజనులెందుఁ బ్రబలి ♦ శోభిల్లువారందుఁ, బ్రజలునటులె యాట ♦ పాపులెగువ
భగ్నులౌట గానఁ ♦ బాముల కిడుపాలు, ఖలవరములు నేక ♦ గతిఫలములు.

క॥ విను మింతవట్టు దాళఁగఁ, దనకయ్యెఁ ద్వదీయవరవ్ర ♦ థాత్వంబెన్నన్
జనదింక నుపేక్షింపఁగ, ఘనభుజుఁడతఁ డాతతాయి ♦ గతికిరవగుటన్. ౨౬౨

వ॥ తనకై తానె నాకవశ్యంబు వధ్యుండయ్యె నిట్లనియె నిమ్మెయిన తొడరుదుననిన భవదీయవరప్రదానవచనరచన కమోఘత్వాపాదనంబుచొప్పడనేర దట్లుంగాన నొక్క రహస్యసందర్భం బెఱింగించెద నాకర్ణింపుము. ౨౬౩

మ॥ అనఘా ! కశ్యపుఁ డచ్చఁపుం దపముమై ♦ నానంద మందింప మె
చ్చిన నన్నందనుఁ గమ్మటంచతఁడు జే ♦ జేవెట్టఁగావల్లె యం
టిని నేఁడుత్తర కోసలేశ్వరత నుం ♦ డెన్వానికిం బుత్రతన్
జననంబందెద నాల్గురూపముల ని ♦ చ్ఛా కల్పనాచాతురిన్. ౨౬౪

క॥ తనయోగమాయయును జన, కుని గృహమునఁదోఁచు నమ్మ ♦ గువతో సర్వం
బును నొనగూర్తుఁ జనుండని, ఘనుఁడద్దేవుండు ధ్యాన ♦ గమ్యుండగుడున్. ౨౬౫

తే॥ వెనుక విధిసురలనుఁ గని ♦ వెన్నుఁ డర్క
వంశమునఁ బుట్టు మీరు మీ ♦ యంశముల వ
లీముఖుల సృష్టి సేయుఁడు ♦ లెందు శుభము
లొదవు నెల్లరకని పల్కి ♦ ముద మొనర్చె. ౨౬౬

వ॥ వెండియు శతానందుండు గోరూపధారిణియగు మేదినీ మానినీ తిలకముం దిలకించి యమ్మా ! నీవింక వగవంజనదు నేఁట రేపటఁ బరమేశ్వరుం డవతరింపం గలవాఁడట మీఁద నీకెవ్వాని భరింప భరంబగు నద్దుష్టాత్ము నమ్మహామహుండె తెగటార్చి నిన్నానందింపంజేయుచు నుండువాఁడని యూఱడిలంబలికి యనంతర క్షణంబున ౨౬౭

క॥ వా రొక్కట ననురాగిల, రీరి పితామహుఁ డటంచుఁ ♦ బ్రీతిఁ బొగడ నం
భోరుహగర్భుఁడు వాణీ, నీరేజదలాక్షితోడ ♦ నెలవునకరిగెన్. ౨౬౮

ఉ॥ వేలుపు లాత్మ తేజముల ♦ విశ్వజనీనచరిత్రసత్త్వము
ద్వేలమయుగ్గణమ్ముఁ గపి ♦ వీరబలమ్ము సృజింప భూమిభృ
త్సాల నికుంజపుంజములఁ ♦ దార్కొని నెక్కొనుచుండె నారమా
లోలుపు నాన యుజ్జగతి ♦ లోఁ గొనరూపముగొన్న చాడ్పునన్. ౨౬౯

—♦ ఇనవంశ రాజ ప్రశంస ♦—

క॥ మును సప్తద్వీపయను, దనరారెడు వసుధయెల్లఁ ♦ దమ కైవసమై
యనువొంద మనుప్రభృతులు, జననాథుల జితులు మనువఁ ♦ జాలఁగ వెలసెన్.

సీ॥ అవ్వారిలోపల ♦ నెవ్వానిశీలమ్ము, గుణ సాగరాఖ్యాన ♦ కోటిమెఱసెఁ
ద్రవ్వించె నేమేటి ♦ తనపేర సంద్రమ్ము, సాగరమ్మనఁగఁ బ్ర ♦ శస్తినెగడ
నేరాజువిఖ్యాతి ♦ యిక్ష్వాకువంశమ్ము, ధ్వజపటి యనవిజ ♦ త్వరతఁబరఁగె
షష్టిపుత్రసహస్ర ♦ సమితి యేసమితింజ, యుంబరివారించె ♦ యుద్ధయాత్ర
నట్టి సగరు నన్వ ♦ యంబున నృపతుల్మ, హాత్ములేతదధిన ♦ మాశ్రయమునఁ
బొడమి పొడవుపడియెఁ ♦ బుణ్యంబు రామాయణంబు నాధరంది ♦ రంబుగాఁగ.

శా॥ ఆయీ రామచరిత్రసంవలితవా ♦ నాఖ్యాన మత్యర్థసు
శ్రేయోదాయక మిూప్సితావహము సం ♦ సిద్ధర్షిముఖ్యానిశ
ధ్యేయంబే వివరింతు నెల్ల నిదియ ♦ ర్థిన్ శ్రద్ధధానుల్జను
ల్గేయంబుం బొనరించి కాంత్రు జయల ♦ క్ష్మీసత్కీర్తివిద్యాధృతుల్. ౨౨౨

—♦ అయోధ్యాపుర వర్ణనము ♦—

తే॥ శ్రీవెలయు కోసలాఖ్యఁ బ్ర ♦ సిద్ధిఁ గాంచి
పెద్ద జనపద మొప్పు సం ♦ స్ఫీతమగుచు
విదితమును ముదితమును ని ♦ విష్టమునయి
సరయువు తటంబు తనకు సం ♦ స్థాయముగను. ౨౨౩

ఆ॥ ధరణి తనప్రభూత ♦ ధనధాన్యసంపత్తి, నిత్యయావనంబు ♦ నెఱయుచుండ
నాథుఁగొలుచు తెఱఁగు ♦ నంద్యమై నెగడొందు, వత్సలత ప్రజాలి ♦ వలన వెలయు.

తే॥ పుడమి చేడియ యురమునఁ ♦ బొసఁగు కోస
లాఖ్య మౌక్తికహారాలి ♦ కందమొసఁగు
వేల్పుతావతకమొ నాఁగ ♦ వెలయు జగతిఁ
బున్నెములకిమ్ము సాకేత ♦ పురవరమ్ము. ౨౨౪

క॥ ఆవీడయోధ్య నాజగ, తీవిశ్రుతమై తలిర్చు ♦ మనుమానవనా
థావిష్కృతగాఁ దన్మహి, మావిర్భాతిప్రకార ♦ మభివర్ణ్యముగాన్. ౨౨౫

తే॥ ఆమహాపురి పదిరెండు ♦ నైతనర్చు, యోజనమ్ముల పొడవయి ♦ యోజ మూట
నట్లు విస్తృతియునునై మ ♦ హాపథసువి, భక్తయును శ్రీమతియునయి ♦ పరిఘవిల్లు.

సీ॥ రవలమేకొను కాంతి ♦ రాణింప ఘననీల, కంఠతఁ దలగంగ ♦ గవయుఁగొన్ని
పద్మరాగాంచిత ♦ ప్రభ సర్వతోముఖ, త్వమునఁగలాస్పష్టిఁ ♦ దనరుఁ గొన్ని
నిజతేజమున దేవ ♦ నిలయంబు పెనుపొందఁ, జేయుచుగురుభక్తిఁ ♦ జెలఁగుఁగొన్ని
రాజరాజత్వాప్తి ♦ రాజిల్లి కుందప్ర, ముఖలక్ష్మి రాజుతో ♦ మొనయుఁ గొన్ని
దుర్జనులఁద్రుంపనిర్ధర ♦ దారయుహారినిఁ, బాయఁజాలమి మునుమున్న ♦ పరఁగినట్టి
శివశతానంద శతమఖ ♦ శ్రీదముఖ్య, దైవతములనఁ బురిని సౌ ♦ధములు వెలయు.

ఉ॥ అమ్మయుఁడైన చందురుని ♦ యందరుణాంశువులొంది రేయిధ్వాం
తమ్మెడఁ జిమ్మునంద్రయినఁ ♦ దద్విధుబింబము దర్శనీయమౌ
టెమ్మెయిఁ గల్గునోతలఁప ♦ రిప్పురి స్ఫాటిక సౌధ కాంతిపుం
జమ్ము దివమ్ము గ్రమ్మగతి ♦ చక్కఁగ నీతనివంకఁ దోఁచెడిన్. ౨౭౯

తే॥ రాజనీలమణీగృహ ♦ రాజిప్రతి ఫ, లింప సితభానునందంక ♦ లీల కాన
నయ్యెనతఁడు తదుద్గతుఁ ♦ డౌటమటియు,నంతరితుఁడౌటఁ బక్షద్వ♦యంబుగలిగె.

తే॥ తన్నగరనాధునకు విబు ♦ ధనిలయేశుఁ, డతనికితఁడు సమైశ్వర్య ♦ లాప్తవరులుఁ
గాన నెగడొందు రాకపో ♦ కలకు నిలిపి, నట్టి సోపానపఙ్క్తి నా ♦ హర్మ్యపాళి.

తే॥ లీలమెయి మాడువులనాడు ♦ బాలురచట,ననిమిషద్రుఫలములందు♦కొనుటఁ జేసి
కానరోత్క్షుత్పిపాసలఁ ♦ గానియెడ భు, జింపనొల్లరె తల్లులు ♦ చీరనైన. ౨౮౨

క॥ అమల కనకగోపుర కుం, భముల మొనయు సమయమునఁ బ్ర ♦ భావంతుని బిం
బము వీట నెల్లరకుఁ ద, గ్గమనముచేఁగాక తెలియఁ ♦ గాఁ దరమౌనే. ౨౮౩

తే॥ తరణి మందేహసంజ్ఞు లా ♦ శరులు సంజ
లందు మాత్రమె రోధించు ♦ టఁసి చూడఁ
దత్పురద్వారచయధ గ ♦ ద్ధగిత హేమ
కలశరవిబింబకోటులఁ ♦ గాంచి కాదే. ౨౮౪

తే॥ పురి మెఱయు వజ్రమయ వప్ర ♦ ములను డాయు
వేళఁ దద్రుచుల నరుణ ♦ బింబమునకు
నొందు వన్నె యొదవుఁగాక ♦ యున్న సంజ
లంద కెంజాయ నది వెల ♦ యంగ నేల. ౨౮౫

క॥ అప్పురిఁగల సైకతముల, కుప్పలు మణిరాసులనఁగఁ ♦ గొనకొని జేజే
తిప్పలనఁ దనరు మేడల, యొప్పిదము నుతింప నెవ్వఁ ♦ డోపు జగములన్.

తే॥ సర్వవస్తువు లచ్చట ♦ స్వర్ణమణిమ, యమ్ములైయుంట నప్పురి ♦ నావరించి
నట్టి ఖేయాబ్ధిగన్న ర ♦ త్నాకరాఖ్య, భ్రాంతి జనులు జలధియెడఁ♦బాడుచుంద్రు.

సీ॥ కీరముఖత్రుటిత ♦ తోరుదాడిమబీజ, ములఁగాంచి మేలి కెం ♦ పులనుఁ గాంచి
నవనవోల్లసితప ♦ ల్లవ నికురుంబమ్ము, లనుఁగాంచి సత్ప్రవా ♦ లములఁగాంచి
పరిపక్వసహకార ♦ భవ్యఫలోత్కర, మ్ములఁగాంచి పసిఁడి ము ♦ ద్దలనుఁ గాంచి
యనిశైక కలనాస ♦ మంచితశాద్వల, మ్ములఁగాంచి గరుడ ప ♦ చ్చలనుఁగాంచి
వికచవివిధపుష్ప ♦ వితతులఁగాంచి వి, శిష్ట మణిగణముల ♦ సిరులఁగాంచి
కాన రొరులువీటఁ ♦ గదియక యుద్యాన, భూములనుచు విపణి ♦ సీమలనుచు.

సీ॥ కులగిరినిభహర్మ్య ♦ కూటస్థలీమృదం, గనినాదములు మేలి ♦ గర్జలనుచు
నంబరచుంబి సౌ ♦ ధాగ్రభూవిహరద్వ, ధూతనుద్యుతులు వి ♦ ద్యుత్తులనుచు
నాశావలయసము ♦ ద్యత్తోరణస్థ ర, త్నప్రభ లింద్రాయు ♦ ధములటంచు
నాతారకాపథ ♦ వ్యాపకవైజయం, తీ కల ల్వీనువాఁక ♦ తెరలటంచు
భ్రాంతులెన్నెన్ని యోయిట్లు ♦ పరఁగుచుండుఁ, గానియేనాఁడును విముక్తి ♦ ఘటనలేదు
ముక్తి పురవరమందురు ♦ మునులెఱింగి, దీని దేవరహస్యంబు ♦ దెలియుటరిది.

చ॥ ఎడనెడనోషధీలతిక ♦ లెల్లెడ యంత్రకలాకలాపభా
స్యుడుపతిబింబముల్ ఘృణి మ ♦ హోజ్జ్వలభాస్కరభాస్వరంబులై
కడలఁదనర్చు రత్నకలి ♦ కానివహంబులు డంబుమీఱ నె
న్నఁడుఁ గనరాదు రేఁ బవలు ♦ నా వివరంబెటు వింతవారికిన్. ౨౯౦

ఉ॥ పచ్చలతోరణాల గుమి ♦ పచ్చఁగఁదీర్చిన యట్టులుండ నే
పొచ్చెము లేని ముత్తెముల ♦ ముగ్గు లమర్చిన రీతినుండ సం
పచ్చయయుక్తి కర్జ్వముగ ♦ మంగళవాద్యము లోలిమ్రోయఁ బ్రో
ల్లచ్చికి లచ్చి; పెండిలిఁ ద ♦ లంగక చేయుచునుండు నిచ్చలున్. ౨౯౧

తే॥ తనవనఁబులు క్రొత్తనం ♦ దనవనములు, మందురలు సైంధవకలాప్త్య ♦ మందరములు
మందిరములు శుభేందిరా ♦ మందిరములు, స్వర్గపురమున కిదివింత ♦ స్వర్గపురము.

ఉ॥ మిన్నుల మించిదాన రమ ♦ మేలువహించి తెటిత్కలాప సం
పన్నతఁగాంచి స్ఫారరవ ♦ భంగులై సంగఁగ గజ్జలాద్రు లం
చెన్నఁగ మేఘమండలి మ ♦ దేభనిభస్థితిఁబొల్చు నప్పురిన్
విన్నఁదనంబు లేకెపుడు ♦ విష్ణుపదాప్తి నెలర్చు రేఘనుల్. ౨౯౩

తే॥ వీటనెగడొందు ఘోటక ♦ వితతిధాటి, వ్రేటువడి వేల్పుదొరతేజి ♦ వీనులెత్తి
తిరిగి చూచుచు వెల్లనై ♦ దివము సేరె, దాన నుచ్చైశ్శ్రవంబంద్రు ♦ దానిజనులు.

క॥ అనిలుని రూపు గెడపె న, మ్మనమణువుగఁ జేసె నంశు ♦ మాలిరథాశ్వా
లినిఁ ద్రోచె మహాబిలమున, ఘనవేగము పేర్మి ఘోట ♦ కవ్రజము పురిన్.

సీ॥ పద్మరాగప్రభా ♦ పటలంబు లొకచోట, నొకయెడ మౌక్తిక ♦ ప్రకటరుచులు
లలితప్రవాలద్యు ♦ తుల రాసులొకవంక, నొకచెంప గారుడా ♦ శ్మోరుశోభ
లలపుష్యరాగ దీ ♦ ప్తులగుంపు లొకయోర, నొకపార్శ్వమున వజ్ర♦నికరరోచు
లలఘునీలమణిచ్ఛ ♦ వులప్రోవు లొకచాయ, నొకకడ గోమేధి ♦ కోస్ర విభలు
సకలరత్న మిశ్ర ♦ సత్కాంతులొకచక్కి, వెలయునెప్డు గగన ♦ వీధిదోరసి
ఘనశతాంగవర్గ ♦ కపటనవగ్రహ, మండలములు ఫీట ♦ మలయుచుంట.

ఉ॥ చొచ్చినఁ జొత్తు రబ్బలి వ ♦ సుంధరనైన ద్విజిహ్వవృత్తి లే
దచ్చద లెక్క నందజె మి ♦ యార్చెద రూనరు పక్షపాతమే
పొచ్చెమెదం దలంపరనిఁ ♦ బోటులఁ గీడ్పడఁ బోరొకప్పుడున్
మెచ్చరు శూలినైన ధృతి ♦ మేకొను యోధవరేణ్యు లప్పురిన్. ౨౯౭

సీ॥ పొలయల్కవోడమున ♦ ప్పుడె విప్రలంభంబు, స్మరసంగరములనె ♦ మానహాని
సురతవిశ్రాంతినే ♦ సొలింతకాన్పు కూ, రొక్కదప్ర్వేళనె కలా ♦ నుద్యమంబు
ఘనతపోవ్రతనిష్ఠ ♦ లనె విలాసవిరామ, మతిహర్షమందె బా ♦ ష్పానుగమము
కలగని మేల్కాంచు ♦ టలయందె విభ్రాంతి, యఘువృత్తియందె య♦నాదరంబు
వలపు గిలిగింతలనె మేలి ♦ యులికిపాటు, తివియు తజితీపులనె కడు ♦ దీవరంబుఁ
గాని యొండెడ నొక్కింతుఁ ♦ గానఁబడదు, పట్టణంబునఁగల సతీ♦పతులకెపుడు.

సీ॥ స్వాధ్యాయవిధి సమా ♦ శ్రయణంబకాని జీ, వికకు విద్దెలటన్న ♦ వెజ్జిఁబొరయ
రాతిథేయస్థితి ♦ వ్యాప్తియకాని భో, గార్థ సంసక్తిమై ♦ నగఁడుగాంచ
రమృతాహృతి మహోశ ♦ యత్వంబకాని దం, భాది జృంభకునిజ్య ♦లనువుపఱుప
రాత్మసంసిద్ధి ల ♦ క్ష్యత యొండకాని వా, దములకై వేదాంత ♦ తత్త్వమెడరు
సత్యమస్తేయమనుకంప ♦ శౌచమార్జ, వమ్ము మున్నగు సహజగు♦ణమ్ములెసఁగఁ
దాపసోత్తమశిక్షలఁ ♦ దవిలి మెలఁగు, విప్రవరు లుందురందుఁ గ ♦ విప్రవరులు.

శా॥ వేనోళ్ళన్వివరింతు విద్దెలనుచు ♦ స్వీటద్విజౌఘంబుతోఁ
దానెంతేనిఁ బ్రతిజ్ఞఁబూని యజయి ♦ త్వంబందుటన్దుర్ధరా
నూనక్ష్మాభరమూనె శేషుఁడనుచో ♦ నొరెత్తఁగా నెంతవాఁ
డీనల్మోములదయ్య మేతదితరు ♦ ల్హీనస్థితిం జెందరే. 300

సీ॥ ఒజ్జలమాటల ♦ కొఱ గొడ్డెములువల్క, రలవోకఁ దొలుఁ బలుకులు పఠింత్రు
సంజలందుఁ బ్రపత్తి ♦ సావిత్రి జపియింతు, రటు సమిదాధాన ♦ మాచరింత్రు
దొసఁగులకూటమిఁ ♦ నొడిఁబడ రేపట్ల, మేలి ప్రశస్తి నె ♦ మ్మోయిఁ దొలంగ
రొగి భైక్షవృత్తిన ♦ యునికి నున్నతిఁగాంతు, రాదృతి మైత్ర్యాదు♦లలవరింత్రు

బ్రహ్మవర్చసమునఁ ♦ బ్రబలి శమాదులు, దోడవ్వులుగనఁ శ్రద్ధ ♦ తోడుగాఁగ
నెందు నవతులేక ♦ యెసఁగుదురజినాది, ధారులగుచు బ్రహ్మ ♦ చారు లచట.

ఉ॥ వృత్తిఁదలంగ రీగి యెడ ♦ విన్నఁదనంబునఁ బోరు సౌమ్య సం
పత్తికి గంటివెట్టరెటుఁ ♦ బ్రాహ్మణిక ప్రకరంబు గొల్తు రే
యొత్తునఁ బాపముల్దలఁప ♦ రోపిక సత్క్రియ లాచరింత్రు వి
ద్వత్తము లిభ్య లంచితులుఁ ♦ దత్పురినుండు గృహస్థు లెప్పుడున్. 30౨

ఆ॥ పత్నిసుతులకడన ♦ పాటిల్లనొండెఁ ద, ద్వ్యక్తు లగుచునుండె ♦ నోజనగ్ను
లెందుఁ దోడుగాఁగ ♦ నెనయుదు రడవిఁ ద, పంబునలుప వనని ♦ వాసులచట.

క॥ వృత్తులమలఁగించి యెదం, జిత్తముఁ జిక్కించి యెపుడుఁ ♦ జిద్ఘనరూపా
యత్తులకా సుఖయింతురు, ముక్తికినెలవులు పురమున ♦ మౌనయుయతీంద్రుల్.

సీ॥ ఈశ్వరకలనాస ♦మృద్ధి లక్ష్యమెకాని, కమలాభిఘాత సం ♦ కలన లేదు
పరతమోనోద ఘూ ♦ ర్వాహనశక్తియెకాని, చక్రవిభేదని ♦ శ్చయము లేదు
కువలయామోదనా ♦ వ్యవహితత్వమెకాని, సద్వికాసనిరాస ♦ సరణి లేదు
స్వార్థిచకోర కా ♦ హ్లాదనేచ్ఛ యకాని, స్వీయాలినిర్బంధ ♦ చింత లేదు
రాజులనరాజులె ప్రదోష ♦ రాగరహితు, లంచిత గురూదయాశంసు♦లపకలంకు
లనిశపూర్ణు లనామయు ♦ లద్వితీయ, యోగమహితు లమిత తేజు♦లుందురందు.

చ॥ ఘనకృషి గోగణావన మ ♦ ఖండముగాఁగ్రయ విక్రయోన్నతి
దనరి మహాసమృద్ధి నిజ ♦ ధర్మముఁబాయక పెంపు సొంపులం
ధనదుని లెక్కసేయక యు ♦ దారతమీాటి విదారితాఘులై
యనయము దేవవిప్రనివ ♦ హార్చలఁ బొల్తురు వైశ్యులప్పురిన్. 30౬

తే॥ ద్విజసమర్చలు నెఱపుచు ♦ దేవభక్తి, దనరఁ బుణ్యచరిత్రము ♦ ల్వినుచుఁ బావ
నాత్ములై ధర్మదేవత ♦ లనఁగశూద్రు, లొప్పుదురు మేలియొప్పుల ♦ కుప్పలచట.

క॥ పతిహితమతిఁ బార్వతి భా, రతి విద్యాకలన సురుచి ♦ రత రతి సంప
ద్గతి శ్రీసతిఁ దొడరి పతి, వ్రత లుందురు పురమునం ద ♦ రముగాదెన్నన్. 30౭

సీ॥ ప్రొద్దుప్రొద్దునమున్నె ♦ నిద్దురమేల్కాంచి, ధవుని యంఘ్రులకు వం ♦ దనమొనర్చి
యిష్టదైవతమెద ♦ నెంచి నెయ్యముదోఁప, శ్వశురుల సేవలా ♦ సక్తినెఱపి
యటఁ బనులచ్చొత్తి ♦ నటులె నొవ్వకతీర్చి, పిల్లలఁగసరక ♦ ప్రీతిగొనరి
సరసమృష్టాన్నము ♦ ల్సరగునఁ బొసగించి, తమవారినతిథుల ♦ దనియఁజేసి
తొడవులకును మేలి ♦ తొడవు నానయకాఁగఁ, బలుకుజుంటితేనె ♦ నెలవుగాఁగ
గొనముతెల్లఁ దాల్మిఁ ♦ గొమరొంద శుభలీల, నెగడు నలకుటుంబి ♦ నీగణంబు.

సీ॥ అంజనాచల సార ♦ మందుఁ దీసినవిగ్గు, లననొప్పు నెఱికొప్పు ♦ లమరుచుండ
లలితసౌదామనీ ♦ లతలతళ్కుల గుంపు, లనఁదోఁచు తనురోచు ♦ లనఁగిపెనఁగ
బూర్ణేందుబింబము♦ల్భువిఁ జెక్కులోదవెనో, యననెమ్మొగములిమ్ము♦లనుఘటింప
బాతాలముననుండి ♦ బయలొందు చిల్వబా, ర్లనమీఱునూగారు ♦ లందగింప
మఱియు సకలాంగసౌష్ఠవ♦మహిమఁదమకు, సవతుగారెల్లజగముల♦యువతులనఁగ
మెఱయుదురు గాధిపుత్రని♦ర్మితనవీన, మోహినీ దేవతలు నాఁగ ♦ ముదితలచట.

క॥ మిన్నున నొకనది గలదని, యెన్నదరిలఁ గవివరేణ్యు ♦ లెంచఁబడియెనో
తన్నగరసౌధతలవిహా, రన్నారీదేహరుచిఝ ♦ రమ్ముల కలిమిన్. ౩౧౧

చ॥ పురిఁ దరుణీవిహారములఁ ♦ బొల్పగు మేడల పజ్జనేగు పు
ష్కరమణిమండలంబునఁ బొ ♦ సంగు త్రిమూర్తులు తత్కటాక్షవా
గురలకు వశ్యులౌదురని ♦ గొబ్బున నిల్చిరి వారి మోమునం
దురమునఁ బార్శ్వమందుఁ గ్రమ ♦ మొప్పఁగఁ దత్సతు లెల్లవేళలన్. ౩౧౨

ఉ॥ వీట మరాలగామినుల ♦ వేనలు లెల్లెడ నంధకారముం
బాటిలఁజేయఁ దత్క్షణమె భాసిలు తన్ముఖచంద్రపఙ్క్తియున్
మీటగు స్వప్రకాశమున ♦ మేకొని దృక్సుఖముల్ఘటింప నె
ప్పాటనుఁ గానరా దుభయ ♦ పక్షపరిక్రమ మెల్లవారికిన్. ౩౧౩

సీ॥ గమగమవలచు చొ ♦ క్కఁపు మేటికస్తురి, తిలకము లొమ్మహింపు ♦ మొలకలీన
గుబగుబనెగయు మే ♦ ల్గుబ్బల నెఱయు కుం, కుమమనురక్తుల ♦ గుప్ప లిడఁగఁ
దళతళమెఱయు ని ♦ ద్దంపుఁజెక్కుల చాయ, లెదిరి దివియుసన్న ♦ లెఱుకసేయ
నిగనిగలొలయు పె ♦ న్నెఱిగుంపు జిగిపెంపు, మరునారుల నిషద్య♦మలఁచివిలువ
జిలుగు నగవులుఁ దెలివి తే ♦ టలు నొయార
ములు బెళుకుచూపు లొఱప్పైన ♦ పలుకు లెలమి
గులుకు నడలుఁ గళలు నొప్పఁ ♦ గోడెకాండ్ర
వలచి వలపింతు రవ్వీటి ♦ వెలవెలఁదులు. ౩౧౪

ఉ॥ అప్పురి వారకాంతల యొ ♦ య్యారములంగని దేవవేశ్య లె
ల్లప్పుడు వీరిఁ గొల్వమన ♦ కన్నిట మేలగునంచు వచ్చుచో
నప్పవిధారి యడ్డపడి • యావతభోఃఖలు మేన కాయనం
దెప్పున నొక్కతెన్విడువ ♦ దీపితతత్పదయుమ్యో నాతియున్. ౩౧౫

సీ॥ తమ్మికిఁ గొసరు రెం ♦ డిమ్ముత్పలములన్న, నొకటికి రెండిడ ♦ నోపననుచు
బిగువులో మంజరు ♦ ల్ప్రిదిలెనోయనఁజూడ, నేర్చినఁ బొగడెదు ♦ సీవయనుచుఁ

బూవు పొత్తొండు పైఁ బొసఁగింపవలెనన్న, జోడుదండలుగొన్నఁ ♦ జూతుననుచుఁ
దలిరాకు మల్లె ♦ మొగ్గలకుఁ జాటనఁజాలుఁ, దగ వెఱంగినవారు ♦ నగుదురనుచుఁ
గలదె యుత్తమసుమనోవి ♦ కాసమనిన, నీవి సడలింపఁ గొఱఁత గా ♦ నేరదనుచు
నీటుకాండ్ర నేరిమివంక ♦ గీటుపెట్టి, విలుతురప్వీటఁ బుష్పలా ♦ వికలువిరుల.

సీ॥ ఆలగుంపులు క్రేపు ♦ లాఁగఁ జేపిన నుబ్బి, జాలువాఱెడు పాల ♦ మేలివాఁక
చెఱకులాడెడుపట్లఁ ♦ జెరచెర ద్రొట్రిలి, నెఱయు పానకముల ♦ నిర్ఝరంబు
గన్నెమిన్నలు జల ♦ కములాడుచోటులఁ, బాటిలుమేటి ప ♦ న్నీటియూట
పొరిపొరి నుద్యాన ♦ ముల విచ్చునలసే, త్తెఱ నెలకొనెడు పూఁ ♦ దేనెసోన
కీరముఖ ఖగవిదలితా ♦ పారఫలర, సమునఁ బేరేఱుగాఁ దప్పి ♦ సత్తినొడ్లఁ
గాక కేదారములఁ దఱి ♦ నాకపండి, రాజభోగంబులప్పురి ♦ రాణఁదనరు. ౩౧౭

సీ॥ అతివ! నీమేనిచా ♦ యఁదనర్చునేయవి, బంగరు తీఁగెలో ♦ సంగడీఁడ
చెలి! నీవుపలుమాఱు ♦ దిలకించు నవియేవి, చిట్టిముత్యాలన ♦ జెల్లుసఖుఁడ
పడఁతి! నీవెన్నాని ♦ పండిన ఫలమెద్ది, రాజభోగమకాదె ♦ రమ్యగాత్ర
పలుకు సూటిగనేది ♦ పాటిల్లునది బాల, జున్నుఁబాలననొప్పు ♦ వన్నెకాఁడ

యనుచుఁ బైరుల పేరు లా ♦ య్యారముగనుఁ
దమ్ముడుగు కోడెకాండ్ర చి ♦ త్తమ్ము లలర
మేలి ప్రత్యుత్తరమ్ములఁ ♦ జాలియుండ్రు
శాలిపాలిక లప్పురిఁ ♦ జాలనెగడి. ౩౧౮

మ॥ అకలంకస్థితిఁ దత్పురోప వనసీ ♦ మాంచన్మహా నారికే
లకుటస్తోమము విష్ణుపాదగతిఁ గ్రా ♦ లం జిత్రమే తత్ఫల
ప్రకరంబొక్కట దివ్యసంయమి శివా ♦ ర్చాపూర్తిఁ గావించి త్ర్యం
బకసారూప్యముఁ జేకొనెన్ భువన గ ♦ ర్భత్వంబు వాటిల్లఁగాన్. ౩౧౯

చ॥ కొలఁకులకల్మి తెమ్మెరల ♦ గోమెలదోఁటల మంజిమంబు పూ
వుల పొదరిండ్ల సోయగము ♦ పుష్పొడి తిన్నెల సౌరభంబువాఁ
కలకలన ల్ఫలోదయ వి ♦ కాసము పౌర సుఖాప్తి శ్రీమత
ల్లుల నెఱయారజమ్ములును ♦ లోకవిలక్షణము ల్పురమ్మునన్. ౩౨౦

చ॥ మలఁక లెఱింగి పద్మినులు ♦ మవ్వఁపు నవ్వులు చూప ముద్దులే
మొలకలు పువ్వుటీరముల ♦ మోసల భాసిల మేల్నలుంగులున్
గలికలు దేనెఁ బుప్పొడుల ♦ గారొనఁ జేయఁగఁ బ్రొద్దుప్రొద్దునన్
జిలుకములాడి తోఁటలఁ బొ ♦ సంగు సమీరకిశోరము ల్పురిన్. ౩౨౧

తే॥ తలఁప జేజేలపీటి మె ♦ చ్చులు రుచింప, వప్పురీ రత్నమరయని ♦ యంతవట్టు
శరులు శ్రుతిమెత్తురే; కను ♦ సన్నలేక, నిజము నిలుకడ నెట్లైన ♦ నెగడఁగలదు.

సీ॥ అచటి తోయ్యాలుల యొ ♦ య్యారముల్గనుపట్ట, నచ్చరల్గలరన్న ♦ యనువుదోఁచె
నచటి తేజీల తే ♦ జంబరంబెనయంగ, రవితురంగముల బీ ♦ రంబు దెలిసె
నచటి శూరులశౌర్య ♦ మమరారులనలంప, వేల్పురాయని తెల్వి ♦ విదితమయ్యె
నచటి యంత్రస్ఫూర్తు ♦ లతివేలముగమించ, సురశిల్పికౌశలి ♦ సుగమమయ్యె.
నచటి తేరులు స్వర్వీథి ♦ నాడిరాఁగ, వ్యోమయానోపగమ ముని ♦ ర్వ్యర్థమయ్యె
నచటి సర్వసమృద్ధుల ♦ త్యతిశయితలు, గాఁగఁ గవికల్పకల్పన ♦ ల్గణనకెక్కె.

శా॥ భావజ్ఞానము శ్రీ వికాసము కలా ♦ ప్రావీణ్య మస్తోకలీ
లా వైయాత్యము సద్గుణానుభవికో ♦ ల్లాసంబు సంమోదపా
గావారాప్లవనం బపాస్తకలుష ♦ ప్రారంభసంభావనం
బావీటన్నెగడొందుఁ బౌరసహభూ ♦ వ్యాపార మేపారఁగన్. ౧౨౮

ఉ॥ మంగళదేవతాస్పదము ♦ మాన్యగుణాచ్యుత మాప్త భారతీ
సంగము బ్రహ్మవైభవ వి ♦ చక్షణ మంచితసర్వమంగళా
సంగజిదాఢ్యసజ్జన మ ♦ హార్పతిభాసము చంద్రమఃకలా
ప్రాంగణ మవ్వురంబెటు సు ♦ పర్వవిలాసముగా దనందగున్. ౧౨౯

తే॥ అని సుకవులెల్లఁ గొనియాడ ♦ నఖిలపురవ, రాతిశాయిగుణోపేత ♦ మమరగీత
మైన సాకేతమున కభి ♦ యాతిశక్తి, సడలఁగ నయోధ్యయనువింత ♦ సంజ్ఞ వెలయు.

క॥ స్వనివిష్టధిషణబలశా, సనభవ్యగుణాంచితాగ్ర ♦ జన్మనృపతికో
టినవీనసుధ ర్మాయిత, ఘనరథ్య యయోధ్య పొగడఁ ♦ గాఁ దరమానే.

క॥ పన్నీటి చల్లకము లం, చన్నవపుష్పోపహార ♦ చందనచర్చల్
దన్నెపుడుఁ బెట్టసేయఁగఁ, దన్నాధుని వలపుఁ దెలుపు ♦ తెరమున నెగడున్.

## —♦ దశరథుం డయోధ్యాపురముం బరిపాలించుట ♦—

తే॥ అప్పురీరత్నమేలు మ ♦ హారథుండు, నారతద్యోతమానతా ♦ నవ్యకీర్తి
చంద్రికాంచద్విధుఁడు క్లప్త ♦ సర్వబుధవు, రందరమనోరథుఁడు దశ ♦ రథుఁడు ప్రీతి.

సీ॥ తనధైర్యరమమేరు ♦ ధరచాపుఁడౌ చంద్ర, ధరున కొండొకవింటి ♦ దారిఁజూప
నిజమహత్త్వమమర్త్య ♦ నీరజేక్షణులకు, విమలగేయాంశమై ♦ విస్తరిల్ల
స్వవిసర్జనం బద్ధి ♦ సదనాంగణముల ని, లింపాగముల నంకు ♦ రింపఁజేయ
స్వాత్మతేజము పద్మ ♦ జాండకటాహమ్ము, కేలిబంగరునీట ♦ మెఱుఁగువెట్టఁ

ప్రవిమలఖ్యాతిఁగాంచెఁ బు ♦ రందరార్థి, తద్విషద్బలహననక ♦ థాస్మృతి ప్ర
కంప్యమానారివీరప్ర ♦ కాశితాద్య, జయరమాస్ఫూర్తి ♦ దశరథచక్రవర్తి. 330

ఆ॥ దివము దేవపతి యు ♦ దీర్ణఁ జెట్లట్టుల, ప్పురము వరముఁ బ్రోచుఁ ♦ బురుషవర్యుఁ
డాతఁడాత్మసీన ♦ మగుమహారాష్ట్రివి, వర్ధనత్వమొప్ప ♦ వలను మెఱయ. 331

వ॥ మఱియు నన్నగరీలలామ విస్తీర్ణ కవాటయగుచు నేలువాని విశాలవక్షస్త్వంబునుఁ బచ్చల తోరణంబుల వల్లభుని నిత్యాభ్యుదయంబును, సమస్త యంత్రాయుధ ప్రశస్తత్వంబున మగని బీరంబును, సర్వశిల్పివిశేషవిశిష్టయై దయితుని యనల్ప రూపకల్పనాఢ్యత్వంబును, సూతమాగధసంబాధసనాథయై నాథుని ప్రఖ్యాతత్వంబును, శ్రీమతియై మగని శ్రీసమున్నతియు, నతులప్రభయై పతిలావణ్య ప్రతిభాసిత్వంబును. సముచ్ఛ్రిత్యన్నతాట్టాలకధ్వజపతాకాదివిరాజమానయై విభున నూనవైభవంబును, శతఘ్నిశతసంకులయై ధవునిశౌర్యంబును, వధూనాటక సంఘంబులచేనొప్పారి మనోహరు రసికత్వంబును, సముద్యదారామ వనాద్యుద్యాన సంపద్యుక్తంబులగు, మణిరత్న క్రీడాపర్వత ప్రాసాదంబుల నలువొంది ప్రియుని విహారప్రియత్వంబును, వాజివారణగోవృషభోష్ట్రఖరాద్యభివృద్ధిసమేతయై యొడయని సర్వశస్సమృద్ధియు, నానాదేశనివాసవణిగ్వరనివాసితయై పార్థివు రత్నహారిత్వంబును, చిత్రవిచిత్రాష్టాపదసుమహితాకారయై స్వర్ణపాంచాలికలతోడి వరనారీమణిగణంబులతోఁ బెనుపొందు పొందికచే నాయకుని నాయఁకరంబును వివరించుచు, నిసర్గదుర్గగంభీరపరిఘాదినర్గయగుట నన్యులకు దుర్గయు దురాసదయునై యయోధ్యనాఁజను నిజనామపదంబన్వర్థంబుగా సర్వరత్నసమాకీర్ణాసమాన వైజయంత సమాన బహువిమానవరగృహసుసంశోభితయై దిక్పాలురం బోని సామంతరాజవరేణ్యులు గుంపులుగుంపులై కరకమలంబులు మోడ్చి కరసమర్పణంబునకుం గరంబుప్పొంగుచుఁ గొలువమరియున్న దెసన్నిలువ నిజమహారాజ్ఞీత్వంబున న్మించుచు, సర్వతస్సమసుందరవలభిప్రముఖావికల్పకల్పశిల్పనైపుణ్యంబున బలభిత్ప్రధానదిగీశానపురవరంబుల ప్రహసితంబులహసించుచు గృహగాఢత్వంబున నవిచ్ఛిద్రత్వంబున సమభూమినివేశితత్వంబున శాలితండుల సంపూర్ణత్వంబున నిక్షుకాండరసోదకత్వంబున నతిథిజనదేవతాకత్వంబున నింద్రుని యమరావతి యెన్నటికిం దన్నుఁ బోలంజాలమి నూహించుచు, దుందుభి మృదంగవీణాపణవప్రభృతిశుభవాదివాదిత్రభృశనాదితయగుచు, స్వకీయ నిత్య మంగళమాంగల్యసాంగత్యంబు నభివర్ణించుచుఁ దనరారునద్దానిఁ దన రాజధాని మెచ్చుచు, నమ్మండలేశ్వరుండు లఘుహస్తులు, విశారదులు బలబాహుబలోపేతులు, మదమత్తసర్దత్కేసరి వ్యాఘ్రవరాహమర్దనులు, శబ్దవేధ్యవేదులు, నిశిత

శస్త్రాస్త్రధరులు, మహారథులునై సురాసురులనేనియు లెక్కఁగొననివారలయ్యు వివిక్తము నపరాపరము పలాయితము నగులక్ష్యంబు శరలక్ష్యం బొనరింపంబోని పుణ్యులగు వీరవరేణ్యులతో నగ్నిమంతులు, గుణవంతులు, వేదవేదాంగపారగులు, సహస్రదులు, సత్యరతులు, మహాత్ములు, మహర్షికల్పులునగు ద్విజోత్తములతో, గుణోత్తరులగు మంత్రిసత్తములతో ననుత్తమతపస్కులగు తపోధనప్రముఖ్యులతో వశిష్ఠాది బ్రహ్మర్షిగురువరిష్ఠులతో నిజధర్మాస్థాని సుధర్మాస్థాని ననుకరింప విబుధేంద్రసాధర్మ్యంబున జగతీసామ్రాజ్యంబు త్రిజగత్సామ్రాజ్యంబుగాఁ బరిపాలనంబించు వేడ్కం బొనరించుచుండె. 332

సీ॥ వేదవేదాంగసం ♦ వేత్త సర్వాభిజ్ఞ, సంగ్రహుండఖిలార్థ ♦ సంగ్రహుండు
దీర్ఘదర్శి సమృద్ధ ♦ తేజుండుపౌర జా, నపదప్రియుండు స ♦ న్మాహవంతుఁ
డతిరథశ్రేష్ఠుండు ♦ యజ్వ ధర్మపరుండు, జనవశీకరణవి ♦ శారదుండు
బ్రహ్మర్షికల్పుఁడీ ♦ రాజర్షి యనుచు ము, ప్పొలముల విఖ్యాతిఁ ♦ బొరసె నప్ర
మేయ బలుఁడు స్వబలహతా ♦ మిత్రుఁడట్లు
యుక్తమిత్రుఁడు విజితేంద్రి ♦ యుం డతండు
వరధననిధానముల శక్ర ♦ వైశ్రవణులఁ
బోల్పనగుచుఁ బ్రజావళిఁ ♦ బ్రోచుచుండె. 333

క॥ మును వైవస్వతమనువే, యనువున లోకైకపాల ♦ నాంచితుఁడయ్యెన్
దన దొరతనమును మునులౌ, నన దశరథుఁడట్లుననిచె ♦ నాయఁకరమునన్. 334

తే॥ ఇంద్రుఁ డమరావతింబోలె ♦ నేలెఁబురి న,తంద్రుఁడాతండు సంపూర్ణ ♦ చంద్రుకలిమి
కసము వెన్నెలగాయు స ♦ త్యాభిసంధఁ, బెరయుపురుషార్థరమపయి ♦ పెచ్చుగాఁగ.

క॥ పురిహృష్టులు ధర్మాత్ములు, నిరత బహుశ్రుతులు తుష్టి ♦ నిష్ఠుల లుబ్ధుల్.
వరసత్యవాదులుందురు, పరమేశ్వర భక్తియుక్తిఁ బరఁగుచు నెపుడున్. 336

సీ॥ అల్పసన్నిచయుఁడ ♦ గారి యసిద్ధార్థుఁ, డగవాశ్వధనధాన్యుఁ ♦ డతుషితుండు
కామి కదర్యుండు ♦ ఘాతుకుండునునైన, యొకకుటుంబియునేని ♦ నుండఁడచట
లేఁడవిద్వాంసుండు ♦ లేఁడు నాస్తికుఁడు నం, దందఱు నరనారు ♦ లధికధర్మ
శీలురు కులవృత్త ♦ శీలముల్తమకన్న, మున్నె జనించెనం ♦ చెన్ననొందు.
రమలచిత్తులు నియతేంద్రి ♦ యత్వపరులు, పొగడుగాంత్రు మహర్షుల ♦ పోయనంగ
నోజనలరారె దాని యం ♦ యోధ్యసంజ్ఞ, నాధుకనుసన్న నానాట ♦ ననుచుధృతిని.

వ॥ మఱియు నప్పుటభేదనంబునఁ గుండలమ్ములు వెట్టనివాఁడు మకుటమ్ము ధరింపని వాఁడు స్రజమ్ములు దాల్పనివాఁడు విహితాంగదనిష్కహస్తాభరణంబుల భరిం

పనివాఁడు స్వల్పభోగుఁ డనభ్యంగుఁడనను లిప్తాంగుఁడ సుగంధుఁ డమృష్టభోజి యదాత యనాత్మవంతుం డనాహితాగ్ని యయజ్వ క్షుద్రుండు తస్కరుండు వర్ణాశ్రమసాంకర్యం బొనరించువాఁడు నెందును మందునకైనం జూపట్టంబోఁడు నిచ్చలుం బ్రాహ్మణులు స్వకర్మనిరతులై విజితేంద్రియులై దానాధ్యయన శీలురై సంకుచిత ప్రతిగ్రహులై యుందురన నొడ్లును దమతమ కులముపాడిన మెలంగుదురని వేఱె చెప్పవలెనే బహూత్కృష్టులతోఁ బనియేమి యమ్మండలేశ్వరుండు శాసించు నఖండ భూమండలమ్మున నొక్కెడనేని నాస్తికుండుగాని యనృతకుండుగాని యబహుశ్రుతుండుగాని యసూయకుండుగాని యశక్తుండుగాని యవిద్వాంసుండుగాని యషడంగవేత్తగాని యవ్రతుండుగాని యసహస్రదుండుగాని దీనుండుగాని క్షిప్తచిత్తుండుగాని వ్యథితుండుగాని యొక్కండు నుండంబోవఁడన నాఱేని రాజధానింగూర్చి యేమేని వచియింపవచ్చునే శ్రీమంతులు రూపవంతులు జ్ఞానవంతులు భోగవంతులు రాజన్యభక్తిమంతులుం గాకుండు నరనారీజను లేతదీయరాష్ట్రంబునం దక్కాలంబున నెందును లేనే లేరనుచుం జక్కగా నొక్కి వక్కాణించువాఁడ. నాలుగువర్ణంబులయందును దేవతాతిథి పూజకులు కృతజ్ఞులు వదాన్యులు శూరులు విక్రమసంయుతులు దీర్ఘాయువులు ధర్మతత్పరులు సత్యసంశ్రితులు పుత్రపౌత్రసహితులు స్త్రీసముపేతులునై మనుజులొప్పార నప్పార్థివోత్తముని ప్రజాపరిపాలనాధ్వరదీక్ష సుపరిరక్షితయై చెల్లుచుండె.

తే॥ బ్రహ్మ ముఖమయి క్షత్రంబు ♦ పరఁగు చుండు
క్షత్రియానువ్రతత వైశ్య ♦ జనత తనరు
నెగడుదురు శూద్రులు స్వధర్మ ♦ నిరతు లగుచుఁ
దదుపచార పరత్వంబు ♦ దవులు మదిని. ౩౩౯

ఆ॥ మనువు మున్నుగాఁగ ♦ మాన్యు లనన్య సా
మాన్యులనఁగ నెగడు ♦ మానవేంద్రు
లానవేంద్రుపాల ♦ నాసక్తి సంపత్తి
మఱవఁ బడిరి సకల ♦ మండనమున. ౩౪౦

తే॥ కూర్చు కేసరీంద్రములచే ♦ గుహాయ పోలె
యోధవర్యులచేఁ బురి ♦ యోజమెఱసె
నగ్నికల్పులు పేశలు ♦ లభిభవాస
హిష్ణులు కృతాస్త్రులై వార ♦ లెలయుచుండ. ౩౪౧

తే॥ పురి హరిహయోత్తమ హయోత్త ♦ మరమఁ గరమ
నుత్తమతఁగాంచెఁ దేజో మ ♦ హోజ్జ్వలయున
నెన్నగుచుఁ గాంభోజ బా ♦ హ్లీకభవము
లటు వనాయు సింధుజములై ♦ యవి పొసంగ. ౩౪౨

సీ॥ అల్లవింజ మ్మివ ♦ మ్మందు కొండయు మున్ను, గాఁగల్గుమెట్టులఁ ♦ గాన్పు వెలయ
నైరావతమ్ము మ ♦ హాపద్మమంజన, వామనమ్ములుఁ దమ ♦ వైపుగాఁగఁ
బుడమినుద్భవమొంది ♦ కడు బలోత్కటతనె, దిరి లెక్కగొనకయు ♦ ద్రిక్తమదత
నిత్యమత్తములవు ♦ నెఱిఁబొల్చు గిరినిభ, మాతంగములఁ బురి ♦ మలయుసిరుల
భద్రమంద్ర మృగాఖ్యల ♦ బరఁగునవియు
భద్రమంద్ర మృగైకాఖ్యఁ ♦ బ్రబలు నవియు
వఱలు భద్రమంద్రమ్ములు ♦ భద్ర మృగము
లట్లు మృగ మంద్రములు నను ♦ నవియునందు. ౩౪౩

క॥ సామంత నృపతులెల్లరు, నేమంబునఁ గొలుచుచుండ ♦ నిత్యశుభశ్రీ
ధామం బప్పురి నెక్కొనె, శ్రీమంతుఁడు దశరథుఁడు వి ♦ శిష్టుండగుచున్. ౩౪౪

క॥ అంగఱలో నక్షత్రము, లందలి చందురుఁడు నాగ ♦ నాయకిమీఁడా
స్థందనరి యేలెఁ బురి న, స్పందత శమితారితయుఁ బ్ర ♦ శంస్యులు గాఁగన్.

ఆ॥ అదియు నెగడెఁబురి మ ♦ హాతేజుఁ డమరేంద్ర
నిభుఁడు విభుఁడు ప్రోచు ♦ నెఱిఁదనర్చు
నోజ యోజన ద్వ ♦ యోత్సేధ మొలసి ప్రే
లూన్పు నెవఁడటంచు ♦ నేపుమీఱి. ౩౪౬

క॥ గొనములగను లింగితవిదు, లనుపమమంత్రజ్ఞు లినహి ♦ తాన్విత తనులా
మనుకుల మణిరత్నంబున, కెన మంత్రుండుదు రమాత్యు ♦ లెలమికి నెలవుల్. ౩౪౭

సీ॥ అవ్వారు ధృష్టిజ ♦ యంతులు విజయ సి, ద్ధార్థార్థసాధకు ♦ లట్లశోక
మంత్రపాలసుమంత్ర ♦ మహితాహ్వయులునాఁగ, నెగడుదురమ్మహా ♦ నేతకాయ
శస్వికాయిక్ష్వాకు ♦ సంతతికాంతార, భూవసంతునకు స ♦ త్పుణ్యులు శుచి
మంతులు విదితులు ♦ మండల కృత్యత, త్పరులునై నిచ్చలుఁ ♦ బరగుమైత్రి
నెలయువారలార్య ♦ లిరువురు ఋత్విజు, ల్పావనులు వశిష్ఠ ♦ వామదేవ
తాపసోత్తములు ప్ర ♦ ధాను లన్యులు మంత్రు, లుందురెందఱేని ♦ నుచితగతులు.

క॥ అందఱు విద్యాశిక్షితు, లందఱు హ్రీశ్రీప్రశస్తు ♦ లందఱుఁగుశలా
స్పందమతులు నియతేంద్రియు, లందఱు దృఢవిక్రములు మ ♦ హాత్ములుసచివుల్.

క॥ శాస్త్రజ్ఞు లప్రమత్తులు, శస్త్రాస్త్రవిదు ల్యథోక్త ♦ సమవహితు ల్తే
జస్వినపరు లధిక్షము, లస్త్రీజితు లధిపుమంత్రు ♦ లార్జితకీర్తుల్. ౩౫౦

ఆ॥ పలుక రనృతమైన ♦ పలుకర్థకాము కో, పార్థపరతనైన ♦ నలతినైనఁ
గూర్తురెల్లకృతుల ♦ గఁటె స్మితపూర్వాభి, భాషులగుచు మేల్మిఁ ♦ బ్రభువిహితులు.

ఆ॥ స్వపరరాష్ట్రములను ♦ వారికిఁ గ్రియమాణ, మేనిఁ బ్రాక్కృతంబ ♦ యేని నటు చి
కీర్షితంబయేనిఁ ♦ గృత్యం బొకింతయుఁ గాదనితము చార ♦ కలితదృష్టి. ౩౫౨

క॥ నిపుణులు వ్యవహారమ్ముల, సుపరీక్షితు లటు సుహృత్త్వ సుమహితగతులన్.
విపరీతమతివివాద, క్షపణులుఁ దద్రాజమంత్రి ♦ సత్తము లెపుడున్. ౩౫౩

సీ॥ తప్పొనర్చినవానిఁ దన పుత్రునేనియు, దండింతురపుడె యు ♦ ద్దండులగుచు
ననపరాధుండగు ♦ నహితునేనియు నిరో, ధింపఁబోరన్యాప ♦ దేశమునను
గోశసంగ్రహణమ్ము ♦ కొఱకట్లు బలపడి, గ్రహమునకై యొడ్ల ♦ గాసిపఱుప
రధిసత్త్వులై నిచ్చ ♦ లారసి విషయవా, సుల సాధువులఁ బ్రోచు ♦ సూటినొంత్రు
బ్రహ్మమును క్షత్రమునుఁ జెఱు ♦ పక నెమ భాండ
పూరణం బొనరింత్రు వి ♦ చారతీక్ష్ణ
దండ మెపుడును నెఱపరు ♦ దత్ప్రధాను
లయనయోత్సాహ విజ్ఞాన ♦ నియమ పరులు

తే॥ నిత్యశుచులేకబుద్ధులు ♦ నిర్మలాత్ము, లును నగుచు వారలందఱ ♦ట్లనుపమముగ
రాజ్యతంత్రమ్ము నడుప రా♦రాపులేక, పురము రాష్ట్రమ్ము జగదేక♦పూజ్యమయ్యె.

క॥ పరదారరతుఁడు దుష్టుఁడు. పరధనహరణేచ్ఛుఁ డనృత ♦ భాషియు లేఁడ
ప్పురమున నారాష్ట్రంబున, నరుఁ డొక్కఁడయేని నెల్ల ♦ ననిచెఁ బ్రశాంతిన్.

సీ॥ మంత్రులుప్రజలు స ♦ న్మాన్య వేషులు సుస్వ, భావాంచితులు ధర్మ♦పరులుగాఁగ
నయదృష్టిమై నర ♦ నాథహితార్థమ్ము, జాగరూకతతోడ ♦ సంగడమునఁ
బరఁగి పరాక్రమ ♦ ప్రఖ్యాతులై నిజ, గురుగుణగ్రహణత ♦ త్వరత నెగడి
సర్వతోబుద్ధి ని ♦ శ్చయమునఁ బరదేశ, వృత్త విజ్ఞానంబు ♦ వెలయుచుండ
సంధివిగ్రహముఖ్యప్ర ♦ సంగములను
నీతిశాస్త్రవిశేషవి ♦ నిర్ణయముల
మంత్రసంవృతులను స్వస ♦ మ్మతుల నతుల
సూక్ష్మమతులయి సుపథంబ ♦ చూపుచుండ. ౩౬౫

తే॥ ఋతము హితమల్ల లోక స ♦ మ్మతము నీతి
వితతమునుఁ బ్రియమును నౌ స్వ ♦ మతము నెఱయ

జేయువారల సంపద్వి ♦ శిష్టులఁ గొని
యినకులేంద్రుండు ప్రాజ్యరా ♦ జ్యజ్యనగడె. ౩౫౮

చ॥ అనఘుఁడు; చారదృష్టిఁ బ్రజ ♦ లందలి ధర్మ మధర్మవర్జనం
బనుపొనరం గనుంగొనుచు ♦ నంచితరంజనమంజిమంబునన్
మునుకొని ప్రోచునన్నెఱిఁ బ్ర ♦ ముఖ్యత విశ్రుతయయ్యె ముజ్జగ
మ్మున కితఁ డొక్కఁడే తగు న ♦ ముఖ్యుల నెన్నఁగనేల నానిలన్. ౩౫౯

క॥ పురుషవ్యాఘ్రున కత్తఱి, సరియెక్కుడు ననఁగనైన ♦ శత్రుఁ డొకండున్
వెరవుమెయి ముప్పొలమ్ముల, నరసినఁగనుపట్టఁ డొల్ల ♦ నన నేమిటికిన్. ౩౬౦

క॥ నతసామంతుఁడు ప్రాభవ, హత కంటకుఁ డాత్తహితుఁడు ♦ నైయేలె ధరన్
బ్రతి దనకు దివస్పతియే, యతులిత విభవమున ననుచు ♦ నందఱుఁ బొగడన్.

తే॥ కడువదాన్యుఁడు సత్యసం ♦ గరుఁడు ధర్మ
పరుఁడు నితఁడొక్కఁడేయని ♦ ప్రాఁకె దెసల
నుదితుఁడౌ నర్కునట్లు స ♦ ముజ్జ్వలుఁడయి
యెలయుహితకరముల జగ ♦ మేలుచుండ. ౩౬౨

ఉ॥ కూరిమి నవ్విభున్మగధ ♦ కోసలకేకయరాజనందనల్
కోరివరింపఁగామనల ♦ కూబరసన్నిభుఁ డుద్వహించె న
వ్వారిజపత్రలోచనల ♦ వారునుఁదన్ను శరీరయుక్తిఁ బో
ల్వారు స్వశక్తులోయన న ♦ హర్నిశము న్భజియింతురా ధృతిన్. ౩౬౩

తే॥ ఆతఁ డాత్రయిఁ గూడి మ ♦ హాసమృద్ధి
వెలసె వృత్తిత్రయిఁ బొసంగు ♦ వేదమునఁ ద్రి
లోకి భరియించు మేరువు ♦ జోకనైఁ ద్రి
వేణిఁ బెనఁగొను సింధువు ♦ వీఁకఁదొడరి. ౩౬౪

సీ॥ ఈమువ్వురును శ్రుతు ♦ లేయనఁగావచ్చు, నితఁడజాత్మోత్థత ♦ నెసఁగెఁగాన
సీకాంతలు త్రితాంచి ♦ తేశానులనవచ్చు, నితఁడు త్రిమూర్త్యంశ ♦ యుతుఁడుగాన
సీరామలేత్రిలో ♦ కీరమ లనవచ్చు. నితఁడింద్రు గద్దైపై ♦ నెక్కెఁగాన
సీశ్రుతాఢ్యలు త్రిశ ♦ క్తి శ్రీలనఁగవచ్చు, నితఁడధీశ్వరపద ♦ మెనసెఁగాన
ననుచు బుధులు వొగడ ♦ నాత్రయిఁగూడి త్రి, వర్గయోగకలన ♦ భాసమానుఁ
డగుచు సవనవహ్ని ♦ లంది మిన్నంది త్రి, విక్రమప్రకాశ ♦ విదితుఁడయ్యె. ౪౬౫

తే॥ మఱియుఁ గోరి వరించిన ♦ మానవతులు, రాజకన్యలు గలరుసా ♦ ర్ధత్రిశతికి
వారలఁగ రేణుకల మహా ♦ వారణేంద్రు, వడువున సుఖింపఁజేయుచు ♦ వఱలుసమత

మ॥ పొలఁతీ నిచ్చలు రాగవార్ధి నతఁడ ♦ పూర్ణాబ్జుఁడులం దేల్చు ప్రే
మలతాంతాస్త్రుఁడు గాంచి నైజసుభగం ♦ మన్యత్వ దర్పోద్ధతు
ల్కలగా నెంచఁ బ్రియాస్వభావగతిలీ ♦ లాసామరస్యంబున
న్మెలఁగె న్భావతలబ్ధనవ్యవిలస ♦ న్మీనాంకశంకాఢ్యుఁడై ౩౧౭

క॥ కామం బర్థము నర్థముఁ, గామము ధర్మమును రెండు ♦ గలయిక పెట్టం
గా మెలఁగఁ బోఁడొకప్పుడు నామహిపతిఁ బోల జగతి ♦ నన్యులుగలరే. ౩౧౮

తే॥ యాచకుఁడు లేఁడు లేఁడెందు ♦ సూచకుండు, జారచోరుల జాడయు ♦ శబ్దగతమె
లేమికేనాఁడు లేమియే ♦ లేమ; మేలె, మేలునకు నట్లు తత్ప్రజా ♦ పాలనమున.

క॥ ఎయ్యెడఁ గాంచినఁ గ్రతువులె, వియ్యఁపుఁబోఁడుములె ధర్మ ♦ విలసనములె మే
లయ్యెన నెడువార్తలె యిల, కయ్యధిపుఁడొకండె యధిపుఁ ♦ డంబుజవదనా. ౩౨౦

మ॥ తనపర్జన్యసఖిత్వమచ్చుపడ గో ♦ త్రాదేవి యుప్పొంగఁగా
నెనయించె న్నెలమూఁడువానలు ప్రజల్ ♦ హృద్యస్థితింగాంచి శో
భనలక్ష్మీనవమూర్తులోయనఁ దలి ♦ ర్పణ లెంకలై యొప్పుఁ బ్రాం
తనరేంద్రుల్గొలువ న్జెలంగె నిజది ♦ జ్ఞాధాంశబోధార్హుఁడై. ౩౨౧

సీ॥ ఈమోహనాకారుఁ ♦ డేరతీశ్వరుఁడైన, నాత్రిలోచనుకృప ♦ నలరుఁగాత
మీవిబుధాధిపుఁ ♦ డేమహేంద్రుండైన, దుష్టరాక్షసశక్తిఁ ♦ దొలఁచుఁగాత
మీసమర్థాభిఖ్యుఁ ♦ డేయచ్యుతుండైన, సిరిచంచలతఁ బాయఁ ♦ జేయుఁగాత
మీలోకబాంధవుం ♦ డేధామనిధియైన, నశ్రాంతవిశ్రాంతి ♦ నందుఁగాత
మనుచు నాబాలగోపాల ♦ మఖిలజనము, దీవనలొసంగ మితిమీఱి ♦ తేజరిల్లి
షష్టివర్షసహస్రము ♦ ల్సలిపె నతఁడు పూజ్యతపొసంగ మేలిసాం ♦ మ్రాజ్యకేలి.

తే॥ తమసతీరము సరయుపు ♦ తటమఖిలము
కనకయూపసుమేరుశృం ♦ గవ్రజాంచి
తముగఁజేసెఁ దదాశ్రయ ♦ ణమున మనుజు
లనిమిషత్వంబు గనుటకు ♦ దా లతాంగి. ౩౨౩

తే॥ మేఖలాజినదండన ♦ మేత మాత్ర
హారిణశృంగము యతభాష ♦ మై సదీక్ష
మగుతదీయాత్మనొందిని ♦ త్యమును వెలయఁ
జేయుపని నాకుఁ గలిగె రా ♦ జీవనేత్ర. ౩౨౪

మ॥ భవదూరుండు వశిష్ఠమౌని తనక ♦ ధ్వర్యుండుగా వేనవే
ల్సవముల్సేయ శతక్రతుం డితనిచే ♦ సామ్రాజ్య మెల్లానొ యుం

చు వినీతిన్గురుయుక్తి మైత్రితగునం ♦ చు న్నాని రావించి నీ
వవురా నాసరియంచు గద్దెనిడి స ♦ ఖ్యంబెంచె దాక్షాయణీ. ౩౨౫

తే॥ సఖ్యమున కర్హముగ రాత్మ ♦ సత్రవజంబు
తన్ను వేఁచెడుతఱి బల ♦ దర్పదమనుఁ
డితనిరావించు మేలెంచి ♦ యెలమిఁబెంచుఁ
గడఁగి కృతకృత్యుఁడై కాన్క ♦ లిడిమఱల్చు. ౩౨౬

శా॥ వేనోళ్లన్వినుతింపవచ్చు సతుల ♦ న్విత్తేశుఁ డర్థిప్రియుం
డై నల్వొందుఁ బ్రవక్త సత్కవి కలా ♦ భ్యర్చ్యుండు తత్త్రైయక్షసం
ధానాప్తి న్మునిగోష్ఠినిల్చు భుజ ♦ సత్త్వ బింద్రవహ్న్యద్యం బతం
డా నీరేజసుహృత్కులుండు సురరా ♦ జ్యంబెంచునా పార్వతీ. ౩౨౭

తే॥ కలికితనిపోర నిలువరా ♦ కలికి యతఁడు
మేలి దశరథపదమిచ్చి ♦ మేలుగొనియెఁ
దలఁగుఁ గలిదోషములుదానిఁ ♦ దలఁప నసఁగఁ
బరులు బెగడొందుచెంత బిం ♦ బరుచిరోష్ఠి. ౩౨౮

క॥ ఏతాదృశమహితస్థితి, యీతాలిమి దయయు సత్య ♦ మీదృగ్జయముల్
భూతభవద్భావిన్నృప, వ్రాతము గనదనుచు జగము ♦ వారలు పొగడన్. ౩౨౯

తే॥ ఏకొఱంతయులేక యి ♦ క్ష్వాకుతిలక, మఖిలసామ్రాజ్యవైభవం ♦ బందుచుండెఁ
దనయవదనారవిందద ♦ ర్శనసుధన్య, తావిరామంబు దక్కఁ గాం ♦ తాలలామ.

## —♦ దశరథుండు సంతతిలేమికి విచారపడుట ♦—

మ॥ తనసాధ్వీతిలకంబులంగలసి యా ♦ ధాత్రీశ్వరుం డిట్టియో
జన పెక్కేండ్లుసుఖించి భూమిఁప్రజలన్ ♦ సంతానవృక్షంబు పెం
పునఁ బోషింపుచుఁ బుత్రదర్శనమునం ♦ బున్నారకాబ్ధిందరిం
పని జన్మంబిఁకనేల యంచు ఘనతా ♦ పశ్రాంతిఁజింతింపుచున్. ౩౩౧

తే॥ తోఁచితోఁచనిగతి మహా ♦ త్ముండతండు
కలవరపడంగఁ దోఁచె నా ♦ క్కండు తలఁపు
రిత్తకునురిత్తదలరంగ ♦ రీతిగలదె
తడవవలవదె తగిన తం ♦ త్రమ్ము మదిని. ౩౩౨

క॥ అనుపమము తురగమేధం, బొనరింపంజనదె దాన ♦ నొదవరె పుత్రుల్
ఘనులు వశిష్ఠప్రముఖులు, తనకుంగూర్చుకృతిఁగూర్పఁ ♦ దార్కొనఁబోరే. ౩౩౩

క॥ అను మతినిశ్చయమున గురు, లనుమతి సేయంగఁ గడఁగ ♦ నౌనని సభకుం
జని మంత్రులం గృతాత్ములఁ, గొని యెల్లరువిన సుమంత్రుఁ ♦ గూర్చుకొని వెసన్

క॥ ఒడయఁడనె నిట్లు మతిమం, తుఁడ వేచని గురులద్విజులఁ ♦ దోడ్కొని రమ్మా
వడలెడల నొక్కకర్జం, బెడనిడితిఁ బొనర్పఁదీరు ♦ పేర్పడవలయున్. ౩౮౫

క॥ నాపుడుఁ జయ్యన వాఁడా, భూవరునానతి శిరమునఁ ♦ బూని యరిగి భూ
దేవవరులఁదోడితెచ్చెను, దేవనిభుల వేదపార ♦ దృశ్వుల నెలమిన్. ౩౮౬

ఆ॥ ధర్మమూర్తి దశర • థప్రభుండవ్వారిఁ, బూజసేసి నుడుల ♦ పొలుపు దనరఁ
బలికె దోసిలొగ్గి ♦ ప్రస్తుతార్థము ధర్మ, వెనసి కడుఁబొసంగ ♦ నెల్లరలర. ౩౮౭

క॥ నందనులు లేమి జీవిత, మందము చందము సెడంగ ♦ నై ధృతిపొదలన్
గుందుతన కశ్వమేధముఁ, బొందుగ నొనరింప బుద్ధి ♦ పొరిఁగడలుకొనెన్. ౩౮౮

ఆ॥ కాన మీరలెల్ల ♦ ఘను లిమ్మహాక్రతు, వరసి యంతరాయ ♦ విరహితముగ
నెఱయఁజేయవలయు ♦ నేనుమీవలనఁ గృ, తార్థధర్మ మెనసి ♦ యలరువాఁడ.

మ॥ అన నవ్వారలు మేలు మేలనుచు న ♦ ర్థ్యంబియ్యదే యయ్యయం
చినవంశ్యా; యనురూపమైనది సుమీ ♦ యింకేల జాగించుఁ జ
య్యనఁ బుత్రుల్గనియింతు రీవుమదినె ♦ ట్లర్థించితా రీతినం
చనయంబేర్పడె నీకు ధార్మికి సుధీ; ♦ యీధీయటంచుం బొరిన్. ౩౯౦

క॥ త్వరపడుము విడువు మధ్వర, తురగము సంభారములనుఁ ♦ దొడ్తోఁ గూర్పం
దొరఁకొనుము పనుపు మధికృత, వరుల న్మతిమత్ప్రవరుల ♦ వారని సుధృతిన్.

క॥ అనివారాశాస్యంబున, కనురూపముగాఁగనొడువ ♦ నలరారుచు ని
ట్లనె నధిపుఁడమాత్యులఁగనుఁ, గొని హర్షాశ్రువులు గన్ను ♦ గొనలఁ గొనకొనన్.

తే॥ గురుల యానతి వింటిరే ♦ యరసి కూర్చుఁ
డెల్లసంభారముల విడుఁ ♦ డిజ్యహయము
సహ సమర్థ ముపాధ్యాయ ♦ సహితముగను
నగును సరయూత్తరతటంబె ♦ యజ్ఞభూమి. ౩౯౩

ఆ॥ అఖిలనృపుల కిది య ♦ నాహ్వ్యంబుగాన శాం
తులఁబొనర్పవలయు ♦ దోషమొదవె
నేనిఁ గ్రతువుచెడు క్షు ♦ యించుఁగర్తయు నుంద్రు
బమ్మరక్కసులు నె ♦ పమ్ములరయ. ౩౯౪

క॥ మీరు సమర్థులు కృత్యము, తారీతిఘటించునెడల ♦ నందఱు నొకఁడై
సారతరమన్మనోరథ, పూరణమునకుం గడఁగుఁడు ♦ పూజ్యత వెలయన్. ౩౯౫

ఆ॥ అనినవల్లెయనుచు ♦ నందఱుఁ బ్రతిపూజ, నంబొనర్చి నర్చి ♦ నలుపొసంగ
గురులద్విజులసచివ ♦ వరులంబనిచి యంతి, పురికినరిగి తెఱవు ♦ నిరవుకొలిపె.

తే॥ అందఱానందమూలమా ♦ నయ్యుదంత
మరసి ముదితాత్మికలుగాఁగ ♦ సరవిఁదన్ము
ఖారవిందములొప్పారె ♦ నదిహిమాత్య
యానుషక్తంబగుటయుఁ జ ♦ య్యన స్ఫురింప. ౩౯౭

—♦ సుమంత్రుఁడు దశరథునితో సనత్కుమారుని వాక్యంబు లుపన్యసించుట ♦—

క॥ అంతట మంతనమున మహి, కాంతునితో సూతుఁడనె వి ♦ కాసముదోఁపన్
వింతగ నొకవృత్తాంతం, బింతకుమును వింటి మునుల ♦ నీదృశులనఁగన్. ౩౯౮

మ॥ భగవంతుండు సనత్కుమారుఁడొకటన్ ♦ భవ్యాత్ములౌ సన్మునుల్
ప్రగుణంబంచు వినంగఁ బల్కెనఁట త్వ ♦ త్ప్రస్తావయోగంబునన్
దఁగనై కాశ్యపుఋశ్యశృంగుఁ గ్రతుసం ♦ ధాతంబొనర్పంగ నీ
కగు సంతానమటంచుఁ దాపసతప ♦ స్యావర్ణనంబొప్పఁగన్. ౩౯౯

వ॥ కాశ్యపమహర్షికి విభండకుఁడను నొక్కసుతుండు నాతనికి ఋష్యశృంగుండను నొకండుపుత్రుండును జనియింతురనియు నాయర్భకుండు వనంబున వన్యసామాన్యంబుగఁ బెరిఁగి తండ్రితోడిదగుననువర్తనంబున నన్యంబుఁ బున్యంబు నెఱుంగని వాఁడవుననియు మహాత్ముండగు నావిప్రసంభూతునకు ద్వివిధంబగు బ్రహ్మచర్యంబును స్మృత్యుక్తంబైనయది సమకూరుననియు, నమ్మహామహుం డగ్నిగురుశుశ్రూషలం గాలంబుఁ గ్రమియించుచుండ నంగదేశాధీశుండు రోమపాదుండనునతం డాత్మీయంబైన ధర్మవ్యతిక్రమంబున సుదారుణయు సుఘోరయు సర్వభూతభయావహయునగు ననావృష్టి స్వదేశంబునకు సంప్రాప్తయైనసుదుఃఖితుండై శ్రుతవృద్ధులగు బ్రాహ్మణోత్తములంబిలిచి స్వీయదోషంబెఱింగించి యద్దానికిందగినప్రాయశ్చిత్తనియమంబువిధించి దేశపీడలనివారింపుఁడని వేఁడుకొనుననియు, నవ్వారలెల్ల నేకగ్రీవంబుగ విభండకతనయు సువినయు ఋశ్యశృంగమహానివరుందోడ్తెచ్చి సుసత్కృతునింజేసి భవత్పుత్రీమణి నిజకాంతిచ్ఛాదితదిశాంత శాంత నొసంగివిధ్యుక్తప్రకారంబున వివాహమహంబొనరించినం గృతార్థుండవగుదువని తెలుపుదురనియును, నమ్మహీకాంతుండు చింతాక్రాంతుండై నిజమంత్రులంబురోహితుని నాయగ్నికల్పునిందోడ్తేరఁ బ్రేరేపించుననియు, వారును వివిధంబుగవితర్కించుచు నిక్కర్జంబుసమకూర్ప నేర్పరులగు వేశ్యలుదక్క నితరులోపరయ్యునఘు నిమ్మోయిందోడితెచ్చినయంతమాత్ర నెద్దియుం బ్రత్యవాయంబొదవఁబోవదని నిశ్చయించి

నిపుణలగునట్టిగణికల నిశాతవజ్రమణికణికలంబనుచుటయు నవ్వారవ్వరతపోధనుని బహూపాయంబులం బారవశ్యంబునంబొదలించి వశంగతునింగావించి తెచ్చిరెయొప్పు గింతురనియు, నారాజన్యశిఖామణి తనకూఁతు నుత్తమ తపస్విసత్తమునకొసంగి పరిణయంబొనరించుటయుఁ బదంపడి పర్జన్యుండు వర్షించుటయు దేశక్షామంబు వాయుటయు నామహానీయుండచ్చోటం బుత్రులు దారయుం దానును సుఖం బుండుటయు సంభవించునని వివరించి వెండియు నాబ్రహ్మర్షివరేణ్యుండు ప్రసంగ వశంబున. ౪౦౦

ఆ॥ దశరథేంద్రుఁడల్ల ♦ తపసికతంబునఁ, బడయఁగలఁడు సత్ప్ర ♦ భావయుతుల
సుతులనొక్కయిజ్య ♦ నతులఁ గృతింగూర్చి, యజ్ఞవిభుప్రసాద ♦ మెనయఁగాంచి.

క॥ అని యమ్మౌనివరిష్ఠుఁడు, వినిచెననుచు మునులుదెలుప ♦ వింటినధిప ; య
య్యనఘు సదారుం గొనితె, మ్మిన కులగురుఁడా వశిష్ఠుఁ ♦ డెలమింబనుపన్.

ఆ॥ అంగరాజు సఖ్యసంగతిఁగూర్చునీ, కట్టిబాంధవమ్ము ♦ నందియున్న
వాఁడుఁగాన యమిన ♦ వశ్యమ్మనుత్పశ్యుఁ, బనుచు సహకుటుంబుఁ♦బ్రతిభతనర.

క॥ ధరణీశ; పుత్రవజ్జన, శిరోమణివ యగుము లెమ్ము ♦ సిరి గనుమని య
వ్వరసచివుఁడు సూతుఁడు దె, ల్ప రహించనరా రేఁడనమ ♦ భాగ్యమరయుచున్.

వ॥ కాతుత్స్థరాజహంసంబులకు మానసనైర్మల్యంబుసూపుచు నశ్రాంతంబునువిశ్రాంతి వెలయ ననవద్యంబగు వైశారద్యంబునంబొసంగఁజేయు నిజకులగురుని వశిష్ఠ మౌనిశేఖరుని సందర్శించి యవ్విరించితనయు ననర్ఘ్యమణికల్పానల్పవచోవినయ శ్రద్ధాభక్తివిశేషశేవధులగు సముపచారవిధులంగౌతూహలంబుమునుకొనంబత్నీ సమేతుండై యమ్మనుకులప్రదీపకుండు త్రయీసమాశ్రితంబగు ప్రణవంబు పర మాత్మననుసంధించు తెఱంగు నవలంబించి పూజించి కరపంకరుహయుగళంబు ఫాలఫలకంబునం గీలించి యిట్లని విన్నవించె. ౪౦౫

శా॥ అయ్యా ; తావకసత్తపోమహిమ రా ♦ జ్యాంగంబులందెన్నఁడున్
డయ్యంబొందొకఁడేని లేవితరక ♦ ష్టంబుల్మహోభ్యున్నతుల్
వెయ్యా లక్ష్మియొ పచ్చతోరణలె యే ♦ వెంటన్ శుభోల్లాసమే
నెయ్యంబు ల్మనదేశపుంబ్రజలకు ♦ న్నిద్రంబులేనేఁటికిన్. ౪౦౬

క॥ భువి నబలుండర్థాయువు, కవితాదూరుండు జడుఁడు ♦ ఖలుఁడల్పధనుం
డవినయవంతుఁడు నిజధ, ర్మవిరతుఁడునులేఁడు నీన ♦ మర్థకతనన్. ౪౦౭

తే॥ తలఁచినప్పుడె వృష్టితా ♦ వలచుఁ గృషికిఁ, దోడు కోరికలెల్లఁ దో♦డ్తోఫలించుఁ
గలిగెఁ గృతకృతధర్మత ♦ ఘనతయింత, వరలె నాకల్మి నీబ్రహ్మ ♦ వర్చసమున.

తే॥ ఉన్నవిన్నియుఁ గొదుకయ్యె ♦ నొకటఁ దనకుఁ
దండ్రి ; నీస్ను షలందు సు ♦ తప్రకాశ
మొదవకుండుటచూవె గు రూక్తులందు
శ్రోతకుఁ బ్రబోధపదనిజ ♦ జ్యోతిభాతి. ౪౦౯

క॥ అదియొకశల్యముగతి నా, యెదనాటినదయ్య దాన ♦ నేయెడ సుఖముల్
గుదురఁగనేరవచట మద,వదమాత్యసభఁ బ్రాజ్ఞ ♦ వర్యులమాడ్కిన్. ౪౧౦

తే॥ ఎన్నివిభవంబులున్నఁ దా ♦ నెన్నిజన్న
ములు సుదానమ్ములునొనర్చి ♦ మురియుచున్నఁ
గనునెసంతానహీనతఁ ♦ గాంచి నరుఁడు
పైతృకఋణమనునబ్ధి ♦ పారమనఘ. ౪౧౧

శా॥ నాయన్నా; ధరయెన్నిరత్నములఁ గన్నం దానినే నేలినన్
బాయంజాల దపుత్రతాకలితమా ♦ పన్నత్వమెన్నాళ్లకున్
శ్రేయంబెట్లగునాకు వంశ్యులు స్వధ ♦ ల్చేఁదప్పినస్మేఁదలే
వో; యంచర్ధము డాఁచుకొందురఁట తా ♦ రుత్సాహసంశూన్యులై. ౪౧౨

తే॥ ఐహికాముష్మికములన ♦ నలరురెండు
సుఖములుండు నపత్యాప్తి ♦ సొంపుగనిన
నొకఁడుగలుగునో యదియులే ♦ కుండునొకొ
యొండుపున్నెమ్ములను బ్రహ్మ ♦ యోగివర్య. ౪౧౩

క॥ కానఁ బ్రజాలోపమున, న్నేనయమునఁ గాలుకొనఁగ ♦ నీకెరియింపన్
గానింత వలసెఁబొరల న, నూనజ్వరసన్నిపాత ♦ యుక్తుని భంగిన్. ౪౧౪

ఉ॥ పెంచితినంశుమత్కులముఁ ♦ బ్రేమ నిజాశ్రమలీలముంగిటన్
మించితినేరసాలమన ♦ మేకొనుకీర్తిలత ల్గుణప్రసూ
నాంచితవాసనల్ శ్రితబు ♦ ధాళులుఁ బొల్చెడునిన్నియుంజెడన్
సంచితమయ్యెవంధ్యత ప్ర ♦ సహ్యమెనీకుఁ దపోధనోత్తమా. ౪౧౫

ఆ॥ దానివలన నన్నుఁ ♦ దలఁగఁజేయునుపాయ, మవధరింపవలయు ♦ నయ్య; యింక
నర్కవంశ్యనృపదు ♦ రాపార్థసిద్ధులు, బ్రహ్మమూర్తి; నీకు ♦ బంట్లుగావె. ౪౧౬

క॥ నన్నుఁగావవె యని చరణము, లన్ప్రవాలిన నతని దృగ్జ ♦ లముజాలై జా
ఱినఁ దనహృదయము నీరై, చనక్షణమామౌని స్వయోగ ♦ చర్యాంచితుఁడై.

క॥ కనుమూసి తెఱచి యిట్లనుఁ, జనునే యిటు వలుక భూమి ♦ జనపాలక యో
జన సేయక నినుఁబోలిన, ఘనులకు నొకనాఁటికైనఁ ♦ గలవేకొదవల్. ౪౧౮

తే॥ కారణాశ్రితయయ్యెఁ బ్రా ♦ క్తనపుభాగ్య
యుక్తి సంతతి దాన వం ♦ ధ్యుఁడవె తలఁప
సురలు ప్రచ్ఛిన్నఁగాంచెఁ బ్ర ♦ స్ఫుటత సాగ
రమ్ము తాముగ రత్నాక ♦ రమ్ముగాదె. ౪౧౯

ఆ॥ అనఘ; సుతులు నలువు ♦ రాలోకపాలకు, లనఁగ నుద్భవింతు ♦ రమలయశులు
గాన వేగఁ బుత్ర ♦ కామేష్టిఁ బొనరింప, గానవోద్యమాను ♦ కారివగుము. ౪౨౦

క॥ సీతలఁపున హయమేధం, బీతఱినొనరింపఁ గుతుక ♦ మొదవెఁగద మహా
పాతకహార మది దీనికి, బాఁతగు రెండుసమకూర్చుఁ ♦ బ్రకృతఫలమ్ముల్. ౪౨౧

## —♦ ఋశ్యశృంగముని చరిత్రము ♦—

సీ॥ మనువంశమౌక్తిక ♦ వినుమంగపతి మాన, ధని రోమపాదాఖ్యుఁ ♦ డినుఁడతండు
తన దేశమున వాన ♦ లనరాని యెడ మంత్రు, లను బురోహితులఁ బా ♦ వనులఁ గూర్చి
ఘనులార యే వెర ♦ వున నీవ్యథ దొలంగు, ననఁ గాశ్యపుని పౌత్రుఁ ♦ డనఘమూర్తి
ముని ఋశ్యశృంగుఁడా ♦ యన లోకు లెఱుఁగని, వనిఁ దపశ్చర్యలఁ ♦ దనరుచుండు
ననయ మంగన పూరుషుం ♦ డనెడు భేద, మునుఁ దెలియనేరఁ డాజ్ఞాన ♦ ఖనికి నీదు
తనయ నర్పించి పాణిపీ ♦ డన మొనర్ప, జను ననావృష్టి నావిని ♦ జనవిభుండు.

క॥ అవ్వారితవ్రతాత్యయు, మవ్వముగూరఁగ దొసంగు ♦ మాటతలఁగ మేల్
నివ్వటిలంగొని తేరఁగ, నెవ్వారో పుదురు మీర ♦ యెఱిఁగింపుడనన్. ౪౨౩

క॥ వారునుఁ గొండొకతడవు వి, చారించియు పలికి రధిప ; ♦ సంయమిదరికిన్
వారాంగనలఁ బనుపఁజను, వారలె యిప్పనికి నేర్చు ♦ వారలు జగతిన్. ౪౨౪

శా॥ ఒయ్యారంబుల కాటపట్టులు విలా ♦ సోద్యాన వాసంతికల్
సయ్యాటంబుల పంటచేలు స్మితగు ♦ చ్ఛప్రోల్లసన్మల్లికల్
వియ్యంపున్నెఱి కందువల్బహుకలా ♦ విర్భావజన్మస్థలుల్
నెయ్యంబయ్యలి వేణులొయ్యఁ గఱప ♦ న్నేకొందు రెప్పట్టునన్. ౪౨౫

శా॥ మూలోచ్ఛేద మొనర్పఁ బో రెలమికి ♦ న్మున్కొందురప్రాకృతం
బౌ లావణ్యముఁ బెంపనేర్తురు రస ♦ వ్యాపారపారీణత
న్బాలత్వంబుననుండి గాంతురు లస ♦ న్మాయానుభావాయిత
ల్బాలంజాలరె యోగినేనిఁ బురికో ♦ ల్పం జావగావింపఁగాన్. ౪౨౬

ఆ॥ అభిమతంబులైన ♦ నైంద్రియకార్థముల్, నరమనఃప్రమాథ ♦ నంబొనర్పఁ
గూర్ప నేర్చువారు ♦ దార్పరే తీర్పన, బ్రహ్మచారిఁ దబిసిఁ ♦ బడసి యొరసి.

ఆ॥ అనిన నెట్టులైన ♦ నదియొక్కఁడె యుపాయ, మితరమానితరమ ♦ యెంచిచూడ
ననుచువారిఁగాంచి ♦ యవ్వారిఁబుత్తేర, వలయుననినఁ దగిన ♦ వారిఁ బనిచి.

వ॥ అమాత్యశేఖరు లాక్షణంబ యవ్వారిజేక్షణల రావించిన. ౪౨౯

—♦ ఋశ్యశృంగాశ్రమమునకు వేశ్యలరుగుట ♦—

సీ॥ మరు తేజులను మేటి ♦ మాటకుదీటుగాఁ, బలుకనేర్చిన రస ♦ భావవిధులు
మోహనాంగులటన్న ♦ మురువునకెనగాఁగఁ, దమిగొల్పుజాలు నే ♦ స్త్రఁపు మొలకలు
హేలావతీత్వప్ర ♦ హేలిక కనువుగా, స్మితరసంబిడుతీపు ♦ చెఱకుగడలు
కామవల్లరులన్న ♦ కథ సెల్ల సుమనోను, బంధంబెడలనీని ♦ పాశతతులు
నాగరవికాసపూరప్ర ♦ ణాలికలు ప్ర, కాశితకలాఖిలాంగ రం ♦ గస్థలులు వి
నోదపాంచాలికలు మహా ♦ మోదకలిక, లరుగు దెంచిరి గణికల ♦ య్యధిపుసభకు.

క॥ ఆసవలామానికముల, మానుగమానించి పలికి ♦ మానవపతి య
మ్మానినులని కర్జము మది, లోనెక్కొనఁదెలిపి వారి ♦ లోఁగొని యనుపన్. ౪౩౧

వ॥ వారును సంభారములందగిన యంతవట్టు గూర్చుకొని మఱియు నక్కార్జంబున కనువు
పడువారినెల్లం దోడ్కొని రాజకీయసహాయంబున నవ్వడుగుజడదారి నెలదారి
నెలవుకొనియున్న కాననంబు దారివట్టిపోవుచు. ౪౩౨

సీ॥ తమపల్లుపలుకు చం ♦ దముఁజిల్కకదుపెంచి, క్రొత్తబాణియని య ♦ త్రిత్తిచూడఁ
దమగీతిరసమరం ♦ దముఁదేఁటిగములాని, వింతపాకమటంచు వినుతిఁగూర్పఁ
దమపంచమస్వరా ♦ ర్థముఁబికాలిగ్రహించి, చిగిరించుమోటుల ♦ కెగసి పొగడఁ
దమవ్యంజకానుబం ♦ ధముఁగేకితతిగాంచి, వినువీధికైచూడ్కి ♦ వెలయఁజేయఁ
దమనడలకంచతెగలోలిఁ ♦ దారసిలఁగఁ, దమబెళుకుచూపులకు నాస ♦ దవిలిలేడి
పిండుగ్రుక్కిళ్లుమ్రింగ నా ♦ పృథునితంబ, లాముకొని గొక్కమాత్రన ♦ క్కాముబలము.

తే॥ మలయపవనానుయోజిత ♦ మార్గకలన, సరసలాస్యంబెసఁగ భృంగ ♦ సమితిగీతు
లమరఁ జివురులువిరులొొప్ప ♦ నందగించు, నచటి గణికాతతియువారి ♦ ననుసరించె.

తే॥ కొమ్మయొప్పెడు ననినఁ బూ ♦ రెమ్మదనరె
ననిన నీశ్యామ పుష్పిణి ♦ యయ్యె ననినఁ
బురుషసంగతి గాంచెఁ బూ ♦ బోఁడి యనిన
నవ్వుకొందురు తమలోన ♦ నారులరసి. ౪౩౪

తే॥ ఉత్తమకుమార కాశ్రయ ♦ మువిద వదలి
జటిలసంగతిఁ గనఁబోవు ♦ సరణిఁగంటె

దేవవల్లభ యోగంబు ♦ దెరలఁ దెలుప
యప్పలాశానుస్మృతి గాంచు ♦ టరయు మదియు. ౪౩౬

క॥ హేలావతు లటులీలా, హేలనమేలనములోలయుఁ ♦ నిందిందిర బృం
దాలీకమారమార్వ్యో, చాలనమొప్పార నతని ♦ సాయకము లనన్. ౪౩౭

క॥ ఆశ్రవతాశ్రితభావము, సశ్రీకతవిశ్రుత ప్ర ♦ చారముఁదగఁదా
రశ్రమత మునికుమారుని, యాశ్రమపదమెనసి చకిత ♦ హర్షితలగుచున్. ౪౩౮

క॥ శమనిరతుఁడు ధీరుండా, శ్రమవాసి ప్రశస్తియుతుఁడు ♦ సంయమి సుతుఁడీ
విమలాత్ముఁ డటీయుఁజనసే, ప్రమాదమొదపునొకో యనుచుఁ♦ భ్రమదలలుకుచున్

తే॥ దానికవిదూరమున నున్న ♦ తరునికుంజ
మరసి విరసంబు వొడమని ♦ యట్లుగాఁగఁ
దాపసకుమారుఁ గనుఁగొనఁ ♦ దవులు నెదల
దగుప్రయత్నంబు దడవొండఁ ♦ దడవుచుండ. ౪౪౦

ఆ॥ నిత్యతృప్తుఁడతఁడు ♦ నెటిపీడి యొండొక్క,వలని కరుగఁబోఁడు ♦ వలనుమెఱయు
తండ్రిసేవలందు ♦ దవులుచిత్తంబున, నున్నచోటునందె ♦ యుండు నెపుడు.

క॥ నరనారీజనముల ♦ నా, గరరాష్ట్రజవస్తువుల ర ♦ కంబొకఁడేన
వ్వరవర్ణియరసి యెఱుఁగఁడు, నిరంతరాత్మానుభూతి ♦ నెక్కొనుచుంటన్.

క॥ కొండొకతడవున కమ్మ్ముని, కుండలిపతి యోగమహిత ♦ కుండలిపతికై
దండవిడి ప్రసాదకలా, మండనుఁడై కనులుదెఱచి ♦ మానితకీర్తిన్. ౪౪౩

— ♦ వేశ్యలు ఋశ్యశృంగుని గాంచుట ♦ —

వ॥ విశ్రాంతికై యాశ్రమంబుచెంగటి బహిరంగణంబునం దవశంబైనదై వవశంబునం బరిక్రమించుచుండ. ౪౪౪

సీ॥ పోఁకమ్రాఁకులలోని ♦ పొడుపుచందురుఁగూర్చు, మొగిజడల్గలనగు♦ మోమువాని
బాలభాస్కరులీల ♦ బయలుపెట్టఁగఁజాలి, దెసలానిమెఱయు బ ♦ త్తేజువాని
నంచతెక్కలతళ్కు ♦ లందు కెందమ్మినాఁ, బటికఁపురబేరొప్ప ♦ పాణివానిఁ
జిక్కమందిడినమే ♦ ల్సింగారమనవల్క, లానుబద్ధమగు నె ♦ మ్మేనివాని
నంగములఁ బులకలెసంగ ♦ నంగనలు క
నుంగొని రసంగు రుచిజితా ♦ నంగు మంగ
ళాంగు నంగీకృతసదేక ♦ సంగుఁజిత్ప
సంగు హతభంగు నాఋష్య ♦ శృంగునచట. ౪౪౫

ఆ॥ అమ్మహానుభావు ♦ నల్లంతఁ గనినంత, వారికొదవె మేని ♦ వడఁకుఁగోడ
బాష్పవారి హృష్ట ♦ భావమ్ముండఁగ, భీరభావ మొందు ♦ తీరుగనియె. ౪౪౬

క॥ ఇట్టులమగునిజధైర్యం, బెట్టిటు మదిఁ గుదురుకొలిపి ♦ హేలావతులా
గుట్టెడలనీక మదనుని, పట్టఁపురాణులన మెలఁగఁ ♦ బాల్పడిరంతన్. ౪౪౭

సీ॥ ఒకపల్లవోష్ఠి తా ♦ నుల్లాస మొప్పార, మేలిపూరెమ్మకై ♦ కేలుసాఁచు
నొకగంధగజయాన ♦ యొయ్యారమున, సల్ల, కీలతఁ బెనఁగొని ♦ కేళిసలుపు
నొకమధుకరవేణి ♦ యున్నతశ్రుతిఁ దెల్పి, తేటకుదిటుగాఁ ♦ బాటపాడు
నొకచిలుకలకొల్కి ♦ యుద్రేకమున రస, మొలుక నిబ్బరమైన ♦ పలుకుపలుకు
నొక్కకలకంఠకంఠి వే ♦ యొక్కమధుర
వాణితో వాక్ప్రసంగంబు ♦ వఱలఁజేయు
నొకచకితబాలహరిణాక్షి ♦ యోగిచంద్రు
వల బెళుకుచూడ్కులఁ గలంక ♦ మొలయఁజూచు. ౪౪౮

తే॥ ఏప్రపంచస్థితియు మున్నె ♦ యెఱుఁగఁడట్టి
దీప్రశుభమూర్తి యానాఁడు ♦ దెలిసికొనునె
వక్రభావానుకలితలా ♦ వారి తెఱఁగు
సక్రమాత్మానుషక్తిఁబో ♦ సంగుఁగాక. ౪౪౯

క॥ వారిఁగని సవిస్మయుఁడై, వారనికుతుకమున మాని ♦ వరులని చేరం
జీరె నుపచరింప శశి, స్మేరుమొగము లోరసేసి ♦ నెలఁతలు నవ్వన్. ౪౫౦

క॥ భాగ్యముఫలించె నిత్తఱి, యోగ్యులమైతిమి మహాత్ము ♦ యోగివరున్ సా
భాగ్యమలర సేవింపఁగ, వాగ్యతుఁడటుపిలిచె మేలి ♦ వలనొప్పారన్. ౪౫౧

ఆ॥ అనుచుఁ జేరనరిగి ♦ యమ్మహామహుఁగాంచి
బ్రహ్మమూర్తి; యొంటి ♦ బరఁగుచుంటి
విట్టికాననమున ♦ నెట్టికజ్జముట్టి
కానెనో తెలుపుమది య ♦ గూఢమేని. ౪౫౨

క॥ అనివార లడుగ నెన్నఁడుఁ, గనియెఱుఁగడు కామ్యరూప ♦ కలనాంచితమా
జన మట్టులగుట హార్దం, బునఁదనవృత్తంబు దెలుపఁ ♦ బూనెఁదలఁపునన్. ౪౫౩

ఆ॥ పరఁగుకాశ్యపునకుఁ ♦ బౌత్రుండనే విభం
డకమునీంద్రుసుతుఁడఁ ♦ బ్రకటమెకద
నాదువర్తనంబు ♦ నామధేయము ఋశ్య
శృంగకలన నేటు ♦ కొననగుటయు. ౪౫౪

ఆ॥ గురుఁడు నేను నిచటఁ ♦ గూర్చుస్వాశ్రమపద
మున వసింతు మెపుడు ♦ మొనయ మొండు
చోటు బ్రహ్మచర్య ♦ శుభవర్తనంబున
నుందు నమ్మహాత్ము ♦ నోజఁగొలిచి. ౨౫౩

క॥ ఇయ్యదె మాయాశ్రమవన, మయ్యలు విచ్చేయుఁడచటి ♦ కంచితమగు మీ
నెయ్యము శుభదర్శనమును, వెయ్యాఱులుఁగూర్చునాకు ♦ విధియోగమునన్.

క॥ మీకందఱకు సమర్చన, నాకొలఁదికిఁ దగినయటు లొ ♦ నర్చెద నిచ్చో
నేకాహ మొలసియుండుట, ప్రాకట మాతిథ్యవిధికిఁ ♦ బ్రాంగణమగుటన్. ౨౫౮

ఆ॥ అనిన నచటుచూడ ♦ నరిగిరి వారెల్ల, రతనితోడఁ గుతుక ♦ మతిశయిల్ల
నమ్మహాత్ముఁడట్టు ♦ లవ్వారిఁగొనిచని, విష్టరములు వేఱు ♦ వేఱ యొసఁగి.

క॥ ఇదె యర్ఘ్యం బిదె పాద్యం, బిదె మూలము ఫలము ననుచు ♦ నేర్పడనిడి యా
సదమలమతి పూజించెను, మదవతులను ముదము గదుర ♦ మాన్యత పొదురన్.

ఆ॥ అట్టిపూజ లతివ ♦ లందిమిన్నంది యా, ఋషికుమారు నెనసి ♦ యెలమిమీఱఁ
గౌఁగిలించి హర్ష ♦ గద్గదకంఠులై, పోయివత్తుమనిరి ♦ ముని భయమున. ౨౬౦

క॥ కట్టిడి తనమఱఁ బలుకుచు, నెట్టెటొ విడనాడి విడిది ♦ నెనసి రధృతిన
మ్మట్టున నిలలేకావల, నెట్టనఁజనె వారలున్న ♦ నెలవున కతఁడున్. ౨౬౧

ఆ॥ అట్టులరిగి వారి ♦ నారసి నను వెలి, నేసి యిచటు వెరయఁ ♦ జెల్లునొక్కొ
మిమ్ముఁబాసి యొంటి ♦ మెలఁగంగఁగలనె ము, న్నిట్టికాతపస్వి ♦ లెఱుకపడిరె.

సీ॥ మహనీయులార; మీ ♦ మనికి యెయ్యది తపో, వర్తనం బేభంగి ♦ వఱలుచుండు
భవదాశ్రమంబు ని ♦ ర్బాధకంబే కద, ఫలముఖ్యలాభంబు ♦ వెలయుచున్నె
యేచెట్టునారల ♦ వీమేలివల్కమ్ము, లిమ్మేటికాంతి మీ ♦ కెట్టులొదవె
మానకజపియించు ♦ మంత్రమ్ములెయ్యవి, యాచారమెయ్యది ♦ యనవరతము
నిట్టివలపుల బసుమంబు ♦ లెచటదొరకు, నెద్ది మీశాఖ గురులెవ్వ ♦ రీశ్రుతిగతి
యాగళస్వర మీ తెల్వి♦ యానడతయు, నెట్టిశుశ్రూషకలన మీ♦ కెఱుఁగనయ్యె.

తే॥ ఉండె నాతల నొకకొమ్మ ♦ యోగ్యులార
రెండుకొమ్ములు మీయెద ♦ నుండె మఱియుఁ
దళుకు లీనెడు; నెమ్మనఁ ♦ దాల్చుపేరు
లెట్టి తరుఫలబీజంబు ♦ లింతగలవొ. ౨౬౨

క॥ అబ్బుర మొదవెడు మదిమీ, నిబ్బరమగు బ్రహ్మచర్య ♦ నియమ మరసినన్
సిబ్బితివడనేల సుఖం, బుబ్బఁగ నాకానతీయ ♦ నుచితులరీరల్. ౨౬౩

క॥ మీమంత్ర రహస్యము విని, శ్రీమహితుఁడనౌదు నేనుఁ ♦ జేతోబ్జాతం
బామోదింపఁబరకలా, భామాసామ్రాజ్యపట్ట ♦ భద్రుఁడ నగుచున్. ౨౬౬

క॥ అని మేదకుఁడమ్మౌని పలి, కినఁగేలీలోల లిదియుఁ ♦ గీడో మేలో
కననేరము తుదిముట్టక, యనివార్యము విభువిధాన ♦ మాఁగాకనుచున్. ౨౬౭

ఆ॥ పలికి రిట్లటంచు ♦ బ్రహ్మర్షి వర్య ; నీ, యాదరమ్ముముట్టె ♦ నజునిశీర్ష
మేము నిన్నుఁగాంచి ♦ యెఱుఁగ మన్యుల నిట్టి, వారలుందురొక్కొ ♦ వసుధలోన.

తే॥ కామవృత్తిన చరియింతు ♦ మేము బ్రహ్మ
సృష్ట మొక్కొండుపద మది ♦ సిరులఁబొనరు
మేలె యావెంట మిముబోంట్ల ♦ మేలుగాంచఁ
దలఁచి మారాకచూ ; తపో ♦ ధనవరేణ్య. ౨౬౮

తే॥ అనుచు నల్లనఁబలికి య ♦ య్యతివ లతని,దీఁగలాగినగతి మతిఁ ♦ దిగిచి ద్విజకు
మారకాసీతభక్ష్యాదు ♦ లారగింపఁ, జేయ రసతృప్తుఁడై వారి ♦ జేరి ప్రీతి.

క॥ ఏచెట్టులపండ్లో యివి, నాచెవికింజేర్పుఁడనిన ♦ నగుమొగములతో
వాచంయమశేఖర; మా, కేచతురత నివియునెల్ల ♦ నేర్పఁబనగున్. ౨౭౧

క॥ కొంతవడి సఖ్యమొదవిన, నంతయు వివరించువార ♦ మావలనున నీ
చెంతనిలుచువారమొ; నీ, వంతకుఁజనుదెంతువో; ని ♦ జాస్పద మరయన్. ౨౭౨

క॥ మాయాశ్రమ మరయంగ న, నాయాసత నిన్నుఁగొంచు ♦ నరిగెద మచ్చో
నీయాశాలత లెగువఁగ, నాయాసత్కృతుల నిచ్చ ♦ లందింతు మొగిన్. ౨౭౩

క॥ నీచేతన చల్లనగాఁ, బూచినతంగెడుసొబగునఁ ♦ బొసఁగు నచటు నీ
మాచేయఁదగినకర్జము, లాచరణమొనర్తు మవల ♦ నాయావిధులన్. ౨౭౪

మ॥ పలుకుల్దేనియలొల్క నిట్లు మునికిన్ ♦ బ్రత్యుత్తరంబిచ్చి య
య్యెలనాగ లక్కలనాగతుల్వెలయ సా ♦ హిత్యప్రకాశంబుసాం
పులు సయ్యాటము లారజంబు లాడికం ♦ బు ల్మిఱి గీత్రిక మో
ద్వలనంబొప్ప మెలంగఁజొచ్చి రతఁడ ♦ వ్యాజస్థితి న్మెచ్చఁగన్. ౨౭౫

సీ॥ తలఁగి కొండొకసేపు ♦ తఱితీపుపుట్టించి, పొడసూపి మెప్పుచొ ♦ ప్పడ నటించి
యొయ్యారముల మది ♦ నుయ్యెలలూఁగించి, కళలు గీల్కొలిపి వెం♦గలినొనర్చి
మేలిముచ్చటలన ♦ మేలంపురుచి గొల్పి, రసపరీవాహాని ♦ ర్మగ్నుఁజేసి
యేకతం బమరంగ ♦ నేమేమొ బోధించి, సృష్టవస్తువులసం ♦ తుష్టిగూర్చి

పోయివచ్చెద మని కూర్మి ♦ పొసఁగ నాడిన
మఱవకుమటంచుఁ దీయని ♦ మాటలాడి
కూడివచ్చెద నేను మీ ♦ తోడ ననెడు
పలుకుపలికించిరతనిచేఁ ♦ గులుకులాండ్రు. ౪౮౬

ఆ॥ మున్నె వారు కామ ♦ మోహనౌషధిలత, ల్మానుఁడు కర్జమొదవ ♦ ఁడేఁడువనిచె
నింక నెట్టికళల ♦ వంక మెలంగరే, వేడబములుగూర్చి ♦ వెర వరయరు. ౪౮౭

తే॥ కానలోనన పొడమె మె ♦ కాలఁగలసి, మెలఁగె లోకమెఱుంగఁడు ♦ మేలిబ్రహ్మ
వసతి మెట్టె నవ్వానిఁగై ♦ వసమొనర్చి, రెంతలెంతలు సేయ ర ♦ య్యింతు లధిప.

—♦ వేశ్యలు ఋశ్యశృంగుని రోమపాదుపురంబునకుం గొనివచ్చుట ♦—

క॥ చానలకన్నను మున్నుగఁ, దానె ప్రయాణమ్ము సేసి ♦ తరలె నతండే
వాని తలఁకెక్కె నెది యదె, యానందోల్లాసమనఁగ ♦ నగుఁగాదె యిఁకన్. ౪౮౯

క॥ పైనంబైనది మొదలుగ, నానెలఁతలమేను లుసుఱు ♦ నాసగొనవ య
మ్మౌని తమ మోసమరసిన, యానాఁడే కీడుమూఁడు ♦ ననుతలఁపు మెయిన్. ౪౯౦

ఆ॥ ఎఱుక చాలకున్న ♦ నేమి; ముగ్ధుఁడటన్న, నేమి; యెటుమెలంగు ♦ నేనినేమి;
మున్నె ముక్తిఁజూఱ ♦ కొన్నవాఁడాశుచి, మూర్తివంక నంక ♦ మును మొనయునే.

క॥ వలరాయని రాయంచల, మెలపున నమ్మెలఁత లతని ♦ మేలుగఁగొని యి
మ్మల విడియింపుచు నల్లన, నలయికనొడఁ గూర్పకుండు ♦ నట్టిగతులచేన్.

వ॥ దారి వట్టిపోవుచు నెడనెడ మేలంబులొప్పార రసాలంబంబుచొప్పుచొప్పడం గల యికలవలను లలవార్చుచు. ౪౯౩

సీ॥ మునివసంత; కిసాల ♦ ములనొప్పె నీలత, ల్సుమనోవికాసంబు ♦ జోడుగొనుచుఁ
దాపసేంద్ర; ఫలాశఁ ♦ దనరె నీరంభాదు, లభిరూపసంపద ♦ ననువుపడుచు
మౌని మన్మథ; రతి ♦ మలసె నీభ్రమరాలి, విరితేనియల్గ్రోలు ♦ వెరవుగనుచు
ఘుమిసూర్య; విప్పుచొ ♦ ప్పందె నీపద్మిను, ల్కరములగిలిగింత ♦ కరులెనయుచు
జటినటేశ్వర; కలికలఁజాలఁదనరె, నీగణికలంచితశివాప ♦ యోగలగుచుఁ
గాననోద్భవకమనీయ ♦ తానవోద్య, దప్సరశ్శ్రీవిలాసంబు ♦ లనఘ; కంటె.

ఉ॥ నాయికజంటఁబాయ కధి ♦ నాయకులేనిఁజరింతు రోసుధీ
నాయక; కంటె మాధవిపె ♦ నంగఁదగెంబురుషోత్తమాగమం

బాయతలీల హైమవతి ♦ నందెదు(ద్ర్యంబకపాదపంబు హా
ళ్లాయిత బ్రాహ్మి బ్రహ్మతరు ♦ సంగతి నంచెలయింతు రాతనిన్. ౨౮౫

మ॥ లలన ల్తాపసచంద్రదు వెన్నెలబయ ♦ శ్శృంగోల్బుచో మాలిమిన్
గలలెచ్చోటఁబొసంగు నంచు నతఁడ ♦ క్కంజారిఁజూపంగనా
వల నర్థాంతరవృత్తిఁగూర్చి ధృతిదై ♦ వాఱం గలావంతులీ
రలయన్నంతన మెచ్చి పొంగుదురు వా ♦ రల్స్వీయసంసిద్ధికిన్. ౨౮౬

క॥ లోకజ్ఞానం బిటులా, లోకాత్మున కెఱుకసేసి ♦ లోలాక్షులు ని
ర్మోకవిమోకముఁగనుఫణి, వీఁకందనరారు నతని ♦ వీనులుదనియన్. ౨౮౭

సీ॥ కలయాశ్రమములోలిఁ ♦ గాచుమేల్పంటకాఁ, పర్థులపాలి క ల్పాగమంబు
నెఱివన్నెగన్నపు ♦ న్నెఁపుము త్తియములప్రో, వఖిలసత్కార్థ ♦ యంత్రశాల
యురురుచి సురలనో ♦ రూరించువంటయి, ల్లరులొడ్లకిడుపస ♦ రాకుమందు
సకలకలాయోగ ♦ సామ్రాజ్యవైభవం, బానందలక్ష్మ్మవి ♦ హారభూమి
వితతపంకవినిష్కాసి ♦ కతకబీజ, మిాప్సితపదంబు పిత్రుము క్తి ♦ హేతు వాత్మ
సిద్ధితీర్థంబు నాఁదగి ♦ సిరుల వెలయు, నవని గార్హస్థ్య మొక్కండె♦యనఘచరిత.

క॥ కలవెన్నియొ ముక్తికిఁద్రో, వలు నిర్మలవృత్తి మెలఁగు ♦ వారికి నెందుం
దలఁగి యధఃపాతమె కను, మలఁగియుఁదెలిసి కను మేలి ♦ మార్గము దీనన్.

క॥ తానొక్కఁడె గతిగాంచునుఁ, బూనికనెందేని యోగ ♦ పూర్ణుండైనన్
మానుగ సురమునిపిత్రులో, కానందముఁగూర్చిముక్తుడౌఁగడకిందున్. ౨౯౦

ఆ॥ నిర్మలాత్మ; జగతి ♦ నీమెఱుంగనిదొండు, ధర్మువుండునే వి ♦ ధానమరసి
యేలొకో; యుపేక్ష ♦ యింతవట్టుగృహా ప్తి, కనుచుఁజవులుసూపి♦వనజముఖులు.

శా॥ అంగీకారమొకింతగాంచి ముని హా ♦ ర్యత్తున్మరుల్కొల్పుచున్
రంగారంగఁ బురోపకంఠమహితా ♦ రామస్థలింజేర్చి వ్యా
సంగంబొప్ప నమస్యలందనుపుచున్ ♦ త్సొజానికాసన్నతా
పాంగల్వైళమెఱుంగఁజేసిరి స్వకీ ♦ యంబౌ కృతార్థత్వమున్. ౨౯౧

క॥ అమ్మహిపతి ప్రకృతులు నా, కొమ్మల నేరిమికిమెచ్చు ♦ గొఱలఁగఁదగు మే
ళమ్ములు మాంగలిక విధా, నమ్ములు వెలయంగఁ దన్మ ♦ నమ్మొలయంగన్.

ఆ॥ తోడరు పరిభవమ్ము ♦ తో మునిచంద్రు సం, దర్శనంబొనర్పఁ ♦ దరలవఱతె
నించు వేడ్క జగతి ♦ నెనయుజాడల నెప, ర్జన్యుఁడును స్వకీయ ♦ రభసమెసఁగ

క॥ దేవ్వఁడన వృష్టికలనల, తో విషయంబెసఁగుప్రీతి ♦ దొరసిన మానిక్
భావముపొంగ నరాధిపుఁ, డావెరవునఁ జేరి ప్రాంచి ♦ తార్చలొనర్చెన్. ౨౯౪

ఆ॥ నేలపైనిఁగూర్మి ♦ వ్రాలిన నెఱిమె సా, ష్టాంగసతిపిధాన ♦ మగుచు నెఱియ
నందుకొనియెఁదత్ప ♦ దాబ్జయుగ్మంబెట్లొ, వలనుగొననిపార ♦ వశ్య మొలయ.

క॥ నాయపరాధములెల్లం, ద్రోయుము పెడకన్నిటికినిఁ ♦ దోయ మొనర్తున్
స్వీయాత్మార్పణ మోముని, నాయక; యనినొడివె ధరణి ♦ నాయకుఁ డెలమిన్.

క॥ ముని యర్ఘ్యాదిసపర్య, ల్గొనఁజాఁచినపాణి మెఱసె ♦ లోకము మనుపన్.
మొనసితి నే జీవనదుఁడ, ననియిడు నభయప్రదాన ♦ హస్తమపోలెన్. ౨౯౭

ఆ॥ భక్తిమీఱ నట్లు ♦ పాద్యాదులొసఁగి కే, ల్దోయిమొగిచి త్వద్వి ♦ లోకనమున
నాకొలంబు పావ ♦ నంబయ్యె ధన్యుండ, నైతి శుభము లొదవె ♦ నఘము లెడలె.

— రోమపాదుండు ఋశ్యశృంగునకుఁ దనకూఁతునిచ్చి వివాహంబొనరించుట —

పంచచామరము.

ఉదారధీ; భవద్వియోగ ♦ మోర్వఁదింక నామనం
బుదా మహత్త్వయుక్తి స్వీయ ♦ పుణ్యమెంచెఁగావునన్
మదీయపుత్రి శాంత శాంత ♦ మానసస్వగ్రహించి యు
ష్మదీయపాదసేవ నన్బ్రి ♦ శస్తుఁజేసి కావవే. ౩౦౦

సీ॥ రాచబిడ్డనటంచు ♦ రాజసంబెనయదు, మైత్ర్యాదిగుణలక్ష్మి ♦ మలయుఁగాని
సుందరీమణినంచుఁ ♦ జులకసేయ దొకొండ్ల, సారిదియోగ్యతకెత్తఁ ♦ జొక్కుఁగాని
యైశ్వర్యమొదవెనం ♦ చటునిటుఁజూడదు, గురులశుశ్రూషింపఁ ♦ గోరుఁగాని
సుకుమారినంచును ♦ స్సులుగొట్టఁదలపెట్ట, దోపినంతలొనర్చి ♦ యొదుఁగుఁగాని
విద్దెలరహస్య మరసియు ♦ విఱ్ఱవీఁగ
దరుసమెదనిండ నుల్లాస ♦ మందుఁగాని
శాంత యనుసంజ్ఞకర్హ యీ ♦ సాధ్వి యిదియ
నీకుఁదగునయ్య; నెయ్యంబు ♦ నెరపుమయ్య. ౩౦౧

క॥ అనిప్రార్థించి ప్రతిశ్రవ, మొనరించి విరించికల్పు ♦ నొకచో విడియిం
చి నవోత్సవమును నగర, మ్మున వెలయించి ద్విజమంత్రి ♦ ముఖ్యాంచితుఁడై.

## —♦ శాంతాఋశ్యశృంగుల వివాహము ♦—

ఆ॥ మంచిలగ్నమునఁ బ్ర ♦ పంచితగుణలక్ష్యఁ, దనతనూజ నతఁడు ♦ మునికొసంగె
లోకమెల్లమనుప ♦ లోకమాతనుఁగాంచి, హరికిఁగూర్చినట్టి ♦ యబ్ధివోలె.

క॥ అమ్మెఱుఁగుబోఁడికెంగే, లమ్మునిమఘువుండు గొనిన ♦ నాపెవిభువియుక్
సమ్మదమెనసె శుభమ్ముల, కిమ్మదియే మొదలటంచు ♦ నెదలఁబొదలుచుక్.

తే॥ పెండిలిమహోత్సవము లెట్లు ♦ పెరసె నట్లు
మండలిమహోత్సవమ్ములు ♦ మలయసాగెఁ
బుష్పవృష్టికిమున్నగాఁబొరసె వృష్టి
జంపతిసమృద్ధికైనయట్ల్యో ♦ సస్యవృద్ధి. ౫౦౫

క॥ ఆనందనకల్లునకతఁ, డానందనవనము యిది య ♦ హోయనఁదగును
ద్యానంబొకఁడాశ్రమముగఁ, బూనికమెయిఁగూర్చి తగిన ♦ పోఁడుము లిడఁగన్.

ఉ॥ రాణఁదలిర్చి లోకులను ♦ రక్తి భజింప మునీంద్ర; విశ్వసం
త్రాణ మొనర్చితీవనుచుఁ ♦ దత్పరతన్నృపుఁడాదరింపఁగాఁ
బ్రాణముప్రాణమట్లు నిజ ♦ పత్ని మెలంగఁజెలంగు నిత్యక
ల్యాణముఁబచ్చతోరణము ♦ నై పదమొప్పఁదపస్వి నిచ్చలున్. ౫౦౮

వ॥ అట్లుంగావున. ౫౦౯

క॥ మనుకులతిలకా; తడయక, మనుజేంద్రునిఁజేరి తత్స ♦ మాధి వెలయ న
మ్మునిశాంతతోడఁదోడ్తె, మ్మునితాంతప్రౌఢిమెయిఁ బ్ర ♦ మోద మెసంగన్.

తే॥ అత్తపసిచందురుండు దోఁ ♦ డగుచునుండ
యాజకత్వంబునెనయునా ♦ యాజ్ఞ నమ్మ
హోమఖాంగ మనంతరా ♦ యముగఁజేయు
మఖిలసాభాగ్యమొదవు నీ ♦ కధిప యనిన. ౫౧౦

క॥ విని యానందామృతవా, ర్ధినిఁదోగెన్నృపతి పార్వ ♦ తీ; వింటివె యం
చనుపలుకు దేనెసోనల, ననబోఁడియుఁదోఁగి పతిమ ♦ నంబలరించెన్. ౫౧౧

### ఆశ్వాసాంతపద్యములు.

శా॥ శ్రీనారాయణదేశికేంద్రచరణా ♦ చింత్యప్రభావోదయ
శ్రీనాళీకభవాదిసద్గురువరా ♦ శీర్వద్ధభావ్యా; శ్రిత
శ్రీనిత్యాస్పదదానశౌండ మథితా ♦ రిప్రేష్ఠహృద్వ్యాస సు
శ్రీనామాకృతికల్పనామహితల ♦ క్ష్మీచిత్ప్రకాశాంచితా. ౫౧౨

క॥ శ్రీహనుమద్గురుమోచిత, మోహావరణజనవాక్స ♦ మూహార్ఘురీపు
ణ్యాపాహాచితాప్లవనధ, న్యోహంధృతితర్పణప్ర ♦ యోగారాధ్యా. ౫౧౩

స్రగ్విణీవృత్తము॥ యజ్ఞనారాయణా ♦ వ్యాజకారుణ్యభా
వజ్ఞసేవాపరా ♦ పారయోగప్రమా
ణజ్ఞధీలబ్ధవ ♦ ర్ణప్రకాశోదయో
పజ్ఞలక్ష్మీస్మకలా ♦ వర్ణితప్రాభవా. ౫౧౪

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథా ఽమృతంబను మహాకావ్యంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### —♦ ద్వితీయాశ్వాసము ♦—

—:(౦):—

కోటీశ్వరగురుహృద
యాకాశదయాప్రకాశ ♦ కానూనకలా
శ్రీకలితసద్గుణాంబుధి
రాకాచంద్రాయితాత్మ ♦ రాజ్యవిలాసా. ౧

—♦ దశరథుండు రోమపాదుని పురంబున కరుగుట ♦—

తే॥ అవధరింపుము శైలరా ♦ జాత్మజాతఁ, గాంచి పలికె గిరీశుండు ♦ గారవమున
నట్లుగురుఁడానయిడ సమ ♦ నంతరం బ, నంతసంతానసంపదు ♦ పాంతకలన. ౨

వ॥ ఆరాజేంద్రుండునుఁదదనుజ్ఞాస్రజంబున మౌళినలంకరించి యాశాసముల్లసితంబుగ నభ్యంచితామోదంబావహిల్ల మంచిముహూర్తంబునం బ్రస్థానంబొనరించి సూతామాత్యసమేతుండై రథారోహణంబాచరించి సాంతఃపురపరివారంబుగా రోమపాదుని పుటభేదనంబునకుంజని పురోపకంఠంబునవిడిసి సమ్మతమ్ము నెఱప నమ్మహీజానిపాలికి నిజానయనసంపాదకంబగు మేలువార్తంబు త్రెంచిన సత్తతిగుణోత్తరుండగు నాన్నృపసత్తముండు సుమహితమహోత్సాహంబున. ౩

చ॥ ఎదురుగవచ్చి కూర్మిగదు ♦ హెచ్చుఁగ ముచ్చటలాడి వేఁడి స
మ్మదమొదవించి తోడ్కొనుచు ♦ మంగళవాద్యము లోలిమ్రోయ సం
పదలకుఁబుట్టినిల్లగు స ♦ భాస్థలి గద్దియఁజేర్చి మేల్పవ
ర్యదనిపి సేమమారసి ని ♦ జాగమనంబెఱిఁగింపవే యనన్. ౪

వ॥ తానునుందదీయంబగు కుశలప్రశ్నంబొనరించి కౌతుకంబుకరంబావేష్టింప నభీష్టావహంబగు నాఋశ్యశృంగుని చరితంబుఁ బ్రస్తావవశంబునం బ్రశంసించి యేతదీయావాసంబడిగి యావాసవవిలాసుండు బాసటయై నిర్దేశింప నయ్యాశ్రమంబునం బ్రవేశంబునెఱపి శరీరబద్ధంబగు బ్రహ్మతేజంబుంబోని వాని స్వరూపంబు సందర్శించి యానందంబు పేరినంద్రంబునం దేలియాడుచుం దచ్చరణారవిందంబుల నిజమానసేందిందిరంబుం బొందుపఱిచి వందనాదికృత్యంబుల నిర్వర్తించి మృదుమధురాలాపంబులొప్పార నిట్లనివిన్నవించె. ౫

క॥ కృతకృత్యుఁడనైతి మదీ, యతపము సాఫల్యమొందె ♦ నఖిలసుధీకాం
క్షితము భవద్దర్శనము గ, రతలామలకంబుగాఁగ ♦ బ్రహ్మణ్యనిధీ. ౬

ఉ॥ ఓచతురాననప్రతిభ; ♦ యుజ్జ్వలనైజతపఃప్రకాశ మ
త్యాచితలోకమై మెఱసె ♦ నన్యమిఁకేలగణింప నీవ యి
ట్లీచరితాఢ్య సువ్రతఁగ ♦ హించి గృహిస్థితినిల్చుటెన్న నీ
రాచకొలంబుపాలి శుభ ♦ రాజ్యరమావిభవంబకాదొకో. ౭

క॥ ఒక్కండననేల జగం, బొక్కట మనుపంగఁదలఁచు ♦ నోజయు తక్కన్
జిక్కునె హేతువు త్వాదృశు, లిక్కరణిని భూతధాత్రి ♦ నెనయుటకు మునీ. ౮

ఆ॥ బ్రహ్మమునివరుండు ♦ పరమేష్ఠియైన క, శ్యపుని కొలమువెలయ ♦ నవతరించి
బ్రహ్మనిష్ఠులరసి ♦ బ్రహ్మనిష్ఠుండితం, డొక్కఁడనఁగ మెఱసి ♦ తోజఁదపసి! ౯

క॥ అంజలినిడి యర్థింతుని, రంజనభావోపవేశ ♦ హాపితదురితా
భంజితతామసగుణ మృ, త్యుంజయవైభవ మహామ ♦ హోజ్జ్వలచరితా.

ఆ॥ ఏనురవికులీనుఁ ♦ డిక్ష్వాకుసంతతి, వాఁడఁ గోసలాఖ్య ♦ వఱలుదేశ
మేలువాఁడ నొక్క ♦ మేలునకై భవ, ద్దయనుఁగోరినాఁడ ♦ దశరథుండ. ౧౧

క॥ ఇష్టి యొకఁడు సాధింపఁగ, నిష్టిందలపెట్టినాఁడ ♦ నీ రరుదేరన్
బుష్టిఁగనునది ♦ యనెడుసం, తుష్టింగొనివచ్చినాఁడ ♦ ద్రుహిణసదృశా. ౧౨

తే॥ అయ్య; నీవును నీపత్ని ♦ యనఘ శాంత
యునుఁ గతిపయాహములు నాథ ♦ వనము సభము
సేయుఁడు పదాబ్జరజమునఁ ♦ జిత్తగించి
దానధన్యతముఁడనౌదు ♦ జ్ఞానసదన; ౧౩

క॥ అంగేశుంగరుణించి త, నం గరుణకుఁ బాత్రుఁడితఁడు ♦ నాదగుమేలే
నుంగంటి నాఁడె తత్ఫల, సంగతి చూపట్టునట్టి ♦ సమయంబొదవెన్. ౧౪

తే॥ అనివినిచి మానివల్లినా ♦ నపుడు నృపుఁడు
రోమపాదునిఁ దిలకించి ♦ రోమహర్ష
ణంబెసఁగ స్వాత్మభావని ♦ ర్ణయము దెలిపి
పలికె వచనామృతఘటంబుఁ ♦ బంచినటుల. ౧౫

ఉ॥ తమ్ముఁడ; నీవు నేను నొక ♦ తల్లియపత్యము లన్నరీతి నే
స్తమ్మున నుందు మట్లగుట ♦ సద్గుణపాలికిఁ బట్టుకొమ్మ శాం
తమ్మను భర్తతో మదుది ♦ తమ్మగు యాగముఁజూడ నానిశాం
తమ్ము శుభమ్ములంబెనుపఁ ♦ దావకచిత్తము సేర్చి యంపవే. ౧౬

ఉ॥ ఈచనవీవొసంగ ధర ♦ హెచ్చెద నందఱిలోన మెచ్చునా
యాచకభావము న్సఫల ♦ మానటు సేయుము ఫీరినంపు మా
లోచనకోప కమ్ముఖ మ ♦ లోపముగా సుగుణాఢ్య; కూర్చుమ
ద్వాచికమంది తోనె పరి ♦ వారముతోఁ జనుదేర నెంచుమీ. ౧౭

క॥ అన్నా; పుత్రులఁగనలే, దన్నాలీకాక్షుకరుణ ♦ నావల నేమో
యున్నాడ నేఁడు పుత్రిఁడ, యున్నాకిదె యంచుఁగూర్మి ♦ నోయన నతఁడున్. ౧౮

శా॥ నా నీ సందున భేదమెన్నవలెనా ♦ నాబిడ్డ నీబిడ్డ బ్ర
హ్మానందంబన నీవె నేనను సుఖం ♦ బౌఁగాదె మాయన్న; యెం
దేనిన్నిత్యము లే; సుతాదులు సతం ♦ బీధాత్రి సత్కీర్తి కొం
పో; నీచిత్తమటన్న నానృపతి సం ♦ పూర్ణాభిలాషాఢ్యుఁడై. ౧౯

తే॥ శాంతఁ గీర్తిలతాసమా ♦ క్రాంతదశది
శాంతఁ దత్పతిఁ దోడ్కొని యంతరంగ
మంతయును సంతసముగా నృ ♦ కాంతుఁడనుప
నంత శుభలగ్నసద్ఘటి ♦ కాంతరమున. ౨౦

—♦ దశరథుండు శాంతాఋశ్యశృంగులం దోడ్తెచ్చుట ♦—

వ॥ బయలుదేరి దవ్వేగకయమున్న యన్నలినబంధుకులుండు కనుదమ్ములవలననుండి యానందబాష్పమధుకణమ్ము లురలఁ బ్రీతివచనపురస్సరంబుగా రోమపాదునా మంత్రణంబొనరించి మరలించి స్యందనారోహణంబు సేసి మున్నాడి యమ్ముని దంపతుల నుచితక్రమంబునందగుచోటునఁ గూర్చుండంబొనరుపఁజేచి తదనుమతిం దానును నట్లాచరించి యుభయపార్శ్వంబులంబరివారజనంబులు మంగళప్రద వాక్ప్రసంగంబుల జేజేవెట్టుచుండ నఖండవేగంబునంగొండొకదివసంబునకు నిజ రాజధానియగు నయోధ్యానగరిఁదఱియవచ్చునంతలోనన తనపుత్తెంచినచారుల

చేవిని పౌరు లప్పురీరత్నంబు నలుగడలం బన్నీట నీరార్చియు మౌక్తికాదివితానం
బులమర్చియు మణితోరణంబులం గూర్చియు వింతవింతవైజయంతికలఁ జేర్చియుఁ
గస్తూరికాదిసమస్తపరిమళద్రవ్యంబులం దార్చియు నెల్లెడలఁ గృష్ణాగరుసువాసన
లల్లిబిల్లిగొన నుల్లసిల్లి చెన్నారుధూపవస్తువులయొయ్యారంపుఁబొగలవగలొలయ
గుబులొత్తనువింతవలపులకుం దోడునీడలగు మల్లెలు మొల్లలు బంతులు చేమం
తులు లోనగుపూలవల్లరులం గొల్లలుగాఁ గీలుకొలిపియుఁ బచ్చకప్పురంపురజముల
మొల్లంబుగా నెల్లవీథుల ననలపఱుపులపయిం జల్లియుఁ గైసేయ నెడలేనివేడుక
నలరారు నాప్రోల్లచ్చి తొలుదొల్త జలకం బాడియు మేలిపుట్టమ్ముఁ గట్టియు మేటి
సొమ్ములు వెట్టియుఁ గమ్మని నెత్తావులం గ్రుమ్మరించు విలేపనమ్ముల మెమ్మెలందులకిం
చియు ధూపధూమమ్ములం దడియార్చియు విరులు ముడిచియుఁ బూవుసెత్తులలంక
రించియు నిరూపింప నల్లనాఁటిజగన్మోహినియో నాగ నాయత్తమై క్రొత్తసెజ్జ
సజ్జితంబొనరించుకొని తోడ్తోనప్పుడమిఱేని యడుగులకు మడుఁగులుంచి ప్రతీ
హారంబున మించి ప్రేమించి నిరీక్షించుచుం బ్రకాశించె నంత. ౨౧

తే॥ సచివు లాప్తులుఁ బౌరులు ♦ నుచితముగను
మంగళాతోద్యరవములెస్స ♦ లంగ నెదురు
వచ్చి తోడ్కొనిచనఁ గూర్మి ♦ హెచ్చి విభుఁడు
సొచ్చెఁ బురతోరణము వింటె ♦ మచ్చెకంటి. ౨౨

క॥ మంగళములు పాడుచుఁబు, ణ్యాంగనలారతులొసంగి ♦ యక్షతలిడఁ బ
ణ్యాంగనలాడఁగ స్మరరుచి, రాంగుఁడు సౌధాంతరమున ♦ కరుదెంచు నెడన్. ౨౩

క॥ మనపాలిటి భాగ్యంబే, మన వచ్చు నపత్యమొసఁగు ♦ నట్టిక్రతువు నీ
యనఘుఁడు పొనర్చెనఁట యొ, య్యనవౌసఫలమని గురువు ♦ లయ్య వచింపన్.

మ॥ తరుణీ ; వీరలు దక్షిణాధ్వరములో ♦ తర్కింప గాఁడిందుశే
ఖరులో ; వాక్పరమేష్ఠులో ; భువనర ♦ క్షాకాంక్షులై యుంట ని
ర్ధర వర్తింపఁదలంచి లచ్చిహరియుం ♦ దారిచ్చమై వచ్చిరో
వరణీయద్యుతు లెందుఁ దెచ్చె నృపుఁడి ♦ వ్వామాక్షి నీవిప్రునిన్. ౨౪

తే॥ అమ్మ ; యీతండు ఋశ్యశృం ♦ గాఖ్యమౌని
మాన్యుఁడానందమయుఁ డసా ♦ మాన్యతేజుఁ
డితనిసత్పత్ని శాంతినా ♦ నెసఁగుకాంత
రోమపాదునిసుత యాన ♦ రోజనయన.

క॥ ఘనుఁడు వశిష్ఠుఁడు నృపునీ, యనఘులఁదోడ్తేరఁబనిచె ◆ నఁట శుభమునకా
సునయుఁడు నెయ్యఁపుటల్లుని, ననుఁగుంగూఁతునటు దెచ్చె ◆ ననుమతి వీరిన్.

తే॥ అనుచుఁ బ్రోల మరాలగా ◆ మినులు వేడ్క
నొండొరులు ముచ్చటలఁదేలు ◆ చుండ ధరణి
కాంతుఁడానందపూరసం ◆ క్రాంతుఁడగుచు
మందిరాలిందమందె రా ◆ కేందువదన. ౨౮

సీ॥ మెఱుఁగునిగ్గుల నీను ◆ మేను లానకమున్నె, రత్నాభ లినువేరు ◆ రమున వ్రాలఁ
గుచకుంకుమము పైఁట ◆ కొంగు దాఁటకమున్నె, యనురక్తి ప్రియునెద ◆ నావరింపఁ
గపురంపుటారతు ◆ ల్గనుల నద్దకమున్నె, వాలుఁజూపులచాల్మి ◆ వాళు లొసఁగ
వలచుపన్నీట నం ◆ ఘ్రులు గడుగకమున్నె, ప్రమదాశ్రువులు దృగ ◆ బ్జములఁదోఁపఁ
గలసి మేల్వార్తలరయుట ◆ కన్న మున్నె
ముచ్చటలఁ గంకణక్వణ ◆ మ్ములు ఘటింపఁ
గోసలాత్మజ లోనగు ◆ కూర్చుకాంత
లెదురుకొనిరంత సమదగ ◆ జేంద్రగమన. ౨౯

తే॥ పసిఁడికీల్బొమ్మలన లీలఁ ◆ బరఁగు చెలులు, చెలఁగి కైదండలిడ విభుఁ ◆ జేరిభక్తి
సముచితసపర్యలొనరించి ◆ సద్వితీయు,నంయమీంద్రునిఁగాంచియం ◆ జలిఘటించి.

వ॥ సముచితవిధులంబూజించి సంభావనాపూర్వకంబుగఁ బ్రార్థించిరి పదంపడి యమ్మ
హీజానియు వారల యథార్హస్థానంబునవిడియించియు నాయావేళల నయ్యైయుప
చారకృత్యంబుల నొనరింపందగువారి నెల్ల నియోగించియు ధర్మపత్నీసమేతంబుగా
నేతదీయంబులగు ననారతశుశ్రూషావిశేషంబులందలిపారవశ్యంబునందవిలి ధన్యా
త్ముండననుచు సుఖంబుండి యంత. 3౦

చ॥ తనసతులెల్లరున్విన ను ◆ తాతిలకంబన శాంతఁగా మనం
బున నిడినాఁడఁ బ్రాణసమ ◆ బుద్ధిఁ గనుండన మున్నె చెల్వొభా
వన ధృతిఁగాంచియుంట సుఖ ◆ వార్ధి మెలంగెడు వారిసాత్త్వికా
ప్తినిఁబునరుక్తతంబెరసెఁ ◆ బ్రీతివచోర్ఘురి జీవితేశ్వరీ. 3౨

తే॥ సొమ్మునఁగనద్ది నీవెమా ◆ సొమ్మటంచు
మేలుసంప్రీతిఁగూర్చి మ ◆ మ్మేలుమనుచుఁ
జనవొసఁగఁగొనఁదనరు యో ◆ జనలనెంచి
కుందనఁపుబొమ్మ; పొగడ నా ◆ కుందరమ్మ. 33

తే॥ అట్టు లంతకునంతకు ♦ నతిశయిల్లెఁ
దొంటికన్నను శాంతపైఁ ♦ దొడరుపెరిమ
పుత్రవతియయి భర్తతోఁ ♦ బొరసిరాఁగ
నాగుణాఢ్యందు బ్రహ్మాయా♦టచ్చుపడఁగ. ౩౪

ఆ॥ అంతిపురిపొలంతు ♦ లందఱు దనపైనిఁ, గన్నులునిచి పేర్చు ♦ గరిమగూర్చు
పూజలెనయఁగాంచి ♦ పుణ్యాంగనామణి, భర్తఁబొసి యచటఁ ♦ బరఁగుచుండె.

క॥ ఇచ్చెలువున మునిఁదోడ్కొని, వచ్చితి భవదాజ్ఞ నిచ్చు ♦ వచ్చినకృతులన్
మచ్చికమెయి నెపుడెది సెల, విచ్చెదొకదె యనవశిష్ఠుఁ ♦ డిట్లనిపలికెన్. ౩౫

తే॥ శుభము నీకగు నింకవ ♦ స్తువులు గూర్చు
మనఘ ; జన్నమునకు దేవుఁ ♦ డనఁగ సమయ
మనఁగ నొండొక్కఁడెరవులే ♦ దంద్రు బుధులు
గాన వలెఁజుమ్ము సత్కాల ♦ గణనసేయ. ౩౬

క॥ రాఁగలవసంతమున సుత, రాగలహరిఁదేల్చుక్రతువ ♦ రమొనర్చుము సా
రాగమతత్త్వైకవిచా, రా ; గమకించు నపుడింది ♦ రాధిపు కృపనాన్. ౩౭

—♦ వసంతఋతు వర్ణనము ♦—

శా॥ భవ్యంబింతటికన్ననేది విలస ♦ త్ప్రజ్ఞాన ; నీయానఁ గ
ర్తవ్యంబేర్పడు మాకు నిచ్చలని త ♦ త్ప్రాథమ్యమీక్షింప సం
భావ్యుండిప్పుడధీశుఁడంచు ముదమొ ♦ ప్పన్వచ్చె వేవే మధుం
డవ్యాక్షేపము కార్యసిద్ధిపిశునం ♦ బొఁగా నగేంద్రాత్మజా. ౩౮

మ॥ పవనస్నిగ్ధత చంద్రనిర్మలత ది ♦ గ్వైశద్య మంభోజబృం
దవికాసంబు సరశ్శుచిత్వ మలిగా ♦ నశ్రీ పికాభాష గ్రొం
జివురు ల్మంజరు లేమునేమునని వ ♦ చ్చెన్నాని వెన్నాని యా
నవరత్నంబు లొక్కొక్కచోట నను నా ♦ న్యాయం బుపేయంబుగాన్. ౪౦

తే॥ అట్టి శుభలక్షణము లాయి ♦ యత్తు వరసి
యామెత ఘటించెఁ దనకితం ♦ డనుచు దోహ
దంబుడంబు వసంతోత్స ♦ వంబొనర్పఁ
దద్గుణములోలి మెఱసె శా ♦ తమణులనఁగ. ౪౧

క॥ సుతుఁడైననేమి ; యంతకుఁ, డితనిదెస న్దనకుఁదేజ ♦ మెసఁగదు మనుసం
తతి యందవుఁ దత్సంగతి, శతగుణయని రవి యుదగ్ది ♦ శన్ వర్తించెన్. ౪౨

ఆ॥ లోకబంధుఁ డివము ♦ లూనంబొనర్చి యు, హార్మ్యముఖముల కొచ్ఛ్య ♦ మందఁజేయు
నపుడె మెఱసె జగము ♦ హంసప్రకాశంబు, వడయునంత జడత ♦ వాయుటెంత.

తే॥ పవలులేకున్న విరహాగ్ని ♦ బడలుచుండు
ద్విజులఁ బ్రోవనో; కోసల ♦ దేశమున ప
నందుగాంచనో; నలినీప్ర ♦ సంగముననో;
మెల్లమెల్లన నడిచె న ♦ మ్మిహిరురథము. ౪౪

ఉ॥ తప్పదలద్గు లప్పుడిడెఁ ♦ దా మలయానిలబాలకుండు బ
ల్విప్పుగఁ బైరుపంటలొద ♦ వెణ్ ఝురనీరము సారమయ్యె మే
లొప్పనసేయుపండువుల ♦ యుబ్బుఘటిల్లెను మాధవోదయం
బొప్పనకాదె చొప్పెనసి ♦ యుర్వర సర్వగుణాఢ్యమై తగన్. ౪౫

క॥ తనచెలువురాక మలయుప, వనుఁ డెఱిఁగింప వనపద్మ ♦ భద్రస్నానం
బొనరింపఁ దాల్చుచేలం, బనఁ బాండురపత్రతతి ద్రు ♦ మావలి నిండెన్. ౪౬

మ॥ అలరుంగారను నాటకాఁడు రతిరా ♦ జామోదిగాఁ బుష్పవం
తులదివ్వెల్వెలయించి కోయిలలగీ ♦ తుల్పాగ మేల్గోత్తరం
గుల బొమ్మల్వెలిపాటుటాకులముసుం ♦ గుల్దోచి రూపించెనా
వలరెంగొమ్మల నందఁపుంజివురులు ♦ దృత్పద్మరాగద్యుతిన్. ౪౭

తే॥ పైక ముత్సాహ మామని ♦ పైఁడివర్తఁ
కుండరసి మున్నుఁ దనయొద్దఁ ♦ గొనెడు నెఱిఁబ్ర
వాలముల గెంపుల ముగించి ♦ వానిమ్రోలఁ
బచ్చలిడె నాఁగ నిగురులఁ ♦ బసరుదోఁచె. ౪౮

క॥ మలయపురుత్ప్రేరణ లతి, కలుఁ దరువులుఁ జివురు లమరఁ ♦ గలసి పికిలికౌఁ
గిళుల రతిఁగులుకనొవుల, కల చాలనఁ గోరకప్ర ♦ కరమొప్పె వనిన్. ౪౯

చ॥ నిగనిగమించు కుంకుమఁపు ♦ నిద్దఁపురక్తిమ రోచనప్రభన్
మృగమదలక్ష్మిఁ గప్పురఁపు ♦ మేల్జిగిఁ గూటమిచాయఁ దీఁగెల
న్మొగుదల పూవుగుత్తులను ♦ ముద్దు కుచంబులు గాననొప్పెఁ దేఁ
టిగుములు కాముకస్థితిఁ గ ♦ డించిన కామతపఃఫలంబులై. ౫౦

సీ॥ సిరిమించు వికసించు ♦ జిగిఁగర్ణికారము, ల్పసిఁడిసొమ్ములసొంపుఁ ♦ బరివహింప
నెలదుమ్మెదలయెమ్మె ♦ లెనగూడి తిలకమ్ము, లలకమౌక్తికకాంతి ♦ యొలపుసూప
వగతావులకు దీవు ♦ లగు కురవకరజ, మ్ములు మేలిమైపూఁత ♦ మురువుదెల్ప
లలిఁ గ్రొత్తతళుకొత్తఁ ♦ గల కింశుకసుమంబు, లంఘ్రిలాక్షారక్తి ♦ నవధరింప

మొగడమల్లెలగుమి చీర ♦ ముద్దుఁజిలుకఁ
జిలుకపలుకుల స్వారస్య ♦ మొలుక నవ్య
రమ్యశుభలీల మెఱసె నా ♦ రామలక్ష్మి
మాధవసమాగమవిశేష ♦ మహిమ నపుడు. ౫౧

క॥ అలమాధవరమ మోహిని, పలాశసుమనోవిభాగ ♦ పరమై సుధన
వ్వలితెగ కొసఁగిన తొలికథఁ, దలపించుచుఁ బూవులంబొ ♦ దలె నునుదేనెల్.

తే॥ విప్రయోగులు స్మరసూన ♦ విశిఖపాలి, శారికోర్వాక తదుపసం ♦ హారమునకు
హారునిచే సిద్ధఘుటికల ♦ నొరసి చల్లి, రన శలాటువులందె నం ♦ దంద విరుల.

ఉ॥ ఒక్కటఁబూవుగుత్తులటు ♦ లుజ్జ్వలఁపుంజివురు ల్మఱొక్కచోఁ
జక్కనిపూపపిందె లొక ♦ చక్కి నిఁకొక్కెడ దోరగాయ లొం
డొక్కెడ మేలు మేలిమియు ♦ నుంకువపెట్టెడుపండ్లుఁగూర్చునా
చక్కెఱవింటివాని ఫల ♦ సాయమ యామని యేమనందగున్. ౫౪

ఉ॥ తేనియసోనలందనియు ♦ తేఁటులపాటలు లేఁజివుళ్ళపా
లాని కిలార్చుకోయిలల ♦ యార్భటులు న్ఫలసారతృప్తిసం
దానితకీరవాక్సభలుఁ ♦ దామరసాకరభూశుచిద్విజా
త్యానతికృత్పదక్రమవి ♦ హారములు న్మధురాడ్వినోదముల్. ౫౫

సీ॥ చందురుఱాతిన్నె ♦ లందుఁగూర్చుండుట, యెలదోఁట మెలఁగుట ♦ యెలమిమీఱఁ
బూవులుగోయుట ♦ బూమెల్ ఘటించుట, కృతకాద్రులెక్కుట ♦ కృతులరయుట
సంగీతసాహిత్య ♦ సరసలాస్యాదుల, నెఱి నెఱుంగుట కలా ♦ నిర్ణయంబుఁ
గనుట కేళాకూళు ♦ లను విహరించుట, కందుకాదిక్రీడ ♦ లందాడనుట

యుయ్యేలలనూఁగుట రతీశ్వ ♦ రోత్సవమ్ము
లధ్వరములు శుభక్రియ ♦ లాచరించు
టరయ నిన్నియొపీనిపై ♦ నన్నియోవ
సంతకృత్యంబులాటల ♦ క్ష్యంబకాదె. ౫౬

క॥ మలయజములు హిమజలములు, వలిమంచుకరుళ్లు కుసుమ ♦ వల్లులు కపుర
మ్ములు వట్టివేళ్లుఁ దొల్తనె, యలయికయన కాముకొందు ♦ రామని రసికుల్. ౫౭

తే॥ ఒండెడలనె మెలంగుచు ♦ నుండు మలయ,
జములచట మెండుకొనియుండు ♦ సమయములను
బూఁతకామని నవికొన్ని ♦ వో నవాచిఁ
దెలిపిగను గొడ్పనుటయొక ♦ తీర్పు గాదె. ౫౮

ఉ॥ చందనసేవలం గోమల ♦ జాజులపయింటల చాలనంబులం
గందువ లందఁగాంచుట ర ♦ కంబగు తెమ్మెరయెమ్మెలాను మే
లొందఁగ బైళ్లకెక్కుట క ♦ వుంగిటఁజెల్వ చెలంగ లౌకికా
నందరసాప్తి మించుటయు ♦ నాఁజనుశ్రీల వసంతుఁడే యిడున్. ౫౯

ఉ॥ మల్లియపూవుసెజ్జపయి ♦ మైఁగదియింత్రు హిమాంబువింతపైఁ
జల్లిన వీవనందనరు ♦ చల్లనిగాలిని హాయిగాంత్రు సం
సల్లలితంబుగాఁ గలిత ♦ చాంద్రశిలామయవేదికాస్థలిం
బల్లవపాణులంగొని క్ష ♦ పాకరుమెచ్చి సుఖింత్రు శ్రీయుతుల్. ౬౦

సీ॥ పూవుదీవియఁబోని ♦ పొలఁతిమే నల్లిబి, ల్లిగఁబెనఁగొన బైళ్ల ♦ సాగియువారు
వగలాఁడినెమ్మోము ♦ జిగిఁగాంచి నిండుజా, బిల్లిఁగన్గొని తప్పు ♦ వెదకువారు
ముద్దులాఁడి రసంపు ♦ మొలక మోవికిఁదక్కి, పుక్కిటిసుర వారఁ ♦ బోయువారు
సుకుమారి కలయికఁ ♦ జొక్కెఁబో యని కూర్చు, సతికి వీవనసేవ ♦ సలుపువారు
కోమలచన వింతలింతలు ♦ గోసరువారు, కలికిమిన్నల పోఁడుము ♦ గాంచువారు
చేడెల రసోక్తులకు మెచ్చు ♦ లాడువారు, మెచ్చరె బళీ; వసంత; మే♦ ల్మేలటంచు.

క॥ అన్నిట నరభవముత్తమ, మన్నెలవునఁ దపము దాన ♦ నౌదానమె యం
దన్నోదకోపకృతి యన, వెన్నునిసిరియా వసంత ♦ విలసన మసదే. ౬౨

ఉ॥ మెల్లఁగగాలివీచునెడ ♦ మేలిగృహమ్మును బ్రోలఁ జల్వపం
దిళ్లు నమర్చి పాంథులకు ♦ నిమ్మరస మ్మలసొంటి యుప్పుఁబైఁ
జల్లిన నీరుమజ్జిగ ర ♦ సాయన మంబలి పేలపిండియుం
జల్లని మాచినీరు నిడి ♦ శ్రాంతివెలార్తురు ధన్యులత్తరిన్. ౬౩

ఉ॥ వందురి నీరువట్టెసఁగ ♦ వచ్చిన పాంథుల నిచ్చగించి యిం
పొందఁగ శీతలోదకము ♦ నోగిరము న్నెతిఁగూర్చి వేడ్కమైఁ
జందనచర్చల న్ఫలర ♦ సంబుల వీవనల న్ముదంబుగా
ర్పందగు భాగ్య మిట్టిదగు ♦ పట్టునఁగా కొకటల్లభించునే. ౬౪

ఉ॥ కమ్మనిభోజనమ్ము నొడి ♦ కమ్మఁగఁగూర్చి విడెమ్ముసంగి తా
నుమ్మలికమ్ముఁబాపు శిశి ♦ రోపకృతుల్ వెలయించుగేస్తులా
యమ్మల కంకణధ్వనుల ♦ నమ్మెయిఁజాటఁగ నిట్టిమేటిభా
గ్యమ్ము తలంగె మాకని ర ♦ యమ్మునఁబోదురు పాంథులిండ్లకున్. ౬౫

సీ॥ ఈవసంతమెకదా ♦ యెంతవారలనైన, ననురాగకృతిఁజిందు ♦ లాడఁజేయు
నీసురభియెకదా ♦ యెట్టివారికి నెట్లు, నభిలషితార్థంబు ♦ లందఁజేయు

నీమధువేకదా ♦ యేవిరాగులకును, నోరూర నూఱుము ♦ న్నూఱుసేయ
నీపుష్పపుందఱి ♦ యేకదా యేరికి, నేని శోభనలక్ష్మి ♦ నెసఁగఁజేయ
నిట్టిదగుమాధవప్రాప్తి ♦ యెవరికిడదు, నవనవోత్సవకలన న ♦ నారతప్ర
వర్ధమానరసానుభ ♦ వప్రకార, సంచితానందతృప్తి ప్ర ♦ పంచగతిని. ౬౬

మ॥ కలలెల్ల న్వెలయింప సంబరములై ♦ క్కంజేయ జేజేలపూ
జలఁ గల్యాణములం బ్రతిష్ఠల మహా ♦ సన్నాహమొప్ప న్ఘటిం
ప లతాంతాస్త్రరసోపహారవిధులం ♦ బ్రావీణ్యముంజూప ని
య్యల నిన్నింట నొకండు నేర్పుగనునే ♦ యిక్కాలమే తక్కఁగన్. ౬౭

క॥ అంతంతకెక్కుడగుచు వ, సంతము గ్రీష్మాదిరూప ♦ సంవాదిగ నొ
క్కింత గనుమార్పు నొకఁడా,భ్యంతరుఁడై సిరులఁగొని య ♦ హంయువు గాఁడే.

శా॥ చిందుల్ద్రొక్కె నొయార్ల నెమ్మొగములం ♦ జిన్నారిపొన్నారిమే
ల్కందు ల్చెమ్మటబొట్లు ముత్తెములచా ♦ క్కాటంబు సంధిల్లఁదీ
రొందె న్బాష్పమొకింతవింతగ హిమా • ర్ధోల్లాసముల్మీఱె ని
ష్పందత్వంబున మాఱెఁదెమ్మెరల వ్యా ♦ పారంబు దూరంబుగన్. ౬౯

సీ॥ పన్నీరు గోరునా ♦ తెన్నున మంచుగ, డ్డలనీరు వలదన్న ♦ తలఁపులేదు
మలయజంబలదున ♦ వ్వలనునఁగపురంపు, రజము పైఁజల్లఁగా ♦ రామి లేదు
వట్టివేరులు గూర్చ ♦ పట్టున బొంబమ్మ, గాలిక ల్దగవన్న ♦ జాలి లేదుఁ
విరిపూల నేర్చిన ♦ వ్విసువుసఁ గిసలయ, మ్ము లిఁకేల యనునింత ♦ పలుకులేదు
విరహపరితాపభరమొ య ♦ వ్వ్యాధి యొసఁగిన
వరమొ మదనునిగెలుపుతీ ♦ వరమొ మధుని
కావరమొ తత్త్వమించుక ♦ గానఁబడక
పాము ముదిసి గా మగుభంగి ♦ నాముకొనియె. ౭౦

క॥ అప్పటికప్పుడు సౌఖ్యం, బుప్పతిలుంగాక కొఱఁత ♦ యుంగునె యదియే
చిప్పిలు రసవైభవమన, నొప్పగు మఱిభాగ్యవంతు ♦ లానరికఁగనరే. ౭౧

ఉ॥ నాఁటివసంతమే పగటు ♦ నందులకించె ననంత నంతటన్
బాటిలె వింతవింతగనుఁ ♦ బార్థివుదేశమునం దయోధ్యలో
మేటితనంబుసూపె నటు ♦ మేలెదఁగోరెడువారి వారిస
య్యాటలు నంతగాఁబ్రబలె ♦ నందములందనరారి రందఱున్. ౭౨

క॥ శృంగారభూమికలు కళ, బంగారఁపుబొమ్మ లొఱపు ♦ పట్టున నడిక
ల్శింగామతురంగములగు, నంగన లామనికిఁగూర్తు ♦ రద్వైవిధులన్. ౭౩

సీ॥ ఉయ్యాలలూఁగుదు♦రొయ్యారు లాకొన, గోళ్ళఁజుక్కల మీటు♦గోటు వెలయఁ
జేరియాడెదరు మి ♦ టారులు వనిఁజాయ, వనదేవతల నూఁదు ♦ వాదుతనరఁ
గాలూనుదురు హరాంత ♦ కారులలంకృతి, స్థితి మారుసతిఁగేరు ♦ తీరుమీఱఁ
గథలుగూర్తురు మాట ♦ కారులు కలన వా, గ్దేవి యాదలనూఁపు♦తీవు దోఁపఁ
దానగోష్ఠిఁజరింత్రు సు ♦ తారులు సుర
మానినుల యాత్మలఁగరంచు ♦ పూనిక తగ
శ్రీతనయజగతీజయ ♦ శ్రీతనయ ల
వేలగుణాలగు మధుమాస ♦ వేళలందు. ౭౮

శా॥ కెంగేళ్ళంజివురాకులుం జరణల ♦ క్ష్మి స్మిట్టదమ్ముల్సకీ
యాంగచ్ఛాయలఁగర్ణికారము లురో ♦ జాస త్తిఁబూగుత్తులున్
సింగారంపుహారంగులంగరువలిం ♦ జిట్టాడు లేఁదీవెలున్
రంగారందులకింతు రాంద్రు ప్రమదా ♦ రామాభిరామాకృతిన్. ౭౯

## —♦ పుష్పాపచయ వర్ణనము ♦—

క॥ అత్తతిఁగొమలు మదనురా, హుత్తుల హరాయలుల్లసిల్ల ♦ నొగి సంమోదా
యత్తలగుచుఁ బూదోఁటల, జిత్తజములుకులు గ్రహింత్రు ♦ జిహ్వాంబులుగన్.

సీ॥ గానబువీణియ బాటఁ♦గుదియించు తమపాటఁ, బాటించి తేంట్లుది♦గ్బ్రమణమొంద
మురళిరంధ్రమ్ముల ♦ మూయించుతమగళ, ధ్వనికిఁ గోయిలపిండు ♦ తన్నుకొనఁగఁ
బలుకుజంత్రఁపుఁగులుక్కు ♦ నులికించు తమపలుకు, లెఱిఁగి చిల్కలుతల♦ లింతసేయఁ
గీలుబొమ్మలహద్దు ♦ గేడించు తమముద్దు, నడకు హంసలు పదా ♦ నతి వహింప
నెమ్మిలొదుఁగుచు శుశ్రూష ♦ నెమ్మిలరయఁ
గోరువంక లుదరత్రిప్తిఁ ♦ గోరుచుండ
నెమ్మెలాఁడులఁ జీరుచు ♦ నెమ్మిలొలయఁ
బూవులు గ్రహింతు రత్తతిఁ ♦ బూవుబోండ్లు. ౮౭

రగడ॥ కొమ్మ, రెమ్మకదె ♦ గొనకొనిసాగెను, గమ్మపుప్పొడి ర ♦ కమ్ముగ రేఁగెను
ఏఁల; తాంతిగొన ♦ నేల తగ న్నడి, మాలతాంగి గనె ♦ మాధవి మున్నడి
ఎలమావి రుచుల ♦ కేకతమే కదె, చలమూ ; విదిర్ప ♦ సల్లకి సోఁకదె
నిలిచె నప్పెచెలి ♦ నిమ్మలనీడల, మల సెనేమొ కదె ♦ మల్లెలజాడల
చివురుగన్న పఖ ♦ చిఱచిఱ లాడెదు, నివురుగొన్నశిఖ ♦ నెలతుక; గూడెదు
చాయకెక్కెఁ జెలి ♦ సంపఁగివల్లరి, మాయమాటలు సు ♦ మా; యదికల్లరి
కోరికోరిగొనె ♦ గోరఁటనాయమ, నారిపేరి లత ♦ నాకిడు నాయమ

పలికె మున్నె కోమ ♦ వల్లిక ముట్టకు, ములికెఁ దేంట్లకది ♦ యోపదు చెట్టకు
వాసంతిక నధి ♦ వాసిత యాస్థలి, కాసంతయు గడిగానద యీచెలి
తిలకమొప్ప వన ♦ దేవత కులికెడు, బలుకు మప్పడఁతి ♦ పాపము తలఁకెడు
చందు జాపలక ♦ జాఱునుఁగాలిడ, ముందు రామకగు ♦ మొల్లలఁ బాలిడ
తేనెవాఁకఁ బుప్పుఁ ♦ దీవియ తోఁగెడు, మానె వాద మలి ♦ మండలి మూఁగెడు
వనలక్ష్మికి నీ ♦ వ్రతతియె మూలము, ఘనలక్ష్మికి సరి ♦ గాదె తమాలము
పొలఁతి యెగ సెఁదాఁ ♦ బుప్పొడితిన్నెకు, నలఁతిపడునె సతి ♦ యానన వన్నెకు
అందమయ్యెఁగన ♦ కాహ్వాయ యపెకను, మందమా మలయ ♦ మారుత మింకను
కలికి; కానకిదె ♦ కదవే దీపము, పలికి బొంక దది ♦ పదవే పాపము
వాతెఱ చిగురని ♦ వచ్చెనుఁగోయిల; యీతెఱఁగున విరు ♦ లిచ్చెఁగదే యిల
అలయింపకుఁడిటు ♦ లాలతకూనను, నెలయింపఁడె ప్రియుఁ ♦ డీలతకూనను
నెలఁత; మానుమది ♦ నే మును గన్నది, యలతక్కోలక ♦ మావల నున్నది
పురుషసంగతినిఁ బొదలెడు నీలత, పరుషమాడె నిదె ♦ పడఁతిసుశీలత
కేసర మ్మువిద ♦ కేసరి పోసిరి, మీసరమ్మగుఁజు ♦ మీ సరమీవిరి
ఆయశోకసగ మాయమ కోరెను, మాయు శోకమిఁక ♦ మగఁడిలు సేరెను
పొగడ నేర్తువటె ♦ పుష్పము లమ్మెయిఁ, బొగడనేర్తువటె ♦ పుష్పము లమ్మెయి
కేళాకూళుల ♦ కెలనఁ జరింతుమె, వేలావల్లుల ♦ విరుల హరింతుమె
చెలువ; యాకోలను ♦ శ్రీకేకాంతము, కలువపాళె మిఁకఁ ♦ గాదే కాంతము
ఆనికాంత పిటు ♦ తా విహరింపఁగ, మానికాంత మది ♦ మానె హరింపఁగ
ఏమనిచెప్పఁగ నింతులపొదలిక, లామని యువతిమ ♦ యమ్మల పొద లిఁక. ౭౮

క॥ రేలుంబవళ్ళు నాకాం, డ్రాలలి నామని యమాని ♦ నలరుసిరులకుఁ
వాలుంజూపుం దేఁటుల, పాలిడి తమపాలుగానఁగఁ ♦ బొల్పడుదు రొగిన్.

క॥ అంతటఁబూవుంబోఁడుల, నంతకు సొమ్ములగుపూల ♦ హాళహాళిఁగొని తా
రంతకు నోపుచు జనిత, శ్రాంతిఁదొలంపఁదమకింత్రు ♦ సరసులఁజెరయన్. ౮౦

## —♦ జలక్రీడావర్ణనము ♦—

సీ॥ వ్రాలి ముద్దిడఁజూచు ♦ వనలక్ష్మిమేలిచూ, డ్కులు నాఁగ నెలదేంట్లు ♦ కూడిరాఁగ
నెదురుకోల్గొను సర ♦ సీందిర పొదలిక, లనఁ దరఁగలచొప్పు ♦ లనువుపడఁగ
నాదృతినెఱపుప ♦ ద్మాస్థానరమ చెయ్వు, లనఁగ నంచలచల ♦ నాదులొప్ప
సరసోక్తులాడు శం ♦ బరపద్మకిలకిల, ల్నా నీరఖగరుతో ♦ న్నతులు తనర

వనవిహారంబు సొనరించి ♦ చని యొకొండు
వనవిహారంబు సలుపంగ ♦ వాంఛ సేయు
వారు గారవమీఁకీత్రిఁ ♦ బడయఁ గాంత్రు
సుదతు లెందునుఁ జట్టాల ♦ సురభుజాన. ౮౧

తే॥ అచ్చపుంబూవు లొక్కెడ ♦ ననువుపఱచి
మేలి కెందమ్మివిరులకై ♦ మేలుపడెడు
వారు వలిపము లటుదాఁచి ♦ వఱలుతొగరు
పావడ ల్దాల్తు రప్పుడ ♦ పద్మముఖులు. ౮౨

ఉ॥ సోరుగ జాలుపైఁట నడి ♦ చక్కి బిగింపఁదలంపఁగుల్కుత
శ్కారువసిండిగుబ్బలన ♦ నౌజిగిగుబ్బల మేలికంచెలన్
దీరుగఁగట్టి జెట్టినెఱి ♦ తీగ్రొకవింతహొయ ల్ఘటింప నో
రూరఁగఁ జేయిసాఁచి కమ ♦ లోదరలక్ష్మి కవుంగిలింపఁగన్. ౮౩

క॥ డాయుంబోయిన యాంతన, యాయంగన లూనుతలఁపు ♦ లటుపులకలు త
చ్ఛాయలు తదంగకమ్ములుఁ, దోయమ్ముగఁ దోయమునకుఁ ♦ దొడరుందొడరన్.

మ॥ అడుగు ల్వెట్టును మెట్టదామరల నొ ♦ య్యన్ శాలిగర్భంబులే
ర్పడఁ జేయు న్వరజంఘ లూరువులు రం ♦ భా స్తంభ ముల్దార్చు నె
ల్లెడఁ బొక్కిళ్లిడుఁ బొన్నపూవులఁ గుచా ♦ ద్యైతత్ప్రతీకాలి య
ట్లొడఁగూర్చుం గమలాకరంబునకు న ♦ వ్యైద్యద్విశేషోన్నతుల్. ౮౫

క॥ కమలినికిఁదమకు నటులొడి, కముగాఁగలుములకుఁదగిన ♦ కందువ లమరన్
గమనీయకంకణక్వణ, నము లచ్చటిసిరిప్రశంస ♦ నములై తనరన్. ౮౬

శా॥ ఆలోలేక్షణ లోలయోల యనుచు ♦ న్వ్యాసంగవశ్యాత్మలై
యోలాకంచన కోలలాడుదురు సా ♦ ఖ్యోర్మ్ము ల్దటాకోర్మికా
వ్యాలీఢాయతలీలలం బెరుఁగ స్వీ ♦ యశ్రీల నప్పద్మినుల్
గ్రాలంజాలుట లెంచి యోలిమికఁగో ♦ రం దత్కవు ల్సీరఁగన్. ౮౭

సీ॥ ముద్దుగుమ్మ మొగమ్ము ♦ మొనయించి జలజమ్ము, నీసడించి విదుర్చు ♦ నింతియోర్తు
కలికికన్నులమ్రోల ♦ వెలయించి కలువతే, కులఁజించి చెండాడుఁ ♦ గొమ్మయోర్తు
గుబ్బకుచపాలిండ్లు ♦ గూర్చి నెత్తమ్మి మొ, గ్గల నత్తి పడవైచుఁ ♦ గాంతయోర్తు
అలివేణికచభార ♦ మటుచేర్చి శైవాల, ముల నఱిముఱిఁ ద్రెంచుఁ ♦ జెలువయోర్తు
గులుకులాఁడి యెదుర ♦ గునుకులుసూపు నం, చల నదల్చి తఱుము ♦ లలనయోర్తు
సామ్యగతికిరాని ♦ సారస్య మిట్లింత, పీని కేల యనెడు ♦ విసువు దోఁప. ౮౮

ఉ॥ చందురుఁడుద్భవించు నెడఁ ♦ జంద్రముఖీముఖ మెత్తి చూపి మో
విందళుకొత్తనొత్తి యిదె ♦ పేర్చుసుధాఘటమంచుఁ దెల్పి య
ట్లందఱ నన్నిటం దవుల ♦ నాడి కొలంకిది పాలసంద్రమం
చించిర నేనటంచు వచి ♦ యించెను సుందరి యోర్తు నేర్పునన్. ౮౯

శా॥ కెమ్మోవు ల్పవడంపుఁదీవియల ల ♦ క్ష్మిం దెల్ప హాసద్యుతుల్
దిమ్మల్వెట్టిన యాణిముత్తెముల వృ ♦ ద్ధిం జూప భూపారుచుల్
సమ్మర్దోద్యదహీట్ఫణామణిమహా ♦ స్సంక్రాంతిఁ జాటం గొలం
కమ్మాదేవికిఁ బుట్టినిల్లనెడు చా ♦ యంగూర్తు రబ్జాననల్. ౯౦

సీ॥ కమలానన ప్రఫుల్ల ♦ కమలపాలి నుతింప, నేణాంకవదన తా ♦ నీసడించు
లలి నుత్పలాక్షి యు ♦ త్పలములే మేలన, హరిణలోచన దాని ♦ నపహసించుఁ
గలహంసయాన యం ♦ చలయొయ్యారం బెంచ, మత్తేభగమన ని♦ర్మమతఁ దెలుపు
నలినీలవేణి తేఁ ♦ టులచొకాటం బెన్న, ఘనకైశిక నిరాస ♦ కలన నూపు

లలితబిసబాహ నవమృణా ♦ లమ్మృదులత్వ
మెఱుక సేయంగ స్రగ్భుజ ♦ యెత్తిపొడుపు
మాటలాడు నొకతె మెచ్చు ♦ మాట నొకతె
మెచ్చ దొండొంటఁ దమమేల్మి ♦ మెఱుఁగుఁగనుట. ౯౧

శా॥ చిక్కంబట్టి యొకర్తు వేఱొకచెలిన్ ♦ సింగారమొప్పార మీ
రిక్కాంతామణి నూరకేవిడుతురే ♦ యిస్సీ; యటన్న న్గోమల్
దక్కంబోయని తమ్మిపూల జలము ♦ ల్దారెత్తి చల్లంగఁ దా
దక్కోల్గాంచె సుజాతయావతకలా ♦ ధారేయతాభ్యున్నతిన్. ౯౨

శా॥ అక్కా; చెల్లెలివంతుదీరె నిఁకనీ ♦ కాభాగ మిట్లన్న మా
చక్కం గూడరొయక్క- లీయెడకు నీ ♦ సన్నాహమే చాలు మి
మ్మెక్కింప న్మఱిడింపఁ జూతుమకదా ♦ యిప్పాట మీరన్ననో
లెక్కా; యంచటు వారిపట్లవిలసి ♦ ల్లెం జల్లుపోరాటముల్. ౯౩

శా॥ నీట న్మున్గుచుఁ దేలుచు న్విహృతుల ♦ న్నేమంబులం గూర్చుచున్
బాటల్పాడుచుఁ దచ్చన ల్నెఱపుచుం ♦ బందెంబులం గొట్టుచున్
జోటు ల్వాటిలుశోభనక్రమకలా ♦ సూచ్యప్రబంధాప్తి స
య్యాట ల్వెంత్రుజలాధిదైవతరమా ♦ వ్యాపార మేపారఁగన్. ౯౪

సీ॥ ఈఁదులాడుదు రొక్క ♦ యెడఁ బద్మరాగద్యుతులఁ దులాభారంబు ♦ దూఁగునటులు
చల్లుపోరాడుదు ♦ రల్లంత ముత్తియ, మ్ములఁ దలఁ బ్రాల్వోయు ♦ ముదువు దోఁప

నోలలాడుదు రట ♦ నొండొండ మాధవ, దీక్షాంతసంపద ♦ వేడ్క దనరఁ
జల్లాడుదురు మేలి ♦ స్మారరంగస్థల, నాటకపాత్రవి ♦ న్యాస మొలయ
గీతము ల్పాడుదురు సుధ ♦ ర్మాతతాప్స, రశ్రసంగోచితరసాను ♦ రణన మొప్ప
జలజనేత్రలు నెలకొండ్రు♦సమయలబ్ధ,జలవిహారమ హోత్సవో♦త్సాహమునను.

క॥ ఓహారిసాహారి నపుడ, ట్లాహారిణాక్షులు పయోవి ♦ హారాదృతలై
యాహారి వొడుచుటఁ గ్రుంకుట, నే హారియించుతమి నెఱుఁగ♦ రెమ్మెయి నెదలన్.

తే॥ తామరలు హల్లకములు కెం ♦ దమ్మి లొఱపు
నెఱపునిందీవరమ్ములు ♦ నేర్పుమీఱ
మరుని బలఁగఁపుఁజిన్నెలు ♦ మలయు నటులు
దాల్తు ర త్తటి నొండొండఁ ♦ దలిరుబోండ్లు. ౯౭

క॥ పాటీరఘుసృణచర్చలఁ, బాటిలుసంపదకుఁదాను ♦ బాల్పడి నలినీ
వాటీపరాగరాగము, గాటముగాఁగొమల మేనఁ ♦ గమలిని యలఁదెన్. ౯౮

తే॥ అన్ననలు గొన్ని చేకొని ♦ యన్నుమిన్న, లెన్నరాని విలాసముల్ ♦ చెన్నుమీఱ
నన్నలినియాన గైకొన్న ♦ సన్న దనరఁ, దిన్నఁగాఁ జేరుదురు దరి ♦ తిన్నెలకును.

చ॥ జలకములాడి మేలిజిగి ♦ జానగువల్వలుగట్టి క్రొన్ననల్
వలనొలయంగఁగూర్చి యధి ♦ వాసనలం దులకించి సొమ్ములె
మ్మెలు దనరారఁదాల్చి బలు ♦ మేటరికస్తురి బొట్టులుంచి క
న్యలు ప్రియునింటి కేగుతటి ♦ నట్టులుగాఁగనుపట్టునంతటన్. ౧౦౦

క॥ లలితజలోచ్ఛ్వాసం బం, చలమేలగురవళి తనదు ♦ చాయయుఁ గనువా
రల క త్తింటికపుడె క, న్నెల నంపెడుజాడ కమలి ♦ నీసతికొప్పన్. ౧౦౧

తే॥ అర్కకిరణావళులకుఁదో ♦ డంగనలమె, ఱుఁగునిగ్గులు దనుపీడఁ జెంగలించు
వగలపెల్లున నలినితా ♦ వఱలదటులు, గాదె యొక్కట గొడవలు ♦ గ్రమ్మకొనిన

క॥ పసుపులు కుంకుమములు సుమ, విసరము లవియువియుఁగొని వి ♦ విక్షస్థలి నా
బిసరుహముఖులామోదము, మసురుకొన న్మేలిహొయలు ♦ ముమ్మడిగాఁగన్.

తే॥ తారుకొనుమారుచికిలీక ♦ టూరు లనఁగ, నారు లయ్యెడఁద్రిభువన ♦ వీరు నతనిఁ
దీరుగ యజింత్రు పూవుల♦కోరు లొసఁగి, తాను వీరుత్తు లట్టులొ♦య్యారు లగుచు.

క॥ అంతఃపురకాంతలతో, నంతటివైభవము లెల్ల ♦ నందఁగనినభూ
కాంతుఁడు మనోభిరామ ము, పాంతశ్రీకమగుకుతుక ♦ మతిశయితముగాన్. ౧౦౫

క॥ అవ్వాసంతసమయమున, నవ్వాసవసముఁడు గురుఁ గృ ♦ పార్ద్రుని నడిగెన్
నివ్వటిలునియతిఁ బుత్రుల, నివ్వంగలనవ్వరేష్టి ♦ నెసఁగు సుదృష్టిన్. ౧౦౬

చ॥ అలరువసంత మియ్యెడె మ ♦ హాత్మక యానతిఁ బేరనొప్పున
యల్లరులఁ దండఁగూర్పు మది ♦ యాదల నుల్లసిలంగఁ దాల్తు మే
లలవడు దాననన్న ద్రుహి ♦ ణాత్మజుఁడాతని మెచ్చి యన్న; నీ
కలవడు మేలె యిప్పలుకు ♦ లాదృతిమీఱఁ బరిగ్రహింపుమీ. ౧౦౭

క॥ మునుకొని తురంగమేధం, బొనరింపుము మనుకులీన; ♦ యుజ్జ్వలవిభవం
బను పదమందెద వాదటఁ, బొనరుపడం గూర్తు మొక్క ♦ పుత్రీయేష్టిఁ. ౧౦౮

తే॥ ఒకపరిధానంబు నడువఁదా ♦ నూర్జితమగు
నన్య మెద్దియు నట్లుఁగాక ♦ యనఘ ; మున్నె
యమ్మహాక్రతువొనరింప ♦ నానవోడమె
నంటి విదె దాని కనువైన ♦ యదనుసుమ్ము. ౧౦౯

—♦ దశరథుం డశ్వమేధం బొనరింపఁ దలపెట్టుట ♦—

క॥ అని నిజమనోరథంబున కనురూపతఁ దనదు గురుని ♦ యానతిఁగొని యి
ట్లనె మనుజేంద్రుఁడు మనమున, ఘనకౌతుకముల్లసిల్లఁ ♦ గా నుద్యతుఁడై. ౧౧౦

తే॥ ఇంతకన్నను మేలెద్ది ♦ యినకులీన
పూజ్యపాదగురుండవు ♦ పుణ్యమతివి
హితుఁడవు పురోహితుఁడవు నీ ♦ యిచ్చ మెలఁగ
నాకుఁజను నీకునాజ్ఞాప ♦ నంబొనర్ప. ౧౧౧

మ॥ కలపాపంబులనెల్లఁ బోఁకడవ న ♦ క్కంజాక్షు మెప్పింప వే
ల్పులసంతృప్తులఁజేయ విప్రవరస ♦ త్పూజాప్తి రాణింపఁజి
క్కలనంబెంప యశంబుగూర్ప గుణవ ♦ త్సంతానలాభంబొన
ర్ప లలిన్మేకొను నిమ్మహామఖముఁ బో ♦ ల్పం గొండొకండుండునే. ౧౧౨

తే॥ రాజమాత్రున కిది పొంద ♦ రాదు దీన
నెద్ది యపరాధ మొదవిన ♦ నింతయనఁగఁ
దగని కష్టంబు సవనక ♦ ర్తకగు ఛిద్ర
మరయుచుందురు రక్కసు ♦ లనయ మిందు. ౧౧౩

క॥ పెక్కండ్లెలిమి నిల నే, దిక్కనఁగన నితఁడె యనుచుఁ ♦ దెలిసి యరులు లోఁ
గ్రుక్కఁగ మెలఁగితి నేఁటికిఁ, జిక్కితి సంతానలోప ♦ చింతాపరతన్. ౧౧౪

మ॥ హయమేధం బొనరింపు మీవనెడు నీ ♦ యాజ్ఞాధికారంబె న
న్ను యథార్థంబుగ నుద్ధరింపఁగలదే ♦ నోవార్ధికి న్నౌకయై

దయ మేల్కొల్పితి వింతకన్నవలెనే ♦ దైవంబుఁగాలంబుఁగూ
డె యియత్తు న్విధి నిర్వహింపుమఁకనీ ♦ తేవ ప్రభావోన్నతా. ౧౧౫

ఆ॥ ఋత్విజుల వరింప ♦ నెల్లరఁబిలిపింప, హయముతోడ ♦ నర్హులైనవారి
ననుప నానసేయు ♦ మది యిది యననేల, సర్వమునుభవత్ప్ర ♦ సాదవశము.

క॥ అముకానతి సంకల్పం, బమరినయుత్కంఠతోడ ♦ ననఁగిపెనఁగి హ
ర్షముఁబెనుచుచు నోడివెడు ఋషి కుమారవరు మహిమ సుతుల♦గొందువటంచున్

క॥ అనివేఁడిననినకులగురుఁ, డనఘుఁడు మునిచంద్రుఁ డర్థ్వ ♦ రాశంస మెయిన్
బనుపడునానందము తల, మునుకగ మునుకొనుశుభంబు ♦ మొనయుమనీషన్.

వ॥ ఋశ్యశృంగమహామునిం బురస్కరించుకొని సుయజ్ఞవామదేవజాబాలికాశ్యప ప్రముఖులంగూర్చుకొని రాజేంద్రునియభీప్సితంబభినందించుచుఁ గ్రతుసంధానం బొప్పార నప్పార్థివోత్తమునితో నిట్లనియె. ౧౧౯

క॥ సాంగ్రహణేష్టికి ఋత్విక్, స్సంగ్రహమొనరింపు మింక ♦ జాగేల హయమే
ధ్యం గ్రహమోచనముఖకృతు; లంగ్రీడయ పోలె నెఱపు ♦ లావు మెఱయఁగాన్.

తే॥ ఇట్టిధార్మికి బుద్ధి నీ ♦ కెవ్వ డెనక, మెసఁగెఁ బుత్రార్థ మంచిత ♦ ప్రసవయగుచుఁ
గూర్చుఁబుత్రుల నలువుర ♦ గుణనిధుల మ, హాపరాక్రమశోభితు ♦ లైన ఘనుల.

క॥ మున్నే తెలిపితి బ్రహ్మ, త్వోన్నతికిన్ బ్రహ్మమూర్తి ♦ యుజ్జ్వలధృతిసం
పన్నుండు ఋశ్యశృంగుఁడె, యన్న; సమర్హుఁడని తొడరు ♦ మనఘువరింపన్.

క॥ వరియింపు మిమ్మహాధ్వర, వరమున ఋత్విజులఁ గాశ్య ♦ పప్రముఖులఁ దా
వరియించు హారికృపయు నటు, వరణీయులు వీరలిట్టి ♦ వారలుఁ గలరే. ౧౨౩

క॥ సరయూనదికి నుదగ్దిశ, సరణిం బరఁగంగ యజన ♦ శాలఁ బొనర్పన్
వరలక్షణవేత్తల స, ద్వరణ మెసఁగ వలయుశిల్పి ♦ వరులంబనుపన్. ౧౨౪

చ॥ జనకు మహానుభావు విల ♦ సద్గుణుఁగేకయుఁ గాశిరాజు స
జ్జనసుతు రోమపాదు సుర ♦ సన్నిభు నంగమహీశు మున్నుగా
ఘనుల సుహృద్వరేణ్యుల వి ♦ కస్వరమూర్తులఁ బిల్వనంపుమీ
వనఘులు మంత్రిసత్తములె ♦ యర్హులు వారల దోడితేరఁగన్. ౧౨౫

ఆ॥ చనునొసర్ప సిద్ధ ♦ సంకల్ప ; సంకల్ప, మింక నమ్మఖాశ్వ ♦ మెల్లకడల
దిరుగునంతలోనఁ ♦ దీర్పంగనగుఁదక్కఁ, గలుగుకృత్యములు ప్ర ♦ కాండములుగ.

క॥ ఏకొఱఁతలేక యాకృతి, నాకాధిపసఖ ; తలిర్పు ♦ నవనవయోగ
శ్రీకలితమగుచు దివ్యలు, నీకతనన్మేలు గాంచు ♦ నెటిఁగనుచుంటన్. ౧౨౭

వ॥ అని యమ్మహానుభావుండానతిచ్చి వెండియు యజ్ఞకర్మనిష్ఠితులగు ద్విజవృద్ధులను
వృద్ధులు పరమధార్మికులు స్థాపత్యనియుక్తులునైన కర్మాంతికులను శిల్పకరులను
వర్ధకులను ఖనకులను గణకులనుఁ జిత్రకారులను నటనర్తకాదులను సుబహు
శ్రుతులు ప్రయోగశాస్త్రవిదులు నిత్యశుచులునై నలువొందు పురుషశ్రేష్ఠులను
విలోకించి యమ్మహాధ్వరంబింకం బ్రవర్తిల్లవలయు మీరలెల్లరు రాజశాసనంబున
సమాహితచిత్తులరై తొలుదొలుత ననేకసాహస్రంబు లిష్టకలంగూర్చి సమకట్టి
యజ్ఞోపకరణంబులతోడి సంభారంబులనెల్లఁ దడయక తీర్చియుఁ జేర్చియుం బేర్చిన
సామర్థ్యంబున రాజన్యోపకార్యలు బ్రాహ్మణావసథంబులు నాగరజానపద జన
నివాసంబులు బహుగుణంబులు బహువిశాలంబులుం గా నేర్పఱచి సర్వవర్ణంబుల
వారలను బహుభక్ష్యాన్నపానీయప్రదానంబుల సచ్ఛందనాది విధివత్పూజా
సత్కారవిశేషంబుల సంతృప్తులనొనరించుచుఁ గామక్రోధాదివశంబుననైన నేవారి
కేనియు నించుకయు నవజ్ఞసంభవింపకుండునట్లు జాగరూకులరై మెలంగవలయునని
యాజ్ఞాపించి గట్టినేసి మంత్రులతో సవనకర్మవ్యగ్రులగు నిప్పురుషులనెల్ల సన్మాన
బహుమానద్రవ్యదానంబులం బరితుష్టాంతరంగులం బొనర్చునది యని హెచ్చ
రించి యవ్వారలెల్ల దేశికవరానుజ్ఞానుసారంబుగ నంతయు నేకొఱంతయు లేకుండ
సువిహితంబుగా సమకూర్చువారమని ప్రీతిస్నిగ్ధచేతస్కులరై నొడువ నది యట్టుల
యవంగాపృతమని యనుమతంబొనయించి మంత్రిసత్తముని సుమంత్రునింగని
యతనితో నిట్లనియె. ౧౨౮

సీ॥ మిథిలాధిపుని శూరు ♦ మిత్రు సువిక్రము, సర్వజ్ఞుఁ దోడ్తెమ్ము ♦ జనకనృపతి
సత్కృతుం డతనిప్రా ♦ క్సంబంధ మారసి, తొలుదొల్తఁ దెలిపితిఁ ♦ దోడుతోడఁ
గాశీశ్వరుని స్నిగ్ధుఁ ♦ గమనీయవాగ్యోగ, నిరతు భావింపుము ♦ నియతి వెలయు
ఘను ధర్మనిష్ఠుఁ గే ♦ కయరాజు వృద్ధు స, పుత్రు శ్వశురు రాజ ♦ పూజ్యునట్లు
శ్రీమహితు నంగవిభుఁ బ్రభు ♦ సామరస్య
కలితుఁ గొనిరమ్ము స్వజనసం ♦ వలితుఁ గాఁగ
మఱియు సర్వదిగీశుల ♦ మాన్యయశులఁ
దోడితేరంగఁ బనుపుము ♦ తొడరుప్రీతి. ౧౨౯

క॥ హితసామంత నరేంద్రులఁ, దతసత్కారములు నెఱయఁ ♦ దద్దయుఁ బిలువన్
గృతులేర్పఱుపం జనునీ, కతులితగుణశాలి వీవ ♦ యన్నిట మెఱయన్. ౧౩౦

వ॥ అనియివ్విధంబున నవ్విజ్ఞానఖనియగు నిజకులగురుం డెల్లరకునిట్టలంబగుశాసనం
బునం గట్టుపాటొనరించిన నమ్మహీజాని యమ్మహానుభావుని యనుమతంబు శిరో
వతంసంబుగాసంతరించి ఋత్విగ్వరులవరించి క్రతుసంకల్పంబు సుకల్పంబు గావించి

మించినయాధ్యానంబున నలువు రుపాధ్యాయులతో సుసమర్థపాలకపాలితంబులగు చతురంగసైన్యంబులతో సమ్మఖాశ్వంబుం బుత్తెంచి పదంపడి సుమంత్రపధానులు సుగుణరాజధానులు నగునిజప్రధానులం దిలకించియాచార్యవర్యానుశాసనానుసారంబుగ నధ్వరశాలాదినిర్మాణప్రక్రియావిశేషంబుల నశేషంబుల నిర్వర్తింప స్రుక్స్రువచమసగ్రహయూపాదియజ్ఞీయసంభారంబుల సమకూర్ప వలయువారల నియోగించునది మఱియు బాంధవహితసామంతనృపముఖ్యుల నానాదేశరాజన్యులం దగుమర్యాదలతో రావించి సన్మానించి మంచివసతుల నేర్పడనుంచునది వేర్పడ నిట్లు గొన్ని యెడలననేల యెల్లెడలనుమీరలకా నప్రమత్తులరై వర్తిల్లునది యని హెచ్చరించిన ముచ్చటలు పెచ్చువెరుఁగ నుద్భవించిన రోమాంచసంచయంబువిస్ఫురణం బానందరసప్రవాహద్వారంబునకుం బ్రతీహారిగా నయ్యమాత్యవర్యులు మహాప్రసాదంబని తదాసాదితనిర్మాల్యంబునౌదలందాల్చి మంగళాచరణపూర్వకంబుగాఁ దత్తద్విధానసమవలంబనంబునం బేరువడసియున్న కలాపిదుల లబ్ధప్రసాదులం బనిచి ప్రపంచితప్రజ్ఞావిలాసంబున నించుకేనియు నెడసేయక యెల్లయర్థంబులు సమృద్ధంబులుగా సమర్థనంబునం బ్రసాధించి యవ్వార్త దులకించుకుతూహలంబున నుపాధ్యాయవరేణ్యున కెఱింగించిన నమ్మహామహుండామహీమహేంద్రునితో నిట్లనియె. ౧౩౧

సీ॥ మొనసె సంకల్పంబ ♦ మోఘఫలంబీయఁ, గాకున్న నిన్నెఱి ♦ గలదె యెందు
మనసునఁ జేర్చిన ♦ మ్మెమ్మె శిల్పకల్ప మ, వ్యాహతి నచ్చొత్తి ♦ నట్టు లలరె
యజ్ఞీయ మగునర్థ ♦ మెల్ల సంభృతమయ్యె, శాలాదినిర్మితి ♦ సవరుగాంచెఁ
గప్పముల్గొంచురా ♦ గడఁగిరి రాజన్యు, లట్లుసత్కృతిశోషి ♦ తాత్ములైరి
సర్వకామోపహృతము నీ ♦ సవనభవన
మరయు మన్నియుఁ జెంగట ♦ ననువుపడఁగఁ
గూర్చినార మొక్కటనైనఁ ♦ గొఱఁతయనఁగఁ
బోలదయ్యె సుసంతృప్తిఁ ♦ బొదలుమయ్య. ౧౩౨

క॥ అనిగురుఁడన సదియట్టిద, యని యనఘుఁడు ఋశ్యశృంగుఁ ♦ డవహితమతియై
తనయనుమతియుం దెలుపఁగ, వినమ్రుఁడై వారిఁబొగడి ♦ విభుఁడుత్సుకుఁడై.

ఆ॥ వారితోడ నరిగి ♦ వాసవసఖుఁడు గ, న్గొనెఁ దనర్చుతనదు ♦ కోర్కెలలర
మంత్రులెలమిఁగూడి ♦ మహిమండనున కెల్ల, యెడలఁగలసమృద్ధు ♦ లెఱుకపఱుప.

సీ॥ కలధౌతశైలల ♦ క్షణమూనుట ననేక, మణిదీధితుల దిఙ్మ ♦ మత్వ మమర
నుపకంఠమున గంగ ♦ యుప్పొంగి రంగత్త, రంగమై రాణఁదు ♦ ఱంగలింప

వసురుద్రముఖ్యస ♦ ర్వసుపర్వసాన్నిధ్య, సుభగత్వ ♦ మొకదివ్య ♦ శోభనొడువ
రంభాదిసంగతి ♦ రమణీయకాంచన, కుంభాఢ్యకుచలక్ష్మి ♦ కులుకు దొలఁక
ననుకలద్విజరాజల ♦ త్కృత్యమునను, బ్రాంచితానందనందన ♦ వ్యాప్తి వెలయ
సురభికల్యాణతతి దాన ♦ సురభి గుప్ప, సుగుణశత,మఖశాల శ్రీ ♦ స్ఫురణఁదనరె.

క॥ ఆక్రతువాటీసుభవం, బాక్రాంతదిగింద్రవిభవ ♦ మై తగ మృగరా
డ్విక్రముఁడు గాంచి పొంగెఁ ద్రి, విక్రముసిరిఁగనియొనా న ♦ వేలోత్సవుఁడై.

క॥ మితిమీఱు భాగ్యమొదవెన్, గతి మీరై యుండ నిట్టి ♦ క్రతువరలాభం
బతులితమయాటఁదొలుతన్, వితత మవలిఫలము స్వాత్మ ♦ విదితమకాదే. ౧౩౭

ఆ॥ అనుచు భక్తి మునుల ♦ నాతఁ డున్మనులఁబొ
నర్చి పొగడి పేర్చి ♦ ననుచు వేడ్కఁ
బూజసేసి స్వర్ణ ♦ పుష్పాంజలులనిడి
వెలయువారిదీవ ♦ నలు గ్రహించి. ౧౩౮

వ॥ పదంపడి కర్మాంతికులకుంబసదనంబులొసంగి యమాత్యవర్యులందిలకించి. ౧౩౯

తే॥ ఎల్లయర్థంబులకు నిదె ♦ యెల్ల యనఁగ, దానమరె శాల సంతాన ♦ దానశీల
కంటి మీకృతినేర్పు శ్రీఁ ♦ గంటినిపుడె, మంత్రులార; సుధీసుర ♦ మంత్రులార.

క॥ అని సరసవాక్ప్రసంగం, బునఁ దేల్పఁగ వారలొలయఁ ♦ బురలక్ష్మీకాం
త నలంకరించుపని తన, పనినటువలె నానసేసె ♦ నది పొనరుపడన్. ౧౪౦

క॥ అప్పురిసిరి నేనేమని, చెప్పుదు విభునాజ్ఞఁదెలియఁ ♦ జేసినయపుడే
యొప్పె నది యనిర్వాచ్యతఁ, గప్పురఁపుందీవికట్లు ♦ గలిగెన్నలనల్. ౧౪౨

చ॥ పులకలుతోఁచినట్లు వల ♦ పుల్వెదచల్లెడు ధూపధూమరే
ఖలుదగెఁ జిమ్మచెమ్మటల ♦ కల్మి ఘటించె హిమాంబుపు ల్పతా
కల చలనంబు వేపథువి ♦ కాసముఁజూపెఁ బురీవధూటిక
వ్వేలనున సాత్త్వికోదయ మ ♦ వశ్యవిభావ్యమకాదె భావినీ. ౧౪౩

క॥ పౌరపురిమీఱు నప్పురి, పౌరంతకు నంతకెక్కు ♦ చాయలెటఁగి యె
ల్లైరన్న సాహసమ ఘాయా, లేరాళము కాంతిపూర ♦ మే త్రేణాక్షీ. ౧౪౪

తే॥ తొలుత దివమీసడించుప్రో ♦ ల్పొలఁతి గురుని
యుక్తి మునిఁదెచ్చువహినంత ♦ యొప్పె శాంత
రా మెఱసె మీఱె సురభిమేల్ ♦ రహిఁ బ్రిబలదె
యునునికై సేఁత సిరులున్న ♦ నేమికొదవ. ౧౪౫

శా॥ అంగాధీశ్వరుఁదొట్టి బాంధవుల సౌ ♦ హార్దంబు చెన్నారఁ బి
ల్వంగాసుత్థుఁ డమాత్యులంబనుపఁ జె ♦ ల్వంబొప్పఁగా వచ్చి రా
సంగప్రాంచితగా నయోధ్యగుణవై ♦ శద్యంబు కాన్పింప వా
రుంగాతూహలిత స్వరూఢజనతా ♦ రోధానురోధంబుగన్. ౧౪౬

క॥ సీమంతినీజనముఖో, సామంతులు విందులగువి ♦ శాంపతులుఁ బోరిన్
ధీమంతుఁడు సామ్రాజ్య, శ్రీమంతుఁడు నతనియాన ♦ శిరమున మెఱయన్. ౧౪౭

క॥ తోఁతెంచిరి పండితు లటు, లేతెంచిరి జనులు లోక ♦ మేకము గాఁగన్
ఏతెంచిరి స్తవసుమములఁ, పాఁతెంచిరి తద్విశేష ♦ భావన వెలయన్. ౧౪౮

మ॥ విధిసర్వజ్ఞుఁడు వారికెల్ల హితని ♦ ర్వేశంబు లొప్పన్ యథా
విధి సత్కారములందఁజేసి విడుదుల్ ♦ వేర్వేఱుగాఁగూర్చి ద
ద్విధ మాచార్యవరేణ్యుఁడౌనసఁగ నా ♦ వేదించెఁ దత్ప్రోక్తత
ద్విధ మానందరసాబ్ధివృత్తికృతిని ♦ ర్వృత్తంబుగా నత్తఱిన్. ౧౪౯

మ॥ ధరణీభృన్మణి యీక్రియ న్నిఖిలకృ ♦ త్యంబుల్సమర్థించి త
ద్గురునిర్దిష్టశుభోదయం బెనయఁ దో ♦ డ్తోఁ బంచషాహంబులం
తరమైనం గ్రమియించె వాఁడవి యుగ ♦ స్థానీయముల్గాఁగ యా
గరమాయోగనిరీక్షతో సుతముఖే ♦ క్షాకాంక్ష పొంగన్ సఖీ. ౧౫౦

ఉ॥ అంతట శోభనాహసము ♦ పాహితమైనటు లశ్వ మాధ్వరం
బంతర మింతలేక సద ♦ నాంతికసీమకుఁ జేరవచ్చె సా
మంతనృపోపనీతబహు ♦ మానపురస్సరమై వసుంధరా
కాంతుని చింతితార్థమనఁ ♦ గల్య మతుల్యముగా నగాత్మజా. ౧౫౧

క॥ వత్సరము పూర్ణమయ్యెను, సత్సమయంబొదవెఁ దడయఁ ♦ జనునె క్రతుఫలా
దిత్స ప్రబల గురువరులును, వాత్సల్యముతోడి యాన ♦ వర్తిలఁజేయన్. ౧౫౨

ఆ॥ అనుచుఁదలఁచునాతఁ ♦ డశ్వోత్తమంబేగు, దేర దృష్టమట్లు ♦ దృష్టదిష్ట
విష్టపములమేలు ♦ వెలయంగ భావిభా, వాప్తి తెల్లమగుచు ♦ ననువుపడఁగ.

క॥ సంతోషపరీవాహని, రంతరితనిజాంతరంగుఁ డై తనరి మహీ
కాంతుఁడు భవ్య మరుంధతి, కాంతుఁడు శాంతాపురంధ్రి ♦ కాంతుఁడు దెలుపన్.

సీ॥ మంగళస్నాతలై ♦ మహనీయలక్ష్మిఁ గా, సల్యాదిసతులుపా ♦ ర్శ్వమున మెఱయ
మంత్రిపుంగవులు సా ♦ మంతు లాప్తులు మేలి, సంతసంబునఁబద ♦ సరణిఁబెరయ
నుచితోపచారంబు ♦ లొనరించువేడుక, నుడిగఁపుంబలఁగంబు ♦ లోలి నెఱయ
వందిబృందము భూపు ♦ రందర; జయజయ, యనిస్తోత్రకుసుమాళు ♦ లందిమొరయ

భావుకాతోద్యరవము ల ♦ భఙ్గింబునోరయ
నెల్లమును లల్లమునియుగ్మ ♦ మెనసి శాకు
నాదికల్పానుచారమ్ము ♦ లరయ దశర
థుండు దీక్షాగృహాము వేడ్క ♦ దూరసె నపుడు. ౧౫౫

వ॥ అది మఱియు ననంతమణిప్రకాశప్రద్యోతమానప్రత్యగ్రసౌవర్ణతామరసవిలాస
నిర్విశేష కాశ్మీరరోచనోపకలితసంమర్దవిశేషవిశిష్టకర్ణికాభ్యంతరభృంగనీలిమశం
కావహాకస్తూరికానివహాభంగీవిరాజితంబును రాజితతత్తద్భవ్యభవనోచితపరిమళ
ద్రవ్యకలనాసముద్భావిత దివ్యసుగంధసంబంధసంపల్లక్షణాప్రసన్నతాభ్యాహితమ
హీదేవీప్రకాశితనైజచరితార్థతాంచదచ్ఛసముచ్ఛ్వసితంబును సితాభ్రప్రకరవిర
చితరంగవల్లీమతల్లీపోల్లసనప్రసితవాలుకానిచయ సౌష్ఠవసమువేత చాంద్రమణీప్ర
ముఖసముత్పన్నలావణ్యామయవిష్ణుపదీనదీర్ఘుకీస్వవైఖరీసంమేళనోపలక్షితపరస్పర
ప్రసూత్వప్రధానమహామహిమంబును హిమాంబుసేచనద్విగుణీకృత లీలారవింద
బృందనిష్యందమరందబిందుసందోహ స్తనంధయితగంధవాహకందలంబును దలశ్రీ
చకచ్చకితనీలోత్పలజాలకసందర్భగర్భితదివ్యమౌక్తికహారమణీమణీవితాన సంగ్రథి
తవితానమండలసౌభాగ్యసంజ్ఞాపితసమగ్రసుధాకరబింబసహోదరతాభి రామం
బును రామణీయకనిధానోపగుంభనశుంభత్కాంచనపాంచాలికాబింబప్రతిబింబిత
నూత్నరత్నద్యుతివికాసానుమితనిజసేవాసమాయాతబాలికాపాలికాసమేతసారవని
తాజాతకైంకర్యసౌకుమార్యానీతమహాశాతపూరకలాప్రస్ఫురితపారితోషికపద్మా
నలక్ష్మీసమాగమంబును ఆగమసంచయప్రపంచితాత్మస్వరూపవిభవంబునగుచు
మున్నాడి తాఁగన్న తెఱంగుకన్నమిన్నయైనరంగునంబొసంగి మంగళదేవతానపీనా
వతారం బనందోరంబగు నయ్యజనాగారంబు సేరంజని సకలసువాసినీవిలాసినులు
నవమోహినులవడువున శోభనగీతపదోచ్చారణప్రసరాగ్రసరంబుగా రాణం
బొసంగి కల్యాణమయంబులగు నమృతపూర్ణకలశంబు లందుకొని చందురునిం
దొడరు నందంపుమోములు మందస్మితచంద్రికలనెల్లకడల వెదచల్ల నల్లనల్లన
నయ్యరుంధతీశాంతలంబురస్కరించుకొని ముందునడువ నమందోత్సాహంబునం
దులకించి యందుఁబ్రవేశించి. ౧౫౬

—♦ దశరథుం డశ్వమేధయాగము సేయుట ♦—

సీ॥ ఋశ్యశృంగవశిష్ఠ ♦ లాశ్యతపోనిష్ఠు, లెలమి బ్రహ్మాత్మాద్య ♦ మెనసి వెలయ
వామదేవాభు ల ♦ వ్వామదేవాదు లు, ద్ధాత్మతాముఖ్యాధి ♦ కారమంద
వశ్యచతుర్ముఖు ♦ లాకాశ్యపప్రముఖులు, విధిదర్శితాలీల ♦ వేడ్కఁబెనఁప
జనకాదిబంధు లు ♦ జ్జ్వలనత్ప్రబంధులు, నభకైంద్ర లక్ష్మీగ్రప ♦ సాద మొసఁగ

మంత్రిసత్తము లఖిలధ ♦ ర్మ్యముల మెలఁగ
నెల్లదివిషదు లల్లమే లెంచి ♦ యెప్పు
డెప్పుడని యుత్సుకతమీఱ ♦ నెలయుచుండ
యజనదీక్షవహించె న ♦ య్యాజి యపుడు. ౧౫౭

క॥ ఆ రాజేంద్రు మహాక్రతు, వై రాజిలు నశ్వమేధ ♦ మమరామితసా
ఖ్యారంభక మిదె యనసై, యారంభంబెనసి మెఱసె ♦ నచలేంద్రసుతా. ౧౫౮

క॥ విఘ్నేశ్వరు నర్చించెరి, పుష్యుఁడు బ్రహ్మాదిదేవ ♦ పూజ లొనర్చెన్
విఘ్నములు తలఁగఁ దత్క్రతు, నిర్విఘ్నమేయఫలలబ్ధి ♦ నెఱయ సురాజ్ఞి. ౧౫౯

ఆ॥ అఖిలవిబుధవితతి ♦ కఖిలేశుఁడాహరి, కిష్టమైనక్రతువ ♦ నిష్టమెనయు
టొకఁడుగలదె నను స ♦ ముత్కంఠితుంజేయఁ, జాలె జగము లెనసె ♦ సంతసంబు.

తే॥ శతమఖుఁడు వేఁడ మున్నొక్క ♦ సాధఘట మొ
సంగె హరి గూర్చెఁగర్తకి ♦ మ్మంగళామృ
తకలశద్వయ మితఁడెంత ♦ ధన్యుఁడని ము
నులనుతులు స్వస్తివాచన ♦ ములుఁజెలంగె. ౧౬౧

క॥ శ్రీధరు యజ్ఞాకృతి సం, బోధించిరి విబుధముఖునిఁ ♦ బూజించిరి య
జ్ఞాధీశ్వరు యజ్ఞపతిన్, బోధాత్ములు ఋషులు రాజ ♦ పుంగవయుతులై. ౧౬౨

క॥ ధాయ్యామంత్రిసమితి నుప, చాయ్యం బానాయ్యమునుఁ బ్ర ♦ సాధించిరి సా
న్నాయ్యోచితముగ నయ్యెడ, నయ్యజమానుఁడు యజింప ♦ నారంభించెన్.

తే॥ శిష్టు లెల్లమునులు ఋశ్య ♦ శృంగు నవ్వ
శిష్ఠునిఁ బురస్కరించి వి ♦ శిష్టులగుచు
మొనసి జననాథు హయమేధ ♦ మును నడిపిరి
స్ఖలిత మహుతము నెప్పాటఁ ♦ గలుగకుండ ౧౬౪

మ॥ తనుజాహంకృతి మాయునింకనని యు ♦ త్సాహంబుతో నిర్జరు
ల్మనుమున్నే చనుదెంచి యమ్మఖముఁ బ్రా ♦ ముఖ్యమ్మునంగాంచుచో
ఘనమర్యాద రసమ్మునించె మునిసం ♦ కల్పోత్థము ల్ప్రీత్యవా
యనిరాసార్థము లింద్రిమావహముఖ ♦ వ్యాహారము ల్భావిసీ. ౧౬౫

క॥ విమలములగు యజ్ఞాంశము, లమరుట కానందమంది ♦ రహిహాదులు త్రా
సమెడపి నృపుఁడెకాలముఁ, దమ కోదనమిడెడుచొప్పు ♦ దలఁచుచు దుర్గా

క॥ యాజకులు వేదపారగు, లాజీజ్య యథావిధిగ యు ♦ థాగమముగ నా
నోజ నెరపి రవ్యాహత, ఖాజతన సమస్తమును సు ♦ రాసురవంద్యా. ౧౬౭

తే॥ వైశ్వదేవాహుతులు మూఁటి ♦ వరుసఁ జేర్చి
యగ్ని పూర్ణాహుతులు వేల్చి ♦ యాప్రవర్గ్య
ముపసదమ్ము నొనర్చి య ♦ ధ్యుపసదమ్ము
లవలఁ బంద్రెండు జరిపి ర ♦ హార్యతనయు. ౧౬౮

తే॥ మఱి బహిష్పవమానాది ♦ మంత్రవిధులఁ
దత్తదధిదేవతార్చన ♦ ల్తగనొనర్చి
జరిపి రటు మూఁడుసవనము ♦ ల్సవనమున య
థాక్రమపరిక్రమమున సం ♦ దఱుఁ దనరుచు. ౧౬౯

తే॥ ఇంద్రునకొఱకు యథావిధి ♦ నైంద్ర మొసఁగి
యనఘు రాజు నభిష్టుతు ♦ నట్లొనర్చి
పరఁగ బ్రాతస్సవనము సం ♦ పన్నమగుడు
నవల మాధ్యందినముఁ దృతీ ♦ యము నెఱపిరి. ౧౭౦

ఆ॥ అహుత మనఁగఁ బోల ♦ దన్యథాహుతమన
రా దగణ్యహవ్య ♦ రాజహోమ
మలవడంగ నమ్మ ♦ హాత్ము జన్నమునందు
బ్రాహ్మణోత్తముల ప్ర ♦ భావమునను. ౧౭౧

క॥ అంతయు నిరంతరాయము, సంతుష్టస్వాంతమగుచు ♦ జరిగె సవన మ
త్యంతశుభోదర్కంబయి, వింతవిధము దోఁప నెల్ల ♦ విబుధులు మెచ్చన్. ౧౭౨

క॥ అద్ధార్మికుండు సత్సం, పద్ధాముఁడు గాఁగ వాని ♦ పత్నీమణులున్
శ్రద్ధామూర్తులుగ నచట, బద్ధాంజలులగుచుఁ జూడఁ ♦ బడి రేణాక్షీ. ౧౭౩

తే॥ మాఁ,కు,నీలాం,ల,సత్కలా ♦ మహిమ దశర
థాప్తిఁ దగనని తత్సుతు ♦ ల్యజనలక్ష్మి
కలరఁ దొలుదొల్త సురభిలం ♦ బగుచు హోమ
ధూమము దొలంకె వేణికా ♦ శ్రీమురువున. ౧౭౪

క॥ వెలవెట్టరానిచెలువున, వెలసి శుచిజ్వాలరుచులు ♦ వెలఁదుల మణిభూ
షలఁదులకించురుచులలో, గలసి స్వకీయైకజాతి ♦ కల బోధించెన్. ౧౭౫

సీ॥ బ్రహ్మవిద్వర్యులు ♦ పరఁగించు క్రతువిది, బ్రహ్మవంతమయి ప్ర ♦ వర్తనమున
వెలసె విశ్రాంతుం డ ♦ విద్వాంసుఁ డశతాన్న, చరుఁడునునగు ద్విజ♦వరుఁడు లేఁడు
బ్రాహ్మణు ల్తాపసుల్ ♦ శ్రమణులు నాథవంతులు స్త్రీలు బాలురా♦ర్తులును వృద్ధ
లును వనిశముఁ దృప్తి ♦ మొనయుదు రెందు మృష్టాన్నవస్త్ర ప్రదా♦నాభినుతులె

శాస్త్రవాదము ల్ధర్మప్ర ♦ శంస లొలసె
బ్రహ్మవివరణములు నొప్పెఁ ♦ బార్థివేంద్రుఁ
డిత్తఁజె కృతి యను గీతమ్ము ♦ లెనసె వైణి
క_ర్తి వ్రజులవీణలందు హి ♦ మాద్రితనయ. ౧౭౬

క॥ అందఱు షడంగవేత్తలె, యందఱు వ్రతనిష్ఠులే మ ♦ హాయోగులె య
ట్లందఱు బహుశ్రుతులె ద్విజు, లాదముచందమునుఁగూర్ప ♦ నగుమర కాదే.

ఆ॥ మిన్నుముట్టి మేను ♦ మేకొన బహువిలా, సముల రూపుగాంచి ♦ ప్రమితి సూపు
ధర్మవనఁ దదీయ ♦ ధర్మమీమాంసాప్ర, చార మొక్క మొగిఁబ్ర ♦శస్తి గాంచె.

మ॥ పరివేష్టింతురు వారి భూషితులు ని ♦ ష్పావు ల్సుసంభావనా
పరులై సేవలొనర్తు రాదృతిమెయి ♦ న్బ్రాశస్త్య మూహింత్రు త
త్పరతన్మేకొను పారవశ్యమున ము ♦ త్పారమ్యసశ్రీకులా
దురు నానాదిగుపాగతు ల్నృపతు లో ♦ దోషాచరధ్వంసినీ. ౧౭౯

క॥ దస్యులరాయిడిలేక స, దస్యుల కొఱఁతయునరాక ♦ తాపసవర్యో
ద్భాస్యం బాక్రతువు నృపో, పాస్యం బలరారె సురవ ♦ రార్చిత మగుచుణ్.

తే॥ నీకుశుభమమ్యో, నీకీర్తి ♦ నెగడుఁగాత, మన్నివిధములఁదృప్తుల ♦ మైతిమనెడు
నర్థుల సమర్థవచనంబు ♦ లాలకించి, యలరె నాఱేఁడు మది లలి♦తాంగి; వింటె.

ఆ॥ నేల యీనె నన్న ♦ నెఱి వేనవేలుగా, నమ్మఖమ్ముఁగాంచ ♦ నరుగుదెంచు
వారిపూజ లెట్టి ♦ వరఁకుననేనియుఁ, గొఱఁతపడక వెలయుఁ ♦ గువలయాక్షి.

క॥ అన్నిట శుభశకునమ్ములె, విన్ననువున మొనయువస్తు ♦ వితతులె సురలే
పన్నగడలనుసహాయులె, వెన్నునెలయఁజేయుక్రతువు ♦ వెలయదె సుదతీ. ౧౮౩

సీ॥ ఎనిమిదంచులు దీర్చి ♦ యేకవింశత్యర, త్నిప్రమాణ మనుసం ♦ ధించి బైల్వ
ఖాదిరముఖ్యము ♦ ల్గా నేకవింశతి, యూపము ల్నిల్పప్ర ♦ యోగనిపుణు
లేర్పర్చినవి యవి ♦ హేరాళముగ దివ్య, మణిసువర్ణాంశుక ♦ మహితపుష్ప
గంధాద్యలంకృతి ♦ కలనల నొప్పార, మఱియునుఁగాంచన ♦ మయము లెన్ని
యేని శోభార్థముగ ఘటి ♦ యించినవియు
వఱల సౌవర్ణమగు శర ♦ వణముఁబోల
నొప్పె నప్పాల మటు కుమా ♦ రోదయ ప్ర
స_క్తిఁ దలఁపింపనగుచు వి ♦ శాలనయన. ౧౮౪

తే॥ ఇష్టకలు సపరిమాణత్వ ♦ మెనయఁగూర్చి
యగ్నిచయనం బొనర్చి ర ♦ నంతరముగ

రుక్మపక్షము గరుడమ్ము ♦ రూఢి వెలయ
శల్యకర్మనిపుణులు సం ♦ శుద్ధు లగుచు. ౧౮౫

ఆ॥ ఉరగములు పతత్రు ♦ లోగి జలచరములు
వన్యములును హయము ♦ వరుస నిలిపి
రశ్వమేధమునకు ♦ ననువైనవెల్ల శా
మిత్రమున విధిప్ర ♦ మితి పొసంగ. ౧౮౬

తే॥ అందుఁ బర్యగ్నికృతము లా ♦ రణ్యకములు
మాని యూపనియుక్తమ్ము ♦ లైన గ్రామ్య
పశువులఁబ్రధాన మశ్వప్ర ♦ వరముఁగాని మ
హోత్మ్ము లమ్మునివరులు ని ♦ యతి తనర్ప. ౧౮౭

క॥ ఆతఱి నాతతమతి ని, జ్యాతురగముఁ బ్రోక్షణాది ♦ సంస్కారములం
బూతముగఁజేసి తొడరిరి, భూతివెలయ శసనవిధిఁ ♦ బుణ్యచరిత్రా. ౧౮౮

తే॥ సద్విధినియుక్తిఁ దొలుతఁగొ ♦ సల్య స్వర్ణ
సూచికల గ్రుచ్చి మంత్రసం ♦ స్తుతిఁ బరిక్రి
మాదిపరిచర్య లొప్ప న ♦ న్యలునుఁగూడి
రా నిరవధిక శ్రద్ధ తో ♦ రముగఁబెరయ. ౧౮౯

ఉ॥ అమ్మహిషీలలామ సము ♦ పాత్తసదాగమ నాఁటిరాత్రి ధ
ర్మమ్ము దిరమ్ముగా మఖతు ♦ రంగమదేహముతోడ నెమ్మమై
నెమ్మెయిఁదార్చి యుండె ధృతి ♦ నెక్కొన క్షామముగప్పి యాజకుం
డమ్మహనీయమంత్రతతి ♦ నాదృతి మీఱఁ బఠించుచుండఁగన్. ౧౯౦

తే॥ దక్షిణార్థము విధిచొప్పు ♦ దప్పకుండ, బ్రహ్మముఖులగు ఋత్విక్ప్ర ♦ వరుల కొసఁగె
మహిషిమున్నగు నలువురు ♦ మహిళల విభుఁ, డర్థపరివృత్తి మఱల వా ♦ రతనికిడిరి.

మ॥ హయమేదస్సు గ్రహించి సర్వవిదుఁడ ♦ య్యధ్వర్యుఁ డర్థిం గ్రియా
నియతుండై శ్రపణంబొనర్చి సవనా ♦ గ్నిన్వేల్చె నాశ్రావయా
వయవాదిశ్రుతదేవతాంచితమహో ♦ వౌషట్పదాంతాఢ్య వా
క్చయమొప్పార సువర్గలోకహితకృ ♦ త్సంరంభ మొప్పొంగఁగన్. ౧౯౨

ఆ॥ తోనె నృపుఁడు హోమ ♦ ధూమగంధాఘ్రాణ
మాచరించె విధివి ♦ ధాంచితముగ
జన్మకర్మబంధ ♦ చయము నేఁడిన్నెఱిఁ
దలఁగఁగంటి నని ము ♦ దమునఁదరుణి ౧౯౩

క॥ వైతసశాఖాసాద్యము, లాతురగాంగముల నెల్ల ♦ నటుశ్రపణవిధో
పేతములఁజేసి వేల్చిరి, ఖ్యాతి తలిర్పఁగఁ బదార్వ ♦ రౌఋత్విజులుఁ. ౧౯౪

సీ॥ అశ్వమేధీయమ్ము ♦ లహములు మూఁడగు, నవి చతుష్టోమ ము ♦ క్థ్య మతిరాత్ర
మన నొప్పఁ దత్ప్రవ ♦ ర్తనమున కలరి య, య్యజమానుఁడాదృతి ♦ నాచరించె
జ్యోతిరాయుఃపద ♦ సోమాతిరాత్రము, లభిజిత్తు విశ్వజి ♦ త్తనెడునవియు
వానిలో నెల్లఁబ్ర ♦ ధాన మప్తోర్యామ, మిన్నియుఁబూరించి ♦ యెసకమెసఁగు
నసము గనె ధన్యుఁడీతండె ♦ యనఁగఁబ్రాచి
హోతకిచ్చె నధ్వర్యున ♦ కొసఁగె నట్ల
వాగ్దిశఁ బ్రతీచి బ్రహ్మక ♦ వ్వరుఁ డుదీచి
నొప్పనుద్గాత కర్పించె ♦ నుచితమెఱిఁగి. ౧౯౫

ఆ॥ బ్రహ్మనిర్మితంబు ♦ ప్రవరమీ యశ్వమే, ధంబు దీనికిదియె ♦ తగుసమగ్ర
దక్షిణయు నటంచుఁ ♦ దద్దయు నద్దేవుఁ, డానతిచ్చె శ్రుతియు ♦ నట్లె తెలుప.

శా॥ ఆక్షోణీంద్రుఁడు యాజకాలికి యథా ♦ ర్హాంబరాభరణాల్గూర్చి త
ద్దీక్షాంతంబున నుత్సవోన్నతిఁ జతు ♦ ర్దేశౌఘ మర్పించినన్
మోక్షశ్రీప్రవణు ల్మునీంద్రులు మహా ♦ మోదంబు చెన్నార స
ద్వీక్షారాజి దయాఽమృతం బొలుక దా ♦ రిట్లాడి రబ్జాననా. ౧౯౭

శా॥ ఆత్రంబింతయులేక వన్యల మహా ♦ హార్ష ప్రకర్ష స్థితిం
బత్రాదుల్భుజియించి యక్షయతపః ♦ పారీణతంగోరు మే
మే; త్రాతాఖిలలోక; యేలుదుము చా ♦ లిద్దేశముల్గామ్ము నీ
పుత్రోత్పత్తియె నీకు మాకును శుభం ♦ బుల్గూర్చు నభ్యర్చ్యయై. ౧౯౮

ఆ॥ ఇష్టమున్న నొసఁగు ♦ మినవంశ్య; యదనీయ
నిష్క్రియముగ నెదియొ ♦ నెగడునదిగ
మణిసువర్ణచయమొ ♦ మహితగోనిచయమో
విధినియుక్తమైన ♦ విషయ మిదియ. ౧౯౯

క॥ నీవేలుము నీసంతతి, యావలనేలునుఁ బ్రశస్తి ♦ యలరారఁగ ని
ట్లీవలనున వలగొనునది, మావాక్యలనఁ శ్రుతిపరి ♦ మాణమ కాఁగన్. ౨౦౦

వ॥ అనుచు నమ్మహామహు లెల్లరు నానతిసేసిన. ౨౦౧

తే॥ ఆవశిష్ఠాదిమునుల కి ♦ ట్లనియె నాతఁ, డయ్యలార భవత్కటా ♦ క్షాంచలములఁ
గాదె యివియెల్ల నిలుచుట ♦ కాక యెుండుగలదె మత్ప్రాభవైకప్ర ♦ కల్పితంబు.

క॥ ఆపలుకులు పునరుక్తము, లీపృథివీదానమైన ♦ నింద్రాదికృపా
ప్రాపితహావిరాదిపునః, ప్రాపణనిజకర్తృతాప్ర ♦ పత్తియ కాదే. ౨౦౩

ఆ॥ ఐనభవదనుగ్ర ♦ హానుకారము మాకుఁ, గార్య మఖిలభవ్య ♦ కరము ననుచుఁ
దత్ప్రికార మన్య ♦ దానకోటుల వారిఁ, దనిపె నృపుఁడు భద్ర ♦ దాననిపుణ.

క॥ మునులటు మనుధర్మంబున, మనుజేంద్రుని మఖము పరిస ♦ మాప్తి నెఱపఁద
ద్వనపర్ణశాల లపుడ, య్యనఘుని కృతి స్వర్ణశాల ♦ లయ్యెఁబ్రియసఖీ. ౨౦౫

తే॥ కడమఋత్విజులకు నట్లు ♦ గలయఁగోటి
కోటులుగ భూరిదక్షిణ ♦ లొక్కల్లసేసె
సార్వభౌముండు మహితభూ ♦ సహితముగను
గోహిరణ్యాదిశతములు ♦ గొసరుగాఁగ. ౨౦౬

తే॥ ఎల్లరకు భూరిదక్షిణ ♦ లిచ్చియిచ్చి
తృప్తిగానఁ డెంతకు నతండు ♦ తృప్తులైరి
దేశదేశాగతులు మహా ♦ ద్విజులు మునులు
నర్థులును నర్థపతులై తా ♦ రనఁగ నెగడి. ౨౦౭

క॥ ఆశీర్వాదములందిమ, హీశుఁడు గురు ఋశ్యశృంగు ♦ నెలయించుచుఁద
త్ప్రాశస్త్య ముగ్గడించి స్వ, కాశంసితపూరణార్థ ♦ మై వేఁడుటయున్. ౨౦౮

—♦ దశరథుండు పుత్రకామేష్టి సేయుట ♦—

తే॥ ఎలమిమై వార లిట్లని ♦ రిపుడొనర్తు
మయ్య; పుత్రేష్టి శ్రౌతశీ ♦ ర్షాంచితములు
మంత్రములు గొని దానస ♦ న్మహితులు జని
యింత్రు నలువురు జగదేక ♦ హితులు సుతులు. ౨౦౯

క॥ లలి నమృతమయోర్మ్ముల న, ట్లలఘు లతనిఁదేర్చి తత్స ♦ మారంభ మనా
విలముగ నొనరించి ప్రయో, గలహరిఁ బోరి వెల్లిగొలుపఁ ♦ గడలుకొనియటన్,

క॥ సర్వజ్ఞులు వారట్టు ల, థర్వశిరోమంత్రవిధులఁ ♦ దాత్పర్యముమై
నుర్వీరమణుని యిజ్యా, నిర్వాహణము గూర్ప వలయు ♦ నెఱి వెలయింపన్.

తే॥ అందు నాలుగు నాల్గు రెం ♦ డైదు రెండు
వర్ణములు గల శ్రౌతవా ♦ గ్వర్తనంబు
సెల్ల విలసిల్లి రెల్లజే ♦ జేలు హవ్య
రసమునకు నెక్కుడౌ హర్ష ♦ రసము పొసఁగ. ౨౧౨

చ॥ క్షమ చెలువుండు వెండియుఁబ ♦ శ స్తగుణాఢ్యము విష్ణుదేవతా
కమగు చరాత్తమంబు సుత ♦ కామ్య వషట్కృతిఁగూర్పఁ దత్ప్రప
త్తిమహిమ నల్లదేవుని యు ♦ దీర్ణకృపామృతరాశినా కటా
క్షమయసురద్రుమాలి కది ♦ కారణవస్తుతఁ గాంచె నెచ్చెలీ. ౨౧౩

వ॥ అయ్యవసరంబున. ౨౧౪

సీ॥ ఆశాప్రదేశంబు ♦ లనువున్నై నిజసుప్ర, సన్నభావముఁ జూపఁ ♦ జాలుటకును
సురభిలమై నేల ♦ చూల్కొని శుభపరం, పర లీనునెజెనిఁ జూ ♦ పట్టుటకును
గమ్మతెమ్మెర లొడి ♦ కమ్మగా గొనకొని, వీవన ల్పచరించు ♦ విధమునకును
బయలున నగుపల్కు ♦ బడు లెల్లఁ గర్ణర, సాయనస్థితి విందు ♦ సేయుటకును
జలము లుప్పొంగుటకు ధనం ♦ జయు నుదార
లక్షణములకు నలరె యి ♦ లామహేంద్రుఁ
డఖలము జగమ్ము దనమేలె ♦ యరయుజాడ
యిదియ కానోపు ననుచుఁ బూ ♦ ర్ణేందువదన. ౨౧౫

క॥ ఉపసదమునఁ గ్రియ లెల్లం, దపసులు పూరించుకలిమి ♦ దార్కొన జేజే
లపరిమితానందము కృతి, నపారమగు పారవశ్య ♦ మందంగనుచున్. ౨౧౬

—♦ దేవతలు మునులు బ్రహ్మదేవునితో ముచ్చటించుట. ♦—

తే॥ యజ్ఞభాగార్థసమవేతు ♦ లమరులు మును
లందు నలువొందు నాశతా ♦ నందు లోక
కర్తఁ గనుఁగొని గడుకొన్న ♦ యార్తి నెంచి
యిట్లనిరి తమయిచ్చ మ ♦ హేచ్ఛ నెఱయ ౨౧౭

సీ॥ భగవంతుఁడ; త్వదీయ ♦ మగువరంబున దృప్తుఁడై రావణుండుదు♦రాత్ముఁడగుచు
బాధించుచున్నాడు ♦ ప్రబలి ముల్లోకము, ల్నిష్కృతినిర్వృతు ♦ ల్నెఱయనీఁడు
లెక్కసేయఁడు శక్రు ♦ నక్కటిను నెదుర్ప, నితరసురల్మను ♦ లెంతవారు
తపనుఁడు తద్భీతిఁ ♦ దపియింపఁ జాలఁడు, పొదలఁడు వాయువు ♦ మెదలఁడబ్ధి
చదిపె నెందఱ నెందఱ ♦ చ్చరల మెదిపె, నెందఱెందఱ యువతుల ♦ నెట్లుసేయఁ
డేమనఁగవచ్చు మిత్తికి ♦ నామమిడిన, వానితోఁబోరు బెబ్బులి ♦ వాతఁతీరు.

క॥ మున్నడుగఁ దెలిపినాడవు, వెన్నుఁడు జనియించి జగతి ♦ వెలయు నటంచున్
విన్ననువది యెన్నటికని, యున్నారము దానిదెస స ♦ ముత్కల మగుచున్.

క॥ అని దేవత లర్థింపఁగ, విని విధి యిట్లనియె నట్టి ♦ వెరవునకై యే
నును వేచి యుంటి నింతకుఁ మునుపాతఁ డవధ్యుఁ డగుట ♦ మొనకొనియుంటన్.

క॥ మానుషవధ్యుం డాతఁడు, మానుషమూర్తి యయి హరియె♦మడఁప మడఁగుఁగా
కానేరిమి గలరె యొరుల్, గానగునది గాకయున్నె ♦ కలవర మిరవే. ౨౨౧

క॥ అని విధి సూచించిన సుర, లనుపద మయ్యర్థమరయు ♦ నయ్యనువున నె
మ్మనముల నూఱట వురికొనఁ, దనరారుచు నుండునంతఁ ♦ దద్దయు నచటన్.

—♦ విష్ణుదేవుండు దేవతలకు దర్శనంబొసఁగుట ♦—

ఉ॥ పచ్చనిపట్టుగట్టి ద్యుతి ♦ ప్రాఁకిడి దిక్కుల నాఁకపెట్ట న
భ్యుచ్చయముల్ దరార్యసిగ ♦ దోజ్జ్వలము ల్కరము ల్స్వకీయసం
పచ్చయ ముచ్చరింప హరి ♦ పాలితలోకుఁడు గానుపించె మీ
రిచ్చలఁ బిచ్చలించునది ♦ యేమిటి కంచను భావ మేర్పడన్. ౨౨౩

—♦ దేవతలు విష్ణునిఁ బ్రార్థించుట ♦—

ఆ॥ బ్రహ్మతోడఁ గూడి ♦ పరఁగి సమాహితుఁ, డై జగద్వినేత ♦ యలరుచుండ
నమరు లెల్ల మ్రొక్కి ♦ యర్థించిరి శరణ్య, శరణ మనుచు భక్తి ♦ జాలుకొనఁగ.

సీ॥ కార్యకారణకర్త్ర ♦ కలన లిట్లెన్నియు, నీయవె కావె వి ♦ నిర్మలాత్మ
జగముల నెలకొల్ప ♦ మొగకొని పోషింప, నీవకా కెవ్వారు ♦ నేర్తు రభవ
యాపదుద్ధారకా; ♦ యని పిల్వ నీకన్నఁ, బరువిడుదురె యొరు ♦ ల్పద్మనయన
నీనామము స్మరింప ♦ నిరయంబుఁ దలఁగింపఁ, బందెమ్ము చఱచెగాఁ ♦ యిందిరేశ
యట్టినీ కుపేక్ష ♦ యగునయ్య; దయ్యాల, పోరుగెడపి మమ్ముఁ ♦ బ్రోవు మయ్య
సమయమిదె దురాత్ము♦ సమయింప నిద్ధరఁ, బొడము మయ్య పుట్టు♦ బుద్ధులయ్య.

క॥ నీకేమి దెలుపువారమె, ప్రాకటయశుఁ డీయయోధ్య ♦ పతి దశరథుఁడ
ప్రాకృతుఁ డిటు పుత్రార్థితఁ, బ్రాఁకిడుచున్నాడు నీకృ ♦ పం బడయంగన్. ౨౨౬

ఆ॥ ధర్మమూర్తి యతివ ♦ దాన్యుఁ డీతండు మ, హర్షిసముఁడు వీని ♦ యతివ లట్టు
లెలయువారు శ్రీయు ♦ హ్రీయుఁ గీర్తియు ననఁ, బేరుగన్నవారు ♦ పృథివియందు

క॥ ఆమువ్వురి యందుఁ జతు, ర్థామహితాత్మకుఁడ వగుచు ♦ ధామనిధికులీ
నాముష్యాయణపుత్రీ, త్వామంత్రితమానుషత్వ ♦ మంది కడంకన్. ౨౨౮

ఆ॥ విధివరప్రవృద్ధు ♦ విశ్వకంటకు సురా, సురదురాసదుం బ ♦ శువు వధింప
దీక్షితుండ వగుము ♦ దీక్షితుండవ కావె, యఖిలలోకరక్ష ♦ ణాధ్వరమున.

క॥ నీయెఱుఁగని యవియే పా, పాయతనము రావణుని దు ♦ రాగతము లిఁకన్
మాయయ్య; తాళజాల మ, జేయు నజిత; గెలిచి గెలుపు ♦ సిరి గైకొనవే.

క॥ మాయామనుజాకృతివై, మాయావి న్మానవాదు ♦ మర్దింతు వటం
చీయిందఱమును శరణని, నీయంఘ్రుల వ్రాల నిట్లు ♦ నెఱసితిమి హరీ. ౨౩౧

ఆ॥ కన్నతండ్రి వీవె ♦ కరుణాంబునిధి వీవె, దాత వీవె దైవ ♦ తంబ వీవె
పరమగతియు నీవె ♦ ప్రార్థింతు మిట్లని, దుష్టవధకు దొరవు ♦ దొరయు మయ్య.

## —♦ దేవతలకు నారాయణుం డభయంబిచ్చుట ♦—

ఆ॥ అనెను సురల మొఱల ♦ నాలించి విష్ణుండు, వరదుఁ డఖిలలోక ♦ వంద్యుఁ డనియె
ధర్మసంహితార్థ ♦ తత్పరులఁ బితామ, హాప్రముఖులఁ గాంచి ♦ యాదరించి.

క॥ విడువుడు భయ మభయం బే, నిడువాఁడను భద్రమింక ♦ నిందఱ కగు నా
చెడుగర మడంతు రావణుఁ, గడఁక సుతామాత్యబంధు ♦ గణకలితునిఁగాన్.

క॥ మున్ను విధి యందఱకునై, తన్నుఁగొలిచి వేఁడ వెలయు ♦ తాత్పర్యమునం
బన్నితి జననం బిన్నెఱి, నన్నాటిక నేఁటి కొదవె ♦ నది యుచితగతిన్. ౨౩౫

ఆ॥ అసురు దేవమునిభ ♦ యావహుఁ దెగటార్చి, యవని ధర్మసంస్థ ♦ నందఁజేయు
విధికిఁ బదునొకండు ♦ వేలేండ్లు నివసింతు, మనుజలోకమున సు ♦ మాళమునను.

తే॥ ఆత్మవంతుండు విష్ణుఁ డ ♦ ట్లమరులకు వ
రంబొసఁగి నెమ్మనమున ది ♦ రంబు సేసెఁ
దనదు పుట్టువునకు నట్టు ♦ దశరథుండు
ఘనుఁడు ధర్మాత్ముఁ డితఁడె యాఁ ♦ గాత మనుచు. ౨౩౭

క॥ తమయిచ్చ నెల్ల హరి య, ట్లమల చతుర్థాంశకలన ♦ నవని జనింపన్.
సుమనస్కృత భావించిన, సుమనసు లర్చించి రుక్తి ♦ సుమన స్తతులన్. ౨౩౮

క॥ ఆనందసాంద్రుఁ డజుఁ డమ, రానందన మట్లు గూర్చి ♦ యవలిప్రబంధం
బానయమున వెలయింపం, దా నంతర్ధాన మందెఁ ♦ దత్పరుఁ డగుచున్. ౨౩౯

## —♦ బ్రహ్మసురర్షులతో వానరసృష్టింగూర్చి హెచ్చరించుట. ♦—

వ॥ అట్లు సర్వలోకపూజ్యుండైన విష్ణుండు విధిముఖసకలసురమహర్షివరనికరసంపూజ్యమానుం డగుచు ధ్యానగమ్యుం డగుటయుఁ జతురాననుం డెల్లరం గనుంగొని తొల్లి హరి యానతింగొని యద్దేవునకు సహాయార్థంబుగ వానరవీరుల సృజియింపుఁ డని మీకెఱింగించి యంతకుమున్న యేనావులించునంత జాంబవం

తుండను నొక ఋక్షవీరవరోత్తంసుం డుదయింపఁ బడంపడి సంసృష్టులగు నెల్ల భల్లూకగణంబులకు నాతని వల్లభునిం గావించి యుంచినాడ మీర లందఱుం దదనుశాసితిప్రబంధంబు సానుబంధం బొనరించితిరే యద్దేవదేవునకు సహాయు లగు వార లెల్ల బలవంతులు కామరూపులు మాయావిదులు మహాశూరులు వాయువేగులు నీతివేత్తలు బుద్ధిసంపన్నులు విష్ణుతుల్యపరాక్రములు నసంహార్యులు నుపాయజ్ఞులు దివ్యసంహననోపేతులు సర్వాస్త్రగుణసంపూర్ణులు నమృతప్రాశన ప్రశస్తులో యననలువొందువారలుఁ గా నుండురుగాత మఱియు మున్నుసముద్ర మథనాదిప్రసంగంబులం గార్యార్థమై మీచే సృజియింపం బడినవారును వెండియు నేనిక్కార్జంబునకై పురికొలుపం గావింపం బడినవారును నట్టులుండ నేఁడును నేమఱపాటులేక యచ్చరల యందును ముఖ్యలగు గంధర్వ స్త్రీలయందును యక్షకిన్నరపన్నగవిద్యాధరాదికన్యలందును వానరీగాత్రంబుల యందును హరి రూపులవు పుత్రుల స్వస్వతుల్యవిక్రముల స్వాంశప్రవేశంబుల జనియింపం జేయు నది యని యవ్విధాత్ముండు ప్రబోధించుటయు నవ్వారెల్ల నుల్లసిల్లుచుఁబ్రాచీన సృష్టిం బ్రభవించినఘను లట్టులుండనప్పటియానతి నా ధృతి స్మఱికొందఱునుద్భ వింపం బొనర్చినార మింకను దేవరవారి యభిప్రాయం బనుసరించి కొలందికి మీఱు వానరశ్రేష్ఠులం బ్రాదుర్భవింపం జేయువారమని యాదేవజ్యేష్ఠునితో విన్నవించి యాయనయుఁ దారును సంపూర్ణమనోరథులై తనరారుచుండి రంత.

—♦ వానరోత్పత్తి ప్రశంస ♦—

తే॥ పుడమిఁ బొడమినవారిలోఁ ♦ బూజ్యమానుఁ
డయ్యెఁ ద్రిదశులలో నిందు ♦ నట్టులైంద్రి
వానరేంద్రుఁ డూర్జితుఁడు నై ♦ వఱలె వాలి
వాలి యనుపేర జగముల ♦ వారు పొగడ. ౨౮౧

క॥ తపనోత్థుఁడు సుగ్రీవుం, డపరిమితబలుండు వాని ♦ యనుజుండగుచున్
తపతాంవరుఁ డీతఁడు నన, సుపుణ్యాకృతి ఋక్షవరజు ♦ సుతుఁ డుదయించెన్.

క॥ అందఱు వానరముఖ్యుల, యందు దుత్తమబుద్ధిశాలి ♦ యగు తారుఁ గనెన్
బృందారకగురుఁ డటు భవ, మందించెన్ గంధమాద ♦ నాఖ్యు ధనదుఁడున్.

ఆ॥ విశ్వకర్మ నలుఁ బ్ర ♦ వీణు మహాహరిఁ, గాంచె నీలు నగ్ని ♦ కల్పు నగ్ని
గలుగఁ జేసె నతఁడు ♦ కడచె నెల్లరఁ దేజ, సంబు బీరమును ఘ ♦ నంబుగాఁగ.

తే॥ రూపధను లాశ్వినేయు లా ♦ రూఢరూప
సమ్మతులు మైందు ద్వివిదుని ♦ సంభవింపఁ
జేసిరి బలార్ణవుల సుసం ♦ సిద్ధతనుల
సక్రమపరాక్రముల సుధా ♦ శనుల ఘనుల. ౨౪౬

ఆ॥ వరుణుఁ డటు సుషేణు ♦ శరభుఁ బర్జన్యుండు, వానరేంద్రు హనుమ ♦ వాయుదేవుఁ
డును జనింపఁ జేసి ♦ రనుపముఁ డనిలజుం, డతనిఁ బోలు శూరు ♦ లవని లేరు.

తే॥ వజ్రసంహననంబున ♦ వఱలు చుండు, నిండుజవమున వైనతే ♦ యుం డతండు
సర్వవానరముఖ్యప్ర ♦ సంగములను, నెగడుగన్నాడు ధీబల ♦ నిర్ణయముల. ౨౪౮

చ॥ పొడమిరి వేనవేలు బల ♦ పూర్ణులు రాక్షసనాథు మార్కొనన్
దొడరెడువా రమేయరణ ♦ ధూర్వహు లర్యమతేజు లూర్జితుల్
కడలిఁ గలంప నక్కడలు ♦ గార్కొన నెక్కొని విక్రమింప ని
ప్పుడమిని వ్రక్కలింప ధృతి ♦ బోలుదు రిందఱునాఁ దనర్చుచున్. ౨౪౯

ఆ॥ కామరూపు లైచ్ఛి ♦ కప్రచారులు మేరు, మందరాభసుదృఢ ♦ మహితతనులు
వఱలి రొకట ఋక్ష ♦ వానరగోపుచ్ఛ, లెల్లదెసల వీర ♦ లే యనంగ. ౨౫౦

ఆ॥ నేల యీనిన చందాన ♦ నేటుకొనిరి, దేవతామానసికసృష్టి ♦ దేటపడఁగ
నెవని యంశంబున జనించె ♦ నెవ్వఁ డతని, కట్టి రూపవేషపరాక్ర♦మార్తివెలయ.

క॥ గోలాంగూలస్త్రీలం, దాలీలనె ఋక్షవాన ♦ రాంగన లందున్
జాలఁగ జనింపఁజేసిరి, శ్రీలలనాథవుని యానఁ ♦ ద్రిదశు లవశులై. ౨౫౨

తే॥ గరుడగంధర్వకిన్నర ♦ ఖచరయక్ష, సిద్ధవిద్యాధరోరగుల్ ♦ చెలఁగు ధృతి మ
హర్షులునుఁ దత్తదంగన♦లందుఁ గపులఁ, గలుగఁజేసి రక్కర్జంబు♦గడలుకొనఁగ.

తే॥ కామరూపబలోన్నత ♦ గతుల నతుల
మతుల సుతులఁ దమకుఁ బోలు ♦ పతులఁ గలసి
మలసి వెసఁ గాంచి రచ్చర ♦ మచ్చెకంటు
లొరసి బన్నంబు లీఁగనొ ♦ నోజ మెఱసి. ౨౫౪

క॥ ధీరులు యథేచ్ఛకృతసం, చారులు శిక్షితనయప్ర ♦ చారులు ప్రాప్త
పారాగమవారాంనిధి, పారులు శూరులు ధుతాఘ ♦ భారులు వారల్. ౨౫౫

తే॥ సింహశార్దూలనిభులు వి ♦ శిష్టదర్ప
బలసమేతు లందఱు శిలా ♦ ప్రహరణులు ద్రు
మాధియోధులు నఖరదం ♦ ష్ట్రాయుధులు స
మస్తశస్త్రాస్త్రకోవిదు ♦ ల్మాన్యయశులు. ౨౫౬

ఆ॥ లెక్కసేయ రరుల ♦ లీలాహరుల్ హరుల్
ద్రక్కలింద్రు గిరుల ♦ జక్కడంద్రు
తరువరములఁ గరులఁ ♦ దార్కాణగాఁ బట్టి
బంతియాటలాడి ♦ ప్రథితి గాంత్రు. ౨౪౮

ఆ॥ శరభసింహనాగ ♦ శార్దూలముఖ్యమ్ము, లెన్నియేనిఁ ద్రోవ ♦ నెదురుపడిన
నెన్నఁబోవ రెత్తి ♦ యిట్టటుఁ బడవైచి, యిచ్చవచ్చినట్లు ♦ లేగుచుంద్రు. ౨౪౯

తే॥ వేగమున సంద్రము గలంప ♦ విపులఁ గాల్ల, దారణం బొనరింపంగఁ ♦ దలఁకఁ బోరు
చొత్తు రబ్బలిసద్మము ♦ సొరిది విష్ణు, పదము ముట్టెద రబ్ధిగో ♦ ష్పదము దమకు.

ఆ॥ ఘనులఁ బట్ట విడువఁ ♦ గానోపుదురు వన్య, మృగమృగాదనముల ♦ మిడుతపిండు
నట్లు నులుమఁ జాలి ♦ యఱిముదు రఱపుల, నవనిఁగూల్తు రధిప ♦ హంగమముల.

ఆ॥ పుడమిఁ బొడమి రిట్టి ♦ పోటుబంటులు హరుల్, హరిదధీశ్వరాది ♦ సురనికరవ
రాంశముల మహాత్ము ♦ లతిబలాఢ్యు లసంఖ్యు, లట్లుఁ గామరూపు ♦ లనఁగ నగుచు.

క॥ అందును శతసాహస్రము, లందిన తెగలకుఁ బ్రధాను ♦ లై నెగడినవా
రందఱును యూథపేంద్రుల, నం దగిరి సృజించి రట్టి ♦ నాయకమణులన్. ౨౫౩

ఉ॥ ఉందురు ఋక్షవంతమున ♦ నూర్జితులౌ హరివర్యు లందునుం
గొందఱు మాల్యవంతమునఁ ♦ గోటి కొలందిగ మేరువింధ్యపా
రందరమందరాద్రులఁ ది ♦ రంబు లనందగు కాననంబులన్
బొందికమై వసింతురు ప్ర ♦ భుత్వ విభుత్వమహత్త్వము ల్తగన్. ౨౫౪

ఆ॥ సూర్యపుత్రుఁ డైన ♦ సుగ్రీవు హరిపుత్రుఁ, డైన వాలి నెల్ల ♦ రఘుచరాఘ
నాథులును భజింత్రు ♦ నలు నీలు హనుమనిఁ, గొలుతు రటులె కీశ ♦ కోటికోట్లు.

క॥ అన్యులు నన్యుల నట్లైయు, నన్యాదృశులన్ సమాహి ♦ తాత్ముల రగుచున్
మాన్యత్వమొలయఁ గొల్తురు, ధన్యులు వీర లన మేలి ♦ తాత్పర్యమునన్. ౨౫౬

ఆ॥ తార్క్ష్యబలసమృద్ధిఁ ♦ దనరు వారల నేలు, వాసవోపముండు ♦ వాసవాత్మ
జుండు నిండుమది న ♦ ఖండసత్త్వాఢ్యుండు, గండుమిగిలి తనదు ♦ కడిమి మెఱయ.

క॥ యుద్ధవిశారదు లటుల, త్యుద్ధతులు సమృద్ధిమంతు ♦ లురు తేజులు ను
ద్బుద్ధులు నగు వారిదెసన్, బద్ధాంజలు లగుదు రిడరు ♦ ప్రతిమతు లెవరున్. ౨౫౮

క॥ నహపర్వతవనసాగర, మహి యెల్ల మహామహీంద్ర ♦ మండలి యన స
న్మహ మొప్పఁ గాననయ్యెను, బహుధాంచద్భాగ్యయోగ ♦ పద్ధతి వెలయన్.

శా॥ నానావ్యంజనలక్షణు ల్వివిధస ♦ న్నాహోద్యసంస్థాను ల
భాగ్రిద్ధు ల్గిరికూటకల్పులు రణ ♦ వ్యాపారపారీణతా
నూనప్రాభవసత్త్వసంభృతులు నై ♦ యొప్పారి రప్పాటనా
శ్రీనాథాంశవిశేషసేవనకళా ♦ స్థిత్వంబు గన్పట్టఁగన్. ౨౬౯

తే॥ ఇనకులుం డట్లుపుత్రకా ♦ మేష్టి కృత్య
మెల్ల నెరవేర్చ చుండమా ♦ నీంద్రు లఖిల
తంత్రముల జాగరూకులై ♦ తనరుచుండ
విధిముఖులు తద్విశేషాప్తి ♦ వేచియుండ. ౨౭౦

క॥ పూర్ణముగఁ బండె సుకృతం, బర్ణవ మీభవము దాఁట ♦ నౌనుఁ గడఁగి నా
నిర్ణయ మిదె యని ముదమునఁ, బూర్ణాహుతి వేల్చె నతఁడు ♦ పుణ్యవిశాలా.

తే॥ కుందకుట్మలరదన; యా ♦ చంద మైన
జ్యాదయితు నిజ్య కంచితా ♦ మోద మెసఁగ
జ్వలనుఁడు ప్రదక్షిణార్చుల ♦ నలరె నధిప
యిదిగొ శుభ మందుకొమ్మని ♦ యిచ్చె ననఁగ. ౨౭౧

క॥ అనలార్చిర్మండల మట్టు, లనఘము ఘనము శివ మవ్య ♦ యము ముక్త్యాలం
బనము నయి చిత్ప్రకాశం, బన నొక్కట వెలుఁగు నెడఁ ద ♦ దవకాశమునన్.

—♦ ప్రాజాపత్యపురుషుండు సాక్షాత్కరించుట. ♦—

సీ॥ సాంధ్యరాగాంచిత ♦ చంద్రబింబము నాగ, రక్తాస్య మానంద ♦ రసము గూర్ప
హర్యక్షసటల నె ♦ య్యము గోరు శ్మశ్రుసమూ, రజములు విద్యుత్ప్ర ♦ తతులకోప
దుందుభిధ్వానంబు ♦ దొరయు కంఠధ్వని, కరుణామృతాసార ♦ గర్జ గాఁగఁ
గల్యాణలక్షణ • కలితావయవరుచు, ల్దివ్యభూషలఁ గ్రొత్త ♦ తేట నింప

నమితతేజంబు తిమిరాలి ♦ నప్పళింప
స్ఫురితదృష్టులు కలుషరా ♦ సుల దహింప
మేరుశృంగంబు నోడియ నె ♦ మ్మేను దివురఁ
బ్రబలవీర్యంబు రక్షోఘ్న ♦ భావమూన. ౨౭౨

క॥ మంగళకరనిజకరయుగ, సంగతి నమృతకలశాను ♦ సరణ మెసఁగ మే
ల్సింగారమ్ముల కిరవగు, బంగారుఁపుఁ బాత్రయందుఁ ♦ బాయస మమరన్. ౨౭౩

తే॥ మగువనై పుణ్యజనతతి ♦ మాయ నొంచి
సురల కమృతంబు వంచితిఁ ♦ బరమపురుష

ధర్మ ముడివో నటంచు న ♦ త్తఱుఁగు మాన్పి
కొనఁ దలఁచు శౌరి పుంరూప ♦ మునను మీఱె. ౨౭౬

ఆ॥ పత్నిఁబోని స్వర్ణ ♦ పాత్రి రాజతపరి, చ్ఛద సుదివ్యపాయ ♦ స ప్రపూర్ణ
శ్రీయుతాఖిలార్థ ♦ సిద్ధి మాయామయి, నట్లు బాహుయుగళి ♦ నవధరించి. ౨౭౮

క॥ చనుదెంచి దివ్యపురుషుం, డనఘుం డొకఁ డోయి దశరథాధీశ్వర; యో
యినకులమణి; యని సంబో, ధనయశ మన స్మితఁపు జ్యోత్స్న ♦ దశదిశలానన్.

తే॥ సభ్యు లెల్లరు విన నిట్లు ♦ సంభ్రమంబు
పరఁగ ననియెఁ బ్రాజాపత్య ♦ నరుఁడ నేను
నిచటి కభ్యాగతుఁడ నైతి ♦ నెలమిగనుము
జనవర యటన్న నాతఁడం ♦ జలి ఘటించి. ౨౭౯

క॥ భగవంతుఁడ; స్వాగతమే, యగుఁగావుత నీకుఁ బ్రస్తు ♦ తార్థం బెది యే
వగ నీతని నేవిధికృతి, సుగమశుభోదయు నొనర్పఁ ♦ జూచెదొ; యనినన్. ౨౮౦

ఆ॥ అమ్మహాత్ముఁ డట్టు లధిపుచే సత్కృతుం, డగుచుఁ దత్ప్రవృత్తి ♦ నభినుతించి
మేలిసంతసమున ♦ మేకొను నడిసన్న, లమర మరల నిట్లు ♦ లనుచుఁ బలికె.

తే॥ ప్రభుఁడ యిది యపరిమితప్ర ♦ భావకలిత
మమరనిర్మితమగు చరూ ♦ త్తమము వేల్పు
పెద్ద ప్రేరేప దీని సం ♦ ప్రీతిఁ గూర్చి
నాడ యజ్ఞేశ్వరునిఁ గాఁగ ♦ నన్నుఁ గనుము. ౨౮౧

క॥ దేవతలఁ బ్రీతిపూర్వక, మీ వేయెడనేని నర్చ ♦ లెనయించుచు సం
భావనలఁ దనుపుచుండుట, కీవిధమగు ఫలముఁ గాంచి ♦ యెలయుట గలిగెన్.

క॥ నృపశార్దూలా; సుకృతప, రిపాక మిదె యంచుఁ బొసఁగు ♦ రీతిఁ గొనుము నీ
కపరిమితారోగ్యసుఖో, పపత్తి నొనగూర్చు దివ్య ♦ పాయస మింకన్, ౨౮౪

క॥ నీపత్నుల కీపాయస, మో పాపవిదూర ; పంచి ♦ యొసఁగుము మదిలో
నేపరమార్థం బిడి తది, యే పుణ్యక్రతుఫలముగ ♦ నెనసెదు తోడ్తోన్. ౨౮౫

క॥ ఏ పుణ్యశ్లోకుఁడు హరి, శ్రీపతి తనుధారియై భ ♦ రించు జగతి నె
ప్డాపరమేష్ఠి చతుర్విధ, రూపతఁ దద్గర్భయోగ ♦ రూఢి జనించున్. ౨౮౬

శా॥ ఏరీ పుణ్యులు వీరికన్ననని తా ♦ రింపొంది బ్రహ్మాదులుం
బారంపర్యముగా నుతింప విలస ♦ త్పృథ్వీశోదయస్ఫూర్తితో

శ్రీరామాధిపుఁ బుత్రితం బడసి సు ♦ శ్రీమూర్తివై హర్షమ
న్పారావారముఁ గొల్లవెట్టుమని త ♦ త్పాత్రోత్తమం బిచ్చినన్. ౨౮౭

క॥ మిన్నంది యందుకొని తన, కన్నుల నద్దుకొని దివ్యుఁ ♦ గనుఁగొని యర్చ
ల్మన్ననలుఁ గూర్చి వినుతు, ల్వన్ని మహాభక్తితోడి ♦ ప్రార్థన లెసఁగన్. ౨౮౮

ఆ॥ అద్భుతంబు తన్మ ♦ హాభూత మత్యంత, హర్షదాయకము శు♦ భాస్పదంబు
తనకొసఁగిన దేవ ♦ తాదత్త రసమూర్తి, స్వర్ణకలశిఁ బ్రీతి ♦ సన్నుతించి. ౨౮౯

క॥ అధనుఁడు తనకు లభించిన, నిధి యక్షయ మరసి హర్ష ♦ నిష్ఠితుఁడగు న
వ్విధమునఁ బరఁగెనుఁ బరవస, మధికముగా నధిపుఁడాత్మ ♦ నందిన ధృతితోన్.

తే॥ పత్నులును దానుఁ బాయస ♦ పాత్రి తోడ
సప్రదక్షిణగతి నమ ♦ స్కారశతము
లమ్మహాత్మున కొనరింప ♦ నమ్మహీంద్రుఁ
నతఁడు దీవించి ధ్యానార్హుఁ ♦ డయ్యె మహిల. ౨౯౧

తే॥ అంతయును హర్షరశ్మిమ ♦ యంబకా నృ
కాంతు నంతఃపురంబు చొ ♦ క్కాట మెనసె
శారదరమాభిరాముఁడో ♦ చంద్రు వెలుఁగు
లంది నెగడొందు నభమట్టు ♦ లద్రితనయ. ౨౯౨

చ॥ అతివలు దాను నమ్మునుల ♦ కందఱకు న్నతు లాచరించి త
త్తతి తవ,కాంక్షితం,సుఫలి ♦ తం,భవతా,త్తనఁగా నరుంధతీ
పతియును ఋశ్యశృంగుఁడును ♦ భవ్యవచస్థ్సితి మేలుకొల్ప భూ
పతి యతులప్రభావభృతి ♦ బ్రహ్మసుఖాప్తుని రీతి నుబ్బుచున్. ౨౯౩

క॥ కోసలకన్యాప్రభృతుల, భాసము పేతలనుఁ జేరి ♦ పలికె విభుండ
క్కౌసల్యతోడఁ దొలుతన్, శ్రీసంశ్రిత మిది భుజించి ♦ స్థితిఁగను మనుచున్.

ఆ॥ ముప్పరకునుఁ బంచు ♦ మురిపెమ్ము దళుకొత్తఁ, జిత్తసీమ నదియుఁ జేర్చె ♦ నాల్గు
భాగములు నొనర్చెఁ ♦ బరికించె నవియెల్ల, మల్లచఱచు దైవ ♦ మతము నెఱయ.

క॥ కడఁగి దలపోసి యాసిరి, గడకొని యెడ నావరింపఁ ♦ గా నొక్కండ
వ్యేడఁబొడమి నిశ్చితంబయి, యెడయక ప్రేరేపఁ దద్వి ♦ ధాంచితుఁ డగుచున్.

తే॥ ఇట్టి యుద్దేశ మని పరు ♦ లెఱుఁగ రెవ్వ
రమ్మనీషి సమత్వాఢ్యుఁ ♦ డయ్యె నగ్రి

పత్ని కవరద్వితీయకుఁ ♦ బంచి యిచ్చె
నర్ధ మర్ధంబు గాఁ బాయ ♦ సాన్న మార్య. ౨౯౮

క॥ సత్రాసుఁడుఁ గాఁడు లస, న్నైమిత్రి దెసం గోఱఁతపడఁడు ♦ మహనీయుఁడు వాఁ
డాత్రిమఱి వారిచేత సు, మిత్రకా సత్కృత నొనర్ప ♦ మేకొనె నెలమిన్.

శా॥ రత్నోత్పత్తికి మున్నుగా గుణతతిన్ రత్నాకరాఖ్యాయికా
నాత్మశ్రీఁదగు కోసలాత్మజ లస ♦ న్మాత్సప్పిపితాస్యాబ్జయై
ప్రత్నఖ్యాతి దొలంక మాగధికి న ♦ ర్ధంబిచ్చె నూహించి స
ద్యత్నం బొప్పఁగ నల్లె స్వాంశమున న ♦ ర్ధం బిచ్చె నాకైకయున్. ౨౯౯

క॥ అచ్చుపడు చెలువు నేరిమి, యొచ్చె మెడయు తోడిసతుల ♦ యోరిమి మదికిన్
మెచ్చుగ నాయమ యలరెను, బొచ్చెముదెసఁ బోని యోగ్య ♦ బుద్ధిఁబురంధ్రీ.

క॥ భవితవ్యతాప్రభావము, సవరొంది తలిర్చుభావ ♦ శక్తుల నెల్లన్
దివియంగఁ జాలి తద్గతిఁ, గవియం గా కెడయునెవఁడు ♦ కాంతామణిరో. 30౧

క॥ ఆపరమాన్నము హర్షర, సాపాదక మని భుజించి ♦ యాత్రయి సిరులం
జూపట్టె నపుడె కుక్షిన్, శ్రీపతి విశ్వంభరు న్భ ♦ రించి సుశీలా. 30౨

తే॥ అంత నింతకునంతయా ♦ సంతసమునఁ
గాంతుఁ డుష్పాంగి కృత్యశే ♦ షాంతరము స
మంతతశ్శుభ మగురీతి ♦ సంతరించి
మంతు కెక్కెను దశదిశా ♦ భ్యంతరమున. 303

సీ॥ ఏసుమాళమొ లేక ♦ యే సుమనశ్శ్రేణి, పిలువకమున్నె తాఁబెరయునదియె
యేయోలిమిక లేక ♦ యే యోలి మూడగ్ను, లటుప్రదక్షిణవృత్తి♦నమరునవియె
యేమాలిమియొ లేక ♦ యే మాలి వినుచూలి, యల్లనల్లన సేవ ♦ లరయునదియె
యేమేలనమొ లేక ♦ యే మేలని యినాది, గ్రహపఙ్క్తి కొఱ లేక♦కాల్పునదియె
భూతనికురుంబ మప్పు డ ♦ భూతనియతి
నెల్లశుభలక్షణములకు ♦ నెల్ల యనఁగ
దశరథుని జన్మమున మేలి ♦ దశ రహింపఁ
గాని క్రతుకర్త లిల లేరె ♦ కానివారె. 30౪

తే॥ యాజ్యయాజకు లాజు ల ♦ య్యనఘమూర్తి
ఋశ్యశృంగుండు బ్రహ్మ ము ♦ నీంద్రులెల్ల

ఋత్విజులు దేవతలు సభ్యు ♦ లిందొకింత
యునుఁ గొఱంత ఘటిల్లునే ♦ యుత్పలాక్షి. 30౫

క॥ వచ్చెదువా ర య్యజనము, మెచ్చెదువా రమృతలబ్ధి ♦ మెయి రసతృప్తిన్
హెచ్చెదువా రటు దీవన, లిచ్చెదు వా రిజ్జగత్త్ర ♦ యిం గలవారల్. 30౬

ఉ॥ కొల్లగ నాలమంద లటు ♦ కోటులు కోటులు పైడికట్లు రం
జిల్లెడు రత్నరాసులునుఁ జేర్చుట యిచ్చుట లెక్కలేక సం
పల్లలితాకృతిన్ జగతి ♦ పట్టక రోదసికెక్కె నమ్మహీ
వల్లభు దానలక్ష్మి యన ♦ వర్ధిలి పర్వతవంశ వర్ధనీ. 30౭

చ॥ అనఘనవామృతస్థితి మ ♦ హారసము ల్వొసఁ జిందు భక్ష్యరా
శినగము లందెదుర్పడుట ♦ స్నిగ్ధత వాటిల నాటఁగొలెఁ దా
ఘనరసదానవైభవము ♦ గాంచి ఘనుం డన మించె మేఘుఁ డా
ఘనుని మఖాన్నదానకృతి ♦ గారవ మిట్టిఁ డనంగ శక్యమే. 30౮

ఉ॥ పాయనివేడ్క వేల్పుపసి ♦ పార్థివు జన్నము గాంచ వచ్చి త్యా
గాయిత ముత్సవం బటు ల ♦ ఖండ మమేయముఁ గాఁగ వెల్లనై
స్వీయభవంబు వ్యర్థమని ♦ సిగ్గున నేమన నోరురామి నం
భా; యనె నేఁటికి ప్పలుకు ♦ మానదు తత్కుల మంగనామణీ. 30౯

క॥ లేమిడి వాచక మెనసెను, గామం బపరగతి మాని ♦ కనె రసపుష్టిన్
భూమీశ్వరు క్రతువరమటు, దా ముజ్జగ మేక నరణిఁ ♦ దనుపఁ గడఁగుడున్.

ఆ॥ యజ్ఞమగుట హరియు ♦ యజమానతాదాత్మ్య, కలన నేను వేయుఁ ♦ గన్నులుండి
శతమఖుం డజుండు ♦ సర్వతోముఖతఁ ద, త్క్రతువిలాస మెల్లఁ ♦ గంటి మబల.

తే॥ అఖిలవిబుధులు మేలుమే ♦ లనఁగ నవ్వి
ధంబునఁ గ్రతూత్తమంబు పూ ♦ ర్ణం బొనర్చి
నందనవసంతమహాసమ ♦ నంతరమున
వైజయంతం బెనయు బల ♦ వైరిఁ బెరసి. 3౧౨

ఉ॥ మంగళతూర్యము ల్మొరయ ♦ మానగుకాంతులు మానినీమణుల్
చెంగట నింప విందులునుఁ ♦ జేరిక రా జడదారు లెల్ల స్వ
స్తిం గర ముచ్చరింప వొర ♦ జేయని వందులు వేడ లీలఁ బ
ణ్యాంగన లాడ భూమి యెడ ♦ యుంపు హజారము నొందె నెచ్చెలీ. 3౧3

క॥ మన్ననలతోడి సత్కృతు, ల న్నాయఁకరం బొలయ ని ♦ లానాయకులన్
సన్నుతుఁడు వనిచె వారును, సన్నాహము లొప్పఁ దరలి ♦ సంభ్రమ మొదవన్.

తే॥ ఋశ్యశృంగుని సేవించి ♦ యెల్లమునుల
కెఱఁగి తరలిరి సంమోద ♦ మెసక మెసఁగఁ
దమతమ యనీకములఁ గొంచుఁ ♦ దరము మీఱ
నెఱపు నాపృచ్ఛనంబుల ♦ నృపతిఁ దనిపి. 307

క॥ వారలతోఁ దద్బలములు, వారని కుతుకమున నరుగు ♦ వరుసఁ బొసఁగె భా
గీరథి బహురూపశుర, ప్రారంభమునం దనర్చు ♦ పట్టిది యనఁగన్. 308

చ॥ తన ముకిపెంబు పెంపున న ♦ తండు మునీంద్రులఁ గొన్ని నాళ్ళఁ బూ
జనసరసాన్నభోజనవ ♦ శంవదచిత్తుల సంప్రహర్షభా
జనులనుఁ గా నొనర్చి ఘన ♦ సత్కృతు లుల్లసిలంగ మేల్సభా
జనములఁ జేల్చి పంచె నను ♦ సారిత వారి నొకప్పు డోయుమా. 309

ఆ॥ సిద్ధమూర్తి ఋశ్య ♦ శృంగు సుపూజితుఁ, జేసి శాంత నట్లు ♦ శ్రీసమృద్ధ
గా నొనర్చి ధరణి ♦ కాంతుం డనిచెఁ దోడ, బలము తోడ రోమ♦ పాదుఁడరుగ.

తే॥ అత్తెఱంగున నంగరా ♦ జాదిబంధు
సమితి మితిలేని సత్క్రియా ♦ ప్రమితిఁ దనియ
జేసి వీడ్కొల్పి ధృతియోగ ♦ భాసురుండు
గాఁ బ్రజల నేలుచుండె నా ♦ క్ష్మావిభుండు. 310

సీ॥ క్రతువైభవము శత ♦ క్రతు వైభవము కత, కెక్కుడై యటువన్నె♦ కెక్కుటయునుఁ
బుడమివేల్పుల జాడఁ♦దొడరి వేల్పులుఁగూడ, మెచ్చుమైఁ జేతులం♦దిచ్చుటయును
జన్నఁపుందొర కన్ను ♦ సన్న మేల్గొన మిన్ను, ముట్టి కన్గంటఁ జూ ♦ పట్టుటయును
బుట్టు శ్రీహరి యంచు గుట్టు దెల్పుచు మించు, పాయసం బర్పణ♦ సేయుటయునుఁ
దలఁపులఁ దలంచి వలపుల ♦ యొలపు గాంచి
యువతులునుఁ దాను నెందేని ♦ సవతు లేని
కోరికల యీరిక లెలర్చు ♦ దారిఁ జేరి
యలరుచుండిరి వెతవీడి ♦ యలరుబోఁడి. 311

తే॥ అని మహాదేవుఁ డెఱిఁగింప ♦ నాలకించి, యమ్మహాదేవి సానంద ♦ యై కడంగి
యవ్వలి కథాసుధారసం ♦ బాను వేడ్క, నానతిమ్మని ప్రాణేశు ♦ నడుగుటయును.

మ॥ లలితోపాసకసోమనాథగురులీ ♦ లాదృక్ప్రసారప్రభా
తలసద్వ్యాప్తసమధీలతాంచిత జనో ♦ ద్యద్భక్తయోగామృతో
జ్జ్వలసంతర్పణ షట్పదాయిత మన ♦ స్కా యున్మనస్కానుభా
త్సలసానాప్యపదా పదాశ్రితనిజా ♦ త్మైక్యానుసంధాయకా. 3౨౨

క॥ జిజ్ఞాసోచితజనసం, వి జ్ఞానాత్మైక్య యోగ ♦ పరసమరసభా
వజ్ఞానోదయనిహతత, దజ్ఞానావరణ భాసి ♦ తాంతఃకరణా. 3౨3

మత్తకోకిల॥ భూతభవ్యభవత్ప్రపంచవి ♦ భూత్యధీశ్వర ధీవరా
భూత తామసశిల్పకల్ప వి ♦ భుప్రభుత్వవిధాయకా
వీతదోషనిరస్తరాగని ♦ విష్టయోగమహామనః
ప్రోతచిన్మయవృత్తిభావ్యమ ♦ హాహ్లాదయా నిహతామయా. 3౨౪

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమునం ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### —♦ తృతీయాశ్వాసము ♦—

—:(o):—

శ్రీవిద్యాదేవీనం
భావితభాసురవిలాస ♦ పరిష్కృతసుభగం
భావుకజగదండవిభా
త్యావిర్భావాదికల్ప ♦ నాధిష్ఠానా. ౧

—♦ కౌసల్యాదుల గర్భలక్షణవర్ణనము ♦—

క॥ పరమాన్నము భుజియించిన, తరుణులు మువ్వురును బ్రాహ్మా ♦ దశ్రీ విలసి
ల్లిరి సద్గురుబోధకలా, స్ఫురణ న్విద్యాత్రయంబు ♦ సొబగున మగువా. ౨

ఆ॥ పాలకడలి సెజ్జ ♦ వాని మూర్తుల బొజ్జ, లందుఁ దాల్చి లలన ♦ లలరుచునికిఁ
దద్యశంబు పైకిఁ ♦ దరలె నా మోములు, వెల్లరుచుల కలిమి ♦ వెలసె నపుడు.

సీ॥ విమతవాదంబు లి ♦ వ్విధి నింకఁ గృశియించు, నను భంగి మేనుల ♦ నెనసెఁ గృశత
నేతినేతినిరాస ♦ మీ తెఱఁగున నన్న, స్థితిఁ దెల్పె భోజ్యని ♦ షేధకలన
యసదుగాని పరార్థ ♦ మరయుచో ప్పిదె యను, హరువొందెనూత్నప ♦ దార్థకాంతు
బాహ్యవృత్తుల మది ♦ పాయు నిట్లనుకీతి, నెత్తె మస్తకము నొ ♦ క్కింత మఱపు
సుంతయుఁ గొఱంత లేదిదె ♦ చుండు తత్త్వ
మని మురియు గారవము సూపె ♦ నావలింత
లఖిలలోకాధినాధు న ♦ వ్యయుని హరిని
గర్భములఁ దాల్చినంత న ♦ క్కాంతలకును. ౪

ఉ॥ ఇంతుల యంగకంబు లపు ♦ డెంతకృశించెనో మేనికాంతు లం
తంతకు నంతగాఁ బ్రబలె ♦ నయ్యెడఁ దత్ప్రకృతప్రసక్తి తా
నెంతతనుత్వమూనె హృద ♦ యేశ్వరుపైఁ గల ప్రేమబంధ మ
త్యంతసమృద్ధి గాంచె నటు ♦ లాయతలోచన; యేమిచెప్పదుల్. ౫

క॥ రస మన బ్రహ్మ మగుటఁ ద, ద్రస మాత్రయి గర్భయుక్తి ♦ రాణించుటఁ బైఁ
బ్రసరించు లక్షణములై, పొసఁగెల్ రసబిందుకళలు ♦ ఫుల్లాబ్జముఖీ. ౬

ఆ॥ పుడమిచేడె తనదు ♦ జడరూపమున నేని
హరినె పతి నొనర్తు ♦ ననుచు వియ్య
మొదవుఁ బిదప ననియు ♦ నోరసెఁ బొత్తన మృత్తు
గంద మమరెఁ దన్ము ♦ ఖములఁ దరుణి. ౭

చ॥ వనితలలో వెలుంగు నిజ ♦ వల్లభు రూపుల ప్రాపునం దదా
స్యనలము లొంది లక్ష్మి స్త్రీ గన ♦ నయ్యెఁ దదాలయగా ననంతరం
బున నలువొందు ధాత్రి కటు ♦ పోలదె నిల్వఁగ నారు లట్టిప
ట్టున మును మంటియాస్థఁ గొను ♦ టొం పెద నింపుదు సుంతె యుగ్మలీ. ౮

ఉ॥ ఉల్లమునందు నెవ్వ నడు ♦ గూఁదిన సిగ్గున మానినీమణుల్
పెల్లగు కోర్కులెవ్వియునుఁ ♦ బేర్కొనఁ జాలరు గ్రుచ్చివేఁడి మీ
రెల్ల వచింపుఁ డంచుఁ బ్రియ ♦ లెంతయు మెచ్చు వయస్యలన్మొదం
బుల్లసితంబుగా నడుగు ♦ చుండె రఘూద్వహుఁ డోశుభావహా. ౯

క॥ వనితాతిలకము; పింటివె, జనితానందతఁ బ్రియాలి ♦ జనుల కతఁడు వా
రనలసత మెలఁగుటకుఁ బస, దనములు కొల్లగ నొనర్చెఁ ♦ దాత్పర్యమునన్.

ఉ॥ వల్లభ లిచ్చగించిరని ♦ వార లొకించుక పేరువెట్ట భూ
వల్లభుఁ డున్మనస్త యొద ♦ వం దదభీష్టపదార్థపుంజ మీ
మెల్లదిగంతమే యనిన ♦ నేమగు ధాత విధానమెంచుచో
టిల్లుగనున్నఁ దెచ్చి యిడె ♦ నెద్ది యసాధ్యము బాహుశక్తికిన్. ౧౧

క॥ దోహదకష్టముల వరా, రోహలు దన్నియును మేలు ♦ రూపించి సుఖా
వ్యాహతి నవరొందఁ గతిప, యాహంబులు గడచె ని ట్ల ♦ హర్యవరసుతా. ౧౨

తే॥ జగతి నన్నొకపరియేని ♦ స్మరణసేయు
నతని కభివృద్ధి గూర్చి మ ♦ దంశధారి
ణులఁ గృశత నొంపఁ జనదని ♦ కలక మాన్పె
హరి యనఁదదంగములఁ బుష్టి ♦ యమరె నపుడు. ౧౩

ఆ॥ అణువుకన్న నణువు ♦ నని తెల్పె హరి యత్తి
లోదరుల యుదరము ♦ లొంది నపుడె
యటులె తనదు మహిమ ♦ కానవాలిడె వారి
పేదనడుములకుఁ బ్ర ♦ వృద్ధిఁగూర్చి. ౧౪

క॥ లోకము దుష్టనిదాఘము, ధాకకు సంతప్తమై బ ♦ డల ఘనుఁ డీఁకనే
నే కలనని తరలెడుకలఁ, గైకొనెఁ దత్కుచనగాగ్ర ♦ గతతచ్ఛాయల్. ౧౫

తే॥ ఆజితేజంబు త్రిభువనం ♦ బలము పెంచి
శరణుచొచ్చె నేతన్నాభి ♦ దరులఁ దమము
దాని కనసీయగర్భాస్ప ♦ దత్వ మొదవ
బయలుపడె నాగ నూఁగార్లు ♦ ప్రబలె నపుడు. ౧౬

సీ॥ తమ గొప్పతనము చం ♦ దముఁ జూపు లావణ్య,రసపూర ముడివోక♦రాజిలంగఁ
దెలివితేటల కెల్ల ♦ దీవులై మోములు, పుండరీకముల వి ♦ స్ఫురణఁ బెనుప
సిరులఁ జిల్కెడు మేలి ♦ చిమ్మచెమ్మటబొట్లు, పూఁదేనె కణముల♦పూర్తి దెలుపఁ
గలజాతి తమ్మిమొ ♦ గ్గల విందులగు కుచం,బుల మొనల్ నైల్యాప్తి♦నళులఁగూర్ప
సరవి గర్భప్రకాశల ♦ ద్వ్యత్వకలన
నవనవవికాస మొదవఁ ద ♦ ద్రవికులీన
రాజహంసమనస్కార ♦ రమ పొసంగ
సరసులనఁ బొల్చి రాసతు ♦ ల్సరసహృదయ. ౧౭

చ॥ ఘనజఘన స్తనద్వితయ ♦ గౌరవము ల్గని మున్నె హంసగా
మినులగు వారు ముజ్జగము ♦ మేలుగఁ గుక్షి నమర్చియున్న దే
వునిఁ దమచిన్నిబొజ్జలనె ♦ పూని గురుస్థితిఁ గాంచు పెంత ది
గ్గనఁ బతిపూజసేయఁ జులు ♦ కందన మందుట చిత్ర మంగనా. ౧౮

మ॥ భువనాతీతకలాసమృద్ధి నటు ల ♦ ప్పూబోణు లొప్పన్ రఘు
ప్రవరుం డుల్లము పల్లవింప నిజసా ♦ మ్రాజ్యానుగుణ్యాప్తిఁ బుం
సవనాద్యుల్చరించి యుండె నట ను ♦ చ్చైర్లక్ష్మిశ్రీ ధర్మక్రియా
ప్రవణత్వంబు సుతోదయశ్రవణపా ♦ రమ్యంబుతో మీఱఁగన్. ౧౯

సీ॥ పాలమున్నీటిపై ♦ ఫణిశయ్య శయనించు, మించుమేలున నొంట ♦ మేలుకొంద్రు
బంగరురెక్కపు ♦ లుంగునెక్కి యొకప్డు, తిరిగివత్తురు వియ ♦ ద్దేశమునను
సురలు మునులుఁ గొల్వ♦సుసమస్యలునమస్య, లక్కజంబుగఁగొందు♦రొక్కనాఁడు
తుంబురునారదా ♦ దుల తులలేని గీ, తుల నొకతఱిని మె ♦ త్తురు పొదలుచు

సిరియు ధరయునుఁ దమవేఁడ్క • చెప్పి కలువుఁ
గోలుతనమున మెలఁగ ద • క్కోఁకలుగాంతు
రెలమి నొక్కెడ నెలనాగ • లోలయు నిదుర
లందుఁ దమపాలి భాగధే • యంబు వెలయ. ౨౦

ఆ॥ అందు నెన్నఁ గోస • లాత్మజ తేజంబు
దరము మీఱుటయుఁ బ్ర • ధానమైన
దరయ లోకనాథు • నంశ మియ్యదె యంచు
నెఱుక గలుగువార • లెంచుచుండ. ౨౧

క॥ బిసరుహసమముఖు లయ్యెడఁ, బ్రసవోన్ముఖు లగుచుఁ దెలిసి • బ్రహ్మాదులు మే
లెసఁగఁ దదున్ముఖులునుఁ బ్రవి, కసితముఖాబ్జులునుఁగాఁ బ్ర • కాశిలు నంతన్.

ఆ॥ క్రతుసమాప్తి మొదలు • గా నాఱు ఋతువులు
కడచిచనఁ బ్రకృష్ట • కాల మదియ
చేరి మేలుసూపు • సిరి మించెనొనంచు
సురలు మునులు నెంచి • చోద్యమంద. ౨౩

తే॥ సకలశుభమయ మగు పుష్ప • సమయమున స
ముల్లసిత చైత్రమాసమం • దెల్లమహిమ
లెసఁగఁ గనుపట్టఁజాలు ఋ • క్షేశవృద్ధి
పక్షమున నవమి శుభాఢ్య • వాసరమున. ౨౪

ఉ॥ ఏనుగ్రహంబు లుచ్చగతి • కెక్క బుధేతరు లర్కయోగముం
గానక యుండ మేషమునఁ • గంజహితుం డెసలార సద్గుణా
నూనశుభోదయంబు కట • కోదయ మయ్యదితిప్రసక్తిమైఁ
దానె జగత్త్రయంబునకుఁ • దత్పరతన్గయమీయ నున్నచోన్, ౨౫

క॥ శశిసంయుక్తుం డగుచుఁ ద్రి, దశగురుఁ డఖిలార్థములకుఁ • దానక ముచ్చాం
శశుభస్థితి లగ్నంబున, నశుభములఁ దొలంపఁ దాన • నై యుండంగన్. ౨౬

## —• శ్రీరామజననము •—

సీ॥ విరినల్లకలువల • వెదచల్లునెమ్మేను, శృంగారలక్ష్మికి నె • చ్చెలిమిఁ దెలుప
దరహాసచంద్రికాం • కురచాకచక్యంబు, ముఖచంద్రతత్త్వార్థ • మును గుణింప
రవికోటిదీప్తిస్ఫు • రద్దివ్యమకుటంబు, స్వీయతేజంబుతో • వియ్య మంద
రమకుఁదోడై యెద • రాజిల్లు కౌస్తుభం, బనురాగతాదాత్మ్య • మెనసి వెలయ

శంఖచక్రాదిసాధన ♦ చయము శయకు, శేశయములఁ బొసంగ వి ♦ శిష్టుఁడగుచ
గలితసౌశీల్య కౌసల్య ♦ గర్భమందు, హరి దయాసింధులహరి తా ♦ నవతరించె

ఆ॥ సకల లోకనాథు ♦ సర్వనమస్కృతు
నఖిలలక్షణాఢ్యు ♦ నిఖిలనిష్ఠుఁ
బుత్త్రుఁ గనియెఁ బరమ ♦ పురుషుఁ గోసలుకన్నె
యమితసుకృతచయఫ ♦ లాప్తి వెలయ. ౨౮

క॥ రక్షాతత్పరతాంచ, ద్దీక్షాసంబద్ధవలయు ♦ దివిజారిహరున్.
వీక్షావృతదాక్షిణ్యున్, సాక్షాద్విష్ణ్వక్షసహితు ♦ సంయమివినుతున్. ౨౯

క॥ శ్రీకరుఁ బుణ్యశ్లోక, వ్యాకృతు సుగుణాలవాలు ♦ వర్ధితతేజున్
లోకాత్ముఁ గనె యశస్విని, ప్రాకట మిక్ష్వాకుకులము ♦ పరఁగింపంగన్. ౩౦

ఆ॥ అమితతేజుఁడైన ♦ యాత్మజుచేఁ గోస, లాత్మజాత సూనృ ♦ తాఢ్య మెఱసె
భిదురపాణి దేవ ♦ విభుఁ డసురారియు, నైన యింద్రు చేత నదితి యట్లు. ౩౧

ఆ॥ జయము వలికె నభము ♦ జలధు లుప్పొంగెఁ బ్ర
సాదకలనఁ దనరె ♦ సకలదిశలు
మెల్లమెల్లవీచె ♦ మేలి తెమ్మెర లీశుఁ
డవనిఁ బొడము నెడ న ♦ వాబ్జగంధి. ౩౨

క॥ హరి యవతరించె నిఁక మన, కరులవలని భయము వాసె ♦ నని ధృతి సుర లె
ల్లరు వినఁ బలికి రపుడు భీ, తిరహితముగ నాగ మ్రోసె ♦ దివిజుల ఢక్కల్. ౩౩

తే॥ ఒకసుధాఘట మగము లే ♦ నుండె నెట్టి
యుక్తి సాధించిరో యమ్మ ♦ హోత్సవమున
సురలు నింపిరి సామృత ♦ సూనరాసు
లెల్లభువనములందుఁ బూ ♦ ర్ణేందువదన. ౩౪

క॥ సేమ మమృతత్వ మిడు శ్రీ, రామకథాఽమృతము భువి న ♦ రప్రతతి కిఁకన్
నోములు ఫలించె నని దివి, ద్యోముని వీణానువృత్తి ♦ నుబ్బుచుఁ బలికెన్. ౩౫

ఆ॥ అవని హరి జనించి ♦ నంత ముక్తి సురాంగ, నాదికెల్ల బంధ ♦ నాది వలనఁ
గలుగు టరుదె విశ్వ ♦ కంటకుఁ డగునాద, శాస్య మకుటమణుల ♦ కబ్బెననఁగ.

క॥ అంతయు వింతయనం దగె, సంతోషఘూర్ఘురములు ♦ జాల్కొని యపుడే
మంతనము లొరసి దివి భువి, నంతట నెఱసి సుమవృష్టు ♦ లై వెలయంగన్.

శా॥ శోచీరాసులు గ్రమ్ము దేరఁగఁ గడల్ ♦ శోధించుచు న్మించుమిం
చాచామేచ్చఁ గడంగునప్పు డెటు ల ♦ ట్లమ్మేటి మైజగ్గని
గ్గే చాల్పొందఁగ సూతికాగృహగతా ♦ హీనప్రదీపాలి సం
కోచం బందెనుఁ జిత్రసంయుతకలా ♦ గోలానుకూలంబుగన్. ౩౮

వ॥ అట్టి సమయంబున. ౩౯

—♦ కౌసల్యాస్తవము ♦—

సీ॥ శ్రీవత్సముఖభవ్య ♦ చిహ్నము ల్గలవాని, పసిఁడిపుట్టము మేన ♦ బొసఁగువానిఁ
దెలివితేటలకు నా ♦ దిజ్ఞాన మగువానిఁ, జల్లని దృష్టి పై ♦ జల్లువానిఁ
గలతేజములకెల్లఁ ♦ గారణం బగువాని, వివిధతమఃపార ♦ వృత్తివాని
నఖిలవేదాంతర ♦ హస్యమై తగువాని, బ్రహ్మాదులకునుఁ జొ ♦ ప్పడనివానిఁ
గాంచి కనులముదశ్రువు ♦ ల్నించి నోము, లెంచి భవసాగరము నిర్గ ♦ మించి తృప్తి
మించి పులకించి కేలుజో ♦ డించి భక్తి, వెంచి వినుతించెఁ గౌసల్య ♦ చంచలాక్షి.

శా॥ శ్రీభూనీలలు దన్నుఁ గొల్వ శుభల ♦ క్ష్మీనిత్యసంభావిత
త్వాభివ్యాప్తి జగమ్ముల న్మనుచు మే ♦ లౌనిచ్చఁ దత్సృష్టికిన్
నాభీపద్మజు నొక్కనింబనిచి సా ♦ నందంబు భోగీంద్రశ
య్యాభోగంబున నబ్ధిఁ బొల్చు దొర వీ ♦ వేఁగాదె విశ్వాత్మకా. ౪౦

క॥ ఏదరిఁగానక సంసా, రోదధిఁ బడి మునిఁగి తిరిగి ♦ యుత్తమపుణ్యం
బేదో తరిగా నిటు నీ, పాదతలముఁ గంటి మంటిఁ ♦ బాపరహితనై. ౪౨

మ॥ శరణంటి న్ననువంటివారి పరిర ♦ క్షం బేర్చునిక్కార్మి నీ
తర మంటిం గనుఁగొంటిఁ బెన్నిధి నవి ♦ ద్యన్ గొంటి కైవల్య మ
ద్దిర యంటి న్సుఖముంటిఁ దృప్తిగతి నెం ♦ తే యోగిహృత్పద్మకో
టిరణద్భృంగమ వీవటంటి దొర కొం ♦ టి న్నిన్నుఁగీర్తింపఁగన్. ౪౩

క॥ దృఙ్మాత్రుఁడ వచ్యుతుఁడ వ, వాఙ్మానసగోచరుఁడ వ ♦ వారణుఁడ వసీ
దృఙ్మహిముఁడ వజుఁడవు ప్ర, త్యఙ్మూర్తివి నినునుతింపఁ ♦ దరమెవ్వరికిన్ ౪౪

క॥ యములు తమేవంవిద్వా, నమృతఇహాభవతి,ముఖాఖి ♦ లామ్నాయస్మృతిన్
నెమకెద రెద్దాని మహి, హా, ద్యమ నీ వదియనుచుఁ దత్త్వ ♦ మరసితిఁజుమ్మా.

సీ॥ వందనం బిదె యోగి ♦ బృందహృత్పద్మమి, ళింద ఘనానంద ♦ కంద నీకు
అంజలిగూర్తు ని ♦ రంజనమూర్తి మృ, త్యుంజయప్రియపాద ♦ కంజ నీకు
నమనక్రియ నొనర్తు ♦ సుమనశ్శ్రయవ్యథా, శమన లక్ష్మీసంగ ♦ తమన నీకు
జోహారుసేర్తు స్వ ♦ వ్యాహారమననక, ర్మాహారితార్యసం ♦ దేహ నీకు

దండ మర్పింతు వేదండ ♦ తండనాథ
చండభయఖండనచణదో ♦ ర్దండ నీకు
మ్రొక్కిడుదు పక్కినెక్కి పెం ♦ పెక్కి జగము
దిక్కిదియనా మెలఁగు వేద ♦ ఫక్కి నీకు. ౮౬

క॥ సమతను నిన్న ప్రాణో, హ్యామనాశ్శుభ్రియని శ్రుతిచ ♦ యము దెలుప నవ
శ్యము నన్ను ధన్యుఁ జేయఁ బ్ర, విమలాకృతిఁ బుట్టితే భు ♦ విం గమలాక్షా. ౮౭

ఉ॥ ఎంతవిచిత్రమయ్య జగ ♦ దీశ్వర ముజ్జగము ల్త్వదీయగ
ర్భాంతరసీమ జీవనచ ♦ రాదులు సంద్రమునంద పోలె రా
పెంతయులేక భాసిల స ♦ మిత్థమహావిభవుండ వైన నీ
వింతటినాదుబొజ్జ జని ♦ యించితి వంచుఁ దలంచు టెంచఁగన్. ౮౮

సీ॥ అఖిలేశ; నీయాన ♦ నొదలనిడి కాదె, ఫణిభర్త మహిభార ♦ వాహుఁడౌట
లోకేశ; నీ శిక్ష ♦ లో మెలంగుటఁ గాదె, రవిశశుల్ క్రమము వా♦రక దొలఁచుట
జగదీశ; నినుఁగొల్చి ♦ స్వామ్యంబు గని కాదె, పవనుండు ప్రాణుల♦ప్రాణమగుట
సర్వేశ; నీకృపఁ ♦ జాలనెకొని కాదె, పర్జన్యు డిట్లుజీ ♦ వన మొసఁగుట
త్వామ్రదికేశ; త్వదాత్మతఁ ♦ గాదె భూత
తతి పరోపకృతిస్థితిఁ ♦ దనరుచుంట
విశ్వపతివైన నిన్నెట్టి ♦ వెరవుకతన
నేను గనఁగంటి; నేమందు ♦ నియతిమహిమ. ౮౯

ఉ॥ భూతములందు నిల్తు పరి ♦ పూర్ణత నెప్పుడు నజ్ఞతాపరా
భూతులు గానలేరు నినుఁ బూజ్యులు గందురు పాపపుణ్యముల్
హేతువు లందు నొండనఁగ ♦ నేల సమత్వమె కాక నీదెసన్
శ్రీతరుణీమణీరమణ; ♦ చేరున కిల్బిష మించుకేనియున్. ౯౦

మ॥ స్ఫురదర్కేందుసహస్రరోచులఁ గ్రహిం ♦ చు న్నీకిరీటంబు నీ
కరపద్మంబుల శంఖచక్రముఖము ♦ లగ్నప్పై లోకత్రయీ
భరణాఖ్యాభరణాదరుండ వగుటన్ ♦ భాషింపుచు న్గాన నీ
వరవిందాక్షుఁడ వంచెఱింగితిని దే ♦ వా; యిందిరావల్లభా. ౯౧

చ॥ నెలనెలయించు మోమున జ ♦ నించి స్ఫురించెడు నవ్వువెన్నెలల్
దెలుపు ననుగ్రహంబెదను ♦ దీర్ణతఁగాంచుటఁ గల్కికన్నులం
దొలఁకు దయారసంబు తన ♦ తోడిదపో యది యంచుఁ జూపు న
న్నెలమిఁ దరింపఁజేయ నిటు ♦ లీవుదయించితి కాదె శ్రీధరా. ౯౨

శా॥ లోకాలోకపరీతభూవలయ మా ♦ లోకించి కావ న్మహా
లోకం బున్నటులుండ నీవిటు దయా ♦ లోలాత్మభావంబున
న్వైకుంఠంబుననుండి వచ్చి తగుఁబో ♦ నాబోఁటి కీమేటి సు
శ్లోకత్వం బొడఁగూర్ప నేసుకృతముఁ ♦ శోధించితో శ్రీపతీ. ౫౩

తే॥ ఎన్నితలములఁ బొడమితి ♦ నెన్ని మేను
లొదవఁజేసెఁ బితామహుం ♦ డొక్కచోట
నైనఁ గంటినె యిట్టిభా ♦ గ్యము త్వదీయ
భక్తవాత్సల్య మూహింపఁ ♦ బడె ముకుంద. ౫౪

సీ॥ దేవ; సత్తామాత్ర ♦ దృక్కేవలాత్ముఁడ; వెద్దాని సాన్నిధ్య ♦ మెనసి నీవు
సత్త్వాదిగుణయుక్తి ♦ సకలప్రపంచంబుఁ, బుట్టింపఁ బోషింపఁ ♦ బొలియఁజేయ
హేతువైతివి తత్త్వ ♦ మెంచిన నమలుఁడ వెదియుఁ జేయవు చన ♦ వెందుఁ గనవు
వినవు నీయెడ నిన్ని ♦ వెలయుచున్నటులుంట, నజ్ఞు లెల్లరు భ్రమ ♦ నందుచుందు
రట్టివిశ్వవిమోహిని ♦ యైనయోగ
మాయ ననుఁ జుట్టకెడల నా ♦ త్మీయరూప
ముల్లమున నొక్కట వెలుఁగు ♦ చుండఁ జేయఁ
గాఁ బ్రసన్నుఁడ వగుము ర ♦ క్షాధురీణ. ౫౫

మ॥ శతశంపాలత లొక్కచో నిలుచునో ♦ జం బెక్కు రుష్ణద్యుతు
ల్తతిగొన్నట్టులు దళ్కులెల్ల వెదచ ♦ ల్లం జాలు నిమ్మేటియా
కృతి నిక్కస్గవ కెట్లుచూపితివొ నీ ♦ కేత్రోఁచు మాయన్న; యు
ద్ధతి నింకేఁగననోప దీని నుపసం ♦ హారంబు గావింపవే. ౫౬

తే॥ పచ్చకప్రంపుఁబ్రో వెదు ♦ ర్పడిన మాడ్కిఁ
బూర్ణచంద్రోదయవ్యాప్తిఁ ♦ బొరసినటులు
నాదు భవరోగ మెడల సా ♦ నందబాల
భావసాన్నిధ్య మొప్పఁ జూ ♦ పట్టుమయ్య. ౫౭

సీ॥ సిరి కొల్వుదీర్చినఁ ♦ జెలువొందునళినమ్ము, వడువున నెమ్మోము ♦ వలపులీడఁగఁ
జేర్మి దేనియ కల్మిఁ ♦ బెరయు క్రొందామర, లనఁ గను ల్విందుల ♦ పెనుపుగొరఁ
నెలదేంట్ల బువ్వంబు ♦ వెలయించు కమలంబు, ల ట్లసల్గల పాణు ♦ లరుస మొసఁగ
నిలపాలి పూలపూ ♦ జలఁ దెల్పు మెట్టద, మ్ములునాఁబదము లర్ధ ♦ ముల ఘటింపఁ
గలుగు నీమేలికైశోర ♦ కంబు దక్కఁ
బుత్రలీలార్థి నెద నేది ♦ ప్రోదిసేయు

నన్ను మొక్కింత గాక తు ♦ ధార్తునకు రు
చించునే రత్నఖని రుచు ♦ ల్నెలఁగు చున్న. ౫౮

క॥ నీదయ నట్టులైన యెడ, స్త్రీఁద భయంబేద నపరి ♦ మితలాలనస
ద్వాదనపరిరంభాదుల, చేఁ దమముఁ గ్రమింతు జనని ♦ సిరిఁ బూని హరీ. ౫౯

క॥ అని వినయవివేకములకుఁ, దను గనియనుకొనఁగఁ బొగడు ♦ తల్లినిఁగని యి
ట్లనె నచ్యుతుఁ డప్పలుకులు, ఘనకరుణాసాగరోర్మి ♦ కలనం దనరన్. ౬౦

తే॥ అమ్మ ; నీకెద్ది యిష్ట మ ♦ ట్లాను వేఱు
గాదు నను వేల్పుపెద్ద జ ♦ గములపీడ
లడఁపఁ బుడమిఁ బొడముటకై ♦ యర్థి వేఁడ
నవతరించితి నైజచి ♦ హ్నములతోడ. ౬౧

మ॥ జననీ; కశ్యపుఁ డాజి నీ వదితి వి ♦ చ్చ స్త్రీరు నన్గార్చి స
న్మును లెల్ల స్మరమంచు మెచ్చుకొన మే ♦ నుల్లోర కెంతేన్దపం
బును సాధింపఁగ నేనుఁగన్పడిన మ ♦ త్పుత్రత్వమర్థింప గొ
బ్బునఁ గూర్మిం జనవిచ్చి యిచ్చితి వరం ♦ బు న్పూర్వజన్మంబునన్. ౬౨

క॥ జనియించినాఁడ వామనుఁ, డన నీగర్భమున నపుడె ♦ యంబరో నీవి
ట్లనఁ గంటివి జన్మత్రయ, మునఁ బుత్రుఁడవైనఁ దృప్తి ♦ మొనయ నటంచున్.

ఆ॥ కాన మానుషత్వ ♦ మూని నేఁడీభవం, బునను సుతుఁడ నగుచుఁ ♦ బుట్టినాఁడ
నిట్టిరూపు గనుట ♦ కెనఁగు నీసుచరిత్ర, త్వంబు కారణంబు ♦ కంబుకంఠి. ౬౪

సీ॥ నీరువ ట్టొదవెనే ♦ నియుఁ బాటిసేయక, యాఁకటిచిచ్చున ♦ కడిచిపడక
యగ్గులవేఁడిమి ♦ కారాట మొందక, యుష్ణాంశువిస్ఫూర్తి ♦ కోటువోక
పర్జన్యు నురవడిఁ ♦ బడి కానపాల్గాక, హిమసంహతికిఁ గంప ♦ మెనయఁబోక
ఘాతుకసత్త్వము ♦ ల్గదిసె నంచడలక, యుదుటురక్కసు లార్వ ♦ నుదిలకొనక
భర్తృశుశ్రూష నెరపుచు ♦ భారమనక
నన్నుఁగని పెంచ నెదఁగోరి ♦ నవసిచేయు
తపముపొంపునేఁగన్నిటి ♦ ధార పెంపు
దోఁపఁ గనుఁగొంటి తల్లినీ ♦ ప్రాపుఁగంటి. ౬౫

ఉ॥ అందఱ కందరానిఫల ♦ మై మను తన్ననుభాగ్య మోజగ
ద్వందిత; కంటి వట్లగుటఁ ♦ బాసె భవద్భవజన్యబంధముల్

చెందె మహాసమృద్ధి యిఁకఁ ♦ జేకురునమ్మ; యమేయ మద్వయా
నందము లేరు నీ కెనయ ♦ నం దగువారు ధరాతలంబునన్. ౬౬

తే॥ తల్లి ననుఁగన్ననీ వమ్మ ♦ తత్వ మాదు
టరుదె యిల్లోకమున నెవ్వ ♦ రైన నిరువు
రము మన మొనర్చు నాభావ ♦ ణముఁ బ్రపత్తి
వినఁ జదువ నాదు సారూప్య ♦ మెనయఁ గలరు. ౬౭

తే॥ అని పలికి యక్కలికి జళు ♦ కవలఁ ద్రోచి
యాచిరంతన పూరుషుం ♦ డంతలోన
వినని కనని చూకాటంబు ♦ వెలసె ననుచుఁ
జూపరులు మెచ్చ నొక ముద్దు ♦ పాపఁ డయ్యె. ౬౮

సీ॥ చేతనత్వముఁగొన్న ♦ సింగారమన మేను, లలితభావస్ఫూర్తిఁ ♦ జిలుకుచుండ
నంగాంగివైన మో ♦ హనవిద్య యన మోము కళల పుట్టిల్లయి ♦ కానుపింపఁ
జూడ్కి-కబ్బిన కీర్తి ♦ సొబగునాఁ దగు తెల్వి, దిగ్వ్యాపకత్వంబుఁ ♦ దెలియఁజేయఁ
జేరవచ్చిన సిరి ♦ చెలువునాఁ జనునోజ, మఖిలాతిశాయిత ♦ నధిగమింప
లీలఁ బెనుపొంది కల్యాణ ♦ జాల మెల్ల, వేలఁ జల్లు దయాదృష్టి ♦ వేలఁ జెలఁగి
యాలలన కోర్కి-పంట నాఁ ♦ జాలి శౌరి, బాలుఁ డయ్యు మెఱసె నోవి ♦ శాలనయన.

వ॥ అమ్మెయినమ్మహానుభావుండు దన్నుగన్నతల్లి యర్థి నర్థించిన విన్ననువున నైల
కొన్న యన్నిసువుదనంబు సన్నం జెన్నుమీఱుటయు నాసాధ్వీవతంసంబు. ౭౦

క॥ ఆ మాయదారి దేవుని, శ్రీమధురాలాపరుచులఁ ♦ జిత్తము జగముం
దా మఱచె నప్పు డిప్పటి, క్రీస్తు బాలుఁగను నెఱుక ♦ నిన్నియు మఱచెన్. ౭౧

ఆ॥ తేఱిపాఱఁజూచు ♦ దీప్తులు పరికించు, నంద మెంచు వింత ♦ చంద మంచుఁ
దనదు భాగ్యగరిమ ♦ ధ్యానించు నాయమ్మ, ముద్దులానిఁగన్న ♦ మోహమునను.

తే॥ పుత్త్రుఁ డుదయించె నని చెప్పఁ ♦ బోలు మేలి
పలుకులో నొండు రెండుమా ♦ త్రల విభుండు
గానినమాత్ర నవ్వారికిఁ ♦ గొల్లసేసెఁ
గోశజాతము లెల్ల ధ ♦ రేశతనయ. ౭౨

శా॥ ఆనందామృతవార్ధిఁ గ్రుంకి సగురుం ♦ డై వచ్చి శ్రీ హెచ్చి ము
న్నైనాఁ డజ్ఞులు గాననేరని విభు ♦ న్వీక్షించి యూహించి యి

ల్లే నొక్కండన కాక ధన్యతముఁ డెం ♦ దే వెంటఁ గన్పట్టె నో
శ్రీనాథుం డితఁడంచు నుంచె మదిలోఁ ♦ జిద్యోగసంశీలినీ. ౨౪

క॥ ఆయుత్తమోత్తమార్భకు, శ్రీయోగం బరసి యుబ్బ ♦ చెలఁగ నతఁ డనేన్
ఘాయేశ్వరాన్వవాయ, శ్రేయోదాయకము మాని ♦ సింహము తోడన్. ౨౫

సీ॥ ఈమోముసిరివిన్న ♦ నిట వచ్చి నెల తన, కులుకు కుంచెడుగాఁగఁ ♦ గొలువకున్నె
యీ యొయ్యారము గన్న ♦ నిందిరాదేవి తా, వలపు వడ్డికిఁ బాఱ ♦ మలయకున్నె
యీవిలాసం బెన్నఁ ♦ గా వసంతకలార్థి, తెలివి దీవుల కెక్కఁ ♦ దిరుగకున్నె
యీసోయగం బన్న ♦ నిపుడె యావలరాజు, గోఁటు గోడలు దాఁటఁ ♦ గూడకున్నె
కంటి నఱువదివేలేండ్లు ♦ గడచి చనఁగ
నేఁటి కీమేటి సౌభాగ్య ♦ నిర్ణయంబు
దెలుసుకొనువాఁడు గలఁడె యీ ♦ దివ్యతత్త్వ
మీశుఁ డీశ్వరసదృశుండ ♦ వీవుఁ దక్క. ౨౬

మ॥ తలఁపోక్కండె నిదానమై తగ మహా ♦ దాక్ష్యం బలక్ష్యంబుగాఁ
దలము ల్నెక్కొనఁజేయ నిల్పఁ గెడపం ♦ దార్కొండు నీమేల్మికి
ప్పాలమే మూలము ప్రొద్దువంగడ మిటే ♦ పున్నెంబుల న్నిన్నుఁగో
ల్చులలిం గైకొనెనొక్కొ లోకవిదితా ♦ లోకప్రభావోదయా. ౨౭

క॥ మే లెసఁగె నెల్ల కలుముల, మేలిమిఁ గనఁగంటి జెనల ♦ మేకొనె నస మిం
కేలోపము గల దన్నిటఁ, జాలితి ననిపించితయ్య ♦ సంయమివర్యా. ౨౮

ఆ॥ అన వశిష్ఠుఁ డెక్కు ♦ డన్న నీవున్నె మొ, క్కండె యనఁగ నేల ♦ కలిగె నాకు
నిట్టిమేలె తఱి ని ♦ రీక్షించినందుల, కింకఁ గార్యనియతి ♦ నెసఁగు మనిన. ౨౯

—♦ భరత లక్ష్మణ శత్రుఘ్నుల జననము, ♦—

ఉ॥ మక్కువ పిక్కటిల్ల నృప ♦ మౌళి వశిష్ఠనియుక్తి యుక్తి పెం
పెక్కఁగ నక్కుమారున క ♦ హీనశుభోన్నతి జాతకక్రియల్
చక్కఁగ దీర్చె నంత సుర ♦ జాలము మేలనులీలఁ గాంచెఁ దా
నొక్క సుపుత్రుఁ గైక కనె ♦ నోలి సుతద్వయ మాసుమిత్రయున్. ౩౦

తే॥ తిష్యనక్షత్రతిథిఁ దోఁచె ♦ దేవదేవు, నంశ మటు మీనలగ్నము ♦ నందుఁ గైక
గన్నకొన్నయి సుగుణసం ♦ పన్నమై త్రివిక్రమపరాక్రమక్రమ ♦ విహిత మగుచు.

ఆ॥ ఆసుమిత్ర గన్న ♦ యాయన్న లటు లీశు, సర్ధమర్ధమునగు ♦ నంశములను
సార్పబుక్షకటక ♦ సంసక్త యగు వేళ, వెలుఁగు జేని దీప్తి ♦ వెలయ నైరి. ౩౧

క॥ అనురూపులు గుణవంతులు, ననుపము లటుప్రోష్ఠపదస ♦ మాభిఖ్యులు నై
తనరారు మహాత్ములు తన, తనయులుగా దశరథుండు ♦ తద్దయు నొప్పెన్. ౮౩

తే॥ పరకపైఁ బాతి కన్నట్టి ♦ ప్రబలె విస్మ
యంబు మునుపటికన్న న ♦ య్యమరవరులు
సూనరాసుల నమృతంపు ♦ సోనలను జ
గంబులను నింపఁ గనువారి ♦ కంబుజాక్షి. ౮౪

క॥ కలమధురస్వరములఁ జి, త్కలన లొలయఁ బాడి రపుడు ♦ గంధర్వులు ము
ద్దులు గులికెడు నటనంబుల, నలరించిరి సురల మనము ♦ లచ్చర లెలమిన్. ౮౫

క॥ తుంబురునారదముఖ్యు ల, సం బెసలారంగ శౌరి ♦ జననము శుభలీ
లం బరఁగించిరి రసభా, వ్యంబుల వీణలు వినేయ ♦ లై వెలయింపన్. ౮౬

ఆ॥ రాజధాని విబుధ ♦ రాజధానియు మేలి, దుందుభిస్వనములఁ ♦ దూర్యరవము
లం బ్రశస్తి నెఱపు ♦ లాలిత్యమునఁ దమ, సామరస్యమున ప్ర ♦ సక్తిఁ దెలిపె.

క॥ జనసంబాధం బదన, వ్యోను వీధుల రథ్యలన్ న ♦ రేంద్రు నగరున్
దన శోభననూపురని, స్వనములఁ బురలక్ష్మి గులుకు ♦ సందడు లొప్పన్. ౮౮

ఆ॥ పసదనంబు లొసఁగెఁ ♦ బార్థివోత్తముఁ డిచ్చ, వచ్చినట్టు లెల్ల వారలకును
శుద్ధనిష్కతతులు ♦ సూతమాగధవంది, బృందములకు మిగుల ♦ బ్రీతుఁ డగుచు.

ఆ॥ కోటికోటు లొసఁగె ♦ గోధనంబులు విప్ర, కోటు లరుస మందఁ ♦ గువలయేంద్రుఁ
డటు లనర్ఘ్యరత్న ♦ హాటకకోటులుఁ, దత్ప్రధానదాన ♦ దక్షిణలుగ. ౯౦

క॥ ఆ నరపతి యానిసువుల, కా నెటి మునియుక్తి జాత ♦ కాంచత్కృతులన్
మానుగఁ దీర్చి మహాహ్లాదయు, మీనయమున వెలసె నాగ ♦ నెసఁగె గిరిసుతా.

చ॥ విబుధులపాలి వాఁడగుచు ♦ విష్ణుఁడు పుట్టె ధరిత్రి నిట్లటం
చుఁ బలుకు వార లిందఱనఁ ♦ జొప్పడ దప్పటికప్డు వారిప్రీ
తిఁ బెనుప భూవరుం డొసఁగు ♦ ధేనువు లూళ్లు మణు ల్సువర్ణముల్
ప్రబలినదానవార్నదులు ♦ భాసిలె సాక్షిదశ న్యశస్వినీ. ౯౨

శా॥ కట్టించె న్బలుదేవళంబు లొగి దా ♦ క్ష్యం బొప్ప వేవేలకుం
బెట్టించె న్మహితాన్నసత్రములఁ బే ♦ ర్మి న్సత్కలాశాలలన్
రెట్టించె న్బృథులోత్సవావళి సురా ♦ రిద్రావణప్రీతితోఁ
గొట్టించెన్ రుచిరాగ్రహారములు గీ ♦ ల్కొల్ప న్వనౌఘుంబులన్. ౯౩

ఉ॥ ఎంత సమృద్ధుఁ డయ్యెఁ బృథివీశ్వరుఁ డిన్నటి నేఁటి కన్నియున్
సంతసఁపుం బొలంబులె పరి సాదపురంబులె దానవార్ధులే
వింతవినోదఁపుందొనలె వేడుకకొండలె చిద్విలాసఁపుం
దొంతరలే శుభాపగలె తోయజలోచన యేమి చెప్పుదున్. ౯౪

తే॥ ఈయరానిది లే దైన నెఱుఁగఁ బోల
దెఱుఁగఁబడిననుఁ జింత లే దింతయేని
నేమియుల్లాసమో కాని భూమిపతికి
సుతులఁ గనుఁచూడ్కికి జగమ్మె చోద్య మయ్యె. ౯౫

క॥ ఆనందనోదయమ్మున, నానందరసోల్లసన మహాంయు వగుచు న
మ్మానవపతి నంతఃపుర, మానవతులఁ బౌరులను స మత లోఁగొనియెన్. ౯౬

వ॥ ఇత్తెఱంగున నన్నరలోకచక్రవర్తి చక్రవర్తిప్రసాదంబునం దిరిలోకోత్సవనిదా నంబగు పుత్రోత్సవంబునం బొదలుచున్నసమయంబున. ౯౭

సీ॥ జలకమార్తురు మహా జలవిహారికి హరి, హరిణేక్షణలు చెయ్వు లందగింప
నుగ్గు వెట్టుదు రుగ్గు లూడ్చు నుగ్గుడుగాని, కుగ్మలు లామోద ముప్పతిల్లఁ
జాలువోయుదు రట్టె పాలసంద్రము మన్కి, వాని కంగన లూన వాలు దనర
శయ్య గూర్తు రహీంద్ర శయ్యాశయానున, కొయ్యారు లొయ్యార ముల్లసిల్ల
సంగరక్షలు నొడఁగూర్తు రఖిలరక్ష
ణాంగలీలావినోదికి మంగళాంగు
లంగములు గరుపాఱఁ బ్ర సంగములు పొ
సంగ దశరాత్రములును శు భంగమేచ్చ. ౯౮

క॥ ఫలితము జేజేలకు నిడ, పలాశతతి శితఫలాశ పాత్సేయ భువిన్
వెలసిన నిసువు మనువ ముని, ఫలీకరణహోమా మమ్లై పరఁగించె నహో.

చ॥ పురు డొకనాఁడ యేనిఁ గనఁ బోని పరాత్పరుఁ డుద్భవించియున్
బురు డనరాని చెల్వమునఁ బొల్చుచు లోకముతోడి పాడిగాఁ
బురు డటుదీర్చి సజ్జనుల పున్నెము పెంపునఁ గానుపింపఁ ద
త్పురుకలితప్రకాశమునఁ బొంపిరివోయె జగం బగాత్మజా. ౧౦౦

మ॥ నవరత్నంబుల ప్రోవు లెన్నియొ బుధా నందంబు సంధిల్ల నీ
నవరత్నంబుల ప్రోవు లబ్బె నను నా నాఁడే విసర్జించె నా
నవనీపాలుఁడు కొల్లసేసెఁ దగెఁ ద వ్వ్యాఖ్యాన మీనాఁటికిన్
నవనీపాగమకోరకాప్తిఁ బులకే న్యాసంబు సూచింపఁగన్. ౧౦౧

తే॥ అవభృథము పుత్త్రికామేష్టి ♦ నడర దొడరెఁ
గాని కాదది యిది యది ♦ గాఁ దలంతు
మని పురుషు దీర స్నాతులై ♦ రతని యువతు
లతఁడు సుతు లటువెలయ బిం ♦ బాధరోష్ఠి. ౧౦౨

క॥ సిరి కిటకున్న తానక, మరవిందాక్షుండు దోఁచె ♦ నట దయితుఁడలం
కరణమొనగూర్పఁ బనిచెను, బురిహారాయలిఁక నేమిసెప్పఁ బుష్పసుగంధీ. ౧౦౩

సీ॥ పచ్చలతోరణ ♦ ల్వల నొప్పునది యయ్యెఁ, బచ్చని తోరణ ♦ ల్వడసి నెగడె
లలిఁ బ్రవాలముల తీ ♦ ర్పుల కూర్పుగల దయ్యె, లలితప్రవాలస ♦ త్కలనఁ దనరె
నధిము క్తకల్పనా ♦ నల్ప మానది యయ్యె, నతిము క్తసుమవితా ♦ నాఢ్యయయ్యెఁ
బద్మరాగశ్రీలఁ ♦ బరఁగుచున్నది యయ్యెఁ, బద్మపూజారాగ ♦ వసతిఁ బొసఁగె
కమ్మకస్తురికలయంపు ♦ లెమ్మెఁ గొలుకు
మేలి కప్రంపు ముగ్గులు ♦ మేలుదెలుపు
మేళములు మేలనము లొప్ప ♦ మేదినీశు
జతన నగరియు మంగళా ♦ యతన మయ్యె. ౧౦౪

—♦ దశరథుండు పుత్త్రులకు నామకరణం బొనరించుట ♦—

మ॥ గురులక్ష్మీప్రతిభాసమానుఁడగుచుఁ ♦ క్షోణీతలేంద్రుండు తాఁ
గురుల న్గోవిదుల న్సుహృజ్జనముల ♦ న్గోత్రేశుల న్గాంచు శ్రీ
గురులక్ష్మ్యస్థితి సమ్మదోర్మిరమ వా ♦ ఋత్విగ్వంగ సంధూపితా
గురులబ్ధోన్నతి భద్రశాల శుభవా ♦ క్స్తోమాభిరామంబుగఁ. ౧౦౫

క॥ మంగళవాద్యకలన లొల, యం గమలాకరము రాజ ♦ హంస మొలయు లీ
లం గూర్చి ప్రవేశించెను, సంగతిఁ బుణ్యాహవాక్ప్ర ♦ సంగము వెలసెఁ. ౧౦౬

శా॥ అశాపాశనిరాసలాలసపద ♦ వ్యాశంసి యశా నీశు న
ష్టాశ న్గెల్చు నితండు వీని కగు దీ ♦ ర్ఘాయుష్యలాభం బటం
చాశీర్వాదముల న్సమేధితునిఁ జే ♦ యం జొచ్చి రాసభ్యులొఁ
బ్రాశస్త్యం బొడఁగూడు నొక్కయెడ స ♦ త్ప్రారంభచింతామణీ. ౧౦౭

ఆ॥ నామరూపగతిప ♦ నాథుండు గాకుండు, సకలగురుఁడు మాను ♦ షత్వ మొంద
నామమునిచ్చి ధన్యుఁ ♦ డై మన మది నెంచె, స్వకులగురుఁడు పూర్ణ ♦ చంద్రవదన.

తే॥ విద్యచే నజ్ఞభావంబు ♦ వెడల నెవని
యందు యోగులు రమియింతు ♦ రట్టిఘనుఁడు

రాముఁ డితఁ డయ్యె మఱియుఁ దా ♦ రమణమునను
రాముఁడగు నని ముని భవ్య ♦ నామధేయ. ౧౦౯

క॥ స్వభువు ప్రభు వగుచు భువి నిటు, ప్రభవించియు మునివచఃప్ర♦భావమున మహా
విభుఁ డగు నయ్యెడ నగణిత, శుభసూచన లెనసి జగము ♦ శోభిలె శుభదా.

తే॥ రామపద మన సామాన్య ♦ నామపదము
గాఁ దలంపవుగా యది ♦ గాఁ బొగడుము
లలితశుభవర్గ యపవర్గ ♦ లక్ష్మి మెచ్చు
రమ్యపదమ కదే శైల ♦ రాట్కుమారి. ౧౧౧

సీ॥ విను కల్మిచెలి దక్కఁ ♦ గాను మర్లమాతంగి, బ్రహ్మవిద్యావల్లి ♦ ప్రాఁకుఁగొమ్మ
చెడుఁగురాకాసులఁ ♦ జీల్చు మహాశక్తి, చిమ్మచీఁకటిపిండుఁ ♦ జెండు వెలుఁగు
కల్యాణవృష్టి మే♦ల్కాంచుతొల్కరిమించు,దొసఁగుగూడెము లేర్చు♦తోఁకచిచ్చు
ఢీకొను పగఱ గుం ♦ డెలలోని పెనుగాల,మఖిలసిద్ధు లిడు సి ♦ ద్ధాంజనంబు
యాతనాబ్ధిఁ గడవఁ బెట్టు ♦ యంత్రనౌక
యంతరాయమహావాత ♦ శాంతిమఖము
ముక్తిరామానుసంధాన ♦ మూలగురువు
రామనామ మనఁగ నగ ♦ రాజతనయ. ౧౧౨

తే॥ నాయనా యేతిశక్తి పా ♦ తానో దేని
యగ్ర్యవర్ణంబు లేక య ♦ ష్టాక్షరంబు
యత్పరాక్షరవిరతిఁ బం ♦ చాక్షరంబు
నటులె నశివాయయనఁగ న ♦ పార్థ మిహనొ. ౧౧౩

క॥ ఆ మంత్రరాజమే యిది, రామామణి ; రామపదము ♦ రమ్యతరము గా
దో మహనీయులుఁ దారక, నాముఁ డితం డనరొ మునిమ ♦ నస్థ్సితి యసదో.

చ॥ మలఁకలఁ బాపు ప్రముక్కిడుల ♦ ప్రమాన్పడఁజేయు నసంపుఁగ్రొత్తవె
న్నెల నెలయించు లిబ్బలిడు ♦ నెయ్యము తియ్యము దోఁప నెల్లవా
రలుఁ దనవారుగా నోలయు ♦ రాణఁ బొనర్చును రామనామ మే
ఫలములఁ గూర్ప దిమ్మనువు ♦ భావ్యమకాదె గిరీంద్రనందినీ. ౧౧౪

వ॥ ఇవ్విధంబున జగదానందకల్యాణధామంబగు శ్రీరామనామంబుఁ గమలామనోభి
రాము నందు సమర్పించి యంచితామోదభూమోదయంబున ధీమానితుం డగు
నామానితుల సార్వభౌముండు మహీసుత్రాముని తో మఱియు నిట్లనియె. ౧౧౫

ఆ॥ కంటివయ్య ; సుతులఁ ♦ గడ జన్మసఫలత, గంటి వేను నామ ♦ కరణకలన
గంటి నేకపరతఁ ♦ గలుములనెలవువా, ల్గంటి చెలువుఁ డితని ♦ కరుణ వెలయ.

సీ॥ నాయనసే కన్న ♦ నాయన్న నేఁడు నీ, నాయనమై పుట్టు ♦ నట్టు వేఁడ
మాపాలి సుఖపాలి ♦ మాపాలి భాగ్యంబు, నీపాలి పంటమై ♦ నియతిఁగూడ
ద్యోపారిరూపారి ♦ యా పారిజాతంబు, వ్యాపారియై యుండు ♦ వఱలఁ జూడ
నేదారినో ; దారి ♦ నాదార్ల మనుచు త, మోదారి కనుదోయి ♦ మ్రోల నాడ
గంటిగలదయ్య ; యింక వేగంటిదొరయుఁ
గంటి ననరాని విభవంబు ♦ గంటి వయ్య
కంటి మీనాఁటి కల్లము ♦ క్కంటి వాలుఁ
గంటి జపయోగ మీతమ్మి ♦ కంటి చనవు. ౧౧౮

వ॥ అని యిట్లు సముల్లాసమ్మున న్మనుంగుచుఁ దేలుచుఁ బలికి వెండియు. ౧౧౯

క॥ నరవర ; కైకసుతుఁడు స, ద్భరణగరిమ భరతసంజ్ఞఁ బరఁగును స్మరసుం
దరుఁ డితఁడు మేలిగోనముల, కిరవై రవి యన వెలుంగు ♦ నేకస్ఫురణన్. ౧౨౦

ఆ॥ విశ్వభర్త రామ ♦ విభుని లక్షణముల, లాభమునఁ జెలంగు ♦ లక్ష్మణాఖ్యుఁ
డా సుమిత్ర పెద్ద ♦ తనయుండు తేజోని, ధాన మార్యవర్ణి ♦ తనయుఁ డితఁడు.

క॥ శత్రువులం బరిమార్చుట, శత్రుఘ్నుఁడు నాగ విజయ ♦ శీలత మను స
న్మిత్రుఁడు సుమిత్ర రెండవ, పుత్రుఁడు వీఁ డఖిలలోక♦పూజ్యుం డనఘా. ౧౨౨

వ॥ అని నిర్దేశించి విరించిమానసపుత్రుండు లోకబాంధవకులగురుండు నగు వశిష్ఠ మునివరుం డక్కుమారరత్నంబులకు నాయాసమయంబుల నయ్యై శుభోదయం బులఁ దత్తత్సంస్కారమహోత్సవంబుల యథావిధిగా నిర్వర్తింపుచుం బ్రవర్ధమాన తేజులం గావింప జాగరూకుండై యుండె నంత. ౧౨౩

ఉ॥ ముచ్చట లెల్ల మొల్లమయి ♦ ముంగిటి కెక్కుఁ దలంచుకర్జముల్
రచ్చకుఁ బోవ మేలెపుడు ♦ రాణఁ దలిర్ప నెఱావిరాళి పై
పెచ్చుగ నప్పు డంతిపురి ♦ పీడని నెయ్యఁపుటన్నుమిన్న లా
పచ్చనిసాలువాని గుఱి ♦ వాఱఁ గనుంగొని యిచ్చ మెచ్చుచున్. ౧౨౪

క॥ వేడుక లటునటుఁ గూర్తురు, పీడని కుతుకమున మధుప ♦ వేణుల సుకృతం
బాడఁదొడరేఁ గాకమ్మెయి, జాడ గలదె త్రిభువనములఁ ♦ జారుగుణాఢ్యా.

ఉ॥ క్రొంబనిమించు మించు కయి ♦ కోలు గనంబడు పైఁడినిగ్గు ర
త్నంబుల జగ్గులుం గలసి ♦ తద్దయు మీఱు మెఱుంగుసూవు కీ

డ్లంబరఁపుం బసందులఁ జె ♦ లంగెడు తొట్లెల వారి నుంచి కా
దంబసమానయానలు ము ♦ దంబునఁ గూర్తురు జోలపాటలన్. ౧౨౬

సీ॥ పిన్నపెద్దలఁ జూడ్కి ♦ సన్న లాలించి శ్రీః ల్పన్నఁజాలిన మేలి ♦ యన్న లాలి
యాతతాననరుచి ♦ శీతాంశునిస్సృజించు, ధాతనాఁదగినమా ♦ తాత లాలి
యొయ్యారమునఁగ్రాలు ♦ దయ్యాలగుమిఁదోలు, సయ్యాటజగమేలు♦నయ్యలాలి
యాబాలగోపాల ♦ మాబార్లకొకరూపు, గాబాంధవముసూపు ♦ బాబులాలి
తాపసుల కోర్కు లీడేర్చు ♦ తండ్రి లాలి
యర్థులవరాలకుప్ప మా ♦ యప్ప లాలి
యనుచుఁ బాటలువాడుదు ♦ రబ్జముఖులు
రాము నుయ్యెలలూఁచుచో ♦ రాజవదన. ౧౨౭

క॥ పారిపారిఁ బెరిఁగె శుభపరం, పర లయ్యెను మందిరమున ♦ బాలుర ముద్దుల్
పెరిఁగెనుఁ బండువు లీవియుఁ, బెరిఁగెను నానాఁటి కట్లు ♦ పృథువిజ్ఞానా. ౧౨౮

చ॥ హరి యుదయించె నెప్పు డది ♦ యాదిగ హర్షఁపుఁబాలవెల్లి య
ప్పురమున కెక్కి కోరికల ♦ మోకల వేడ్కలపంటచేల స
త్సరసమహోత్సవాఖ్యసుర ♦ సాలవనంబుల వృద్ధి సూపె నా
సిరిగలవాని చేరికనుఁ ♦ జేరున కాదె సమృద్ధు లెన్నియున్. ౧౨౯

తే॥ జన్మవాసర మని జన్మ ♦ సమయ మనియు
జన్మనక్షత్ర మనియు వి ♦ శంకటముగఁ
జేయు నుత్సవములు లెక్క ♦ సేయఁ దరమె
తరము మీఱెఁ గదే మేళ్లు ♦ దశరథునకు. ౧౩౦

క॥ పసుపులు గుంకుమములు మేఁ, ల్పసిఁడియు రతనములుఁ బొసఁగు ♦ పట్టువసనముల్
వెసఁ బంచి యిడఁ బె కా కొక, పసగల పని గలదె నగరఁ ♦ బద్మదలాక్షీ. ౧౩౧

తే॥ ఊరివారెల్ల నెపుడు నో ♦ యూర రాము, వారనితపఃఫలము పండఁ ♦ బాఱఁ గాంచి
వారివారల కెఱిఁగించి ♦ వారి హర్ష, వారినిధిఁ దేల్చుచుందురు ♦ వారి జాక్షి.

మ॥ అనుమానంబు జనించుఁ గాంచునపుడే ♦ యవ్వారిగా వారి కా
జనులం బ్రాకృతులం చనందగునె వి ♦ శ్వం బెల్ల మోహాంధమే
చనునే నెట్టనఁ బక్షపాత మనఁగా ♦ సర్వేశు లీలాయితం
బున వేదం బుదయించఁబడే పసులకు ♦ న్సొబ్ధాయితశ్రీయుతా. ౧౩౩

క॥ కన్నులఁగట్టిన యట్టులె, యున్న విలాసములు గొన్ని ♦ యొజ్జలు గావో
వెన్నునిసిరి మొఱకుల మది, కి న్నాన్యాదృశము గాదొ ♦ గిరివరతనయా. ౧౩౪

సీ॥ శ్రీరాబ్ధిశయనుఁ డీ ♦ చిన్నికూన యటంచుఁ, బాలబుగ్గల హొయ ♦ ల్బయలుపఱిచె
ఫణితల్పమహితుఁ డీ ♦ పసిపాపఁ డంచని, మెత్తని నెమ్మేను ♦ మేలు సూపెఁ
గమలాక్షుఁ డీకసుఁ ♦ గందు నిక్కం బని, కలికికన్నుల సోయ ♦ గంబు దెలిపె
శ్రీనివాసుండె యీ ♦ చిఱుత బిడ్డండని, క్రొత్తకాంతి మఱింత ♦ యొత్తి పలికె
సకలసంశయములఁ దీర్పఁ ♦ జాల దొక్క
విశ్వమోహను సర్వాంగ ♦ విలసనంబు
చెలఁగు పురుషోత్తముని భాగ్య ♦ చిహ్న మెట్లు
దాఁచుకొన్నను దాఁగునే ♦ తరలనయన. ౧౩౫

వ॥ ఇవ్విధంబున నవ్విభుని మందిరంబు స్వభావవిహారమందిరంబ కాఁ ద్రిలోకోత్సవ
ప్రధానమందిరంబై నలువొందు చుండునంత. ౧౩౬

సీ॥ వగలాఁడు లెదఁ గ్రొత్త ♦ వగ లూరఁగాంచిలే, వలపు మేకొనఁజొక్కు ♦ మెలపుతోడ
జడదార్ల మదిఁ దోఁచి ♦ కడఁగి పైఁబడి భరం, పడు మనోరథపరం ♦ పరలతోడ
సీమసాములు వృత్తి ♦ సెదర మేల్కొనితోన, యలవార్చుకొను మేలి ♦ చెలిమితోడ
గడుసు రాకాసులు ♦ కాల్నిల్ప లేక జు, ర్రాఁతె పైకిడు పఱ ♦ వముల తోడఁ
దల్లి ముద్దు తోడఁ ♦ దండ్రి హర్షము తోడ, వేల్పువీటివారి ♦ వేడ్క తోడఁ
బౌరహితము తోడఁ ♦ బాడితాశల తోడ, వారు పెనుపు గనిరి ♦ వనరుహాక్షి.

క॥ ఒక్కొకమనోరథం బపు, డక్కవలయభర్త యెడఁద ♦ నలరుకొనంగా
నెక్కొనె నవి యక్కొమరుల, దిక్కున ఫలియింప నిఖిల ♦ దివిజస్తుత్యా. ౧౩౭

తే॥ చంద్రమండలమునఁ దోఁచు సన్నవెన్నె
లల ననుకరించు చిఱునవ్వు ♦ లొలయ సాగె
దేవతామంగళానకో ♦ ద్దీర్ణరణన
ముల విడంబించు శబ్దము ♦ ల్మొలకలెత్తె. ౧౩౮

సీ॥ కూర్చుండ నేర్చెను ♦ గొమరొప్ప వేల్పుల, గుండియ ల్మెల్లనఁ ♦ గుదురుకొనఁగఁ
బాఱాడఁగా నేర్చెఁ ♦ బఱవడు ల్సేయు రా, కాసుల చిత్తము ♦ ల్గాసిఁ బడఁగ
నడుగు వెట్టఁగ నేర్చె ♦ నరివితానము వితా, నస్థితి నడుగంటు ♦ నయము దోఁపఁ
బరువిడఁగా నేర్చెఁ బంచబంగాళమై, పాపపుంజము లెల్లఁ ♦ బరువులిడఁగ

ముచ్చటలు చూపఁగా నేర్చె ♦ మొనయు మేలు
ముచ్చట దలంచి భూదేవి ♦ ముచ్చటపడఁ
దమ్ములునుఁ దోడుగాఁగ నా ♦ తమ్మికంటి
సామనసహాసమెసఁగ ల ♦ సద్వికాస. ౧౪౦

శా॥ అన్నాళీకభవాత్మజుండు ముని భ ♦ వ్యశ్రీలకుం దానకం
బన్నప్రాశన మట్లుగూర్చె ఋషిము ♦ ఖ్యాశీఃప్రధానంబుగా
నన్నాదుం డటెయన్న మన్నదుఁడుఁ దా ♦ నౌ వేల్పు రామన్న యా
యన్నం బోలినవారె తమ్ములుమహా ♦ వ్యాహారలీలాత్మికా. ౧౪౧

మ॥ చెలి; వాశిష్ఠతపఃప్రభావభవిక ♦ శ్రీతో మహాభాసము
జ్జ్వలులై మించిరి సామిధేని కలన ♦ జ్జ్ఞానొందు ప్రత్యగ్రవ
హ్నులు నా న్బాలురురాజ్యహవ్యమిడుటె ♦ ష్టో; యంచు భూభర్త వ
ర్తిల లోకు ల్మదిఁబొంగ నెల్లవిబుధు ♦ ల్ప్రీతిం బ్రతీక్షింపఁగన్. ౧౪౨

క॥ స్వీయసమగ్రగుణాంచద, మేయమహిమ మూర్తు లొంది ♦ మేకోనునాత్మ
నాయకు పురుషార్థము లన, నాయర్భకు లేధమాను ♦ లై రేణాక్షీ. ౧౪౩

క॥ శ్రీరామునితో నలువురు, దారకు లాత్మానురూప ♦ తం బొదలఁగ మం
దారాదికల్పతరుప్రల, పూరణసంఖ్యకు నృపుండు ♦ వోల్చె గుణాఢ్యా. ౧౪౪

క॥ లీలామానుషతను లా, బాలేందుల నడుమ రామ ♦ భద్రుఁడు తగె ది
క్పాలచతుష్టయమున సుర, పాలకుఁ డెటు లవ్విధమునఁ ♦ బర్వేందుముఖీ.

ఉ॥ తమ్ముల మీఱు కన్నవ సు ♦ ధారస మొల్కెడు తీరు మేలిశాం
త మ్మనివార్యతేజము ప్ర ♦ ధానగుణమ్ము లుదారలక్ష్మి ని
త్యమ్ము శుభమ్ముల న్బెనుప ♦ నాహరికి న్నముఁడయ్యెఁ బెద్దయా
తమ్ముఁడు ముజ్జగమ్ములునుఁ ♦ దా నొకఁ డేలఁగఁ జాలి బాలికా. ౧౪౬

ఆ॥ హరికిఁ బిన్నతమ్ము ♦ లౌ సుమిత్రాసుతు, లమృతకరనిభాస్యు ♦ లందగించి
రవని యమళులై న ♦ వావతారము గన్న, యాశ్వినేయులన ల ♦ తాంగి వింటె.

క॥ అందఱు ముద్దులమూటలె, యందఱు రతనాలగనులె ♦ యైన సుఖశ్రీ
మందిరము రామచంద్రుని, చందము వింతకును వింత ♦ చందనగంధీ. ౧౪౭

సీ॥ ఇంద్రనీలపుఁ జాయ ♦ యెందు లేకుండునే, విశ్వమోహనలీల ♦ వెలయదేమొ
భానుతేజస్స్ఫూర్తి ♦ బయ లెక్కకుండునే; యఖిలతామిస్రాప్తి ♦ నడఁపదేమొ

జంభిల్లికళల మే ♦ ల్పడి దోఁపకుండునే, జనజాడ్యము దొలంపఁ జాలదే మొ
పర్జన్యయోగసం ♦ పద మించకుండునే, నిఖిలశోభనవృష్టి ♦ నెగడదే మొ
యమ్మెఱుఁగుమేని సోయగం ♦ బాప్రకాశ
మా ప్రసాదైకవిలసన ♦ మాకృపాస
మంచితకృపార్ద్రదృష్టియు ♦ నంద రామిఁ
జెలువ; యిదమిత్థమని నోటఁ ♦ జెప్పఁ దరమె. ౧౪౯

ఉ॥ ముద్దులుగుల్కు చేష్టలును ♦ మొల్లఁపుఁదేనియ లొల్కు పల్కులున్
బెద్దతనంపుఁబ్రోవడులు ♦ బెల్లు దయాబ్ధితరంగితేక్షలున్
దద్దయుఁ దమ్ములుంబలెనె ♦ తన్నెడఁబాయక కొల్వ రాముఁ డే
ప్రొద్దు రమింపఁ జేసెఁ గద ♦ ముద్దియరో; పితృమానసంబులన్. ౧౫౦

సీ॥ ముత్తియమ్ముల పొత్తు♦ మొనయు బంగరురావి, రేక పైఁ దగు మోము♦జోకవానిఁ
బులిగోరు నడుమ సొం♦పుల నీన రతనంపు, హారము ల్గల మెడ ♦ సౌరు వానిఁ
గనకాప్తిఁ గను మాని ♦ కెంపు మద్దికాయలఁ, దనరు కర్ణముల యం ♦ దముల వాని
నటులన్న ఘల్లుఘ ♦ ల్లను మేలి మంజీర, ములఁ గుల్కు పదలక్ష్మి ♦ మురువు వాని
మొలకనవ్వవానిఁ ♦ జెలగుసన్నని పలు, వరుసవానిఁ దోడి ♦ వారిఁగూడి
యాడువాని వాని ♦ నటుగాంచి వా రింత, లనఁగరాని సుఖము ♦ గనిరి తరుణి.

తే॥ శకలితేంద్రమణిప్రభా ♦ చాకచక్య
మూను నెమ్మేన నగల క ♦ డాని మినుకు
లను మెఱుపు లొప్ప ఘనుఁడు కృ ♦ పాఽమృతంబు
గురిసెఁ దనుఁగన్నవారి కో ♦ ర్కులు ఫలింప. ౧౫౨

సీ॥ భుజియించు నెడఁ బ్రీతి♦వొంగఁబల్మాఱురా, మునిఁదండ్రి;రమ్మర♦మ్మనుచున్నపుఁడు
పిలువ నాతఁడురాక ♦ బెరుకులు వెట్టఁ గో, సలసుతా నీవైన ♦ సరవిఁ గూర్పు
మను డాయము స్మితాఢ్య ♦ యగు చటఁబోయినా,యన్న;రావోయినా♦నల్లనల్లఁ
దలఁగఁ బర్విడియైనఁ ♦ దా యోగిహృద్గతు, నతనిఁ బట్టఁగ నేర ♦ కలయునంతఁ
దానె కలకలనగుచుఁ గ ♦ ర్దమము చేతఁ
దనర నేతెంచి ♦ యించుక ♦ దడయ కన్న
కబల మొక్కొండు గొని చను ♦ నబల; వారు
స్వీయపునరాగమంబె కాం ♦ క్షించు చుండ. ౧౫౩

చ॥ కుశలమె నీకు బ్రహ్మ; ననుఁ ♦ గూర్మిఁ దలంతువె యాశ; నీ కహ
ర్నిశము సుఖంబె యింద్ర; భయ ♦ రీతి దొఱంగెనె దిక్పులార; బా

లిశుఁ డతఁ డేమిసేయుఁ దృణ ♦ లీల నడంతు నటంచు నిద్దురన్
విశద మొనర్చు దాశరథి ♦ వేల్పులతోఁ బతిదేవతామణీ. ౧౫౪

ఆ॥ కలవరించె నమ్మ ♦ కాచెల్ల యని తల్లి, యన్న; లెమ్మటంచు ♦ నతని చుట్టు
చుట్టివైచి కావి ♦ చుక్కబొట్టిడి వేఁడు, నింటివేలుపుల గి ♦ రీంద్రతనయ.౧౫౫

శా॥ ఆలోలాంబక గోలపల్కుల నతం ♦ డాలించి లాలించి యి
ట్లేలా తల్లి యొనర్చె దంచరయుచు ♦ న్వైలాగతు ల్మీఱఁ జ
న్బా లొక్కింతలు గ్రోలి బాలకుల ప్రా ♦ వం బోవు నాటాడఁగం
దా లో నెంజలి మాని మాత ముదమం ♦ ద న్మానిసన్మానితా. ౧౫౬

ఆ॥ రాముఁబాయఁ డెపుడు ♦ రమణిరో; లక్ష్మణుం
డటులె భరతుఁబాయఁ ♦ డతని తమ్ముఁ
డందగించె ద్వంద్వ ♦ మై వారు మెలఁగుట
లౌనె యెంత; పాయ ♦ సాన్నమహిమ. ౧౫౭

క॥ అందము లేని దొకఁడు గల, దందుమె పుడమి కపు డమరె ♦ నందము దివి క
ట్లంద మయోధ్యకు నంద, బందమునకు నంద మొదవె ♦ హరి యందెనయన్.

క॥ తమచేసిన పున్నెంబులు, తమ మేలున కౌనకాని ♦ తద్దయు ముల్లో
కముల మనుపంగఁ జాలునె, యమరేంద్రసఖునకుఁ గలిగె ♦ నాగరిమ సఖీ.

ఆ॥ నాఁడునాఁడు నింద్రు ♦ నకు సాయ మొనరింపఁ
బోయి రక్కసులను ♦ బొడవడంచె
నేఁడుఁ బెద్దయైన ♦ నెటి జగమ్ములఁ గావఁ
దన తపమునఁ గాంచెఁ ♦ దనయమణుల. ౧౬౦

క॥ *తనరు వొకఁడె సకలలోకో, త్కరమును శాసింపఁ జాలుఁ ♦ దనకను నమ్మె
బిరుదునకు సుతులు నలువురుఁ, బరఁగిరి తోడగుచు దెసల ♦ పతు లట్టిరవై.

క॥ ఏమని వర్ణింపఁగ నౌ, నామెయి బాలకుల లీల ♦ లామెత్తై త
మ్మామోదాబ్ధిం దేల్పఁగ, నోములఁ దలపోసుకొంద్రు ♦ నుత్యములనుచున్.

క॥ పొగడినఁ బొగడన యగు న, య్యగణితకల్యాణగుణుని ♦ యవతారకథల్
నిగమన మని కలదే స న్నిగమాగమతత్త్వసార ♦ నిర్ణయనిపుణా. ౧౬౩

క॥ విన మానాఁటి విభవములు, గన మొండొకచోట నెపుడుఁ ♦ గల్యాణానం
దనియతఫలములు దనియఁ, న్వీను మటుగాన వినిపింతు ♦ విద్యాలతికా. ౧౬౪

ఆ॥ వీధి కెక్కె వారి ♦ విశ్వమోహనవిల, సనము లంతనంత ♦ సంస్తుతులకు
దావలంబు లగుచుఁ ♦ దాత్పర్యములు మీఱ, నాటలాడఁ బోడర ♦ నచలతనయ.

సీ॥ ముద్దులు గుల్కు ని ♦ మ్మోము పూర్ణశశాంకు, నవ్వు టబ్రమె యను ♦ నాతి యోర్తు
నెమ్మేని కాంతిపూ౦ర మ్మపాంగతరంగ, ములుఁ గృపాబ్ధివో యను మెలఁత యొకతె
సౌకుమార్యము శేష♦శాయి కేనియు నింత, లొప్పునే యను విద్రు ♦మోష్ఠి యితర
వెను వెంటఁ దవిలి సే♦వింప వచ్చెనొ నాగ,సిరి యొల్చె నదె యను♦ చెలి యొకర్తు
నోము లిటు పండవలె నను ♦ భామ యేత
దన్య యన్యోన్యముగ మెచ్చు ♦ లాడు కొందుఱు
బాలకులఁ గూడి యాడు న ♦ వ్వేళ రాము
రామణీయక మీక్షించి ♦ రామ లగజ. ౧౬౬

ఉ॥ ముద్దున ముద్దు దోఁచు మఱి ♦ ముచ్చట ముచ్చట గొప్ప మేల్మి మే
ల్పద్దున మేలిపద్దు దగుఁ ♦ బండువ పండువ కబ్బుఁ గూర్మి శ్రీ
హద్దున హద్దు గల్గు సుగు ♦ ణాప్తి గుణాప్తికి మీఱు రాము నే
ప్రొద్దుఁ గనుంగవ ల్దనియఁ ♦ బుణ్యఫలం బని కాంచువారికిన్. ౧౬౭

క॥ ఆదర్శనమె శుభశ్రీ, కాదర్శ మటం చెఱుంగ ♦ నగునో కాదో
యాదట నాఘల మిపు డీ, మోదమె చాలుఁగద వారి ♦ ముంపం దేల్పన్. ౧౬౮

మ॥ సమసాహిత్యకుతూహలాఢ్యసవయ ♦ స్కశ్రేణి సేవించి రాఁ
దమ ద్వంద్వంబుల చొప్పు మార్పు కటులే ♦ తత్సాహచర్యంబు పొం
కముగా నాటలఁ బాటల న్మెలఁగు నా ♦ కల్యాణలీలాయుతో
ద్యమ మీనాఁడును గాన వచ్చు మది శ్రీ ♦ తాహార్యపుత్రీమణీ. ౧౬౯

సీ॥ చోరుఁడై తగుఁ ద్రయీ♦చోరుమర్మము గన్న, చోఱధర్మము నూపు♦చోరవదోఁపఁ
గుదు రాట లాడు నేఁ ♦ గుధరంబు క్రిందఁ బెన్నుదురై తినను చొప్పు ♦ కుదురుకొనఁగ
రొంపిఁ బొర్లాడు ని ♦ లింపారి నటుసాఁగ, నంపిన కిటిరూపు ♦ పెంపు వెలయ
సింహ మేనని మృగ ♦ సంహార మాడు నృ,సింహత్వమునఁ గొన్న ♦ రంహ మెసఁగ
నర్థినుఁ బ్రాక్తనార్థిత్వ ♦ మన్వయింప, రాజశిక్షాభినీతి భా ♦ ర్గవత నెఱపు
రాముఁ డటు బాలలీలాప ♦ రత్వమునను, వివిధకలనలఁ దనరె ని ♦ ర్వేలవిభవ.

క॥ ఓరామ వింతె యభిరతి, నా రామవిభుండు సాను ♦ జానుచరుండై
యారామభూమి నాడఁగ, శ్రీరామన్నాట పేః ♦ సిరి నది గనిరేన్. ౧౭౦

తే॥ ఏమిచెప్పంగ వచ్చు శై ♦ లేంద్రతనయ
విశ్వజననాది కేళుల ♦ వెలయు దేవుఁ

డంశముల నాల్గురూపంబు ♦ లంది నాల్గు
కంబముల యాట లాడెఁజి ♦ త్రంబ కాదె. ౧౭౨

సీ॥ తలదువ్వి మిసిమి జ ♦ ల్తారు చొళ్లెఁపుసిగ, తగఁ గూర్చి బలునిగ ♦ నిగలఁజిలుకు
వగఁ గుల్కు మగరాజి ♦ లుఁగుపను ల్గల జాళు, వాకుళాయి ధరించి ♦ వాసనల గు
బుల్కొన నొనరించి ♦ పూదండలిడి క్రొన్న, గలు సేర్చి నుదుట మే ♦ ల్తిలకమునిచి
హారము ల్గదియించి ♦ యచ్చవహా శ్రీగంధ, మలఁది కడానిదు ♦ వ్వలువగట్టి
పసిఁడిసాలువు వలెవాటు ♦ పొసఁగ నంది
యలు ఘణిల్ఘణి లనఁ బంతు ♦ లాడఁ దోడి
వారితో వచ్చు రాము నొ ♦ య్యార మెంచ
వశమె ఫణిపతికిని నస ♦ దృశగుణాఢ్య. ౧౭౩

క॥ ఏ యాట లాడఁ జొచ్చిన, నాయెడ జయలక్ష్మి రాము ♦ నందఁగనియె హా
వేయేల తలఁప నజితుం, డీయన యని రతని సుహృదు ♦ లిందునిభాస్యా. ౧౭౪

ఉ॥ కొందఱు వేల్పు లట్లు మఱి ♦ కొందఱు పూర్వసుపర్వు లట్టు లొ
ప్పం దనతమ్ము లుత్తముఁడుఁ ♦ బాత్రలుఁ గా నొడఁగూర్చి పేర్చి తా
నందలిసూత్రధారి యగు ♦ నాహరి మై తగి యాట సూపునే
ర్మిం దనమర్మ మెన్నఁ గను ♦ ప్రేక్షకు లెల్లరు సంతసింపఁగన్. ౧౭౫

ఆ॥ కలికి; యతఁడు భువన ♦ కపటనాటకసూత్ర, ధారుఁడేనిఁ దలఁపఁ ♦ దప్పగలదె
యవల నెట్టివేస ♦ మవలంబన మొనర్ప, డెట్టులేని మెలఁగఁ ♦ దఱిఁగి యెఱిఁగి.

ఉ॥ వారల మీర లిల్లుగల ♦ వారలు నిద్దుర గాంచ దొంగలీ
దారిని వత్తురేనిఁ జను ♦ దారినిఁ గాచుకొనుండు సొత్తులం
చూరక హెచ్చరించి మఱి ♦ యొక్కఁడుఁ దానునుఁ బవ్వళించి య
వ్వారి మొఱంగి డాఁగు నిజ ♦ పద్ధతి వారరయం దలంపఁగన్. ౧౭౭

క॥ ఆడిన యాటల నాడకె, యాడిరి తద్రసముఁ గ్రోలు ♦ నాస దనర మే
ల్గూడె నని నాగరులు గొని, యాడ సురల యెడఁదఁ గొన్న ♦ యడలటువీడన్.

సీ॥ కుప్పిగంతులు వైచి ♦ క్రోఁతుల మంద్రు త, ద్భావానుబంధంబు ♦ బయలుపడఁగ
తెక్కలమర్చి బల్ ♦ పక్కుల మంద్రు త, త్పక్షోపయోగోప ♦ పత్తి దోఁప
భీషణాకృతి నిల్పి ♦ బిరుదుల మంద్రు త, చ్ఛాసనౌత్సుక్యల ♦ క్షణము తనర
నలవిమానము లెక్కి ♦ యమరుల మంద్రు త, ద్ధరావతరణాలీ ♦ లాప్తి వెలయ
వానసనిరతిఁ గూర్చి ♦ మానుల మంద్రు త, న్మాన్యతావిశేష ♦ మహిమ దొలఁక
నక్కుమారవరు ల ♦ హంయుదురాపు ల, ట్లాటలాడు పట్ల ♦ నగకుమారి.

శా॥ తానే లోకము లేలు వాఁడఁట యమా ♦ త్యశ్రీకిఁ దమ్ముల్గదా
మానా చోటులు స్నిగ్ధులెల్లఁ దగరా; ♦ మాన్యప్రకృత్యర్థస
న్మానం బందఁగఁ గొంద ఱందుఁ బ్రజలై ♦ నల్వొందఁ బాలించు ధ
ర్మానూనస్థితి మించ రాముఁ డపుడే ♦ యన్యాయ మన్యంబుగన్. ౧౮౦

సీ॥ కలితానురాగంబు ♦ కల్యాణయోగంబు, కలికికన్నుల సిరి ♦ గలసి వెలయ
శ్రుతగుణాశ్లేషంబు ♦ శోభనోన్మేషంబు, ముద్దుమోమున పద్మ ♦ మొనసి మెఱయ
భావితామోదంబు ♦ భవ్యప్రసాదంబు, మొలకనవ్వుల లక్ష్మి ♦ మలసి నెఱయఁ
బ్రథితశృంగారంబు ♦ భద్రప్రకారంబు, వన్నెచిన్నెలరమ ♦ వలచి దొరయ
నాటపాటల మెలఁగుచు ♦ ననువు గనుచు, ననుగమండలి నేలుచు ♦ నందగించి
రాముఁ డుత్తరకోసల • క్ష్మామహేంద్రు, భాగ్యరేఖావిలాసమై ♦ పరిఢవిల్లె.

క॥ ఇంతటి విభవముఁ గాంచక, యెంతటిది యయోధ్య ముక్తి ♦ కిరవకొ ; దానన్
బంతమిడు నగరులకు మే, ల్బంతియు నకొ; జాజిపూల ♦ బంతీ యింతీ. ౧౮౨

తే॥ ఏల చరిత్రచర్వణం ♦ బోలతాఁగి, బ్రహ్మవాదులకునుఁ గానఁ ♦ బడని తత్త్వ
మాటలాడంగఁ దొడరె న♦య్యధిపు మ్రోల, ధన్యుఁ డెవఁ డింతకన్నను♦ధాత్రిలోన

తే॥ తేనియల ముంచి లేవనె ♦ త్తెడు విధమున
వారి ముచ్చట లాటలి ♦ వ్వరుసఁ బొసఁగఁ
బత్నులునుఁ దాను సుఖవార్ధిఁ ♦ బవ్వళించె
దశరథుఁడు సార్థకత విభీ ♦ తహరిణాక్షి. ౧౮౪

మ॥ జగదానందకరుండు హర్షఘనుఁ డౌ ♦ సర్వేశుఁ డారాముఁ డి
వ్వగ మాయాశిశుధర్మ మూని తన చె ♦ ల్వం బెల్లవారిచ్చమె
చ్చఁగ నిచ్చ ల్సహసోదరుం డగుచుఁ బ్రాం ♦ చల్లీలలన్ స్వీయులన్
దగ సౌఖ్యాంబుధి నోలలార్చె మనువి ♦ ద్యా చంద్రి విద్యాత్మికా. ౧౮౫

శా॥ కౌమారీ; విను మంతఁ గొంతమితినా ♦ కాలంబున న్బాలకుల్
కౌమారం బెనయన్ లిపిగ్రహణము ♦ న్గావింప వాగ్బ్రహ్మ మీ
కౌమారస్థితి మించె నంచుఁ గవు లా ♦ కాంక్షింప వా రెంతయున్
గౌమారప్రతిభాప్తిఁ జెంపుగని రా ♦ క్ష్మానాథు మోదంబుకోన్. ౧౮౬

క॥ జ్ఞానము జ్ఞాతయు జ్ఞేయముఁ, దానే యగు విభున కపుడు ♦ తజ్జ్ఞుఁడు గురుఁ డ
ష్టైనాటి నక్షరతత్త్వముఁ, బూనిక నెఱిఁగించె నౌకా ♦ పుణ్యచరిత్రా. ౧౮౭

క॥ తానే నే నటు నేనే, తా నను భావమున మను వి ◆ ధాతయు వర్ణ
శ్రీనిరతి మన్మనుస్థితిఁ, దా నరసె న్మన్నె ధర్మ ◆ తత్పరత సఖీ. ౧౮౮

ఉ॥ ఉపవేశం బొడఁగూడు నంతటనె తా ◆ నూల్లేతె నన్నట్టు ల
య్యుపదేశంబు ఘటిల్లు నాక్షణమె య ◆ య్యున్నిద్రబోధుండు త
ద్వ్యపదేశంబునఁ గాంచె నెల్లకళలన్ ◆ ధ్యానోపనమ్ర ల్గదే
యుపనాశల్ శ్రుతు లమ్మహాత్మునకు నేఁ ◆ డా శ్రోత్త లిప్పట్టునన్. ౧౮౯

తే॥ ఎంతవాఁడయ్యెఁ గళల న ◆ ట్లంతవారె
మైరి తారును రాముని ◆ ట్లతని తమ్ము
లెలయు నేవాడ చిలుక యా ◆ పలుకె పలుకు
ననుపలుకు వెలయుఁ గాదె వ ◆ ద్మాయతాక్షి. ౧౯౦

క॥ కర్తయుఁ గరణముఁ గార్యము, నార్తి దొలఁచి మనువఁ దాన ◆ యై నెగడుజగ
త్కర్తకుఁ జౌలాదికశుభ, వర్తనములు నడిపె ముని య ◆ వారితవిభవా. ౧౯౧

క॥ పంచశిఖ లుంచి రటులె ప్ర, పంచావనచతురునకు స్వ ◆ భావంబుగ మ
త్పంచాస్యరూపవిభవ, ప్రాంచితుఁ డతఁ డగుట నల త ◆ పస్వు లరయరే.

తే॥ కుండలేంద్రశయానునిఁ ◆ గుండలేంద్రుఁ
జేయఁ దొలుదొల్త నునిచిరి ◆ చెవులఁ బోఁగు
లందగించెఁ దవాస్య ము ◆ పాంతచక్ర
హారి స్మారజగన్మోహ ◆ యంత్ర మనఁగ. ౧౯౩

—* దశరథుండు పుత్త్రుల కుపనయనంబు లాచరించుట *—

ఉ॥ జుట్టులు చుట్టుఁబోఁగు లాక ◆ సాయగ మొల్కొడు కాకపక్షముల్
నెట్టన శేవ గుల్కు నెఱ ◆ నీటులు మీటగు మేటిచెయ్దిముల్
గట్టడఁపుం గళ ల్గల చొ ◆ కాటఁపుసొమ్ముల జగ్గునిగ్గు ల
ప్పట్టున నక్కుమారులకుఁ ◆ బాటిల నయ్యె వధూటికామణీ. ౧౯౪

క॥ ఉపనయనస్థితి కెవ్వాఁ, డుపాయ మగు నట్టి పరముఁ ◆ డుర్వరఁ బొడమన్
విపరీతమనక నృపుఁడప్పు, డుపనయనము సేయఁ బూనె ◆ నుత్పలనయనా. ౧౯౫

సీ॥ పందిలి నెనసె న ◆ ప్పట్టున నాకసం, బటువేదికాంచిత ◆ యయ్యె జగతి
సురపురి సొరెల్లఁ ◆ జొచ్చె వేడ్క నయోధ్య, నమరహర్షముపొసు◆లందు మెఱసె
నొగిఁ జాలెగంధవ◆హుఁడుగంధములుగూర్పఁ,బుష్పవంతులుమహ◆స్ఫురణఁగొనిరి
వాచంయములు స్వస్తి ◆ వాచనికతఁ గాంచి, రైదువ లలవేల్పు ◆ టన్నులైరి

తా నె నేనై తి వేయేల ♦ తలఁప నెల్ల
జగము లొక్కటఁ మంగళా ♦ స్పదము లయ్యె
రామునకు నిత్యకల్యాణ ♦ ధామునకును
బ్రహ్మచర్యవ్రతారంభ ♦ భద్ర మమర. ౧౯౬

క॥ ఆతల్లుల సౌభాగ్యం, బాతండ్రి వికాస మిట్టిఁ డన నాతర మే
యాతఱిఁ దమకొమరుల నుప, నీతుల నొనరింపఁ గలుగ ♦ నిర్మలచరితా. ౧౯౭

ఉ॥ మాటికిఁ గ్రొత్తలై వెలసె ♦ మాంగలికోత్సవసంవిధానము
ల్లోటికిఁ గొల్లగా నమరె ♦ గోమణిహాటకకోటిదానముల్
నాఁటికి నేఁటికి న్మఱపు ♦ నాకుజనింపదు హర్షతృప్తికిం
బాటిలె నేరి కద్దు జని ♦ వారలె ధన్యులు క్ష్మాధరాత్మజా. ౧౯౮

సీ॥ ఎవని నిశ్శ్వసితంబు ♦ లిజ్జగత్త్రయిఁ ద్రయీ, కలనఁ బెంపొంది ప్ర ♦ ఖ్యాతిఁగాంచె
నెవని నామావృత్తి ♦ యెసఁగుసన్మౌనుల, కలరుమంత్రరహస్య ♦ మై తనర్చె
నెవని శ్రీచరణంబు ♦ లవము త్రిమార్గనాఁ, దగి తాతిసృష్టిఁ బూ ♦ తగనొనర్చె
నెవని సందర్శనం ♦ బెల్ల సంయములకు, బ్రహ్మసాక్షాత్కార ♦ పదవి యయ్యె
నట్టి హరి చతుర్వి ♦ ధాంశావతరణాప్తిఁ, గన్నవాని శక్తిఁ ♦ గన్నవాని
గారవమునఁ గృతులు ♦ గాఁజేయ వటులీలఁ, గని మెలంగె వికచ ♦ కమలనయన.

క॥ అజ్ఞానతిమిరమిహిరుఁడు, ప్రజ్ఞానఘనుండు నిగమ ♦ పదవిలసితుఁ డా
యజ్ఞాత్మకుఁ డగు హరి గురు, నాజ్ఞ న్యజ్ఞోపవీత ♦ మందెఁ బ్రియసఖీ. ౨౦౦

శా॥ నాంది దేవత లైరి తృప్తు లటుల ♦ న్న న్దేవత ల్వాదిక
న్నం దారుం బరితృప్తులై రి తొలుతన్ ♦ క్ష్మాదేవతల్ తృప్తి పెం
పొందం గాంచిరి వేయునేల రఘురా ♦ మోద్యచ్ఛుభప్రక్రియా
మందానందరసప్రవాహములలో ♦ మల్లాడె ముల్లోకముల్. ౨౦౧

ఆ॥ మఱువ దెవని వేద ♦ మాత యాలోకని, ర్మాత తాతఁగన్న • తాత యైన
బ్రహ్మమున కొనర్చె ♦ బ్రహ్మోపదేశ మ, మ్మౌని యెంతవాఁడు ♦ మానవతిరొ.

క॥ హవిరధికరణము హోతయు, హవిస్సు నటు హోమ ఋతియు ♦ నగు హరి చేతన్
హవనప్రక్రియ సేయుం, జె వి శేషజ్ఞుఁ డగు మౌని ♦ చిత్కల లెసఁగన్. ౨౦౩

శా॥ సావిత్రాహ్వయమండలాధిపదవా ♦ స్తవ్యుండు విశ్వాధిభూ
సావిత్రాన్వయసాగరోద్భవుఁడు స ♦ చ్చారిత్రలక్ష్మీ స్త్రమిల
త్సావిత్రపరిభాసమంచితుఁడు శ్రీ ♦ ధాముండు రాముండు దాన్
సావిత్రీమహితోపదేశ మెద మె ♦ చ్చం గాంచె నబ్జాననా. ౨౦౪

ఉ॥ మండల మేలువాఁడు సుర ♦ మండలిఁ బ్రోవ జనించి వారక
న్మండల మప్డు గాంచె నస ♦ మానమహత్త్వము దోఁచె దాన స
న్మండల మెచ్చ బ్రహ్మభవ ♦ మాన్యనియమ్యత బ్రహ్మచర్య భూ
మండలరాజ్యముం గొనియె ♦ మానులు వేల్పులు నుబ్బియాడఁగన్. ౨౦౫

క॥ ఆక్షాలితాఘుఁ డాశర, శిక్షానిష్ణాతుఁ డైన ♦ శ్రీసఖుఁ డంతన్
భిక్షాందేహి యని భువన, రక్షావిధి కెత్తె భిక్ష ♦ రాజీవాక్షీ. ౨౦౬

ఆ॥ అన్న; పుట్టు కుట్టు ♦ నెన్నఁడు లేకున్కి, నొసఁగుమయ్య యనుచు ♦ నొత్తి పరముఁ
దన్న వేఁడుఁ డనుచుఁ దలఁపించె నన మున్న, యడిగె గురుల రాముఁ ♦ డద్ధి నబల.

క॥ స్మయవర్జితహృదయా యీ, క్రియఁ జెలు వగురాము నెనసి ♦ శ్రీఁగనె ననుజ
త్క్రియమును నయ్యెడ వర్ణ, త్క్రియ మా ప్రణవోపపత్తిఁ దా వెలయు రహిన్.

సీ॥ మున్నద్ది తానయై ♦ యున్నవాఁడగుటఁ ద, దనుసంధి మెలుపు గా ♦ యత్రి దెలుపఁ
దనమాయత్రిగుణాత్మ ♦ తనుఁగాంచుటనుదాని, కిదెమన్కి యనిమౌంజి ♦ యెఱుక సేయఁ
ద్రయి యిత్తెఱఁగున నీ ♦ తనిఁ జుట్టి వఱలు నం, చనురీతి నుపవీత ♦ మభినయింపఁ
బళసంజ్ఞ మను భవి ♦ వ్రజ మేలుఁ దత్పతి, యవు నితం డని దండ ♦ మర్థమొసఁగ
బ్రహ్మచారిత్వ మిమ్మెయి ♦ బాలభావ
మునఁ వెలుఁగుట నొకవెలుం ♦ గనువదింపఁ
దమ్మ లటుగూడ నుపనీత ♦ ధర్మ మెనసి
మెఱసె రఘురాముఁ డోదయా ♦ మిలిత నయన. ౨౦౯

ఆ॥ తనకు నాకు భేద ♦ మనరాదు గాన ని, య్యిర వెఱుఁగఁ జేసె ♦ నెల్లవారి
కన నతండు వొల్చె ♦ నజినాదిమామక, చిహ్నధారణమునఁ ♦ జిత్ప్రకాశ. ౨౧౦

క॥ పాలాశసమితి నిఁక మీ, పా లాశమనుపురి యనుచుఁ ♦ బనుచు విభున కా
పాలాశశుభక్రియ సుర, పాలాశయుఁ బెనిచెఁ దపసి ♦ పర్వేందుముఖీ. ౨౧౧

చ॥ మహిమ గడల్కొన న్నిఖిల ♦ మానివరు ల్గురుఁడుం బ్రసక్తి న
న్వహ మటఁబ్రజ్ఞ మేధయు న ♦ నంతత నెక్కొన స్వాశిషోక్తి న
ల్లహరి చిదాత్మలం బెనుచు ♦ లావు మదాత్మకుఁ గూడ విస్మయా
వహమగు నైన నెద్ది పర ♦ వస్తువుఁ జేరి ఫలింప దోయుమా. ౨౧౨

తే॥ ఎల్లవిభవంపుసిరికిఁ బు ♦ ట్టిల్లు సుకవి
జీవనము త్రిదశుల ప్రక్క ♦ చేని పంట
మునితపస్సిద్ధిపదము రా ♦ మునివ్రతోత్స
వము వెలసెఁ బాలవెల్లినా ♦ వనరుహాక్షి. ౨౧౩

క॥ తమ్ములుఁ దా నిట్లుపనయ, న మ్మొనసి శివాత్ము లని జ ♦ నమ్ము వొగడ వే
దమ్ములు సాంగములుగా, నమ్మునివలన గ్రహించి ♦ నగరాజసుతా. ౨౧౪

తే॥ చిత్రమాఁ గడె మునుమున్న ♦ చెలఁగు నయ్యు
పాకరణ మాది యాసమా ♦ పనమె సీమ
యా కతిపయాహముల నఖి ♦ లాగమములుఁ
గేలిమెయిఁ బాడి రొకట లె ♦ క్కించి రనఁగ. ౨౧౫

ఉ॥ నాలుగు మోములయ్యఁ గని ♦ నాడఁట పల్కువెలంది కోడలా
మేలగువీలుఁ గూడె నఁట ♦ మేకొను సెజ్జయు వేయిమోములన్
జాలుగ వ్యాకృతు ల్నెఱపఁ ♦ జాలిన బంటఁట విద్దె లెల్లఁ దా
నేలఁజె యప్పురాణకవి ♦ యింకను సందియమే యమిస్తుతా. ౨౧౬

మ॥ జగతి న్విద్దెలకెల్ల మూలపదమా ♦ సర్వేశుఁ డిట్లన్నియున్
స్వగురుప్రోక్తిఁ బరిగ్రహించి శరల ♦ క్ష్యప్రౌఢిఁ దానెంచుల
గ్గగుఁగాకంచుఁ దదేకనిష్ఠుఁ డగుచా ♦ య న్వేల్పులూహింపఁ గాఁ
దగ బాణాసనవిద్య గూర్చునెడ ను ♦ ద్యల్లక్ష్మిన్ నబ్జాననా. ౨౧౭

క॥ వేదండగామినిరో; విన, వే; దండధరాభులగుచు ♦ వెలసిరి వారా
కోదండకలన, వదభోః, కోదండ, మితోఽర్వాతీహా, ♦ గోప,యనిరనన్. ౨౧౮

ఆ॥ మొయిలు దొఱఁగి మెఱయు ♦ ముచ్వేలుపులయిక్క
తెలిపి దుర్నిరీక్ష ♦ తేజులగుచుఁ
బ్రబలి రబల; వారు ♦ బ్రాహ్మ్యయుక్తి వెలుంగు
క్షాత్ర మిట్టిదన వ ♦ శంబె జగతి. ౨౧౯

క॥ అమ్మని యాథర్వణత, త్వ మ్మెమ్మెయెడ ధారవోసి ♦ ధన్యతఁ గనె లో
కమ్ముల నటుమనిచెను ఘను, లమ్మొయివా రగుట క్రొత్త ♦ లగునే మగువా.

ఆ॥ చాలమెఱసె నాగమాలి ♦ యచ్చో శక్తి, కలితవారిబిందు ♦ కలన దోఁప
నిట్టిగురుఁడు గూడు ♦ నేమొకో శిష్యులు, దొరక రిట్టివారు ♦ తోయజాక్షి.

సీ॥ సింగార మొనయించి ♦ జిగిజిరా ధరియించి, సింగాణి కైఁబూన్చి ♦ చెలువు గాంచి
సొరగు సిగ చుట్టి ♦ చలువదుప్పటి గట్టి, సొరప్రతిభ మీఱి ♦ జయము గోరి
భద్రాశ్వమణి నెక్కి ♦ ప్రాభవమ్మున నెక్కి, భద్రాత్మత న్మించి ♦ పరువు వెంచి
తమ్ముఁ బౌరులు మెచ్చఁ♦దాత్పర్య మెద హెచ్చఁ, దమ్ములతోఁ డను♦ద్వరితముగను

వనము గలయఁ జొచ్చి ♦ వడి సత్త్వముల వ్రచ్చి
మఱలి వచ్చుఁ దండ్రి ♦ మదికి వచ్చు
కాన్క లప్పగించుఁ గలికి ♦ యిట్లు చరించు
రాముఁ డఖిలహృదభి ♦ రాముఁ డగుచు. ౨౨౨

ఉ॥ వేకువవేళ స్నాతుఁడయి ♦ వేడ్క గురుం దలిదండ్రుల న్నమ
స్యాకృతిఁ దన్పి తమ్ములునుఁ ♦ జక్కటినెయ్యురుఁ గూడిరా జయ
శ్రీకరమైన గద్దె దరిఁ ♦ జేరి నయ మ్మొనయ న్గురూక్తులన్
గైకొని రాష్ట్రతంత్రములఁ ♦ గాంచు రఘూద్వహుఁ డుత్పలేక్షణా. ౨౨౩

ఆ॥ మునులతోడి పొత్తు ♦ మొనసి భుజింపుచు
నిఖిలధర్మశాస్త్ర ♦ నిర్ణయంబు
లెఱిఁగి కొనుచు వారి ♦ కెఱుక గూర్చుచు నిచ్చ
లతఁడు మెఱసె నిట్టు ల ♦ హార్యతనయ. ౨౨౪

వ॥ మఱియును. ౨౨౫

సీ॥ ఒకవేళ శబ్దశా ♦ స్త్రకలాప్రకాశనం, బొకక్షణం బాన్వీక్షికో ♦ ద్వ్యక్తిపరత
యొకముహూర్తమున మౌ ♦ హూర్తికప్రకరణం, బొకగడె సుపదప్ర ♦ యోగలక్ష్య
మొకపూఁట కల్పశి ♦ క్షోచితాభాషణం, బొకయరజాము ని ♦ రుక్తిగరిమ
మొకయామ మకలంక ♦ సకలధర్మవివక్ష, యొకప్రొద్దు రాజనీ ♦ త్యూహనిష్ఠ
అన్నియెడలను బ్రహ్మతా ♦ దాత్మ్యలక్ష
ణోపనిషదర్థవివృతియు ♦ నొప్ప రాముఁ
డమరు మునిగోష్ఠిఁ గమలాక ♦ రమున నొగి వె
లుంగు ప్రతిమాప్రభాకరు ♦ భంగి గిరిజ. ౨౨౬

చ॥ మనుజుఁడ నంచుఁ దోఁచి మహి ♦ మం బొకకొంత మఱుంగుసేసి తా
నను జను లిచ్చ మేకొనఁ ప ♦ ను ల్గొనె నిట్లు వికారి పోలికన్
ఘనుఁ డజుఁ డీశుఁ డేవికృతి ♦ గల్గదు వానికి నిక్కమం చెఱిం
గిన కృతియే పరాత్మకృతి ♦ కీలు గనంగను నంగనామణీ. ౨౨౭

—* శ్రీరామప్రభృతుల యౌవన వర్ణనము *—

క॥ అక్కుమరుల కక్కాలముఁ, జక్కెఱవిలుకాని కళల ♦ స్వామ్యం బొకఁడే
తక్కువపడెనని మక్కువ, నక్కఱతయుఁ దీర్పఁ దలఁచె ♦ యౌవనము కృతిన్.

సీ॥ కప్పుటఱా యొప్పుర ♦ కం బంత బిరుసంచుఁ, దాపింఛముల విప్పు ♦ దార్చునేమొ
యాణిముత్తెపుఁదళు ♦ కా మొక్కలం బంచు, మల్లెపూ నెఱి కాన ♦ మార్చునేమొ
విద్రుమచ్ఛాయాను ♦ విధి యగ్గలం బంచుఁ, జివురుటాకు పసందు ♦ చేర్చునేమొ
పద్మరాగద్యుతి ♦ భంగి ముమ్మర మంచుఁ, గ్రొందామరల సిరిఁ ♦ గూర్చునేమొ
యంగరుచి హాసవికస నా ♦ భ్యంచితోష్ఠ
రాగ కరపాదలీలాస్ఫు ♦ రణల కింతె
యావనం బింక నేమిసే ♦ యంగఁ జాలు
రాము జగదభిరాము శ్రీ ♦ ధాము దొరసి. ౨౨౯

క॥ అందఱు నందఱె యను న, ట్లందఱు యెడఁ బాదుకొలిపె ♦ నాయాకళలం
గంద మిదె యనియె రాముని, యం దన్నియు వెలయఁజేసె ♦ నవి గ్రొత్తలుగన్.

సీ॥ శృంగారసర్వస్వ ♦ సిద్ధితీర్థం బంచు, నూనూగుమీసాల ♦ నూలుకొలిపె
మోదాతిభూమావి ♦ ముక్తస్థలం బంచు, జిఱునవ్వులయఁబల్కు ♦ చెలువుగూర్చెఁ
గల్యాణవృష్టిప్ర ♦ కామ్యాశ్రమం బంచుఁ, గూర్మిఁ జాల్గొలుపు చూ ♦ పుల నమర్చె
లక్ష్మీవినోదాము ♦ లక్షేత్ర మిది యంచు, నెఱిసారెబంచు బ ♦ ల్మీటు వెనిచె
నొక్కొకని సుకృతంబట్టు ♦ లూర్జితె మగుఁ
గాని కానగునది యేది ♦ గాక మాను
సకలకర్తృకలాప్రకా ♦ శకపదములు
పుణ్యభూములు గదె దయా ♦ పూర్ణహృదయ. ౨౩౦

క॥ పొగడినయదె పొగడఁగ నగు, జగతీధరతనయ ; రామ ♦ చరితం బెల్లన్
నెగడుగనవో విలాసము, లగణితములుఁగావొ యావ ♦ నాంచితకలనన్. ౧౩౨

మ॥ మితభాషిత్వ ముదారభావము దయో ♦ న్మీలత్వ మార్యోక్తిస
న్మతి చాటూక్తివిపాక మంచితకలా ♦ మానిత్వ మప్రాకృత
ప్రతిభాసిత్వ మనుగ్రహాగ్రహనుసం ♦ పన్నత్వ మాలక్ష్మితో
న్నతలక్ష్మీస్ఫురణంబు వారల దెస ♦ న్గన్పట్టె నప్పట్టునన్. ౨౩౩

చ॥ అవయవసౌష్ఠవంబు కల ♦ నాతిశయం బసదృక్షకాంతివై
భవ మపరాజితస్వరస ♦ భావవిలాసము శ్రీసముల్లస
త్కవివరవర్ణనీయపద ♦ కంధిసముద్భవభాగ్యలక్ష్మికిన్
భవనములయ్యె వారి యెడ ♦ భావభవోదయకృత్కళాశ్రియా. ౨౩౪

సీ॥ చంద్రకలాశక్తి ♦ చాలునో; చాలదో;, పంకజాతస్ఫూర్తి ♦ బయలుపడియె
సౌరసిద్ధాంతోక్తి ♦ జరుగునో; జరగదో;, వైద్యుతక్షణికతా ♦ వార్త నిలిచె

ననలానుమితిదార్ఢ్య ◆ మమరునో; యమరదో; బాష్పాప్తిఁబరతాప ◆ వహ్ని వెలసెఁ
గుండలీశ్వరభక్తి ◆ కూడునో; కూడదో; గురువచస్సంపత్తి ◆ గుప్తిఁగాంచె
ననుచు ముచ్చటలాడుట ◆ లతిశయిల్లె
విబుధగోష్ఠుల సందేహ ◆ వివృతు లమర
నక్కుమారుల ముఖలక్ష్మి ◆ యమితతేజ
మధికశౌర్యము వాగ్గుంభ ◆ మనువుపడఁగ. ౨౩౫

ఉ॥ తమ్మి యొకండు తామరలు ◆ దామరసమ్ములు సారసమ్ములుం
గమ్మనితావి మేల్విరుల ◆ కందువలై వికసించెఁ బౌనరు
క్త్య మ్మనరాదు వాటి దెస ◆ యౌవనభానుని రాకఁ గాంతిపూ
రమ్మున మోము కన్నులు క ◆ రమ్ములు పాదము లట్లు వొల్చుటన్. ౨౩౬

చ॥ కమలము లన్నఁ బ్రాఁతవడెఁ ◆ గాదని చంద్రునిఁ బట్ట నాగ్రహం
బమరెడు నింక వేఱువిధి ◆ యా; విధి కుచ్చితుఁ డట్లు వారి యం
గముల నమర్చి కావ్యమతిఁ ◆ గానసీమల పాలు సేయఁ గాఁ
కమరులువోంగ సామ్యగతి ◆ కందెడు వస్తువు లందఁ జేయఁడే. ౨౩౭

సీ॥ మానినీమానసాం ◆ భోనిధు ల్గలఁగవో, తాలుకొన్నిగరంగి ◆ జాలువాఱెఁ
బరమండలులు డక్కు ◆ వడి బిట్టు తమకవో, చక్రపక్షులు కొన్ని ◆ జళుకుగాంచెఁ
గూర్చు ద్విజశ్రేణి ◆ కోరిక ల్పండవో, కవిరాజు లోకకొన్ని ◆ నవక మొనసెఁ
దామసోత్కరము లు ◆ ద్ధతి సెడ ఁగవో, యిరులమూకలు గొన్ని ◆ యేగసాగె
నెద్ది యెటులైన నింతకు ◆ నెల్ల జగము, ప్రాంచితానందతృప్తిప్ర ◆ పంచమయ్యె
వినకులేశ్వరు తనయుల ◆ య్యనువు నెఱయ, నంక మొరయని రాకాశ ◆ శాంకులగుట

శా॥ ఒక్కండేనిఁ గొఱంతె యుండదు గదా ◆ యుర్వీంద్రు సంతానమం
దక్కంజాతభవుండె నేర్పరి యటం ◆ చాముక్త మర్యాద పెం
పెక్కంగావుత వాని భాగ్య మటులే; ◆ యెట్లేని శ్రీజాని తా
దృక్కల్యాణకలాకలాప మపరా ◆ ధీనం బదీనక్రమా. ౨౩౯

శా॥ మోకల్వెట్టిననాఁడె కల్పతరువు ◆ ల్మున్నాడి తన్మంజరీ
ప్రాకట్యం బిటు దోఁచె నేఁటి కిఁకఁద ◆ త్ప్రఖ్యాతసంపత్ఫలా
స్తోకప్రాభవ మొప్పకుండదు గదా ◆ శుద్ధాత్ము లాశింతు రా
శ్రీకల్యాణపరంపర ల్వడయ వా ◆ గ్జేగీయమానోదయా. ౨౪౦

క॥ ఎంద ఱెటులున్న రాముని, యందొక క్రొందళుకు గులుకు ◆ నది వివరింపన్
బృందారకులకును శతా, నందునకునుఁ దరమె వికచ ◆ నలినదలాక్షీ. ౨౪౧

తే॥ ఆజగన్మోహనాకారుఁ ♦ డైన రాముఁ
డగును మగలకు నేని మో ♦ హావహుండు
మున్ను మోహినియై యటు ♦ ల్మానసె ననినఁ
గామజనకత్వ మీనాఁడుఁ ♦ గడచి చనెనె. ౨౮౨

ఉ॥ ఏమనిచెప్పుదు న్గిరికు ♦ లేశ్వరనందిని రాము నప్పు డే
రామలు గాంచి కాననివి ♦ రాళికిఁ బాల్పడి చొక్కి గాంచ రే
భామల చిత్తవృత్తు లటు ♦ భాస్వరతన్మహనీయ చిత్రిలీ
లామయత న్గడల్కొనవు ♦ లాలితసద్భ్రమసంపదున్నతిన్. ౨౮౩

సీ॥ పటము గన్గొని వాని ♦ ప్రక్కఁ జేరినఁ గాని, పరికింపలేనను ♦ సరసదృష్టి
లేఖ లూహించి యా ♦ లీలాత్ముఁ గదియక, తోఁచ దెద్దియు నను ♦ వాచికోత్క
వార్త లాలించి య ♦ వ్వారు ముఖాముఖిఁ గాక, భాషింప రాదను ♦ భాష్యచతుర
మైత్రిపెంపరసి య ♦ మ్మహి కూర్మి గొనకున్న, మమత వాటిల దను ♦ మాన్యభక్తి
యువని నొకరెత యన నేల ♦ యంద ఱట్టి, వారె యన నైరి పో రాచ ♦ వారి కన్నె
లఖిలభువనైకమోహనుం ♦ డైన రాము, లలితకామకలాసము ♦ ల్లాస మొలయ.

ఉ॥ చుట్టఱికం బెఱింగి మదిఁ ♦ జొక్కుదు రొక్కట లేనిబాంధవం
బట్టిటుఁ గూర్చి కూర్తు మని ♦ హాయి గనం గమకింతు రాదృతిన్
మట్టునుమీఱు సారెల సు ♦ మాళము మేకొనఁ దార్పఁ జూతు ర
ప్పట్టున వారి మెప్పు గను ♦ భాగ్యము గల్గునో యంచు భూపతుల్. ౨౮౫

తే॥ వచ్చువారును బటములఁ ♦ దెచ్చువారు
మెచ్చువారును గానుకలం ♦ దిచ్చువారు
ముచ్చటల మున్గువారుఁ గా ♦ మచ్చు చూప
మచ్చికంటుల హాయ లెల్ల ♦ రచ్చ కెక్కె. ౨౮౬

తే॥ ఎంద ఱాశింప నేమగు ♦ నేరికేని, నందరాని మహాలక్ష్మి ♦ నందువాని
చంద మెట్లును వింతయా ♦ జగతి కెల్లఁ, గుందరదన; కలాసమ ♦ గ్రేందువదన.

ఉ॥ చుట్టఱికంబు పెంపు సరి ♦ చూడక శీలము వంకఁ బోక చే
పట్టఁగఁ గూర్చు కన్నియల ♦ భావకలావిభవంబు లెన్న కే
పట్టుననేని సంపదల ♦ భంగి దలంపక కోరునంతనే
యట్టిమహామహీంద్రు ♦ లనయం బెనయం గ్రహియింప నెంతురే. ౨౮౮

మ॥ చికిలీచేసిన చంద్రహాసతతి నాఁ ♦ జెన్నారు చిన్నారి రా
చకొలం బన్నిటఁ జాలి యుండ సుధృతిన్ ♦ శ్యామజాని శ్రీజానిగు

ట్టోకయింతేనిఁ దలంచునో, తలఁపఁడో, ♦ యూహించు మైఁబెంచు నే
వికచాంభోజదలాక్షు లీనెఱికి ను ♦ ద్వేం గూర్తు రంచాత్మలోఁ. ౨౪౯

తే॥ సగరవంశోద్భవులు తారు ♦ సాగరంబు, సొంపు గాంభీర్యమునఁ బురు ♦ డింపరొక్కా
తమకఁ డొక్కింతయును నేరు ♦ తారసిల్లి, రేని దశరథుఁ డెద్దాని ♦ కాన యిడఁగ.

క॥ ముచ్చటలఁ దేలుచుం దన, మెచ్చుల కుప్పలకుఁ దగిన ♦ మెలఁతలఁ గూర్పఁ
వచ్చు నెపు డెట్లనుచు మది, నచ్చఁపు వేడుకలఁ గోన ♦ లాధిపుఁ డుండేఁ. ౨౫౧

క॥ అని శంకరుఁ డెఱిఁగించిన, విని బ్రహ్మానందలక్ష్మి ♦ విలసనమున నా
ననపద్మ మందగింపఁగ, దనివి సనక గౌరి,శో, న ♦ తనితో ననియెఁ. ౨౫౨

క॥ మాయాదూర ; వశీకృత, మాయుం డజుఁ డతని మహిమ ♦ మఱి విందు నటఁ
దా, యోగమాయ తదను, జ్ఞాయత్తతఁ దోఁచె నెట్టు ♦ లది దెల్పఁ గదే.

వ॥ అని యనుసరించి వేఁడుకొనుటయు. ౨౫౪

శా॥ సత్తామాత్రవివేచనాధిగతస ♦ త్సంపత్తినిత్యా స్వసం
విత్తాయోగవిభాగతోంచితజగ ♦ ద్వేత్తృత్వ యోగ్యా రసో
దృత్తాత్మానుభవప్రకారవృతపూ ♦ ర్ణానందభావా ప్రమా
యత్తాన్యత్వవిభావిభావ్యమహితా ♦ నంతప్రభావోదయా. ౨౫౫

క॥ విధివిహితయోగతేజో, నిధిభాస్వద్భాస్యతావి ♦ నిహితసమాన
త్త్యధిభూతసర్వభానా, వధిభూతస్వప్రకాశ ♦ భాసకభానా. ౨౫౬

మాలిని॥ పరమపదమహశ్రీ ♦ ప్రాపకాత్మానుసంధి
స్వరసనుఖితభక్తా ♦ శ్రోతమార్గానుషక్తా
నిరవధికకృపాబ్ధీ ♦ నిత్యనిర్వాణలబ్ధీ
సురపరివృఢసేవ్యా ♦ శుద్ధభావానుభావ్యా. ౨౫౭

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మమ్మాంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమునం దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### —♦ చతుర్థాశ్వాసము ♦—

—:(o):—

శ్రీనిత్యానందరసా
ధీనబుధాధీనభక్త ♦ ధీవృత్తిపరా
ధీనస్వభావలక్ష్యా
త్మానుశ్రుతచిత్కళా ♦ స్పృశా పరమేశా. ౧

—♦ యోగమాయా జననఘట్టము ♦—

ఆ॥ అవధరింపు మయ్య ♦ హార్యరాజతనూజ
కిట్టులనె గిరీశు ♦ డెలమిఁ దొలఁక
హరి యనుజ్ఞ మున్నె ♦ యాదల నిడి యోగ
మాయ స్వీయయోగ ♦ మహిమ మెఱయ. ౨

వ॥ బ్రహ్మవిద్యావిశారదుండు పావనుండు నగు కుశధ్వజనాముని మహాముని సంభావ
నీయునింగా మతినుంచి గతినెంచి పతిదేవతావతంసంబు నా వఱలు తత్కులకాంతా
మణి గర్భంబునం బ్రవేశించి యొక్క శుభోదయంబున నయ్యుధీషణాత్మజుండు. ౩

చ॥ తొలుఁబలుకు ల్పఠించు తఱిఁ ♦ దోఁచి మెలుంగుల జాల్గరంగు భం
గులు వెలయంగ వాణోనుడుఁ ♦ గూరిమి నివ్వటిలంగ నాతఁడ
ష్వాలఁతిఁ దలంచె వేదవతి ♦ పోయిది యం చటు లవ్విలాసినీ
తిలకముఁ బిల్చి రెల్ల రది ♦ తెల్లము తచ్ఛ్రితియుక్తి నెచ్చెలీ. ౪

క॥ ఆగుణవతి సుమమంజరి, నాఁగని జనయిత్రి వొల్చె ♦ నవమాలిక యా
నాగ మునివర వసంతుని, యోగానిలు దక్షిణత్వ ♦ మొలయఁగ నవలా. ౫

ఆ॥ దిక్కులెల్లఁ దెలివి ♦ దేటలఁ దేలె మే, ల్వొందె నన్నియెడలఁ ♦ బొరువు లగుచు
నీరజము లనిలకి ♦ శోరము ల్వొదలెన, వ్వేళఁ బ్రాణితతికి ♦ వెలసె సుఖము. ౬

క॥ ఘనుఁ డమ్ముని యానందను, ఘనుఁడై బాలికకు మేలు ♦ గా నగు విధులె
ల్లనుఁ దీర్చి ప్రియత లతకూ, నను బలెఁ బెనిచెం గ్రమంబు ♦ న ంగమలాస్యా. ౭

తే॥ వింతె; యిందీవరాక్షి య ♦ వ్వేలఁది పెంపు
గనుటఁ గ్రొన్నెలరేక తా ♦ ననుకరించె
నవల నానాఁట సిరి మించు ♦ నుచిద మ్రోలఁ
గం దెనయుచుంట నది తిర ♦ స్కార మొందె. ౮

క॥ నిలఁబడు తొలకరి మెఱు పనఁ, గలకాలము మెఱయు చంద్ర ♦ కల నావలపు
ల్గల మేలి పసిఁడి తీవియ, పొలుపున నబ్బాల రుచులఁ ♦ బొలిచె సుశీలా. ౯

ఉ॥ ఆదటఁ గొన్నినాళ్ల కతఁ ♦ డన్నులమిన్న కనన్యలభ్యసం
మోదము పేర్మి నన్నమిడె ♦ మున్నిది యన్నమయాది కవ్వలం
దాఁ దులకించునట్టి పర ♦ తత్త్వ మనం గనఁ డొక్కొ; యమ్మ; న
న్నాదృతిఁ జేర్పు పీని కడ ♦ కం చనుటో; కనవే విలాసినీ. ౧౦

ఆ॥ లీల లొలుక నటు ల ♦ వేలవార్షము పేరి, పాలవెల్లి తమకుఁ ♦ బొలువడుట
నోలిఁ దల్లిదండ్రు ♦ లోలలాడఁగ బాల, కేళు లొలసె నామె ♦ లోలనయన. ౧౧

ఉ॥ ఆటలఁ బాటలం దళుకు ♦ లంగము లందొరలంగ మాటికిన్
మాటకు మాట కయ్యమృత ♦ మండల ముట్టిపడంగఁ జెల్వలం
దేటల గాటమై మహిమ ♦ తీవెలువాఱ జగంబులోన నీ
బోఁటికి సాటి యెవ్వ రని ♦ పొల్చిరి హర్షభృతి న్గురు ల్సతీ. ౧౨

తే॥ తపము సిరి దక్క నొండెద్ది ♦ దమకుఁ బోల
కునికిఁ బుపుగుత్తు లాదిగా ♦ నువిద కిడఁగ
నామె వనలక్ష్మి నా మించె ♦ నందగింప
రే; కలిమివార లెట్లుఁ బూ ♦ ర్ణేందువదన. ౧౩

ఉ॥ ముద్దులగుమ్మపైఁ దొరలు ♦ ముద్దుల కుద్దిగ విద్దె లొద్దికం
బెద్దతికంబుఁ గూర్చు నని ♦ పేర్మిఁ దపస్వుల పెద్ద పద్దెము

ల్దద్దయుఁ గొన్ని నేర్పటయుఁ ♦ దారసిలె న్గవు లద్దిరా యనం
బద్దుగ మానసాబ్జరతిఁ బొల్పడి యాగమహంస లద్రిజా. ౧౪

తే॥ ఎల్లవిద్దెల కీయమ్మ ♦ యెల్ల యగుట
శారదాదేవి యనవచ్చు ♦ జవ్వనమున
మించువహిఁ దిలకించియు ♦ మెలఁత మరుని
తరుణి యను బెంత దొసఁగు కాం ♦ తాలలామ. ౧౫

క॥ ఆమనితతరుణిమోన్నతి, యామనిగాఁ జూతలతిక ♦ యనుగతి పొనరం
గామునిసాయక మిది యనఁ, గా మునినాయకుని తనయ ♦ కడురుచిఁ బ్రబలెన్.

ఆ॥ విరియఁ బడియె మేను ♦ విఱ్ఱవీఁగఁ గుచంబు, లవయవాలి తీర్చి ♦ నట్టు లయ్యెఁ
బాదుకొనె విలాస ♦ భావంబు లతనుని, ములుకు లయ్యెఁగలికి ♦ పలుకు లపుడు.

మ॥ ఎలప్రాయం బెలయించు లీల జటిలుం ♦ డీక్షించి యాబాల వె
న్నెల గూర్పంగల తేనితో డయిన క ♦ న్నెం బోలఁగా నిల్లెదం
దలపోసె న్వలరాజుఁ గన్నతఁడ యీ ♦ తన్వంగికి న్భర్త గా
వలయు న్బో, వల దన్యుఁ డెట్టిఁ డయిన ♦ న్వాంఛింప నం చంగనా. ౧౬

ఆ॥ ఇటుదలంచి తపసి ♦ యెల్లరు వినఁగ ని, య్యతివ నేరి కొసఁగ ♦ హరికిఁ దక్క
ననుచుఁ బ్రతిన చఱచి ♦ యంచితజపనిష్ఠ, మెలఁగుచుండె నతఁడు ♦ సలలితాంగి.

ఉ॥ అంత మదేభయానఁ గని ♦ యంగజకింకరతాప్తి నిక్క తా
రెంతటివార లేని చెలి ♦ నిమ్మని వేఁడి వృథాప్రయత్నులై
కొంతకుఁ దేఱియు న్మనము ♦ కొందలమందఁ దలంగుచుండ్రి సు
మ్మింత యభాగ్యశాలురకు ♦ నెట్లిది దక్కు నటంచు సుందరీ. ౨౦

ఆ॥ తనువు గలుగునాఁడె ♦ తనపొడ గనవచ్చు
టతని మహిమ కొంత ♦ యడఁగి యుండెఁ
దనువుఁ దొఱఁగి వాఁడు ♦ తనుధారులను వేఁపఁ
దొడరె నతనుఁ డిపుడు ♦ తోయజాక్షి. ౨౧

క॥ తెఱవ తముఁ బ్రోనఁ బొడమిన, తెఱఁ గెఱిఁగియు నాపె యొఱపుఁ♦దెఱ గ్రమ్మిన నే
ర్తెఱఁ గోరిరి సతి విబుధులుఁ, బఱపగు హరిమాయఁ దలఁగఁ ♦ బరులకు వశమే.

ఆ॥ కలుషభయ మొకింత ♦ యలమానిభయ మింత, యిచ్చఁ దవుల మలఁగి♦ రెల్ల రట్టి
గుట్టు తమకొలంబు ♦ పట్టున లేకున్కి, దంభుఁ డన నొకొండు ♦ దైత్యవిభుఁడు.

ఉ॥ ఆ జటిముఖ్యుఁ జేరి మరుఁ ♦ డంపల ముంప భరింప లేక నా
కీజవరాలిఁ గూర్పు మని ♦ యెంతయు వేఁడి యతం డదల్ప వాఁ
డోజ మెఱంగి దుర్మదని ♦ యుక్తి నిశిం జనుదెంచి పొంచి ని
ద్రాజనితాంధతం బొదలు ♦ తాపసుఁ గన్గొని నిర్దయాత్ముఁడై. ౨౪

క॥ అక్కఱినుం డసిఁబూని చి, వుక్కునఁ దలఁగోసె యోగ ♦ పూర్ణుం డగుటన్
గ్రక్కున నతఁ డెక్కుడుగతి, కెక్కె నసుర హత్య పొదువ ♦ నీల్గె న్నగజా. ౨౫

ఆ॥ మానిసతియు ధర్మ ♦ హాని కోర్వక కన్నెఁ, గాంచి హరియ నీకు ♦ గతి యటంచు
బుద్ధు లెలమిఁ గొన్ని ♦ బోధించి పతిమూర్తి, ననుగమించె వహ్ని ♦ యందు సాధ్వి.

చ॥ తన తలిదండ్రు లట్లుచన ♦ దైవవిలాసము నెంచి యవ్విలా
సిని జపవృత్తి శౌరి దరిఁ ♦ జేరెద మద్గురు నిర్ణయంబు చొ
ప్పున నని యిచ్చఁ గూర్చి పరి ♦ పూర్ణసమాధిఁ దదేకతానతం
దనరు టెఱింగె నిర్జరులు ♦ తద్దయు మెచ్చఁ దపస్వినందితా. ౨౬

—♦ వేదవతి విష్ణునింగూర్చి తపంబొనర్చుట ♦—

సీ॥ నగువెన్నెలలు చిల్క ♦ నగు మోముజాబిల్లిఁ, బ్రొద్దువెల్గుల వంకఁ ♦ బొందుపఱిచి
యంటినఁ గసుగందు ♦ నన మించు మైదీవె, నాల్గువహ్నుల నట్ట ♦ నడుమ నునిచి
తెఱకుగ్రొందళుకు చూ ♦ డ్కులఁగుల్కు కనుదోయి, నెఱిమోగలత్వ్యాప్తి ♦ నిలువరించి
పలుకుఁగన్నియ రచ్చ ♦ పట్టు మేల్గను నాల్క, నానముద్రాస్థితి ♦ మలఁచివైచి
కోర్కు లుజ్జగించి ♦ గోవిందునెడఁ గూర్మి, మిగులఁ దపసు సెల్ల ♦ మేల్కొనంగఁ
గలికిమిన్న పెద్ద ♦ కాలంబు దప మిట్టు, లాచరించుచుండె ♦ నబ్జవదన. ౨౮

క॥ వంటకము పైఁ దలం పను, కంటకమౌ నెకల్చి తృష్ణ ♦ గడచి మదాదు
ల్గంటివడ నొంటి నవ్వా, ల్గంటి నెఱపె నియమ మిట్లు ♦ కంజదలాక్షి. ౨౯

ఉ॥ తావులఁ గొన్నిటి న్వరుస ♦ దప్పక దాఁటి హిరణ్మయాఖ్యబిం
బావసితాత్మమూర్తిఁ గల ♦ యం బరికించి మనోవికారముల్
పో వెడలించి నిత్యపరి ♦ పూర్ణసుఖామృతవార్ధిఁ దేలి య
ద్దేవి పొసంగ విష్ణు సెస ♦ తీపి ఫలం బిదె చూవె భావినీ. 30

ఆ॥ పొలఁతి యాశ్రమంబు ♦ పొంత గోవ్యాఘ్రాది, నిచ్చ వేరముడిగి ♦ నియతి నొండొ
కొండు గూడి యాడు ♦ చుండుఁ బుష్పఫలాదు, లెల్లవేళఁ దరువు ♦ లిచ్చు చుండు.

## —♦ వేదవతియొద్దకు రావణుండువచ్చుట ♦—

క॥ ఈరీతి నాతలోదరి, సారవయోరూపవిభవ ♦ సత్త్వము లెల్లన్
నారాయణార్పితము లని, యారూఢోన్నతిఁ దనర్చు ♦ నాసమయమునన్. 3౨

సీ॥ పరమేష్ఠి చిత్తమే ♦ వరనిష్ఠ జపశక్తి, కిచ్ఛావిధేయత్వ ♦ మెనయఁ గోరెఁ
గలధౌతశైలమే ♦ ఘనసత్త్వకరయుక్తి, నాటాడు విఱిబంతి ♦ యై తనర్చె
నాశాంతపదము లే ♦ యదరాత్మ వినియుక్తి, నసినటీరంగత్వ ♦ మందఁ బూనె
నేకశూరత్వమే ♦ యిద్ధతేజ ప్రసక్తి, ద్రిభువనజయలక్ష్మిఁ ♦ దివియఁ జొచ్చె
వాఁడు దవపీతిహోత్రవి ♦ వర్తనిజక, థాప్రధూమిత విబుధనా ♦ థప్రధాన
వీరవరమానసాభిఖ్య ♦ విపినతలుఁడు, రావణుఁడు సర్వభూతవి ♦ ద్రావణుండు. 33

వ॥ నిచ్చలుం దన యిచ్చకు వచ్చి నట్లెల్లజగమ్ములం గ్రుమ్మరుచున్నవాఁడొక్కనాఁడు హిమవన్నగంబున కుదగ్భాగంబున న్నలువొందుచున్నతదీయాశ్రమంబునం బ్రవేశించి యందొక్కవివిక్తప్రదేశంబున. 3౪

సీ॥ కుండలినీసంజ్ఞ ♦ గుట్టు గన్పట్టఁ జే, యుచు మేలిపెంజడ ♦ యొఱపు నెఱపఁ
జిక్కలాభివ్యాప్తిఁ ♦ జెనయుచు నొకదీప్తి, మైనుండి దెసలంట ♦ మలయుచుండ
నంచవన్నియ నిర్వ ♦ హించుచుఁ బటికపుం, బూసల పేరు సొం ♦ పులు ఘటింపఁ
దనుఁ దావుకొన్న మా ♦ యను నిర్ణయించుచు,వల్కలాంబర మొండు ♦ వాసిఁ బెనఁగ
మేఖలాజినదండము ♦ ఖ్యాఖిలర్షి
లక్షణము లుల్లసిల్ల లీ ♦ లాతపస్వి
మూర్తి వగు నీప్రభావంబు ♦ మొనసి తప మొ
నర్చు మునికన్యఁ గనె నతం ♦ డర్చనీయ. 3౫

క॥ కాంచి తొలికాన్పునని కను, లెంచఁగరాని తమకమున ♦ నిరవుకొని మనం
బంచుఁ దను వంచు మలఁగని, సంచున జాడ్యమునఁ గ్రుంకు ♦ జాడనె యుండెన్.

సీ॥ తన యాననము చిత్త ♦ మును సుప్రసాదమై, కువలయాహ్లాదంబుఁ ♦ గూర్చుచుండ
దన ఘేను నాసిక ♦ యును భవ్యరూపమై, ఘనసదామోదసం ♦ ఘటనఁ గోర
దన కేలు నెమ్మోవి ♦ యును సానురాగమై, సలలితస్నిగ్ధత్వ ♦ సరణి మెఱయ
దన కుచద్వయి కటి ♦ యును యోగరూఢమై, యనిశాతిశయవృత్త ♦ తనువహింప
లీలఁ జంద్ర సువర్ణ ప్ర ♦ వాల చక్ర
కలన లొప్పార సర్వాంగ ♦ విలసనము ల

మూల్యములు గాఁగ రాజిల్లు ♦ మునితనూజ
యాతని స్మరయాబ్ధి ముంచె న ♦ హార్యతనయ. ౩౭

వ॥ అట్టియెడ. ౩౮

ఉ॥ ఉల్లము పక్కునం బగిలె ♦ నొక్కటఁ దాలిమి మొక్కపోయె మై
నుల్లసిలెం ద్రవంబు పుల ♦ కోత్కర మెల్లెడఁ బిక్కటిల్లె సం
ధిల్లె వివర్ణభావగతి ♦ ద్రిక్కనెఁ జేష్ట లెసంగెఁ గంప మా
ఫుల్లనలాక్షి మూర్తిఁ గనఁ ♦ బూర్వసుపర్వన కోలి బాలికా. ౩౯

ఆ॥ తన్నుఁ దాన పెద్ద ♦ తడ వెఱుంగకె యెట్ట
కేల కాత్మ వృత్తిఁ ♦ గేలుకొలిపి
కాంచనాంగి మరలఁ ♦ గాంచి వాఁ డిట్లని
మదిఁ దలంచె విబుధ ♦ మాననీయ. ౪౦

—♦ రావణుండు వేదవతి చక్కఁదనంబు వర్ణించుట ♦—

క॥ ఇది స్వప్నమొ జాగరమో, మది గుదురదు సాగరమున ♦ మగ్నంబైన
ట్లాదవెడు మూఢత దీనికిఁ, దుది మొదలుం గానఁబడదు ♦ తోఁచు న్విధికిన్.

ఆ॥ కాంతిచయము నడుమఁ ♦ గనుపట్టు నొకవ్యక్తి, యాడుదనము దోఁప ♦ నల్లనల్ల
నేమనంగవచ్చు ♦ నిది క్రొత్త యీ లేమ; నేమిటికి సృజించి ♦ యెవ్వ రిడిరొ.

ఉ॥ ఎవ్వతె యొకొ్క యువ్వనిత ♦ యివ్వని నివ్విధి నేకతంబ లే
జవ్వని పువ్వుఁబోని మెయి ♦ క్షామత ప్రామ, దపం బొనర్చి తా
నెవ్వర మర్థిఁ గైకొనుట ♦ కెవ్వరి వేఁడఁ దలంచె నొక్కొ హా
యెవ్వని పాలుసేయు నొకొ ♦ యీ నునుపాయము రూపధేయమున్. ౪౩

తే॥ తేఁటి యొరయని యరవిరి ♦ తేట గాలి, సూటిఁ బాఱని నునుదీవె ♦ గోఁటు దీని
నీటు తలఁపించె నౌర యి♦బ్బోఁటి మదను, మేటిసామ్రాజ్య మేన్నకి♦కీటి కగునొ.

ఆ॥ నలువ గూర్చె నాన ♦ నములు నాకొకపది, యువియు నన్నిలక్ష ♦ లైనఁ జేయఁ
డబల సొబగు వొగడ ♦ నటుగాన నితఁడు ము, త్తాతగాఁడు శమను ♦ దూత గాక.

శా॥ బోనే; చక్కఁదవంబు మేలిమురిపం ♦ బయ్యారె; యొయ్యార మా
నౌ నాహ్లాదన మద్దిరా బిగితనం ♦ బౌ; చాకచక్యంబు తీ
రౌ నిర్మించెనె దీని నిట్లు ముదుకం ♦ డౌ తాతగా రొక్కెడన్
దానే పూని పొనర్చెఁ గాముఁ డిదె పో ♦ తథ్యంబు నాకీమణిన్. ౪౬

ఆ॥ వలపు తపసు మెఱుఁగు♦నిలుకడ వర్ణంబు, పొలుపు దెలివి మ్రదిమ ♦ కళలు నొలయు
చెలువ మేని చేత ♦ దలఁపించె సామగ్రి, వల సమగ్రవృత్తి ♦ వలను విధికి. ౮౭

ఉ॥ చెంపకుఁ జేరె డాకనులు ♦ శ్రీపదముల్ స్తనమండలంబు నై
లింపగజేంద్రకుంభయుగి ♦ లీలకుఁ బైకొను మోము సోము సొ
హంపదలక్ష్మ్యఁ జేయుఁ గన ♦ కాద్రి కదా కటి యిట్లొనర్చి ము
ష్టింపచవృత్తిఁ గొను నలఁ ♦ చె న్విధి మానఁడు పక్షపాతముల్. ౮౮

ఆ॥ జడలసంచునాఁచు ♦ దొడరి యిమ్మొయి మించు, దీని మోముదమ్మి ♦ తెలివి తేట
దానిఁ దొఱఁగి చికుర ♦ తతిపేరి మధుకర, పాలి దొరయు నెంత ♦ ప్రబలు నొక్కొ.

మ॥ ఉరులావణ్యపయఃప్రవాహ కుచచ ♦ క్రోల్లాసభూయిష్ఠ భా
స్వరనేత్రాననపాణిపాదనల ♦ గ్రీవాశంఖ కైశ్యాలిబం
ధుర బాహాబిసలక్ష్య దృగ్ఝష నవ ♦ ద్యోతాఢ్య యై పొల్చు నీ
సరసిన్ స్వచ్ఛత మించు వల్కలజటా ♦ శైవాలముం ద్రోచినన్. ౯౦

సీ॥ కాలుద్రొక్కకపోవఁ♦గడఁగెఁగా చెలి మేని, కాంతి యన్నంతఁ గ్రొ♦క్కారుమెఱుము
లంతకంతకుఁ గార్శ్య ♦ మందెఁగా సఖి మోము, కలన లున్నంత రా ♦ కాశశాంకుఁ
డడవి నుండుటె లెన్న ♦ యనెనుఁగా సతి చూడ్కి, కీర్తి విన్నంత మృ ♦ గీచయంబు
పుట్టఁ జొచ్చుటఁ దల ♦ పెట్టెఁగా కొమ యారు, సారు గన్నంత భుజంగమాలి
మొక్కప్రోద్దాఁగి యుండెఁగా ♦ యువిదచనుల
చక్కఁదన మెన్ను కొన్నంత ♦ జక్కవకవ
యతివ యవయవముల సామ్య ♦ గతికి నోము
కొనము గా యంచు లజ్జ నె ♦ ట్టన మునింగి. ౯౧

ఉ॥ కంటి సుపర్వసుందరులఁ ♦ గంటి భుజంగమదేభయానలన్
గంటి మనుష్యకామినులఁ ♦ గామవధూప్రతిభాసమానలన్
గంటిఁ దదన్యల న్సొగసు ♦ కన్నెల ధన్యలఁ దన్మహోన్నతుల్
గంటినిఁ గాన దీనిమెడఁ ♦ గల్గు నశేషవిశేషసంపదల్. ౯౨

సీ॥ నెలఁత వాతెఱ తేని♦యలు గ్రోల నగు భాగి, సుధఁ గుడ్యములఁ జిల్కఁ♦ జూడకున్నె
యింతి వాల్గనుల ము♦ద్దిడఁ గాంచు ధన్యుండు, కలువపూల వితాన♦గతిఁ బెనుపఁడె
కొమ్మ పెన్దొడ లంటి♦కొనఁగూడు భవ్యుండు, మేటిరంభల నేల♦నాటఁ జొరఁడె
పడఁతి చన్దోయిచే ♦ పట్టఁ గల్గు ఘనుండు, రసకుంభయుగళంబు ♦ రచ్చ నిడఁడె

కలికి ననుపల్కు లూఁకొనఁ ♦ గనెడు సుకృతి
కోటిద్విజరాజివచనము ♦ లొక్కల్లఁగొనఁడె
వనిత పొం దెవ్వఁ డెవని కై ♦ వచ్చు నాతఁ
డఖిలశోభనపదభాగ్య ♦ మపుడె కనఁడె. ౫౩

చ॥ నలువ మొద ల్పురాణకవి ♦ నాథులు సాధులసద్గతి న్మతిన్
జెలువ కలాసమృద్ధి సవి • శేషముగాఁ బొగడం గడంగియు
న్దలఁగెద రోపనేర కన ♦ నాతర మెట్లగుఁ గాలయాపనం
బలవడు దాన నయ్యమృత ♦ మా విష మన్నది సిద్ధ మయ్యెడిన్. ౫౪

సీ॥ ముగుద మహాపద్మ ♦ ముఖి పద్మకర శంఖ, గళలక్ష్య మకరగజం ♦ ఘాప్రశస్త
కచ్ఛపప్రపద కుం ♦ దాచ్ఛరదన నీల, కుంతల యనుచు నా ♦ కోర్కి దీరఁ
బ్రణుతింతు మత్సరి ♦ గ్రహయోగ్య యగు నిది, శ్రీదసోదరతాప్ర ♦ సిద్ధి గాంచు
వాఁడఁ గావున దీన ♦ వఱలు భాగప్రాప్తి, యెచ్చుతగ్గులు గణి ♦ యింతు నేనిఁ
గోమలాంగి యెడ ము ♦ కుందవరారూఢి; పొడము దానఁ గీడు ♦ పుట్టుఁ గాన
నింతవ ట్టెఱింగి ♦ యింతిఁ గైకొను టెల్లఁ, బ్రబలతపము వలని ♦ ఫలము నాకు. ౫౫

వ॥ అట్లగుటం జేసి. ౫౬

తే॥ మునుఁ గుశలవార్త దీనితో ♦ ముచ్చటించి
కలఁకఁ బోకార్చి తనయెడ ♦ వలపుఁ జొనిపి
వనితఁ గైకొని యిచ్చకు ♦ వచ్చినట్లు
పువ్వువిలుకానిసిరిఁజూఱ ♦ పుచ్చువాఁడ. ౫౭

వ॥ ఇందుల కొడంబడక తలంగం గడంగె నేనియు. ౫౮

క॥ ఎలనాగరికత చెలు వి, య్యేలనాగ ధనంబు నాఁగ ♦ నేఁ జెలి మానం
గలనే నిద్దుర మెలఁకువ, గలనేని న్నిగ్రహింతుఁ ♦ గావుత బలిమిన్. ౫౯

ఉ॥ నా కెదురే సురాసురులు ♦ నాకవిభుండు పినాకపాణియు
న్దేఁకువ నెవ్వరే న్మగువ ♦ నేఁగాని పోవఁగ నడ్డగింతు ర
ప్రాకృతశౌర్యసంపదని ♦ వార్యత వారలఁ దోలి దీని న
స్తోకజయప్రభావకల • దోఁప వరించి రమించి మించెదన్. ౬౦

తే॥ అని మనోరాజ్యమునఁ గూరి ♦ యమరవైరి
చపలగతిమీఱి యలఁతిన ♦ చ్చటికిఁ దారి

మిడుతవోయెడుదారిన ♦ మ్మొలఁత పేరి
దహనశిఖఁజేరినిలిచెన ♦ త్తజెనిగారి. ౬౧

క॥ వచ్చిన విరించిపౌత్రజు, నచ్చపలాక్షియు ననర్ఘఁ ♦ డన కర్ణాలక్
జెచ్చెర నెరపెనుఁ బూర్వుల, సచ్చరితము లరసి ముఖ్య ♦ సరణిం దరుణీ. ౬౨

— రావణుండు వేదవతిచేయు సత్కారంబంది యాయనుతో ముచ్చటించుట —

తే॥ ఆయమ పౌనర్చ్య నాతిథ్య ♦ మంది యసుర
పాయనేరని తమకంబు ♦ పట్టువిడక
దాయతనమునఁ దను వేఁపఁ ♦ దరుణిఁ గాంచి
కాయజుని దూరి యిట్లనెఁ గాముకలిక. ౬౩

ఉ॥ ఎవ్వతె వీవు భావినిరొ ; ♦ యెద్ది కొలంబు తలంబు నామ మో
జవ్వని ; పువ్వుఁబోని మెయి ♦ శ్యామత గ్రామఁ దపం బటంచు ని
ట్లెవ్వని నర్థి వేఁడ మతి ♦ నెంచితివే వితగాఁ దనంతఁ దా
నివ్వఁడె కోరి కోరికల • నీశ్వరుఁ డో భువనైకమోహినీ. ౬౪

తే॥ కన్నెరో ; నీదు చందంబు ♦ గన్న వింత, విన్నఁదనము గలంచెడు ♦ నన్నుఁ గూడ
నున్న కథ లింక నున్నట్టు ♦ లెన్నకున్న, మిన్నక తపింప వలపె నా ♦ కున్నతాంగి.

క॥ తలిదండ్రులు పెద్దలు విం, దులు చెలులు నెడసిన తెఱఁగుఁ ♦ దోఁచెడు వారల్
గలిగిన నీ యిప్పనుబా, ముల నోర్చెదరే యసహ్య ♦ ముల హరిణాక్షీ. ౬౬

సీ॥ పువుబోని యిమ్మేను ♦ పోలునే తీండ్రించు, నాల్గువహ్నుల నట్ట ♦ నడుమ నిలువఁ
గళలొల్లు నిమ్మోము ♦ వలయునే మధ్యంది, నాతపోష్ణాహతి ♦ నగడుపడఁగఁ
బొలివోని యిక్కాంతి ♦ మొనయునే బహుగుల్మ, పాదపవనపఙ్క్తి ♦ పాలుగాఁగ
రసమూర్తి యీజిహ్వ ♦ పొసఁగునే కటుపర్ణ, కందమూలప్రాప్తిఁ ♦ గసటుగాంచఁ
గోదమజక్కవ లీచను ♦ ల్గూడునే ని, కామవల్కలజాలాప్తి ♦ గాసినొంద
జేలతనమున జప మని ♦ పేరుపెట్టి, యేల రిత్తగ్రుశించెద ♦ వే లతాంగి. ౬౭

చ॥ తెలి బసుమంబు మైఁ నలఁది ♦ తిన్నని వేణి జటాలి గట్టి యా
కులు ఫలమూలము ల్మెసవి ♦ క్రొత్తజలంబుల మున్గి క్రోలి తి
ప్పల శయనించి యిట్లు నును ♦ బ్రాయము మూర్ఖత మానివర్తనం
బులఁ గ్రమియింప నావలని ♦ భోగదశ న్వివరింపు భామినీ. ౬౮

తే॥ కన్నెవు పరాత్తవృత్తివా ♦ కావు లక్ష్మి
వన్నె గన్నావు సౌందర్య ♦ వతుల పేర

సున్న లిడినావు శరమైతి ♦ సూనశరున
కిన్నిగల నీకుఁదప మింక ♦ నేల చెప్పుము. ౧౯

క॥ పొసఁగిన వరు నెమ్మది నా, రసి యొకఁడునుఁ బోలకునికి ♦ రహిసెడ నెంతో
విసివి మునివృత్తి దొరసిన, మసలిక గనవచ్చె సొకు ♦ మార్ద్యైకనిధీ. ౨౦

ఆ॥ కచ్చుజా ల్బిగించి ♦ చిచ్చు చెంగట నిడి
పొచ్చె మెడలె నిచ్చ ♦ లిచ్చ ననెడి
మ్రుచ్చుమునులు నిన్ను ♦ మచ్చికంటిరో ? కన్న
గ్రుచ్చి కౌఁగిలించి ♦ మెచ్చి కొనరె. ౨౧

వ॥ కావున భవదీయవృత్తాంతంబు సవిస్తరంబుగా వినవలతుం జెప్పుమనినఁ దప్పు కొనంబోలక కప్పుకొనిన ముప్పున నప్పల్లవాధరి యుల్లంబుఝల్లన నొల్లంబోయి చేయునదినేరక యూరక తెచ్చుకొంటింగదాయని పాయని చింతం గొంతతడవు వితర్కించి ధైర్యం బవలంబించి మంచితనంబు వెలయ నారాత్రించరవరున కిట్లనియె. ౨౨

—* వేదవతి తన వృత్తాంతంబు రావణున కెఱింగించుట. *—

చ॥ అనఘ కుశధ్వజాఖ్యముని ♦ కైతి సుత న్నియమప్రసక్తి నా
ఘనుఁడు శ్రుతు ల్పఠించుతఱిఁ ♦ గంటి భవం బటుఁగాన నించు వే
డ్కను ననుఁగాంచి వేదవతి ♦ గా యిది యంచు వచించె నాఁటఁగో
లె నటులె పిల్చి రెల్ల రట ♦ లీలఁ జెలంగితిఁ దద్గృహంబునన్. ౨౩

తే॥ తల్లిదండ్రులు తనమొడఁ ♦ దద్ద గూర్మి
మిగులఁ గనుదోయి ఱెప్పల ♦ పగిది దోఁప
నొక్కక్షణమేని నెడఁబాయ ♦ నోప రట్లు
పూపలతఁ బోలెఁ బెనిచి రో ♦ పుణ్యచరిత. ౨౪

క॥ తనభాగ్య మెట్టిదో కా, ననుఁ బ్రాయము దొరయువేళ ♦ ననుఁగని హరికి
త్తును లాఁతివారి కే దీ, ని నొసఁగనని గురుఁడు ప్రతిన ♦ నెరపె మహాత్మా. ౨౫

ఉ॥ ఎల్లరు దీని నిమ్మని ము ♦ నీంద్రుని వేఁడి యతం డదల్పఁ దా
రల్లన నేగ దంభపదుఁ ♦ డాశరుఁ డొక్కఁడు తన్నిషిద్ధుఁడై
చెల్ల మొఱంగి వేచి నిశిఁ ♦ జేరి యతాత్ము శిరంబు మూర్ఖతన్
భల్లము పాలొనర్చి యటు ♦ పల్వడె వాఁడును బ్రహ్మహత్యకున్. ౨౬

పృథ్వి॥ తపస్వి జపశక్తి స ♦ ద్గతికిఁ జేరెఁ దత్పత్ని న
న్విపన్నఁ గని సూక్తుల ♦ న్విమలఁ జేసి యున్న న్నగ
త్యపాయమని భర్తృదే ♦ హము స్వమూర్తియు న్వహ్నిలోఁ
బ్రపత్తిఁ గదియించి త ♦ త్పదముఁ గాంచె వైశ్యేశ్వరా. ౨౨

తోటకము॥ తలిదండ్రుల కీదశ ♦ తారసిలం
బలవించియు ధైర్యము ♦ ప్రాపున నేఁ
బొలివోక యెద న్హరి ♦ పూజల ని
చ్చ లొనర్చుచు నిల్చితి ♦ సారమతీ. ౨౩

వ॥ అపారకృపాసాగరుం డయ్యంబుజోదరుండు దన్నాదరంబునం గటాక్షించెనేనియు.

ఆ॥ తండ్రి ప్రతిన దీర్చ ♦ చాన లేకున్నఁ ద, ద్గతికిఁ గూర్చుదానఁ ♦ దనకు నియమ
మింతవట్టు దడసి ♦ తిచ్చవచ్చిన యెడ, కేగుమయ్య రాక్ష ♦ సేంద్ర యనిన. ౨౪

—♦ రావణుఁడు వేదవతికిఁ దనకోరిక నెఱింగించుట ♦—

దోధక॥ దక్కఁ గదా యిది ♦ దైవవిలాసం, బక్కజ మౌనని ♦ యాతఁడు ప్రీతిం
జొక్కుచు డగ్గఱు ♦ చో మదనుం డా, రక్కసు నక్షు శ ♦ రమ్ములఁ గ్రుమ్మెన్.

ఆ॥ మున్నె తాల్మి సున్న ♦ మొదలాడెఁ బిదప న, త్యంతచలతఁ గదిసి ♦ యసుర వలికె
నేమి యింత వెట్టి ♦ యెలప్రాయ మతినిష్ఠ, విష్ణుఁడని గ్రసింతు ♦ వృద్ధ వగుచు.

వనమయూరము॥ తాఁ జెలివిమాలి తన ♦ తండ్రి యిటులే దా
మోదరున కిత్తునని ♦ యారక నశింపన్
కాదనక లేఁదనము ♦ కారడవి పాలై
పోఁ దలిరుబోఁడి యిటు ♦ పోలునె కృశింపన్. ౨౫

పంచచామరము॥ పరాకు శౌరియే బలప్ర ♦ భావశాలియేని ము
న్విరోధి యొక్కరుండు డాసి ♦ నీగురు న్నితాసిచే
శిరంబు ద్రెళ్ల నేయుచోఁ బ్ర ♦ సిద్ధి దోఁపఁ దోఁచి యా
శరు న్వధించి మానిఁగావఁ ♦ జాలెనే తలోదరీ. ౨౬

క॥ హరిపదవాచ్యము హయకే, సరికపిభేకాదికంబు ♦ శత మగు నీవా
హరి యని పొరలిన నేమగు, హరి విక్రమము నన్నుఁగవియు ♦ మా; హరిమధ్యా.

ఆ॥ బ్రహ్మపౌత్రజుఁడ న ♦ పారశౌర్యవిధేయ, నిఖిలభూతచయుఁడ ♦ నిష్ఠ బలిమి
బహువరంబు లొకటఁ ♦ బరమేష్ఠి మెప్పించి, కొన్నవాఁడ మహిమ♦గన్నవాఁడ.

క॥ పురుషుఁడొడుకు విధి నా కె, న్నఁడు లే దలజడి మదీయ ♦ నామశ్రుతికిఁ
వడవడ వడఁకుదు రమరులు, గడు శల్లసిరులకు లంక ♦ గోపుర మబలా. ౮౭

మ॥ రజతాద్రిం బెకలించి రుద్రున కని ♦ ద్రప్రీతి వాటిల్లఁ జే
సి జరామృత్యువిదూరత న్సుమహితా ♦ సిం గొంటిఁ ద్రైలోక్యపుం
బ్రజలు న్న న్భజియించి తోడనె భవ ♦ త్పాదాబ్జపీఠి న్విర
స్సృజము లోనఁగఁగ మ్రొక్కఁ గాంచు కలిమిం ♦ జంద్రాస్య నిన్వేఁడెదన్. ౮౮

క॥ మగువా; నినుఁ గనినది మొద, లుగ మరుఁ డిగురాకు బాఁకు ♦ లోఁగాడి కుదిం
పఁగ ధైర్య మగలె నిఁకఁ దా, ళఁగ జాల నెద న్గదించి ♦ లాలింపఁగదే. ౮౯

తే॥ చాలుదునుఁ జాల మానఁగాఁ ♦ జాల నేల
చాల దాయువు చాల డిం ♦ కేల జాగు
చాలు నను నిట్టిశంకల ♦ పాలఁబడితిఁ
జాల నీలీల వర్ణించు ♦ వేల బాల. ౯౦

సీ॥ తవిలి యాఁకలి డప్పిఁ దరలింప నోపునీ, దంతచ్ఛదం బమృ ♦ తంపుబరణి
చేరి మేలిపసిండి ♦ సిరి నొప్ప కొసఁగు మై, వన్నె నిద్దంపుసా ♦ వర్ణకరణి
తాఁకి హృత్కీలితా ♦ తను శరావళు లూడ్చు, శయకుశేయము వి ♦ శల్యకరణి
సోఁకి యంతఁపుదెసఁ ♦ జొరనీయ నేనను, శ్రీదయాదృష్టి సం ♦ జీవకరణి
మేను లెద లెడవెట్టక ♦ మేళగించు, తలఁ బోకఁడుసేయ నగును సం ♦ధానకరణి
యిన్ని గలిగి స్మరవ్యాధి ♦ నేఁ గృశింప, నేమిఫల మందఁ జూచెద ♦ వే లతాంగి.

ఆ॥ ఇంక నేల జాల ♦ మింద్రియంబులు మేను, ప్రాణబుద్ధు లాత్మ ♦ ప్రాభవంబు
నీకు ధారవోసి ♦ నిలిచితి నొండెద్ది, దలఁప వలదు సుమ్ము ♦ తరలనయన. ౯౧

చ॥ అన విని భీతబాలహారి ♦ ణాక్షి కలంక దొలంకఁ గర్ణము
ల్మునుజిగురాకుగేల్గవ ద ♦ ళుక్కున మూసి యిసీ యటంచు నా
తనిఁ దృణదృష్టిఁ జూచి హరి ♦ తత్పరత న్మదిఁ గీలుకొల్పి తో
ననె నవతాథ్యనిర్భరఘ ♦ నార్భటి మీఱ మనోరమాకృతీ. ౯౨

ఆ॥ పుట్టి తీవు విధికి ♦ మూడవతరమునఁ, జదివినాడ వెల్ల ♦ శాస్త్రములును
బెద్దతనముఁ దపము ♦ పేర్మిఁ గన్నాడ వి, ట్లాడఁదగునె యాసు ♦ రాధినాథ. ౯౩

సీ॥ నిఖిలసర్జనకేళి ♦ నెగడొంద జనియించె, నెవ్వాని నాభిఁ బ్ర ♦ జేశ్వరుండు
జన్మబంధస్థితి ♦ నడలింప యోగీంద్రు, లెవ్వాని పదభక్తి ♦ నేర్పరింతు

రాగమవిద్యార ♦ హాస్యస్వరూపమై, యెవ్వాని సత్త్వంబు ♦ నివ్వటిల్లుఁ
దగ సత్క్రియాఫల ♦ దాననిరూపణం, బెవ్వాని కృత్యమై ♦ యెసక మెసఁగుఁ

దవిలి మనలోన నెల్లెడఁ ♦ దత్త్వమయత
సకలసాక్షిత వెలుఁగొందు ♦ జాణ యెవ్వఁ
డట్టి పరమేశు హరి వితా ♦ యభిభవించి
గారవము గొంతుపోటు రా ♦ క్షసకులేంద్రి. ౯౫

ఉ॥ లో ఖలి నుండి యేకగతి ♦ లోకము లెల్ల వెలుంగఁజేయుచున్
దా వెలుఁగొందు పూర్ణుఁ బర ♦ తత్త్వమయాత్ము స్వయంప్రకాశు ల
క్ష్మీశవిభు నల్పబుద్ధి నిర ♦ సించె దిమీకమునట్టు లాత్మవి
ద్యావిభవంబు హృద్యతప ♦ మాద్యనవద్యత తీరు నిరుగాక. ౯౬

ఆ॥ మును హిరణ్యకశిపు ♦ ముఖ్యులు మీవారు, హరిఁ దిరస్కరించి ♦ యంత లెంత
లైరొ; చనదె తెలియ ♦ నక్కటా; బాల్యంబు, ద్రోయ వెట్లు పెద్ద ♦ చాయ మనియు.

క॥ తా మునుఁ జేసినకర్మము, నేమనుచుఁ గలంచు నెట్టి ♦ నిపుణుని నైనం
బ్రామికొనెనొ దంభుఁడు చనఁ, డో; ముని సద్గతికిఁ దగదొ ♦ యోరిమి హరికిన్.

ఆ॥ ఇన్ని యేల యొంటి ♦ కిష్టంబు పులుపండుఁ, దీపి కొంకు నాల్క ♦ దీటుచుండుఁ
దనకు శౌరి దెస ము ♦ దంబు సూపె మనంబు, దైవగతికిఁ దప్ప ♦ దారి గలదె.

క॥ చలమునఁ బెద్దల దూలెడు, తులువ దొకఁడు గాదు తప్పు ♦ త్రో నద్దెస వీ
నుల నిడ నూల్కొను చెనటిది, బలుతప్పని చక్కఁ దెలియఁ ♦ బలుకుదు రార్యుల్.

ఆ॥ కానఁ బెక్కులాడఁ ♦ గా నోప నామేను, మానసము మురారి ♦ కాన యిడితి
కానిపోని యాస ♦ లూనక హరిపద, ధ్యానరతి సుఖాబ్ధి ♦ మాని వగుము. ౧౦౧

క॥ కలికి యిటుపలికి యమృతం, బొలికిన గతి దొలఁకఁబిల్లి ♦ కులికి కలఁక న
వ్వలికిఁ జను రాచిలుకకో, మలికి సరిగ నెట్టనం దె ♦ మల్చుకొనంగన్. ౧౦౨

తే॥ మదనుఁ డద నిదె కద యని ♦ యదరి పదరి
పొదలి త్రిదశారి యెద గుదు ♦ రొదవఁ బదను
ప్రదరములు పదిపదు లూఁది ♦ యదిమి గదుమ
మది సెదరి తాళ కాతఁ డ ♦ మ్మదితఁ గదిసి. ౧౦౩

మ॥ అలినీలాలక ? యింత మోడి తగునా ♦ హా యెంత ప్రార్థించినన్
జెలి కాని న్వితకాఖులం గలఁచి పైఁ ♦ జింతింపకే లిందుఁబోఁ

దలఁ ఫుల్లంబునఁ జొన్పి తేను హాతకం ♦ దర్వారి బారిం బడన్
జెలువం బొప్ప సుఖింతువోటు చెదుఁ గీ ♦ శీలంబు మూలంబుగాన్. ౧౦౪

ఆ॥ మోము మోము సేర్చి ♦ మోవి పానక మిచ్చి
కళలఁదేల్చి యెడఁద ♦ కలఁక లూడ్చి
మైఁగడించి పేరు ♦ మాలిన యీఁగోర
మెడలఁజేయ కెచటి ♦ కేగె దబల. ౧౦౫

క॥ అని వదరుచుఁ దెంపున న, వ్వనితామణి వేణి నొడిసి ♦ వాఁడు తిగిచె గ్ర
క్కునఁ బ్రాణానిలములపై, నెనరేది మహాహినాధు ♦ నిం బోలెఁ జెలీ. ౧౦౬

ఆ॥ కలఁక దలఁగి వేగఁ ♦ గలికి కత్తిలి వ్రేయఁ
దునిగె వేణి సగము ♦ తునుక చిక్క
వాఁడు దూలి దీని ♦ వరతపశ్శక్తి యం
చాత్మఁదలఁచుచుండ ♦ నామె కినిసి. ౧౦౭

వ॥ అవ్వాలికిం జని సంవర్తసమయజాజ్వల్యమానపవమానసఖమహాజ్వాలిక పోలిక భూనభోంతరాళంబు లొక్కపెట్టున నెట్టన వెలుంగులం గప్ప నమ్మొప్పునం గొప్పనిప్పుకణంబులు విప్పుకనుంగవ నుప్పతిలి చొప్పువీడి యెదిరిపై కుఱుకం గఱకుతనంబు నెఱయం బఱచు చుఱుకుచుఱుకు చూపుల వఱ్ఱుకున నమ్మొఱకు రక్కసితేని నిక్కపెడ నుక్కడంగించు తెఱం గెఱింగించి సరకుసేయ కాతనిం జఱచుఱచూచుచు బిరుసుపిడుగు లురలునెడ నఱుము నుఱుమున నురవడిం దఱుముచు బిరబిర నయ్యసుర నుద్దేశించి వెఱంగుపడం గసరుచు నిట్లనియె. ౧౦౮

మ॥ అపురా; యింతటి కగ్గమైతివె దురా ♦ త్మా; దుష్టుఁ డీతండు దా
నవుఁడంచుం దొలుదొల్త నిన్నని యుప ♦ న్యాస్యం దపోమూర్తి వి
శ్రవసుం డెందమునం దలంచి యుపచ ♦ ర్య ల్పన్ని మన్నించి ప
ల్క విరోధించె జగమ్ము లేర్చు నిను నిం ♦ క న్వీడఁగాఁ గూడునే. ౧౦౯

ఆ॥ చిచ్చుఁబోనియలుకఁ ♦ బిచ్చలించెమచూడ్కి; పెచ్చుమంటనిన్ను ♦ గ్రచ్చుమడఁప
నచ్చమగు జపాంశ ♦ ముచ్చిపోవుట కిచ్చ, మెచ్చ దాత్మ పో; వి ♦ యచ్చరారి.

తో॥ అది యట్లెడుమీ వొఱ ♦ టంటిన మై, సొదఁబెట్టక యెట్టులు ♦ శుద్ధ మగున్
దుదిఁగాంచియుఁ దోడనె ♦ తోఁచెద నీ, యుదుటార్పెడి పూనిక ♦ నోరి భువిన్.

—♦ వేదవతి రావణునకు శాపంబొసంగి యగ్నిలోనుఱుకుట ♦—

మాలిని॥ అని నొడివి నిజక్రో • ధాగ్ని యట్లుండ ము న్నే
నని తపరు మహోగ్రో ♦ గాగ్ని మిన్నాని క్రాలన్
సునియతి సతి దానిం ♦ జుట్టి శ్రీజాని స్వాత్మం
జొనిపి దనుజు వీను ♦ ల్వాడ నీజాడఁ బల్కెన్. ౧౧౨

మ॥ హరికిం బ్రాణము లర్థ మర్పణముసే ♦ యం జూచు ఛానేని నా
హరి దన్నాదృతిఁ బత్నిఁగాఁగొనుట త ♦ థ్యంబేని నిమ్మేదినిన్
హరి మెచ్చంగ నయోనిజత్వరమ ను ♦ ద్యల్లీల జన్మించి యీ
హరివైరి న్ససుతానుజాప్తు హతుఁ జే ♦ య న్మాల మే నయ్యెదన్. ౧౧౩

క॥ అని తెగువ నాడి యమ్మా, నిని తో నయ్యగ్నిఁజొచ్చి ♦ నీరై చనె మి
న్నున నీయమ నుడి తథ్యం, బని యశరీరమగు భూత ♦ మప్పుడె పలికెన్. ౧౧౪

ఆ॥ విరులు గురిసి రంత ♦ వేల్పులు దుందుభు, ల్మ్రోసె దివిని గాడ్పు ♦ మొలక లొప్పె
నాడి రమరసతులు ♦ పాడిరి గంధర్వు, లీసులేని యరుస ♦ మెనసె జగము. ౧౧౫

తే॥ కన్నులారంగ నింతయుఁ ♦ గని సురారి
యేపుసెడి యొండుదారి లే ♦ కెంత పుట్టె
నకట; యని తన్నుఁ దా దూఱి ♦ యవల నిచ్చ
వచ్చునెడ కేగె నున్నిద్ర ♦ వారిజాక్షి. ౧౧౬

—♦ వేదవతి లంకలోని కొలనున గమలంబునం జూపట్టుట ♦—

ఉ॥ అమ్మని పుత్రి నెమ్మొయి ర ♦ యమ్మున నమ్మహనీయవహ్ని మ
ధ్యమ్మున వేల్చి క్రిమ్మఱి య ♦ హ మ్మని యిమ్మగఁ గ్రిమ్మ దైవయో
గమ్మున ముజ్జగమ్ములు సు ♦ ఖ మ్మన నమ్మనుజాశి నేర్చు య
త్నమ్ము మనమ్మునం దవిత ♦ థమ్ముగ నమ్మొయి ముమ్మరింపఁగన్. ౧౧౭

సీ॥ ఒడలి పైఁడిమెఱుంగు ♦ యోగవహ్నిఁగరంగు, తఱిమ హేమోన్నతిగన్న ♦ సరణి నెఱపఁ
గనుల మార్గచ్ఛాయ ♦ దనుజభీతినిఁ బాయఁ, జూచునప్పటి బెళ్కు ♦ జూడ్కి పొసఁగ
మోవి కెంపుబెడంగు ♦ మొనకొన్న కసిరంగు, మోముఁ బ్రాఁకినరీతి ♦ మునుమడింపఁ
గురుల చీఁకటిడాలు ♦ కుటిల దైత్యునిఁబాలు, గొనఁగోరు పెనుమిత్తి ♦ గుఱుతు దెలుప
లంక నొక్కొండు మడువున ♦ లలితకమల, కర్ణికాంతరమునఁ జిన్ని ♦ కన్నె యగుచుఁ
దనదు పద్మనివాసినీ ♦ త్వంబు మెఱయఁ, దోఁచె నద్దేవి తొలుదొల్తఁ ♦ దోయజాక్షి.

వ॥ అంత నొక్కనాఁడు. ౧౧౯

తే॥ నియతి మామకపూజనో ♦ న్నిద్రితాత్మ, మానసాబ్జుండు రక్కసి ♦ మన్ను ఁజేఁడు
వేడ్క నల్లకొలని తమ్మి ♦ విరుల నెల్లఁ, జిదిమి మునుమిడి తగ విమ ♦ ర్శింపుచుండ.

శా॥ విద్యుల్లక్షవిభావనాచణతనూ ♦ ద్వేల్లత్ప్రభావల్లికా
సద్యశ్ఛన్నదిగంతరాల యగుచు ♦ న్సర్వాంగ, సౌస్నిగ్ధ్య, సం
పద్యోగంబు కరంబుఁ బెంపెసఁగ న ♦ ప్పౌలస్త్యు మై ఝల్లన
బ్రోద్యల్లీలఁ దొలంకె నామె యొకచో ♦ ఫుల్లాబ్జపత్రేక్షణా. ౧౨౦

ఆ॥ వేయురేకు లెసఁగు ♦ విరిదమ్మి నడిచక్కిఁ, దళుకులీను మేని ♦ దాని మొదలి
వ్రేలి పొడవు దాని ♦ వెలుఁగు సూపెడుదానిఁ, గాంచి రక్కసుండు ♦ గనులు మొగిచి.

క॥ తెప్పిఱిలి కొంతసేపటి, కప్పాలఁతుక యింతలంత ♦ లగు టరసి మదిం
దెప్పర మిది యని నిజగురు, నప్పుడ రావించి తెలుప ♦ నతఁ డిట్లనియెన్.

తే॥ తామసించెదవేల న♦ క్తంచరేంద్ర, గరిత యిద్యోడ నిల మేలు ♦ గాదు నీకుఁ
బనుపు మెచ్చోటికైన ను ♦ త్పాతమనఁగఁ, జెల్లు దీనికిఁ దగు శాంతిఁ♦ జేయుమనిన.

ఆ॥ ఒక్క మందసమున ♦ నుత్పలేక్షణ నట్టి, యునిచి కడలి నడుమ ♦ నురక విడచి
శాంతివిధులు గొన్ని ♦ జరిపి యాదట స్వస్థుఁ, డై మెలంగెనతఁడ ♦ హార్యతనయ.

ఉ॥ అన్నులమిన్న పెట్టె యిటు ♦ లంబుధిలోఁ బడ నూర్మిహస్తముల్
గ్రన్నన చాఁచి యాతఁ డెద ♦ గారవ మూరఁగ లేవనెత్తి మై
మిన్నొరయం బ్రహర్షగతి ♦ మేకొన బిట్టుగ మ్రోసె నీమె నా
కన్నియ యంచుఁ దెల్పువహి ♦ గ్రచ్ఛఱ నచ్చుపడం దలోదరీ. ౧౨౫

ఆ॥ అబ్ధి పుత్రియనుచు ♦ నటుచాటి మిన్నేటి, తరఁగ లోలసి పేటి ♦ దరికిఁ గూర్ప
దాన జనకరాజ ♦ ధాని చెంగటి రత్న, గర్భ గర్భరత్న ♦ కలనఁ గదిసె.

—♦ వేదవతి జనకుని యజ్ఞభూమిగర్భంబున నుద్భవించుట ♦—

క॥ అంతం గతిపయదినము ల, నంతాగర్భమున నుండి ♦ యవతారశ్రీ
మంతనమునఁ దలపోయుచు, నెంతయుఁ బ్రీతిమెయి ధాత్రి ♦ నెలయించు నెడన్.

సీ॥ పుట్టువిరాగి యై ♦ పొలుపొందు శుకయోగి, యెవనిఁ బ్రబోధామృ ♦ తేచ్ఛఁ జేరె
వెన్నతోఁ బరవిద్య ♦ గొన్న యాసులభాఖ్య, యెవని నిస్సంగత ♦ కెడఁద మెచ్చె
నొండొండు గవగూడ ♦ నొల్లని శ్రీముక్తు, లెవని దక్షిణత జో ♦ డెనసి మెఱసె
నొరుల నంపద్యోగ ♦ మోర్వని పెరసాము, లెవని శ్రేయమున క ♦ నీర్ష్యతఁ గని

రట్టి భవ్యయశుఁ డ ♦ హంకారదూరుండు
చారుమూర్తి జనక ♦ చక్రవర్తి
జగము మేల్మి కొక్క ♦ సవము వేల్పుల పాలి
కలిమి వెలయఁ జేయఁ ♦ గాఁ దలంచి. ౧౨౯

తే॥ మించువేడుక శాలని ♦ ర్మింపఁ దీర్థ
మనుచుఁ దోతెంచి స్థలశోధ ♦ నార్థ మచటి
నేల దున్నింప నాఁగేటి ♦ చాలున నెదు
రై ఘణిల్లనె మందసం ♦ బంబుజాక్షి. ౧౩౦

క॥ ఇది యేమని యబ్బుర మెదఁ, బదరఁగ నమ్మేటి పేటి ♦ బలుబీగములన్
వదలింప మొదలి నోముల, కదనము ఫల మదియ కాఁ ♦ దదంతరసీమన్. ౧౩౧

సీ॥ తన పేటికావృత్తి ♦ ఘనగుహాభ్యంతర, పరవస్తుభావోప ♦ పత్తి నెరపఁ
దన దివ్యతేజంబు ♦ జననస్థితివినాశ, ములు ముజ్జగమ్ములు ♦ మొనయఁ జూడఁ
దన మంగళాకృతి ♦ దనుజభీతినిమగ్న, దైవతావలి దేల్చు ♦ దారి గాంచఁ
దన మందహాసంబు ♦ తాపసోత్తమమహా, వరణతమఃపాలి ♦ వ్రయ్యఁ జేయ

దన యపాంగతరంగితో ♦ దారదృష్టు
లమితసామ్రాజ్య మాత్మీయు ♦ లందఁ గోరఁ
దన యజాండప్రసూత్వంబు ♦ దాఁచి కన్నె
మిన్నయై తోఁచె నాప్రోడ ♦ కన్నె గిరిజ. ౧౩౨

క॥ పసికూనతనము దెసలం, బ్రసరించెడు మిసిమి పస ప్ర ♦ పంచము దానై
ముసరు మహిమయుం గని ఘనుఁ, డసదృశభయవిస్మయప్ర ♦ హర్షాంచితుఁడై.

క॥ తన పాలి భాగ్యదేవత, కన వచ్చె నోహో; యటంచుఁ ♦ గనుఁగొలుకుల నె
ట్టన మోదము జాల్కొన నిం, తనరాని కుతూహలమున ♦ నానృపుఁ డంతన్.

తే॥ అమ్మ; రమ్మని యెత్తి ము ♦ ద్దాడి నన్నుఁ
గన్నతల్లివి పుత్రివై ♦ కానవచ్చి
తమ్మ నీవని కొని చని ♦ యాత్మపత్ని
కన్నెలఁత మిన్న నొసఁగెఁ బ్రే ♦ మ న్నతాంగి. ౧౩౫

క॥ ఇచ్చిన నామెయు గారవ, మెచ్చఁగఁ దమకమున మనిచె ♦ నిట్టట్టన నా
కచ్చపడ దీవు శరజని, నచ్చఁపురుచిఁ బెనిచి తెలుఁగు ♦ మావివరంబున్. ౧౩౬

ఉ॥ తోఁచునె కర్జము న్దెలుపఁ ♦ దోఁచునె మజ్జనభోజనాదికృ
త్యాచరణంబు బ్రాహ్మణస ♦ మర్హణ భృత్య జనాదరంబు బం
ధూచితసత్క్రియాకలన ♦ లూనఁగ నయ్యెడ నామె కమ్మృగీ
లోచనఁ జూచువేడ్క మది ♦ లో నెడవెట్టక నిల్పఁ జెల్వరో. ౧౩౮

క॥ తా నౌరససంతానము, పై నింతటి పెరిమఁ గానదు ♦ భావము తాద్రూ
ప్యానుగతిఁ బెనఁగఁ జిత్తరు, వో; నా, నిలఁబడుఁ దలంపఁ ♦ దొక్కఁడు నెడఁదన్.

వ॥ మఱియు నద్దేవి యమ్మహాదేవివలని ప్రేమాతిరేకంబునం బొదలుచు నొక్కక్షణం
బేనియుం బాయనోపక యేతదీయంబులగు మృదుమధురచేష్టావిశేషంబులకుం
జొక్కుచుం బ్రొద్దుగడపుచుండె నమ్మిథిలేశ్వరుండునుఁ బరమానందనిష్యంద పరీ
వాహబృందసుందరహృదయారవిందుండై యమందప్రేమకందలంబు పెంపొంద
శతానందుండు మున్నుగాఁగల తపసిచందురుల తోడం దనవిందులనుఁ గూడ
రావించి పురస్కరించి పూజించి యభినందించి వారల యభిమతంబెంచి సన్మా
నించి యబ్బాలికాతిలకంబునకు నామకరణమహోత్సవంబొనరింపం దలంచి.

—♦ జనకుండు భూపుత్రికి నామకరణం బొనర్చుట ♦—

శా॥ సీతం దోఁచి ప్రసోచిఁ బెంచుటఁ దగున్ ♦ సీతాభిధానంబె యీ
శీతాంశుప్రతిమాస్య కంచు సుకృత ♦ శ్రీమించి తా నుంచెఁ బ్ర
ఖ్యాతుం డా నృపచంద్రుఁ డాఖ్య సుతకుం ♦ గల్యాత్మతోపేతకున్
జ్ఞాతృప్రీతకు లోకమాతకు సమ ♦ జ్ఞానస్ఫూర్తికై గోత్రిజా. ౧౪౦

ఆ॥ పుడమిఁ బొడమి యుంట ♦ భూపుత్రి మున్నుగ, వెలసెఁ బేళ్లు జనకుఁ ♦ డెలమిఁ బెద్ద
బిడ్డ యనుచుఁ బ్రీతిఁ ♦ బెనుచుటఁ దద్ధిత, కలన నలరెఁ గొన్ని ♦ సులలితాంగి.

క॥ వేయేల తలఁప నిలపయి, నే యే పద మొదవ్రఁదత్త్వ ♦ మెఱిఁగిన జంటం
బాయవు గదె యాయమ నెపు, డా యా నామంబు లజము ♦ ఖాదిత్యనుతా.

తే॥ సుదతి; జనకుని నగర నా ♦ సుప్రకాశ
కనియెఁ బెంపు తదీయదృ ♦ క్పర్వ మగుచు
నహరహం బొందు కళ యెక్కు ♦ డై సదార్తిఁ
బ్రీతి నెలకొల్పెడు ప్రబోధ ♦ రేఖ వోలె. ౧౪౩

క॥ ఆ నాకీతిలకం బటు నానాఁటం బెరుఁగ జనకు ♦ నకుఁ దత్సుతికిన్
జానగు వేడుక లమ్మెయిఁ, బూని ప్రబలె నామె యెడఁ బ్ర ♦ ఫుల్లాబ్జాక్షీ. ౧౪౪

తే॥ ముద్దుకుడుములు పిసికెని ♦ మ్రుగుద యంచుఁ
బంచి గూరెల్ల నిండంగఁ ♦ బంచదార
ముద్ద లమ్మేడఁ దద్దురు ♦ ల్మానసి పసిఁడి
ముద్దలునుఁ దోడుగా మేలి ♦ మురిపె మూర. ౧౪౫

తే॥ దేవతాన్నంబు శోఁ బుట్టు ♦ తెలివ కప్పు
డాఱవు నెలపె నన్నప్రాశ ♦ నోత్సవాప్తి
జన్మతిథివాసరర్ద్రాది ♦ సన్మహంబు
లమరె ద్యోభూమిదేవప్ర ♦ హర్ష మెసఁగ. ౧౪౬

క॥ రాకడ పోకడ ప్రబలె ధ, రాకాంతున కప్పుడింది ♦ రాదేవీస
త్ప్రాకటకరుణాపాంగ, శ్రీకలితైశ్వర్య మట్లు ♦ సేయదె సుదతీ. ౧౪౭

వ॥ ఆసమయంబున. ౧౪౮

తే॥ కురిసె నెలమూడు వానలు ♦ గోచయంబు
పిదికె నెవ్వేళ క్షీరము ♦ ల్పృథివి నిండ
దొరసె నిత్యోత్సవము పచ్చ ♦ తోరణంబు
నృపుని క్షితి శుభగుణరత్న ♦ నిధియ కాఁగ. ౧౪౯

క॥ అమ్మల కయ్యల కబ్బల, నమ్మల సృజియింప నోపు ♦ నమ్మానిని తా
నమ్మా; యయ్యా; యని తన, యమ్మకు నయ్యకు ముదాప్తి♦నయ్యెడఁబెనిచెన్.

క॥ జనవిభుఁ దండ్రి; యని జగ, జ్జనని పిలువ జనకపదము ♦ శక్తం బయ్యెన్
దన పుట్టున ట్టనఁగ నా, తని నేల నెలంత కదియుఁ ♦ దగియుండెఁ జెలీ. ౧౫౧

తే॥ అడుగు లిడ నేర్చె శాత్రవు ♦ లడుగునఁ బడ
మురువుసూపె రక్కసిపిండు ♦ మురువు జాఱ
నాడఁదొడరెఁ బాపాత్ముల ♦ ల్లాడ మేటి
చిఱుతవయసున జానకీ ♦ శ్రీవధూటి. ౧౫౨

—♦ శ్రీ సీతామహాదేవి కైశోరక వర్ణనము ♦—

ఉ॥ బంగరు దండవం కులును ♦ బాపటబొట్టును రావిరేకయున్
రంగగు తారహారములు ♦ రత్నపుటుంగరము ల్కడెంబులున్
గంగునమ్రోయు గజ్జెలు ర ♦ కంబగు మేల్జడకుప్పె లందె లొ
ప్పం గళ లొల్కు కల్కి తమ ♦ వారి నొనర్చె తపఃఫలాఢ్యులన్. ౧౫౩

మత్తకో॥ ముద్దుగుల్కెడు కల్కిచేష్టలు ♦ మొల్లమౌ విరితేనె మే
ల్పాదు రద్దుగఁ జిల్కు పల్కులు ♦ హాళి కిమ్మగు కూర్మి ల
య్యుద్ది మీఱిన సారుతీరు మ ♦ హోద్యమంబు క్రమంబులుస్
ముద్దుగుమ్మ వశమ్ము లౌటకు ♦ మోదమందిరి తద్గురుల్. ౧౫౪

మత్తకో॥ ఈడుజోడయి తోడువీడని ♦ యెమ్మెలాఁడుల తోడఁ బూఁ
బోఁడి యాడెడి యాటజాడలఁ ♦ బోల్చువాఁడు గలండె యా
పోఁడుము ల్గని యింట నచ్చర ♦ బోటు లొండొరు లాసమైఁ
గూడి యాడఁ దొడంగి రట్లాడఁ ♦ గూడు నంచుఁ దలోదరీ. ౧౫౫

సీ॥ కూర్చు బొమ్మలపెండ్లి♦కూటమ్ము లొండొంట్లు, గూర్తు నిమ్మెయి నన్న♦గుర్తు దెలియ
నాడు నచ్చనగాయ ♦ లఖిలగోళంబు లి, ట్లాడింతు నను భావ ♦ మచ్చుపడఁగ
నడుపు బువ్వముబంతి♦ నలువమున్నగ నన్న, మిడుదు నేనను సన్న♦ గడలుకొనఁగ
నెన్ను వెన్నెలకుప్ప ♦ లేఁగప్పు మణి గన్న, వారె పో; ఘను లన్న♦ వలను మెఱయ
మలయు నాల్గుకంబ ♦ ములక్షేల నలువ్రరిఁ, గికురువెట్టు తనదు ♦ కీలు దోఁపఁ
దోఁడి బాలికాలిఁ ♦ గూడి యాశ్రుతిమూళ్ళి, కేళి లీలఁజెలఁగు ♦ వేళ బాల. ౧౫౬

క॥ వామనగాయల నాడెను, వామామణి చెలుల తోడ ♦ వల్లభనామో
ద్దామమహిమ నలువొందుట, నౌ మానని ప్రేమ దొలఁక ♦ నమ్మై యెడలన్.

ఆ॥ అవని మెలఁగు వార ♦ లందఱు నాబిడ్డ, లేనుఁ దల్లి ననుచు ♦ నింతి యాడ
జనని నిక్క మింత♦యనఁ పొంగు నృపు భాగ్య,సరణి వొగడ నెవరి♦తరము తరుణి.

క॥ వనితకుఁ బులు మిమ్మది దాఁ, కిన నోదవును మీకు నట్ల ♦ కికురిడి ననుఁ ద
ల్లినిఁ జేరఁబాఱఁ గనుఁ డీ, రని యొక్కెడ నాడు భావ ♦ మలర వరేణ్యా. ౧౫౯

సీ॥ కాయ లెక్కెనుఁ బావు ♦ గల పందెము ల్నావి, నీకాయఁ గొట్టితి ♦ నీరజాక్షి
మూట మున్నైదు కూడ ♦ ముట్ట నీతర మౌనె, నాల్గింట గడిగట్టి ♦ నాను గనవో
యైదాఱు నీట్లడ్డ ♦ నవ్వాల నాకాయ, యిది పండుకాయ సు ♦ మ్మిందువదన
దనత్రీసు లేటికే ♦ తరుణి యిచ్చోటికి, ముదిత నీపందెమ్ము ♦ ముఱిగె నిదిగొ

చెక్కవడెఁ బంటగడి యిక్క ♦ కెక్కె డెట్లు
చేరె నాకాయ లివె పుట్టు ♦ చింత మీకుఁ
గవరొ పచ్చీసు తెఱఁ గంచుఁ ♦ గలికిమిన్న
యాడె రన మొల్క సఖులతో ♦ నబ్జవదన. ౧౬౦

క॥ పాటలగంధి యిటులు దా, నాటల రస మెల్లఁ గ్రోలు ♦ నన నాజ్ఞ సుహృ
త్పాటవ మరిపాటనమును, నాఁటికి నాఁటికినిఁ దోఁప ♦ నగరాజసుతా. ౧౬౧

తే॥ జనకుఁ డాయతనియతి మైఁ ♦ దనరుచుండఁ
బలుకు మని చెంతఁజని వేఁడి ♦ పలుక కున్న
నయ్య మత్ప్రీతిఁగాంచని ♦ యట్టి యోగ
మేల యనుఁ దన్నతఁడు ♦ గ్రుచ్చి యెత్తి యాడ. ౧౬౨

తే॥ అమ్మ; నీకెందఱే బిడ్డ♦లనుచు వేఁడి, యామె దనుఁ గూర్చి పలికిన ♦ నవని కన్నె
ననుఁ గణింపని చో సిట్టు ♦ లౌనె వేఱు, సేయనని ముద్దుమూపున ♦చ్చెలువ చెలువ.

ఉ॥ నోములు నోముచే కఱవు ♦ నోమిన నోములు సత్ఫలంబులం
దా మిడు టంతకన్నఁ గల ♦ తావుల గర్వము గూరకుండు టెం
తో మురిపెంబు పాల్పడుట ♦ తోఁచును విఘ్నము లందుఁ బెక్కులే
నేమనువాఁడఁ దద్గురుస ♦ మిద్ధతపఃఫలభవ్యభావముల్. ౧౬౪

సీ॥ నిలుచు నొక్కొక్కచోట ♦ నిలువెల్ల బంగారు, తీరుగా రుచి జెస ♦ ద్దివియుచుండ
నడుచు నొక్కొక్కచోట ♦ నడుగుగెందమ్మిపు, వ్వ్వులపూజయిలపాలి♦కలిమి దెలుపఁ
బలుకు నొక్కొక్కచోట ♦ భాషాంఘ్రినూపుర, కింకిణీక్వణనసం ♦ కేత మెసఁగ
మఱియు నొక్కొక్కచోట ♦ మోముచందురు వెల్గు, లనుబంధిజనఖేద♦మపనయింపఁ
జూచు నొక్కచోట ♦ సొబగువాల్గనుగవ
కూర్మినూనికములఁ ♦ గుమ్మరింప
జనకనృపతి సుకృత ♦ చయలక్ష్మిశ్రే యక్కన్నె
శైశవంబు గడపు ♦ సమయమునను. ౧౬౫

—♦ సీతామహాదేవి విద్యాభ్యాస వర్ణనము ♦—

ఆ॥ ముద్దుపట్టి కెడఁద ♦ మురిపం బలర విద్దె
లలవరింపఁ జేసె ♦ నధిపుఁ డల్ల
మేలి గురుల వలన ♦ మెలఁత కుతూహలం
బడరఁ దొడరెఁ జదువ ♦ నబ్జవదన. ౧౬౬

క॥ సమయజ్ఞులు తద్గురు లోం, నమశ్శివాయ యని తొలుత ♦ నారీమణికిఁ
బ్రమదమునఁ గఱపి రాయమ, క్రమ మరసియొ; కలితలాకి ♦ కస్థితినొ; సఖి.

తే॥ వర్ణమాతృక లప్పుడ ♦ వ్వర్ణమాతృ, కాత్మికకుఁ దేట తెల్లమౌ ♦ నట్లు లబ్ధ
వర్ణు లుపదేశ మొనరించి ♦ రర్ణవంబుఁ, దజ్జలౌఘూర్మ్యురచన మైఁ ♦ దనుపు సరణి.

క॥ అణకాన్యచరితసుస్థితి, గుణకారాదికము నేర్చె ♦ గురుతతి త్రిజగ
ద్గుణకారభాగహారా, ర్పణకారణకర్త్రి యైన ♦ పడఁతి కపర్ణా. ౧౭౯

వ॥ అయ్యవసరంబున. ౧౮౦

మ॥ సతి హృద్వీథిని సూత్రధారకుఁడు ప్రా ♦ క్సంస్కారసంజ్ఞుండు స
మ్మతి నారిం జత గొంచుఁ జేరి రససం ♦ మగ్నుల్పరుల్గాఁగ ధీ
ప్రతిసీర న్వేలయించె విద్దియల పే ♦ రన్మించు మేల్బొమ్మలన్
స్మృతిదీపాలి వెలుఁగఁ జేసి విబుధు ♦ ల్మెచ్చం బయోజాననా. ౧౮౧

తే॥ అమ్మహాదేవి శుచిమూర్తి ♦ నధిగమించు
స్వగురువరనీతకలితసు ♦ వర్ణవితతి
పులు దొఱఁగి మించు వన్నెల ♦ పొలుపుఁగాంచెఁ
దద్విదులు మేలనుచు మెచ్చఁ ♦ దరలనయన. ౧౮౨

చ॥ పెనుపు వహించు సత్కళలఁ ♦ జేరిమి గూరఁగఁ బెద్దపొత్తముల్
దన కెఱఁగించి సద్గురు లు ♦ దారమనీష మనీషివంద్య తా
నును వినెఁ గ్రొత్తక్రొత్తగ న ♦ నూత్ననిజాచరితత్వభావనా
వనతకథాప్రసంగముల ♦ వానిఁ బ్రగల్భతమై నగాత్మజా. ౧౮౩

సీ॥ వ్యాసశిక్షాధురి ♦ వఱలె నిర్మలగతిఁ, బాణినీయవనంబు ♦ పరఁగఁ బూచెఁ
గేదారవృత్తిస ♦ స్యాది లెస్సగఁ బండె, నిర్వచనశుభోక్తి ♦ నెగడె జగతి
జ్యౌతిషమార్గమై ♦ శద్యంబు పెనుపొందె, నౌకల్పకల్పన ♦ లతిశయిల్లె
న్యాయచర్చాంచిత ♦ వ్యాహారములు మీఱె, శ్రౌతాదిదృక్సామ ♦ రస్యమూరె
సుకవితాగీతిమాధురీ ♦ శోభమాన, వల్లకీసల్లలితకళ ♦ లుల్లసిల్లెఁ
గలితసామ్యాయనత్వవి♦ఖ్యాత సీత,స్వీయమహితవిద్యాలక్ష్మిఁ ♦ జెలఁగు నపుడు.

తే॥ తప్పఁ బట్ట దొజ్జల దెసఁ దనదు వధువు
నుడువుచెలి బలగంబ కాఁ ♦ దొడరు పెరిమ
మంచి దటుగానిచో వారు ♦ మక్షిక లటు
దారు పులు లట్లకాదె యి ♦ ద్ధరణిఁ దరుణి. ౧౮౪

తే॥ ముజ్జగమ్ముల పుట్టుక ♦ మొదలి దుంప
మోహనాంగి తాఁ బఠియించు ♦ ముచ్చటరయ
నిజగురుత్వమహైశ్వర్య ♦ నియతి వారి
తెఱఁగు వొరగును సవరింపఁ ♦ దలఁచి కాదె. ౧౮౫

సీ॥ తలఁపించు వేల్పుటో♦జ్జలు మేఱి తెఱఁగంటి, గమి సుద్దులఁ బొదల్చు ♦ గారవంబు
వెలయించు బలుమత్త్రి♦వల నిల్చు పౌర, తెల్వి, జడదారులకుఁ గూర్చు♦జాణతనము
మెఱయించు నల జక్కి ♦ మెడప్రోడ నెఱబోడి, తపసులఁ జొక్కించు♦దంటతికము
నెఱయించుఁ బొందమ్మి♦నిసువు దేవేరి ప్రా, మినుకుగన్నెల దేర్చు♦మేలిహొయలు

నంతకంత కెక్కుడై ♦ కళ దళుకొత్తఁ, జదువఁ దెలుపఁ దనుప ♦ జాలుకొలుపఁ
జాలి చంద్రవదన ♦ సరివారి నడుమ ని, ల్లైసఁగె బుధరసాప్తి ♦ పొసఁగ నగజ.

క॥ అవిద్యారూపిణి తా, నేవిధమున నొడువు శ్రుతుల ♦ యెడ నన్వయముః
భావించి నిరూపించిరి, శ్రీ వెలయు మహాత్ము లదియె ♦ శ్రితకల్పలతా. ౧౮౦

సీ॥ కలనాళ్ల లొక్కఁడౌ♦క్కఁడు రెండుగాఁబ్రిలఁ, గలుఁగుడాఁగుఁడు పెద్ద♦గఱచుకొనియె
మానముద్రాలక్ష్య ♦ మానసీయనిరుక్తి, భార్గవుండటు మానె ♦ వాకొనంగ
నెమ్మిఁ బెద్దఱికంబు ♦ నెఱపి శుశ్రూషలఁ, బాటిల్లఁ దగెఁ బద్మ ♦ భవుని రాణి
పైతేయపీడితేం ♦ ద్రప్రసాదనయుక్తి, సమయ మీఁగఁ దలంచె ♦ సారగురుఁడు

లలితగతి జానకీదేవి ♦ కలితవైదు, షీవిలాససముంచద్వి ♦ జృంభణంబు
సారె మీఱఁ బరాభవ ♦ శంక నొఱపు, సూప నేరిమి పోలమి ♦ సుందరాంగి.

తే॥ కళలుగలవాని భగిని ప్రా♦క్కళలకొలము గన్న మోములు గలవాని ♦ కన్నతల్లి
భువననాటక కలనాప్ర ♦ బుద్ధ సాధ్వి, తాఁ గలాంచిత యగుట చి ♦ త్రంబె గిరిజ.

క॥ ప్రమదలహారి జనకుఁడు త, త్ప్రమదయుఁ బెనుపొంది రోలి ♦ బాలామణి తాఁ
గమలారమణియ కా న, భ్రమె తద్గురు లట్లుగాఁగఁ ♦ బర్వేందుముఖీ. ౧౮౧

క॥ ఆయమ వైదుష్య ముపా, ధ్యాయవరుం డరసి యరుస ♦ మంది కవీంద్రో
ధ్యేయ యవుగాత మిది యని, శ్రీయుత వీక్షించి ప్రీతి ♦ చెలువార ననుః.

సీ॥ నీ తాల్మి కీభూమి ♦ నేఁ దోడనుచు నంచి, తామోదభూమోద ♦ యమున మనదె
యీఁడే భవత్కల ♦ లెఱిఁగిన సర్వస్వ, మాముురారి కవీంద్రుఁ ♦ డై యలగుట
నేపట్ల నిను వీడ ♦ నేనని గిరిజ నీ, చెలువ మీక్షించి తాఁ ♦ జిక్కకున్నె
తల్లి; త్వత్సంగీత ♦ తాత్పర్యమున దివ్య, మాని వీణియ పొంగి ♦ మహతి గాదె

శ్రీ వెలయు ప్రాసముఖ్యస ♦ ద్భావయుక్తిఁ
బొంకమగు వర్ణతతిఁ బాద ♦ ములనుఁ గూర్చి
కటకితఫణీంద్రు నాట్యయో ♦ గ్యముగఁ బదముఁ
జెప్పఁ బూనుము కవినామ ♦ సిద్ధి వెలయ. ౧౮౩

క॥ అన వలఁగొని వందనముం, బొనర్చి గురుదక్షిణలఁబ్ర ♦ పూర్ణార్థులుగా
ననఁబోఁడి సమర్పించి త, దనుజ్ఞఁగొని యుండె నగర ♦ నలరుచు నంతన్. ౧౮౪

— ♦ శ్రీ సీతామహాదేవి యౌవన విలాస వర్ణనము ♦ —

చ॥ నునుజిగిపేర్మికింజికిలి ♦ నొవ్వని చిత్రిక గాత్రయష్టికిం
గొనమిడు ధూపచర్చ విరి ♦ కోల దునేదు నగించుతూపు చూ
పు నెఱి మఱల్పనీని నవ ♦ మోహనమంత్రముఁగట్టు సొంపుఁబెం
పు నొఱపు నింపుజవ్వనము ♦ పొంపమరెం దలిరాకుబోఁడికిన్. ౧౮౫

క॥ తారుణ్యార్కుఁడు పొడమిన, నారీమణి వికసితాన ♦ నప్రముఖాంగా
బ్జారామశ్రీ కలన సరసికిఁ, దాఁ రెండవమూర్తి యగువి ♦ ధంబునఁబొల్చెన్. ౧౮౬

క॥ పూపచనులు జిగిపలుకులు, తీపగునడకులును తెలివి ♦ తేట యొఱపు ని
ద్దాపసలు చుఱుకు ఠెళుకుఁ, జూపులు కళ లమరె యువతి ♦ చూడామణికిన్.

సీ॥ ఒకవేళ దమయంతి ♦ యొఱపుమైఁ గనుపట్టుఁ, గనుపట్టి సురలనే ♦ కలఁకపెట్టు
నొకసారి శశిరేఖ ♦ యోజ నెక్కొనఁ గాంచుఁ, గాంచినత్కళలర ♦ కంబుమించు
నొకతేప వాగ్దేవి ♦ యుల్లాసమునఁ దోఁచుఁ, దోఁచిజాడ్యంబెల్లఁ ♦ దొలఁగఁజూచు
నొకమాటు భవదైక్య ♦ యుక్తిచే రాణించు, రాణించి సుజనాను ♦ రక్తిఁబెంచు
నొక్కయెడ లోకమాతృత్వ ♦ మొలసి మీఱు
మీఱి శ్రీహరి పొత్తున ♦ మెలఁగఁ గోరుఁ
బొసఁగ సద్దేవి యౌవన ♦ స్ఫురణ నేర
బాఱు నంతన యుత్ఫుల్ల ♦ పంకజాక్షి. ౧౮౮

క॥ వాసంతసమయజృంభిత, వాసంతిక నాఁగఁగ్రొత్త ♦ వయసున సతి దా
భాసిల్లె మాధవాశ్రయ, నాసక్త లతాంగి యట్ల ♦ యౌఁగా మగువా. ౧౮౯

సీ॥ తన నెమ్మొగము విధు ♦ తత్త్వ మిమ్మెడ ననఁ, గనులుపద్మాప్తసం ♦ గతి మెలంగ
నధరంబు మధుమన్మ ♦ హాలక్ష్మి మై మించ, శ్రుతులు శ్రీరామను ♦ స్థితిరహింప
చిబుకమనంతవి ♦ శేషాస్థరాణింప, గళ మబ్జధారణ ♦ కళ భజింపఁ
జనులచ్యుతామేయ ♦ సామ్రాజ్యమున నిల్వ, నడుము విష్ణుపదాశ ♦ నలువుమీఱఁ
దనువు కనకాంశుకవికాస ♦ మనఁగిపెనఁగ
నడవడి గజేంద్రపోషణా ♦ నంద మందఁ
జెయ్వు లలవిశ్వమోహన ♦ శ్రీ నయింప
హరి తదాత్మతఁదగె నామె ♦ యలరుఁబోఁడి. ౧౯౦

—♦ శ్రీ సీతామహాదేవి శిరఃప్రభృత్యవయవస్తవము ♦—

తే॥ విరులు సరులుఁదొడరి జిగి ♦ విరులుకొనఁగ
మరు లడరఁజేయు నద్దేవి ♦ కురులు సిరుల
నిరుల నరికట్టు టరుదె చూ ♦ పరులు జెరల
నుఱియ మరుఁ డిడ్డ మోహంపు ♦ టురుల కావె. ౧౯౧

తే॥ చెలువనెఱివేణి చిలువల ♦ చెవ్వులు వెఱుకఁ
జెదరి తద్వృత్తి గన్నులఁ జేరె నవల
నయ్యె జక్షుశ్శ్రవంబు ల ♦ య్యభిభవంబు
దలఁచి ఘూర్ణిల్లుఁ గొన్ని తి ♦ త్థణమిషమున. ౧౯౨

క॥ శ్రీమత్తైక్ష్యవిభానిభ, యామునఝరమిళితవేణి ♦ కాంచత్కాళీ
యామృగ్యఫణమణిప్రభ, సీమంతఁపుఁజెందిరంబు ♦ చెలఁగుఁ జెలువకుఁన్. ౧౯౩

తే॥ తన్ను శ్రీరాముఁ డొకరుండు ♦ దక్క నొండొ
కండు కాంక్షించినను మస్త ♦ కంబు భిన్న
తరముగాఁ జెడువాఁడను ♦ సరణిఁ గఱపు
మహితలక్షణ యామె సీ ♦ మంతసీమ. ౧౯౪

మ॥ అలకాళు ల్స్వసపక్షకై శికతమో ♦ హార్త్యాప్తిఁ బ్రార్థించి త
న్గొలువ న్నెమ్మొగ మబ్జగూఢి గనుట ♦ న్గూర్మి న్స్వపద్మస్థితి
న్నలినాప్త న్నిజతత్స్వరూపత శశి ♦ న్దార్వంగ భూపాఫలా
త్మల సూర్యేందువు లొప్పి రింతి తలఁ ద ♦ త్సఖ్యంబు పాటించుచున్. ౧౯౫

తే॥ ఎలమి నభిముఖ యగుడు వె ♦ న్నెలల కలిమి
నవ్వలనికై న యెడఁ దమి ♦ ప్రాప్తిఁ బలిమి
నబల చంద్రసహోదరి ♦ యనుచుఁ దెలిపి
పద్మనిష్ఠ రూపింపదె ♦ పడఁతి మోము. ౧౯౬

చ॥ మృగమదరేఖ క్రమము స ♦ మీపగతిం ద్యుతిపూర్తి క్రీడజో
కఁ గొఱలఁ గాంచనాంగి యలి ♦ కస్థలి నిల్వఁ బొసంగె రెండుఁదృ
ప్తిగ నిడపేరి గంగజతఁ ♦ బింగల నాఁజను భానుకన్య లో
నెగయు సుషుమ్న యన్బలుకు ♦ టే తెసఁగం జిగి మించు చాడ్పునన్. ౧౯౭

క॥ శృంగారరసఁపురంగున, నంగజు విల్లు ముంచి మోము ♦ హంగును వివరిం
పంగ నిడె ధాత గుఱుతు ల, నం గనుబొమ లందగించు ♦ నారీమణికిన్. ౧౯౮

తే॥ మొగము జిగి తమ్మికొలనిమే ♦ ల్మొరుపు గనుటఁ
గలికి కను లొప్పఁదద్రేఖ ♦ నొలయఁ జూపు
లఖిలొ బేడిసలో నల్ల ♦ కలువచాలొ
యెద్దియునఁ గామసామగ్రి ♦ యింత నిజము. ౧౯౯

తే॥ కలికి కాటుకకనులకు ♦ ఖంజనంబు
గాదనఁగ నెట్టులది సప ♦ క్షంబ యట్టి
దయ్యెఁ గారుణ్యరస మొల్క ♦ నట్టి తమకు
గొఱఁతవడఁ దద్ధృతీక్ష జ ♦ కోరపాలి. ౨౦౦

సీ॥ మెఱుఁగుజగ్గులఁ బైకి ♦ మేకొను నప్పాట, నిలనుండి దివికి మె ♦ ట్లైనయఁ జేయుఁ
దివిచినతీవెనా ♦ దివినుండి దిగుపట్ల, స్వర్గసంపదఁ దెచ్చి ♦ వసుధ కొసఁగు
సాచీకృతివిలాస ♦ సరణి నెక్కొనువేళ, దెస లేలు నెఱజాణ ♦ తీరు నెఱపు
నెదిరిఁ బ్రౌఢి దొలంకఁ ♦ బొదలించు నవ్యాజ, నిగ్రహానుగ్రహ ♦ నిరతిఁ దెలుపు

నెలమికలిమి కెదుర్పడు ♦ నేది యచటఁ, గూర్మ లొక్కట నుడివోక ♦ గుమ్మరించు
లలితముఖనలినాస్థాన ♦ లక్ష్మి మేలి, కలికితనములకిక్క యు ♦ క్కలికిచూడ్కి.

చ॥ పొలఁతుకమిన్న నాస సరి ♦ పోలఁగఁ దా సమకట్టి నెట్టనన్
దిలసుమ మొక్కఁ డొండవడి ♦ తీవ్రతపస్యఁ జరించి ద్యోగతి
న్మలఁగెఁ దిలోత్తమాఖ్య ధృతి ♦ నెక్కొన నోమియు హీనజాతియ
క్కొలమునఁ బేరుఁ బెంపుఁగనఁ ♦ గూర్చె నె యుత్తమవంశయుక్తికిన్. ౨౦౨

శా॥ శ్రీమర్యాద తగ న్సుధాంచితకలా ♦ సిద్ధాంతసంభావనా
ప్రాముఖ్యంబున శష్కులీనిరసన ♦ ప్రావీణ్య మేపార భూ
షామూల్యప్రథమీఱఁ దోర మగున ♦ య్యబ్జాక్షి శ్రోత్రద్వయం
బామోదింపదె కర్ణపూరితమహా ♦ వ్యాహార సామ్యస్థితిన్. ౨౦౩

తే॥ ముదిత చెక్కులు స్మరమణి ♦ ముకురములొ వ
రేణ్యలావణ్యరసలహ ♦ రీభృగువులొ
కానియెడ రత్నతాటంక ♦ భానుకిరణ
బింబనస్ఫూర్తిచాకచ ♦ క్యం బెనఁగునె. ౨౦౪

తే॥ గిలుకుటందెల రవళిమైఁ ♦ గులుకు లొలుకు
పలుకుచెలి నాట్యరంగ మ ♦ క్కలికి నాల్క
దా రసజ్ఞయా టబ్రమె ♦ తదవయవము
లన్నియు మనోజ్ఞకలనామ ♦ హత్త్వ మొలయ. ౨౦౫

క॥ పులుదొఱఁగిన ముత్తెము లనఁ, జెలి దంతము లిరు బదాఱు ♦ సిరి గను నొకఁడే
కళలెల్లఁ గొనఁ దగియుఁ దమ, వలఁ బొర పఱ రెండురెండు♦వరుసఁ బొరయుచున్.

చ॥ చెలి రసనాగ్రరంగమునఁ ♦ జిత్కళ లొల్కెడు మిన్కుకన్నె మే
ల్కులుకు నొయారము న్జెలువుఁ ♦ గూర నుదారకథారసాప్తిఁ ద
ద్ఘ్న లలర రూపకోత్కలిక ♦ తోఁదగ శ్రీమణిదీపదీప్తిమై
వలనగు కెంపుడాల్తెరయ ♦ వాతెఱనా నెగడొందు నెంతయున్. ౨౦౭

తే॥ కెంజివురు దొండపండు మం ♦ కెనపువ్వు పగ
డంబు గెంపు లాక్షయు నేర్ప ♦ డంగఁ గరఁగి
మొనయు పుండ్రేక్షుమధుసితా ♦ ముద్ర నమృత
కలన విధి యచ్చుపోసె ని ♦ క్కలికి మోము. ౨౦౮

తే॥ జిలుఁగునగవుల వెన్నెల ♦ ల్చిలుక నగుచుఁ
బలువరుస రిక్కచా లొంట ♦ భాసిలంగ
నమరు సంజకెంజాయఁ జం ♦ ద్రాస్య మోవి
యబ్బురంబు శ్యామాత్మ కా ♦ దనఁగ నెట్లు. ౨౦౯

క॥ అసదృశ మఁట సతి చిబుకం, బసదే యవ్వార్త వాఙ్మ ♦ హాపీఠము మో
ముసిరికి మూలస్థానము, మిసిమినగవు పంటపొలము ♦ మేరయు నదె కాన్.

సీ॥ మగఱాల మొలకలు ♦ మంచిముత్తెఁపురుచు, ల్పదతి పల్వరుస కే ♦ చూఱపుచ్చెఁ
బవడంపుఁ బలుకులు ♦ పద్మరాగద్యుతు, ల్బింబోష్ఠి మోవికై ♦ వెచ్చగించెఁ
గప్పుఱాకణికలు ♦ గారుత్మతశ్రీలు, నలివేణి కురుల క ♦ ట్లప్పగించెఁ
బటికఁపుంబలకలు ♦ వైదూర్యలక్ష్ములు, సుకపోల చెక్కుల ♦ కొకటఁదార్చె

బళిర రత్ననిధియ పో సు ♦ వదన వదన
మేర్చికూర్చెనుఁగద విధి ♦ యింతవట్టు
గడఁగి మెఱుఁగిడ మరుఁడుఁ ♦ దోడ్పడెనొ కాక
మొదలికూర్పె తనకుఁ జల ♦ మునుక లయ్యె. ౨౧౧

తే॥ జీవపదము విశుద్ధాత్మ ♦ సిద్ధమాన
సక్రమంబు రేఖాత్రయీ ♦ శరణము హరి
చందనాఢ్యము హారియౌ ♦ సాధ్వి గళము
జలధిఁ బొడమిన సంకును ♦ సరకుగొనునె. ౨౧౨

తే॥ నీలకుంతల కంఠంబు ♦ నిగమమూర్తి
గానియెడఁ గమలజముఖా ♦ కలన నవత
రించు నె స్వరాదికత్రయీ ♦ శ్రీవిశేష
సూచకత్రిరేఖావృత్తి ♦ సొంపు గనునె. ౨౧౩

క॥ కిన్నర కొయ్యవడియె నటు, తన్నెఱుఁగదు వీణ సంకు ♦ తలక్రిందయ్యెన్
మున్నె వనిఁ దారెఁ గోయిల, కన్నియ సుస్వరకలావి ♦ కస్వరగళగాన్. ౨౧౪

ఉ॥ వాడని పూసరు ల్మురువు ♦ వాయని మేలిమృణాలము ల్సిరు
ల్వీడని యాణిముత్యాలు వెల ♦ పెట్టక కట్టిన మేటికోవ ల
ల్లాడని తియ్యవింటిదొర ♦ యూఁదిన మోహపు వల్లెత్రాళ్లు పైఁ
జూడని కల్పశాఖికలు ♦ సుందరి బాహువు లందగింపవే. ౨౧౫

క॥ సరసిజకిసలయలక్ష్మిన్, హరణాదరములు మహోర్మి ♦ కాంచద్రత్నా
కరములు నఖరుచిజితస, ద్వరములు సుందరతరములు ♦ పడఁతుక కరముల్.

ఉ॥ చాలమి సోముఁ డేఁప వగఁ ♦ జక్రయుగం బవనీసుతాంగని
ర్వేలవిభాఝరీవసతి ♦ వే శశిశేఖరుఁ గొల్చి తత్కృపం
జాలి గికేశలక్ష్మిఁ మ్ముఖ ♦ చంద్రుని కోడమి పొత్తుకల్మి నె
వ్వేళఁ దలంగమిఁ గ్గనె సు ♦ వేణి కుచద్వయమై మహోన్నతిన్. ౨౧౭

తే॥ నిజవపుశ్శ్రీఫలము లవ♦నిజ కుచములు, శ్రీఫలము లయ్యెఁదల్లక్ష్మిఁ♦ జెనయఁబెక్కు-
వేసములఁగామి మునిధర్మ ♦ విలసనమునఁ, జెందె బిల్వాము లుత్తపద ♦ సిద్ధిఁ దుదిని.

ఆ॥ చేర్చెఁ దల నజుండు ♦ శృంగారసారాంశ, మదియు నుదుట బొమల♦నక్షియుగిఁ గు
చాగ్రములఁ దొలంకి ♦ యటఁజింది జాలొంది, నాభిసరసిఁ జొచ్చె ♦ నాతి కెపుడు.

క॥ తరుణికటిమండలమొ కుచ, ధరయుగమో భర మటంచు ♦ దాత్పర్యమునన్
మఱఁకు తులఁదూఁచునడి నం, తరమున నారెసఁగు నినుప ♦ దండె వడువునన్.

తే॥ అతివ కౌనంబరం బగు ♦ టరయ నిజమ
కాన లావణ్యజాహ్నవి ♦ ఘనత కెక్కె-
నందు వళులను వీచిక ♦ లందగించె
నాభి సుడియు శ్రోణులు పులి ♦ నములు నయ్యె. ౨౨౦

తే॥ పొలఁతి తీర్చిన మేల్పైఁడి ♦ బొమ్మ సుమ్ము
కానిచో నవయువకలా ♦ గరిమ మిట్లు

తగునె జగమెల్లఁ గడరునె ♦ యగునె త్రిప్పు
త్రాటిగుఱుతులు వళిసంజ్ఞ ♦ దనర నడుము. ౨౨౨

ఆ॥ మిన్నుబావి యన్న ♦ మేలమాడుట పొన్న, పూ వటన్న సొను ♦ బొల్లుమాట
యమృతసరసి యన్న ♦ నౌఁగాక కామసం; జీవనౌషధంబు ♦ చెలువనాభి. ౨౨౩

క॥ పదునాల్గు జగము లొక్కటఁ, బదరి గెలువ నలువ యతనుఁ ♦ బట్టము గట్టెన్
సుదతీజఘనకృతిం దా, నఁదగె నతం డేకచక్ర ♦ నాయకగరిమన్. ౨౨౪

తే॥ మూల మంత కేసే నంచు ♦ భూతధాత్రి
యాకసము బిట్టుపోరాడు ♦ టరసి నలువ
చెలికటిస్థలి గాను గాఁ ♦ జేర్చి తేజ
మునిచెఁ బైకొప్పు గాఁగఁ ద ♦ దుభయమునకు. ౨౨౫

ఆ॥ ఒక్కరక కొనర్చె ♦ నూరువు ల్కరభము
ల్గామకు నలువ నేర్మి ♦ గోఱలఁ బోలు
వాని కవియు పోల్చ ♦ వచ్చునె రంభలఁ
గింభలను వినీతి ♦ గుంభ మనక. ౨౨౬

క॥ లలిమించు భువనజయుదో, హలతాకలితాత్మభవము ♦ హాశాసనశం
సిలసత్కలమంగళకా, హలయుగలము నాఁగఁ ♦ బల్లవాధరిజంఘుల్. ౨౨౭

ఆ॥ డాఁగెఁ గ్రింద మంద ♦ రాగంబు పైకెక్క, నప్పుడిపుడు సతి కు ♦ చాద్రులెంచి
తా ద్విధాత్మకలనఁ ♦ దామేటిమేటి త, త్పాదనతిఁ గనె న్ప్రి ♦ పదరమాప్తి.

క॥ సిరినెలవుల సారాంశము, లరవిందజుఁ డొరసి యుంగ ♦ నాంగములు సృజిం
చె రుచులు వొసంగ నిట్లనఁ, జరణము లంబుజము లనఁగ ♦ సందియ మేలా.

ఆ॥ ఉడుచయంబు పొరయ ♦ దొగి దివాభీతత్వ
మబ్జ మలుక దాసు ♦ ధాంశు నెదుర
నవనిజాపదద్వ ♦ యావతారప్రాప్తిఁ
దాత చెద్ది చిత్ర ♦ తరమ కాదె. ౨౩౦

ఆ॥ హంసకాంచితంబు ♦ లతివ పాదాబ్జముల్, శ్రీనివాసగరిమఁ ♦ జెలువు గనవె
రాజహంసగతివి ♦ రాజమానము లౌర;, మందగమన మహిమ ♦ మానితంబు.

సీ॥ పొంచి వన్నియ దొంగి ♦ లించికాఁబోలు బ, ల్కాఁక సమ్మోటపాట్లు ♦ గనెఁ బసిండి
మెంచి తళ్కులకుఁ జ♦లించి కాఁబోలు మ, బ్బుల చాటుచాటున♦మలఁగె మించు

మించి శ్రీరఘురికి భ్ర ♦ మించి కాఁబోలు లో, పల డాఁగి ప్రవహించెఁ♦బలుకు తేటు
కాంచి విప్పున శోహ ♦ టించి కాఁబోలు నూ, పిరి లేక ప్రాలె సం ♦ పెంగపూవు

కవివరులు గూర్చునవి కొఱ ♦ గానివయ్యెఁ
గాన నుపమాన మొక్కండు ♦ గానఁబడదు
మానినీమణి నెమ్మని ♦ మాస్యకళలఁ
గలయ వర్ణింప విధికేని ♦ గతియు లేదు. ౨౩౨

మ॥ చెలిసింగారము చొక్కమందు బొమలా ♦ చెల్వొందువిం డ్లాదృగం
చలము ల్తూపులు నాస యానలిక మ ♦ బ్జం బాగళం బారు నూ
ర్వ్వి లసజ్జంఘలు తూణము ల్కటి రథ ♦ శ్రీ మేల్చను ల్దుర్గముల్
గలిగె న్సర్వ మమోఘ మింక మరుఁడా ♦ క్రాలండె దుష్ప్రేక్షుఁడై. ౨౩౩

క॥ అని చూపరు లగ్గింపఁగ, వనితారత్నంబు వొల్చె ♦ వరయావనశా
ణనివేశకలనఁ దీరగు, మనసిజు మోహనశరంబు ♦ మాద్రి గిరిసుతా. ౨౩౪

సీ॥ మోముగాదిది చంద్ర ♦ మోమండలాంతస్స్న, రససారపూర్ణ సా ♦ రసము గాని
మేను గాదిది మించు ♦ మించుతళ్కులఁ బైఁడిఁ, గట్టుకట్టిన బొమ్మ ♦ కట్టు గాని
మోవి గాదిది యొడ్ల ♦ మొఱఁగి మోహిని సుధ, కోర డాఁచిన కెంపు♦కోరగాని
చూడ్కి గాదిది స్మార ♦ సూచీమరీచుల, కుట్టువాపెడు పచ్చ ♦ కుట్టు గాని

యెంతలెంతలు నేర్చె నేఁ ♦ డీవిధాత
యేటి జతనంబు సామగ్రి ♦ యెట్టు లమరె
మరుఁడు దోడ్పడెనో; యంచు ♦ మగువసృష్టిఁ
గూర్చి చర్చింతు రచ్చర ♦ లుద్ధరతనయ. ౨౩౫

సీ॥ నవరత్నముల కోట ♦ నామించు నగుమోము, పాలఁతి రత్నాకరో♦ద్భూతగాదె
కల్యాణముల పేఁట ♦ గా నొప్పు నెమ్మేను, తరుణి మంగళదేవ ♦ తయగుఁగాదె
యసదుద్వహుల మాట♦యనఁజెల్లులేఁగొను, మగువశ్రీహరియోగ♦మాయగాదె
స్వరసవాదుల బాటఁ ♦ జాటు లావణ్యంబు, తరలాక్షి చంద్రసో ♦ దరియ కాదె

మహితవాత్సల్యములమూట ♦ మలయు తేట
మానినీతిలకము లోక ♦ మాత గాదె
యనుచు విబుధులు భావింతు ♦ రహరహంబు
భావినీమణిఁ గాంచి సం ♦ భావ్యచరిత. ౨౩౬

క॥ సింగారమొ మరు బీరమొ, బంగారఁపుసారమో యు ♦ వతిబేరమొ వా
గ్రంగారమొ నుడికారమొ, యంగనరో యరయఁ దరమె ♦ యజునకునైనన్.

తే॥ ఆమె రతనాలలోనఁ జిం ♦ తామణియు మ
హౌషధులలోన సంజీవ ♦ నాఖ్యయును జ
గములలో హరికీర్తి నా ♦ గానఁబడియె
స్త్రీలలో బల్కు లిఁకఁ బెక్కు ♦ లేల బాల. ౨౩౮

చ॥ నడచిన శంఖచక్రకల ♦ నల్పదచిహ్నము లెక్కఁ గన్గొనం
దొడరఁ గటాక్షపఙ్క్తి దయ ♦ తో భువనత్రయ మేలఁ బల్కుసొం
పడరఁ బదప్రమాణరస ♦ హావము లబ్ధులు గాఁగఁ దండ్రి యె
వ్వఁడు తగు నీమె కేయజితు ♦ వల్లభ యీయమ యంచు నెంచుచోన్. ౨౩౯

## జనకమహారాజునొద్దకు నారదముని వచ్చుట

సీ॥ అలమేలు గొనఁ జాలు ♦ తెలిడాలు మెయి గీలు, కొనిమేలుకొనుకీర్తి ♦ ననుకరింపఁ
దొలినోములకు గీము ♦ బలులేములకు బాము, నగుమోమువిధునామ ♦ మనఁగ పెనఁగ
సిరి వేడుకకు వీడు ♦ హరిఁ గోడుకొను త్రాడు, త్రయిజోడు బత్తిచి ♦ త్తమున మెలఁగఁ
బ్రణవారవము చాటి ♦ బడి ధీరతనుసార, మయి యోర మహతి ర ♦ సైక్యమొసఁగఁ
గక్షపాల రశన స్ఫటి ♦ కాక్షమాల
ఘంచె కఱ్ఱ కమండలం ♦ బంచితములు
గా మహాస్ఫూర్తి వెలుఁగొంద ♦ ఘనుఁడు కలిక
లాశనుఁడు దివ్యముని తోఁచె ♦ నచట నపుడు. ౨౪౦

క॥ అన్నారదముని రాకడ, గన్నారం గని విభుఁడు సు ♦ ఖాయితవృత్తిన్
చెన్నార నెదురుకొని త, త్పన్నారజములకు నెరఁగి ♦ పరఁగినభక్తిన్. ౨౪౧

తే॥ పూజ లొజ నొనర్చి సం ♦ పూజ్యమాన, రత్నపీఠి సుఖాసీను ♦ రజ్యమాన
మానసునిఁ జేసి యసమాన మాధురీధు, రీణవచనరచన తేజ ♦ రిల్లుచుండ.

క॥ మునిఁ గనుఁగొని జనవిభుఁ డి, ట్లనియె ననుగ్రహవికాస ♦ మనఁ జను మీద
ర్శన మాకస్మికముగ మ, జ్జని సాఫల్యంబు గూర్చె ♦ సద్గతి గంటిన్. ౨౪౩

తే॥ కోరికలఁ జేరికిం గొన ♦ కేరికేనిఁ
జేరి కనరాని దారికి ♦ దారి మీరు
వారు మీరిటు కూరిమి ♦ గూర దొరయు
గారవము నాకుఁ బ్రశ్నావ ♦ కాశమిడదె. ౨౪౪

ఆ॥ జగముఁ బ్రోచువారి ♦ సహజవృత్తం బిది
యైన నగును గాని ♦ యస్మదీయ
సుకృతపాకభేద ♦ సూచనఁ జెనుపొంది
వెలయుఁ దారతమ్య ♦ విలసనంబు. ౨౮౫

క॥ క్షణదాప్త మణినిరాసము, గుణితానందము సదాను ♦ గుణము తమోదా
రణ మచ్ఛము భువనవిల, క్షణ మోయమిరాజమిత్రప్ర ♦ సాదము వింటే. ౨౮౬

మ॥ కలిగె న్మత్తెఱులందు భావుకము లిం ♦ కంగాన మెందుం గొఱం
త లనన్యాప్యము తావకాంఘ్రియుగ మా ♦ స్తం జౌట నెట్లైన న
ప్పలుకుందొయ్యలి మిన్న గన్నఫలమై ♦ భాసిల్లు నీవాగ్రసం
బులుచూపట్టక యెట్టు లార్పుదును రా ♦ పుల్సాపు తృష్ణాశిఖిన్. ౨౮౭

వ॥ అట్లుగాన మదీయ భవాప్రియఫలాయమానంబు జగత్పావనంబు నగుభావనిర్దే
శంబున భవదీయమంగళానుశాసనవిధేయుండ నగునన్నుమన్నింపవే యని యమే
యభక్తియోగంబు డంబుమీఱ సవినయంబుగా విన్నవించిన. ౨౮౮

క॥ కరుణారస మొలుకఁగ న, ప్పరమతపోధనుఁడు వాని ♦ భవ్యవచోమా
ధురి భావ మెఱిఁగి యబ్బుర, మిరవొందఁగ మెచ్చి ప్రీతి ♦ నిట్లని పలికెన్.

సీ॥ ఒప్పుఁ ద్రయ్యాత్మకాన్వయ ♦ యుక్తిఁ బొడము, వారికి శ్రుతప్రకాశవి ♦ స్తారకీర్తి
యైన నీసామ్యగతి సమా ♦ హ్లాదనంబు, కలితరసపుష్టి సద్భక్తి ♦ గలవె యందు.

చ॥ గొనములకెల్లఁ బెట్టియవు ♦ కోరినవారికిఁ బెట్టుచెట్టు వెం
దునుఁ బొలిపోవు సత్కళల ♦ దోసము మోసము మున్న సున్న భా
వన పరమార్థసంపదను ♦ బద్ధ త్వదీయమహానుభావతం
జెనక జగాన నోజనక; ♦ శ్రీమహితుం డొకరాజు శక్తుఁడే. ౨౯౧

తే॥ గంటి లేనట్టి సంతృప్తిఁ ♦ గంటి నయ్య, మేలు సరిరారు ముల్లోక ♦ మేలువారు
నీకుఁ గలితైకశుభగుణా ♦ నీకు నిన్ను, వినుతిసేయం దరమె సుధీ ♦ వినుతిపాత్ర.

చ॥ అగు నన వచ్చుఁ బో; కరత ♦ లామలకంబు సమస్త మీవ తా
వగుదు వివేకసంపదకు ♦ నైనఁ గుతూహల మాఁగఁజాల మే
లగు నొకవార్త మామకహ్ర ♦ దంబుజమం చిడియుంటఁ జాల జా
లగు జలము న్మఱల్ప క్షముఁ ♦ డౌ నెవఁ డొక్కట రాజచంద్రమా. ౨౯౩

క॥ హెచ్చగు మచ్చికమెయిఁ గన, వచ్చుట నిటు ముచ్చటింప ◆ వలసెన చూ; మే
లచ్చుపడఁ జెప్పెదఁగు పనిఁ, బొచ్చె మెఱుఁగ కెఱుకసేఁత ◆ పునరుక్తం బే. ౨౫౪

క॥ మునుపాక జ్యోతిర్మయమూ, ర్తిని మింటం గంటి వంటి ◆ తేఁకువమై నం
దనమై యీయను జనకా; యను భాగ్యము తనకుఁ గలదొ ◆ యనుచు మనమునన్.

క॥ తోన యశరీరభూతం, బౌ నటులే యనుచు నొడువ ◆ నబ్బపడితి వ
లైనఁ గృతకృత్యుఁడన యని, యానెఱిఁ దలపోయుదే మ ◆ హాత్మ; తలఁపునన్.

సీ॥ జగము పుట్టువు నట్టు ◆ సొగియు నేకల్యాణి, యడుగుగెందమ్ముల ◆ నమరు రజము
సాలివోని మినుకులు ◆ సొలుచు నేసుచరిత్ర, ముకుపుటమ్ముల దాఁకి ◆ మొనయుగాడ్పు
తెల్లజేజేల శ్రీ ◆ లెలయు నేపరదేవి, యిచ్చమున్నీటఁ బె ◆ ల్లెగయు తరఁగ
లలమేలు మడమె ◆ ట్లలరు నేజనయిత్రి, యెలగడగంటి చూ ◆ పుల కొటారు
లట్టి హరిదేవి భువనావ ◆ నానురక్తిఁ, గలికురక్కసితెగల యా ◆ గడ మడంప
వేల్పుగమికోర్కిపంట నా ◆ వెలసి నీవు, కన్నెవై తోఁచె విజ్ఞాన ◆ కలితమూర్తి.

ఉ॥ పుట్టె నయోనిజత్వమున ◆ భూమిజవై భువనప్రసిద్ధిఁ జూ
పట్టె భవత్తనూజయన ◆ భావము పొంగ హృదబ్జపీఠికం
బట్టె నుపేంద్రునంఘ్రియుగిఁ ◆ బెంపెసఁగన్ స్వజనాఘజాలము
న్మొట్టి యిడెన్ జగంబులకు ◆ మేలొనరించెదు నింక భూవరా. ౨౫౮

ఆ॥ ఆమె యెప్పుడుఁ బాయ ◆ దచ్యుతు నచ్యుతుం, డామె నెపుడుఁ బాయఁ ◆ డాదరమున
వారి యోగగరిమ ◆ వఱలు వాగర్థాను, బంధ మెట్టు లటులె ◆ పార్థివేంద్ర.

క॥ ఏయవతారము హరి గను, నాయవతారమున కర్హ ◆ మగు రూపున న
త్తోయజవాసిని తోడ్పడు, నేయెడ ననపాయినియె న ◆ యించుచునుండన్.

ఆ॥ లోకమాత నీవె ◆ నో నెఱింగి యెఱుఁగ, కేని నొడ్ల కేరి ◆ కిత్తుననినఁ
ద్వాద్రసజ్ఞ వ్యర్థ ◆ దశ నొందునని మున్ను, తెలుప వచ్చినాఁడ ◆ దేటపడఁగ. ౨౬౧

క॥ కావున హరియుం బూరుష, భావమున జనించె జగతి ◆ భద్రయశుం డా
శ్రీవరున కాకె నిడి మే, ల్గావింపు మెఱింగి దానఁ ◆ గనియెదు శుభమున్.

శా॥ ధన్యత్వంబు త్వదీయ మాదిఁ బరిణ ◆ ద్ధం బయ్యె సౌజన్యభూ
జన్యానల్పఫలంబు గాఁగ నిపుడీ ◆ జ్యాపుత్రి నీయందసా
మాన్యంబై కనుపట్టఁ జేసె గురుధ ◆ ర్మం బీ వనన్యస్థితిం
గన్యాదాన మొనర్తునంటి తనయా; ◆ క్ష్మాపాలమాత్రుండవే. ౨౬౩

తే॥ పోయివచ్చెద నన్న నీ ♦ పొందు లెస్స, నెగడుగను ముజ్జగంబుల ♦ నీయశంబు
మమ్ముమఱవకు మన్న న ♦ మ్మౌనివరుని, మన్ననలఁ దన్పి వీడ్కొల్పి ♦ మఱలి వచ్చి

వ॥ వసుంధరావల్లభుం డవ్వాచంయమవరేణ్యుని వచనకలాస్ఫురణంబు మున్నుగాఁగ స్వకీయంబగు భాగధేయంబుం బ్రశంసించి మించిన వేడుక ననంతరకర్తవ్యతావిచారమథ్యమానమానససముద్రుండై నిర్ణిద్రవివేకపరిపాకంబున నుపాయాంతర ప్రబోధామృతం బుపలక్షించి యపారతపస్సమారంభంబున నన్నుఁ బ్రసాదసనాథునిం గావించి ప్రాక్తనసంచిత మదీయానుగ్రహసంగ్రహవిలసనంబును సమంచితామేయమహామహిమ వికసనంబునుఁ బ్రపంచితాశేష దుర్జననిరసనంబును నగు శరాసనంబు పరిగ్రహావశ్యంబుగా నొనరించి సమగ్రభక్తిరసాతిరేకంబున రాణించి యొక్కవిశాల భద్రశాలం బ్రతిష్ఠాపనవిధిపూర్వకంబుగాఁ నుంచి పూజించి ప్రాంచితామోద మహోదయంబున మంత్రిసామంతహితపురోహితాది నిజవర్గంబు రావించి గారవించి తద్గోష్ఠిం బ్రవేశించి యాత్మీయమనోరథాభిధేయంబు జగదేకమంగళానుశాసనవిధేయంబు గా నిట్లనియె. ౨౬౬

మ॥ తన మేటెట్టిదొ యజ్ఞభూమిఁ గదలం ♦ ద్రవ్వించుచో భవ్యభా
వనవోల్లాసిని సద్గుణాశ్రయ దయా ♦ వర్ధిష్ణువు న్మంగళాం
గి నమేయోత్సవ మత్తపస్సుకృతల ♦ క్షిస్రంబోని కన్నం గనం
గని దాని న్నుతనిర్విశేషముగ వే ♦ డ్కం బెంచుచుంటిం గదా. ౨౬౭

ఆ॥ మన మనంగ నేల ♦ జనమెల్ల సంబంధి, భిన్నమయ్యెఁ బ్రేమ ♦ పెచ్చు పెరిఁగి
యీమె వలను దొరయ ♦ నీక్షించు నల వర్ధ, మానశశికలాభి ♦ మాన మెసఁగ.

క॥ జనరాజి పొగడ నింతిం, తనరాని మమత్వ మెలమి ♦ హర్షము దయయుం
దనరార మమ్ముఁ దేర్చును, గనరా దీయమ్మమహిమ ♦ కల యెవ్వరికిన్. ౨౬౮

మ॥ నవలామానిక మానెలంత కిపుడా ♦ న్నత్యాఢ్యమై యావనో
ద్భవ మొప్పె న్ననుదావి మేలిరుచి హ్మా ♦ ద్యప్రజ్ఞయు న్మిఱఁ ద
ద్భవికశ్రీల నపూర్వఁ గాంచనమయి ♦ న్బ్యాంచాలిక న్మించెఁ జెం
దొవవిందు న్వనుద్రొక్కి మోమెసఁగుశే ♦ దుస్సాధమై యుండునే. ౨౬౯

తే॥ కలిమిచెలి మేలి చెలువుల ♦ కలిమిబలిమిఁ
బలుకుసతి తొలుఁబలుకు నాఁ ♦ బలుకునియతిఁ
జిలువరాదాల్పు చెలువ రా ♦ జిలు వయసున
నిమ్మహిని సాటి యెద్ది శ్రీ ♦ నిమ్మహినికి. ౨౭౦

క॥ ఇమ్మహిలామణి కియ్యెడ, నెమ్మి వివాహ మ్మొనర్ప ♦ నేనెంచి సుహృ
త్సమ్మతుఁడగు వరుఁ గాన మహిఁ, గ్రుమ్మరుచున్నాఁడఁ జుండ ♦ కుంఠితబుద్ధిన్.

ఉ॥ ఇన్ని దినంబు లేమఱక ♦ యే మతి నేగతి నూహ సేసినం
గన్నియ మెచ్చ వచ్చు ద్విజ ♦ గన్నుతుఁ గాన సమానరూపశే
ఖ న్నలువొందువానిఁ గనఁ గా నగునా ననుమాన మన్నచో
నిన్నలినాక్షి సద్గుణము ♦ లేరికి శక్యము తాఁ గణింపఁగన్. ౨౭౩

ఆ॥ చెలువు శ్రీపదంబు ♦ చెయ్వు లనంతంబు, లచ్యుతంబు భావ ♦ మానసంబు
విధుమయంబు చిత్త ♦ విధము సంవిత్ప్రభ, మజితకీర్తి యరయ ♦ నబల మూర్తి.

క॥ కావున నేనొక సమయము, గావింపఁ దలంచినాఁడఁ ♦ గని మీరును సం
భావింప వలయు నేయెడ, మీవల మద్భార మెల్ల ♦ మేకొని యుంటన్. ౨౭౪

మ॥ హరబాణాసన మర్హణీయము మదీ ♦ యాగారమం దర్హణన్
గరిమొప్పన్ గిరివోలె మించుఁగద వే ♦ డ్కం దాని నెవ్వాఁడు త
త్పరతం జేకొని మౌర్విఁ గోటి నెనయం ♦ దార్చు న్మహాత్ముం డతం
డిర నా కూరిమియల్లుఁ డాఘనున కే ♦ నీకన్నె నర్పించెదన్. ౨౭౫

క॥ ఇది నానిశ్చయమన నె, మ్మది సమ్మద మొదవ లోక ♦ మాన్యులు మీరె
య్యది గూర్తు రెద సదియు కుదు, రదనగు సంపదల కెల్ల ♦ నని రయ్యనఘుల్.

వ॥ ఇట్లు కృతప్రతిజ్ఞుండై. ౨౭౭

సీ॥ అఖిలదేశాధీశ్వ ♦ రాస్థానులకు వార్త, లెఱిఁగించి వారల ♦ యెఱుక గాంచి
యిష్టదైవతపూజ ♦ లెల్లరు జరుపంగ, నియమించి తానును ♦ నియతి మించి
పురి నంతిపురి శ్రీలఁ ♦ బొసఁగింప మదిఁ బ్రీతి, హెచ్చించి తనవారి ♦ హెచ్చరించి
యభ్యాగతులఁ గొల్చి ♦ యలరించు జనులందు, మెప్పించి యవ్వారి ♦ మెప్పు గాంచి
చలువపందిళ్లు చాందినీ ♦ ల్కలువడములు
మంచె లవసథములు మహా ♦ మార్గములుఁ జొ
కాటముగ సంతరించి య ♦ మ్మేటి వరుని
రాకకై వేచి యుండెఁ బ ♦ రాకు లేక. ౨౭౮

తే॥ ప్రాయ మటుగన్న తన కన్నె ♦ పద్మనయనుఁ
గాని వరియింపదఁట దైన్య ♦ మూనఁ బోక
తాను నావిల్లు పణముగాఁ ♦ దార్చెనఁట గి
రీంద్రకులవర్ధనీ ; యిది ♦ యేటి వెరవొ. ౨౭౯

క॥ అది యట్టిద యగు శ్రేయం, బొదవెడు నానాఁటి తలఁపు ♦ లొరులకు నేనిన్
జదవీచ్యుతము లనం దగుఁ, బొదలికగనుఁ బిదప సిరులఁ ♦ బొల్చు గుణాఢ్యా.

తే॥ కావర మొకింతయునుఁ గాన ♦ కావరణము, ధీ వరమహాసిఁ దొలిచి సు ♦ ధీవరగతి
శ్రీవరదయాప్తిఁ గాంచు సు ♦ శ్రీవరధృతి, దీవరము నొందు వాఁడె యిం ♦ దీవరదృశ.

క॥ అయ్యేలనాగ యుదంతం, బయ్యెడ వినవయ్యె ధర ధ ♦ రాధిపతులకున్
దియ్యవిలుకాని గుణరవ, మొయ్యనఁ దోఁగొనఁగ నెడఁద ♦ లుయ్యేల లూఁగన్.

ఆ॥ ముజ్జగముల మోహఁ ♦ పుందీవఁ గన్నియ, విన్నవారి చెవులు ♦ వినవు దేనిఁ
గన్నవారి కనుల ♦ గతియేమొ మఱఁ జూపుఁ, డాత్మవృత్తితృప్తి ♦ యతని కగునె.

తే॥ జానకీనామ మంత్రరా ♦ జప్రసక్తిఁ
దవులఁ జెవ్వాఁడు తద్రూప ♦ మవధరింపఁ
జెవ్వఁ డాత్మఁ దత్పదసేవ ♦ నేచ్ఛ మనఁడు
జగతి నెవఁ డప్పు డాస్మర ♦ శాసనమున. ౨౮౪

క॥ వచ్చెడు వా రచ్చాపము, మెచ్చెడువా రాత్మసత్త్వమితి తద్ధృతి కం
దిచ్చెడువా రూర్పులఁబోఁ, బుచ్చెడువా రైరి వీర ♦ పురుషులు భువిలోన్. ౨౮౫

ఆ॥ రాజకోటు లట్లు ♦ రా మ్రొగ్గె నట ఫణి, స్వామి భరము దోఁపఁ ♦ గామఁ జెగచి
వాఁడి వృత్తికోటి ♦ వఱలె నొక్కని విధ, యడఁచు నొకనిఁ జేర్చు ♦ నంబరమున.

క॥ కిన్నరగరుడోరగముఖు, లు న్నెలఁతకుఁగా ధనుర్వి ♦ లోడనకాంక్షం
బన్ని పడిరి బన్నము లట, పిన్నఁదనము గదురఁ బెరువు ♦ వెదకిరి తెరలన్.

తే॥ ఒదవెఁ బెక్కులు సిలుగు ల ♦ య్యువిదఁ గోరి
రాజులపై నెత్తి వచ్చిన ♦ రాచవారి
కతిన దైవబలంబునఁ ♦ గాంచె నతఁడు
విజయ మాఖ్యల సిరి యేల ♦ వెలయ దబల. ౨౮౬

మ॥ కలధౌతాచల మస్మదీయ మెటులా ♦ కంపింపఁగాఁ జేసె న
ట్లలఘుప్రాభవ మొప్ప నిద్ధనువుఁ దూఁ ♦ గాడింప నుంకించి యు
త్కలికం దాఁకె రావణుండును జగ ♦ ద్వైకల్యసంపాది వీఁ
డలఁతిం బోఁడని యెల్లరుల్కఁగ విదే ♦ హస్థాన మం దద్రిజా. ౨౮౭

తే॥ వచ్చి తన లావు బీరమ్ముఁ ♦ బిచ్చలింపఁ
గడిఁది సింగాణిఁ బొదలింపఁ ♦ దొడఁగి బడలి

వింశతిభుజుండు వెరవేది ♦ వెలుకఁబాత్రె
దైవబల మెక్కుడో శైల ♦ దేవతనయ. ౨౯౦

మ॥ కలితౌజుండు శఠుండు వాఁడు జనక ♦ క్ష్మానాథుపై నల్గఁడే
వల నీక్షింపఁడు సోఁకు వెన్కొనినతే ♦ వఁ జాతె నేమందుఁ జం
చలతాపాది మనోజుఁ డాకె త్రిజగ ♦ త్సంమోహినీవిద్య యో
గలసద్వైభవుఁ డాన్నృపాలుఁ డిఁక ని ♦ క్కం బెన్న సామాన్యమే. ౨౯౧

ఆ॥ వాఁడు లంక కరిగి ♦ వలపు పైఁగ్రమ్మిన, యువతి ప్రథితి నెంచు ♦ నుస్సురంచుఁ
గలవరించు నీమె ♦ కమల గానోపు నం, చూహఁ జెంచు నెడఁద ♦ నూరడించు.

తే॥ తజ్జగన్మాతృతాస్మృతి ♦ దానవేంద్రుఁ, డొందెఁ బ్రకృతి ననంతర ♦ ముర్విపతియుఁ
బ్రకృతులు నతండు దెరలుటఁ ♦ బ్రాగ్విరోధ, నిగరణాసక్తి సీతయు ♦ నిర్మలాంగి.

ఆ॥ పుడమి యొడయ లెల్లఁ ♦ బొలివోయి రెందునుఁ
గానరాదు తమ్మి ♦ కంటి వాదు
దైవ మెద్దిసేయుఁ ♦ దలఁచెనో ; యని మది
నెంచుచుండె నృపతి ♦ యేణనయన. ౨౯౪

ఉ॥ భావిని, భావమెల్ల హరి ♦ పట్టుగ నేర్పడఁ గూర్ప దెద్దియుఁ
భావజుఁ డెంతవాఁడు రతి ♦ ప్రాపుగ నోపెఁ జరింప నయ్యెడఁ
వావికి లేమిలే దజితు ♦ వంకకె తార్చెదు నన్న మోసగాఁ
డీవెర వ్రూఁది పాలిడునొ ♦ యేవిధి నేదశ చంచలాక్షికిఁ. ౨౯౫

ఆ॥ మున్ను ముజ్జగముల ♦ ముంపఁ దేల్పఁగ నెద్ది
మోహావిద్యలనఁగ ♦ మొనసె నట్టి
తనులతాంగి మనుజ ♦ తనువొంది కనుగంటె
నతనుధాటి సూటి ♦ యై మృగాక్షి. ౨౯౬

తే॥ అజితుఁ డితఁడన హరినీల ♦ మనినఁ గృష్ణ
పక్షు మిదియన మాధవ ♦ ప్రాప్తి యొదవె
నన్నఁ బురుషోత్తముఁ డితం డ ♦ టన్న నులుకు
నామె ప్రియ నామయుక్తి హి ♦ మాద్రితనయ. ౨౯౭

తే॥ మాధవీపురుషోత్తమ ♦ మహ మొనర్తు
మెల్లి యని కూర్చుచెలి వల్క ♦ నెట్టులెట్టు
లని పలుకరించు సొలయు నె ♦ య్యంబు సూపుఁ
దనదు మేలేమొ యను నాస ♦ దవిలి వెలయ. ౨౯౮

క॥ ఎంద వతరించె హరి ముచ్చి, కుందవరదు నెపుడు విందుఁ ♦ గూర్తు నెటులు గో
విందున కెన్నఁడు వచ్చు ము, కుందుఁ డజితు పొందు మేలు ♦ గొన నెది యదనో

ఆ॥ ఎప్పుడెప్పు డింక ♦ నిభరాజవరదుఁ డీ, త్రోవ దివ్యమంగ ♦ ళావతార
మూర్తికలన వెలసి ♦ మునుకొని నాకన్ను, దోయి కుత్సవంబు ♦ సేయునొక్కొ.

సీ॥ తొగఱేని టెక్కు ద ♦ క్కగ మించు నెమ్మొగ, మనుబంధిదృక్చకో ♦ రాలి మనుప
వినుమానికము తాఁపు ♦ గొను మేని బలుతేజు, చిమ్మచీఁకటిపిండు ♦ చెట్ట దెలుప
నెనరులచ్చి బిడారు ♦ నెఱి గాంచు కనుదమ్మి, లాశ్రితాళుల దైన్య ♦ మపనయింపఁ
బిన్ననవ్వుల గూడి ♦ పెనుఁబొందు వాగ్ఝరి, శ్రుతివృత్తి విబుధుల ♦ సొలయఁ జేయ
నిం దరుగుదెంచి తన కూర్మి ♦ హెచ్చరించి, లలి జనకరాజగోష్ఠి న ♦ లంకరించి
శివశరాసన మెక్కిడు ♦ సిరులు నించి, నన్నెపుడు గైకొనునొ జగ ♦ న్నాథుఁ డెలమి.

చ॥ అని తలపోయు నెమ్మది న ♦ హర్నిశముం దన కూర్మిపెంపఁ బెం
చిన శుకశారికాళి దరిఁ ♦ జేరఁగనీ దనరాదు వాగ్విలా
సనవనవోదయోల్లసిత ♦ సత్కవితాకలనాచమత్కృతుల్
గన రెఱఁగించె నిట్లవని ♦ కన్నియ యన్నిట సన్నుతాంగిరో. ౩౦౭

క॥ ఎం దరిగెదు నిలునిలు గో, విందయనుచుఁ జెలియ నాఁగు ♦ విదితము మఱపుం
గ్రందుకొన హరి స్మరించును, మందగమన పరవసంబు ♦ మఱుఁ గఱసేయున్.

తే॥ చానమై మరుధాటిఁ గా ♦ ర్శ్యంబు గదుర, నంతకంతకు జగి యెక్కు ♦ డై తనర్చె
సాన నిడి చక్కఁజెక్కిన ♦ మానికంబు, సన్నవడి తళ్కులీనెడు ♦ చందమునను.

క॥ ఒకపరి నిద్దుర వోడమిన, సకలేశ్వరుఁ గౌగిలింపఁ ♦ జనునొకొ యని య
య్యకలంకచంద్రముఖి వే, డుక సేయు సుషుప్తి కెక్కు ♦ డుగ నుల్లమునన్.

చ॥ కని నెఱజాణలౌ సఖులు ♦ కన్నియ మోహఁపు జిన్నెలెంచి య
క్కునఁ జెలిఁ దార్చి యోడకుము ♦ కొమ్మరొ ; యింకిట నేఁట రేపటన్
గొనబులమేర నీమదికిఁ ♦ గూర్చు మగం డిటరాగలండు త
క్కునె రతనంబు గైకొనక ♦ కోమలి తత్పరుఁ డెన్నఁడేనియున్. ౩౦౮

తే॥ అనువుపడ దెట్టు లిటమున్న ♦ యతివ నీదు
కోర్కి జనకు ప్రతిజ్ఞయుఁ ♦ గొఱఁత లైన
హరి నెనరుకల్మి చూ లెస్స ♦ యబ్ధి ద్రచ్చి
యమృత మెనయంగ నయ్యెన ♦ య్యనశనులకు. ౩౦౯

ఉ॥ కానఁ బ్రయత్నగౌరవము ♦ కాలము దైవముఁ గూడ నెంతయుఁ
దానె ఫలించుఁ గర్జ మిటు ♦ తామస మందుట గూడునమ్మ శ్రీ
జాని భజించు టొక్కటియ ♦ చాలునుఁ దక్కటి మానుమమ్మ యి
మ్మానితమూర్తి కింత వ్యథ ♦ మానగునమ్మ సతీవతంసమా. ౩౦౮

తే॥ తనువు గృశియించెఁ గోర్కులు ♦ తరము మీఱె
నతనువేత లంతకంతకు ♦ నతిశయిల్లె
నన్న మనరా దనఁగ నయ్యె ♦ నబల యింక
నిన్ను నీవ యూరార్పంగ ♦ నెలవు సుమ్ము. ౩౦౯

ఆ॥ ఉర్విఁ బొడమినావ ♦ యోనిజవై యోగ, మహితుఁ డైన జనకు ♦ మనువు గంటి
వమ్మ నీదు మహిమ ♦ మరయ నసామాన్య, మిట్టినీవు ధైర్య ♦ మెడలు టలఁతి.

ఉ॥ ఇంతకుమున్నె పుట్టినతఁ డేలిక గావలె నిక్క మింతెకా
కింతటఁ బుట్టఁ బోఁడు గదె ♦ యింతిరో నీకు మగండు తాత దా
నంత జడుండె నీవిభవ ♦ మాఱడిపుచ్చునె లచ్చిఁబోని ని
న్నంతుని యబ్బఁ గూర్పనగుఁ ♦ గాని యొరు న్ఘటియింప నెంచునే. ౩౧౧

చ॥ మహితము నీచరిత్ర మను ♦ మానము మాను మొకింత తాపు మే
మహిళల కందరాని బుధ ♦ మానితవైభవ మబ్బు నీకు స
న్మహముల కీవ తానకము ♦ నా నెగడొందెదు తల్లి లక్షణ
ప్రహితము లయ్యె భావిఫల ♦ భావవిశేషము లెల్ల భంగులన్. ౩౧౨

వ॥ అని యిచ్చెలువున నెచ్చెలులుం దల్లియు నాప్రబోధాత్మిక బోధించికలఁక మాన్పి
యమందమకరందనిష్యంద సందోహతుందిలీకృతేందిందిరబృంద సందానితానూన
గాన మాధురీధురీణాకర్ణమనోజ్ఞతానిదాన మాధవీమల్లికామృద్వీకాదివల్లికామతల్లి
కావేల్లిత సహకార బీజపూరనారికేర జంబుజంబీరశారదరంభా పనసదాడిమనా
రంగలవంగకుడుంగక దంబకదంబక రసాంచితఫలాహార సముపహార హారి శారికా
శుకపికాదికద్విజనికర మృదుమధురసూక్తివిశేష రచనానుమితావిరతవనరమా
మాధవసమాగమ మహోత్సవసంరంభజక్రిబృంభిత నీలకంఠలాస్యక్రియావిలాస
భాసుర సురవిపినకల్పానల్పాభిరామ గృహారామవిహారంబులవలననుఁ బ్రఫుల్లహ
ల్లకకల్హార కైరవేందీవరసారసకేసరపరాగవిసరధూసరితమృణాలికాపాలికా డోలి
కాందోలనచణరాజహంసగణ గరుదంచలప్రచాలనసంజనితపవమానకందలస్పంద
నోద్బృంహిత మారవికార త్వరమాణ కోకమిథునసమాశ్లేషణ కలనోచ్ఛలిత
రాజీవరాజీ తనూధాళధళ్య స్పర్శనోద్భ్రాంత షట్పదపక్షవిక్షేపచాకచక్య సంవ

లిత హరినీలోపలశంకావహ గంధవచ్ఛీతలవిమలసలిల సలీలతరంగరంగిత కమలా కరకేళీవినోదంబుల వలనను ధాతురాగమండలమండిత కటకస్థలీరుహ మహీరుహ విటపాగ్రవేల్లల్లతాలతాంతసంతాన సంతానితనూతనాతపత్రాంచిత చమరీమృగవాలవ్యజనవీజనకలావైభవోన్నిద్రతాక్షుద్ర వివిధమహారత్నస్థగితశాతకుంభనితంబశుంభదభ్రద సింహాసనోపలక్షిత ప్రశస్తశబ్దప్రధానసత్త్వద్విజస్త్రీ సమాజ పరివేష్టిత క్రీడాశైలరాజ్యాభిషేక సూచకహిమాంబుపూర నిరంతర నిర్ఝరపరీవాహ సందర్శనంబుల వలనను జనకదుహిత యుల్లంబు పల్లవింపం జేయుచుండ నద్దేవియు నారాయణచరణనలినధ్యానపరాయణయై తదీయార్చనల బ్రాహ్మణ సమారాధనంబులం బ్రొద్దు పుచ్చుచుండె నియ్యది యయ్యోగమాయాభ్యుదయ ప్రకారంబు. ౩౦౩

క॥ అని శంకరుఁ డెఱిఁగించిన, విని శాంకరి యవల రాము ♦ వృత్తాంతము విం దు నెనరుకలిమిఁ దెలుపు మం,చనఁ గౌఁగిటఁగ్రుచ్చెఁ బ్రమద ♦ మంది రిరువురుఁ

ఉ॥ పావనచిద్రమావిభవ ♦ పాలితలోక విలోకనామృత
శ్రీవిలసద్విశిష్టజన ♦ చింతితభావ మహానుభావ సం
భావితనిత్యసౌఖ్యపరి ♦ భావితదుఃఖ నిరస్తమోహదృ
క్కేవలగమ్య శ్రౌతపథ ♦ కీర్తితసంపదధీశతాంచితా. ౩౦౪

క॥ మాయాదూర వశీకృత, మాయా మాయికజనాప ♦ మార్గవిదలన
శ్రేయఃప్రదాన నిపుణ, శ్రీయుతమూర్త్రిత్రయాను ♦ శిష్టవిశేషా. ౩౦౫

తోట॥ అనిలానలభానుసు ♦ రాధిపమృ, త్యునివిష్టవిభుత్వని ♦ యుక్తిభయా
వనహేతుకతాప్రతి ♦ పాదిసనా, తన సర్వమహేశ్వర ♦ తావిభవా. ౩౦౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగవైద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమునం జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### —♦ పంచమాశ్వాసము ♦—

—:(౦):—

శ్రీమన్మునీంద్రవర్ణిత
ధామా, సోమాదిమూర్తి ♦ తాస్ఫురణాంచ
ద్భూమానందవిలసనో
ద్దామశ్రీరామ నంది ♦ తపరంధామా. ౧

### —♦ విశ్వామిత్రాగమనము ♦—

తే॥ అవధరింపుము గట్లరా ♦ యనియనుంగు
పట్టి కిట్లనుఁ దపసిక ♦ న్నాపదాల్పు
మహిమ మహేంద్రుని కల్పభూ ♦ రుహము లనఁగ
నక్కొమరు లట్లు ప్రబలు న ♦ య్యవసరమున. ౨

సీ॥ విద్యుల్లతల గుంపు ♦ వెనుద్రొక్క బయలెక్కె, నన జడల్తళతళ ♦ మనినటింపఁ
బూర్ణచంద్రోదయ ♦ స్ఫురణమై నెమ్మోము, చూచువారల మేలు♦చూచుచుండ
స్ఫటికాక్షమాలికా ♦ చాకచక్యము చిత్త, వైశద్యమునఁ గొన్న ♦ వన్నె నొడువ
ముజ్జగంబుల నొక్క ♦ మొగి మోవఁగల నిదె, పండెంబనుచుఁగక్ష♦పాలపెనఁగఁ
గనియెదఁ బరార్థ మిటులను ♦ కలికిహొయలు
దెలుపు చిఱునవ్వు నల్దెస ♦ ల్దివియఁగవియఁ
బెద్దకాలంపుఁ దపములఁ బేరు గాంచి
నట్టి రెండవస్రష్ట తా ♦ నరుగుదెంచె. 3

ఆ॥ అట్లు దారసి ద్వార ♦ గాధ్యక్షులం గాంచి
కౌశికుండు తపసి ♦ గాధిసుతుఁడు
దర్శనార్థి యగుచుఁ ♦ దా వచ్చె నని తెల్పుఁ
డరిగి జనవిభున క ♦ టం చనుటయు. ౪

క॥ వారు ససంభ్రములై పరి, వారాంచితు నృపతిఁ గాంచి ♦ వడఁకుచు నె తప
శ్శ్రీ రాజిల్లెడు గాధికు, మారుఁడు చనుదెంచి తెలుప ♦ మ మ్మనిచె ననన్. ౫

క॥ ఆకౌశికముని రాకడ, నాకువలయభర్త విని మ ♦ హామోద మెదం
జేకూరఁగఁ జేకూరెఁ గ, దా; కల్యాణ మిటులనుచుఁ ♦ దత్పరుఁ డగుచున్. ౬

ఆ॥ సభ్యు లెలమిఁ దోడఁ ♦ జను దేర సపురోహి
తుం డతండు ప్రీతి ♦ దోరసెఁ దపసి
వాసవుండు బ్రహ్మ ♦ వలనున కెదు రేగు
కలిమి వెలయఁ జిత్త ♦ కనుల మెలయ. ౭

తే॥ చేరి సాఁగిలఁబడి మ్రొక్కి ♦ చెలఁగి యుబ్బి
పాద్య మిడి యర్ఘ్య మర్పించి ♦ పలుదెఱఁగుల
యర్చన లొనర్చె గోభూష ♦ ణాంబరంబు
లర్పణముసేసి వికసితా ♦ స్యాబ్జుఁ డగుచు. ౮

ఆ॥ శాస్త్రదృష్ట పూజ ♦ సంయమీంద్రుం డందఁ
గాంచి తృప్తి మించి ♦ కలన లెంచి
కుశల మవ్యయంబె ♦ కూర్చుసప్తాంగము
లందుఁ గొల్చువారె ♦ యంద ఱెలమి. ౯

క॥ సన్నతులై యుందురె వి, ద్వన్నత; సామంతు లెపుడుఁ ♦ బగతులు జితులై
నిన్నె నయుదురే కదసం, పన్నత నీకింద్రునకు వి ♦ భాగము గలదే. ౧౦

ఆ॥ దైవమానుషములఁ ♦ దద్దయుఁ బెద్దయౌ
రీతి శుభగతి న్వ ♦ రింతుగాదె
పరఁగు గురుఁడు నీకు ♦ బ్రహ్మజ్ఞుఁడు వశిష్ఠుఁ
డనఁ గొఱంత లున్నె ♦ యవనినాథ. ౧౧

క॥ అని పలుకుచు నె వశిష్ఠుని, మునిపుంగవుఁ గలిసి మేలి ♦ ముచ్చట లలరన్
మునుకొని కుశల మడిగి స, న్మనులఁ దదన్యులను నల్లె ♦ మానించుటయున్. ౧౨

తే॥ అందఱును సంతసం బంది ♦ యమ్మహాత్ము
నర్ఘ్యాణలు పొసఁగం గొని ♦ యరుగుదెంచి
సికులఁదనరు నృపాస్థానిఁ ♦ జేర్చి ప్రాంచి
తాసన మొసంగి కూర్చుండుఁ ♦ డని వచించి. ౧౩

క॥ ఆయన యనుమతిఁ దారునుఁ, బాయని కుతుకమునఁ దగిన ♦ పల్యంకికలన్
శ్రీయుతులై నెక్కొనఁగన్, శ్రేయోర్థి విభుండు మౌనిఁ ♦ జేరి ప్రసక్తిన్. ౧౪

క॥ నిటలతటీఘటితాంజలి, పుటుఁడై పటుభక్తియుక్తిఁ ♦ బొదలుచు నటుల
జ్జటిలవరు నెదుట నిలిచి యు, కుటిలత వినయాదు లల్లు ♦ కొన నిట్లనియెన్. ౧౫

చ॥ కుశలమె సంయమీంద్ర; తన ♦ కుం దనవారికి నెల్ల నాసమి
త్కుశఫలపుష్పతోయములు ♦ కొల్లలుగాఁ గలవే వనంబులన్
వశములె ఘోరసత్త్వములు ♦ వారక పండునె వన్యసస్యముల్
ప్రశమధను ల్భవాదృశులు ♦ పాటిలుచోట్లఁ గొఱంత లుండునే. ౧౬

క॥ ననుఁగన్నయన్న; యిటుభ, న్యునిఁ జేయన కోరి కాచె ♦ యొరులకు సులభం
బనరాని భవద్దర్శన, మును నాకొనగూర్చు టరయ ♦ మునికులతిలకా. ౧౭

తే॥ మృతుని ప్రాప్తి మరుస్థలా ♦ మితసువృష్టి, యప్రజాపత్యలబ్ధి న ♦ ష్టార్థలాభ
మట్లు పుత్రవివాహాది ♦ కాభ్యుదయము, నెంతు నీరాక కైన యని ♦ యే మనమున

ఆ॥ స్వాగతంబు నాగ ♦ సందియంబె మునీంద్ర; , పాత్రిభూతు నిన్నుఁ ♦ బడసినాడఁ
నేకృతి న్ఘటించి ♦ యేఁ గృతార్థుఁడ నౌదు, నో; యెఱుంగ దాని ♦ యున్నరూపు.

ఉ॥ పావనవృత్తి నీజగతి ♦ బాలన సేసితి సత్తపస్సుసం
భావనఁ జేసి యేలె దిటు ♦ బ్రహ్మఋషిత్వమహాస్పదంబు మ
ద్దైవత మీవ యంచు మదిఁ ♦ దద్దయు నెంతుఁ దలంతుఁ ద్వన్నమ
స్యావిధినిల్వ నయ్యది శు ♦ భాయతియై సమకూరె నేఁటికిన్. ౨౦

తే॥ అభ్యుదయమున కిదియె మ ♦ హాభ్యుదయము
నద్భుతంబుల కెల్ల మ ♦ హాద్భుతంబు
ననఁగ నెగడొందు దీని నే ♦ నందినాడ
నెన్నరాని శుభాస్పద ♦ మెక్కినాడ. ౨౧

క॥ తన జన్మ మయ్యె సఫలము, తన జీవితమే సుజీవి ♦ తంబనఁ దగె నీ
తనికి స్వధర్మమె ధర్మం, బన నొప్పెఁ ద్వదాగమనమ ♦ హాయోగాప్తిన్. ౨౨

ఆ॥ పూర్వపుణ్యమునన ♦ పొనరెఁ గాఁగల సిరి
కిదియె హేతు వఘము ♦ నేర్చుచున్న
దిపుడు గాన నన్ని ♦ యెడల నన్నుఁ గృతార్థుఁ
గా గణించె యుష్మ ♦ దాగమనము. ౨౩

మ॥ భవదీయాగమ సుప్రసాదకలనం ♦ బ్రాపించె సర్వంబు న
న్దవులంబోదు కొఱంత నెంతయుఁ బ్రమో ♦ దంబబ్బె నైన న్నృపుం
గవియం బోలదు తృప్తి యందు రదియాఁ ♦ గాకున్న మచ్చిత్త స
స్యవికాసం బెటు త్వద్వచోఽర్థరసవ ♦ ర్షం బందకున్నందగున్. ౨౪

క॥ మునిసార్వభౌమ రాజ్యం, బును నను నావారి మంత్రి ♦ ముఖ్యుల సర్వం
బును నీకొసఁగితి నిటకే, పనిఁగొన నేతెంచితనఁ ద ♦ పస్వి పొదలుచున్. ౨౫

క॥ తా నిట్లనె రఘుకులజది, శానాగముతోడ సంత ♦ సము వెల్లువగా
మానగు చిఱునగవున మో, మానెఱి వెన్నెలలుగాయ ♦ నా నెల గాఁగన్.

సీ॥ మేలయ్యె నీకాన్పు ♦ మిహిరవంశమణీ ; ప్ర, కామర్థులకుఁ దాన ♦ కంబు గాఁగ
మానేమ మడిగితి ♦ మా కేల వాటిల్లుఁ, గొఱఁతలు నీప్రోపు ♦ గొమరు మిగుల
మున్నె కృతార్థుండ ♦ విన్నెఱ్ఱఁ గాకున్న, బ్రాఁతియే మారాక ♦ ప్రస్తుతింప
విబుధేశ్వరున కింటి ♦ విందువ కూర్చు నీ, కలఘుతపోనిష్ఠుఁ ♦ డగు వశిష్ఠుఁ
డర్థులకుఁ బ్రాణమైన స ♦ మర్పణంబు, సేయుకే యమ్మహాత్ముని ♦ శిక్ష మెలఁగు
నీకొలమువారి కెల్లను ♦ నియత మింత, పట్టు చెల్లమ యిది రిత్త ♦ వాదుగాదు.

ఆ॥ ఎదిరి కష్టసుఖము ♦ లెఱుఁగని రాజన్యు, లుదరపూరణమున ♦ కున్నవారు
వారిఁ జెప్ప నేల ♦ వారిజాప్తకులాబ్ధి, కల్పభూజ మీవు ♦ గలిగి యుండ. ౨౭

మ॥ కలవే; లోకము లేలువారి నెపుడుం ♦ గన్నారఁ గన్నార మి
య్యలఘుప్రాభవ మాదరోక్తి వినయం ♦ బౌదార్య మానందసం
వలనం బంచితతేజ మచ్ఛయశ మ ♦ వ్యాజస్వభావంబు వా
రలయం దొక్కెడ నైన భానుకులమూ ♦ ర్ధన్యుండ నీకేతగున్. ౨౮

తే॥ అబ్బురం బయ్యెనయ్య నీ ♦ నిబ్బరంపుఁ
బ్రేమ గనినంత నేముఖ ♦ ప్రీతివాడ
గాను నీసుకృతంబెన్న ♦ లేను మామ
కాగమనహేతు వింక నో ♦ యధిప వినుము. 30

—♦ విశ్వామిత్రుఁడు యజ్ఞరక్షణమునకు రాము ననుపుమని దశరథు నడుగుట ♦—

క॥ వినుము విని యనినయంతలు, పొనరింపు మసత్త్వసక్తిఁ ♦ బోకుము బళి; యీ
జనవిభుఁడు సత్యసంగరుఁ, డన నెగడుము గాంచు దుట మ♦హాభ్యుదయములన్.

ఉ॥ జన్న మొనర్చువేళ భుజ ♦ సత్త్వసమగ్రులు తాటకాత్మజుల్
గ్రన్న ఘటింత్రు విఘ్నములఁ ♦ గాఁచియ పెట్టుదు రాఁగి మెప్పు డే
పున్నెము దక్కనీరు రఘు ♦ పుంగవ వారినడంప రాము నా
యన్నకుఁ దోడు లక్ష్మణుని ♦ నంపుము మీఁద శుభోదయంబగున్. ౩౨

క॥ ఆశ్రమవాసుల మొనసి బ, హుశ్రమ మొందించి త్రోచి ♦ హుంకృతు లిడి తా
రశ్రములై యేగెద రి, య్యాశ్రమముల యవస్థఁ గెడపు ♦ మా నృప కృపచేన్. ౩౩

ఆ॥ ఏను యోగసిద్ధి ♦ కెక్కుడు నియమంబు
పూనినాఁడ పుణ్య ♦ పురుష యదియు
రాము కాపున నె య ♦ నామయమ్మై చెల్లుఁ
జెడగరముల పనులఁ ♦ జెడక నెగడి. ౩౪

క॥ మునుఁ గొన్ని పొనర్పఁగనే, మొనకొన దుర్మాంసరుధిర ♦ ముల వర్షింపన్
దనుజాధము లవ్వారలు, తనుకక దొరకొనఁగ వినువు ♦ దవిలిన మదితోన్. ౩౫

క॥ కోపము శాపముఁ జూపఁగ, నోపఁ దపోభంగ మెంచి ♦ యుద్రిక్తులపై
నీపాలఁ బడితి నీకుల, దీపకునిం బనిచి ముప్పు ♦ దీర్పుముకడఁకన్. ౩౬

తే॥ రాజశార్దూల; యొసఁగుము ♦ రాము జ్యేష్ఠు
శూరు దృఢవిక్రమునిఁ గాఁగఁ ♦ జొనుపు మెదను
కాకపక్షధరుం డని ♦ కాన కేనుఁ
గంటిననియునుఁ దలపోసి ♦ గంటిపడక. ౩౭

తే॥ ఎల్లరక్కసులం గూల్ప ♦ నితఁడ చాలు
దనదు తేజు మద్గుప్తియుఁ ♦ దనరుచుండ
శ్రేయ మొసఁగెద బహురూప ♦ సిద్ధికృతము
ఖ్యాతి గాంచును మూఁడులో ♦ కముల నితఁడు. ౩౮

ఆ॥ అనఘ రాముఁగాక ♦ యన్యుల లెక్కింప
రధికవీర్యు లగుట ♦ నసురు లిమ్మ
హాత్ము మ్రోల నిలిచి ♦ యడరలే రింతయు
నిజము నేఁ బ్రతిజ్ఞ ♦ నెఱపువాఁడ. ౩౯

క॥ ఆకాలపాశ మఱుమం, గా కే దొరఁకొనరు రాముఁ ♦ గదియఁగ దనుజుల్
చీకాకుపఱుచు నావలఁ, బోకార్చును వారిఁ ♦ బురుషపుంగవుఁ డనిలోన్. ౪౦

ఆ॥ చాల రయ్యె రాము ♦ చక్కఁ దా రడరంగ
నసురు లడఁగి చనిర ♦ యని తలఁపుము
పుత్రహార్దమునను ♦ బొలివోకు మీనాదు
నెఱి యెఱింగి మేలి ♦ నెగడు గనుము. ౪౧

తే॥ అధిప యెఱుఁగుదు నేను మ ♦ హాత్ము రాము
సత్యవిక్రముఁ డనుచుఁ బ్ర ♦ శస్తుఁ డనుచు
నీమహాతేజుఁడు వశిష్ఠుఁ ♦ డెఱుగు మఱియు
నెఱుఁగుదురు సుతపోనిష్ఠు ♦ లెల్లమునులు. ౪౨

ఆ॥ అనఘ ; యడుగు మిమ్మ ♦ హానుభావు వశిష్ఠు, నాతఁ డనుపు మన్న ♦ ననుపు మట్లు
గాక యున్నఁ దక్క ♦ మేకర్జమున నేనిఁ, దారు విన్నఁ దేర్చ ♦ వార కారె.

తే॥ ధర్మలాభంబుఁ గీర్తియుఁ ♦ దద్ద నిలుపు
కొనఁ దలంచేని నెచ్చుత ♦ గ్గులకుఁ జొరక
రాము నోసఁగుము నాకు బి ♦ రాన క్షత్ర
భావ మొప్పార సత్యసం ♦ పత్తి మీఱ. ౪౪

తే॥ నీ సుమంత్రుఁడు మున్నుగా ♦ నో సుమంత్రు
లెల్లరకుఁ జక్కఁ దెలిపి త ♦ దీహితమ్ము
లరయు మిది హిత మనుచు వా ♦ రొరసి నొడివి
రేనిఁ బనుపుము రాము స ♦ మీహితముగ. ౪౫

క॥ మదభిప్రేతం బదనున, నాదవ నసక్త మొసఁగుము స ♦ ముజ్జ్వలు రామున్
బదిదినముల క్రతువే యి, య్యది వెలయున్ మీఁద భద్ర ♦ మయ్యెడు నీకున్.

ఆ॥ ఒల్లఁబోవకు మయ్య; వి ♦ యోగదుఃఖ, మెంచి మంతనమున నడ ♦ రుంచఁబోకు
మనుచు ధర్మార్థసహితమౌ ♦ నట్లు పలికి, మించుముని తేజుగని విర ♦ మించుటయును.

చ॥ కుశలములైన మౌని పలు ♦ కు ల్వినినంత ధరాతలేంద్రు దు
ర్దశ గటసె న్విషాదమున ♦ రా పదనం బన నయ్యె సాధ్వసం
బళమము గూర్చెఁ గంపము మ ♦ హావ్యథయుం దలయెత్తె భ్రాంతి క
ర్కశ యని తోఁచె నొక్కగడె ♦ గార్కొనె విభ్రమమోహవృత్తులున్. ౪౬

తే॥ పన్న గని కొంతవడి కెట్లొ ♦ క్ష్మావిభుండు
విన్నఁ దన మానసమ్మున ♦ వ్రేలుకాడ

నేనోకఁడఁ జాలనే యింత ♦ కేల గోల
బాలుర నలంప నా విని ♦ ప్రౌఢమాని. ౪౯

క|| కాదయ్యా; మనవలననె, కా దయ్యాసురుల గెలువఁ ♦ గా సురలకు నేన్
వాదయ్యా వానికి గోడ, వా దయ్యాల వలఁ బంపు ♦ మాత్మజు ననినన్, ౫౦

క|| అక్షౌహిణితోఁ దగినస, పక్షులతో నెదిరి నిల్చి ♦ భంజించెద నా
రక్షోబల మెల్ల ననన్, దక్షుం డమ్మునికి మెచ్చు ♦ దలకొనకున్నన్. ౫౧

ఆ|| లోనఁ గుందికుంది ♦ దీని కే నేమందు, నేమి గొందు సందు ♦ నింక ముందుఁ
దానుఁ దపసి పెద్ద ♦ తామసి యీపసి, బాలుఁ గోరెఁ బగఱ ♦ పాలుసేయ.

ఉ|| నోఁచిన నోము లొక్కఁడుగ ♦ నూఱును వేయును రాముఁ డయ్యె నీ
యాచన యేల వచ్చె నను ♦ నక్కట కాల్పనె యెల్ల యర్థ మా
లోచన సేయ కిత్తునని ♦ లోఁబడి పల్కితిఁ నెద్దియేనియుం
దోఁచునె యాపద ల్గదిసి ♦ త్రోచెడు నయ్యెడ నెట్టివారికిన్. ౫౩

ఆ|| ఎంత పాప మొక్కొ ♦ యీనాఁటిశని యేమొ
నోటపండ్లఁ బట్టి ♦ నొడువకున్న
యంతలోనె సర్వ ♦ మర్పించితిని నూటి
కొక్కఁడైననుడిన ♦ నుచిత మనక. ౫౪

ఉ|| పండువు లుత్సవాదులు శు ♦ భక్రియ లంపుడటన్న బిడ్డలం
గొండొకయిండ్ల కంపుదురు ♦ క్రూరత మీఱఁగ మేటిరక్కసుల్
పిండుగనైరి వారిపయిఁ ♦ బెంపఱఁ దోలు మటన్న నేఁడు నా
గుండియ ఱాయొ యిన్మొ బలు ♦ గోరము నెట్లుభరింతు నయ్యయో. ౫౫

క|| పెక్కేండ్లు సంతతికినై, యక్కఱపడి జపతపమ్ము ♦ లర్పించి తుదిం
దక్కి రనుకొనిన యీసుతు, లిక్కైవడి గాఁగ దైవ ♦ మెంచెనొ తలఁపన్. ౫౬

సీ|| నాతాపము తలంగ ♦ నగుమోముసిరి నిండు, జాబిల్లి మఱపింపఁ ♦ జాలు వాఁడు
నాపంక ముడివోవ ♦ నందితోద్యత్కాంతి, నినసుతాఝరలక్ష్మి ♦ నిడెడు వాఁడు
నాదైన్యము నశింప ♦ నవనవోన్మేషాప్తి సీవిభ్రమాఁకుల తల ♦ కెక్కు వాఁడు
నాతమం బెడలంగ ♦ నాసీరగతదీప్తి, నరుణమండలిఁ బ్రోతు ♦ ననెడు వాఁడు
నామనోరథముల పంట ♦ నామహాత్మ
వామృతాంబుధి నా మేలు ♦ నా మురిపము

నా మొలకముద్దు నేఁడిట్లు ♦ గీము విడచి
రాముఁ డరిగిన నింక నా ♦ కేమిగలదు. ౫౭

క॥ తన తమ్ముకుఱ్ఱతో నా, గొనములఁ బ్రో విట్టులేగఁ ♦ గొనకొనునె యిఁకం
దనువనియును మన మనియును, మనఁగలుగుట యనియు నేటి♦మాటలు నాకున్.

తే॥ తోఁచదాయె మఱేమన్న ♦ దోసమాయెఁ
దాను వినఁడాయె దైవమీ ♦ తలఁపుదాయె
రాము నెడఁబాయ నాయెఁ బో ♦ రాము లాయెఁ
బ్రాణములు బ్రేలుటాయె స ♦ ర్వమునుఁ బోయె. ౫౮

క॥ అని చింతామయతం గొని, తన చింతామణియ యిది క ♦ దా యన కలఁతిం
గని మునివరుఁ డో నిట్లనె, మనుకులనృపతిమణి సుతమ ♦ మత్వం బలమున్.

క॥ కొంచెము కొఱఁగఁ బదాఱని, పించిన వర్షముల పిన్న ♦ బిడ్డఁడు సురలన్
గొంచెపఱుచు నసురులతో, నెంచం బోరఁగలఁ డంచు ♦ నేను మునీంద్రా. ౬౧

క॥ అక్షౌహిణీశ్వరుఁడ నై, దక్షత రక్షోబలములఁ ♦ దఱిమి గెలువ నై
యక్షముఁడ నైతి ననిన వి, పక్షుల గెలువఁ బసివానిఁ ♦ బనుపం జనునే. ౬౨

సీ॥ ఏ ధనుష్పాణి నై ♦ యేతెంతుఁ గలనిలో, సమయింతు నన్నిశా ♦ చరబలముల
నుసుఱులు మేనిలో ♦ నున్నంతవట్టునుఁ, జెలఁగనీ కవ్వారిఁ ♦ జిక్కువఱుతు
వీరె శూరులు ఘను ♦ ల్విక్రాంతు లున్నవా, రస్త్రవిశారదు ♦ లైన యోధు
లిందఱుఁ గాని వత్తు ♦ నింకఁ గొందఱఁ దెత్తు, సంశయింపఁగనేల ♦ సంయమీంద్ర
యర్భకుని రాము నకృతశ ♦ స్త్రాస్త్రవిద్యుఁ
బరబలాబలవిజ్ఞాన ♦ విరతుఁ గేళి
రతు నతులకూటయుద్ధాభి ♦ మత సురారి
కోటిపైఁ దోలఁ జాల ని ♦ క్కువము గాఁగ. ౬౩

ఆ॥ వీని వీడి క్షణమ ♦ యేని నే జీవింప, నోప డాఁపనేల ♦ యున్నమాట [యుము
సుతునితోడ మించు ♦ చతురంగసైన్యంబు, నన్నుఁగూడఁ దార్చు ♦ నయమర

తే॥ పుట్టినది మొదలుగ నాకు ♦ బుణ్యమూర్తి;
కడచె నఱువదివేలేండ్లు ♦ గడ వయసునఁ
గంటి నెట్లో యితని బిట్టు ♦ గాసినొంది
కావున మహాత్మ రాముఁ గొం ♦ పోవ జనదు. ౬౪

క॥ పరఁగిన పుత్రుల లోపలఁ, బరమిక యగు ప్రీతి యితని ♦ పై నెగడొందున్
వరధర్మమూర్తి జ్యేష్ఠుఁడుఁ, గరుణాకర; కాన రాముఁ ♦ గా వెడసేయన్. ౬౫

క॥ భగవంతుఁడ ; యారక్కసు, లగణితబలు లంటి వారి ♦ యావాసము వీ
ర్యగుణోత్సేకం బాకా, రగమాగమవృత్తములు న ♦ రసి తెల్పఁగదే. ౬౬

ఆ॥ ఎట్టి బలమువార ♦ లెవ్వారి పుత్రు లే, లక్షణములవారు ♦ లాఁతులేని
స్వీయులేని వీరిఁ ♦ జేర్పఁ దీర్పొనరింపఁ, బనుప నేర్తు రెవరు ♦ బ్రహ్మమూర్తి;

క॥ అంతయు వివరింపవె యను, మంత యయినఁ ద్రిక్కుకుండ♦ నాతరబడి సా
మంతులతోఁ బోరఁగఁ గల, యంత లరయవలయుఁ గాదె ♦ యఖిలాభిజ్ఞా. ౬౮

ఆ॥ అనిన నతని పలుకు ♦ లాలించి దొరఁకొనె, మునివరేణ్యుఁ జెల్ల ♦ ముట్టఁదెలుప
వినఁ దలంచితేని విను మల్లవారల, తెఱఁగు బీరములునుఁ ♦ దేటపడఁగ. ౬౯

క॥ విభుఁడు పులస్త్యాన్వయమునఁ, బ్రభవించెను రావణాఖ్యుఁ ♦ బరఁగెడు వాఁడా
యభయుఁడు బ్రహ్మవరంబులఁ, ద్రిభువనముల వేఁపఁ గూర్పు ♦ తీర్పన వెలసెన్.

ఆ॥ అలవు చలముఁ గలుగు♦నతనికిఁ దోడైరి, బ్రహ్మరాక్షసులు ప్ర ♦ బలురు పలువు
రేమిచెప్ప విశ్రవోముని పుత్రుండు, వైశ్రవణుని భ్రాత ♦ వాఁడు ఘనుఁడు.

తే॥ వింటివో; లేదొ; యవ్వాని ♦ విధము తాన
పాడొనర్చు మఖము లాండ్రు ♦ భంగపఱుచు
నీచతములు సుబాహు మా ♦ రీచు లనెడు
వారి వీరి ననుచు నొండు ♦ వలనుపడిన. ౭౧

క॥ సుందోపసుందసంజ్ఞుల, నందను లివ్వారు ఘనులు ♦ నాకసదహితుల్
క్రందుకొనుఁ దాటకయు ని, ట్లాఁదఱఁ దలకడచినది మ ♦ హాబలతోడై. ౭౩

క॥ ఆ పాపుఁడు ప్రేరేపఁగ, మాపాలిటి మిత్తు లగుచు ♦ మలసిరి వీరల్
ప్రాపతఁడే కలఁడని బి, ట్టేపున మెఱయుదు రడంతు ♦ రిజ్యల మునులన్. ౭౪

క॥ అని వారలఁ దెగటార్పఁగ, ననుపమవిక్రముని రాము ♦ ననుపుము తోడ్తో
డన గెలుపుతోడి సిరిగొని, చనుదెంచును నీదుసత్య ♦ సంగరత తగన్. ౭౫

## —♦ దశరథుండు రాముని రక్కసులతోఁబోరఁ బంపనేరననుట ♦—

క॥ అని పలికెడు ముని పలుకులు, విని చింతాసాగరోర్మి ♦ వీచికల భ్రమిం
చెను దొప్పదోఁగె నరపతి, యనువేదఁగ నిట్టు లనియె ♦ నాఘను తోడన్. ౭౬

ఆ॥ పెద్దవాఁడ నేనుఁ ♦ బిన్నవాఁ డీబిడ్డఁ, డట్టిదుష్టతముల ♦ నలమి గెలుతు
మెట్లు వీఁడుమయ్యె ♦ యిప్పాట మమ్మోప, రలఁతిపడుచు వేఁడి ♦ రని తలంచి.

ఆ॥ తండ్రివీవెగురువు ♦ దైవతంబునునీవె, యల్పభాగ్యుఁడీతఁ ♦ డని నెనరున
నన్నుమనుపుమయ్య నాబిడ్డపైఁబ్రసా, దమ్ముదృష్టినెఱపి ♦ తాపసేంద్రఁ ౭౯

సీ॥ దైవతగంధర్వ ♦ దానవయక్షర, క్షఃప్రముఖులయేని ♦ సమితి గెలువఁ
జాలరారక్కసు ♦ సంత్రాసకు నటన్న, మానవు లిఁక నియ ♦ న్మాత్రు లనఁగ
నగుఁగాదె యెల్లైన ♦ నగుదురు మానవా, దులు వారు వీర్యవంతులు మహాత్ము
లందు నాతం డంత ♦ కాకృతిఁ గైకొనె, నంతలుసేసెఁ ద ♦ న్నజు వరములు
వాని నెదిరింప నోప న ♦ వార్యతేజు,సుతయుతుఁ డనేని సైన్యస ♦ హితుఁడనేని
యజ్ఞవిఘ్నకరులు భైర ♦ వానుచరులు, నైన యివ్వారిపోరేని ♦ నలవిగాదు.

ఆ॥ చూచి చూచి యెట్లు ♦ సుతు నమరప్రఖ్యు, ననమరప్రసక్తు ♦ నబలు బాలు
బాఱవైచువాఁడఁ • బ్రబలదుర్ధర్షమ, హాగ్నికల్పశాక్తు ♦ సాంతరమున. ౮౦

క॥ ప్రారంభవిఘ్నకరుల, మారీచసుబాహు లనెడు ♦ మనుజాశనులన్
బోర నెదిరి యొక్కొక్కని, తోరణ మొనరింతు హితుల ♦ తో వచ్చి ధృతిన్.

క॥ అనుచు సుతలాలసుం డయి, మనుజేంద్రుఁ డసంగతముగ ♦ మాటాడంగన్
మునిమన్యువహ్ని జన్నం; బున సుహుతజ్వాలు జ్వాలనుఁ ♦ బోలి వెలింగెన్. ౮౧

తే॥ స్నేహపర్యాకులాక్షర ♦ స్థితి కొలుకులు
నృపతి పలుకులు విని కోప ♦ నిష్ఠుఁ డగుచు
నందఱును విన నిట్లనె ♦ నతనితోడ
కుశికసుతవిధి స్వప్రాతి ♦ కూల్యగతిని. ౮౨

తే॥ ఇది సమంజస మని యెంచి ♦ తేమొ కాని
వక్రమార్గంబ యయ్యెని ♦ ర్వక్రముగను
రఘుకులీనులు నృపులు రా ♦ చాపు తమకుఁ
గలిగెనేనియు విపరీత ♦ గతికిఁ జోరరు. ౮౩

ఆ॥ చేసినట్టిప్రతిన ♦ చెల్లఁబో; విడనాడి, బ్రదుకుఁ డీవు నీదు ♦ బాంధవులును
వచ్చినట్టు లేగు ♦ వాఁడ నావాడకు; దేవుఁడే కలండు ♦ దిక్కు మాకు. ౮౪

క॥ అనిరోషపరీతుం డయి, యను విశ్వామిత్రునుడుల ♦ కవనివడంకెన్
మొనసె సురల మనముల భయ, మనువిద్ధం బైన శ్రేయ ♦ మవలఁ జనంగన్.

—♦ వశిష్ఠుండు రాముని మహిమంబు వివరించుట ♦—

క॥ ఆనరపతి చింతావృతుఁ, డై నానెరిదీర్చి తేర్చు ♦ నానయమున స
న్మానితచింతామణి గురుఁ, డౌ నొండొకఁడౌనె యనుచు ♦ నాథును దొరసెన్.

ఆ॥ ఆమహానుభావుఁ ♦ డాసువ్రతుఁడు ధీరుఁ
డామహర్షివర్యుఁ ♦ డౌవశిష్ఠుఁ
డంతయును నెఱింగి ♦ యవనీంద్రుఁ గనుఁగొని
యిట్టులనుచుఁ బలికె ♦ నెలమి దోఁకఁ. ౮౮

తే॥ పొడమి తిక్ష్వాకుకులమునఁ బూజ్యమానుఁ
డనఁగ నెగడితి ప్రత్యక్ష ♦ మైన ధర్మ
మిదియ యంచు జగత్త్రయం ♦ బెన్నఁ బరఁగి
తిపుడు దిగఁద్రావుదే దాని ♦ నీ కతమున. ౮౯

క॥ మతియును ధృతియును సిరియును, వ్రతనిష్ఠయు సత్యయుక్తి ♦ వర్తిలు నీయం
దతులితధర్మాత్మత మని, సుతసంగతి మోహ మెనసి ♦ చొప్పడ లెదవే. ౯౦

ఆ॥ ఇందఱును వినంగ ♦ నిపుడ యాడితివి నీ, యిచ్చ మెలఁగువాఁడ ♦ నే నటంచుఁ
బలికి బొంకితేని ♦ బాపంబు పాల్పడన, ధర్మ మింక నిన్నుఁ ♦ దలఁగి చనదె.

క॥ నిలఁబడుము స్వధర్మంబునఁ, దలఁగుము వ్యామోహ మింకఁ ♦ దనయునిఁ బనుపన్
దలకొను మిష్టాపూర్తం, బులు సెడు స్వీకృతప్రతిజ్ఞ ♦ పొలివోయినచోన్.

తే॥ అనఘ నీరాముఁడు కృతాస్త్రుఁ ♦ డైనను నకృ
తాస్త్రుఁడే యైన నితని సు ♦ రాసురులునుఁ
జెనకి మనఁబోరు పోరుల ♦ సిద్ధ మింకఁ
గల దొకరహస్య మదియునుఁ ♦ గలయ వినుము. ౯౩

మ॥ నరుఁడా; రాముఁడు ధీసమాధి విధి య ♦ న్నారాయణు న్ధారుణీ
భరముం బాపఁగ వేఁడ వల్లె యని మీ ♦ భాగ్యంబునం బుట్టినా
డరవిందాక్షుఁ డితండు లక్ష్మణుఁడు ను ♦ న్నాశేషుఁ డజ్జారులీ
భరతుం ♦ డీతని పిన్నతమ్ముఁ డని నీ ♦ భావంబున న్నిల్పుమీ. ౯౪

క॥ పెక్కురు రక్కసు లొక్కట, నిక్కువలయ మాక్రమించి ♦ యెక్కుడుధృతిఁ బెం
పెక్కిరి తక్కక గ్రక్కున, జక్కడచును వారి నితఁ డ ♦ సాధ్యుఁడ చుమ్మీ.

చ॥ గొనబుల మేర తేజుగుమి ♦ కూర్మలకోన గొనాలపుట్ట మే
ల్మెనరులవంగడంబు లలు ♦ లిబ్బులపంట జగామగంటుముల్

దనరు కొట్టారు తాల్మినెత్తి ♦ దాఁటని కూటమి తెల్విదీవి పెం
దనములఁబ్రోవు రాముఁడనఁ ♦ దా నొక రాజకుమారమాత్రుఁడే. ౯౬

తే॥ అఖిలము భరింప నోపు న ♦ నంతశక్తి
యీతఁడు మనుష్యుఁ డననైన ♦ నేమి యదియుఁ
గాక జ్వలనుఁ డమృతము న ♦ శ్లైకవృత్తిఁ
గుశికతనయుండె కాపాడఁ గొఱఁత లున్నె. ౯౭

తే॥ జగములు సృజింపఁ బొలియింపఁ ♦ జాలు మౌని
యిమ్మహామహు ప్రోల స ♦ మిద్ధతేజుఁ
డైన సీతనిఁ జనకంగ ♦ నజహరాదు
లేని నోపరు పెరవారి ♦ నెంచ నేల. ౯౮

సీ॥ ఇలనాల్గుచెఱఁగుల ♦ నేకాధిపత్యంబు, వఱలఁ దొల్దొలుతఁ బ్రా ♦ భవముసూపె
మత్తపశ్శక్తికి ♦ మదిమెచ్చి స్పర్థచే, బ్రహ్మర్షిగాఁ గోరి ♦ ప్రతినచఱచె
శాపదగ్ధుఁ ద్రిశంకుఁ♦జండాలు నటఁ జేర్ప,దివమొండు సృజియించి ♦ తెలివిమీఱెఁ
దను వేఁడుకొన్న యా ♦ పనిబద్ధు మునిపుత్రు, వేల్పుల మెప్పించి ♦ విడిచిపుచ్చె
సత్యమరసి హరిశ్చంద్ర ♦ సార్వభౌముఁ
బంతమునఁ బదునాల్గు మ ♦ న్వంతరంబు
లింద్రు సరిగద్దె స్వారాజ్య ♦ మేలుమనియె
గాధి సుతుఁడుసామాన్యుఁడే ♦ క్ష్మాతలేంద్రి;. ౯౯

ఆ॥ తపముపెంపు పొల్లు ♦ గాఁజేయ నొల్లఁడ, కాక పొలసుదిండి ♦ మూఁకఁ గెడపు
టొకఁడ కాదు జగము ♦ లొక్కట హావళిఁ, బెట్టజాలు గాధి ♦ పట్టి యధిప.

ఆ॥ ఇదియె విగ్రహంబు ♦ నెనసిన ధర్మంబు, గతియు వీర్యవత్ప్రి ♦ కాండములకు
బుద్ధిసంపదలకుఁ ♦ బుట్టున ట్టఖిలత, పంబులకుఁ బరాయ ♦ ణంబు నిజము.

తే॥ ఇతఁడు సచరాచరంబులౌ ♦ నెల్లలోక
ముల వెలయు సర్వశస్త్రాస్త్ర ♦ ములు నెఱుంగుఁ
బుట్టలే దిట్టిపురుషుండు ♦ పుడమి నెవఁడుఁ
బుట్టఁబోఁ డింక నిమ్మెయి ♦ స్ఫురణ లడర. ౧౦౦

ఆ॥ ఎల్ల సురలసురులు ♦ నెలయు గంధర్వులు, యక్షరాక్షసాదు ♦ లఖిలమునులు
నెవ్వరేని నెఱుఁగ ♦ రీతనిఁ బోలంగ, సకలములు మహాస్త్ర ♦ సముదయములు.

క॥ ఇమ్మని యధర్వమూర్తియ, చు మ్మీతనిఁ గొలుచుచుండు ♦ సొలయక శస్త్రా
స్త్రమ్ములు సమ్ముఖమున దే, హమ్ములు దాల్చి యొకరుండ ♦ హమ్మనఁ గలఁడే.

క॥ పరమేశ్వరు మెప్పించి సు, పరమాస్త్రము లెల్లఁగొనియెఁ ♦ బ్రాజ్ఞత మెఱయన్
బరఁగిరి భృశాశ్వసుతు లిం, దిరవొంది మహాస్త్రవృత్తి ♦ నేర్పెఱ నెఱయన్.

సీ॥ ఆప్రజాపతి పెండ్లి ♦ యాడె భృశాశ్వుండు, దక్షకన్యల నిచ్చ ♦ దవ్వులు మదిని
జయనాగ సుప్రభా♦ఖ్యయు నాఁ దగువారి, వారలు గాంచి ర♦వ్వారుస సుతుల
నేఁబదేఁబది లెక్క ♦ నిరువురు నూర్వుర, నఖిలలోకావనా ♦ ర్థాభిరతిని
మహితవీర్యులు దీప్తి ♦ మంతులు విజయాన్వి, తులు నైకరూపతా ♦ భ్యుల్లసితులు
కామగము లజితులు దురా ♦ క్రాములు ఘను
లతిబలీయులు దుర్ధర్షు ♦ లట్లు ధార్మి
కోత్తములు నగువారి వా ♦ రుత్తమాస్త్ర
భావ మొప్ప రక్షోఘ్నులై ♦ పరఁగుచుండ్రి. ౧౦౬

తే॥ అసురసంహారకాభిఖ్య ♦ నలరు నట్టి
యస్త్రముల నిమ్మహాత్మున ♦ కాభృశాశ్వుఁ
డొసఁగె రాజర్షియై జగ ♦ మోజ నెఱయఁ
గరుణ పెంపునఁ బ్రోచున ♦ క్కాలమునను. ౧౦౭

క॥ కావున నయ్యస్త్రంబులు, భావుకసంపాదు లితని ♦ పజ్జన మెలఁగన్
ధీవిలసితుఁడు సృజించునుఁ, గావలసిన బహ్వపూర్వ ♦ ఘనశస్త్రములన్. ౧౦౮

ఆ॥ వైరి నిగ్రహించు ♦ వలనున కనికాదు, చాలు నన్నిటికిని ♦ సంయమీంద్రుఁ
డలరుప్రేమ నొక్కఁ ♦ డాంతరమున నిడి, నీతనయుల నడిగె ♦ నీతనయుల.

ఆ॥ తనకుఁ దానె మేలు ♦ దలఁచి దోఁతెంచె ని
మ్మౌని యొండు దలఁప ♦ మనకుఁ దగునె
కూర్చుతమ్ము రాము ♦ గూర్చి వేగమ పంపు
మనఘ ; తపసి మెచ్చు ♦ నట్టు లనిన. ౧౧౦

ఆ॥ గురుని నుడుల నార ♦ ఘుప్రవరుండు ప్ర, సన్నచిత్తుఁ డగుచు ♦ సంభ్రమమునఁ
గొడుకు ననుపఁ గుశికు♦కొడుకుఁ దేర్పఁగ నగు, మేలినడవడికల ♦ మెలఁగెనగజ.

వ॥ సందియం బెడలి నంతన వెడలి వచ్చి హెచ్చిన మచ్చిక నజ్జడదారిదరి జేరి నన్ను
మన్నింపు మనికోరి సేవకజనావనంబులు జగత్పావనంబులు నైన భవత్పాద
రాజీవంబులే మజ్జీవధనంబు లనుచుం బన్ను సన్నుతుల నతులత్వంబున మించు
నతు లాచరించి నేరుపు మీఱం బ్రార్థించి యిచ్చవచ్చిన దారి ననేకసత్కా
రంబు లాచరించి పరితుష్టుం గావించి పుష్టిం గాంచి చరితార్థుండ నైతి ననుచు

సమంచితామోదంబునం దనరారుచు శ్రీదంబులైన వేదంబులతోడి సంవాదం బొప్పు శుభసంపాదకంబులగు నేతదీయమహనీయాశీర్వాదంబులం గైకొని మేలు కొని శ్రీదయితుండనఁ బో యితండు నా ననువుపడి పదంపడి యమ్మేదినీమానినీ వల్లభుండు. ౧౧౨

చ॥ తలకొని రాముని బిలిచి తద్దయు బుద్ధులు నేర్పి లక్ష్మణుం
గలిపి కడంగి దీవనలు ♦ కాంక్ష కొలందిగఁ గూర్చి పొల్చు వా
రల ముని ముందర నిల్పి పరి ♦ రక్షకు లన్నిట మీరె యంచు మే
లలరఁగ నుగ్గడించి యుచి ♦ తాలపనంబులఁ దన్పి యన్పుచోన్. ౧౧౩

తే॥ ననుచు కూరిమి స్వస్త్యయ ♦ నము లొనర్చెఁ
గోసలాత్మజ తన యిచ్చ ♦ కొలఁది మున్నె
కులగురుండునుఁ గడుఁ బ్రేమ ♦ గొఱల మంగ
ళాభిమంత్రిణమంత్రితు ♦ నటు లొనర్చె. ౧౧౪

తే॥ తాను మఱిమఱి పుత్త్రియూ ♦ ర్థానుకలన
నంచితాఘ్రాణ మొనరించి ♦ యభిమతములు
మహితములు ప్రీతివిహితము ♦ ల్మలయ వారి
మించు ధృతి మౌనివరున క ♦ ర్పించుటయును. ౧౧౫

తే॥ నీరజస్కఁ గై యల్లన ♦ నెఱసె ననిలు
డందఱకును సుఖస్పర్శుఁ ♦ డనఁగ నగుచు
రాము రాజీవలోచను ♦ రాజచంద్రుఁ
డనుజయుతు మౌని కొసఁగిన ♦ యాక్షణమున. ౧౧౬

ఆ॥ పొరసెఁ బుష్పవృష్టి ♦ పొలుపొందు సురదుందు
భులు చెలంగి మ్రోసెఁ ♦ బొలిచె శంఖ
మహితరవము లట్లు ♦ మాంగళికధ్వను
లమ్మహాత్ము పయన ♦ మమర గిరిజ. ౧౧౭

క॥ దేశికవరుఁ గొలుచు సము, ద్దేశంబునఁ బయనమైన ♦ దిట్టల సుతులన్
శ్రీశప్రతిభులఁ గను ధర, ణీశుని కనుదోయి తృప్తి ♦ నెనయని దయ్యెన్. ౧౧౮

వ॥ అవ్వారిఁ దఱియంజని యవ్వారిగాఁ బొంగి పొరలు ప్రేమాతిరేకంబునం దవిలి వీడనితమకంబున నూఁగాడెడు చిత్తవృత్తుల నెట్టనం జిక్కుపట్టుకొనుచు దశరథుం డక్కుమారమణులతో మఱియు నిట్లనియె. ౧౧౯

క॥ ఏయెడఁ బన్నుండెదరో ;, యేయెడఁ దానంబు పాన ♦ మెలయించెదరో
నాయన్నలార ; యెఱుకం, బాయని మెలకువ మెలంగఁ ♦ బాత్రుల రీరత్. ౧౭౦

ఆ॥ మఱియు నెట్టిపనుల ♦ మఱకువ నెడఁప నే
మఱియు మానిచంద్రు ♦ మతము మఱవ
వలదు మేలిశుభము ♦ వఱలు దానను జాగు
వలదు మలయుఁ డనిన ♦ వారుఁ బొంగి. ౧౭౧

—♦ రాములక్ష్మణులు విశ్వామిత్రుని యాగసంరక్షణంబున కరుగుట ♦—

సీ॥ సిరిమించు సరిగంచు ♦ జిగి శిరస్త్రఁపుమించు, కాకపక్షఁపు మొగి ♦ ల్గలసి మెఱయ
జగమేలు వగఁ గ్రాలు ♦ సత్ప్రసాదఁపు మేలు, నగుమోము నెలమేళ ♦ నమునఁ బొసఁగ
మురిపెంపుగుఱి నింపు ♦ మొగి ఱా జిరాపెంపు, హారాళిఁ గాఁగిట ♦ నలముకొనఁగ
జగడంబునఁ గరంబు ♦ సగుణమౌ విలు డంబు, శరపూర్ణతూణప ♦ క్షంబు గోర
సింహసంహననస్థితి ♦ శ్రీ ఘటిల్ల, సలలితకృపాకటాక్షల ♦ క్షణము దనర
జనకునకు గురునకు మ్రొక్కి ♦ చారుగతుల, వెడలి రవ్వీరు లటు ముఖ ♦ విజితచంద్ర.

క॥ తనవెంట రామచంద్రుఁడు, తన తమ్ముఁడు గొలువ రా స ♦ తంబై యాహ్లా
దనము దనరంగ నొక్కట, మునిడెందము పొంగె సంద్ర ♦ ముం బోలెఁ జెలీ.

వ॥ ఇత్తెఱంగున నత్తపస్విసత్తముని చిత్తంబు కుతూహలాయత్తంబై చిప్రరోత్తం దత్తరం బుత్తలంబుగాఁ దరలునత్తఱి గుణోత్తరుండగు నృపోత్తముండు తత్పద మహాత్మ్యలంబుల కెఱఁగి పునర్దర్శనం బచిరోదయస్పర్శనంబుగాఁ బడయం గోరిన నది యట్టిదయగాఁగాక యిఁక నేము పోయివచ్చెదమని వినిచి తోడన యాతనిమోము దమ్మిచక్కి చక్కఁగనుంగొని. ౧౭౪

క॥ బళిరా ; తాగధృతులన, బ్బలిరాముల గెలిచి తీవు ♦ పఙ్క్తిరథ యిఁక
న్నిలు రాముఁడు బలరమలన, నిలు రాజుం డెగడు జయము ♦ నెల వితఁ డనినన్.

వ॥ సంతసించి వారల నమ్మెయిఁ బలుతెఱంగుల ననువ్రమీఱ నామంత్రణంబొనరించి పుత్తెంచి మందిరంబునం బ్రవేశించి కోసలాత్మజాదులు విన శ్రీరాముని మేలు వార్తలతోడ జయలక్ష్మీసంపాదకంబగు తన్మహాత్మ్యాహాతిరేకంబు వివరించి యవ్వారలనూరడిలంజేసి యమ్మహీపాలుండు పుత్రవాత్సల్యంబునం దదీయ ప్రస్థానం బెడనెడఁ దలంచి యించుక చలించియైన మునివిరించి మహితానుభావం బూహించియు నేతదీయామోఘవచనంబులెంచియు నపగతసాధ్వసుండై సుఖం బుండె నంత నిక్కరణి నక్కుమారరత్నంబులం దోడ్కొని తపోధనవరేణ్యుం

డా కుశికతనయుండు స్వాశ్రమోన్ముఖుండును వికసితముఖకమలుండు నై మార్గంబు దొరసి యనర్గళంబుగాఁ బోవుచున్న సమయంబున. ౧౨౬

తే॥ ముందుగాఁగ విశ్వామిత్రి ♦ మునివరుండు, రామణీయకపుంగని ♦ రాముఁ డతని
వెంట లక్ష్మణుఁ డన్న వె ♦ న్నంటి నడువఁ, దొడరి రవ్వార లట్లు వి ♦ ధూతదురిత.

క॥ తూణంబులు బాణంబులఁ, బాణాకృతములఁ బొనర్చి ♦ పరఁగఁగ మూపుల్
రాణింప శరాసనము ల, క్షీణంబులు గొని నడిచిరి ♦ శ్రీరాము లొగిన్. ౧౨౮

ఆ॥ మూడుతలల తోడి ♦ మొనయు నాగేంద్రుల, పగిది నకొమరులు ♦ భాసమాను
లగుచు దెసల వెలుఁగు♦లందఁజేయుచు ముని, మొనసిచనిరి భాస♦మానమూర్తి.

ఆ॥ బ్రహ్మతేజ మెసఁగఁ ♦ బ్రజలు నమ్మని వెంట, నరుగువారు వొల్చి ♦ రబల; వారు
పద్మహితునితోడఁ ♦ బఱతెంచు నెడ నాశ్వి, నేయయుగము నెగడు♦చాయ మించి.

ఆ॥ వెలుఁగు లడరు కాంతి ♦ వెలయ విశ్వామిత్రు, మలసి చనిరి వారు ♦ మారనిభులు
నన్నుఁబెరసి యోజ ♦ ననుచు కుమారుల, వెరవు తెఱవుఁ దోఁప ♦ విశ్వజనని.

తే॥ ఆకుమారులు దివ్యశో ♦ భాకలితులు
మెఱసి రస్త్రాని వలగొని ♦ మెఱుఁగుఁబోఁడి
బాసయొడయనిఁ జెరసి వి ♦ భాసమాను
లైన యింద్రాగ్ను లట్టు ల ♦ హార్యపుత్రి. ౧౩౨

క॥ చంద్రనిభయశుఁడు నృపసుత, చంద్రుల సంగతిని మాని ♦ చంద్రుఁడు దగెనో
చంద్రముఖి రుద్రుఁ డింద్రో, పేంద్రుల పొత్తునఁ జరించు ♦ నెడ మించు రహిన్.

తే॥ అద్భుతకుమారు లటు మాని ♦ నంటఁ గదిసి
యర్థి నెలకొని శోభిల్లి ♦ రనుపమాంగి
అర్థకామంబు లొగిఁ బర ♦ మార్థమైన
ధర్మ ముపబృంహణ మొనర్చు ♦ తత్త్వ మొలసి. ౧౩౪

తే॥ సరయుఁడై యట్లు సంయమి ♦ సరణిఁ బెరసి
సహ నృపకుమారుఁ డర్ధయో ♦ జనము గడచి
సరభసత సరయూనది ♦ చాయ కెక్కి
చాయ కెక్కె మనస్సిద్ధి ♦ జాడ తోడ. ౧౩౫

— విశ్వామిత్రుండు రామలక్ష్మణులకు బలాతిబలలను విద్యల నుపదేశించుట —

ఉ॥ హా నివరుండు క్రోశయుగ ♦ మాత్రమున న్సరయూసరస్వతిన్
దానుఁ గుమారులుం గడచి ♦ తత్పరసీమనుఁ గాల్యకృత్యముల్

మానుగఁ దీర్చి రామ యిడె ♦ మంత్రరహస్యము గూర్తుఁ జిత్తసం
ధానము మీఱి నిల్వఁ డాగి ♦ నా నటు వారునుఁ జేయ నత్తఱిన్. ౧౩౬

చ॥ అమితయశుండు సంయమి బ ♦ లాతిబలాఖ్యల విద్యలన్ శుభం
బమర ముదంబు నెయ్యము హృ ♦ దంతరసీమఁ గడల్కొనంగ రా
కొమరుల కిచ్చె వార లను ♦ కూలత మీఱఁ బరిగ్రహించి హా
చ్చె మెడలి పొల్చు ముత్తెముల ♦ శ్రీ నలువొందిరి మేనకాత్మజా. ౧౩౭

సీ॥ అమృతాంబునిధి యాత్మ♦నానురం గమరంగ, క్షుత్తృష్ణ లటు తేటి♦చూడవయ్యె
రేవెల్లుఘృణులు మై ♦ తావ్రకొన్నటులున్నఁ, దాపంబు నిలలేక ♦ దలఁగి చనియెఁ
గలిమికన్నియ మొద ♦ ల్గడియించువగ మించ, శీత మించుక చెట్టఁ ♦ జెనకదాయెఁ
జిలువతేఁ డిల మడుం♦గులు వెట్టుచున్నట్లు, కంటకాదిక మార్గ ♦ లంట ననియెఁ

గుశికతనయుఁ డెచ్చు ♦ కూరిమి నుపదేశ
మొసఁగినట్టి మనువు ♦ లెసఁగు మహిమ
లోన మెలఁగి జనను ♦ లోయనఁ బోషింపఁ
దొడరునంత నృపసు ♦ తులకుఁ గాంత. ౧౩౮

క॥ కర మరుదగు తేజముతోఁ, గరముల విస్ఫురణ లెసఁగఁ ♦ గడఁగి శరద్భా
స్కరుఁ డిరుగూపు గొనిన య, ట్లరవున మెఱసి రిరువురును ♦ విద్యాశక్తిన్. ౧౩౯

ఆ॥ ననుచుమాతృపార్శ్వ ♦ మున వర్తనమునఁజె, న్నారి మున్ను గనిన ♦ తీరుదోఁప
లలితమూర్తు లపుడు ♦ లాలితామరకీర్తు, లగుచుఁ బొలుపుగని ర ♦ గాత్మజాత.

క॥ అంతట వారుం దానును, సంతసమునఁ బొదలుచుం బ్ర ♦ సక్తి న్మని శ్రీ
కాంతున కిట్లనెఁ గూర్మి హృ, దంతరమున నిండి పొంగ ♦ నవశత పేర్మిన్. ౧౪౦

తే॥ రామ ; యీరెండువిద్యలు ♦ బ్రహ్మపుత్రి
కలు బలయు నతిబలయు నా ♦ వెలయువార
లేరిపై స్వీయము ప్రసాద ♦ మొనయు వారి
కఖిలశుభములు గూర్తు ర ♦ య్యైవిధముల. ౧౪౨

క॥ అనఘాత్మ ; యేమి చెప్పుదు, ఘనమంత్రమహత్త్వకలన ♦ గనికని బహుయో
జనదూరంకలితపద మీ, రెనయుదు రిరుమూడమగుల ♦ నిడిన వడువునన్. ౧౪౩

ఉ॥ ఒందవు దప్పి యాకలియు ♦ నోపదు తాపము నిల్వఁ జెల్వి చె
ల్వొందు జయంబు పొల్పడు మ ♦ హోద్యమము ల్ఫలియించు సంతతా

నందము పొందఁగున్ భయము ♦ నాఁజన దెందును చేను గందదే
మందు విషాగ్నిశస్త్రకృత ♦ యాపద చూపిడలేదు రాఘవా. ౧౪౪

క॥ రక్కసు లుక్కఱ మీాదెసఁ, జక్కఁ గనుంగొనఁగ నెట్టుఁ ♦ జాలర యింకం
జెక్కుల నొడువఁ దల్లుల, మక్కువ మఱపించు నెలమి ♦ మనుచు న్మనువుల్.

క॥ సకలజ్ఞత్వము తోఁడిద, యకలంకం బసము పెరయు ♦ నసదృశ మగుచున్
వికసిల్లుచుండుఁ జిత్తము, సుకరం బసుసుల జయించు ♦ చొప్పిఁక మీాకున్.

వ॥ అట్లు గావున నిమ్మహామంత్రంబుల నేమఱక జపించుచుండునది యని నియమించి
యమ్మెయిన యమ్మునికులతిలకం బమ్మేటిలీలాబాలకుల యుల్లంబులు పల్లవింపం
జేయుచు మంత్రగ్రామరహస్యంబు లెల్ల సక్రమప్రక్రమంబున నవ్వారియందుఁ
బ్రవర్తిల్లంజేసియీనాఁటికి నిచ్చోట నివసించి యుపవసించుట మేఁనిన వల్లెయని
యట్లునిలిచి గురుశుశ్రూష లెల్లఁబొనర్చి యత్తపోధను నర్చించి కాల్యకృత్యంబులు
నిర్వర్తించి మంత్రానుష్ఠానం బొనరించుచు సుఖంబుండి రంత. ౧౪౭

క॥ ఆలలి నాలలితాత్మ లై, లాలలనేశాత్మజులు జ్వ ♦ లత్తేజులు తా
రోలిఁ గుశికసుతవాక్య, శ్రీలాలితు లగుచు నిశియుఁ ♦ జెలఁగెన్ సిరులన్.

తే॥ సుఖము దైవాఱ నాఁకేయి ♦ శుద్ధవృత్తి
నెగడఁ దృణశయ్య శయనించి ♦ నియమ మొప్పఁ
గడపి రాప్రౌఢబాలకు ♦ లక్కౌశికార్థి
తార్థసిద్ధివివర్తు ల ♦ య్యనఘుఁ జెరసి. ౧౪౯

క॥ శ్రీయుత రజని ప్రభాత, ప్రాయ యగుడుఁ దఱిసి సతృణ ♦ పర్ణశయనులన్
శ్రీయుతుల మేలుకొలిపె మ, హీయస్తేజుఁడు మహర్షి ♦ యెలమి దొలంకన్.

తే॥ రామ ; కౌసల్యసుప్రజ ♦ రాగదోయి
నెఱయుచున్నది తొలుసంజ ♦ నీదుకొలువు
పడసి పేరొంద నిద్దుర ♦ వలనుపడునె
జగము మనిచెడు నినుఁబోఁటి ♦ జాణలకును. ౧౫౧

క॥ తమ్ముఁడు నీవును ముద్దుల, కిమ్ములు నగు మోములొప్ప ♦ నేతెంచి శుభం
బిమ్మెయి వెలయం జేయుఁడు, సమ్మద మెసఁగం బ్రభాత ♦ సత్కృత్యములన్.

క॥ ఇమ్మానరశార్దూల ; తీ, రమ్మై దైవాహ్నికము స ♦ రవిఁ దీర్చి వృతం
బిమ్మంత్రగ్రామమ్ము జ, పమ్మున మెఱయింపుఁ డఖిల ♦ భద్రము లొదవున్.

క॥ అను ముని పరమోదారం, బనుపమితము వచన మొలసి ♦ నంతనె నృపనం
దను లటుమేల్కని స్నానం, బును సాంధ్యవిధులునుఁ దీర్చి ♦ పొలుపొందు ఘృణిన్

ఆ॥ జప్యమును జపించి ♦ సంయమీంద్రునిఁ జేరి, వఱలుభక్తి సమభి ♦ వందనములు
సేసి నిలిచి సెలవు ♦ సిరిమీఱ సంప్రాప్తు, లై ప్రయాణకలన ♦ కనువుపడుచు.

ఆ॥ అట్లు వెడలి యమ్మ ♦ హావీర్యు లమ్మౌని, తోడ నరిగి యెలమి ♦ తోడ గంగ
సరయునం గమించు ♦ సంగమస్థానంబు, నం బొసంగు నాశ్ర ♦ మంబు గనిరి.

సీ॥ హైమవతీయుక్తి నమరు ముక్కంటిక్రమ్మఁ ♦ గుల తల ల్మినువాఁక ♦ నలముకొనఁగఁ
గాంచననవమాలి ♦ కాంచితశ్రీఫల, శ్రీమద్విశిష్టత ♦ ప్రీతిఁ బెనుప
శారదాప్తబ్రహ్మ ♦ దాయువు ల్యజ్ఞాంగ, కలన గాయత్రిసం ♦ గతిఁ జెలంగ
నింద్రాణికాశక్ర ♦ హితవృత్తి రంభాది, సుమనోగణికి లోఁగి ♦ జుట్టి మెలఁగఁ
బరఁగి సహకారపురిరమా ♦ భాసితంబు, లలితపురుషోత్తమము సహా ♦ కలితమన్మ
థంబు హరిచందనానూది ♦ తఫలపూర, మైన వనరాజ మధిపై ♦ తాప్తి నెగడె.

క॥ కన్నులపండువునా న, ట్లున్న యటవిఁగాంచి రాముఁ ♦ డుల్ల మలర మే
ల్పున్నెముల నెలవు తపసుల, కన్నా కెదలోనఁబొంగఁ ♦ గా నిట్లనియెన్. ౧౫౮

—♦ కామాశ్రమవృత్తాంత కథనము ♦—

ఉ॥ మానివరేణ్య ; యిన్వన మ ♦ మానుషసుందర మెన్వరేని స
న్మానితులౌ తపోధనులు ♦ మానుగ నుందురె యీదు నందనో
ద్యానము నాఁగఁజెల్వమగు ♦ నో సరయూనది యీవలం ద్రిలో
కీనుత గంగ యావల నొ ♦ గిందగ నొక్కఁడె పావనం బనన్. ౧౫౯

వ॥ శుశ్రూష యొప్పారెడు నానతీయవలయు ననిన నప్పలుకులు ముద్దుసేసి వాచం
యమశేఖరుండు కౌతుకం బలర నిట్లనియెఁ దొల్లి దాక్షాయణీదేవి యాత్మజనకుం
డగు దక్షుండు వెలయించు నయ్యధ్వరంబున నిజభర్తయు జగద్భర్తయు నగు
నీశానదేవు నవమానించిన దా నయ్యవహేడనంబు సహింపనేరక యాక్షణంబ
సమక్షంబునం దన వలనం బ్రణీతంబగు యోగాగ్నిచే స్వదేహంబు దహించి
సద్గుణప్రసన్నుండగు హిమవన్నగేంద్రుని ప్రేయసీమణియుఁ బ్రణిధానంబు పెన్ని
ధానంబునుఁ బరమేష్ఠిమానససృష్టియు నగు మేనక యను సతీతిలకంబు గర్భ
శుక్తిముక్తాఫలంబుకలన నలంకరించి నలువొందుచుండ నమ్మహాదేవుం డద్వితీ
యుండగుట నేకతానత్వంబు వఱల స్వాత్మసమాధినిష్ఠుండై యుండె నట్టియెడ.

ఆ॥ తారకాఖ్యుఁ దొట్టి ♦ దండిఁ గక్కసిల్లెగ, దన్ను వేఁప వేల్పు ♦ మన్నెకాఁడు
మిన్నువాఁక దాల్పు ♦ మేనకాత్మజఁ గూర్పఁ, దనదు కోల తలంగు ♦ నని తలంచి.

తే॥ చిలుక తేజీవజీరు నె ♦ చ్చెలిమి దోలఁకఁ
జేర రాఁ బిల్చి మన్నించి ♦ చిత్తగింపు
మేను నీవల జేజేల ♦ కెల్లఁ బ్రోవు
గాంచ నూహించి యిటు ముచ్చ ♦ టించువాఁడ. ౧౬౨

శా॥ వింటే మన్మథ తారకుండు మము నీ ♦ వెంటం బడంగొంటుటల్
కంటే విష్ణుసుదర్శనాయుధము ని ♦ ష్కంబై యురంబంటుటల్
మింట న్మంటనుఁ గాక వాఁడు జగము ♦ ల్మేలేదఁ బీడించుటల్
కంట న్నీరొలుకంగ నచ్చరలు త ♦ త్తారాస్థలి న్మ్రొగ్గుటల్. ౧౬౩

క॥ కానని వానివలె న్మముఁ, గానలపా ల్సేయ నీకుఁ ♦ గా దుడిగమ్మ
ల్మానెడునవి మాకెన్నఁడు, నీ ననవి ల్లుండి యిదియు ♦ నెనరే మదనా. ౧౬౪

ఆ॥ అనిన నసురుఁబోక ♦ కైనఁ దలంక ఫా, లాక్షు నేనిఁ జెనక ♦ నటమటింప
నింత పెద్దసేయ నేల న ♦ న్నెద్ది యేఁ, జేయుకర్జ మింకఁ ♦ జెప్పు మింద్ర. ౧౬౫

క॥ అని పల్కినఁ గంతునిఁ గనుఁ, గొని గట్టులసూడు ప్రాపు ♦ గోరి నలువ వేఁ
డిన నయ్యనఘుఁడు దెలిపెను, విను మయ్యాపయిక మిపుడ ♦ వినిచెదఁ దెలియన్.

శా॥ ఎందుం దుర్జయుఁ డింక వానిఁ జెనయ ♦ న్వీక్షింప లే రెవ్వరే
మందుం దొల్తఁ దపంపుఁజేర్మిఁ గొనె ను ♦ ద్యద్భూతి మావల్లఁ బ్రాఁ
కెం దేజం బెడగ్రమ్మ నిట్టిడనుచున్ ♦ గిట్టింప నెల్లెవ్వఁడు
న్మ్రింద జేయునె చేఁదుమ్రా ననుచు ము ♦ న్నక్షించి చేచేతులన్. ౧౬౭

క॥ నీవును నట్టేఁడ వోటం, ద్రోవంగాఁ బాల కొండు ♦ తోఁగ్రివ దెలిపెదన్
భావాభావవిదూరుఁడు, సేవకకల్పకము శివుఁడు ♦ సిద్ధము మఘవా. ౧౬౮

సీ॥ ఏ దేవు నిజమూర్తు ♦ లెనిమిది భూతంబు, లైదు చంద్రార్కులు ♦ యజ్వయు నన
నే మేటి కేనగ్ని ♦ యిల శౌరి శ్రుతు లబ్ధి, సురగిరి యంత్రాది ♦ పరిక్రమముల
మే విభుఁ గూర్చు మ ♦ హేశమృత్యుంజయ, కాలకాలాదికా ♦ ఖ్యల నిరూఢి
యే సామి కుత్తుక ♦ యెల్లలోకము లేర్చు, చెట్ట విసము పొలి ♦ చెలికోలంబొ
యమ్మహాత్ము సదయు ♦ నధిహార్షరూపు న, నాదినిధను శరణ ♦ మనుఁడు శర్వుఁ
డాదరించి మనుచు ♦ నభవు చిదంశమై, పాడము జ్యోతి యసుర ♦ మడఁచు నింద్ర.

వ॥ అద్దేవుం డద్దుష్టునెడం గినియకుంట కస్మదీయవరప్రసాదంబుకారణం బట్లగుటం జేసి. ౧౭౦

ఆ॥ తోడరి తాన వానిఁ ♦ ద్రుంపఁ దలంపఁడు
మఱియుఁ బెరసె దృఢస ♦ మాధినిష్ఠ
దేవి దక్షకృతధ ♦ వావజ్ఞ హిమశైల
జాతయై తపంబు ♦ సలుపుచుండె. ౧౭౧

క॥ కావున భవు నుమఁ గూర్పఁగ, నేవిధముననో ప్రయత్న ♦ మిపు డొనరింపం
గావలయుఁ బొందు దీనం, గావలయుం గార్యసిద్ధి ♦ గన మొండొంటన్. ౧౭౨

క॥ అని యానతిచ్చె విధి కా, వున నిక్కార్యంబు నీక ♦ పోలునుఁ బనిలే
దనుసృతగమను మధునిఁ బొ,మ్మని లెమ్మిఁక మనుపు సురల ♦ నస మెనయు స్మరా.

ఆ॥ అనిన సంశయించి ♦ యునుఁ గాదనఁగఁ జెల్ల
దని వసంతుఁ గూడి ♦ యపుడ తరలి
స్థాణు గిరిజ ననమ ♦ శరుఁడు మోహనబాణ
పాతఘటన బడలు ♦ పఱుచుటయును. ౧౭౪

వ॥ తపంబు చాలించి యొక్కవలనున నాతని నుపలక్షించి. ౧౭౫

మాలిని॥ శివుఁ డలిగి సమాధి ♦ శ్రీసుఖావిష్టు నన్నుం
గవియఁగఁ దెరలింపం ♦ గాఁ గలం డెవ్వఁ డంచున్
దివిరి యుపరినేత్ర ♦ స్థేమదీప్రానలావి
ర్భవతరలకరాల ♦ జ్వాల భస్మీకరించెన్. ౧౭౬

క॥ ఆదుర్మేఘుఁ డధీశు ను, హాదేవుఁ బరాత్ము నట్టు ♦ లదలించి విలో
కోదితవహ్నిం గ్రాఁగెను, సీదత్సర్వాంగుఁడై భ ♦ సితశేషముగన్. ౧౭౭

తే॥ రామ ; మనసిజు తను విందు రాలె దాన
నంగదేశము నాఁజెల్లె ♦ నతఁ డనంగుఁ
డయ్యె నిది నాటఁగోలెఁ గా ♦ మాశ్రమాఖ్య
దనరెఁ దపసు లిచ్చటఁ గోర్కె ♦ లెనయుచుండ్రు. ౧౭౮

క॥ కామజము లఘము లిచ్చో, నేమంబున నిలుచువారి ♦ నెరయవు మునులుం
గామారిశిష్యు లగుట మ, హామహిమము గాంతురి సిద్ధి ♦ మలసి యొలయఁగన్.

క॥ కావున నేఁటికి మన మటఁ, బోవలవదు నిలుతు మిచట ♦ మునిసంగతి సం
భావన సేయుదు రెల్లరుఁ బావను లానందపూర్ణ ♦ భావము పొసఁగన్. ౧౮౦

ఆ॥ రెండునదుల నడుమ ♦ నుండు పుణ్యాశ్రమం, బిచటు గానదీని ♦ నెనయు టొప్పు.
స్నానజప్యహోమ ♦ సత్క్రియ లొప్పార, నడిపి మేలిశుద్ధిఁ ♦ బడయఁ గాంచి.

సీ॥ అని యట్లఁ బారు దా ♦ నొనరించి యాశ్రమ, పద మాఘనుడుఁ జేరఁ ♦ బాటి నపుడు
మును లాత్మవిదులు స ♦ న్మను లెదురేతెంచి, కొనిచని చనవెల్లఁ ♦ గొల్లపెట్టి
యనఘ విశ్వమున కె ♦ ట్లును మిత్రుఁడవు నీవ, కాక వేల్పొడ్లకీ ♦ ఖ్యాతి తగునె
కనులపండువు సేయఁ ♦ గాఁ దోడి తెచ్చితీ, హరిమూర్తి మముబోంట్ల ♦ యఘములడఁప

గానము లొప్పారె లగ్గయ్యెఁ ♦ గోర్కె లొదవె
నని పొగడి మువ్వురను మహా ♦ ర్ఘ్య విధుల
మొనసి యానందజాశ్రువు ♦ ల్మానకొనంగ
గానబుమీఁఱఁ బూజించిరి ♦ కుధరతనయ. ౧౮౨

క॥ తొలుఁబలుకుఁజెలుల పాపట, వెలవెట్టని చెందిరముగ ♦ వెలయు నెవని యం
ఘ్రుల వలని మేలిరజమా, యలఘుఁడు మునిపూజ లందు ♦ టబ్బమె చెలియా.

క॥ అభిరామము లాచరితము, లభిరాములు నృపతిసుతులు ♦ హర్షింప ఋషుల్
విభవ మిదె యనుచు విన ముని, విభుఁడు విసిచె వెలసె శుభము ♦ వెలవెట్టనిదై.

తే॥ కూర్మ్మి లొండొరు లొండొర్లఁ ♦ గొసరుకొనుచు
నాఁటిరేయిఁ గడపి మఱు ♦ నాఁటి ప్రొద్దు
పొడుపువేళకు మును మున్న ♦ వెడలి యంత
తడవు జడదారు లెనసిరా ♦ నడిచి రగజ. ౧౮౩

వ॥ అట్లు దమతోడివారలై యేతెంచు నవ్వారల మేలెంచి కీర్తించుచుఁ దమువదిష్ట
మార్గంబున ననర్గళంబగు గమనంబునఁ జని. ౧౮౪

లయగ్రాహి —♦ గంగానదీ వర్ణనము ♦—

అంగనరో వారలెదు, రంగనిరి దివ్యముని, పుంగవమనోవికస, నాంగణయశశ్శ్రీ
సంగ సముపార్తిజయ, మంగళకళాభ్యుదయ, రంగదమలాంగహృద, యంగమవిలాసో
త్తుంగ కరుణామృతత, రంగ కలితోల్లసద, పాంగ రసతానటన, రంగ సుఖలక్ష్మీ
సంగమన సర్వభయ, భంగకృతిహేతుదృగ భంగ గుణసంపదను, షంగనల గంగన్

క॥ కన్నంతన మైపొంగఁగ, నన్నయుఁ దమ్ముఁడును సన్న ♦ లమరఁ దదీయాం
చన్నవకీర్తులు నా జిగి, వెన్నెలల న్నగడు తెరల ♦ వేడ్క గనునెడన్. ౧౮౫

ఉ॥ దవ్వులఁ బువ్వుటీరములఁ ♦ దార్కొని పుప్పొడు లల్లరేఁపుచున్.
గ్రొవ్విరితావు లందుకొని ♦ గోమొసఁగం గలహంసకూజితం

బవ్వలఁ గూర్చి యాకౌస్తుభు ♦ గాపగ శీకరము ల్గ్రహించి య
మ్మువ్వురి చిత్తము ల్గొనె న ♦ మూల్యము దక్షిణమారుతంబుమా. ౧౮౯

క॥ జలజలమని దొరలెడు తరఁ, గలఁ గలకలబలుకు నీర ♦ ఖగముల జలజం
బుల మొరయు నళుల మ్రోఁతల, కలు దలకొనఁ గనుచుఁ దీర్థ ♦ గతులై రంతన్.

మ॥ క్షణ మెంతేఁ దన యంతరంగమునఁ బొం ♦ గ న్రాఘవుం డాధునిన్
బ్రణతాభీష్టదఁ గాంచి ప్రేమ దొలఁకం ♦ బ్రాపించి పాదాబ్జల
క్షణ మేతజ్జలమం దొకక్షణము జ ♦ క్కంగూర్పఁ దత్కార్యకా
రణభావం బపు డూహసేయఁ దగె ధీ ♦ రశ్రేణికిన్ స్త్రీమణీ. ౧౯౧

ఉ॥ ముద్దులుగుల్కు నన్నదుల ♦ మున్దలరత్నము కన్నుదోయికిన్
దద్దయు విందొనర్పఁ గను ♦ దాశరథిం గని తాపసౌఘముం
బెద్ద తదీయహర్షగతి ♦ పెంపువహింప నిలింపనిమ్నగన్
గ్రద్దనఁ బ్రీతిమైఁ బొగడఁ ♦ గాఁ దొడరె న్దరుణీవతంసమా. ౧౯౨

ఆ॥ అన్న; చూచితే మ ♦ హైశ్వర్య మన మన, కన్నుదోయి కెదురఁ ♦ గానఁబడియెఁ
గన్నతల్లి సకల ♦ కవిముఖారూఢిక, నన్నుతిప్రసన్న ♦ నదులమిన్న. ౧౯౩

క॥ సిరి పుట్టినింటి బలఁగము, హరి ముద్దులమూట శంక ♦ రార్చిత గాక్
తరుణీసోదరి రత్నా, కరు ముద్రాలక్ష్మి యిది జ ♦ గన్నుత కాదే. ౧౯౪

సీ॥ ఇది పాల్కడలికన్నె ♦ నెలమి నేలెడు దొర, యడుగుగెందమ్మల ♦ యలరుఁదేనె
ఇది గట్టువిలుపట్టు ♦ నెకిమీని సికఁ జుట్టు, నన లారసీని చం ♦ దనఁపుఁదేట
యిది మంచుమల మేన ♦ నొదవి ముజ్జగముల, నెలకొనఁజాలు పు ♦ న్నెములచాలు
ఇది తోయనిధికిఁ బెం ♦ పిడు మేలిగొనముల, వన్నెకెక్కిన గార ♦ వంపుటాలు
ఇది సగరువంగడముఁ బంక ♦ మెల్లఁ గెడపి, పరమసుఖ మందఁ జేసిన ♦ భాగ్యమహిమ
ఇది సురర్షులఁ బెతరుల ♦ నిన్నిజీవు, లను మనుచు తల్లి సురభిక ♦ ల్పద్రువల్లి. ౧౯౫

తే॥ ఇదియ యసమాన జగతీత్ర ♦ యీడ్యమాన, పావన, భగీరథ, తపఃప్ర ♦ భావకలన
యిది కదా రామ; త్వద్యశః ♦ పదసఖిత్వ, రంగదుత్తుంగభవ్యత ♦ రంగ గంగ.

క॥ ఒక్కొక సుకృతం బొదవిన, నొక్కొక యఘ మడఁగుఁ గాక ♦ యొగిఁ గలుషతతిం
జక్కడవ నింతకన్ననుఁ, జక్కనికారణము మూఁడు ♦ జగములఁ గలదే. ౧౯౬

తే॥ రామ; యెద్దానిఁ గన్నమా ♦ త్రానఁ గరత
లామలక మగు నమృత మి ♦ య్యవనివారి

కట్టి యీయవ్వ సేవ సే ♦ యంగఁ గలుగు
నతని కెందేనిఁ గొఱఁత యిం ♦ తైనఁ గలదె. ౧౯౮

సీ॥ ఏయంబ శుభనామ ♦ ధేయస్మృతియ చాలు, సకలపాపంబుల ♦ సమయఁ జేయ
నేసాధ్వి గుణకీర్త ♦ నేప్సితం బేనను, బ్రారబ్ధచయ మెల్లఁ ♦ బాఱఁదోల
నేదేవి సందర్శ ♦ నాదృతి తలయొత్తు, నజ్ఞానతతిభరం ♦ బాఁచికొనఁగ
నేరాణి తీరావ ♦ తారాప్తి మేకొను, మేలుమేడకుఁ బ్రాఁక ♦ మెట్లొనర్ప
నేయమృతవేణి సరసాన ♦ పాయనేవ, గూర్చు నమ్ముక్తిరామోప ♦ గూహనమ్ము
నిఖిలజగదేకపావన ♦ నిష్ఠఁ దనరు, నట్టి యీగంగ పొగడంగ ♦ నలవి యగునె.

తే॥ పరఁగునిది యాదిధాత ♦ వ్యాపారపాత్రి
నిష్ఠజల మన హరియంఘ్రి ♦ నెగడు తీర్థ
మయ్యెఁ బిదప మహేశోత్త ♦ మాంగలక్ష్మి
యై జగమునన్పఁ దుది భువి ♦ కవతరించె. ౨౦౦

ఉ॥ ఎందఱు వాణులో ద్రుహిణు ♦ లెందఱొ యిందిర లెందఱొక్క గో
విందు లిఁకెందఱో నిగమ ♦ వేద్యులు శైలసుతేందుశేఖరుల్
పొందుగ నెంద ఱెందరొకొ ♦ పొచ్చెమువో నిట మున్గి దేవి ; సం
క్రందనవంటితే ; యనుచు ♦ గానమొనర్చిన మానవోత్తముల్. ౨౦౧

క॥ పుడమి నెలకొన్న ప్రజలం, గడఁకన్మిన్నందునాక ♦ గతుల మనుపఁ దో
డ్పడు టబ్రము గా దడుగున, బడిన బడుగు లుద్ధరింపఁ ♦ బడి రీయమచే.

మ॥ కనుఁగొంటే రఘురామ సేవలన యి ♦ క్కల్యాణి బాంధవ్యసం
జనితప్రేమవికాస మొప్ప శుభల ♦ క్ష్మవ్యాప్తి మీఱం దరం
గనినాదాలపనంబులం బొదలె నా ♦ కాశంబు మైఁదాఁకఁ గ్ర
న్ననె కన్నెత్తముఁ గన్నవాఁరిఁ గనఁ గ ♦ న్నం బొంగు టిట్లేకదా. ౨౦౩

ఉ॥ రాజిలు దీపరాజి దరి ♦ మ్రాఁకుల జోకగు పూవుగుత్తులన్
రాజతపాత్రహస్తములు ♦ రమ్యనలోర్మ్ములఁ జేసియీనదీ
రాజముఖీశిరోమణి వి ♦ రాజితసారసమూజితోక్తి నీ
రాజన మెత్తె నీకొసఁగ ♦ రామ ; యమేయజయప్రభావముల్. ౨౦౪

ఉ॥ ఈపవమానబాలకున ♦ కిప్పనిఁ దానె విధించి పంపె ని
య్యాపగ నిక్క మీతఁడు గు ♦ ణాప్తి మహాత్మికలంది తెల్వికిం
బ్రాపుగ వచ్చి మేలొసఁగఁ ♦ బాలిడి తెచ్చిన సేసలో యన
న్నీపయి జల్లుజల్లనఁగ ♦ నింపెఁ బ్రతీరలతల్ప్రసూనముల్. ౨౦౫

చ॥ సొగసగు సైకతస్థలులు ♦ చొక్కఁపుఁ దీర్థము లచ్చపుం దటుల్
నగవెడఁజిందు పూపొదలు ♦ నాణెపుఁ దెమ్మెర లించు సల్లతా
ద్రుమగతఫలావళు ల్బుధనుఁ ♦ దోఁగొను తోయము లోషధీమణుల్
తగ నెగడొందు నిన్నదియ ♦ తావు సుమీ రస మందువారికిన్. ౨౦౬

సీ॥ అనుచు భాగీరథీ♦యలఘుమహిమఁ జెప్పఁ, గొనియాడుచుండ రా♦కొమరు లంత
రంగములుప్పొంగ ♦ హర్షపరీవాహ, నిష్యంద మన సాస్రు ♦ నివహ మొలయ
మది మెచ్చి రంత స♦న్యాని వారును దానుఁ, గాల్యకృత్యమ్ములు ♦ గడపి కడఁగి
కల మమ్మునులు గూర్పఁ♦ గలితమంత్రాభ్యుక్షు, ణంబు గా నారోహ♦ణంబొనర్చి
తన్మహాపగఁ దరియించు ♦ తఱి సరిద్వ
రాంతరంబునఁ బొడమి పై ♦ ల్లగుచుఁ బెరయు
తుములమగు ధ్వని విని లోక ♦ ధూర్వహుండు
రాముఁ డనె యమిఱేఁడ గా ♦ రాము నెఱయ. ౨౦౭

క॥ ఇది జలసంఘట్టనమున, నొదవునదియొ యన్యకృతమొ ♦ యుద్వృద్ధంబై
కదిరెడు శబ్దం బరుదుగ, మొద లెయ్యది యొక్కొ యిట్టి ♦ మొరపంబునకున్.

ఆ॥ అనుచు వేఁడ్కమీఱ ♦ నడుగ నవ్వారిపా
తలఁపు లెంచి యిట్లు ♦ తబిసి పలికె
మొనసె రామ; ♦ యిదియు మొదలఁ గైలాససీ
మను మనోభవమున ♦ మానసమున. ౨౦౯

క॥ బ్రహ్మమనస్సంభవమై, బ్రహ్మణ్యము మానసాఖ్యఁ ♦ బరఁగె సరసు త
ద్బ్రహ్మవచస్సారోత్థ మ, జిహ్మామృత మిదియ నాఁగ ♦ శ్రీకర మగుచున్. ౨౧౦

తే॥ దానఁ దగుమానసాఖ్యఁ ద♦ద్బ్రహ్మసరసి
దాననుండి స్రవించు చుం ♦ దాననేయ
యోధ్య వలగొని ప్రస్రవి♦ణ్యుత్తమ సర
యూసమాఖ్య సరస్స్రవంతి ♦ నొప్పెఁ బుణ్య. ౨౧౧

క॥ శుభద యిది జాహ్నవీనది, నభివర్తిత యగుట కతన ♦ నయ్యె నిచటనుం
డుభయజలక్షోభంబున, బుభుసన్నిభ; యీప్రణాద ♦ మీడిత మగుచున్. ౨౧౨

తే॥ రామ; మీరు ప్రణామముల్ ♦ రహి దలిర్పఁ
గూర్పుఁ డిమ్మేటి నిమ్నగా ♦ కూటమునను
రెండువాఁకలకును భక్తి ♦ నిండుమనము
లొప్ప నిప్పుణ్యకలన మి ♦ మ్మెలయు శుభము. ౨౧౩

క॥ అనునంతనె యతిధార్మికు, లనుపమభక్తిప్రసక్తి ♦ నన్నదులకుఁ గ్రొ
న్న నొనర్చిరి వందనములు, వినమ్రులయి స్తోత్రపాఠ ♦ విలసన మెసఁగన్. ౨౧౮

క॥ దక్షిణతీరం బెనయఁగ, నాక్షణమున మునుల నిలువుఁ ♦ డని పిడ్కొనుచో
లక్షణవంతములగు పూ, జాక్షణజనభాజనములు ♦ జనిపిరి ప్రీతిన్. ౨౧౯

తే॥ అటు మహోపగఁ దరియించి♦యవ్వలనున, ప్రేమ నామంత్రణ మొనర్చి♦పెద్దతడవు
దిరిగిచూచుచు విందుల ♦ తెఱఁగు నెఱయ నల్లనల్ల నరుగుచుండి ♦ రంబుజాక్షి.

—♦విశ్వామిత్ర ప్రభృతులు గంగ దాఁటి యాత్మ్రమహారణ్యంబు గనుంగొనుట♦—

క॥ అటఁ ద్వరితగమనమున ను, ద్భటలీలాబాలకులుఁ ద ♦ పస్వియుఁ జనఁ జెం
గట నటవిఁ గాంచి రాముఁడు, చటులం బగుటెంచి పలికె ♦ సంయమి శోర్డన్.

సీ॥ ఈవనం బెట్టిదో ♦ యెఱుఁగఁబోలదు మహో, వృక్షము ల్పెనఁగొని ♦ ఋక్షపథముఁ
బెరసి యున్నవి కర ♦ మరుదుగ నరమాత్ర, సంచార మనరాదు ♦ శ్వాపదైక
సంబాధమున మించు ♦ సరణిఁ గొక్కిఱిసిరే, లిడి చూపనగు నన్న ♦ నిక్క గాని
చక్కటికైనని ♦ సంయము లుండిరో, మున్ను నేఁడిట్టిల ♦ ముసుఁగుపడెనొ
తెలుపుమయ్య; దీని ♦ చరిత మఱియు నన, నమ్మహాతపస్వి ♦ యమిత తేజుఁ
డంతఁ దెలుపఁ దొడఁగె♦నయ్యుదంత ముదాత్త, మొరసి రసికభావ♦మొప్పుచుండ.

ఆ॥ వృత్రహత్యఁ దలఁగు ♦ వేళ నింద్రుని సుర, ల్మునులుఁ దీర్థసలిల ♦ ములను జలక
మార్చుచుండ నలని♦యంగంబు వలన మ, లముఁ గరూశమును ని♦లకుఁ దొరంగె.

చ॥ మలినతఁద్రోచి యింద్రుఁ డస ♦ మానసుఖోన్నతి మించి యియ్యెడ
న్మలదములుం గరూశములు ♦ నాఁ జను దేశము లొప్పు నెప్పుడున్
లలి ధనధాన్యముఖ్యముల ♦ లావునఁ బొల్చు నటంచుఁ బల్కె న
ప్పలుకుల నుల్లసిల్లె నవి ♦ భాసిలి రెల్లరు సంతసంబునన్. ౨౨౦

క॥ స్ఫీతము లాజనపదము ల, నేతాదృశముల యనంగ ♦ నెసకమెసఁగె న
య్యాతతవిభవప్రభవము, ప్రాతిస్వికకలనఁ బొగడఁ ♦ బడె నెల్లెడలన్.

ఆ॥ రామ; నాటఁగోలె ♦ నామేటి మర్యాద, జనపదములు పెనుపు ♦ దనర నొప్పెఁ
బెద్దకాలమునకుఁ ♦ జేరుమాలిన ఘోర, మనఁగ రాక్షసాఘ ♦ మాక్రమించె.

క॥ మత్తిలి తము వారేఁపఁగ, నొత్తుమువడి యెల్ల రొయ్య ♦ నొయ్య నొదుఁగ ని
క్కెత్తెఁ దల విపిన మియ్యెడఁ, గత్తిఁ జొనుపరా దనంగఁ ♦ గదిసెం దరువుల్.

ఆ॥ క్రూరసత్త్వములకుఁ ♦ గూర్చు నట్టిదియును, రాక్షసాఘసంచ ♦ రణము గన్న
యదియు నైన నింక ♦ నడుగిడువా రెవ్వఁ, రచటనుండు జీవ ♦ నార్థపరులు.

—♦ తాటకా వృత్తాంత కథనము ♦—

క॥ ఇయ్యడవిఁ దిరుగు రక్కసి, తొయ్యలి యొక్కొండు మిత్తి ♦ దోయము దాని
దయ్య మని తలఁగఁ గాంతురు, నెయ్యముచే పెల్లవారి ♦ నెమకి భుజించున్.

ఆ॥ సురలు నరులు మునులు ♦ చుట్టము ల్వెరవారు, నాఁగఁ జెల్ల దీవి ♦ భాగ మేరి
నేనిఁ బట్టి చంపు ♦ నింతి నాగసహస్ర, బలము గలుగునది య ♦ బలయు తలఁప.

వ॥ ఏతదీయంబగు వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా నెఱింగించువాఁడ రఘునాథ
మణీ ; యింక సావధానుండవై వినుము. ౨౨౬

ఆ॥ అనఘ; మును సుకేతుఁ ♦ డను మహాయక్షుండు
తనకు సుతులు లేమి ♦ ధాతఁ గూర్చి
తప మొనర్చ విధియుఁ ♦ దానిచ్చె వేయునే
నుఁగుల బలముగల త ♦ నూజ నొకతె. ౨౨౭

వ॥ పదంపడి సుకేతుండును దానికిఁ దాటకయను నామధేయంబిడి ప్రేమాతిరేకంబు
నం బెనిచి కౌమరప్రాయంబునం గౌమరారు నిజకుమారికం గనుంగొని. ౨౨౮

క॥ సుందుఁ డను నతఁడు ప్రబలుఁ, డిందుముఖికిఁ దగు నటంచు ♦ నిచ్చెఁ ద్రిలోకీ
సుందరి వానికి వాఁడును, మందగమనతో సుఖాబ్ధి ♦ మగ్నతఁ బొదలెన్. ౨౩౦

ఆ॥ కలభమిథునకలనఁ ♦ గదిసి వారిరువు రొం
డొరుల రతుల నోరయు ♦ చుండు నంతఁ
గొంతకాలమునకు ♦ గొంతి మారీచసు
బాహులను సుబాహు ♦ బలురఁ గనియె. ౨౩౧

శా॥ సుందుం డంతటఁ గొన్నినాళ్లకు రణ ♦ క్షోణీస్థలిం జెళ్లఁ దా
నెందుం బుత్రులఁ గొంచు నంజ లిడుచున్ ♦ హీనస్వభావంబునన్
గ్రిందు స్మీఁదుఁ దలంప కొక్కయెడ నా ♦ క్షేపించె సన్మౌని చం
ద్రుం డైత్యేభహరిం దపోమయు నగ ♦ స్త్యుం దైవయోగంబునన్. ౨౩౨

ఆ॥ అమ్మహాత్ముఁ డలిగి ♦ యా యక్షి రక్కసి, గమ్ము ఘోరరూప ♦ కలితు లగుచు
నీవు నీదుసుతులు ♦ నెఱిమాలి కుణపభ, క్షణము గనుడు పెద్ద ♦ కాల మనియె.

తే॥ ఆఘనుఁడు పల్కినంతనే ♦ యట్టిద గతి
వారి కొదవెను నానాఁట ♦ దారుణాఘ
ములకు వెరవేది ♦ కొందఱ ద్రుక్కిడులనుఁ
గూడి యిటఁ జేరి యాశ్రమ ♦ కూటములను. ౨౩౪

క॥ విశసనముసేయ రోయుచుఁ, బశువిసరము నట్లు మునుల ♦ భంజింపుచు దు
ర్దశఁ ద్రిదశులకునుఁ గొసరుచుఁ, బ్రశాంతిచే కెల్లవారి ♦ బాధింపంగన్. ౨౩౫

వ॥ అమ్మాయి సమ్మారీమహోపద్రవ మ్మొల్లకడల గడలుకొనుడుఁ గాలక్రమంబున.

ఉ॥ పెక్కులు జన్నము ల్మడఁగెఁ ♦ బెక్కురు భూసురు లుక్కడంగి రీ
దిక్కునఁ బెక్కు సత్త్వ బల ♦ దృప్తులు రాక్షసుల ల్నశించి రీ
సెక్కినఁ దాటకాపద మ ♦ హీనత నెల్లర ప్రాణవాయువుల్
దక్కక గ్రోలు నిక్క మని ♦ దానవిఁ బేర్కొన రొక్కరేనియున్. ౨౩౬

ఆ॥ రామ; నీకుఁ దక్కఁ ♦ బ్రావేల్పు మొనటులఁ
బొదువఁ జిదుమ వెసల ♦ నోదుఁగఁ గదుమ
జేరుమాయఁ జేయఁ ♦ జెరవారి కగు నెట్లు
జగముప్రోపు వెరవు ♦ నెగడకునికి. ౨౩౭

వ॥ అది యట్లుండని మ్మొటు లేనియు నియ్యరణ్యపథంబున. ౨౩౮

క॥ సన్నద్ధులరై యిఁక మా, యన్నా ; తమ్ముఁడును నీవు ♦ నడుగిడుటయ మే
లన్న నటు లమరి యిరువురుఁ, గ్రన్నన జ్యాలతల మ్రోయఁ ♦ గా జేయుటయున్

వ॥ అ య్యపూర్వగుణవల్లికామతల్లికాసముల్లసితప్రాతిస్విక్షోర్జస్వలమహానిస్వనం బా
కర్ణించి. ౨౪౧

సీ॥ మసి ప్రోవిడిన భాతి ♦ నెసఁగు నైజాకృతి, దెసలఁ జీఁకటిలోయఁ ♦ దెరలఁద్రోయ
జగము ముంపఁగనున్న ♦ చపల యామసి గన్న, చకచక ల్కను లేక ♦ సరసి దోఁక
బారుకట్టిన లీల ♦ బరఁగి పున్కలమాల, ఘనబలాకాస్థాన ♦ కలన నీన
నాంత్ర మేఖల నోలి ♦ హాత్తిల్లు కుణపాలి, నగల డాల్హారిచాప ♦ ముగతికోపఁ
దాటకాకాలకాలిక ♦ తామసప్రవ, సక్తిగర్జ లెలర్ప మో ♦ సల వనాలి
సుడియు రయమార ♦ నల్లంతఁ జూచుప్రజకు, వెగడుదోఁప మహారజో ♦ వృష్టిగదిసె

క॥ వడవడ వడఁకెను భూతము, లెడ పెట్టక మ్రోసె సురమ ♦ హీధరము గుహల్
సడలెఁ గడ లాకసంబునుఁ, దొడరె నుడులు రాల నసుర ♦ దోఁతెంచు నెడన్.

చ॥ అది గని తాపసోత్తముఁ డ ♦ హా! రఘురామ; యుపేక్ష సెల్ల ది
య్యెదుటు దురంత మొక్కట ల ♦ యోగ్రుఁ గృతాంతుఁ బెరల్ప నోప్ప బ
ల్లిదుఁ డొకఁడే నెదిర్చి మనె ♦ లెక్కకు నాఁజన దింతవట్టు నీ
ప్రదరము వేఁడి చూపు మెడఁ ♦ బాపు సుధీసుమనోమనోవ్యథల్. ౨౪౪

క॥ ఆఁడుది తెగఁజూడఁగ నెట్టు, కూడు నిసీ యనకు దీని ♦ క్రూరదవజ్వా
లాడంబరము నవాబ్దము, జాడం జల్లార్పకున్న ♦ జగములు మనునే. ౨౪౫

ఉ॥ పాతకమేని ఘాతుకతి ♦ పాల్పడు నేనిఁ దలంక రాదు క్షా
త్రాతతవృత్తి లోకవిహి ♦ తాచరణం బొనరించుపట్ల రా
ట్పాతికి భూసతి న్నడఁపఁ ♦ జూచు విరోచనపుత్రి శక్రుఁడున్
వాత్రికి వానిఁ దెచ్చు భృగు ♦ పత్ని జనార్దనుఁడు వ్వధింపరే. ౨౪౬

క॥ ఆదోషము నృపసూతిం, బాదుకొనంబోదు నిఖిల ♦ పాలనదీక్షా
సాదితశుచిత్వకలన, న్నాదన నెట్టు లగ్ని సర్వ ♦ ఘస్మరుఁ డనుచున్. ౨౪౭

ఆ॥ అడవి తోడసు గెడపు ♦ న వ్వేఁటకానికిఁ
బోడువఁ జనదె యోఁడు ♦ పులి దోడరినఁ
జెడుగు ఘాలసుదిండి ♦ శిక్షింపబె భవదాయు
ధాగ్ని వేల్చు పశువు ♦ నట్టులసిన. ౨౪౮

క॥ వేదోపబృంహకంబులు. భేదరహిత; మిమ్ముఁబోంట్ల ♦ స్మృతవచనముల్
గాదన్న మాఱుస్మృష్టికి, సీదగు మాహాత్మ్యకలన ♦ నెలవు మునీంద్రా. ౨౪౯

వ॥ అయ్యది యట్టిద యగు నది యునుంగాక. ౨౫౦

ఆ॥ మమ్ముఁ బనుచు వేళ ♦ మాయయ్య తనమాఱు, నిన్ను భక్తిఁ గొలువ ♦ నీయనుజ్ఞ
నే యవస్థ నెటుల ♦ నేని మీఱక యుండ, నెఱపె నాన మాకు ♦ నియతమదియ.

వ॥ అట్లుంగావున. ౨౫౧

తే॥ ఎల్లశక్తులు గలిగి స ♦ మిద్ధకీర్తి
వైన నీపంపు సేయుట ♦ కాని దెట్టు
లని తథాస్తువచశ్శ్రీతి ♦ కనురణనము
గాఁగ ప్రమోయించె గుణముని ♦ క్ష్వాకుకులుఁడు. ౨౫౩

వ॥ అయ్యాసురియు సురేంద్ర ప్రముఖులు సురవర్త్మంబున నొదిఁగి యొదిఁగి చూచుచుండ. ౨౫౪

## —♦ తాటకా సంహారము ♦—

ఉ॥ ఆరవ మాలకించి యవు ♦ నౌనను మిత్తినె పిల్చుచున్నవాఁ
డేరికి శక్య మీపని ని ♦ రీహుఁడవో తడవేల యంచు న
ద్దారి విశాలసాల మొక ♦ తాఁకునఁ గూలిచి కైనమర్చి గం
భీరనినాద మొప్ప రఘు ♦ వీరకిశోరముఁ జేర వచ్చినన్. ౨౫౫

ఆ॥ అర్ధచంద్రభల్ల ♦ హతిఁ దరు వింతింత, లై పడంగ రాముఁ ♦ డవనిఁ గూల్చి
దాని దీర్ఘబాహు ♦ దండము ల్నఱికె ల, క్ష్మణుఁడుఁ గోసె నాసి ♦ కను శ్రుతులను.

క॥ ఆ యక్షాంగన మొరయుచు, మాయాబలకలన మేఘ ♦ మార్గము వలనన్
స్థాయచ్ఛిలాసహస్రిము, లా యిరువురిపై మహోగ్ర ♦ మై వర్షించెన్ .

క॥ ముని రక్షోఘ్నామ్నాయము, లనుఁ జదివి జయోస్తురామ; ♦ లక్ష్మణ; యువయో
స్తని సంజ దొడరు నింకిట, జన దాలస్యంబు వేగఁ జంపన తగునాన్. ౨౫౮

క॥ ఆలో నాలోలాత్మక, యాలోఁ తరయంగ లేని ♦ దై వారి పయిన్
జాలుకొలిపె మాయాస్ర, గ్జాలాశనివృష్టి దుష్ట ♦ జలదాకృతియై. ౨౫౯

క॥ కన్నులు గానని యఁన్నెరిఁ, బన్నె రజోవర్ష మదియుఁ ♦ బ్రబలి యలమె నా
మిన్నును మన్ను నొకఁడుగా, బన్నమ చూపట్టె దాని ♦ పలుపోకడలన్. ౨౬౦

ఆ॥ అబల ప్రబల గాన ♦ నతిమానమాయిక, ధర్షణములతో న ♦ మర్షణంబుఁ
బెరుఁగఁ దఱుగు లేని ♦ పీడ లొనర్చుచు,నెదురుపడక యడరు ♦ టేర్పడుటయు.

క॥ దాశరథి దయాశరధి త, దాశరవనితాదురధ్వ ♦ మారసి యనుజుం
డాశల దృష్టి నెఱపు న, య్యాశయ మూహించి యిట్లు ♦ లనె నాతనితోన్.

ఉ॥ చూచితె లక్ష్మణా ; జలధి ♦ సూడున గో డిది యాఁడుపాడి నా
కేచి యలంపఁ జొచ్చె నిసి ; ♦ యెట్టులు బోటి వధింతు నెట్టెటో
పాచినఁబాయునం చరయు ♦ పద్ధతి యుద్ధతి కిట్లు మార్చెఁ జు
మ్మా ; చెడు గీదురంత బరి ♦ మార్చెదఁ జేర్చు శరోత్తమాహతిన్, ౨౬౩

క॥ అని సహజు సాధువచనం, బను మోదించి రఘువీరుఁ డస్త్రం బొకఁ డెం
చి నిశామోజ్జ్వల మగున, ట్లొనరింపఁ దలంపు పెట్టి ♦ యున్నట్టి యెడన్. ౨౬౪

ఆ॥ అసురి యశ్మవర్ష ♦ మాకీర్యమాణులఁ, జేయఁ గర్జమెడఁదఁ ♦ జేర్చువారిఁ
గాంచి గాధిసుతుఁడు ♦ ఘనతేజుఁ డిట్లనె, రాముతోడఁ దత్స ♦ రత్వమొలయ.

ఆ॥ ఇంక మాయలాఁడి ♦ యేపార నున్నది, దుష్ట తోఁన దీని ♦ ద్రుంపుమయ్య
చాన యను ఘృణార్తిఁ ♦ జాలింపు మీసంజ, తోఁడరఁ బాపురాలిఁ♦గడచుటరిది.

క॥ అని త్వరపడుచుం దెలుపఁగ, జననాథసుతుండు దాని ♦ సంరంభం బో
య్యనఁ ద్రోవ శబ్దవేధి, త్వనిర్ఘోషిం బఱపె నస్త్రు ♦ తత్తసుర లలరన్. ౨౬౭

ఆ॥ శబ్దపాతిబాణ ♦ శక్తిచే నాసురి
మాయ గెడపునంత ♦ మాయలాఁడి
మఱుఁగు దొఱఁగి రాము ♦ మార్కొనఁ జెనుగొండ
వోలె దొరలె సురలు ♦ జాలిపడఁగ. ౨౬౮

క॥ శరజాలరుద్ధయై యా, శరరూపిణి యక్షి మాయ ♦ జతగొను బలస
త్వరగతు లొప్పఁగ నఱికెను, నరనాథాత్మజులపై ని ♦ నాద మెసఁగన్. ౨౬౯

ఆ॥ పిడుగు వోలెఁ దమ్ముఁ ♦ బెరయు దురాసద, యక్షపుత్త్రి రాక్ష ♦ సాత్మవేధ
కలిత నాటకప్ర ♦ చలితఁ దాటక రాముఁ, డరయఁ గాంచి రభస ♦ మతిశయిల్ల.

క॥ క్రూరాస్త్ర మొండు గొని రఘు, వీరుఁడు సంధించి మంత్ర ♦ విలసన మెసఁగం
గా రక్కసి పేరురమున, భోరన నాటె న్జగత్ప్రి ♦ మోదము పొసఁగన్. ౨౭౧

ఆ॥ ఎవఁడు దుర్వినీతుఁ ♦ డెవఁడు లోకద్రోహి, వాని కిదియ చూ; య ♦ వస్థ యనుచు
రావణునకుఁ దెలుపు ♦ రవణ ఘోషింపుచుఁ, బడె ధరాతలమునఁ ♦ బాప యక్షి.

మ॥ ఇలపై రక్కసి కూలఁగా నదరె భో ♦ గీంద్రోత్తమాంగంబు ల
ప్పలలాశిప్రకరంబు గుండియలు దే ♦ వద్వేషి నేత్రాంతమా
లిలసద్రత్నము లట్లు బద్ధదివిష ♦ ల్లీలావతీవామన
క్షులు తద్వల్లభదక్షిణేక్షణభుజా ♦ క్రోడమ్ము లొక్కుమ్మడిన్.

తే॥ అగము లగలంగ నటు వ్రాలి ♦ యక్కజంపుఁ
జాల్పును వెడల్పుఁ దగ నొప్పెఁ ♦ జాన మేను
రక్కసులఁ ద్రుంచు పనికినై ♦ రాముఁ డాయి
తం బొనర్చిన ఘంటాప ♦ థం బనంగ. ౨౭౪

క॥ దవ్వుల దవ్వుల నిలఁబడి, యవ్వీరులపైఁ బహర్ష ♦ మమరఁగ నమరుల్
పువ్వుల ఱువ్వఁ దొడంగిరి, మవ్వము నివ్వటిల మౌని ♦ మండలి పొగడన్.

—♦ దేవతలు శ్రీరాముని స్తుతియించుట ♦—

ఆ॥ ఎలమి సురలు మునులు ♦ నిందుఁ బ్రముఖు లగుచు గొని
వచ్చి తచ్చిదంశ ♦ వర్ణ్య దేవ
దేవుఁ గాంచి మించు ♦ ధృతిఁ బొగడిరి ప్రీతిఁ
బడయఁజేయు పలుకు ♦ బహులు పొనర. ౨౭౬

క॥ మాభాగ్యము ఫలియించెను, మాభాగ్యము పంట యిట్లు ♦ మము దేర్ప జగ
త్క్షోభం బెడలింపఁగ ర, క్షోభంజనముం బొనర్చు ♦ సూటిఁ దలిర్పన్. ౨౭౭

మ॥ ఇదె కాదే సనకాది నుత్యరసనా ♦ హిత్యంబు సత్యంబు ము
న్నిదె కాదే మణి యిందిరారమణి భూ ♦ యిష్ఠం బభీష్టాస్పదం
బిదె కాదే ఫణిశయ్యఁ బాలకడలిన్ ♦ హేతుస్థితిం బొల్చు తే
జిదె కాదే జగతీతపఃఫలితమా ♦ నిర్మోహనాఖ్యానమున్. ౨౭౮

క॥ మెచ్చితి వయ్యా మునీ; త్రో, త్తెచ్చితి వయ్యా హరిన్ను ♦ హిం కి ద్యోస్థలికి
న్దెచ్చితి వయ్యా సుఖములు, సొచ్చితి వయ్యా యలభ్య ♦ శుభదాస్పదమున్.

తే॥ నీకు భద్రంబు కౌశిక ♦ నిష్ఠితుండ, వైతివే యింక రాము నె ♦ య్యంబు విడకు
మాభృశాశ్వసుతాద్యశ ♦ లాస్త్రశస్త్ర, విద్య లన్నియు నిచ్చోట ♦ వెలయ నిడుము.

ఆ॥ బ్రహ్మమూర్తి; నీకుఁ ♦ బాత్రభూతుం డైన, శిష్యుఁ డమరినాఁడు ♦ సిరికి నెలవు
దైవకార్యములును ♦ దరము మీఱినయవి, గలవు గాన నింత ♦ గని మెలఁగుము

క॥ అందఱము తృప్తినొందితి, మందని ఫల మందఁ జేసి ♦ తౌ, నౌ, నీమే
లిందఱము మఱవ మింకిట, నుందుము నీకీర్తిఁ బొగడు ♦ చుండు వలనునన్.

క॥ అని యిట్లు లెల్లసురలును, మునులును ముచ్చటల మాట ♦ ముచ్చటలం గై
కొని ముచ్చటించు చుండెడు, ననువునఁ దన మేలి ముడుప ♦ మలరారంగన్.

శా॥ వేయుంగన్నుల బాష్పము ల్దొనఁక ని ♦ ర్వేలప్రమోదాయితం
బై యుల్లం బలరారఁ జేరి మునిచం ♦ ద్రా; సద్దయాసాంద్ర; మా
యాయాసం బెడలింప రాము నయవి ♦ ద్యాధాముఁ దోడ్తెచ్చి తం
చా యింద్రుండు నుతించె మించె సురక ♦ న్యాగీతనృత్యక్రియల్. ౨౮౪

క॥ అందఱు నన్నుతిఁ బొగడుచు, నందము చందమ్ము వెలయ ♦ నటఁ జని రాసం
క్రందనముఖ్యులు రాముని, యం దిరవొందిన మనముల ♦ నల్లఁ దడవుచున్.

ఆ॥ మేఘమాలఁ దొఱఁగి ♦ మెఱయు చందురు రేక, చెలువ మలవరించి ♦ చిన్నెలాఁడి
వేల్పుకన్నె మిన్న ♦ వెలఁబొల్చి దివినిల్చి, పొగడె రాము భక్తి ♦ పూర్వకముగ.

## —♦ తాటకాకృతస్తవము ♦—

మంజుభాషిణీ వృత్తములు.

పెనుఁబల్కుటాంౘ్రడు మురి ♦ పెంబు పేర్మిని, న్గొనియాడి తృప్తి కొన ♦ గూరలేరనా
ననుఁబోంట్ల కేమిగతి ♦ నన్నుఁగన్నయ, న్న; నవోదయా; భువన ♦ నాయకా; హరీ.
మునుల న్సాధించి మఖ ♦ ము ల్గలంచినేఁ, బెనుమారి వోలె వనిఁ♦ బెర్మిమాలి యి
ట్లనరాని కిల్బిషము ♦ లాచరించి యే, మన నీదుచూడ్కి కెదు ♦ రైతి నోహరీ.
తొలినోముపంట తులఁ♦ దూఁగ సాగెనో, కలగుండునై సురలు ♦ కాంక్ష వేఁడిరో
కలుషాలి నన్యగతి ♦ గా గణించిరో, వెలలేని నీనెనరు ♦ వేడ్కయో హరీ. ౨౯౧
విషమెప్డు జీవితము ♦ వేయునేల నీ, మిషలేని సత్కరుణ ♦ మేలుకొంటి నాఁ
డుషఁబోసి ముత్తెముల♦దూఁచుకొంటిఁబో, సుషమాంచితా; నిగమ♦సూచితా; హరీ.
ఇనవంశమందు జని ♦ యించి దుష్టనా, శనశిష్టరక్షలను ♦ సంస్కరించి మే
దిని ధన్యఁజేయఁ జను ♦ దెంచినాడవీ, వన రాజమాత్రుఁడవె ♦ యచ్యుతా; హరీ.
తుది గాంతు నీదుగుణ ♦ తోయరాశి కె, ట్లదిగాన వందనము ♦ లాచరింతు మే
ల్మదిఁగోరి కాదె మును ♦ మాని శాపమి, చ్చె దయానిధీ; వరద ♦ శ్రీపతీ; హరీ; ౨౯౨
ఎది శబ్దకోటి కెన ♦ యిఁపఁగాదొ మె, య్యది యర్థతత్త్వమున ♦ కందరానిదో
యది నీదురూప మను ♦ నర్థిను ల్కృతు, ల్వేదితాత్మకా; వెరవు ♦ లేక శ్రీహరీ. ౨౯౩
మహాదాది కవ్వలని ♦ మాట యన్నఁద, న్మహిమావృతు ల్గనెడు ♦ మార్గ మున్నె నీ
జహాదంకదృక్కలిత ♦ సత్కటాక్షసం, నహానంబు గా కఖిల ♦ నాథ; శ్రీహరీ. ౨౯౪
నినుఁ జిత్తసీమ నెఱి ♦ నిల్పి వేఁడఁ బా, వనవృత్తి నీకథలు ♦ పాటఁబాడ నీ
మను వెప్డు జిహ్వానల ♦ మంగఁ జూడ నా, కొనగూర్పు రామపద ♦ యోగి; శ్రీహరీ;

వ॥ అని యిత్తెఱంగునం దెఱగంటియన్నుమిన్న చెన్ను గైకొన్న యక్కన్నియ ప్రపన్నభావంబునం గఱకుఱాల్గరంగు రంగుమీఱం గొనియాడిన రఘువంశపుంగవుండు. ౨౯౬

తే॥ మంజుభాషిణి నీస్తుతి ♦ మంజిమంబు, హాళి విబుధాళి కర్ణర ♦ సాయనంబు
మమ్ము మఱవకు మమ్మ; పో♦మరుదధీశ, పురవరవిహారసుఖములఁ♦బొదలు మెపుడు.

క॥ అని పలికిన రఘుపతిఁ గని, వినయానత యగుచు ౘ్రమొక్కి ♦ వీడ్కొనె యక్షాం
గన వ్యోమయానగతయై, మనము తదీయాంఘ్రికమల ♦ మగ్నతఁ బొదలన్.

వ॥ అవ్విధంబున నయ్యక్షకాంత సుమహాహ్లాదయసంక్రాంతయై దేవలోకంబున కరుగుటయు. ౨౯౭

తే॥ తపసి రాముని గౌఁగిటఁ ♦ దార్చి శిరము
మూర్కొని ప్రమోదభరితుఁడై ♦ ముద్దులుగొని
చాల మేలయ్యె బ్రదికె ము ♦ జ్జగము నీదు
నెనరుపేర్మి మాకోర్కెలు ♦ నేఁడు దీరె. ౩౦౦

తే॥ రామ; శుభదర్శన; గుణాభి ♦ రామ; యింద
యుండ మీ రే గడవ నెల్లి ♦ యుదయవేళ
నస్మదీయాశ్రమపదమ్ము ♦ నందఁ గాంతు
మనిన వల్లె యటంచు న ♦ య్యధిపు సుతులు. ౩౦౧

క॥ మునిఁ గొలిచి యచట నుండిరి, ఘనశాపవిమోక మెనసి ♦ కానన మారే
యిన చైత్రరథము నందన, మును నగుచు మహావికాస ♦ మున నలువొందెన్.

ఆ॥ సుఖితు లగుచు రాజ ♦ సుతు లచ్చటున నిద్ర, సేసి మేలుకాంచి ♦ సిరులు దనర
మహితకీర్తి మౌని ♦ మాన్య విశ్వామిత్రు, సొరసి కర్జ మడుగఁ ♦ దొడర టయును.

క॥ తిన్నని చిఱునగవున మో, మన్నెఱ వికసితము కమల ♦ మగు చుండ మహా
భ్యున్నతుఁడు మౌని మధురో, క్తి న్నెలకొనఁ జేసె రాము ♦ ధృతిఁ గన్గొనుచున్.

ఆ॥ అయ్య, నీకు భద్ర ♦ మగుఁగాత సత్కీర్తి, యొలసె రాజపుత్ర ♦ వలచి నిన్ను
నెఱసె నాదు ప్రీతి ♦ నీ దెసఁ బరమమై, యెల్ల యస్త్రనివహ ♦ మిచ్చువాఁడ. ౩౦౨

ఉ॥ అన్న; భృశాశ్వనందను ల ♦ హర్పతికల్పులు శస్త్రరూపసం
పన్నులు జృంభకాదులగు ♦ వారల నూర్వుర లోకరక్షకై
మున్ను సృజించి రన్నలువ ♦ మున్నగు నేతలు యోగశక్తి నెం
దున్న జయంబ యయ్యెడ న ♦ నుత్తమధీమదుపాస్య లాఘునుల్. ౩౦౩

ఆ॥ ఇవి రహస్యవిద్య ♦ లే నెఱింగితిఁ గూర్మి, నవియు నింకఁ గొన్ని ♦ యస్త్రములును
నీకొసంగువాఁడ ♦ నియతిఁ గైకొమ్ము ని, న్నెదిరిచూడ లేరు ♦ దితిజు లెపుడు. ౩౦౪

ఆ॥ అఖిలదేవగణము ♦ లసురులు గంధర్వు, లురగు లెందఱేని ♦ నరు లితరులు
నిన్నెదిర్చి కలన ♦ నిలువ నోపరు వారి, నిగ్రహించి గెలుతు ♦ నిశ్చయముగ.

వ॥ అని యిట్లు తాపసేంద్రుం డానతిచ్చిన విని శ్రీరామచంద్రుం డానందసాంద్రుండు సుస్నాతుండు సుసంశుద్ధుండునై వాచంయమవరేణ్యుని చరణనలినయుగలంబునకు మించు భక్తి సాష్టాంగప్రణామం బాచరించి తత్సాన్నిధ్యంబునం దదనుమతిం గుశాసనోపవిష్టుండై మౌనముద్రానియతి నేకతానత్వంబు వఱల నలువొందు

చున్నంత మునివరుండును శుచియుఁ బ్రాఙ్ముఖాస్తరణోపవిష్టుండు నగుచు సుసం
శ్రితత్వంబు నెగడొంద నమ్మంత్రగ్రామంబు సమస్తంబును వేఱువేఱ నభివర్ణిం
చుచు నివేదింపం దొడరె నప్పు డప్పుణ్యరాశి వలననుండి ధర్మమర్మశర్మ
దంబులగు దండచక్రంబును ధర్మచక్రంబునుఁ గాలచక్రంబును విష్ణుచక్రంబును
నత్యుగ్రం బైంద్రాస్త్రంబును వజ్రాస్త్రంబును శైవశూలవరంబును బ్రహ్మశిరో
నామకంబును నైషీకంబును ననుత్తమబ్రహ్మాస్త్రంబును మోదకియు శిఖరియు
నను రెండుగదలును ధర్మపాశంబునుఁ గాలపాశంబును వరుణపాశంబును శుష్కా
ర్ద్రాశనులునుఁ బైనాకంబును నారాయణంబును శిఖరం బను మహాగ్నేయం
బునుఁ బ్రథనం బను వాయవ్యంబును హయశిరోనామకంబునుఁ గ్రౌంచాస్త్రం
బును విష్ణుశక్తియు రుద్రశక్తియుఁ గంకాలముసలఘోరకాపాలకంకణప్రధానంబు
లగు నసురధార్యాస్త్రంబులును నందనం బను వైద్యాధరమహాసిరత్నంబును గాంధ
ర్వంబున మానవంబును బ్రస్వాపనప్రశమనంబులును సౌరంబును దర్పణంబును
శోషణంబును సంతాపనవిలాపనంబులును మదనంబునుఁ బైశాచంబును మోహ
నంబునుఁ దామసంబును సౌమనసంబును సంవర్ధంబును మౌసలంబును మాయా
ధరంబునుఁ బర తేజోఽపకర్షణం బగు తేజఃప్రభంబునుఁ వ్యాప్తిం బగు శిశిరంబును
శీతేషువను భగవైవత్యంబును నను నిమ్మహాస్త్రంబులు బహుబలంబులుఁ గామ
రూపంబులునై యొప్పారునవి యొక్కుమ్మడి నమ్మహామునివరుం డనుష్ఠానపరుం
డగుచుం బ్రేరేప రఘునాథునియందుఁ బ్రవేశించి సన్నిధినేసి సంతసంబునం
బ్రాంజలులగుచు నయ్యస్త్రరాజంబులు పరమోదారులమై నెగడొందు నీ వంక
వారలమెల్ల నీదుకింకరుల మో రామా ; పరంధామా ; శ్రితజనకల్పకారామా ;
యేలుకొను మనవుడుఁ బ్రతిగ్రహించి సంతోషంబున మించి పాణిపద్మంబున
సంస్పృశించి మానసంబులై నాతలఁచినయప్పుడు సాక్షాత్కరించునది యనిన
వల్లెయని యమ్మంత్రదేవత లంతర్ధానంబు సేసిరి తదనంతరావసరంబున. ౩౦౯

ఆ॥ మౌనివరున కెఱఁగి ♦ మౌనిమండలనుతుఁ డరుస మెసఁగఁ బ్రీతుఁ ♦ డగుచు స్వాశ్ర
మాధిగమశుభంగ ♦ మాభిముఖ్యం బట్టు, లెఱుక సేసి మఱియు ♦ నిట్టులనియె.

ఆ॥ గురువరేణ్య; యింత ♦ గూర్తె మంత్రాగమ, శక్తి యెల్లఁ గైవ ♦ సం బొనర్చి
తింక నీదు కరుణ ♦ నే వెంటఁ జనుమన్న, నట్లుమెలఁగువాఁడ ♦ నలవు మెఱయ.

క॥ భగవంతుఁడ ; నీ నెనరున, నగణితవిద్యాప్రసక్తి ♦ నందితి నింకన్
సుగమము విజయము సురలున్, బ్రగల్భు లనరాదు తేఱి ♦ పాఱ ననుఁ గనన్.

క॥ ఉపసంహారక్రియ మో, యుపరతనామ్నాయమూర్తి; యొసఁగుము తోడ్తో
నపచారివిదలనం బను, సుపుణ్యకృతి నెగడువాఁడ ♦ సూనృతనిభృతిన్.

క॥ అన విని విశ్వామిత్రుం, డనుపమవాత్సల్యయోగ ♦ మలరఁగ గాకు
త్స్థునకు శుచివ్రతనిష్ఠత, ఘనసంహారక్రమప్ర ♦ కరణము దెలిపెన్. ౩౧౮

వ॥ వెండియు సత్యవంతుండును సత్యకీర్తియు ధృష్టుండును రభసుండును ప్రతిహారతరుం
డునుఁ బరాఙ్ముఖుండు నవాఙ్ముఖుండును లక్ష్యాక్షుండును విషముండును దృఢ
నాభుండును సునాభకుండును దశాక్షుండును శతవక్త్రుండును దశశీర్షుండును శతో
దరుండునుఁ బద్మనాభుండును సునాభుండును జ్యోతిషుఁడునుఁ గృశనుండును
నైరాశ్యుండును విమలుండును యోగంధరుండును హారిద్రుండును దైత్యుం
డునుఁ బ్రశమనుండును శుచిర్బాహుండును మహాబాహుండును నిష్కలియు
విరుచియు సార్చిర్మాలియు ధృతిర్మాలియు వృత్తిమంతుండును రుచిరుండునుఁ
బితృసౌమనసుండును విధూతుండును మకరుండును కరవీరకరుండును ధనుండును
ధాన్యుండునుఁ గామరూపుండునుఁ గామరుచియు మోహుండును నావరణుండును
జృంభకుండును సర్వనాభుండును సంతానుండును వరణుండును ననం బేరొందిన
వారి నిందఱ మఱికొందఱ భృశాశ్వనందనులం జేకొని మునినాయకుండు
రఘునాయకమణీ ; యివ్వారలు మహాభాస్వరులు కామరూపులు శస్త్రాస్త్ర
మూర్తులునై దుర్జనహరణంబును సజ్జనభరణంబును గావింప దొరఁకొను వారికి
సహాయులుగాఁ బ్రజాపతిశాసనంబునం బ్రవర్తించుచుండువారు మదుపాసితులై
మద్వశంగతులై యున్నవా రట్లుంగావున నిమ్మహామంత్రరహస్యవిద్యలం గూడ
మాపాలివాఁడ వగు నీకు సమర్పించువాఁడ, భాజనంబ వగు నీవు పరిగ్రహింపుము
సమస్తకల్యాణగుణాభిరామా శ్రీరామా యభ్యుదయపరంపరల ననుభవింపుము.
దీనం జేసి యేనునుఁ జరితార్థుండ నౌదునిట్లని యాదివ్యబోధుండు ప్రబోధించిన.

క॥ మేలనుచుం గాకుత్స్థుఁడు, మేళన మొప్పార మేల్మి ♦ మెయికొనఁగఁ బ్రహ
ర్షాలంబనమై కైకొనె, శ్రీలసితతదస్త్రమంత్ర ♦ సిద్ధార్థములన్. ౩౧౯

తే॥ ఆ తపసివేఁడివేల్పు నం ♦ దమరు మంత్ర, సమితిదీధితు లట్టు రామ ♦ చంద్రు నందు
సంక్రమించి వెలుంగుటఁ ♦ జాలె హేతు, వుభయనిష్ఠతమోనుత్త్వ ♦ యుక్తి కదియ.

క॥ అమ్ముని యనుశాసనమున, నమ్మహనీయాస్త్రదైవ ♦ తాలియుఁ దోడ్తో
సమ్ముఖము సేసె రాఘవుఁ, డమ్మెయి మహిమమ్ము లెంచి ♦ యలరారంగన్.

ఆ॥ మూర్తు లెనసి నట్టి ♦ మురిపెమ్ము లమ్మోటి, మంత్రరాజు లటు సు ♦ మాళ మెసఁగ
దివ్యభాస్వరాంగ ♦ దేదీప్యమానులై, సన్నిధానకృతిఁ బొ ♦ సంగ నగుచు.

తే॥ కొంద ఱంగారసదృశులు ♦ కొంద ఱందు
ధూమభూమోపములు సుధా ♦ ధామలక్ష్మ్య
లక్షసన్నిభులును నయి ♦ యుండ వార
లెల్లఁ గన్గంటఁ గాన్పించి ♦ రెలమి మీఱ. ౩౨౦

క॥ ప్రహ్వాంజలిపుటులై త, ద్బహ్వర్థం బెంచి యెంచు ♦ ప్రణుతులు స్తుతులున్
జిహ్వాలు కృతార్థలుగ మఘు, వాహ్వానము లొప్పఁ గూర్చి ♦ యని రధిపునితోన్.

తే॥ అనఘ; మంత్రదైవతముల ♦ మైన మేము, నీకు వశ్యుల మెప్పుడు ♦ నీదు పంపు
సేయ నున్నార మెది యేని ♦ సేఁ వొసంగు, మిచ్చవచ్చిన విధి నెప్పు ♦ డెప్పుడేని.

క॥ నీకింకఁ గుల మహీశా; మా కెవ్వాసన మొసంగి ♦ మలయుంచెదన్
యా కలన మెలఁగువారల, మీ కరణికటాక్షదృష్టు ♦ లెనయింపఁగదే. ౩౨౩

ఆ॥ అనుచు వారు వేఁడ ♦ నజ్ఞాయతాత్ముండు, రాముఁ డఖిలసుగుణ ♦ ధాముఁ డలరి
ముని ప్రసాద మెడఁద ♦ మువ్వోకఁ దలపోసి, మేలితలఁపు లొకట ♦ మేలుకొనఁగ.

వ॥ భక్తివినయవివేకపురస్సరంబుగా నమ్మంత్రరాజాధిదేవతలకుం దానునుఁ గేలు మోడ్చి వలయునప్పుడెల్ల నేను మిమ్ము డెందంబునం దలంచువాఁడ మానసులరై మీరలయ్యనువునం గానుపించి నాకుం గూర్చు నక్కర్జంబు సమకూర్చుండని విన్నవించిన మేలెంచి యవ్వేలుపు లమ్మహామహునిఁ జెక్కుటెఱంగులం గాని యాడి యంతర్ధానంబుసేయ సమకట్టి. ౩౨౪

క॥ ఆమంత్రణం బొనర్చి ప్ర, ణామము లర్పించి సద్గు ♦ ణశ్రీమణిశో
నామై మలయం గలమని, యామంత్రఁపు వేల్పు లరిగి ♦ రంత యథేచ్ఛన్. ౩౨౫

వ॥ తదనంతరం బమ్మనువంశవార్తికంబు. ౩౨౬

క॥ మునియనుమతి ననుజునకును, నెనరుకలిమి వెలయఁ దెలిపె ♦ నియతుండై యా
యనఘుఁడు గ్రహించె విద్యా, ఘనతత్త్వము సురలు కౌతు ♦ కంబునఁ బొదలన్.

సీ॥ ఆఘను లకొ్కన ♦ నిట్లునిష్కంటకం, బుగఁ జేసి శస్త్రాస్త్ర ♦ ములు గ్రహించి
మునిచంద్రు వెనువెంటఁ ♦ జనుచుండి రలపున, ర్వ్యాపులను రిక్కల ♦ వడువుమీఱ
నయ్యెడ రఘురాముఁ ♦ డయ్యమివర్యుని, తోఁ బల్కెఁ జూడ్కికిఁ ♦ దొడవు గాఁగ
బలవైరినందన ♦ వనము నా జక్కల, జేని చైత్రరథంబు ♦ నానెగడఁగ

నైన యాశ్రమ మదె తోఁచె ♦ నస్మదీయ
మదియు కొండొకటియు తెల్పుఁ ♦ డల్ల పోలను
దిండిదిట్టలు మలయు న ♦ త్తైరువు వారి
నెలవు బోధింపుఁడనముని ♦ పలికెనిట్లు. ౩౨౯

## —♦ వామన చరిత్రము ♦—

ఆ॥ జిలుఁగుగొప్పుదిండి ♦ సెజ్జఁ దొఱంగి యు, వ్వయుఁడు హరి సహస్ర ♦ హాయనములు
నెఱసమాధినియతి నిల్చి నింద్రుని గెల్చి, యపుడె బలి జగత్త్ర ♦ యంబు గొనియె.

క॥ దానికి వగచి మహేంద్రుఁడు, దానవరిపుఁ జేరి తనదు ♦ దశ వినిచి జగ
న్మానిత; మాత్రబదు కెన్నఁడు, నీ నెనరునఁ గాదొ యిపుడు ♦ నీ కదిలేదో. ౩౩౧

క॥ కొనె బలి త్రిభువనరాజ్యము, గొనె నభిమానంబు సుఖము ♦ గొనె మర్యాదల్
గొనె నేవి గొనం డసువులు, గొనఁ డింతియ యమృత మేము ♦ గొన్న కతమునన్.

ఆ॥ మాకుఁ గాక యుంట ♦ మాపాలి దురదృష్ట, మింతె కాని ధర్మ ♦ వింతయేనిఁ
దలఁగఁబోఁడు దాన ♦ దానవుం డరి యైన, నీకుఁ గూర్పఁ గాదె ♦ నీరజాక్ష.

సీ॥ ఈగిమాటకు మాకు ♦ నీగి ప్రమాఁకులకునుఁ, దలవంచి మొగడింప ♦ వలసె నెపుడుఁ
దేజ మెన్నఁగ లేఁడు ♦ తేజోనిధి యటన్నఁ, జిన్నవారల వేఱె ♦ చెప్పనేల
యూష్మలత్వంబున ♦ నుగ్రుఁడై నాఁడని, వెఱచుచున్నా డిప్డు ♦ వీతిహోత్రుఁ
డార్జవంబున వీని ♦ నదలింపలే మని, యొదిఁగి కొల్తురు తాప ♦ సోత్తములును
బ్రహ్మతేజమునన ♦ ప్రబలి మేలిమి కెక్కె, రక్కసుం డనంగ ♦ రాదు వాని
దేఱిచూడఁ గాదు ♦ దేవసామాన్యుల, కతనిఁ బాసి సిరియు ♦ నలఁతిఁ బోదు.

క॥ ఆలీల నుండు నతఁడే, చాలె న్నము జాలిఁబెట్టఁ ♦ జాలుగ నసురుల్
చాల రెటు లుస్సురనినం, జాలింపక వేఁపఁ దల్ప్రి ♦ సాదము కలిమిన్. ౩౩౫

ఆ॥ అడవి మనికి యయ్యె ♦ ననరానిదయ్యె హా, వ్యార్జనంబు సౌఖ్య ♦ మనఁగ నెట్టు
లింక వేలుపులకు ♦ నెద్దియో గతి కలఁ, గాంచి వాని ధాటిఁ ♦ గలవరింప. ౩౩౬

క॥ ముజ్జగము లేలుఁ జెలివికిఁ, బజ్జ యితఁడె నాఁగఁ బ్రాభ ♦ వమునం గవి మే
లొజ్జగ బలి క్రతుపోకఁడు జ, గజ్జనకా; యాచరింపఁ ♦ గైకొనె దీక్షన్. ౩౩౭

ఆ॥ భాజనములు దీర్పఁ ♦ బంగరుకొండయు
జలము గూర్ప నేడు ♦ సంద్రములునుఁ
జాల వోషధులను ♦ సమకూర్ప జెట్లొకో ;
తలఁపఁజాల భూత ♦ ధాత్రి కిపుడు. ౩౩౮

క॥ ఆతని సతి వింధ్యావళి, యాతనిఁ బోలుం బ్రవృత్తి ♦ నౌపయికమునన్
జేతోజ్ఞాత మలరఁ ద, చ్చేతోగతి మెలఁగుఁ గ్రతువి ♦ శేషము పొసఁగన్.

క॥ తనిసి రటఁ బుడమివేల్పులు, వినీతి మెయిఁ గూర్చు నతని ♦ వితరణమునకున్
మొనసి రటు వేల్పు లలజడి, దొరకున రక్కసు లొనర్చు ♦ మండనమునకున్.

ఆ॥ కాన బలిమిఁ దొడరి ♦ కాక బాడబవృత్తి, నతని మది గరంగు ♦ నటు లొనర్చి
కోరి కొమిడిచికొనుటె ♦ కొఱలేని తెరు వంచుఁ, దలఁతు నీవ నేస్తు ♦ దైవరాయ.

తే॥ నీపూనర్చిన యదె కాదె ♦ నియతి స్వర్గ
మేలువారలు సుర లంచు ♦ నిట్టులట్టు
లనఁగ నేనెంతవాఁడనీ ♦ యానతి గొన
వచ్చినాఁడ దానికి యిచ్చ ♦ మెచ్చువాఁడ. ౩౮౭

క॥ అని రిపుగుణావగుణములు, పెనుపెడలక వెలయ వేఁడు ♦ వృత్రారిఁ గనుం
గొని మెచ్చి మీఁద లగ్గగుఁ, జను మతఁడును నాకుఁ గూర్చు ♦ జంభారాతీ.

తే॥ కడుపుఁ డొక్కింతకాలమ్ము ♦ గాసి యనక
వాసి గాంచెద రవ్రతటి ♦ వచ్చు నంత
నాపదలు నిల్వఁబోవు మే ♦ లచ్చుపటుపఁ
గాదు నిత్యమ్ము గాఁగఁ బ్రా ♦ కామ్య మరిది. ౩౮౮

క॥ నిను నీ వెఱిఁగి సుఖింపుము, గను మెదనను గాంతు లెల్ల ♦ గావను మెప్పున్
మనమున నైర్మల్యముఁగూ, ర్చను జతనముసేయు మార్య ♦ పథ మిది మఘవా.

ఆ॥ అనుచు వాసుదేవుఁ ♦ డవ్వాసవునిఁ బంచి, యచటఁ దన్ను డెంద ♦ మందు నిలిపి
వ్రతములోలి జరిపి ♦ వఱలు నయ్యదితిక, శ్యపుల దెనఁ బ్రసన్నుఁ ♦ డై తనర్చె.

ఉ॥ ఆముని పూజసేసి జగ ♦ దంచిత ; నీకరుణార్ద్రదృష్టి నా
నోములు నిండె లెస్సగ మ ♦ నోరథము ల్ఫలియించె సంతతో
ద్దామశుభంబు లొప్పె నిఁక ♦ ధన్యుఁడ నాసరివారు లేరు వి
ద్యామహితాత్మ దేవ వర ♦ దా; కమలారమణీమనోహరా. ౩౮౯

సీ॥ లోకంబు లెల్ల నీ ♦ లో నెప్డువసియించు,వసియింతు వీవట్లు ♦ వానిలోన
నెలయించువారల ♦ నెలయింతు వమ్మాయి, నూరకుండిర యేని ♦ నూరకుందు
వాదరింపవు స్వీయు ♦ లనఘులు గాకున్న, నాదరింతువు పరు ♦ లార్యులైన
నభిముఖులకు శ్రేయ ♦ మందింతు ద్రోయుదు, విముఖుల సంసార ♦ వివరమునను

దారవు నీదెసఁ దోఁపవు ♦ దొడ్డు కొంచె
మను తలఁపులు ననుఁగావు ♦ మయ్య కరుణ
విశ్వమూర్తి ; జనార్దన ; ♦ వేదవేద్య
శాశ్వతైశ్వర్యచణ ; సాధు ♦ జనవిధేయ. ౩౪౮

ఆ॥ అనుచుఁ బ్రస్తుతించి ♦ యచ్యుత ; ననుఁబ్రోవఁ
దలఁపు గలిగెనేనిఁ ♦ బోలుపుమీఱ
నదితిగర్భమున మ ♦ దాత్మజాతుండవై
తగ నుపేంద్రలీలఁ దాల్పుమయ్య. ౩౪౯

క॥ ఇది నీకృప సిద్ధాశ్రమ, పద మన నెగడొందుఁగాత ♦ వాసవుఁడు నిజా
స్పద మందుఁగాత మది స, మ్మద మొదవెడుఁగాత ప్రజకు ♦ మానుగ ననినన్.

క॥ అంగీకరించి హరి దయ, పొంగ నదితిగర్భమున న ♦ పూర్వతఁ జొచ్చెన్
అంగనయు శుభోదయమున, నంగజరుచిరాంగు నమ్మ ♦ హాత్మునిఁ గనియెన్.

ఆ॥ అతఁడు వొడమ ముదితుఁ ♦ డమ్మహాభాగుండు
జరిపె జాతకర్మ ♦ సన్మహంబుఁ
జెనిచె నొడ్లు వెనుపఁ ♦ జెరుఁగనివాఁ డంచు
నెఱిఁగి యెఱిఁగి సంయ ♦ మీశుఁ డీశు. ౩౫౨

క॥ హాస్టెఱిఁగినప్రాఁజదువుల, ముద్దియలకు నద్దు ముద్దు ♦ మురువొసఁగెడువాఁ
డద్దిర; తలిదండ్రుల కటు, ముద్దులు చూపంగఁ దొడరె ♦ మోహముఁ బెనుపన్

తే. అవతరించెను మున్న దా ♦ నభవుఁ డాట
లాడఁగాఁ జొచ్చె నరయఁగా ♦ నచ్యుతుండు
చెలఁగెనుఁ దపస్వివాటి ల ♦ క్ష్మీశ్వవిభుండు
బాపురే, మునిదంపతి ♦ భాగ్యమహిమ. ౩౫౪

క॥ అల్లారుముద్దు మేకొన, ముల్లోకము లేలు జాణ ♦ మురువిది యనుచున్
దల్లియుఁ దండ్రియు నిచ్చలు; నుల్లము లుల్లసితములుగ ♦ నుండిరి వేడ్కన్.

ఆ॥ గుజ్జుపాపఁ డగుటఁ ♦ గూర్మి వామనుఁ డని
రెల్ల సంస్కరణము ♦ లెనసి పిదపఁ
గపటవటువు సకల ♦ కావ్యశాస్త్రాగమ
నిగమములుఁ దరించి ♦ నియతి మించి. ౩౫౬

క॥ బలిచక్రవర్తిక్రతు వటు, పలువురు గో నెంతురంట ప్రవృత్తి వెలయం బూ
జలు జరుపుదురంట యోజన,నలతి యగునె యరుగువాడనని వేడ్కన్ మెయిన్.

శా॥ యాతాయాతజనంబులం గలసి యే మార్గ నేది యెట్టెట్లు వి
ఖ్యాతిం బూంతయయ్యె రోదసి పనం గౌతూహలం బయ్యెడిన్
బూతాత్ముం డటకర్త వాని చరితోద్భూతిం బ్రశంసించుచుండ్
చేతస్సీమ సుమాళ మువ్వతిల వాసిం గాంచె సంచాదృతిన్. ౩౫౯

క॥ జన్నము వార్త లరసి కను, సన్నలు వెలయించి తోడం జనుదెంచెద న
న్నన్నిక చేయుడు మీరీ, పున్నెము గొనుం డన్నలార; పోవుదమనుచున్.

సీ॥ హరాంబట్టుసాలు మేల్ లోఁ అవు గాంచిన మూఁపుఁ గృష్ణాజినము గోడం గీలుకొలిపి
కౌస్తుభశ్రీ పేరు గనిన పేరురమునం బూసలపేసులు పొంకపఱచి
యరిదరోద్భూతిం జెన్నమరిన కరములం బాలాశకరకము బ్బురంగ గూర్చి
కమ్మకస్తురి తిలకమ్ము యిమ్మనిన మో, మాగ్నేయభసితాప్తి కలవరించి
జన్నిదము సిగ గోంచి ముంజప్రయుక్త
రశన వ్యజనాతపత్రముల్ రాణఁదనర
నెనసె బలియజ్ఞవాటి న క్షీణశ్వరుండు
ద్విజులతోఁ గూడి కతిపయ దివసములకు. ౩౬౦

తే॥ ఆ తెఱవి తేట లాఁఅవు నెయ్యంబు కలిమి
ప్రబ్బుకళలు విమర్శించి లిబ్బిపడఁతి
గొన్నవాఁ డౌను గా దంచు గుజ్జువడుగు
గన్నవారెల్ల విస్మయాక్రాంతులైరి. ౩౬౧

క॥ తన కన్న మున్న స్తుతిపాఠనివహములు సొచ్చి కడలి డంబుగ నభివా
దన మోదనపూర్వకముగఁ, దను రమ్మని దారి సూపం దాత్పర్యమునన్. ౩౬౨

మ॥ అతఁ డాస్థానికిఁ జేరునంతటనె విద్యావైభవం బెల్ల వి
శ్రుతసంపత్తి వహించి శ్రోత్రయుగముల్ శోధించి లోఁజొచ్చి చి
త్తతతి న్మత్తిలఁ జేసి సర్వజనసాధారణ్య మొప్ప న్మహా
న్నతహాస్యాంబుధి నోలలార్చె రసమన్న న్నామరస్యంబె కాన్. ౩౬౩

సీ॥ అమృతంబుజాల్కొల్పు ననువుమేకొనుఁగాదె, మోమే దెసకుఁ ద్రిప్పి మురియుచట
నభిలాగమంబులు నవతరించున కాదె, నోరెత్తి నుంకింప నూత్నకళల
నుదయార్కు నీరెండ యోజం బఱవుఁ గాదె, బ్రహ్మతేజంబున ప్రాభవంబు
మహితోత్సవంబులు మలయింప నౌఁగాదె, శ్రీమత్కటాక్షుల క్ష్మీవిలాస

మార; నెఱజాణ గాఁడై యి ♦ య్యనుఁగుబిడ్డఁ
డేరో ధన్యులు తలిదండ్రు ♦ లెచటు తీర్థ
నై రహించెనో యీబ్రహ్మ ♦ చారికతనఁ
దారితుల మని రాసభా ♦ స్తారులెల్ల. ౩౬౪

క॥ తలలెత్తిచూతు రన్నెఱెఁ, దలఁపరు తమ కృత్యములును ♦ దద్యాగమృతం
బాలుకఁగ రసయోగంబున, కలిమి ననిమిషత్వకలన ♦ గలుగఁగ రామా. ౩౬౫

చ॥ పలుకుల తీపు గాంచి బలు ♦ పగ్గ దలంచి గొనంబు లెంచి యిం
బులఁ దులకించు విద్దెల ప్ర ♦ భుత్వము కల్మికి సంతసించి వాఁ
డలఘుగుణోత్కరుండు బలి ♦ యాతని రమ్మని పిల్చె మేనునం
బులకలు పిక్కటిల్ల నిజ ♦ పూర్ణమనోరథభావ మెంచుచున్. ౩౬౬

ఉ॥ దానికి వాని మెచ్చి నెఱ ♦ దంట నిదానము దాన మున్నచో
వీని జయింతు రెవ్వ రని ♦ వేడుక మీఱఁగఁ జేర వచ్చి యో
దానవసార్వభౌమ; సుకృ ♦ తంబున ని న్గనఁగంటి నావుడున్
దా నను దానశౌండుఁ డను ♦ భావిమనోగతి సత్క్రియాధృతిన్. ౩౬౭

ఆ॥ మా గృహంబు సర్వ ♦ మంగళాస్పదమయ్యె
ముక్త తతిఁ గొనంగ ♦ మొనసె వంశ
మేనుఁ బావనుండ ♦ నానోములు ఫలించె
బ్రహ్మమూర్తి; నీదు ♦ రాక కతన. ౩౬౮

సీ॥ నీ పుట్టు వరయంగ ♦ నే నెంతవాఁడను, నినుఁ గన్నవారి మే ♦ ల్నెఱి నుతింతు
నీ యంఘ్రి లంటిన♦నెలవు తీర్థము నాఁగ, నున్నయచ్చోటువున్నె♦మెన్నఁదరమె
యే యక్కరములు తీ ♦ రెనసె నీపేరొంది, యీతేజ మీకాంతి♦ యెట్టు లబ్బె
బ్రహ్మవర్చసమునఁ బ్రబలరే మీవార, లదె రూపు గైకొనె ♦ ననఁగ వలసె
నిన్ని దలఁప నేల ♦ యిత్థచరిత్ర నీ, కోర్కి యెద్ది దానిఁ ♦ గూర్చువాఁడ
నడుగ నేర్చితేని ♦ నడుగుము నీకన్నఁ, బాత్రభూతు నెందు ♦ బడయఁ గందు.

క॥ అని వేఁడిన మేలని యి, ట్లని పలికె న్గపటవటుఁ డ ♦ హా లోకముల
న్నినుఁ బోలు దాత లుండురె, మన మలరెం బ్రముదవార్ధి ♦ మగ్నుఁడ నైతిన్.

క॥ ఒరులనఁ జుట్టము లనఁగాఁ, బురుషవరా; నాకు లేరు ♦ పుణ్యోదయ మి
ట్లరుదెంచి నిన్నుఁ జూపఁగ, నరుదెంచితి నీదు చరిత మసదృశ మంటిన్. ౩౭౧

ఆ॥ ఒంటి నుండు సిరియు ♦ నోపదు నను గొల్వఁ
దపము పేర్మి దక్కఁ ♦ దలఁపు దోఁప
దడిగినంత లొసఁగి ♦ యనిచిన నదె చాలు
నీదు కీర్తిఁ బొగడి ♦ నెగడు వాఁడ. ౩౨౨

క॥ నాఱెండ మఱస మొందఁగ, మూఁడడుగుల పొల మొసఁగుము ♦ ముజ్జగములతో
నీడంబో కదె పోలును, గూడుఁ దపశ్శక్తి బ్రహ్మ ♦ కూఁకటి ముట్టన్. ౩౨౩

మ॥ అనినం జాలునుఁ జాలుఁ బెద్దతడవి ♦ ట్లర్థింపఁగా నెంచి తే
మని నాముద్దుల మూట నీవడుగ నే ♦ యర్థంబులున్ లేవె మె
చ్చిన కన్యామణులో సువర్ణములో స ♦ శ్రీకంబు రాజ్యంబొ నా
పెనుపైనం గన కిట్టులాడఁ జనునే ♦ పేరొప్పఁగాఁ జెల్లదే. ౩౨౪

ఆ॥ అనుచు మూదలింప ♦ నొఁగాక యిన్ని నా
కేల మున్నె యదియు ♦ నెఱుక సేసి
నాడ మూడడుగులె ♦ మూఁడులోకము లిచ్చు
నెఱికిఁ గూర్చు నాదు ♦ నియత మిదియ. ౩౨౫

క॥ అను నన్నెఱవాది పలుకు, లను విని కవి యలఁతిగాఁ ద ♦ లంపకుమీ యీ
గినిఁ గినిసి నిన్నలంపఁగఁ, జను వెంచినవాఁడు చక్రి ♦ శక్రార్థితుఁడై. ౩౨౬

మ॥ తన సర్వస్వముఁ బోవు నన్నయెడ ని ♦ స్స్వామ్యత్త్వముం గొంట యొ
ప్పని దాఁగాదె సురారినాథ ; హితముం ♦ బాటింపకే సత్య మె
ట్లనువొందు న్నృపనీతికోవిదులు స ♦ త్యంబెంచియు న్నేలఁ బ్రొ
ద్దును భావించి చరింపనేర్తురు విప ♦ త్తుం గోర నీకేటికిన్. ౩౨౭

క॥ ఇది యీఁగానిది నీకొం, డెది యేని నొసంగువాఁడ ♦ నిట్లని యెటులో
పొదలించి యనుపఁ జూడుము, తదనంతర మెలమిఁ దార్ప ♦ దైవము నేర్చున్.

క॥ అని శుక్రుఁడు బోధించిన, విని నెఱదాత యిది నెఱియె ♦ వేడబమై పో
వునకాదె సత్య మీ నా, ల్కను రెండవ పలుకు సేర్పఁ ♦ గా హిత వగునే.

క॥ పసికూనప్రోడవడు గలె, ముసిముసినగ వొలుకు ముద్దు ♦ మో మెఱు కళలన్
మిసిమింతుఁడు గాఁబోఁ డలె, యసదై తన్నడుగ నివ్వ ♦ నన నెటు నేర్తున్.

క॥ అగుఁ గాక లచ్చి మగఁ డటు, లగుఁ గాక శచీవిభుండె ♦ యర్థింపఁగ నీ
మొగకొంటిఁ గాదనఁగ నా, కగునే; గురువర్య; పుట్టు ♦ వాఱడిపోవన్. ౩౩౧

సీ॥ సతములే సంపద ♦ ల్పావరే పుట్టరే, దొసఁగు లొందవె మేళ్లు ♦ దొరయఁబోవె
యొకని దియ్యది యంచు ♦ నొంటింపు సేసిరే; యొంద జేలిరి నేల ♦ యింతవట్టు
రాజసంబునఁ గాక ♦ రారాపు వాడమునే, త్యాగ మూనని ముత్తి ♦ దారి యున్నె
యశము మేనులఁబూర్వ ♦ లవనిపై నిలువరే, సత్యప్రతిజ్ఞులై ♦ చాల నెగడి

నీవు వారింప నొగిలి వి ♦ సిత్రి నెరయఁ
జిన్నవోయిన మోమునఁ జెన్ను దఱఁగి
యున్నవాఁ డిట్టు లీతఁడే ♦ నోప ననఁగఁ
జాల నోయయ్య ; చల మింకఁ ♦ బోలదయ్య. ౩౮౫

ఆ॥ లచ్చి యవయవములు ♦ లాలించు నెద్దాని, నిచ్చఁ గ్రొత్తసూపు ♦ నెఱికి దక్కి
క్రిందు పడఁగ నట్టి ♦ కేలు పై నా కేలు, గాఁ బొనర్చుటయును ♦ ఘనము కాదె.

క॥ ఎది యెటుగా నున్నదియో, యది యట్లగుఁ గాక యిత్తు ♦ నని యీననఁగా
మది మెచ్చ దుడుగు మయ్యా, సదములుఁ డివ్వడుగు తోడి ♦ స్వర్గము నాకున్.

వ॥ అని యిట్లు త్రికరణశుద్ధిగాఁ బలికిన నప్పలుకులు ములుకులక్రియవీనుల దస
సూడుకొని కలంకవెట్ట నులికిపడి శుక్రుండు కోపాటోపంబున శీఘ్రకాలంబునన
పదభ్రష్టుండవు కమ్మని శాపంబొసంగి కసరిన నద్దానికిం దలంక కద్దానివతం
సంబు ప్రతిగ్రహీత కభిముఖుండై. ౩౮౬

ఆ॥ నా యదృష్టరేఖ ♦ నాయయ్య; రావయ్య, నీకు దాన మిత్తు ♦ నియతి వెలయఁ
బాదతీర్థ మొసఁగఁ ♦ బ్రార్థింతు నిన్నెఱిఁ, జేర్చుకొని కృతార్థుఁ ♦ జేయుమయ్య.

వ॥ అని యిట్లు వేఁడుకొని తదాయత్తంబగు చిత్తంబున. ౩౮౭

ఉ॥ బంగరుపీఁట పెట్టి పరి ♦ పాటిగ రత్నపుఁగిండి గొంచు స్వీ
యాంగన చెంగట న్నిలువ ♦ హైమము పళ్లెర మందుఁ దత్పదం
బుం గడు వేడ్కనైఁ గడిగి ♦ పొల్పగు తజ్జలము న్శిరంబునం
బొంగుచుఁ దాల్చె నవ్విభుఁడు ♦ బోరన వేలుపు లుబ్బియాడఁగన్. ౩౮౮

ఆ॥ పావనములు విష్ణు ♦ పాదోదకము లవి, దాల్చి బలి విశుద్ధ ♦ తమతఁ గాంచె
నెవి ప్రసిద్ధి నొందె ♦ నీరేడుజగముల, యందు నీశ్వరత్వ ♦ మందఁ జేయ. ౩౮౯

తే॥ కొమ్మునడిచక్కి సూక్ష్మరూ ♦ పమ్ము నొంది
ధార పడ కుండ నాఁగ నా ♦ దైత్యగురుఁడు
పొడిచెనుఁ గుశాగ్రమునఁ గన్ను ♦ పొడవడంగ
నతని పోకడ లెంచి వి ♦ శ్వాత్ముఁ డపుడు. ౩౯౦

క॥ కన్నె సెజ్జె నిండె యిటకే దన, పన్నగడలు సాగ వంచుఁ ♦ బనివినెఁ గావ్యం
డన్నెఱి నాతఁడు దలఁగఁగ, వెన్నునిఁ బూజించె దైత్య ♦ విభుఁడు పొదలుచున్.

క॥ ఎవ్వని ప్రతికృతి నచ్చలు, మవ్వము దశకోత్తఁ గూర్చి ♦ మర్త్యు లమర్త్యుల్
దవ్వను తత్త్వము గాంతురొ, యవ్విభు నర్చించె దైత్యుఁ ♦ డసదే తలఁపన్.

క॥ ఇచ్చె నిల మూడడుగు లిం, పచ్చుపడ నదక్షిణాక ♦ మై తన నాతం
డొచ్చెము నాక గ్రహించెను, మెచ్చు గదుర వేలుపులకు ♦ మే లొనగూర్పన్.

వ॥ అట్లు గొఱఁతపడి కేలుసాఁచి లక్ష్మీవిభుండు చక్రవర్తి యయ్యును దానవ చక్రవర్తి యొసంగు నయ్యర్ఘ్యంబు పరిగ్రహించి. ౩౯౪

క॥ ఇంతయు నంతయు నై తల, మంతయుఁ దానై ధరిత్రి ♦ యాకస మనరా
కెంతయు నేడ్తెఱ మెఱయఁగఁ, గ్రాంతాఖిల భువనుఁడై త్ర ♦ కామ్యత వెలసెన్.

వ॥ ఇట్లు తేజోరాశియై దశదిశలను విజృంభించిన యమ్మూర్తివిశేషంబునకు త్రివిక్రమ నామధేయం బనువుపడ సురలును మునులును యోగివరేణ్యులునుఁ జేర వచ్చి యత్యంతభక్తి మెయిం బూజించువారును బ్రదక్షిణప్రక్రమణంబు లొనరించు వారును సాష్టాంగనమస్కారశతంబులు సమర్పించువారును స్తోత్రపాఠంబులు వన్నుపన్నుగడలం బ్రార్థించువారును నై కృతకృత్యు లగుచుండ వేలుపులు చాలుపులుగాఁగ నంబరంబున సంబరంబునం బ్రసూనవృష్టులం బరఁగింపఁ దెఱ గంటి యన్నుమిన్న లాడ గంధర్వులు పాడ సిద్ధసాధ్యచారణవిద్యాధరముఖ్యులు వందిమాగధ కృత్యంబులు నిర్వర్తింప నారదుండు నిండుమనంబునం గుంచె విదుల్చుచు వీణియ మీటుచుం బారవశ్యంబున నామసంకీర్తనంబు వెలయించుచు నర్తనంబు సలుప ముల్లోకంబులు నల్లోకోత్సవపారావారంబు కల్లోలంబుల నోలలాడు చుండునట్టి సమయంబున. ౩౯౬

ఆ॥ ఒదిఁగి దోమ వోలె ♦ నున్న య న్నెఱదాతఁ
జేరి పలికె నపుడు ♦ శ్రీవిభుండు
పుడమి యొక్కఁ డడుగు ♦ పోల్పంగ నూర్ధ్వలో
కంబు లొక్కఁ డడుగు ♦ గాఁగ నయ్యె. ౩౯౭

క॥ ఆ మూడవ యడుగున కేది, భూమి యనినఁ దెరల కతఁడు ♦ పొలుపమరఁగ నా
సామీ యిదె నాతల యిడు, మీ మేలగునంజ నా ర ♦ మేశుఁ డలరుచున్.

తే॥ బలినిఁ గట్టెను సంసృతి ♦ బంధము లై, రక్షి దరిఁ జేర్చునమ్మేటి ♦ పిల్చి బిడ్డ
నీయ నెత్తి కుదించిన ♦ ట్లీశుఁ డెఱిఁగి, చేయు పని కెవ్వరిక నడ్డు ♦ చెప్పువారు.

తే॥ రక్కసులు చక్రి యమ్మేటి ♦ రాణఁ గని స
హింప నోపక బలికి నై ♦ యెత్తివచ్చి
పోరొనర్చి సుదర్శన ♦ ధారఁ బడిరి
దా గరిగి రన్యులట నిరా ♦ ధారు లగుచు. ౪౦౦

ఆ॥ అప్పు డతని పత్ని ♦ యనఘ వింధ్యావళి, లోకమాతృనిభ వి ♦ లోలనయన
నమ్ర యగుచు నఖిల ♦ నాయక; పతిభిక్ష, పెట్టు మనుచు బిట్టు ♦ వేఁడె నొగిలి.

మ॥ తగునయ్యా; దృఢపాశబంధనము లీ ♦ దైత్యాధినాథుండు మే
లుగఁ బూజించెను నిన్నుఁ గావ్యుఁడనినన్ ♦ లోభంబు పాటింపఁబోఁ
డోగిఁ దచ్ఛాపము నొందియుం దలఁకఁ డ ♦ ట్లోహో భరింపంగ నా
నగధారీ; యని రబ్జజాదులునుఁ బ్ర ♦ హ్లాదుండుఁ దోఁతెంచుచున్. ౪౦౨

వ॥ అట్లు చనుదెంచి యద్దేవుని సాన్నిధ్యంబు వడసి బహుప్రకారంబులం బ్రార్థించు నాప్రపన్నుల దెసం బ్రసాదసుముఖుండగు నమ్మహామహుండు కరుణాకటాక్ష వీక్షణంబుల దైత్యరాజచంద్రుని విలోకించుచు నవ్వార లెల్లరు వినుచుండ నిట్లనియె. ౪౦౩

సీ॥ నాకుఁ గూర్చు నితండు ♦ నయవిద్వరేణ్యుండు, ధార్మికుం డాగమ ♦ తత్త్వవేత్త
యీతనిఁ బోల్పంగ ♦ నీరేడులోకంబు, లెనగావు సుర లన ♦ నెంతవార
లసురుల పొత్తు ప్ర ♦ హ్లాదునిఁ బోలె ని, య్యనఘునిఁ జెఱుపంగ ♦ నాసపడదు
రాజసంబునఁ బోక ♦ రాణింప సత్త్వంబుఁ, బ్రబలించి వీని నా ♦ బంటు సేయ
నెంచి యివ్వేర విపుడాచ ♦ రించినాడ
సుతల మీతని స్వర్గంబు ♦ సురుచిరంబు
పరఁగ నజరామరుండయి ♦ ప్రజ్ఞ మెఱయ
నుండు ననమున వెన్నెల ♦ ల్మెండుకొనఁగ. ౪౦౪

క॥ సుర లీఘనుఁ భావింతు ర, సురులుం గొలుతు రదనెఱిఁగి ♦ శుద్ధగుణాలం
కరణుఁడు స్వజనక్షేమం, కరుఁడును నై యెలమి గాంచుఁ ♦ గాఁ గలఁ డింకన్.

తే॥ ఎపుడు సీతని పొత్తున ♦ నెలమి నుండు
వీని శాసితి మెలఁగని ♦ వేని నేని
నాదు చక్రంబె శాసించు ♦ నలువు గాంచు
ముక్తుఁడై దుష్టసంగని ♦ ర్ముక్తుఁ డగుచు. ౪౦౫

క॥ అను ననుశాసనమును విధి, గొనియాడెను బలియు నలరె ♦ గుణనిధి ప్రహ్లా
దున కగ్గలమయ్యెను ముద, మనుమోదించిరి సుర ల్ప్ర ♦ హర్షము పేర్మిన్.

వ॥ పదంపడి వాసుదేవుండు భక్తాగ్రగణ్యుండగు బలీంద్రుని సపరిచ్ఛదునిం దోడ్కొని బ్రహ్మాదులగు సురలును మునులునుం దోడ్తేర నా సుతలంబున కరిగి యున్నవీన స్వర్గరాజ్యంబునకు నాతని నభిషిక్తుం జేసె నయ్యవసరంబున. ౪౦౮

చ॥ సురలు ప్రసూనములు గురియ ♦ సూరెలఁ జారణులు న్నుతింప భూ
సురు లసురుల్ హసాదనుచు ♦ శుద్ధమనస్కతఁ జేరి కొల్వఁగన్
వరపుడ మోపి చేయఁబరి ♦ వారము గూర బలీంద్రుఁ డొప్పె నా
హరిదయ మీఱ నెప్డుఁ దన ♦ కాప్తుఁడునై యలరించుచుండఁగన్. ౪౦౯

క॥ ఇది వామను చరితము హరి, సదయుఁడు బలిఁ బ్రోచినట్టి ♦ సందర్భమునన్
జదివిన వినిన న్వ్రాసిన, సదమలు లొందుదురు సర్వ ♦ సౌఖ్యము లెందున్. ౪౧౦

తే॥ ఆ ఘను ప్రసక్తి నిది వామ ♦ నాశ్రమంబు
శ్రమశమనము సిద్ధాశ్రమ ♦ సంజ్ఞితంబు
నేనుఁ దద్భక్తిగౌరవ ♦ నిరతిఁ దప మొ
నర్చి సంసిద్ధి గంటి వి ♦ ఘ్నముల గెంటి. ౪౧౧

క॥ ఆ వెరవరి వీవే కదె, పావన చారిత్ర యెఱుక ♦ పట్టిదిగా కి
ష్టే వినవయ్యెనె నేను, న్నివిధ మరయకయ యిందు ♦ నినుఁ దెచ్చితినే. ౪౧౨

క॥ కాకుత్స్థకులతిలక యిది, నీకటు నాకాశ్రమంబ ♦ నే నన్యుఁడఁ గా
నేకద యిందె సవము కిం, పాకుల రాయిడియు నీప్ర ♦ భావము నెసఁగున్.

తే॥ దుష్టచారులఁ బసు లట్లు ♦ దునిమి యిచటఁ
గాంతు కల్యాణమూర్తి స ♦ త్క్రతుఫలంబు
విఘ్నము లడంచి మఖరక్ష ♦ వెలయఁజేయు
నతఁడు యజ్ఞాత్ముఁడౌ హరి ♦ కాంతరుండు. ౪౧౪

—♦ విశ్వామిత్రుండు నిజాశ్రమంబునం బ్రవేశించుట ♦—

చ॥ అనుచు నిజాశ్రమంబు దఱి ♦ యం జన వైదికవహ్నులట్లు లో
య్యన నెదురై మును ల్కృపవ ♦ రాత్మజుల న్యమివర్యుఁ బూజలం
దనిపిరి వారుఁ దాను శుభ ♦ దాయిముహూర్తమున న్మహోన్నతిన్
దనరి ప్రవిష్టులై సముచి ♦ తస్థితుల న్సుఖమంది రద్విజా. ౪౧౫

క॥ శశి నీహారవిరతుఁడై, విశదరుచిఁ బునర్వసుప్ర ♦ వేశమునఁ బలెన్
బ్రశమధనుఁ డర్యమాన్వయ, కిశోరమణియుక్తి వసతి ♦ గెడకొని మెఱసెన్.

క॥ పొలుచు నపూర్వవిలోకన, ములఁ బూజల లాలనముల ♦ మొనయు పురస్కా
రలలితవర్తనముల మా, నులు తత్పరులై మెలఁగిరి ♦ నుత్యవిలాసా. ౪౧౬

తే॥ అంతఁ గొంతవడికిఁ జెంత ♦ కరిగి గాధి
పట్టిఁ దిలకించి రఘువీర ♦ వరకుమారు
లింక జాగేల మఖ మెప్పు ♦ డెప్పు డనుచు
లఱుమువా రెట్టు లెట్టి వా ♦ రరయ వలయు. ౨౧౮

ఆ॥ నీకు భద్ర మయ్య ; ♦ నీపల్కినట్లె సి, ద్ధాశ్రమంబు నాఁగ ♦ నగునుఁ గాత
మిది మహర్షివర్య ♦ యిట్టట్టు నరయక, దీక్షఁ గైకొనంగఁ ♦ దివురుమయ్య.

క॥ కాఁగల పనిగా నాదట, నేగుఱి నెటు మెలఁగినను య ♦ మీశ్వర ; మేలా
నాఁగ నగరాజవరసుత ; యాగమువతనంబు మెచ్చి ♦ రతఁ డమ్మునులున్.

శా॥ కాఁగిట వారలఁ గదియం, గాఁ గొని నేఁడ యొనగూర్తుఁ ♦ గ్రత్వారంభం
జాఁ గా దను వా రెవరిఁక, నాగంబులు దొలఁప మీర ♦ లై యుండంగన్.

## —♦ విశ్వామిత్రుండు యజ్ఞ మొనర్చుట ♦—

ఆ॥ అనుడు గడువు వెలువు ♦ మయ్య మెక్కాల మా
దుష్టవర్త్మగతులు ♦ దొడరు వారొ
యెంతవట్టు రక్ష ♦ యిజ్యకు వలయునో
యనుచు వారఁ నిన ♦ యాత్క్షణంబ. ౨౨౨

క॥ మును లెల్లరునుఁ బ్రమోద, మ్మునఁ బొదలిరి స్తుతు లొనర్ప ♦ ముదలకొనిరి యు
న్మను లైరి యట్టిఁ లై యు, మ్మునివరుఁ డిట్లనె రఘుప్ర ♦ ముఖ్యుల తోడన్. ౨౨౩

ఆ॥ అన్నలార నేఁటి ♦ కాఱు దినమ్ములు, గడువు గడపవలయుఁ గడఁగి వారి
చేత లంతరంబు ♦ సేయ నోపవు దీని, నియమ మింతవట్టు ♦ నెఱప వలయు.

క॥ మౌననిరతి నుండ న్వలెఁ, గాన భవదధీన మగునుఁ ♦ గ్రతురక్షణ మా
పై నెటులైనం దిరమగుఁ, బూనిక నెక్కొనఁగ మీక ♦ పోలదు నెందున్. ౨౨౫

క॥ అని యుపకరణము లెల్లం, గొని సభ్యుల ఋత్విజులనుఁ ♦ గూర్చి శుభంబుల్
మొనయఁగ వేదులుఁ గుండము, లును మండపములు నమర్చి ♦ లో నెసఁగు ధృతిన్.

క॥ అక్షాళితాఘుఁ డమ్ముని, దీక్షాముఖముం బొనర్చి ♦ తెలివి మెఱయ ని
ట్లక్షుద్రమంత్రవిధుల స, పక్షుండై యధ్వరంబు ♦ ప్రారంభించెన్. ౨౨౭

సీ॥ అంత రాకొమరు ల ♦ త్యంతకౌతూహల, మ్మునను శుద్ధస్నాన ♦ ముల నొనర్చి
కై సేసి శస్త్రసం ♦ గ్రహణ మ్మడర లక్ష్య, సంయుక్తి మంత్రప్ర ♦ చార మెసఁగ

నమితధర్మారూఢి ♦ నాజ్యాదు లమర వే, దిక నెలకొని శుచి ♦ దీప్తు లోలయఁ
బవలు రే యని పరి ♦ పాటిఁ జూడక యొంతు, భావ మెందేని నే ♦ ర్పఱుప కట్లు
జగదవనసవదీక్షితు ♦ లగుచుఁ దపసి
చాలి యుపదేశ మొసఁగ జే ♦ జేలు మెచ్చఁ
గఱకురక్కసిపసుల నె ♦ క్కటి మగఁటిమి
శసన మొనరింపఁ దఱి వేచు ♦ జాడ నెగడ. ౪౨౯

క॥ షడహోరాత్రం బస్మోయిఁ, గడవ నగుచు నుండ నిజ్య ♦ కడముట్టెడు చొ
ప్పడర నెడ లేదు మేలల, వడు నని సుర లెడలఁ బొంగి ♦ వలగొనఁ దొడరన్.

తే॥ అన్న ; లక్ష్మణ ; జాగరూ ♦ కాత్మకతఁ బొ
సంగఁ దగు జాల మీవేళఁ ♦ జనదు పడయ
ననుచుఁ దను హెచ్చరించు రా ♦ ముని నుడుల క
తండు నిండారు మది ధృతి ♦ నొందుకొలుప. ౪౩౦

తే॥ ఆ యయుత్సులఁ గని ఋషు ♦ లలరి యజ్ఞ
వేది సజ్వాలయై చాల ♦ విస్తరిల్ల
నగ్నియుఁ బ్రదక్షిణార్చుల ♦ నభము వాయు
శుభము వాటిల్లు నను చొప్పు ♦ చూపుచుండ. ౪౩౧

క॥ సోపాధ్యాయపురోహిత, యై పాఱుతపసి తపస్య ♦ యలరారెడు లో
కాపచ్ఛమని యిది యటం, చేపట్టులనేని విదితు ♦ లేర్పడ నొడువన్. ౪౩౨

తే॥ మంత్రినన్యాయవద్యోగ ♦ మహిత మగుచు
యాగ మొప్పారె నట్లు ని ♦ రాగసముగ
దర్భచమససుగ్రాదిసా ♦ ధన విశిష్ట
కుసుమ సుజ్వాల క్రతువేది ♦ కొమరుమిగుల. ౪౩౩

క॥ అల్లన నల్లని చాయల, యుల్లాసము పొసఁగె నవల ♦ నుపరితలమునన్
బెల్లెగసె నబ్ధి తరఁగల, కల్లోలముఁ జాటు రవము ♦ కడు బెట్టిదమై. ౪౩౪

తే॥ అల్లమారీచుఁడు సుబాహు ♦ డనెడు పొలసు
దిండిసరదార్లు తమవారి ♦ తెగలఁ జీరి
మచ్చరము మీఱి యచ్చోట ♦ మాయదారి
వారిదము సేరి కురిసి రె ♦ వ్వముల గారి. ౪౩౫

క॥ మఱియు రుధిరౌఘవర్షముఁ, దఱిఁ దలకొనఁ జేయ వహ్ని ♦ తలమెల్లం దా
నఱుము నెఱిఁ బెరసెఁ గాకే, కొఱసూఁపడ తపసి తపము ♦ గొన మెట్టిదియో.

— ♦ శ్రీరాముఁడు సుబాహుప్రముఖుల వధించుట ♦ —

శా॥ ఆయుద్రిక్తతఁ గాంచి యంచితధను ♦ ర్జ్యాఘోష మాశాంతము
ల్దాయం బర్వ సుపర్వశైలగుహ తో ♦ డన్ రోదసు ల్ప్రోయ న
మ్మాయావు ల్నిజమాయ మాయ మగుచో ♦ మందత్వ మందంగ నా
గ్నేయాస్త్రం బరివోసె రాముఁ డమరు ♦ ల్కీర్తింప సంపత్కళా. ౪౩౮

ఆ॥ అటు లొనర్చు నన్న ♦ నన్న ; లక్ష్మణ ; కనుఁ
గొంటె కొంటె వేల్పు ♦ గొంటుకాండ్ర
ననిలుఁ డామొగిళ్ల ♦ నట్లు నిర్ఘాతుల
హతులఁ జేయుదు న్మ ♦ హాస్త్రశక్తి. ౪౩౯

క॥ పొలదిండిపోఁతు లిమ్మెయి, తులువ పను ల్డడవఁ దొడర ♦ దొర లోసరిలం
గలచె గరువతన మింకిట, నలఁతి గన రె జగతి వార ♦ లనుచున్ బెలుచన్.

ఉ॥ తోడనె విస్ఫులింగములఁ ♦ దోఁకొని యాఁకొని యున్న బెబ్బులిం
దో డన నొప్పు నబ్బలువు ♦ తూపు సుబాహుని మీఁద వైవ నే
జాడను వాఁడెదిర్చి కలు ♦ చ న్నిలిచె న్శరజాలకమ్ముతో
మాఁకెను వీడ కమ్ములికి ♦ మంటలు గ్రమ్మిన నమ్మెయి న్సఖీ. ౪౪౦

ఆ॥ అగ్నిదేవతాక ♦ మగు శర మసుర మై, గాల్పఁ బదర నమ్మ ♦ కము జనించె
నగ్నిముఖులు దివిజు ♦ లగుట నిక్కం బిది, యనుచుఁ బుడమి జనుల ♦ కబ్జవదన.

క॥ ఘనతేజ మొదవు నెడఁబోఁ, దనరెం దొలుదొల్త దుష్ట ♦ దానవుఁ డగుటన్
దన తనువునఁగల తామస, మనఁ బొగ దివిఁ బ్రాఁకెఁ జోద్య ♦ మనఁ దగి నగజా.

ఆ॥ దైవమహిమ పొగడఁ ♦ దరమె యమ్మారీచు
వలయు పనికి మనుపఁ ♦ దలఁచె నొక్క
పవనమానవహతిఁ ♦ బడ వైచె జలనిధి
యందు రాముఁ డతని ♦ నాక్షణమున. ౪౪౩

క॥ పిడుగునకుఁ దోడు దొడరెడు, బడబాగ్నిం జెనకు తనకుఁ బొల్పడి తోడ్తో
నడరు పెరమూఁక నొక్కు,మ్మడిఁ బొరిగొనె లక్ష్మణుం డ ♦ మర్త్యులు వొగడన్.

ఆ॥ ఎంత చిత్ర మబల; ♦ యిల హరి ధను వూని, ఘనత నిలఁ బలాశి ♦ గణ మడంగె
నలరుజడి దివిం బ్ర ♦ బలె శిఖిముఖక్లిష్ట, సరసలాస్య మెసఁగె ♦ స్వర్గమునను.

ఉ॥ ఒక్కట వారి పట్లఁ గన ♦ నొప్పుఁ గదే బలుమాయవిద్దె తా
రక్కొఱగాములం గెడప ♦ నయ్యొడ నంపిన యంపగుంపు పే

రెక్కిన చొక్కమందు వగ ♦ నేచి సురారుల రూపు మాపి చే
జిక్కఁగఁ జేసె నల్లహరి ♦ చిన్నెల వన్నెల నన్నఁ గన్నెరో. ౨౨౬

క॥ వారలు దివి కరిగిన సుర, వారము మేలడిగె మాని ♦ వారము పొగడెన్
శ్రీరఘువరు నింద్రుని బృం, దారకచయ మట్లు మాని ♦ తతి ప్రాజించెన్. ౨౨౭

క॥ ఆవిధి నావిధి పూర్తిం, గావించి నికేతకలనఁ ♦ గాన్పించి వెసన్
శ్రీవెలయు టరసి గాధిజుఁ, డా వెరవ్రునఁ బౌరవశ్య ♦ మనువొందంగన్. ౨౨౮

తే॥ అచ్చెఱుత రఘుసింహుల ♦ మెచ్చి డాయ
వచ్చి హారితత్త్వ మని యెద ♦ నచ్చి పొంగు
పెచ్చుమోదంబు సంద్రంబు ♦ సొచ్చి వెడలి
గ్రుచ్చె బిగికౌఁగిటఁ దపస్వి ♦ మచ్చెకంటి. ౨౨౯

ఆ॥ మించు మేనఁ బులక ♦ లించు సంచునని దీ
పించె భాగధేయ ♦ మెంచి చనవుఁ
జెంచి తనదు తొడల ♦ నుంచి శీర్షంబు ఘ్రా
ణించి తన్మహిమఁ ద ♦ లంచి కాంచి. ౨౩౦

క॥ పొనపొన గనుదమ్మికెలఁకు, లను హర్షాశ్రువులు మధుక ♦ లాలలితశ్రీ
లెనగా జడిగొనఁగా ని, ట్లనె గాధేయుఁడు కృతార్థుఁ ♦ డై రామునితోన్.

ఉ॥ నోములు నోమి కోసలత ♦ నూభవ నిన్గడుఁ బొంచి కాంచి తా
నామెయి గర్భశుక్తి ఫల ♦ మందుట శ్రీగురుధర్మ మూనె న
న్లే మును పే మొనర్చినది యేమొకొ యీవులమానిచేను చిం
తామణిపేటి వేల్పుపసి ♦ దాఁటును నాఁ గనవైత్రి వోహరీ. ౨౩౨

ఆ॥ ఎంచి చూడఁజూడఁ ♦ గొంచెమై యున్న రా, త్రించరౌఘకృతి ప్ర ♦ పంచమెల్ల
సంచలించెఁ దలలు ♦ వంచె శేషుఁడు వారి, ద్రుంచి యెల్లవారి ♦ మంచి తనవు.

క॥ ఏ పనికై పొడమితి వీ, వా పనికిం బొడరు టబ్రు ♦ మా నెటు లిటు లీ
ప్రాపు గనఁ గలుగుటయె మా, కీపరవస మొసఁగ నిందు ♦ హేతు వధీశా.

క॥ ఇఁకఁ గాఁగల పను లిన్నియు, నక గాఁగల వన్నియుం గ ♦ నం గల రఘునా
యక; లంకముట్టఁ గ్రతు వీ, యకలంకము పదము సిద్ధి ♦ కాస్పద మయ్యెన్.

క॥ గురువచనము కృత మయ్యెను, గురుధర్మం బబ్బె నీకుఁ ♦ గోవిదవినుతు
ల్వరఁగె విశదము మహాయశ, మరయ స్నీయదియ నాఁగ ♦ నయ్యె జగములన్

క॥ అని ముని తనివున రసవా, హిని నత్తజి వెల్లిగొలుప ♦ నెల్లరును సుపా
వన మనుచు దొప్పఁదొఁగిరి, ననుచువిధిం దశ్కృతార్చ ♦ నము లొప్పారెన్.

వ॥ భానుకులాలంకారుండగు రాముండు సానుజుండై యమ్మునిరాజహంసవతంసమ్మునకు సవిధానభక్తిప్రధానంబుగ సప్రదక్షిణసాష్టాంగప్రణామంబు లాచరించి తదీయమానసవికాసానురూపంబుగ ననుజ్ఞవడసి కాల్యకృత్యంబుల నిర్వర్తించి జప్యజపనిష్ఠలం బ్రవర్తించుచు మురువుసూపు నయ్యిరువురు రఘువీరాగ్రేసరులుం గృతార్థముదితులుఁ బ్రహృష్టాంతరాత్ములు నై యారజని సారజనిం గావించి రనుచుం దిన్నని విన్ననువు వెలయ జన్నంపువేఁటకాఁడు తన యన్నుమిన్నకు వెన్నుండు తబిసినెల జన్నంబు గాపాడి పాడి నెఱపిన తెఱం గెఱింగించి సమంచిత కౌతూహలంబున మించిన. ౨౫౯

క॥ విని వనజనయన నెమ్మన, మున ముదుకొని పొంగి పొరలు ♦ మోదమ్మునఁ జి
క్కని కౌఁగిటఁ దనుఁ బొదివి స, మనంతరక్రమకథాశ్రు ♦ తాదృత యగుడున్.

మందాక్రాంతావృత్తము.

విద్యామూర్తీ; ♦ వివిధమహిమా ♦ విష్కృతైశ్వర్యకీర్తీ
సద్యస్స్ఫూర్తీ ♦ క్షణకృతజగ ♦ జ్జాలలీలాఽభినర్తీ
సద్యోగార్తి ♦ శ్రపణవిధిసం ♦ సక్తభావానువర్తీ
ప్రద్యోతర్తీ ♦ భవదుపనిష ♦ త్ప్రాప్యభూచక్రవర్తీ. ౨౬౦

క॥ సర్వేశ్వర సర్వాత్మక, సర్వజగత్సేవ్యమాన ♦ సర్వవిశేషా
సర్వవిభూతివిధాయక, సర్వశ్రుతివేద్యవిభవ ♦ సర్వాతీతా. ౨౬౧

పృథ్వీ॥ నిరస్తగుణదోషహృ ♦ న్నిహితసత్ప్రబోధోదయ
స్వరూపమహితాత్మదృ ♦ క్ప్రకటితైక్యయోగాస్పదా
నిరూపితజగత్త్రయీ ♦ నిరవధిక్రమప్రాభవా
స్వరోచిరుపగుంభభా ♦ స్జలజబాంధవాదిప్రభా. ౨౬౨

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమునం బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### ♦ షష్ఠాశ్వాసము ♦

:(౦):

శ్రీ సంప్రదాయ శుద్ధక
థా సముపహితశ్రుతిప్ర ♦ ధానవిశేష
వ్యాసంగ సంప్రసాదన
భాసిత నిజభక్తియోగ ♦ భావాధీనా. ౧

తే॥ అవధరింపుము మదనద ♦ ర్పాపహారి
హైమవతితోడఁ దా నిట్టు ♦ లనియెఁ దెలియఁ
బ్రేయసీమణి వినుము సం ♦ ప్రీతి గనుము
రాము చరితము నవసుధా ♦ రస భరితము. ౨

### ♦ విశ్వామిత్రుండు మునిగోష్ఠి నుండి శ్రీరామునితో సంభాషించుట ♦

ఉ॥ నావ్వనరాక యాగము మ ♦ నోరథపూగముతో ఫలింపఁగాఁ
గ్రొవ్వఱ దండిరక్కసులు ♦ కూళలు గూలఁ దపోధను ల్గను
ల్నివ్వెఱపాటునం దన మ ♦ నీష నుతింపఁగ రాశోలంబు మే
ల్మవ్వము మీఱఁ దాఁ గడపె ♦ మౌనివరేణ్యుఁ డొకింత కాలముం. 3

చ॥ సుఖశయనం బొనర్చి పరి ♦ శుద్ధమనస్కుతఁ దార్చి ప్రాహ్ణస
మ్ముఖకృతు లెల్లఁ దీర్చి మను ♦ ముఖ్యజపప్రతిపత్తిఁ బేర్చి య
మ్మఖపతిఁ జేరి మ్రొక్కుదురు ♦ మాన్యుల కల్లై వినమ్రులౌదు రు
న్ముఖులయి ధర్మవర్త్మమున ♦ నూల్కొని యొడ్డనుఁ జేర్ప రాట్సుతుల్. ౪

ఆ॥ తన్నుఁ దఱియ వచ్చి ♦ ధర్మనిష్ఠఁ దనర్చి
కర్జ మడిగి మధుర ♦ కలన లొాలయు
పలుకుబడులఁ గలయ ♦ భాషింత్రు నీ కేము
కింకరుల మటంచుఁ ♦ గీర్త్యు లగుచు. ౫

సీ॥ శాబ్దంబునను మున్న ♦ చవి గన్న చెవి గొన్న, పారవశ్యంబున ♦ బలువు మెచ్చి
యనుమితికరణమే ♦ యనుమాన మని దాని, ప్రాథమ్య మొండెడఁ ♦ బాఱవైచి
రూపింపఁ బ్రతిరూప ♦ రూపణం బసదంచు, నుపమ ప్రామాణ్యంబు ♦ నుజ్జగించి
యఖిలసమ్మతము ప్ర ♦ త్యక్షమం చద్దాన, స్వానుభూతివిధావి ♦ ధాన మరసి
రామతత్త్వం బిదియె పర ♦ బ్రహ్మ మనుచుఁ
దపసులునుఁ దానుఁ దత్పర ♦ తంత్రు లగుచు
నొండువృత్తు లెడలి చొక్కు ♦ చుండి రపుడు
నిత్యతృప్తి గడల్కొన ♦ నీరజాక్షి. ౬

ఆ॥ నెరడు లేక యేక ♦ నియతి నవ్వారల
చూడ్కు లెల్ల రాము ♦ సోయగమ్ము
చూఱకొనఁగ గోష్ఠి ♦ సాగియుచుఁ గౌశికుం
డొక్కనాఁడు పలికె ♦ నుచిత మెఱిఁగి. ౭

సీ॥ ఎదురుచూచెడుఁ దల ♦ లెత్తి యీపులకలు, తనివోక నీదు నే ♦ స్త్రమునఁ దవిలి
తెప్పపాటున మేల్కొ ♦ మెప్పుగా దేరాలి, భాగ్య మట్టులు దృష్టి ♦ పట్టెక్కి కిపుడు
ధుర్యమా పలుకుమా ♦ ధుర్యంబునకు శ్రుతి, నాశ్రయించెడు నాల్క ♦ యద నెఱింగి
కలిగె సంకల్పవి ♦ కల్పకల్పన మిథ్య, గా నేకలక్ష్యంబు ♦ కలిమి మదికి
నిన్ను విడతు మెట్లు ♦ నీమేలు మామేలు, గాఁ దలంతు మసదు ♦ గాదు ముగ్ధ
మూర్తి; సర్వలోక ♦ మోహన; యిందిరా, కామ; ప్రథితహర్ష ♦ భూమ; రామ.

క॥ నీశాసనమున మెలఁగుదు, రీశానవిరించిముఖ్యు ♦ లేమెఱిఁగియు ని
న్నేశాసింపఁ దొడఁగితిమి, పాశ మెడలఁ జేయు చనవు ♦ పడసి రమేశా. ౯

క॥ మేలెంచి పనిచె దశరథుఁ, డాలించితి వట్లుతపసు ♦ లందఱ మొఱ లీ
కీలెంచి వేల్పు లలరిరి, పాలించితి జగములెల్ల ♦ భక్తాధీనా. ౧౦

తే॥ ఇంక జనకునిఁగనఁ బోవు ♦ టెగ్గు గాదు, గాని కల దొకకర్జమా ♦ కాంక్షితమ్ము
వినుము జనకుండునా జగ ♦ ద్విశ్రుతుండు, మిథిల యేలెడువాడు భా ♦ మిహిరుఁడతఁడు.

క॥ ఆతని గొనములు పొగడఁగ, నాతరమా సురలు మునులు ♦ నాకేశుఁడు నా
ధ్యాత మొనరింత్రు తచ్చరి, తాతతవైభవము మహిత ♦ మని రఘువీరా. ౧౧

క॥ యోగరహస్యజ్ఞుఁడు స, ద్యోగరసాభిజ్ఞుఁ డంచి ♦ తోద్యోగరమా
యోగజ్ఞుఁ డధిసమజ్ఞుఁడు, త్యాగజ్ఞుఁడు సర్వసార ♦ తత్త్వజ్ఞుండున్. ౧౩

—♦ జనకప్రతిజ్ఞాప్రశంస ♦—

ఉ॥ పన్నము తెల్లవేల్పులకుఁ ♦ బాపఁ దలంచి మలంచు వేడ్కమై
జన్న మొనర్పఁ బూని మహి ♦ జాని మహీపరిశోధనార్థమై
దున్నఁగ నొక్క మందసము ♦ తోఁచె హిరణ్మయ మందుఁ గన్పడెన్
గన్నియమిన్న యొర్తుక వి ♦ కాసవిభాసితదిగ్విభాగయై. ౧౪

క॥ ఆసిసువు లోకజనని యు, నా నెగడఁగ దానిఁ బెనిచె ♦ నరనాథుఁడున
న్నానితకల్యాణకలా, శ్రీ నలువారంగ నదియుఁ ♦ జెలఁగెఁ గుమారా. ౧౫

క॥ తా నచ్చరకోమఁ గాంచుట, పూనిక మెయి దానిఁ బోలు ♦ ప్రతికిఁ బడయం
గా నిచ్చ యిచ్చగించుట, యానని యశరీరవాణి ♦ యనుట దలఁచుచున్. ౧౬

ఆ॥ తన యదృష్టలక్ష్మి ♦ తన తల్లి తన బిడ్డ, యనుచు గారవించు ♦ ననుచు కూర్మి
నారసం బపత్య ♦ మంతలుగాఁ జూడఁ, డతని భాగధేయ ♦ మఱఁతి యగునె.

క॥ ఆ యెలనాగయు లలితము, ప్రాయము తోడ్తోన తనకుఁ ♦ బొల్పడ నవభి
ప్రాయమునఁ గళల రుచుల న, మేయవికాసమున జగతి ♦ మితి మీఱుటయున్.

తే॥ తగిన పరిణేతఁ గూర్పంగఁ ♦ దలఁచెఁ గాని
కానఁబడ దయ్యె నద్దాని ♦ కడమ ఫలము
భువనమోహనకలనా ప్ర ♦ బుద్ధుఁ డైన
వాఁడు తన బుద్ధి నెప్పాట ♦ వఱల కునికి. ౧౯

సీ॥ ఆతిథేయుఁడు విడ ♦ నాడఁగా నేరఁ డా, శాభంగకారి దో ♦ సం బెఱింగి
సత్యవ్రతుఁడు మాట ♦ జాఱఁగాఁ జూడఁ బోఁ, డనృతవాదమున వే ♦ దనకుఁ దనికి
ధర్మనిష్ఠుఁ డుపేక్షఁ ♦ దవిలి వర్తింపలేఁ, డాలస్యమున దుర్న ♦ యత్వ మరసి
తత్త్వవేత్త ఖికారి ♦ దశకుఁ బొల్పడఁ జాలఁ, డవ్యయానందమ్ము ♦ నందఁగాంచి
సంకటం బిట్టిదయ్యెనా ♦ జనకనృపతి, కసిపదను పైని నడక చౌ ♦ ప్పావహిల్ల
గన్నె కన్నెఱికము నెఱి ♦ గడ వనీక, తగినవరుఁ గూర్పఁ డను వార్త ♦ తారసిల్ల.

క॥ కలహములు పెక్కు లాదవినఁ, గలఁగ కతం డీశ్వరోప ♦ గతమై పూజా
కలన లోలయు ధను వొక్కఁడు, గలికికిఁ బణ మనుచుఁ గొంత ♦ కాలము గడపెన్.

ఆ॥ విల్లుపూని తనదు ♦ వెరవుమై గొనయమ్ము
గూర్పఁ జాలు నతఁడె ♦ కూర్చువాఁడు

కొమ్మ కనియె దానఁ ♦ గోనకొని ముజ్జగ
మ్ములనుఁ బొంగి పొరలి ♦ మొనసె నొకట. ౨౭

క॥ ఒక్కండేనిఁ గదల్పఁగ, నిక్కఁపు గండఁడు జగముల ♦ నేఁటికిఁ గనరాఁ
డక్కజము వఱలఁ దెరలిరి, పెక్కురు రాజన్యులూర్పు ♦ విడుచుచు రామా.

ఆ॥ దైవసాహ్య మొండు ♦ దక్క దక్కొండు లే, దనుచుఁ బెద్దలెల్ల ♦ రనుమతింప
జరుపుచున్నవాఁడు ♦ జతన మాఱడిపోవ, జనవిభుండు దీర్ఘ ♦ సత్రమిపుడు. ౨౮

క॥ వేదార్థకలన లాశీ, ర్వాదంబులు తర్కతంత్ర ♦ వాగనుసృతసం
వాదంబులు దివి భువి సం, మోదముఁ బూరించుఁ దోర ♦ ముగ నాసభలోన్.

తే॥ ఈగికి నమర్వాణలకు మ ♦ నీషు లట్టు, లమరు లక్కఱపడుదు రా♦హావ్యమునకు
నిర్మలాత్ముండు పొసరించు ♦ నిష్ఠ కఖిల, భూతసంతతి సంతృప్తిఁ♦బొదలు టరుదె.

ఆ॥ బ్రహ్మవిద్వరుండు ♦ పార్థివు జన్మంబు, గాంచి యతని నాద ♦ రించు టొకటి
మొనసి వేడ్క మీఱ ♦ ముక్కంటివింటి లా వెంచి కర్జ మనుస ♦ రించుటొకటి.

క॥ కలపను లచ్చటి వింతలు, గలయం బరికించి గురులఁ ♦ గనఁ బోవుదు మ
క్కలన నె సాకేతమునకుఁ, దలఁపున నిటు లునిచినాడ ♦ దశరథతనయా. ౨౯

ఆ॥ అవెయు నెన్నవల ద ♦ నాహూతగమనమం, చధ్వరమున కట్టు ♦ లరుగుటయును
విధినియుక్త మచటి♦విధియుక్తసత్కార, మెనయఁ గనుట సుకృత♦మిచ్చు ఫలము.

ఆ॥ నిన్నుఁబోఁటి పేరు ♦ గన్న గండరగండఁ, డరయ వలదె హరశ ♦ రాసనంబు
నిత్యరాజయోగి ♦ నిర్ణీతపూజనం, బఖిలనరసురాసు ♦ రాభినుతము. ౩౦

సీ॥ గుఱి మీఱి శుభములు ♦ గురియు నెమ్మేనికిఁ, దెఱవల కన్నులా ♦ తిథ్య మొసఁగ
బాసచేసి విశుద్ధిఁ బరఁగించు పదపద్మ, జలముల జనము పైఁ ♦ జల్లుకొనఁగ
వాదమాడి సిరుల్ప్రి ♦ సాదించు చూడ్కుల, కర్థులారాత్రిక ♦ లర్థిఁ గూర్పఁ
బేరువాడి వెతల్వి ♦ దారించు నామ మా, శ్రితులెల్ల నెమ్మదిఁ ♦ జేర్చి పొగడ
జనకుని తపమ్ము ఫలమున ♦ సార మిదియ
యనుచు సభ్యు లలరి సభా ♦ జన మొనర్పఁ
గలుగు భాగ్యంబు మిథిలకు ♦ నెలవు కొలుపఁ
గోరుచున్నాడ నింక ర ♦ ఘుప్రవీర. ౩౧

## ♦ శ్రీరాముఁడు మిథిలాప్రస్థానం బంగీకరించుట ♦

చ॥ అని ముని తెల్ప నత్తపసు ♦ లందఱు మేలన రాముఁ డాదరం
బున వినయంబు భక్తియు వి ♦ భుత్వమునన్నెఱి నూప వల్లె యం

చనుటకుఁ దోడుగా స్మితమ ♦ యుం బగు నుల్లసితంబు మోమునం
దనువుపడం బొసంగుటయు ♦ నత్తటి ముత్తరళీకృతాత్ముఁడై. ౩౨

క॥ పయనము సేసె శుభోదయ, మయవిహితముగా నెఱింగి ♦ యాశ్రమమునుల
మ్మయిన తనతోడివా రయి, బయలు వెడలి రాఁగ గాధి ♦ పట్టి మురియుచున్.

క॥ సిద్ధాశ్రమమున కతఁడు త్రి, శుద్ధిఁ బ్రదక్షిణము సేసి ♦ జోహారిడై సం
సిద్ధులు మును లాకొమరులు, నద్ధర్మువ్ర నొలసి రా న ♦ హార్యతనూజా. ౩౪

సీ॥ పోయివచ్చెద మింకఁ ♦ బుణ్యవృక్షములార, నెయ్యంబు మాయెడ ♦ నిలుపుఁడెపుడు
నోషధీమణులార ♦ యూరడిల్లుఁడు రామె, యేనాఁటనేని మీ ♦ యెలమి దలఁచి
గిరినిర్ఝరములార ♦ గెలికొను ప్రేముడి, ననుపుఁడా; శ్రేయంబు ♦ లనువుపడఁగఁ
దివుట మైకొన వన ♦ దేవతలార; మీ, శుభదృష్టులను మమ్ముఁ ♦ జూడవలయు
నమ్మ సిద్ధాశ్రమస్థలీ; ♦ యందరాని, ఫలము గయికొంటి నీదయ ♦ భద్రముగను
మఱవకుండుఁడు మీమేలు ♦ మఱవఁ జాల, వాసి నెక్కిన తాపస ♦ వర్యులార;

—♦ మిథిలాపుర ప్రయాణము ♦—

మ॥ అని యామంత్రణముం బొనర్చి తనతో ♦ డై వీడరాకున్న యా
మ్మునిసంఘమ్మును రాకొమారులను స ♦ మ్మోదమ్మునం గొంచుఁ ద
క్కినవారు న్వనదేవతాదికము ను ♦ త్కృష్టావృతిం బాయ లే
మని యెట్లో మఱల న్గమించె శుభల ♦ క్ష్యవ్యాప్తి చెన్నొందఁగన్. ౩౬

క॥ శకటీశతమాత్రమునకుఁ, బ్రకటము బ్రహ్మర్షి చయము ♦ ప్రాయ మఱిగె వా
రక కులపతివారితమై, యకలంకము ఖగమృగాగ ♦ మాద్యము నిలిచెన్. ౩౭

క॥ శోణనదము దరిఁ జేర న, క్షీణగతి న్నాఁటి కరిగి ♦ ప్రీతిఁ బొదలె ని
ర్వాణసుఖమాని మౌని ధు, రీణ యనిద్రాణయు నగు ♦ శ్రీ మునుకొనఁగన్.

తే॥ సాంధ్యకృత్యంబు లచ్చోట ♦ జరిపి మలసి
యెలమి సుఖశయనము గూర్చ ♦ నింతవట్టు
వారు జతనం బొనర్పంగ ♦ వలను మీఱ
రాముఁ డనుజన్ముఁ గూడి సు ♦ ధాముఁ డగుచు. ౩౯

క॥ సుహుతహుతాశను లమిత, ప్రహితౌజులు నైన ఋషుల ♦ వరగోష్ఠి రఘూ
ద్వహు లన్నెఱిఁ దనరారిరి, ద్రుహిణుం డిరుగాపు లెనసి ♦ దొరసెనొ యనఁగన్.

క॥ మునిసింహము విశ్వామి, త్రునకున్ దక్కినతబసులకు ♦ మ్రొక్కి కొలిచి రా
మన యాఘనుఁ గని కౌతుక, మినుబడిగా ముద్దులొలుక ♦ నిట్లని పలికెన్. ౪౧

క॥ మహనీయ నీ మెఱుంగని, మహిమలు లేవెందు నేని ♦ మానితసుగుణో
ద్వహము గిరినిర్ఝరానో, కహమహితము దేశ మిది ప్ర ♦ కాశించుఁ గడున్.

తే॥ దీని తత్త్వంబు దెలుపుము ♦ దేశికేంద్ర
వేడ్క బొడమెడుఁ జూడ్కికి ♦ వింత సేయ
నియతిఁ జాలెడు నిచ్చోట ♦ నిరతి మెఱయ
నేమహాత్ములు నివసించి ♦ యెలమి గనిరొ.

ఆ॥ ఎఱుకగలుగువారి ♦ నెనసి సేవించుట, పుణ్యభూమి దెంచి ♦ పొరయఁ గనుట
ధర్మ వార్తి గనియుఁ ♦ దప్పక మెలఁగుట, భవము గాంచి పడయు ♦ ఫలము కాదె

క॥ అని వేడినఁ జనవునకున్, దన మనమున సంతసిల్లి ♦ తాపసవర్యుం
డనె నిట్లు మానిమండల, మనుమోదింపంగ మేన ♦ కాత్మజ; వింటే. ౪౫

## —♦ కుశోపాఖ్యానము ♦—

ఆ॥ తపము గనిన కలికి ♦ తనమున రూపు ధ, ర్మావతార మాశ్రి ♦ తామరాగ
మధికృతుండు సజ్జ ♦ నారాధకుఁడు కుశుఁ, డన జనించె నలువ ♦ కవని వెలయ.

తే॥ ఆతఁ డుపనీతుఁడై విద్దె ♦ లరసి మెఱసి
క్షత్రధర్మోచితశ్రీఁ బ్ర ♦ సక్తిఁ దవిలి
యొండు సరిరాఁ డనఁగ నెందు ♦ నొలపు గాంచె
నజుఁడు తనసృష్టి మేలిమి ♦ కాత్మ నలర. ౪౬

క॥ వైదర్భి రీతి యొందు బు, ధాదృత యని తత్ప్రదాన్వ ♦ యాంచిత సాధ్వీన్
వేదోక్తవిధి వివాహం, బై దేవనిభుం డతండ ♦ నామయుఁ డమ్మెన్. ౪౭

క॥ అనవరతము శుశ్రూషలఁ, దనరెడు పతిదేవతావ ♦ తంసం బమ్మా
నిని యోగమ్మున నాతఁడు, గనె నలువురు సుతుల స్వకవి♦కసనము పొసఁగన్.

వ॥ కుశాంబకుశనాభాధూర్తరజసవసువులను నక్కుమారరత్నంబులకు జాతకర్మాది సంస్కారవిశేషంబులు నిర్వర్తించి సకలకలాకోవిదులం గావించి ధర్మపథం బెడలనీక భూలోకపరిపాలనం బొనరించునది యని యవ్వారల నియోగించిన.

క॥ నానత్యనిభులు సుమహితు, లానత్యవ్రతులు తండ్రి ♦ యానతి దెసలన్
భాసిల్లిరి భూభరణ, ప్రాసంగికు లగుచు దిగ్వ ♦ రప్రాంచితులై. ౫౧

వ॥ కుశాంబునకుఁ గౌశాంబీపురంబునుఁ గుశనాభునకు మహోదయపుటభేదనంబును నాధూర్తరజసునకు ధర్మారణ్యపత్తనంబును వసువునకు గిరివ్రజనగరంబును రాజధానులుగా గుణాఢ్యులరగు నవ్వార లెల్లజగంబును ధర్మపూరంబునం బొనరుపడి శుద్ధంబుగాఁ బరిపాలనంబు గావించుచుం బొగడుగని రందు. ౫౨

క॥ వసునిభుఁ డవ్వసుఁ డేలిన, వసుమతి యిది యవియె శైల వరము లయిదు త
త్ప్రసృత సుమమాల యనఁగ వి, లసిల్లునది నది ఫలత్ఫ ♦ లప్రస్తుతమై. ౫౩

ఆ॥ గిరుల నడుమ వెలసి గిఱికొను మగధదే, శములఁ జొచ్చి తాఁ బ్ర ♦ శస్తిఁగాంచె
మాగధీపదమున ♦ మహిత యియ్యదివసు, పాలనంబు కీర్తి ♦ భంగి రామ. ౫౪

క॥ ఘనుఁడు కుశనాభనరపతి, కనకాంగి ఘృతాచి యందుఁ ♦ గన్యాశతముం
గనియె గుణరూపవిభ్రమ, కనత్కలాశ్రీవికాసి ♦ గా సుకృతమునన్. ౫౫

క॥ తనయావనశాణోత్తే, జనమున స్త్రీరత్నశతము ♦ చాలెను రుచులం
దనర నమూల్యమగుచుఁ బ్రా, ర్థనమున దరిఁ గాంచు నతఁడె ♦ ధన్యుం డనగన్.

వ॥ అంత నొక్కనాఁ డక్కన్యకామణు లంతరంగంబుల నెక్కొను కుతూహలాతి
రేకంబున. ౫౭

—♦ కుశనాభుని పుత్రికాశత ముద్యానంబున విహరించుట ♦—

సీ॥ సొబగు గుత్తుకఁగొన్న ♦ చొప్పు మెప్పున మేలి, నెమ్మేను లిమ్ముల ♦ నెమ్మి దెలుపఁ
జెనయు శ్రీ నెఱజాణతనమునా వింతచొ, క్కటం బెదిరి చూడ్కి ♦ గమియఁజూడఁ
జతురలంకృతికలా ♦ సామగ్రి పుట్టుతో, నొదవినయది గాఁగఁ ♦ గదిసి మెఱయఁ
గలికికన్నులు గన్న ♦ కానుపు ల్చూపులు, మరుని తూపులపైసి ♦ మాటమోప
మొనసి రుద్యానవనభూమి ♦ మొగిలు కెలని
మెఱుఁగుఁదీఁగెలు నాఁగఁ గ్రొ ♦ మ్మెఱుఁగు లీను
చుక్కలనఁ జూచుమేరకు ♦ నెక్కువలగు
సంపదలకు నిలింపు లా ♦ శ్చర్యపడఁగ. ౫౮

క॥ పాయని సయ్యాటంబుల, నాయింతులు మెలఁగఁ గాంచి ♦ యటఁజనలేక
క్కాయజుని బారికేర్పడి, వాయువు తన్నెఱుకసేసి ♦ వారక పలికెన్. ౫౯

ఆ॥ చెలువలార మీకుఁ ♦ జెడదు ప్రాయము మిమ్ము
వలచినాడ నన్ను ♦ వలతురేని
దీర్ఘ మాయు వొదవు ♦ దివ్యత్వ మబ్బు నిం
కేల చెడెద రింత ♦ యెఱిఁగి యెఱిఁగి. ౬౦

క॥ నాతలఁపు చిన్నపుచ్చకుఁ, డోతలిరుంబోఁడులార ; ♦ యొదుఁగకుఁ డింకన్
మీతరమె నన్నుఁగడవ న, మాతతవైభవము గాంచుఁ ♦ డని తివురుటయున్.

ఉ॥ వారు కలంగి యిట్లనఁగ ♦ వచ్చునె దేవుఁడ వీవు వాయుభ
ట్టారక ; మర్త్యకన్యకల ♦ డాయఁ దలంచుట వింతగాదె దు

ర్వారము నీప్రభావమని ♦ పద్ధతి మార్చుట నీతియే సదా
చారమున న్స్రైలంగుదుము ♦ చాలుదు మీానుడి కానసేయఁగన్. ౬౨

ఆ॥ తపము గెడపరామిఁ దాళితి మిన్నియు, నేల తండ్రి గురువు ♦ నేడుగడయు
దైవతమ్ము నతఁడ ♦ తాఁ గూర్చు నెవని క, వ్వాఁడె వరుఁడు మా ♦కవశ్యముగను.

—♦ వాయుదేవుఁడు కుశనాభుని పుత్రికలఁ గుబ్జలనొనరించుట ♦—

క॥ అనినం గోపించి ప్రభం, జనుఁ డెడకని సొచ్చి కోమల ♦ చక్కని మేను
ల్గొనకొని భంజించెను వా, రనుపదమే కుబ్జ లగుచు ♦ నాక్రోశింపన్. ౬౪

తే॥ అటు పరాభూతలై మన్కి ♦ కరిగి వారిలి
రంగనామణు లుద్విగ్న ♦ లగుచు వారి
తెఱఁగు గనుఁగొని యిది యేమి ♦ తెవులుగొంటి
రిట్టులన నంతయునుఁ దండ్రి ♦ కెఱుకసేయ. ౬౫

ఉ॥ ఆతఁడు సంతసిల్లి తగ ♦ నాడితి రమ్మొయి నమ్మలార ; యొ
ప్లేతటి నెట్టులేననిన ♦ నింతుల కోరిమి మేల్మి గూర్చు ధ
ర్మాతత వైభవంబు గన ♦ నయ్యెను మీాకృతి నింతె చాలు వి
శ్వాతిగ మయ్యెఁ గీరితి భ ♦ యం బెడఁబాయుఁబొసంగు భద్రముల్. ౬౬

క॥ అనితరసులభం బియ్యది, యనూనమతి మీాకెఱుంగ ♦ నయ్యె నిజకులం
బున పాడి దలఁగ కుండుట, యనిమిషు లననేమి లాఁతు ♦ లన నేమి యగున్.

ఆ॥ అనుచు నోడిచి వారి ♦ నాతఁ డాశ్వాసించి: మంత్రివరుల తోడ ♦ మలసి తదను
రూపసుగుణవరని ♦ రూపణమున మది, దవుల మెలఁగుచుండె ♦ రవికులీన. ౬౮

—♦ బ్రహ్మదత్తుని చరిత్రము ♦—

మ॥ మునిచూడామణి చూళినాఁ బ్రఖితధా ♦ ముం డూర్ధ్వరేతస్కుఁ డొం
డెనసె న్బ్రహ్మతపస్స్థితి న్నియతిమై ♦ నెవ్వారికిం దేఱిచూ
డను రా కాతనిఁ గొల్చుచుండె వెనువెం ♦ ట న్దన్మహత్త్వంబు మే
లని గంధర్వి యొకర్తు చొక్కుచుఁ దదీ ♦ యంబౌ నిదేశంబునన్. ౬౯

తే॥ ఊర్మిలాత్మజ యయ్యది ♦ యొప్పుచుండు
సోమద యనంగ నద్దానిఁ ♦ జూచుచూడ్కి
సోమనిభముఖదానంబు ♦ చొప్పరయక
పోదు సౌజన్యమున దానిఁ ♦ బోల రొకరు. ౭౦

తే॥ ఉండియుండియు నది యొడ్డ ♦ కొజ్జ యయ్యె
మౌని శుశ్రూషణమున నే ♦ మమ్ము నోడువ
ధర్మ మింతయుఁ దప్పక ♦ దప్ప కనయక
సజ్జనులు మెచ్చు సువ్రతా ♦ చరణ మొలసి. ౨౦

క॥ దానిఁ గని యమ్మహాత్ముం, డానీరజనయన; నీగుణోన్నతి కెలమి
న్నే నెద మెచ్చితి నేవర, మేని న్గోరి కొను మన మ ♦ హిల యిట్లనియెన్. ౨౧

క॥ మునిచంద్ర; త్వత్ప్రసాద, మ్మున మొనయుదుఁ గాత బ్రాహ్మ ♦ మునఁ దేజమునన్
దనరి నినుఁ బోలు తనయు నో, కని ధర్మిష్ఠుని ధరాజ ♦ గతి వెలయంగన్. ౨౩

ఆ॥ కన్నె నేను నిన్నుఁ ♦ గాంచి త్రిశుద్ధిగ, నీదు సేవసేయు ♦ నెఱియ తక్కఁ
దక్కుఁ గలుగ నింక ♦ నెక్కరణినిఁ బ్రోవఁ, దలఁతొ సదయ యనినఁ ♦ దాపసుండు.

వ॥ అనుమతించి నిజతపఃప్రభావంబున నద్దాని యందుఁ బుత్రోత్పాదనంబు గావించి భావించి యవ్వానికి బ్రహ్మదత్తుండను నామధేయం బిడి సన్మాననీయాను భావంబుం బ్రసాదించిన. ౨౪

క॥ అసామదేయుఁ డధిక, క్ష్మాసామ్రాజ్యము వహించెఁ ♦ గాంపిల్యాఖ్యన్
భాసుర యగు పురి నిలిచి ద్వి, భాసురపతికలన లొడ్ల ♦ తలఁపుల నోదవన్.

ఉ॥ ఆతనిఁ దోడితెచ్చి ఘనుఁ ♦ డాకుశనాభుఁ డొసంగెఁ బ్రేముడి
న్గూఁతుల నూర్వురం దదను ♦ కూలశుభోదయ మెంచి మించి లో
కాతిగ తేజుఁ డమ్మహితు ♦ హ స్తము సోకిన యంతఁ బాసెఁ ద
ద్వాతవికార మెల్ల బుధ ♦ వర్యులు మేలని సన్నుతింపఁగన్. ౨౬

ఆ॥ కఱవుదీఱఁ దనదు ♦ గాదిలికన్నెల, మేలు గాంచి పొంగి ♦ మేదినీశుఁ
డనిచెఁ బుత్రికలకు ♦ నల్లునకు మహార్హ, మైన హారణ మొసఁగి ♦ యాదరమున.

క॥ సోమద సుతుఁ గోడండ్రం, బ్రేమ వెలయఁ గాంచి తనసి ♦ రిం దలఁచి తప
శ్శ్రీమహితమౌనిసేవా, సామర్థ్యం బెంచి సుఖర ♦ సంబునఁ దేలెన్. ౨౮

## ♦ గాధి జన్మవృత్తాంతము ♦

తే॥ రఘువరాన్వయతిలక ; యా ♦ రాజచంద్రుఁ
డర్మిలికొమార్తె లత్తింటి ♦ కరిగి నెగడ
జాతి యగు నిష్టి నెఱపె స ♦ త్పుత్రుఁ బడసి
యన్వయము వెలయింపఁ దా ♦ నాత్మఁ దలఁచి. ౩౦

ఆ॥ ఇష్టి జరుగుచుండ ♦ నెలమిమై బ్రహ్మలోకమున నుండి కుశుఁడు ♦ కరుణ వెలయ
నేగుదెంచి తనయ; యీవు గోరినయట్లు, పుత్రుఁ డూర్జితుండు ♦ వొడము నొకఁడు.

ఆ॥ నీకుఁ దగినవాఁడు ♦ నిజధర్మనిష్ఠితుం
డసము గాధ వెలయు ♦ నతనివలనఁ
గాన గాధి యనఁగఁ ♦ గాంచుఁ బే రాత్మసం
పదల కొలయు సుకృత ♦ మొదవు ననిన. ౮౨

క॥ ఆనందించి సుతుఁడు తన, కానత్రముండై విధిక్ర ♦ మార్చితుఁ జేయం
గా నలరి చనె నతండు శ, తానంద నికేతనమున ♦ కాజితనూజా. ౮౩

ఉ॥ ఆదటఁ గొంతకాలమున ♦ కామపితుండు జనించి ధాత్రి సం
మోదిత గాఁగ నేలె విధి ♦ ముఖ్యులు మేలన ధర్మయోగసం
పాదితకీర్తి యయ్యె ముని ♦ వర్యుల గోష్ఠి మెలంగి యాత్మవి
ద్యోదితచిద్వికాసమున ♦ నొప్పె సుఖాభ్యుదయంబు చొప్పడన్. ౮౪

క॥ ఆతం డస్మజ్జనకుఁడు, శీతాంశునిభాస్య; నాదు ♦ జ్యేష్ఠస్వస ప్ర
ద్యోతాంగి సత్యవతి యన, ఖ్యాతిఁగనె ఋచీకపత్ని ♦ యై లోకమునన్. ౮౫

—♦ కౌశికీవృత్తాంత కథనము ♦—

ఆ॥ పడఁతి భృగుకులంబు ♦ పావనం బొనరించి
మూర్తి తోనె దివము ♦ మొనసె భర్తృ
యుక్త యగుచుఁ గడఁగి ♦ యోగశక్తినిఁ బ్రవ
హించె వాహినీత్వ ♦ మెనసి జగతి. ౮౬

సీ॥ తన యాలువున మేల్మి ♦ దలఁచి పుట్టుననట్లు, నొలసె మాకని గంగ ♦ యుగ్గడింపఁ
దన పూర్వచరితంబు ♦ తవిలి లోకైకహి, తార్థప్రవర్తనం ♦ బనువదింపఁ
దన స్వాదురసయోగ ♦ మునఁ జేసి దేవర్షి పితృలోకములు తృప్తి ♦ బెరయుచుండఁ
దన సేవనాసక్తి ♦ తత్త్వనిర్ణయమున, మొనయు సామ్రాజ్యంబు ♦ ముచ్చటింప
వెలసె మిన్నేటికిని మిన్న ♦ విలసనమున
నాఁగ హిమశైలభూభవ ♦ నమున నుండి
వెడలె రత్నాకరుని తోడి ♦ వియ్యమునకు
నియతి నభిరామ యీతటి ♦ నీలలామ. ౮౭

క॥ కౌశికి యాయమ నేనునుఁ, గౌశికుఁడఁ గుశాభిజాత్య ♦ కలనఁ గలిగెఁ దృ
ష్ణాశునకును స్వస్నమైత్రీ, పాశమున హిమాద్రి పొలము ♦ ప్రాప్తియు స్థితియున్.

ఆ॥ నేమ మెనసి కంటి ♦ నిన్ను సిద్ధాశ్రమ, వాసు లసురభయముఁ ♦ బాసి యలరి
రిట్టి సిద్ధులెల్ల ♦ హేరాళమగు సిద్ధి, తేజమునన కాదె ♦ తెలియ రామ. ౮౯

క॥ నీ యనుయోగము విన్నతి, న్నా యన్వయవిధము లోక ♦ నంద్యచరిత ; యి
ట్లాయెఁ దెలుపంగఁ బుణ్యా, చ్ఛాయాసాదితకథాప్ర ♦ సంగము వెలయన్. ౯౦

సీ॥ నిన్నంగనై సంజ ♦ నిలిచె రాగము వోవ, రేచీఁకటిని దెసల్ ♦ కేలి సెడియెఁ
జాలించె మెకములు ♦ సంచార మెల్లెడ, నడఁగె నీడముల వి ♦ హంగములు
మానె మానుల యట్లు ♦ మానులు చలనమ్ము, జ్యోతుల సభ మిలఁ ♦ జాడఁ దొడరె
నైశభూతములుఁ గా ♦ నఁగ నయ్యె నందంద, జాబిల్లి వొడమెడు ♦ జాడ దోఁచె
కథలు నొడువ రేప ♦ కడఁ గాచె యీమన
త్రోవ విడిచి కొలలు ♦ దొలఁగుగాత
నీకు భద్ర మయ్యె ♦ నిదురవో నాతండ్రి
సొలసితేమొ రఘుకి ♦ శోర రామ. ౯౧

చ॥ పసితన మెంచి మౌని యిటు ♦ పల్కిన రాముఁడు తమ్ముకుజ్జునిన్
ముసిముసినవ్వు లొల్కఁ గని ♦ ముచ్చట దీరఁగఁ జెప్పితయ్య యి
య్యసదృశమా త్వదన్వయమ ♦ హత్త్వము దేశము కల్మి శోడి సొం
పెసఁగ వినంగ నయ్యెఁ గృత ♦ మెల్ల ఫలించెను మిమ్ముఁగొల్వఁగన్. ౯౨

క॥ అని రాముఁడు పొగడఁగ న, మ్మును లనుమోదించి రెలమి ♦ మునుకొన మేత్రే
లని కడఁగి వారు నిట్లని, రనురూపప్రకృతి ఫణితి ♦ తాభ్యుదితగతిన్. ౯౩

తే॥ ఈకుశికవంశ మెల్ల న ♦ నీదృశంబు
ధర్మపరము సుమహిత మ ♦ ధర్మమార
మిందుఁ బొడమిన వారు స ♦ మిద్ధతేజు
లందఱును బ్రహ్మసములు మ ♦ హాత్ము లరయ. ౯౪

క॥ విశ్వమునకెల్ల మిత్రుఁడు, విశ్వామిత్రుఁడన మౌని ♦ విభుఁ డితఁడు మున్
శాశ్వతకీర్తి న్నెలకొనె, విశ్వాత్ములు మీప్రసక్తి ♦ వెలసె న్నేఁటియున్. ౯౫

క॥ ఆతటినీమణి స్వకులో, ద్ద్యోతకరి స్వకీయభగిని ♦ తొలిపుట్టునఁ దాఁ
బూతాత్మిక యిపు డెల్లర, పాతకములఁ దొలఁచి లోక ♦ పావని యయ్యెన్.

ఆ॥ అని ప్రశంస సేయ ♦ నలరారి రెల్లరు, నస్తశిఖరిఁ బెరయు ♦ నంశుమాలిఁ
బొల్ప సగుచు మౌని ♦ పొదలె నిద్దురఁ జేరి, మునులు రాజసుతులు ♦ దనరిరట్లు.

క॥ రేపకడ మున్న మేల్కని, యాపుణ్యమహర్షి ♦ తాత్మం దగుచుఁ
శ్రీపతిచిన్మయమూర్తుల, నాపగిది న్మేలుకొలుపు ♦ ననువునఁ బొనరెఁ. ౯౮

ఆ॥ అయ్య; సుప్రభాత ♦ యయ్యె రాతిరి లెమ్మ, లెమ్మ నీవు మేలు ♦ లీలఁ బెరయ
నవుదు పూర్వసంధ్య ♦ నర్చించి పయనమ్మ, సేయు మిదియె సకల ♦ సిద్ధిపదము.

క॥ అనునెడ మేల్కని యాప, ల్కనుబంధయుతం బొనర్చి ♦ యమివరుఁ గని వం
దనము లొనరించి పయనం, బునకు న్మొనకొనిరి నృపతి ♦ పుత్రులు ప్రీతిఁ.

క॥ ఆపగిది వెడలి మును లిడు, నాపథమున నడిచి శోణ ♦ మటు దాఁటి చలం
బాపక పోఁదొడఁగిరి గం, గాపగ నానాఁడె చూడ ♦ నొఁగా కనుచుఁ. ౧౦౧

సీ॥ తనమీఁది యనురాగ♦మున కానవాలు గా, శోణాహ్వయముకల్మిఁ♦జూపుదానిఁ
బేరుదెచ్చినది గాం ♦ భీర్యమౌ లెమ్మని, రసము గాఢము గాఁగఁ♦ బొసఁగుదాని
నసము సంపాదింప ♦ నయ్యె నిట్లని పులి, నప్రకాశంబున ♦ ననుచుదాని
నామంత్రణంబున ♦ ననువాద మొలయించు, కవిహృద్యవాక్ప్రసం ♦గములదానిఁ
గనిన యట్లై దానిఁ ♦ గనెడు కన్నులతోడి
పోలుపు నెలయఁ గంటిఁ ♦ బున్నె మనెడి
తలఁపు గొనుచుఁ గడచి ♦ దశరథు జని ఫలం
బొరసె మునుల మార్గ ♦ ముత్పలాక్షి. ౧౦౨

ఆ॥ కెలని కొలను లొప్పఁ ♦ గీరశారీపిక, భృంగకలన లెసఁగఁ ♦ బెరసి చాయ
లిడుచుఁ దెమ్మెరలకు ♦ నిక్కలై ఫలపుష్ప, యుతలు వన్యలతిక♦లొలపుగూర్ప.

—♦ గంగావర్ణనము ♦—

క॥ దూరపథము వాక్యామృత, సారాసారప్రసంగ ♦ సరణిఁ గడచి గం
గారమణీయోర్మిలరస, పూరముఁ గనుఁగొనిరి పొంగి ♦ పొరలెడు వేడ్కఁ.

చ॥ తపసుల పాలవెల్లి భవ ♦ తాపనివారిణి పుణ్యరాశి భ
ద్రపద యశోవిశాల సరి ♦ త్పంపతి కూరిమిరాణివాస మ
చ్చఁపు మణిమాల భూసతికి ♦ సారసహంసవిహారసీమ యో
గఁపు ఫలితంబు సార మగు ♦ గంగ కనుంగవ కింపు గూర్పఁగఁ. ౧౦౫

క॥ తత్తీరముఁ బెరసి శుభా, యత్తులు తగు నునికిపట్టు ♦ లనువుపడఁగ వా
రత్తఱి విహితానుష్ఠా, నోత్తీర్ణతఁ గాంచి తొనఁకు ♦ చుండెడు వేడ్కఁ. ౧౦౬

తే॥ రాకొమారులు దారును ♦ రస్య మగు హ
విష్యశేషము భుజియించి ♦ విహితగోష్ఠి

నమరి యుండెఁ బారవ ♦ శ్యంబు దనరఁ
గౌశికవచస్సుధారసా ♦ కాంక్షు లగుచు. ౧౦౭

తే॥ సహసహోదరరుచిర మిఁ ♦ క్ష్వాకువంశ
భూషణం బిట్లనెఁ దదగ్ర ♦ భూమి మొనసి
లలితగుణలక్ష్యమాణలీ ♦ లావధాన
మలయపవమానలోలకుం ♦ తలతలముగ. ౧౦౮

తే॥ కోర్కి సులభమ కాదె మా ♦ కునుఁ ద్వదుక్తి
లోలభావంబు గూర్చునా ♦ లోడనమునఁ
దెలుపు మోయయ్య; మునివర్య; ♦ తేటపడఁగ
గంగ సౌభాగ్య మాత్మజో ♦ గ్యత ప్రసంగ. ౧౦౯

క॥ మును సిద్ధాశ్రమమునం ద్రో, వను మునుకొని కొంత వింటిఁ ♦ బావన మీస్వ
ర్ధుని చరితము సక్రమముగ, వినవలతుం దెలుపవే వి ♦ వేకనిధానా. ౧౧౦

ఆ॥ అనిన హర్షపూర్ణ ♦ మగు హార్దమున హృద
యము దలిర్ప సంది ♦ యంబె యింక
ననుచు మేను వొంగ ♦ నమ్మౌని యిట్లని
తెలుపఁ దొడరె గుణవ ♦ తీలలామ. ౧౧౧

## ♦ గంగోత్పత్తి ప్రశంస ♦

క॥ ఆదిపితామహజగదు, త్పాదనసామగ్రి గాఁబొ ♦ దలు నీయము హే
తూదితజవిమై కలిమికిఁ, గ్రాది యగుచుఁ దోఁచె మొదలి ♦ పుట్టున రామా.

ఉ॥ యోగివరేణ్యపూజిత ప్ర ♦ యోజక యోగిని ధర్మమూర్తి జ్ఞా
తాగమతత్త్వసార యగు ♦ స్వాత్మవధూమణి యందు భూమిభృ
న్నాగము గాంచెఁ బుణ్యమున ♦ నందనుల న్హిమవంతుఁ డాత్తచి
ద్యోగవికాస మొప్ప శుభ ♦ యోజన ముజ్జగము ల్దలిర్పఁగన్. ౧౧౩

తే॥ అందుఁ గన్నియ లిరువురు ♦ నప్రమేయ
రూపరేఖావిలాసని ♦ రూఢ లగ్ర
జాత యీయమ యుమ యను ♦ జాత మణిశ
లాక తెనఁగింత్రు తద్గృహా ♦ మాకరముగ. ౧౧౪

క॥ ప్రాయము నెక్కొనె స్వరస, ప్రాయముగా నాత్రిలోక ♦ వందితల కభి
ప్రాయము గుణరుచివిభవ, ప్రాయమునఁ జరాచరమునుఁ ♦ బాలనసేయన్.

సీ॥ అమృతోర్మిలహాస ♦ మాహార మనిపించు, క్రేగంటిచూడ్కులు ♦ క్రేళ్లుదాఁటఁ
జంద్రరశ్మిస్ఫురా ♦ చాకచక్యము సూపు, చిఱునవ్వు మోమునఁ ♦ జిందులాడఁ
జక్రచక్రాంగసం ♦ శ్రయము దెల్పక దెల్పు. గబ్బిగుబ్బలు నడ ♦ల్గడలుకొనఁగ
రాజీవరాజీవి ♦ రచన మేలెనయించు, నిమ్నలు సోయగ ♦ మిమ్రదె యనంగ

భావిశుభసూచనంబులఁ ♦ బరఁగుచున్న
పెద్దకన్నియ రసవహఁ ♦ బేర్మిఁ గాంచి
వేల్పు లర్థించి రిద్దేవి ♦ వెలయఁగాత
దేవపథయోగమున మముఁ ♦ దేర్ప ననుచు. ౧౧౬

తే॥ లోకపావని యీగంగ ♦ లోకహితము
పొంది స్వచ్ఛందపథగయై ♦ పోలుచు నిదియె
దేవతార్థంబనెడు వారి ♦ తృప్తి కొసఁగె
స్వర్థునిఁగ నిజకన్య నా ♦ శైలవిభుఁడు. ౧౧౭

క॥ అంతట సుర లాయమఁ గొని, సంతస మొప్పారఁ జనిరి ♦ స్వకృతార్థత యిం
తింత యనరా దనుచు ది, వ్యాంతఃకలనం దనర్చె ♦ నద్దేవి దివిన్. ౧౧౮

క॥ తనకు శివుఁడు పరమేశ్వరుఁ, డనఘుఁడు భర్త యగుఁగాత ♦ మని తదనుజ నె
మ్మనమున నిశ్చలచ్ఛరితము. వినిచె న్సురమాని గోత్రి ♦ విభునకు వేడ్కన్.

చ॥ తన శిఖరంబునందుఁ బ్రియ ♦ తపఃకరంబు భజింప స్వాత్మభా
వనిరతి యోగలక్ష్యమున ♦ బ్రహ్మముఖార్చితుఁ డుండె శంకరుం
డనితరగమ్యహర్షకల ♦ నాంచితుఁడై యన నుబ్బి కొల్వఁగాఁ
బనిచె సుతం దదాజ్ఞఁగొని ♦ పర్వతనాథుఁ డఖర్వయోజనన్. ౧౨౦

తే॥ భక్తియోగంబునఁ ద్రిలోక ♦ పతినిఁ గొలిచె
నమ్మహాసాధ్వి యగజ ని ♦ రంతరముగ
నెండ యని వాన యని యొక ♦ యింతయేనిఁ
దలఁపున నొకప్పుడేనియుఁ ♦ దార్ప కొదిఁగి. ౧౨౧

సీ॥ వేదసమ్మార్జన ♦ విధి పొందె స్తనభార, మున నతినమ్రత ♦ మొనసె ననుచు
స్థండిలశాయిత్వ ♦ దశఁ దెల్ప నంగాంగ, సంగతక్షుత్తి మ్రొక్క ♦ జాలె ననుచుఁ
గుశలుఁ బుష్పాలుఁ గోసి ♦ కొని వచ్చునెడఁ బాణి, తల మద్రిర క్తతఁ ♦ గొలిపె ననుచు
సలిలానయనపరి ♦ శ్రమమునఁ గాకేల, నిశ్వాసబాష్పము ♦ లైర ననుచుఁ

జూచునో చూడఁడో కాని ♦ శోభనాంగి
కష్టములు దీర్ప నెవ్వదిఁ ♦ గాంక్ష సేయఁ

డభవ్రదుఁడు గిరీశుఁడైన నే ♦ మాయెఁ దనదు
గతిఁ దలంచియు గిరిపుత్రి ♦ గాసిపడదు. ౧౨౨

క॥ ఈక్రియ శుశ్రూషల నా కమణి మెలఁగుచుండె ♦ నానాఁటికిఁ ద
త్ప్రార్థిత మేయదియు న, నారత దోఁప హరుఁ డుండె ♦ సంయమపరతన్.

మ॥ ఒకనాఁ డాయుమ దైవయోగఘటనో ♦ ద్వ్యక్తి స్నానాలంకృతి
ప్రకటశ్రీ నలువొంది మ్రోల నిలువన్ ♦ బ్రాపంచవృత్తిప్రయో
జకుఁ డైనత్తతి నక్షమాల దొలఁగన్ ♦ శంభుండు కేల్సాఁప న
య్యకలంకోజ్జ్వలమూర్తి దానిఁ గొని ప్ర ♦ త్యాసత్తి నర్పించుచోన్. ౧౨౮

* క॥ విశ్వవిభుఁ డెలమినై నా, విశ్వాత్మిక నాఁడిఁ జూచె ♦ విస్రబ్ధము ల
జ్జాశ్వములు దివిరెఁ దివియఁ ద, దాశ్వాసిత యుల్లసిల్లె ♦ నాయమయు నెదన్.

ఆ॥ మున్నె తెలిపినాడ ♦ మోసంబు పాటింప, రాత్మకార్యపరత ♦ నమరు లొడిచి
మరునిఁ బనిచి రతఁడు ♦ ప్రమగ్గ రుద్రకోపాగ్ని, దహనకీల లెగిచి ♦ తప్పుల ననుచు.

ఉ॥ మోహనబాణపాతమున ♦ మున్కొని వారల ముంప నెంచి తా
దేహముఁ బాసె వాఁడు రతి ♦ దేవి కృశింప వినించి శాపమున్
బాహిరముం బొనర్చి వెత ♦ పాయు నసె న్నిశరీరవాణి య
త్యాహిత మెంచి తత్క్షణమ ♦ యచ్చోటువాసి చరించె శంభుఁడున్. ౧౨౭

ఆ॥ లోకజనని శివుఁడు ♦ లోలుండు గామి యె
ఱింగి యుమ హిమాద్రి ♦ శృంగమునను
దా నొనర్చెఁ దపము ♦ దద్దయుఁ బెక్కేండ్లు
దలఁగ కతని యెడఁదఁ ♦ దప్పులు వెనుప. ౧౨౫

—♦ శివుండు పార్వతిం బెండిలియై యాయుమం గొనిపనుట ♦—

క॥ సురలు మునులు బెగడొందఁగ, నింత్రి నెఱపు మేలి తపము ♦ నిష్ఠకు హరుఁ డ
చ్చెరువుపడి మెచ్చు మొయికొన, నరాల కేశ్వని వరించి ♦ హర్షితుఁడయ్యెన్.

ఆ॥ పెండ్లి సేసి యనిచెఁ బృథ్వీధరేంద్రుండు, జగము మేలుకలిమి ♦ చాల నెగడ
వనితఁ గూడి ప్రమథ ♦ వల్లభుండు సుఖించె, నిచ్చవచ్చు చోటు ♦ లెల్లఁ బెరసి.

క॥ ఒక రేయి గాఁగ వర్షశ, తెక మది దివ్యంబు గడవఁ ♦ దాత్పర్యము పే
డక సురతపరవశుండై, యకలంకుం డాతఁ డుండె ♦ నచలితుఁ డగుచున్. ౧౩౦

తే॥ మున్నుఁ దమకోరినదియ పో ♦ మొనసె ననుచుఁ
గానఁ బోరు వేల్పుల కొంటఁ ♦ గలదె తెఱఁగు

నారి వారింపఁ జని రని ♦ వార్యమాణ
సమరసరతిప్రసంగల ♦ క్ష్మ్యతకుఁ దలఁకి. ౧౩౨

క॥ ఎగ్గని తలఁప రతఁడు సతి, బిగ్గకవుంగిటఁ గదించి ♦ ప్రీతిఁ బొదలు న
య్యగ్గున నెదుర్పడిరి తన, సిగ్గు చెడుట కద్రితనయ ♦ చేడ్పడి తలఁగన్. ౧౩౩

తే॥ జతన మాఱడిపోవ సా ♦ శంకుఁడైన, హరుని వేఁడిరి దేవత ♦ లార్తి తోడరఁ
దప్పొనర్చితి మింతకుఁ ♦ దామసింప, కభవ ; కావుము మాపలు ♦ కాదరించి.

తే॥ అరయ దుర్ధర్ష మప్రమే ♦ యంబు నీదు, తేజ మద్దాని నిలుపుము ♦ తేజమునన
దీన నొండు భూతము దోఁపఁ ♦ దెరలకున్నె, భువనతతి నీయొఱుంగని ♦ బుద్ధిగలదె.

ఉ॥ లోకము లెల్ల నీతలఁపు ♦ లోన జనించు నడంగు నుండు న
ప్రాకృతదివ్యమూర్తివి వి ♦ పాకభరం బగు కర్జమూని యి
ట్లేకత మున్న దీని కిది ♦ హేతువటం చన నెవ్వఁ డోపు నీ
శ్రీకరుణార్ద్రదృష్టు లిటు ♦ చేర్చి తగ న్నము మన్పఁ జూడవే. ౧౩౬

ఆ॥ భవ్య మగును నీవు ♦ బ్రాహ్మమా తపమున
దేవి తోడ నిలుచు ♦ భావ మెన్న
నన్ని జగములును మ ♦ హాత్మ నీయవె కాన
వాని మేలు దలఁప ♦ వలెన కాదె. ౧౩౭

క॥ భూతేశ; భూతభావన; భూతదయాపర; యభూత ♦ పూర్వచరిత సం
భూతాష్టభూతిదాయక, భూతోద్వహపుణ్యమూర్తి ♦ భూతప్రభవా. ౧౩౮

ఆ॥ అనుడు శంభుఁడను న ♦ నాగత నెట్టులైన, నిపుడు తొడఁకు దీని ♦ నెవ్వరోపు
వారు తాల్ప నింత ♦ వగ సెడ నెంచితి, రనిన ధర ధరించు ♦ ననిరి సురలు

—♦ పార్వతీదేవి దేవతలకు శాపంబొసంగుట ♦—

సీ॥ అనఁగ నొఁగాకంచు ♦ నగ్ని రేతస్కుండు, విడిచె నమ్మోయి నిజ ♦ వీర్య మదియు
గిరులఁ గాననముల ♦ గిటికొని ధర ముంప, నత్యయం బని వేల్పు ♦ లనలుననిలు
తోఁ గూడి భరియింపఁ ♦ దొడరు మంచన నతం, డట్లు సేసిన భరం ♦ బనఁగనయ్యె
స్వర్ణమయంబుగ ♦ శరవణంబును శ్వేత, పర్వతంబును దానఁ ♦ బనుపడుటయు
నమరె నమరులఁ గాంచి హి ♦ మాద్రితనయ
పుట్టు లేదెప్డు మీకు మీ ♦ పొలఁతులందు
సంతతి యడంగుఁ బొండని ♦ జగతి నీవు
నట్లయూ దింక బహుభార్య ♦ వగుదు వనియె. ౧౪౦

ఉ॥ అంతట శంకరుండు తుహి ♦ నాద్రిజతోఁ దదహార్యకూటప
ర్యంతభువిం దపస్స్థితిస ♦ మాహితుఁడై నిలువం బ్రయత్నని
ష్క్రాంతులు ప్రేషితు ల్సురలు ♦ సారససంభవుఁ జూచి రాక్షస
క్రాంతి దలంగ నెద్ది నెఱి ♦ గాంచి వచింపఁ దలంపవే యనన్. ౧౪౧

ఆ॥ అతఁ డిట్టులనె న ♦ హార్యరాజతనూజ, యలుక మెయి నొసంగి ♦ నట్టిశాప
మేర్చు నింక సురల ♦ కెనఁగదు సంతతి, తెఱవు దప్పె నిట్టి ♦ తీవరమున.

చ॥ అనలునిలో వెలుంగు ప్రమ ♦ థాధిపు వీర్యము గంగ సంగతం
బనువుగఁ దాల్ప వేఁడుఁడు మ ♦ హాత్ముఁ డుదారుఁ డుదాత్తతేజుఁ డొం
డనుపమశక్తిసారుఁ డుద ♦ యం బెనయు న్దరిఁగాంతు రాఘనుం
డినుఁ డగు దేవసేనకు జ ♦ యించు నలంచు సురారిసైన్యమున్. ౧౪౩

శా॥ అంగీకారము సూపు గంగయు మదీ ♦ యాంబే యటం చాత్మ ను
ప్పొంగు న్సంగతి సర్వమంగళయు నే ♦ పొచ్చెంబు లేదిక్కృతిన్
శృంగారైకనివాసభూమి త్రిజగ ♦ త్సేవ్యం బపత్యంబు శ
ర్వాంగశ్రీమహనీయతేజమున ను ♦ ద్యద్భూతిఁ గన్పట్టఁగన్. ౧౪౪

ఆ॥ అనిన వేల్పులెల్ల ♦ నబ్జజుఁ గొనియాడి, పూజసేసి రెలమిఁ ♦ బొంది దేవ
దేవ; నీదు కరుణఁ ♦ దెఱఁగు గాంచితి మింక, నాపదలు దలంగ ♦ నయ్యె ననుచు.

—♦ కుమారస్వామి జననము ♦—

సీ॥ గంగ కిమ్మెలెఱుఁ ♦ గంగఁ జేసి హుతాశు, ననుప నాయమ ధృతి ♦ కనుమతించి
విశ్వరూపము దాల్చి ♦ వెలయ నవ్వీర్యంబు, గురిసె నాతఁడుఁ గొన ♦ కొని తదీయ
పూరము ల్వెరసె సం ♦ పూర్ణంబులుగఁ గొంత, వడికి నద్దేవి పా ♦ వకునితోడ
భారంబు సైరింపఁ ♦ గారామి దెలుపంగ, నద్దాని శరవణ ♦ మందుఁ జేర్పఁ
బనిచె నట్లొనర్పఁ ♦ బసిఁడి రూపున గిరు, ల్తరులు లతలుఁ దనరె ♦ ధరణి తత్ప్ర
ధానలోహరాజ ♦ ధానినై నలువొందె, నెల్లవార లబ్బ ♦ మిది యనంగ.

క॥ శరవణమునందు నమ్మెయి, సురనది తిగిచి యిడి నట్టి ♦ సురుచిరగర్భం
బరయఁగ షట్కృత్తికలన్, సురలు వనిచి రాత్మ ముదము ♦ చొప్పడ రామా.

ఆ॥ అరిగి గరిత లతని ♦ నక్కునఁ జేర్పంగఁ
బాలు వొంగె వింత ♦ బాలుఁ డెగచి
కుడిచె మోము లాఱుఁ గొమరొంద వారు వా
త్సల్యమునఁ బొసంగఁ ♦ దపనతేజ. ౧౪౮

ఉ॥ ఆతఁడు మేను వెంచి చటు ♦ లార్భటి సేయుఁడు వేల్పు లుక్కఱన్
భూతము పుట్టె నొండని ప్ర ♦ భూతభయార్తులు గాఁగ శక్రుఁడా
భీతిఁ దొలంప మాతృకల ♦ వే పనుపం జని వారు తత్పరా
భూతలుగా నతం డశనిఁ ♦ బుచ్చిన దాని మలంచె బాలుఁడున్. ౧౪౯

—♦ పార్వతీపరమేశ్వరులు శరవణంబునకు వచ్చుట ♦—

క॥ అబ్బుర మెగువఁ జనిరి తా, రబ్బాలకుఁ గాంచ విధిము ♦ ఖామరు లెడఁద
న్నిబ్బరము సేసి కనుచో, నబ్బయు నమ్మయును వచ్చి ♦ రచ్చోటునకున్. ౧౫౦

వ॥ పర్వతరాజనందినియుఁ బయోధరంబులం బాలు జాలువారుటయు తనకానవాలు గాఁగ నబ్బాలు నెత్తికొని ముద్దాడి నెమ్మనునం బులక లెగయనిర్భరానంద పరిభూతబాష్పకణికాంచితలోచనాంచలయై చన్నుగుడుపుచుఁ బుడుకుఁదొడుకు నానెగడి యొడలు పుడుకుచు ననుపమానవాత్సల్యంబున నుపలాలింపుచుండె నక్కుశోరరత్నంబునుఁ దదీయస్తనమండలనిస్సృతరసోపహారంబునం జేసి యోజ స్తేజోబలసారకలావిలాసంబుల ననదృక్షుండై యేకాహమాత్రంబునం బెనుపు వహించె మారవైరియు నయ్యద్భుతకుమారునకుం గుమారుం డని నామకరణం బొనగూర్చి మఱియుం బార్వతీనందనుం డగు నితండగ్నిముఖసంభృతంబగు వీర్యంబునం బొడముట కతన నగ్నిభవుండనియు గంగగర్భంబునం దాల్చుటవలనం గాంగేయుం డనియు గర్భపరిస్రవస్కన్నుండై వెలుఁగొందుటం జేసి స్కందుండనియునుఁ గృత్తికలుపమాత లగుట నిమిత్తంబుగాఁ గార్తికేయుం డనియుం బ్రసిద్ధిఁ గాంచు నని యిట్లునిర్దేశించి సర్వసుపర్వసమర్హణాలం గైకొని మాతృకాకృత్తి కాదులర్థించు వరంబు లర్థి నొసంగి యాతనిం దోడ్కొని కరితుభుజులునుఁ దోడ్తోడన రా సతీమణియుం దానును భద్రవటంబున కరిగి నిర్వర్తితాఖిల బ్రాహ్మసంస్కారుండగు నక్కుమారు నిఖిలనిగమాగమ రహస్యోపదేశంబునం బరిపూర్ణుం గావించె నంత. ౧౫౧

క॥ మించిన శక్తిమెయి న్నే, దించెనుఁ గొంచమల నొండు ♦ దివ్యశరమునన్
బంచాస్యు ధనుర్వేదా, భ్యంచిత ముపదేశ మొదవ ♦ నాతఁడు లీలన్. ౧౫౨

—♦కుమారస్వామి దేవసేనాధిపతియై తారకాసురప్రభృతుల సంహరించుట♦—

ఆ॥ అమరులెల్ల శివుని ♦ యానతి నమ్మహా
సేను నెల్లదేవ ♦ సేనలకును
విభునిఁ జేసిరతఁడు ♦ వెలసె మృత్యుంజయు
తోడివాఁడొ మిగులు ♦ వాఁడొ యనఁగ. ౧౫౩

క॥ సురలెల్లపరికరంబులు, సరభసులై కూర్చి రంత ♦ శర్వుఁడు పనుపన్
సిరు లెసఁగఁ దారకాద్యా, శరతతి శరతతి నడంచె ♦ జగములు పొగడన్.

ఆ॥ జయము గాంచి యతఁడు ♦ శంఖంబు పూరించెఁ
బొలిచె జగము హర్ష ♦ పూరణమున
బిరుదు లిడిరి విరులు ♦ గురిసిరి సురలు క
లాప్రవృద్ధి రఘుకు ♦ లప్రవీర. ౧౫౮

క॥ స్కందచరిత్రం బిది సా, నందముగాఁ జదివి విని జ ♦ నంబులు శుభముల్
పొందుదురు తత్సలోకత, నందుదు రాదట మహోప్ర ♦ భాంచితు లగుచున్.

తే॥ ఆయురారోగ్యపుత్రపౌ ♦ త్రాభివృద్ధి, దాయకం బిట్టి శుభచరి ♦ తంబుఁ దెలుప
నాయెఁ బ్రస్తావవశమున ♦ నర్థి వినుఁడు, గంగ వృత్తాంబు సాంగంబు♦గా వచింతు.

—♦ సగరచక్రవర్తి చరిత్రము ♦—

చ॥ అసితుఁ డనంగ సూర్యకుల ♦ మందు జనించె నొకండు మేదకుం
డసురులఁ బోలు శాత్రవు ల ♦ హంకృతి నాతని గిట్టి లక్ష్మిఁ గై
వసముఁ బొనర్చి కొంచతనిఁ ♦ బాయఁగఁ జేసి రయోధ్య వీడివాఁ
డుసుఖుల నెట్లొ నిల్పుకొనె ♦ నుత్తరశైలమునం దపస్వియై. ౧౫౯

క॥ కారణము లేక రవికుల, పీడలలో నొండొకండు ♦ వీఱిడి గలఁడే
సారమగు తపము కలిమి న, నారత మతఁడొప్పె భావి ♦ తాత్మత వెలయన్.

ఆ॥ అతని పత్ను లిరువు ♦ రందొండు గర్భిణి
గా నెఱింగి యన్య ♦ గరము వెట్టె
నోర్వలేక, దాని ♦ కోర్చి యాయమ భృగు
ప్రస్రవణమునను బ్ర ♦ పన్న యగుచు. ౧౬౦

వ॥ చ్యవనమునీంద్రుని సందర్శించి తనదు కష్టంబులెల్ల నుగ్గడించి యోదీనశరణ్యా; యనన్యశరణ నగు నామొఱాలించి కావవేఁ యని పాదంబులం బడి శోకించిన సదయుండగు నమ్మునివరేణ్యుం డాసుశీల కభయం బిడి విషంబు వలని చెట్ట యా యమ గర్భంబున కాపాదింప కుండు నట్లుగ నొనరించి ప్రసాదపూర్ణావలోకనంబుల నవలోకించి. ౧౬౧

క॥ ఓయవ్వ నీకొకఁడు సుతుఁ, డాయుష్మంతుఁడు ససత్త్వుఁ ♦ డరినిగ్రహాదీ
క్షాయుతుఁడు కీర్తిశాలి మ, హాయజ్వ జనించి భువన ♦ మంతయు నేలున్.

ఆ॥ గరము సోఁకెఁ గానఁ ♦ గాంచును సగరుండు
నాఁ బ్రసిద్ధి వాఁడు ♦ నాదు పలుకు
దప్ప దర్యమునకుఁ ♦ దాఁ బ్రతినిధి తేజ
మున ననంగ మోద ♦ మున మునింగి. ౧౬౩

వ॥ మానినీతిలకం బమ్మహాత్ముని సేవించు చుండెఁ బదంపడి సగరుండుద్భవించి యరులం దోలి యయోధ్య రాజధానిగా నెల్లపుడమి నేకఛత్రాధిపత్యంబు వెలయం బరిపాలించు చుండె నంత. ౧౬౪

చ॥ ఒకతె విదర్భరాజసుత ♦ యుత్తమ కేశిని జ్యేష్ఠపత్ని యొం
డొకతె యరిష్టనేమిసుత ♦ యూర్జితమూర్తి ద్వితీయపత్ని వా
రక భజియింత్రు వాని నను ♦ రక్తి మెయిం గులశీలరూపభా
ప్రకటయశోవిలాసములఁ ♦ బావను లంచుఁ గవు ల్నుతింపఁగన్. ౧౬౫

తే॥ ప్రజలఁ గని యేలు నతనికిఁ ♦ బ్రజలు వొడమ
రైరి వారలయందుఁ జే ♦ రాస కొలఁది
నోమునోములు దానము ♦ లున్నాలు పుణ్య
తీర్థయాత్రలు వేయున ♦ పార్థములుగ. ౧౬౬

క॥ పత్ను లిఁక నెన్నఁ డంత, ర్వత్ను లగుదురో కొ యనెడు ♦ వలనున మది ని
ర్యత్నులకు ప్రసుక్క యువతీ, రత్నములం గొంచు హిమధ ♦ రాధరభూమిన్.

♦ సగరుండు సపత్నీకుండై భృగుమహర్షిని సేవించుకొనుట ♦

వ॥ నెగడొందు భృగుప్రస్రవణంబ యేనాఁడేనియుం దమకు మేలు గూర్పంజాలు సిద్ధిక్షేత్రం బని నిశ్చయించి యాక్షణంబ పోయి యచ్చోటున నివసించి తపోనియమంబు తనరార నపారబ్రహ్మతేజోనిధి యగు భృగుమహర్షి సుజనతర్షి నెయ్యంబు వడయంగాంచి యమ్మహాత్మునిం బ్రపత్తి మించి పుత్రలాభం బెంచి యారాధించు చున్నంత. ౧౬౮

ఆ॥ వర్షశతము గడవ ♦ వాని భక్తికి మెచ్చి, మౌని పలికె నీదు ♦ మగువలందు
నొకతె కొదవుఁ బుత్రుఁ ♦ డొకఁడు వంశకరుండు, వాని చరిత మిపుడు ♦ వలదు తెలుప.

క॥ ప్రసవించును షష్టిసహ, స్రసంఖ్యఁ దగు సుతుల సత్వ ♦ సంపన్నుల న
న్య, సతు లెవి దేని కిష్టమొ, యొసఁగం గోరుకొనఁ జనుఁ బ్ర ♦ బుద్ధత ననినన్.

వ॥ అమ్మహాత్మునకు నమస్కరించి యవ్వారలలోఁ గేశిని యొక్క యపత్యంబును సుమతిపెక్కండ్రు సుతులం గోరి యమ్మెయిన యనుగ్రహింపవేయని వేఁడు

కొనిన నత్తపోధనుం డట్లయగుం గావుతమని ప్రసాదించి ప్రస్థానంబు సమకూర్చిన సపత్నీకుండై యప్పుడమితేఁ డచ్చాచంయమవరేణ్యునకు సప్రదక్షిణక్రమంబుగ సాష్టాంగంబగు నంజలిసేసి సెంజిలిఁబాసి యనుజ్ఞం గైకొని నిజరాజధానిం బ్రవేశించి ప్రజాపాలనం బొనరించుచు నుండు నంత. ౧౭౧

—♦ సగరునకుఁ బుత్త్రులు గలుగుట ♦—

క॥ ధరియించిరి గర్భముల, య్యిరువురు జ్యేష్ఠ కనెఁ దనయు ♦ నితరయుఁ గనె న
చ్చెరు వొలయ నొక్క తుంబముఁ బురికొను సంయమివరోక్తిఁ ♦ బురుషోత్తంసా.

సీ॥ అల తుంబ మెడలింప ♦ నం దఱువదివేల, లెక్కకు బిడ్డలు ♦ లీల సూక్ష్మ
రూపులై కనుపట్ట ♦ రూపెనసిన యట్ల, మున భంగి ఘృతకుంభ ♦ ముల నమర్చి
పెనిచిన వారలు ♦ పెనుపొంది యున్నత, దేహు లుద్యద్భాను ♦ తేజులు బల
సంపన్నులునునై ప్ర ♦ శస్తయావనరేఖఁ ♦ బొసఁగిరి సగరుని పున్నెములనఁ

గదిసి తామరతంపర ♦ గాఁగఁ దనదు
కొలము వెలయంగ నాతండు ♦ గూర్చు నరుస
మున ముని ప్రసాద మెంచుచుఁ ♦ దపరు చుండెఁ
దనకు సరిగాఁ డొకొండని ♦ యినకులీన. ౧౭౩

వ॥ కొంతకాలంబునకుఁ గేశినీసుతుండగు నసమంజుండు. ౧౭౪

క॥ అసము సెడ నెంతు నసమం, జసుఁడై దుష్కృత్య మనక ♦ సరయూనది లో
విసువ కెదిరి బిడ్డల నిడి, హసించు వా రడఁగఁ దల్లు ♦ లాక్రోశింపన్. ౧౭౫

ఆ॥ పలుకరాని చెడుగుపనులు వాఁ ♦ డొనరింపఁ
బొరువు లేద్వ జ్యేష్ఠ ♦ పుత్త్రుఁ డనక
వాని వెడల నడిచె ♦ వసుధేశుఁ డత్యయం
బొదవు నంచు ధర్మ ♦ వెదఁ దలంచి. ౧౭౬

క॥ తనయుఁ డొకఁ డంశుమంతుం, డన నతనికిఁ గలఁడు వాని ♦ నవహితమతియై
పెనిచె విభుఁ డతఁడు పెరిఁగెను, వినయాదుల తోడఁ బెనుపు ♦ వెలయఁగుమారా.

చ॥ ఎదిరి హితమ్ము స్వాత్మశుభ ♦ మెంచి చరించుఁ బ్రియోక్తులాడు దు
ర్మదులకు దుర్నిరీక్ష్యుఁడగు ♦ మాలిమి సూపును సజ్జనాళికిన్
వదలఁడు ధర్మమార్గ మప ♦ వర్గముఁ గోరును స్వీయ మంశుమ
త్పద మటు లర్థవంతముగ ♦ భాసిలె వాఁడుదయంబు నొందుచోన్. ౧౭౮

—♦ సగరచక్రవర్తి యశ్వమేధంబొనర్చుట ♦—

క॥ అంతట నృపశార్దూలుఁడు, మంతనమునఁ దలఁచెఁ దనదు ♦ మహిమ కెనగఁగా
వింతు నొకఁ డశ్వమేధ ము, నంతఫలప్రసవ మవని ♦ నదె చూ; యనుచున్.

క॥ ఆ మొడయఁ డంత సోపా, ధ్యాయుండై నిశ్చయించి ♦ యార్యావర్తం
బే యుత్తమపద మదియె శు, భాయిత మని వారలనఁ బ్ర ♦ భావం బెసఁగన్.

తే॥ వింజమును వలికొండయు ♦ వెరవు కలిమి
నొండొరుల బొంచి వీక్షించు ♦ చుండు నచటు
పుణ్ణ్యముల కిక్క యమ్మేలి ♦ పొలము నందు
సవనవేదులు శాలలు ♦ సంతరించి, ౧౮౧

క॥ దీక్షితుఁ డయ్యెను నృపహ, ర్యక్షుఁడు సరి యగునె యితని ♦ కమరేంద్రుఁడు నా
నక్షీణవైభవము ప్ర, త్యక్షముగా నెల్లజగము ♦ లానందింపన్. ౧౮౨

మ॥ తన సామ్రాజ్య మొకండ తాల్చువహింకిం ♦ దార్కాణగాఁ దేజ మొ
ప్ప నవీనార్కమలీల మెప్పొలయు న ♦ ప్పాత్రుం బవిత్రు న్మఖా
శ్వనియోగార్థుఁ బొనర్చి యవ్విభుఁడు ని ♦ శ్శంకంబుగా నుండెఁ బా
లనదీక్షాప్తిఁ జరించె నాతఁ డజితో ♦ ల్లాసంబు శోభిల్లఁగన్. ౧౮౩

ఆ॥ తేఱిచూడ రాక ♦ తెరువాటుకాండ్రకుఁ, బుడమిఁ జుట్టిరాఁగఁ ♦ దొడరు దొరల
గిట్టి యోర్చి వారి ♦ కీర్తులు కరయుక్తి, నందిపుచ్చుకొనుచు ♦ నతఁడుఁ బెరయ.

—♦ ఇంద్రుండు మఖాశ్వంబు హరించుట ♦—

వ॥ భూప్రదక్షిణంబు గావించి యాగోపసదంబు సేరవచ్చు నత్తఱి నుత్తలపాటునం
గదిసి కుపూయంబగు రక్షోభావంబు ప్రాయంబుగ నొక్కండు మాయ వన్ని
దాయ చుట్టిఁకై పర్వసమయంబు నయంబున బొంచి యున్న హరిహయుం డా
క్రతుహయంబు సలీలంబుగా నపహరించిన. ౧౮౪

సీ॥ తన ప్రాభవంబు చు ♦ ల్కన యయ్యెఁ బోయంచు, నొడ్లు గన్గొన నాన ♦ నొదుఁగు వాని
వంశకీర్తికి హాని ♦ వాటిల్లె నిట్లని, వైవర్ణ్యమున మోము ♦ వాంచు వాని
నెదిరి యేర్పడ కున్కి ♦ కెది మూల మనుచు ను, ద్వేగంబు భరమున ♦ ద్రేలు వాని
యజ్ఞభాగార్హుల ♦ కగునె యిట్లని కనుం, గవ కెంపుతోఁ బల్కఁ ♦ దివురు వానిఁ
గాంచెఁ గాకుత్స్థవీరు న ♦ క్కజము గదుర
నెంచె నాతని యపరాధ ♦ మించుకయును

గామి జేజేలగమి యోర్వ ♦ లేమి యధ్వ
రంబు చెడరామియును మహీ ♦ రమణుఁ డపుడు. ౧౮౬

శా॥ ప్రిచ్ఛన్నం బొనరించె హర్త హయము ♦ న్బ్రాపీణ్య మొప్పార నేఁ
డచ్ఛిద్రంబుగఁ జేయు మీక్రతువరం ♦ బస్మత్ప్రణాశంబు వో
నచ్ఛంజా యశ మబ్బుఁ గావుత మటం ♦ చాచార్యుఁడుం దెల్పఁ బ్రాం
చచ్ఛీలుం డతఁ డిట్లనె న్సుతుల బ్రా ♦ శస్త్యంబు పెంపొందఁగన్. ౧౮౭

ఆ॥ బిడ్డలార ; మిమ్ముఁ ♦ జేర్మి మైఁ గన్నైన
కలిమి ఫలము నేఁడు ♦ గాంచు వాఁడ
నరయుఁ డిమ్మఖాశ్వ ♦ మంతరాయము మీర
తలఁగ వలయు భూమి ♦ తలముఁ బెరసి. ౧౮౮

క॥ యోజనమున కొకఁడుగ మీ, రోజం బెనుపొంది తడవుఁ ♦ డోర్చున హయమ
య్యోజనఁ గానక కాంచుఁడు; భ్రాజిష్ణుతఁ బుడమి వ్రచ్చి ♦ పాతాలంబున్.

తే॥ దీక్ష సెడకుండఁ బాత్రుండు ♦ తెలివు గావ
నిందు మేల్కాని మీరాక ♦ కెదురుసూచు
చుందు మేను బుత్విజులుం బ్ర ♦ యోగవిధికిఁ
గొఱఁత వాటిల్ల కుండెడు ♦ నెటికిఁ గూర్చి. ౧౯౦

—♦ సగరసుతులు మఖాశ్వంబునకై భూమి వ్రక్కలించుట ♦—

మ॥ అనినన్ సంతసమంది యాజ్ఞగొని వా ♦ రానాఁడె విశ్వంభరా
ఖని గాలించి హయంబుఁ గానక కడం ♦ క న్యోజనాయామ మొ
క్కనికిం బాలుగఁ గొంచు దిగ్గజములుం ♦ గాన్పింప నౌనచ్చటుం
గనఁ బాతాలము సొచ్చి చూఱకొన నా ♦ కాంక్షించు కల్పంబునన్. ౧౯౧

క॥ శూలములు సీరములు కు, ద్దాలమ్ములుఁ గొంచు భూవి ♦ దారణమునకుం
జాలి తలపడిరి భూతము, లాలో నాలోడనమున ♦ నటునిటుఁ బఱవన్. ౧౯౨

ఆ॥ ఘోరుమంచు మ్రోసె ♦ భువి గ్రక్కదలె గిరు
ల్దిక్కు లెల్లఁ బెరలి ♦ తిరుగుడు పడె
సాహసిక్య మొప్ప ♦ సగరపుత్రులు మన్ను
మిన్ను నొకఁడు సేయు ♦ పన్నుగడను. ౧౯౩

చ॥ ఎదురుగ వచ్చు భూత మది ♦ యెయ్యది యేనిఁ దురంగహారిగా
మదిఁ దలపోసి తిట్టుదు ర ♦ మందబలంబున నెవ్వఁ రేనియుం

గదిసిన గిట్టి ఘోరుమ ర ♦ కారణదూషణభాషణంబుల
న్మొదలిడి వార లేమనిన ♦ మోదుదు రాయతి నెంచ కేద్రలన్. ౧౯౪

మ॥ స్వామితి స్షష్టిసహస్రయోజనసువి ♦ స్తారంబుగా భోగిలో
కము గాన్పింపఁగఁ ద్రవ్వి దిగ్గజములు ♦ న్దన్పట్ట సంభావనా
క్రమణమ్ము ల్బొనరింపుచు న్నడచుచున్ ♦ ద్ధాత్రినాథు పుత్రు ల్పరా
క్రమ మొప్ప న్ధరఁ జుట్టివచ్చి రవిని ♦ ద్ధార్యప్రభావాఢ్యులై. ౧౯౫

క॥ ఆలోలచిత్తులై సురు, లాలోఁ గాలోచితముగ ♦ నగు మాగతి కే
యాలోచన యని మొఱయిడ, నాలోకేశుండు పలికె ♦ నవ్వారలతోన్. ౧౯౬

ఆ॥ పొందు కర్జమొందు ♦ పుట్టు నిద్దానికి
జాలి నొందనేల ♦ జతన మేల
యోర్చి యుండుఁ డెదియు ♦ నొప్ప దిప్పటిట్టు
లసదుగా సహింపఁ ♦ డచ్యుతుండు. ౧౯౭

ఆ॥ అనినఁ గీశాతింగి ♦ యరిగిరి వేల్పులు
మఱలకుఁడు తురంగ ♦ మంబు గాంచి
కాని యనెడు తండ్రి ♦ యానతిఁ దొలఁచి రి
శాను జెసయుఁ గూడ ♦ సగరసుతులు.

—♦ సగరసుతులకుఁ గపిలముని కాన్పించుట ♦—

క॥ కని రయ్యెడ నొకదివ్యునిఁ, గనదగ్నిప్రతిముఁ బ్రలయ ♦ కాలాభీలున్
మునిరూపధరుని నచ్చటు, మొనసి మెలఁగు యజ్ఞతురగ ♦ మును నవ్వీరుల్.

సీ॥ భానుబింబంబున ♦ భంగినై యాశైదు, దెసలఁ గ్రిక్కిఱిసి బ ♦ త్తేజ మెసఁగ
శ్మశ్రుమూర్ధజసటా ♦ చ్ఛటలు సింగంబు ప్ర, సంగంబు బీరమ్ము హాంగుసూపఁ
దనుకడారచ్ఛాయ ♦ తపిలి కల్యాణప్ర, వర్షణంబున కాన ♦ వాలు గాఁగ
సాంఖ్యవిజ్ఞానప్ర ♦ సాదనంబున మేల్మి, నవనవోన్మేషంబు ♦ నలువు నొడువ
నెగడు నమ్మహనీయుని ♦ నిర్ణయింప
నేరక మఖాశ్వ మచ్చట ♦ నెలవుకొనిన
జాడ కమ్మౌని హర్తగాఁ ♦ జాలు ననుచు
హృష్టు లయ్యుఁ గృధాసమా ♦ కృష్టులైరి. ౨౦౦

తే॥ తోడనె ఖనిత్రలాంగల ♦ తోమరాదు
లెత్తికొని యమ్మహాత్ముపై ♦ నెగసి సగర

సూనులు ప్రసూనమృదులంబు ♦ మాని మాన
సంబు దంభోళిఁ గావించు ♦ సంబరమున. ౨౦౧

ఉ॥ దొంగవు నీవు మమ్మెదిరి ♦ త్రోవఁగఁ జాలక మాని పోల్కిఁ బా
యుం గనుమూయుచుం దెలుచు ♦ చున్న నటంచుఁ దలంప రిత్తవో
వం గలదెట్లు కుచ్చితము ♦ వారక తత్ఫల మందితో మ్మెదం
బొంగకు మిత్తితోఁ సగర ♦ పుత్రులు నివ్విడనాడ రెమ్మెయిన్. ౨౦౨

క॥ అని తిట్టుచుఁ దనపై మూఁ, గిన గపిలమునీంద్రుఁ డగ్నికీలాకీలా
శనికల్పదృష్టిపాతం, బెనయఁగ నమ్మోటిమగల ♦ నీక్షించుటయున్. ౨౦౩

—♦ కపిలుండు సగరసుతుల భస్మసాత్కరించుట ♦—

ఆ॥ బూదిప్రోవు లైరి ♦ పురవైరి ఫాలాగ్ని, దగ్ధులైన త్రిపుర ♦ దనుజు లట్టు
లెందుఁ గావరము స ♦ మిద్ధతేజులనేని, గూల్పకున్నె భాను ♦ కులవతంస.

క॥ అంతట సగరుఁడు చేడ్పడి, యంతనమున యంత నంశు ♦ మంతునిఁ గని యి
ట్లింత తడసి రేలొకొ భా, స్వంతులు నీతండ్రు లెచట ♦ బడలి తెరలిరో.

తే॥ బుద్ధిమంతుండ వెందు ని న్నోల నేర
రొరులు శూరుఁడ వస్త్రశస్త్ర ♦ యోగకృతివి
నీకు దైవసహాయంబు ♦ నెఱియుఁ గలదు
గాన నను నాక్రతువు నేఁడు ♦ గావు మనఘ. ౨౦౪

క॥ నినుఁ గంటిమి కంటిమి తెలుఁ, గినవంశ్యుల కెల్ల మేటి వీవ ♦ మెలఁకువం
గని చని మఖాశ్వగతియుం, బినతండ్రుల స్థితియుఁ దెలిపి ♦ ప్రీతిఁ గొలువుమా.

ఆ॥ అనిన నట్లకాక ♦ యని యాజ్ఞ గొని సాధ
నములు గొంచు నాక్ష ♦ ణమున భద్ర
ముఖుఁడు మేలిపయన ♦ మున నొప్పి చనెఁ దన
వారు తొలిచి యుడిన ♦ దారి దొరసి. ౨౦౫

సీ॥ ఒదిమ మేకొని రూప ♦ మొందె నిట్లని చూచు, వారెల్లరు మెచ్చు ♦ వారు గాఁగఁ
దపసి పెట్టిన భిక్ష ♦ తానక మిద్దాని, కని వేల్పు లెడగని ♦ వినుతిసేయ
వంగడం బీతని ♦ వలన నెక్కొను నంచుఁ, బూర్వులింద్రాస్థానిఁ ♦ బొదలుచుండఁ
బేరువాడిన వాసిఁ ♦ బెరసెఁ దేజునఁ దన, తోఁడివాఁడని భానుఁ ♦ డాడఁ దొడరఁ

జేరి దిక్కరులకుఁ బ్రద ♦ క్షిణ మొనర్చి
కుశల మడిగి తదాశంస ♦ కొసరఁ వడసి

కాంచె హయమునుఁ దండ్రుల ♦ గతినిఁ గపిలుఁ
డుండు నప్పాల మండపమం ♦ తుండు తెలిసి. ౨౦౯

తే॥ అడలె ఘోరనఁ దండ్రుల ♦ యగతికత్వ
మునకు యజ్ఞాశ్వలబ్ధికి ♦ మొనసెఁ దృష్టి
రెండు వాఁగులు పొంగి యొం ♦ డొండ నొరయు
చుండ నడికట్టవోలె న ♦ తండు వెరలి. ౨౧౦

మ॥ సమకాలంబున వార లట్లగుటకుం ♦ జాలిం బరాధీనుఁడై
సుమకోదండనిభుండు వాఁ డెడఁద సం ♦ క్షోభింపఁ గ న్బుణ్యలో
కము లిమ్మాన్యుల కెట్టు లబ్బు ప్రమదమా ♦ కాన్పింప దొం డే నివా
ప మొసంగం గమకించు మేరకని ప్రా ♦ ప్తవ్యంబు భావించుచోన్. ౨౧౧

తే॥ భాసిత సుమతి కవ్వారల ♦ మాతులుండు
పక్షిపతివిక్రమాతులుఁడు ♦ సుపర్ణుఁ డతనిఁ
జేర వచ్చి దురంతి యీ ♦ చింత మాను
మలఁతిఁ ద్రోపడ దింతి ల ♦ నర్థకంబు. ౨౧౨

ఉ॥ వీరలు వీరు లెవ్వరవు ♦ పీడిన చొప్పునఁ జచ్చి రిట్టివా
రేరును లౌకికోదకము ♦ లిచ్చినఁ దృప్తులు గారు విశ్వసం
తారిణి భూధరేంద్రసుత ♦ తా నరుదేరఁగఁ దద్విశుద్ధమ
త్పారజలప్రదానమున ♦ బొందుదు రుత్తమలోక సంపదల్. ౨౧౩

ఆ॥ కపిలముని క్రోధాగ్ని ♦ గ్రాలఁ గాలిన వీరి
భస్మరాసు లెపుడు ♦ పరమ గంగ
ప్లావితము లొనర్చుఁ ♦ బడయుదు రానాఁడు
శుద్ధు లగుచు స్వర్గ ♦ సుఖము శుభము. ౨౧౪

ఉ॥ నీవు మఖాశ్వముం గొని వి ♦ నీతి మెయిం జని యాపితామహుం
గావుము తొల్త జన్నముఁ బ్ర ♦ కాశిలఁ జేసి కడంగి దుర్ధరం
బీవరయత్న మెప్పగిది ♦ నేనిఁ దలంపు మొనర్ప నిన్ను నీ
చేవను నమ్మి యుందు రిటు ♦ చేడ్పడి నీపితరుల్ కుమారకా. ౨౧౫

తే॥ అనుచు నెఱి గూర్చి యప్పన్న ♦ గాశనుండు
పూజితుండై చనిన నా ప్ర ♦ బుద్ధుఁ డపుడు
కపిలమునిఁ గొల్చి మఖతురం ♦ గమముఁ దెచ్చి
తాత కర్పించెఁ గీర్తివి ♦ స్తారుఁ డగుచు. ౨౧౬

వ॥ సగరనృపతియుం దద్వృత్తాంతం బెల్ల నాకర్ణించి. ౨౧౮

క॥ సుతుల గతి కింత బెరలియు, వితతయశం బశ్వరంబు ♦ వెంట నలఁగి స
మ్మతి నిలకు నంశుమంతునిఁ, బతిఁ జేసి త్రివిష్టపాప్తి ♦ పతిఁ జేరెఁ దుదిన్. ౨౧౯

తే॥ కడఁగి ముప్పదివేలేండ్లుఁ ♦ బుడమి నేలి, భార మంతయుఁ బౌత్రుపైఁ ♦ బాఱవైచి
కాంచెఁ దనగతిఁ దనయుల ♦ గతిఁ దలంప, సగరునంతటి వాఁడునుఁ♦జాలఁ డయ్యె.

—♦ అంశుమంతుండు తపంబొనర్చుట ♦—

క॥ మతిమంతుఁ డంశుమంతుఁడు, సుతుని దిలీపుఁ బృథురాజ్య ♦ శోభనకేలా
యుతుఁ జేసి చేసెఁ దప మా, యతి పెనుపడ హిమధరాగ్ర ♦ మందుఁ గుమారా.

సీ॥ వడిగాలి సడిసన్న ♦ గడచి పాఱెడు మది,మలయించు ధృతిఁ బెంచి♦పాలయఁ జేసి
మిఱ్ఱు పల్లము నాక ♦ మిడుకఁ జూచు ఖవాజి, తత్రి లోని లక్ష్యబం♦ధమున నిలిపి
ధ్యానయోగరసాయ ♦ నానూనగుణయుక్తిఁ, బదరు క్లేశంబుల ♦ యదరు మాన్పి
యంచపట్టున నూర్ప ♦ డంచు నేర్పున జన్మ, కర్మపాశనిరాస ♦ గతికిఁ జాలి

యెడసి ముప్పదిరెండువే ♦ లేండ్లుఁ దపము
సలిపె గంగావతరణంబు ♦ దలఁపున నిడి
కాని యాతేని కాపూన్కి ♦ కాని దయ్యె
సిద్ధి గనకున్కి రఘుకుల ♦ శ్రీనివేశ. ౨౨౧

క॥ ఆకొఱఁతఁ బాపుకొనలే, కాఁకొని యే వాఁడు సనియె ♦ నమరపురమునన్
మేకొని సుఖించుటయు మే, లే కాకని జతన మెడసి ♦ యినవంశమణీ. ౨౨౨

ఆ॥ తండ్రిఁ బోలి నెగడెఁ దద్దయుఁ గ్రతువులు,సేయఁ జాలె నూఱు ♦క్షితియు నేలెఁ
బెద్దలల్లె పెక్కు ♦ వేలేండ్లు గంగఁ దే, నేరఁ డాదిలీప ♦ నృపుఁడు వత్స. ౨౨౩

క॥ అభ్యర్హితుఁ డాదట సుతు, నభ్యుదయాంచితు నొనర్చి ♦ యతఁ డైంద్రసభన్
సభ్యత్వ మెనసి మెఱసె న, మభ్యూహపదమునఁ దోలి ప్ర♦యత్నము నిలువన్.

—♦ భగీరథుని చరిత్రము ♦—

ఆ॥ పుట్టఁబోని బిడ్డ ♦ పుట్టె వీఁడని బుధు
ల్పొగడఁ బరిమళించెఁ ♦ బొగడ దండ
వోలె నతని యశము ♦ పుడమిఱేఁ డటు భగీ
రథుఁడు గాఁగ మాఁడు ♦ రాజ్యములను. ౨౨౪

సీ॥ విద్యలందున చేర్చె ♦ విధిరాణివాసమ్ము, తల్లి పాల్గోలిలు న ♦ త్తఱిన వేడ్క
నట వినయాదుల ♦ నల్లిబిల్లిగ నల్లెఁ, దాతతండ్రులనాఁటి ♦ దయిత కీర్తి
లాలించె నామీఁద ♦ లక్ష్మిస్త్ర సామ్రాజ్యంబు, కీర్తనంబునఁ జెక్కు ♦ గీఁటికూర్మి
మగని మారుగ నెంచె ♦ మరునారివయసున, శుద్ధాంతహృత్ప్రాంతిఁ ♦ జొక్కఁగాంచి
మెచ్చ రెవ్వార లవ్వాని ♦ పెచ్చుమేలి
లక్షణములకుఁ గరఁగి వ ♦ లక్షపక్ష
విధుఁడ తానయి జగముల ♦ వెలసె నాభ
గీరథుఁడు కేవలుం డెట్లు ♦ శ్రీరఘువర. ౨౨౮

ఆ॥ అతని పగటు వైరు ♦ లం దట్టు లీగి బ్రా, హ్మణుల యందుఁ గరుణ ♦ యర్థులందు
వలపు పత్నియందుఁ ♦ దలఁపు సత్కర్మము, లందు నెగడి వింత ♦ లనఁగ నయ్యె.

ఆ॥ అర్బుదములు క్రతువు ♦ లం దబ్రముగ నిచ్చె
నరద మొకఁడు గజము ♦ లైదు పది హ
యములు పత్త్రిశతము ♦ నర్థంబుతో స్వర్ణ
భూషితములు గాఁగ ♦ భూసురులకు. ౨౨౯

క॥ తన పూర్వుల చరితములకుఁ, దన చరితము మెఱుఁగువెట్టఁ ♦ దద్దయుఁ దగి య
య్యనఘుఁడు చింతిలె నెమ్మెయిఁ, బినముత్తాతలు సుగతులఁ ♦ బెరయుదురనుచున్.

మ॥ తన సామ్రాజ్యము సంద్రము న్నొడరి యీఁ ♦ దం బోలు నమ్మేలునన్
ఘనులౌ మంత్రులఁ దత్పరసక్తిపరులం ♦ గావించి సంతానమా
కనరాదింతకు మున్ను దుర్మృతులకా ♦ కాన్పింప వుచ్చైర్గతు
ల్పొనరం దాపసవృత్తి నయ్యుభయము ♦ న్నోపలు న్సమర్థింపఁగన్. ౨౩౦

క॥ అని నిశ్చయించి నెమ్మన, మనువొందఁ జలింపనీక ♦ యడఁగించి తదే
కనిరూఢి మించి తలకొనె, మొనకొను నమ్మేలి కర్జ ♦ మును సాధింపన్. ౨౩౧

క॥ గోకర్ణక్షేత్రమునకుఁ, బాకారిస్తుతుఁడు చని ప్ర ♦ పన్నుండై మా
సైకాహాభోజియై య, స్తోకనియతిఁ జేసెఁ దపము ♦ సుర లగ్గింపన్. ౨౩౨

సీ॥ బొట్టనవ్రే లూఁది ♦ పుడమి నెట్టన నిల్చి, బాహువు ల్నిల్వునఁ ♦ బరఁగఁ జాఁచి
నాలుగగ్గులు వెల్గ ♦ నడిచక్కిఁ దానయి, రవి నేకదృష్టి తై ♦ అవునఁ జూచి
కుండలినికి మేలు ♦ కోలు నెక్కొనఁ జేసి, హంసతత్త్వవికాస ♦ మరసి మోచి
క్షుత్పిపాసల జోలి ♦ పోలయక విడనాడి, యలజడి యను నడి ♦ నవలఁ ద్రోచి
దివ్యవర్ష సహస్రము ♦ త్రైఱపి లేని, తపమునిష్ఠఁ దలిర్పఁ బి ♦ తామహుండు
మెచ్చివచ్చితి నీకోర్కు ♦ లిచ్చువాఁడ, ననిన నాతేఁడు హర్షించి ♦ తాత్త్వుఁడగుచు.

తే॥ మ్రొక్కి పూజించి స్తుతిపాఠ ♦ ములు రచించి
యనము కలకాల మితనికై ♦ యతిశయిల్లఁ
దనదు భాగ్యంబు ఫలయుక్తిఁ ♦ దనరునేనిఁ
దండ్రి; ననుఁ గావఁ దలఁపునఁ ♦ దలఁచితేని. ౨౩౮

క॥ సంతతి విచ్ఛేదము లే, కెంతయు శోభిల్లఁగూర్చు ♦ మేర్పడఁ దాతల్
వంత లెడలి స్వర్గతి సుఖ, వంతులు గాఁగ జల మొసఁగు ♦ వలను మొదలుగన్.

తే॥ తాకికోదకములఁ గాక ♦ లోకజనని, గంగ తా భువి కరుగుదే ♦ రంగఁ దజ్జ
లౌఘములఁ బితరులు తృప్తి ♦ నోలలాడఁ, జేయవే, భక్తవత్సల ♦ చిత్తయనిన.

క॥ పరమేష్ఠి పలికె నిట్లే, పర మలఁతియె గంగ ♦ వేఁడ వచ్చును దానిన్
ధరణి భరింపఁగ నోపదు, భరియించెడు వాఁడు గానఁ ♦ బడఁ డొం డెందున్.

ఆ॥ అఖిలలోకనాథుఁ డప్రమేయుఁ డజుం డ, నాదినిధనుఁ డీశుఁ ♦ డలఁతిఁ దాల్ప
నోపు నీవు నింక ♦ నుమప్రాణవల్లభుఁ, గూర్చి కొనరి వేఁడు ♦ కోనుము భక్తి.

ఉ॥ ఆతఁడు వల్లె యంచనిన ♦ నర్థము లెల్ల ఫలించు నీతల
న్ఖ్యాతచరిత్ర శీతగిరి ♦ పుత్రిక జ్యేష్ఠ సువర్గలోకవి
ఖ్యాత ధరాతలం బెనయ ♦ నాధృతిమైఁ జనుదేరఁ బిన్నను
త్తాతలు ధూతపాపు లయి ♦ తా రొలయుం గల రుత్తమస్థితిన్. ౨౩౯

క॥ భద్రముఖా ; నీకగు న, చ్ఛిద్రము సంతాన మింకఁ ♦ జెచ్చెరఁ జని ని
ర్ణిద్రకరుణావశంవదు, రుద్రునిఁ బ్రార్థింపు మాత్మ ♦ రూఢి పొసంగన్. ౨౪౦

చ॥ అని యుపలాలనంబునఁ బ్ర ♦ హర్షము నించి యమర్త్యలోకవా
హిని మది కెక్క నమ్మెయి స మీహితము న్వెలయించి వల్లె యం
చను నుడి గాంచి నీతలఁచు ♦ నప్పుడె తా నవతీర్ణయౌను స్వ
ర్ధుని ధర కంచు నానృపతి ♦ తో వివరించి విరించి యేగినన్. ౨౪౧

ఉ॥ మానుగ నట్టిఁడైన నియ ♦ మంబున శంకరుఁ గూర్చి మేదినీ
శానుఁడు క్రమ్మఱ న్దపము ♦ సల్పుచునుండ నొకొంతు వత్సరం
బైన దయాసనాథుఁ డచ ♦ లాత్మజనాథుఁడు వేని భక్తికిన్
మానస ముల్లసిల్లఁ దగు ♦ మాలిమి సూపుచు వాని కిట్లనున్. ౨౪౨

ఆ॥ మెచ్చినాడ నీదు ♦ మేలినిష్ఠకు వరం, బిచ్చినాడ నిదె గి ♦ రీంద్రపుత్రి
నగ్నిఁ దాల్తు శిరము ♦ నం దది నీమది, కెక్క బ్రీతి గొలుపు ♦ టెఱిఁగి యెఱిఁగి.

క॥ నీ కోరిన యర్థమునకు, నాకౌకసులెల్ల మెచ్చ ♦ నలినాప్త కులం
బీ కలనఁగీర్తి వెలయఁగ, నా కృతి మేకొనెను నెటి గ ♦ నందగు వత్సా.

తే॥ అనుచు నిఖిలనమస్కృతుం ♦ డభవుఁ డిట్టు
లానతిచ్చినఁ గౌతుకం ♦ బతిశయిల్లఁ
గనుల హర్షాశ్రుపూరము ♦ ల్గ్రిమ్ముదేర
ధృతి శివునిఁ గొల్చి గంగఁ బ్రా ♦ ర్థించె నతఁడు. ౨౮౫

సీ॥ రావమ్మ పుట్టింటి ♦ రమఁ గోరి గిరిపుత్రి;, నడిమి లోకంబు వి ♦ న్నాణముగను
భూషింపుమమ్మ సం ♦ బోధించె గంగ; ని, న్నాదలఁ దాల్పంగ ♦ నంగజారి
వినుమమ్మ నామొఱ ♦ విధిముఖార్చిత; దీన, పాలనంబున పుణ్య ♦ ఫలముఁ బెరయఁ
గనుమమ్మ యిమ్మేలు ♦ కల్యాణి; కలకాల, మసము పూరింపంగ ♦ నౌ నటంచుఁ
బక్షపాతంబు వలదు ము♦ప్పట్టు లోక్క, తీరుగాఁ జూడుమమ్మ యో♦దివ్యమూర్తి;
యమృతదానంబు సేయుమో♦యమ్మ తరలి, భవభయార్తులఁ గావ న♦భస్స్రవంతి.

శా॥ కల్లోలోల్లసితామృతాంగి వగు నీ ♦ కారుణ్యవీక్షాప్తికి
న్మల్లోకంబులు వేచి యుండు నెపుడు ♦ న్మోక్షమ్ము నీకూర్చు సా
మ్మల్లాడ న్ననుఁబోంట్లు నీవెడయ నౌ ♦ నా కీర్తి వేవేగ నా
తల్లీ; రాగదవమ్మ యిమ్మహికి హా ♦ ర్దం బొప్ప గంగానదీ. ౨౮౭

తే॥ ఎవ్వరేపాపముల నెట్టు ♦ లేర్చుకొన్నఁ, గన్నతల్లివి నీకాన్పె ♦ కావఁ జాలు
నన్న ధైర్యంబ నీబిడ్డ ♦ లందఱకును, గన్నెడకుఁ గూర్పఁ గాదు ♦ గంగా భవాని.

క॥ అఘమర్షణ మొనరింపఁగ, నఘనాశని నీదు గర్భ ♦ మందినఁ గాకే
లఘుమార్గము గల దిఁక హా, ర్షఘనము త్వత్సేవనము ర ♦ సప్రసితకలా.

మ॥ విధికిం బాసి నిషేధమం చనక ని ♦ ర్వేలంబు సంసారవా
ర్నిధి పాలై తుది ముట్టలేని మొఱకు ♦ ల్నీసేవకుం జీవితా
వధి యా కాలమునం దొకక్షణము సం ♦ భావింతురేని న్దయా
నిధి వారి న్దరిఁజేర్తు వింకఁగలరే ♦ నీసాటివా రేయెడన్. ౨౯౦

ఉ॥ కావఁగ రమ్ము నీయెలమి ♦ గానఁగ నయ్యెడు నేఁడు కర్మముల్
గావు తరింపఁ జేయ గతి ♦ గాననివారి నటన్న మాట యిం
దే విదితంబు గాఁగ నిఁక ♦ నేలనె జాలము కన్నతల్లి; యో
పావనపావనీ; నిఖిల ♦ పాలని; నాకధునీ; యశస్వినీ. ౨౯౧

వే॥ అగతిగతికల్పనంబున ♦ నైతి త్వత్క, టాక్షరసవ త్తరంగని ♦ రీక్షణంబ
చేయుచున్నార మంబ; వి ♦ చ్చేయు మింక, నమరవాహిని నాదు మొ ♦ఱాలకించి.

మ॥ అని వేఁడం జనుదెంతు నే నిద్దె కనుం ♦ డన్నట్టు లద్దేవి ; భం
గనినాదోద్ధతిమీఱఁ గామహరునిం ♦ గారింతుఁ బాతాలలో
కనివాసంబునఁ జేర్చి కాకని స్వవే ♦ గక్రాంతికి న్వేల్పులున్
మునులు న్విస్మయ మంద శంకరు శిర ♦ మ్ముద్రొక్కి త్రొక్కిపాడినన్. ౨౫౩

క॥ మంగళకరుం డసంగుం, డంగజహరుఁ డంగనాద్రి ♦ తాధ్రాంగశ్రీ
సంగుఁ డల సర్వమంగళ, కుం గైతవ మెఱుకసేసి ♦ కుపితుం డగుచున్. ౨౫౪

క॥ ఈనెలవున నీపెఁ డిరో, ధానంబున నలఁతుఁ గాక ♦ తన తరమా న
న్నినెఱి మొఱంగి యొండెడఁ, బోనని జడముడి విదిల్చి ♦ పూని నిలిచినన్. ౨౫౫

సీ॥ నిక్కిచూచినఁ బయి ♦ నెలవులకును మీఁదు, గా నిట్టవొడుచుచుఁ ♦ గానిపింప
నిట్టట్టు నరసిన ♦ నెడ లెల్లఁ దమ రూప, కాఁ గ్రిక్కిఱిసి చూడ్కిఁ ♦ గమియఁజూడఁ
గదలింపఁ దొడరిన ♦ గడుసుతనము వజ్ర, సారమ్ము సడలించు ♦ సరణి నెఱయఁ
బాదు గన్గొనఁ బోవ ♦ బాతాలమున భంగి, నైన వింతకు వింత ♦ యతిశయిల్ల
నడరు హరు మహోజ ♦ టాటవి నెట్టనఁ, బడి తెమల్చుకొనఁగఁ ♦ బాటుపడియు
నిర్గమింప లేక ♦ నెఱిదక్కి బహుదివ్య, వత్సరములు మిన్ను ♦ వాఁక గడపె.

ఆ॥ అడరు దక్కి నిలిచె ♦ నద్దేవి ధన్యయై, పుణ్య మీశు శిరము ♦ పొలమునందు
సాగకునికిఁ దనదు ♦ చలపాదితన మెల్ల, మాని పరవసమున ♦ మ్రానుపడుచు.

క॥ మున్నెంత రభస మూనెనొ, తన్నెదిరి నెఱింగి వింత ♦ దశకుం బాలై
విన్ననువు దోఁపఁబిడప జ, గన్నేతకుఁ దనకు, దాన ♦ కైవస మయ్యెన్. ౨౫౭

తే॥ రామ; హిమవన్నిభము జటా ♦ రామఘనము
పావనము శివశీర్షమ్ముఁ ♦ బాయకుండె
వన్నె వెట్టుచు చందురు ♦ వరుస నచటఁ
జుట్టుచుట్టిన పూసరు ♦ లొప్పగటువాయు. ౨౫౮

ఉ॥ అంతట నమ్మహీంద్రుఁడు ని ♦ జాయతయత్నము వమ్ము గాఁగ ని
ష్కాంతుఁడు గాక సేవకవ ♦ శంకరు శంకరు సమ్యగర్పిత
స్వాంతుఁడనై భజించె దృఢ ♦ సంయమ మొప్పఁగ వేల్పు లింతకి
ట్లింతలు సేయువారుఁ గల ♦ రే యని విస్మయ మంది చూడఁగన్, ౨౬౦

క॥ చిరకాలమునకు శంభుఁడు, సరిద్వ్రతంసంబుఁ బట్టు ♦ సడలఁగనీక
యుర్వరవున ననిచి విడిచె నా, ధరావిభుని ధృతికి మెచ్చి ♦ దయ నెక్కొనఁగన్.

తే॥ బిందుతతిమాత్రముక్తమై ♦ బిందుసరసిఁ
జెరసి జాల్వడి విపులమై ♦ విపుల యగుచు
నేడుస్రోతస్సులుగ నొప్పి ♦ యింతలంత
లనఁగ రాక రసాతల ♦ మంటెఁ బిదప. ౨౬౨

తే॥ తనరె ముల్లోకముల నిట్టు ♦ లెనసి త్రిపథ
గాఖ్య నద్దేవి యందు ధ ♦ రావతీర్ణ
ననిచె హ్లాదిని పావని ♦ నలిని యనఁగ
మూఁడుస్రోతస్సులనుఁ దూర్పు ♦ మొనసి రామ. ౨౬౩

వ॥ మఱియును సుచక్షుస్సీతాసింధువు లనియెడు మూఁడుప్రవాహంబులు శుభావహంబులు ప్రతీచికిం జనె నన్నిటికి నెక్కుడగు నోఘం బొక్కండు దురాలభంబగు రభసంబున నొప్పారుచు నప్పార్థివోత్తమునిం గూడముట్టి యరుదెంచుచుండె నయ్యవసరంబున. ౨౬౪

తే॥ రథముపై నెక్కి తన మనో ♦ రథము సఫల
మయ్యెనని హర్ష వికసితా ♦ స్యాబ్జుఁ డగుచుఁ
బుత్త్రిఁ దోడితెచ్చు జనకుని ♦ పోల్కి నెగడెఁ
గలన భాగీరథియు రా భ ♦ గీరథుండు. ౨౬౫

ఉ॥ ముద్దులుసేయు నొక్కయెడ ♦ ముందలమై యొకట న్వినమ్రమై
నిద్దఁపు వేగము న్మఱియు ♦ నేమము నొక్కొకచోటునం దగం
బద్దులు సూపు నాభువన ♦ పావని తో నరుదేరనైన నం
పద్దశఁ గన్న యానృపతి ♦ భాగ్యమె భాగ్యము రాఘవోత్తమా. ౨౬౬

ఆ॥ ఆకసమునుండి ♦ యభవుని శిరమున
కచట నుండి భువికి ♦ నవతరించి
తనదు మహిమఁ దెలుపఁ ♦ దనరె నా శబ్దాయ
మాన యయ్యె నడకు ♦ మలసి యపుడు. ౨౬౭

సీ॥ తమకుఁదా మెదురై పొ ♦ దలు వాఁక లంచల, తోఁ శారదాభ్రాప్తి ♦ దొరయుచుండ
నెగసి తళుక్కని ♦ యిట్టట్టు దుముకు మీల్, ఐరమ్మదస్ఫూర్తు ♦ లనువుపఱుపఁ
బెండెర ల్వెరయున ♦ ప్పెనఁకువ చప్పుళ్ళు, గర్జితంబుల బలఁ ♦ గములు గాఁగ
జలదేవతల రత్న ♦ చారుభూషణరుచు, లింద్రాయుధవికాస ♦ మిదె యనంగ

భువియు దివియుఁ దనదు ♦ పొలుపున నొకఁడు గాఁ
జాలెఁ జేయ నాధు ♦ నీలలామ
యాకసమున నుండి ♦ యవతీర్ణ యా కల్కి
నచట నిచటఁ దాన ♦ యగుచు రామ. ౨౬౮

తే॥ మత్స్యకచ్ఛపోరగశింశు ♦ మారముఖ్య
జలచరావలి పఱతెంచె ♦ బలఁగ మామె
కది యనుఁగుబిడ్డలనుచుఁ ద ♦ మ్మాదరించు
వారి మఱచునె యనుజీవి ♦ వర్గ మధిప ; ౨౬౯

క॥ భవమూర్తిస్పర్శనమునఁ, బవిత్రతమమై తనర్చు ♦ భాగీరథి న
ద్ద్విజులు గన వచ్చిరి పున, రవతారితఁ గొలిచి పార ♦ మందఁ బ్రయతులై.

సీ॥ మెఱుఁగు దీఁగెలువోలె♦మెఱుఁగుఁబోఁడులుతమ, కెలనఁగ్రొందళుకుల♦గేలుకొలుప
నాభరణద్యుతు ♦ లంతరిక్షముఁ బ్రాఁకి, శతసహస్రరవిప్ర ♦ సక్తిఁ జూప
మండలంబులతోనె ♦ మలసి రిట్లను భ్రాంతి, నల విమానస్ఫుర♦ ణలు ఘటింపఁ
బాండురచ్ఛత్రాత ♦ పత్రపతాకేభ, తురగకాంతులు కౌము ♦ దులకుఁ జాలఁ
గనుఁగొనిరి చేరి సురయక్ష ♦ గరుడముఖ్యు
లెలయు దిక్పతులునుఁ దారు ♦ నెలమి దొనఁక
నమ్మహాదేవి మహిమ మ ♦ నంత మగుటఁ
గనుల కెఱిఁగించు సుకృతంబు ♦ కతనఁ దరలి. ౨౭౦

ఆ॥ తొంటి శాప మొకఁడు ♦ దొరకొనుటయు నృప
వరుని ప్రార్థనయును ♦ వరుసఁ బెరసి
మిన్నువాఁకమిన్న ♦ యిన్నెల వెలయింపఁ
జేయు భాగ్య మెనయఁ ♦ జేసె ననఘ. ౨౭౧

ఉ॥ కారణజన్మయై విగత ♦ కల్మష తా విలసిల్లె నెప్పుడే
తీరున నేనివేశములఁ ♦ దీర్థము లయ్యవి శుద్ధము ల్మహా
శ్రీరమణీయము ల్కథలు ♦ సెప్పఁగ నేల శ్రుతు ల్జగత్త్రయా
ధార యటంచు నీయమ యు ♦ దారతఁ జాటుచునుండ రాఘవా. ౨౭౩

తే॥ దివ్యతతి కట్లు భూతలా ♦ స్థితి ఘటిల్లె
దేవి శివుఁ జేరి భువి కరు ♦ దేర నైన
హంసతత్త్వం బదియ కాదె ♦ యరయ నెద్ది
సార మద్దాని గ్రహియింపఁ ♦ జాలు ననఁగ. ౨౭౪

సీ॥ అనుకంపించితే మాత; ♦ యమృతాత్మికా; యాచు,నతిహర్షమునఁ జేర ♦ నరుగువారు
పాడసూపితమ్ము మా ♦ పున్నెమ్మున నటంచుఁ, గాంచికృత్యముని యా ♦ పించువారు
విలసిల్లితే తల్లి; ♦ విప్రులపై నిట్లని, పారవశ్యంబునఁ ♦ బరఁగు వారు
నెలయించితే జన ♦ యిత్రి మమ్మిమ్మోయి, వాత్సల్యమున నని ♦ వఱలు వారు

నగుచు భూతలవాసు ల ♦ ట్లమరుల లనుగు
నెలవు వారలు నిదియ పో ♦ వెలకుఁ గొలుప
రాని దగు భాగ్య మని ♦ స్నానపానముఖ్య
కృత్యములఁ దృప్తులై రవి ♦ నీతచరిత. ౨౭౫

తే॥ ఉభయరసపూరముల నిట్టు ♦ లోలలాడి
పొగడి రమ్మేటి రాజర్షి ♦ పున్నె మెంచి
యొక్కఁడే చాలఁడే పుత్రుఁ ♦ డుభయవంశ
తారకుఁడు గాఁగఁ గీర్తివి ♦ స్తారుఁ డైన. ౨౭౬

మ॥ అగు విఘ్నంబుల కోటువోక కడునా ♦ యాసంబునం గుంద కే
వగకుం బాల్పడ కిట్టి మేలి నియతి ♦ న్వర్ధిల్లి యీసారని
మ్మగఁ దోడ్తెచ్చి జగమ్ముల న్మనిచె నా ♦ మాన్యుండె యీధన్యు ప్రో
పు గనం గాంచిరి ప్రేత లింకఁ గనరే ♦ పుణ్యోర్ధ్వలోకంబులన్. ౨౭౭

క॥ అనుచుం దోడ్తో నవ్వా, రనురా విబుధాపగాను ♦ రోధమ్మున నె
మ్మన మలరఁ గడు రయమ్మున, ననఘుఁ డతం డొంటివు మీఱి ♦ నరుదేరంగన్.

తే॥ జహ్నుముని యజ్ఞవాటంబు ♦ చాయఁ బోవు
నంత గమవతనంబున ♦ నామె యతనిఁ
జెనకి యచ్చోటుననుఁ దల ♦ మునుక గాఁగ
వెల్లివిరిసిన నాఘనుఁ ♦ డల్లనగుచు. ౨౭౮

క॥ అంతరమర్షంబున నీ, వింతకుఁ జాలుదువ కా మ ♦ జేమని జల మొ
క్కింతయుఁ ద్రిక్కఁగ నీయక, పంతము మెయిఁ గ్రోలె రిత్త ♦ బయ లగుపడఁగన్.

తే॥ అటు తిరోధాన మొనరించి ♦ యతఁడు యాగ
మును నిరంకుశముగఁ జేయ ♦ మొనయుచుండ
విస్మయము నొంది మునులును ♦ వేల్పులును మ
హాత్మ నమ్మౌని వినుతించి ♦ రాదరమున. ౨౭౯

ఉ॥ కంటిని నిన్ను సన్మహిమ ♦ గంటి యొకింతయు నీవిదంచు ము
క్కంటికి నీకు నంతరము ♦ గానఁగ నైన మహానుభావ మా
కంటికి నీవెఁ గాంచు నెఱి ♦ గల్గఁగఁ దొల్లిటి యజ్ఞానస్వవే
కంటిని నీవ యన్న ప్రభఁ ♦ గైకొనవే కనుగంట నీక్రియన్. ౨౮౨

క॥ నిహ్నవము గాదు త్వత్కృతి, చిహ్నముగా వెలయు నింక ♦ శ్రీమతి యగుచున్
జహ్నుమునిపుత్రి యీయమ, జాహ్నవి యన నీదు కీర్తి ♦ జగముల నెగడన్.

తే॥ అనుచుఁ బ్రార్థింప నయ్యన ♦ ఘునకు దోసి
లొగ్గి రాజర్షి యును వేఁడె ♦ నోపి నట్టు
లన్ని పాటులు పడి నేఁటి ♦ కరయఁ గంటి
నీదు ప్రోపున నిట మీఁద ♦ నెగడు వాఁడ. ౨౮౪

క॥ ననుఁ గావవే దయానిధి; మినువాఁక నొసంగి నాదు ♦ మెల్లని మేల్మిం
గను మింక నీదు చరితముఁ, గొని యాడుచు బ్రదుకువాఁడఁ ♦ గుంభినిలోనన్.

తే॥ అనుచు రసవంతముగ వేఁడ ♦ నప్పలుకులు
చొచ్చి చూపినయదె కొని ♦ సోరిది నెడలు
హర్షపూరము నా నమ్మ ♦ హార్దము ప్రతి
మార్గమున వెల్లివిరియించె ♦ మౌనివరుఁడు. ౨౮౬

ఆ॥ అట్లు జహ్నుతనయ ♦ యై తచ్ఛ్రోణియోగ, ముక్తి దృక్పథప్ర ♦ సక్తి మెఱసె
మిన్నువాఁక దొల్త ♦ కన్న మిన్నగ మిన్ను, ముట్టి రాజు మురిప ♦ మునఁ దలిర్ప.

క॥ తన తోడ మొనసి రా నా, ధునీవతంసంబుఁ గొనుచు ♦ ధూతాఘుండై
చనెఁ బినముత్తాతలు త్ర, వ్విన యయనం బొరయఁ గని ప్ర ♦ వీణత పౌనరన్.

సీ॥ విరియుంతుఁ దమ మన్న ♦ విధి ఫేనశఫరికా, హాసావలోకాప్తి బొసయిడుచు
సుడియింతుఁ బాపము ♦ ల్బూడ్కి మాత్రన యని, యావర్తముల జాడ ♦ నాడ నగుచు
నెడలింతుఁ జేచేత ♦ నే దొసంగుల నంచు, నలల చాల్పున నభ ♦ యం బొసఁగుచు
సడలింతు భవతాప ♦ సంపాత మను వార్త, సిద్ధోదకస్ఫూర్తిఁ ♦ జేర్పఁ నగుచుఁ

జని చని ప్రమోదభరితయై ♦ జగతి వెలయఁ
జొచ్చి పాతాళకుహరంబు ♦ గ్రచ్చి సాగి
నాగరుల బూది ప్రోవులఁ ♦ జక్కఁ బఱచి
నిలిచె వినువాఁక రఘుకుల ♦ తిలక యంచు. ౨౮౯

క॥ సుర లెలమి విమానంబుల, సరభసముగఁ దేఱఁ బనిచి ♦ సగరసుతుల నం
దిరవుపఱిచి నెఱి నిజపురి, కరిగిరి తత్క్షణమె భాస్క ♦ రాన్వయముఖ్యా. ౨౯౦

వ॥ అత్తఱి భగీరథుండును సంప్రీతచేతస్కుం డగుచు నమ్మహానదీజలంబులం గృత
స్నానుండై ప్రపితామహులకు సక్రమంబుగా నివాపాంజలివిధులం దీర్చి పేర్చిన
నవ్వారలెల్ల దివ్యమూర్తిధరులు దివ్యవిమానారూఢులునై పొడసూపి. ౨౯౧

క॥ మనుమనిఁ గని చిరకాలము, మను మని దీవించి స్వర్గ ♦ మన మబ్బెను తె
మ్మను మోదమ్మున నెమ్మన, మనుమోద మ్మెనయఁజని ర ♦ హార్పతితేజా.

సీ॥ అంతటఁ గాన్పించి ♦ యాతని కిట్లనుఁ, బరమేష్ఠి జన్మసా ♦ ఫల్య మెనయఁ
గంటి భగీరథ ♦ కా రొరు ల్నినుఁ బోల, నిటు దుష్కరము దీర్తు ♦ రెవ్వరిలను
భాగీరథీసంజ్ఞఁ ♦ బరఁగు నీయమ యిల, నెంత కాలము నిల్చు ♦ నంతవఱకు
నపరిమితము సౌఖ్య ♦ మందు వారలు నీదు, పెతరులు దివ్యులై ♦ ప్రీతిఁ గాంచి
యబ్ధి సాగర మనఁగ మీ ♦ యశము వెనుపఁ
జాలి నెగడొందు జగముల ♦ జాలి వాపి
తయ్య; మను మయ్య; చిరకాల ♦ మవనిపాల
నమున సురలోకపాలనో ♦ న్నతి తలిర్ప. ౨౯౩

వ॥ అక్షయ్యపుణ్యలోకంబు లీవునుఁ గడంగి చూఱకొనువాఁడవ యని యానతిచ్చి
యానతవత్సలుం డాతనిచే నత్యంతశ్రద్ధాభక్తియుక్తంబుగఁ బూజితుండై వాని
నుపలాలించి వీడ్కొని వేలుపుంబెద్ద పెద్దయుం బ్రొద్దుఁ దద్గుణౌఘంబులం బ్రశం
సింపుచు సపరివారంబుగ సత్యలోకంబునకుం జనియె నంత. ౨౯౪

క॥ రాజర్షి శేఖరుఁడు స, త్పూజితుఁడై పురము సొచ్చి ♦ పుడమి భరించెన్
దేజున ననమున నసదృశుఁ, డీ జనపతి నాఁగ నెగడి ♦ యినకులదీపా. ౨౯౫

తే॥ చాతకంబులు జలదంబుఁ ♦ జాడ్పనను జ
కోరతతి చంద్రు నట్టులు ♦ గోర్కె లూర
నతనిఁ గనఁ గల్గి ప్రజ లెల్ల ♦ హర్ష మంది
యగడుఁ బాసి సమృద్ధార్థు ♦ లైరి రామ. ౨౯౬

ఉ॥ ఏయెడఁ గాంచినన్ శుభము ♦ లే ప్రజలే నెలమూఁడువానలే
శ్రీ యొడికంబుగా నెగడు ♦ చెయ్వులె విద్యలె యిజ్యలే ప్రబో
ధాయితయోగసంపదలె ♦ తత్పరతాకలితాదరంబులే
పో; యిల నమ్మహామహుఁడు ♦ పోలఁగఁ బాలన సేయు నత్తఱిన్ ౨౯౭

మ॥ ఇది గంగామహిమంబు జనిదృశ మెవం ♦ డిద్దాని నెల్పు న్వినున్
న్మది భావించు లిఖించు భక్తి మెయి స ♦ న్మానించుఁ బూజించు వాఁ
డిద మిత్థం బనరాని సౌఖ్యనికరం ♦ బిష్టంబునం గాంచ నై
తుదిఁ గైకోల్గొను బ్రహ్మభూయము వినీ ♦ ఖ్యాతాఘుఁడై రాఘవా. ౨౯౭

తే॥ ధన్యము యశస్య మాయుష్ప్ర ♦ దంబు పుత్ర్య
మఖిలదేవర్షి పితృతర్ప ♦ ణాంచితంబు
స్వర్గ్య మిద్దాని శుభపరం ♦ పరలు గోరు
వారు భావింతు రెడఁద న ♦ నారతమును. ౨౯౮

ఆ॥ నీకు శుభము లొదవు ♦ నీతోడి శ్రోతలుఁ
బుణ్యు లింక సంజ ♦ ప్రొద్దు గడవ
నాగెఁ గథల జోలి ♦ చాలించి విధికృత్య
ముల ప్రసక్తి మొనయ ♦ వలయు ననిన. ౩౦౦

క॥ అందఱు తత్కాస్తనఁగఁ దా, నుం దమ్ముఁడు నమ్మహాత్ము ♦ నుతిసేసి ముదం
బందఁగ నవ్వేళ మునిసం, క్రందన నీనుడుల వలని ♦ రసయోగమునన్. ౩౦౧

క॥ మా పూర్వుల చరితము లిటు, లేపారునె కీర్తితోడి ♦ హితముమెయిని సా
రాపగ ప్రసంగ మింతలె, యే పుణ్యంబుననొ మాకు ♦ నిటు వినఁ గలిగెన్.

ఉ॥ సాగరవంశకీర్తనము ♦ చంద మనింద్యము గా ఘటింప నీ
సాగరపూరణం బొకఁడు ♦ చాలదె కారణ మారయంగ ని
ట్లాఁ గద మిమ్ముఁ బొంట్ల ♦ నెనయుంగని సేవ లొనర్చు శిష్యులం
దాగతసర్వభావకల ♦ నాంచితశక్తివిశేషసంపదల్. 303

క॥ అతివిస్మయజనకం బిది, యతిలోకజ్ఞానమహిత ♦ యగు నీవాచా
స్థితి నెఱుఁగ నయ్యె నిటు మము, మతిమంతులఁ జేయఁ జాలి ♦ మానితచరితా.

తే॥ అని పొగడు రాముఁ గౌఁగిట ♦ నలముకొనుచు
మునిశశి ప్రమోదభరమున ♦ మొనసి యొప్పె
నట్టు లా రేగడన సమ ♦ నంతరమున
గంగ దాఁటిరి హృద్యప్ర ♦ సంగ మొలయ. 30౫

క॥ స్నానంబులఁ బూజల స, న్మానంబుల నాయమర్త్య ♦ నదిఁ జేర్చి తదా
ఖ్యానుతు లొలయఁగ వీడ్కొని, పూని విశాలాఖ్య యైన ♦ పురిఁ గాంచుటయున్.

తే॥ వానిఁ గని రాముఁ డనె నిది ♦ మర్త్యలోక
మునఁ బురిమె దీనిచే స్వర్గ ♦ మునకు నప్ర
తిష్ఠ వాటిల్ల కుండునే ♦ దీని నేలు
వాఁ డొకఁడ పో ; ధరావధూ ♦ వల్లభుండు. ౩౦౭

సీ॥ మెఱయించుఁ గన్నులు♦మిఱుమిట్లుగొన చెస, లారసి రత్నగృహాది♦తోరుదీప్తు
లోలయించు నమృతోర్మి ♦ కల సౌన ల్నించువాఁ, కలకలనలనించు♦కలికికొలఁకు
తెలయించు నన్నెచి ♦ న్నెలఁ గల్మి వలపించు, దంటలు నుతికెక్క♦పంటపొలము
లలరించు ఫలపుష్ప ♦ లలితలతాపరి; రంభజృంభితనగా ♦ రామతతులు
పొంది బలుపొంది యుందు మా ♦ మందిరమున
నిందుబింబంబున ధరాసు ♦ మందహాస
మం దనువసంతవిలసితా ♦ నందనమున
నందమునుఁ జందమునుఁ బెంచు ♦ చుం దిరముగ. ౩౦౮

క॥ ఈ పురి యశోవిశాలత, యేపట్టున నెట్టులెటులో ♦ యేర్పడ వినఁగా
నో పుణ్యచరిత; వలతుం, బ్రాపిచె యగుఁ గాక కలిమి ♦ పడఁతుక కెపుడున్.

ఆ॥ అనిన సంతసించి ♦ యంతయు నీకల్మి
గాక యొండు గలదె ♦ కామితంబు
వెలయఁ జెలువువాఁడ ♦ వీటి యుల్లసితంబు
వినుము రాచకొలము ♦ విధము తోడ. ౩౧౦

చ॥ దితిజులు నాదితేయులు ను ♦ దీర్ణపరాక్రము లొక్కరూపున
న్మతిఁ దలపెట్టి రబ్ధిమథ ♦ నక్రియ శాపవినష్టసంపదు
న్నతిఁ బడయ స్వరాభయవి ♦ నాశములం గెడపంగఁ గోరి య
చ్యుతుఁడు సహాయుఁడై పరఁగి ♦ యొక్కట సర్వము నిర్వహింపఁగన్. ౩౧౧

ఉ॥ భాసురులై సురాసురులు ♦ పట్టునఁ గవ్వము మందరాద్రిగా
వాసుకి త్రాడుగాఁ బెనఁచి ♦ వారక సంద్రముఁ ద్రచ్చు చుండఁగా
నోసరిలె ధ్ధరంబు హరి ♦ యుక్కున నెత్తెను దానిఁ గచ్ఛపం
బై సుడివోక వారటు ల ♦ నంతరయత్నమునం బ్రవర్తిలన్. ౩౧౨

ఆ॥ కానిపోని కర్మ ♦ గతి క్షీరసాగర
మందుఁ దొలుతఁ బొడమె ♦ హాలహాలము
జగము లొంట నేర్చు ♦ జాడ నగ్నిజ్వాల
లుమియఁ జాలుచును మ ♦ హోగ్రముగను. ౩౧౩

ఉ॥ అందఱు మోసమం చని భ ♦ యార్తతఁ బాఱఁగ వారిఁ గొంచు గో
విందుఁడు శంకరు న్గొలువ ♦ వే చని కర్జము దెల్పి యింక మా
కొందలపా టెడల్ప మదిఁ ♦ గూర్చి దయానిధి ; కావు మన్న న
య్యిందుకలాధరుండు ధరి ♦ యించి యడంచెను దానిఁ గుత్తుకన్. ౩౧౪

వ॥ ఎల్లరును దానికి సంతసిల్లి యప్పరమేశ్వరుం బూజించి యానతి వడసి చని. ౩౧౫

సీ॥ వేయునేం డ్లటు వారు ♦ విసువక మధియింప, క్షీరోదమునఁ బుట్టె ♦ సిద్ధమూర్తి
దండకమండలు ♦ ధారి ధన్వంతరి, రూపలావణ్యాని ♦ రూఢలైన
యచ్చర లనియించి ♦ రఱువదికోటులు, వరుణాత్మజయు వారి ♦ వరుసఁ దోఁచెఁ
గామధేనువు గల్ప ♦ కంబు లుచ్చైశ్శ్రివం, బైరావణంబు న ♦ నంతమణిచిఁ
జెనయు కౌస్తుభమును ♦ జ్యేష్ఠయు లక్ష్మియుఁ
జందురుండుఁ బొడమ ♦ నంతసమునఁ
గొనిరి వారు వానిఁ ♦ గోర్కుల కగ్గమై
తెలివువట్టి యెడఁద ♦ త్రిభువ రామ ౩౧౬

క॥ హరి సొమ్మయ్యెను సిరి దా, వరించి కౌస్తుభము తోడ ♦ వారుణిఁ దివిజుల్
భరియించి సురలు నాఁ బరఁ, గి రసురులై రాపెఁ గెడసి ♦ కీడ్పడి దితిజుల్.

తే॥ బలి కసురపతి కల జ్యేష్ఠ ♦ పాలు పడియె, నచ్చుపడెను సాధారణ్యా ♦ మచ్చరలకు
నిందుధన్వంతరులు జగ ♦ దీడ్యులైరి, కడమయవి దేవపతి కయ్యెఁ ♦ గైవసములు.

ఉ॥ వెండియుఁ బాలవెల్లిఁ దొలి ♦ వేల్పులు వేల్పులుఁ గూడి త్రిచ్చుచోఁ
బండెనుఁ బున్నె మన్న గతిఁ ♦ బొల్పడె నయ్యమృతాఖ్య మాషధం
బొందు దలంప కెల్లరకు ♦ నుద్ధతిఁ గైకొన నాస పుట్టె నొం
డొండ ఘటిల్లె నొండొరుల ♦ కూఱట లేని విరుద్ధభావముల్. ౩౧౯

తే॥ అన్ని యసురుల సంఘంబు ♦ లావలనున, నడర నీవల సురలెల్లఁ ♦ దొడరి పోరఁ
బోరు ఘోరతరం బయ్యెఁ ♦ బ్రొద్దు నేల, లెడసి చల మంతకంతకు ♦ నెగయు చుండ.

క॥ హరి వేఁడుకొనుచు వేల్పులు, విరుద్ధధర్మమున దైత్య ♦ వీరులు నటు మ
చ్చరమునఁ బెనంగ మహిాత్మా, దరుఁ డిది యన రాని తనదు ♦ తాత్పర్యమునన్.

సీ॥ కడగంటఁబొడమిచూ♦క్కఁపున వ్వెనయుచూడ్కి, గమిగాంగయామున♦కలన నొడువఁ
దనుయష్టిఁ దోఁచి ది♦క్తటు లాను క్రొమ్మించు, నంచు సౌవర్ణవ♦ర్ణ ణముఁ బఱప
మొలకలేజవ్వన ♦ మ్మున జిగిబిగిసోయ, గంబు లంగము లమూ ♦ ల్యంబు లనఁగ
నీటు గోఁటులఁ బెంచు♦నెఱజాణ తన మేచి, యెదిరి చిత్తముల కు♦య్యేలలు గూర్ప

మరుని జక్కిఁ జక్కెఱమరు ♦ ల్మలఁచి తేర్ప
జాలు పలుకులు రసమును ♦ జాలుకొలుప
విశ్వమోహన విద్యాప్ర ♦ వీణుఁ డజుఁడు
విష్ణుఁ జెక్కటి చక్కని ♦ వెలఁది యయ్యె. ౩౨౨

వ॥ అట్లు పొడసూపి నవనవోన్మిషద్విభ్రమాకూతవిశేషంబుల నిరంతరతంతన్యమాన శ్రీమానితానేకరాగద్రుగ్వ్యాపారంబులఁ దనదు మోహినీపదంబునం దన్వర్థత పొందుపడం దనరియమ్మందేహుల హృదంబులు గొందలపఱుపం దలకొని. ౩౨౩

క॥ మామా; బావా; యనుచును, మామాన్యం డనెడు తలఁపు ♦ మాన్పి దితిజులన్
సామమునఁ దేర్చి రసఘుటి, సామప్రియుఁ డొడిచి కొని య ♦ శంకితవృత్తిన్.

ఉ॥ మోహమహార్ణవం బెగిచి ♦ మున్కొని దైత్యుల ముంపఁ దద్వన
ష్టోహులఁ గన్గొఱంగి సుధ ♦ నవ్వలివారి కొసంగి సర్వసం
మోహనుఁ డీశుఁడు న్మదము ♦ మొల్లముగాఁ దనుఁ గ్రుచ్చి యెత్త సం
దేహము వాపి స్వీయమవు ♦ దివ్యశరీరముఁ దాల్చె నంతటన్. ౩౨౪

క॥ ఆతురులై యసురులు తమ, కాతలిరుంబోఁడి సేసె ♦ నపకృతి యనుచుం
జేతోగతి నిది హరిమా, యాతతవైభవము కాక ♦ యని రోసమునన్. ౩౨౬

శా॥ సన్నాహంబునఁ జేర్చి శక్రముఖులన్ ♦ సాంగ్రామికోత్సాహసం
పన్నత్వంబున మీఱి పోరరులకు ♦ న్భారంబుగాఁ జేయుచో
వెన్నుం డన్నెఱిఁ దోడ్పడం జెరలి రు ♦ ద్వింగూలి రాపన్నులై
సన్నం బాసిరి పాఱి రాజడులు స్వ ♦ స్సత్సీద్యులై రాఘవా. ౩౨౭

క॥ హతశేషులు వెత లొందుచు, సుతలంబునఁ జేరి బ్రదుక ♦ సురపతి స్వర్గం
బతులితవైభవ మెసఁగ వి, తతసుఖుఁడై యేలుచుండెఁ ♦ దపనకులీనా. ౩౨౮

క॥ దానికి వగచి పతిం గని, మానిని దితి మానివర వి ♦ మానన నాసం
తానమునకై యిప్పాటునఁ, గానైనం గరుణ లేదొ కానఁగ రాదో. ౩౨౯

వ॥ సర్వసముఁడవగు నీ విట్టియెడ నా యడరు వాప వలతేని భవత్తేజంబున నింద్రనిహంత యగు వాఁ డొక్కరుండు నాయందు జనియించి పెనుపొందు నట్లుగ వరంబుఁ బ్రసాదింప వలయు నని తత్పాదపద్మంబుల వ్రాలి మొఱవెట్టినం గశ్యపుం డద్దాని నూఱడించి యట్లచేయుదు లెమ్మని యనుగ్రహించి మఱియు నిట్లనియె. ౩౩౦

ఆ॥ వేయువత్సరములు విసువక వ్రతచర్య, జరుప వలయు నీవు ♦ జతన మొప్ప
నిష్ఠ నెడలకున్న ♦ నీకట్టిఁ డొక్కండు, సుతుఁడు వొడము శక్ర ♦ సూదనుండు.

వ॥ అనిన నద్దేవి యద్దాని కొడంబడి తడబాటు లేని యావేశంబున నడరి తదాదేశం
బునం గుశప్లవనప్రదేశంబున నివసించి ప్రయతయై నియతి వెలయ నమ్మహనీయ
వ్రతచర్య నవలంబించి సధైర్యయై యుండె నంత. ౩౩౨

క॥ అది విని యింద్రుఁ డతంద్రుం, డిది యిట్లగుఁ గాక యని త ♦ దీప్సిత మెటు లే
యదనున నొదవునొ దానిం, బదిలముగాఁ గూర్చుచుండెఁ ♦ బరిచారకుఁడై.

తే॥ ఎల్ల యర్థంబు లందిచ్చు ♦ నెలమి కొదిఁగి
యొదిఁగి శుశ్రూష లొనరించు ♦ నోలిమికకు
శ్రమ మపనయించు నెఱికిఁ జి ♦ త్తమున నలరి
యొక్కయెడ నిట్టులనె నామె ♦ యుచిత మెఱిఁగి. ౩౩౪

ఆ॥ అన్న ; నీప్రశస్తి ♦ కాత్మ మెచ్చితి నిట్లు, వరవుడమ్ము నేయు ♦ వారు గలరె
తమ్ముఁ డొవవె నేనిఁ ♦ దప్పక పగ మాని, నీకు వాఁడు గూర్చు ♦ నెఱికిఁ గూర్తు.

వ॥ అని పలికిన యాయమ నేరిమికి మఘవుండు సంతసిల్లి తల్లి ; యది యట్టిద
యౌఁగాకని ప్రత్యుత్తరం బొసంగి యథాపూర్వంబుగఁ బ్రవర్తిల్లుచు నెల్లెడల
జాగరూకుండై యుండ సహస్రహాయనంబులు దశమాత్రోనంబులుగ నిండ
వచ్చె నంత నొక్కనాఁడు. ౩౩౬

ఆ॥ పగటివేళఁ గూర్కు ♦ పాటు పాల్పడ నోటు
వడి తలాడ వంకఁ ♦ బాదములునుఁ
గాళ్ళకడనుఁ దలయుఁ ♦ గా సెజ్జ నొఱిగి ని
ద్రించుచుఁడఁ గాంచి ♦ దివిజవిభుఁడు. ౩౩౭

వ॥ ఆయమ యశుచి యగు టెఱింగి నిజప్రయత్నంబు సఫలం బగుటకు హర్షించి
వజ్రహస్తుండై తదీయగర్భకుహరంబునం బ్రవేశించి యమ్మహామహం బగు
గర్భం బేడు శకలంబులుగాఁ గోయుచుండ నాయర్భకుండు సుస్వరంబుగా
రోదనం బొనరింపఁ బురందరుండు మారుద మారుద యనుచుండ నద్దేవి
మేల్కాంచి. ౩౩౮

క॥ తగునే నీ కిటుసేయఁగ, నగవైకీ; నిన్ను నమ్మి ♦ నా నబలనుఁ బా
పగతికిఁ బాల్పడ కుడుగు మ, నఁగ వెలువడి వచ్చి నాక ♦ నాయకుఁడనియెన్.

ఆ॥ నన్నుఁ జంపువాని ♦ నాతల్లి; చంపన, వలయుఁ గాన నిట్లు ♦ వలసెఁ జేయ
సప్తమూర్తిగాఁగఁ ♦ జంపక విడిచితి, నీదు వచనమున వి ♦ నీతి వెలయ. ౩౮౦

క॥ ఎంచక నీ విమ్మెయి ని, ద్రించుట నపవిత్ర వైతి ♦ తేఁకువ మెయి నేఁ
గాంచితి నంతర మిఁక మే, లెంచి యనంతరవిధాన ♦ మేర్పఱుపు మనన్. ౩౮౧

తే॥ నా పొనర్చిన యపరాధ ♦ మీపగిదిని
నన్నుఁ గాల్వంగ నీసుర ♦ నాథు తలఁపు
తా ఫలించె నెట్టన దురా ♦ ధర్షుఁ డితఁడు
గాన సాంత్వమ యొప్పు ని ♦ క్కాలమనుచు. ౩౮౨

సీ॥ దితి పల్కె నిట్లని ♦ దివిజేంద్రుఁ గనుఁగొని, తమ ప్రాణరక్షకుఁ ♦ దవులుగొందు
రెల్ల వారును గాన ♦ నిది నాదు నేరంబు, కతనఁ జొప్పడె నిన్నుఁ ♦ గాదు తిట్టఁ
గరుణించు మీగర్భ ♦ ఖండంబు లేదును, నీకృతిఁ దను కీర్తి ♦ నెగడ సప్త
మారుతస్కంధము ♦ లమలసి మారుతసంజ్ఞ, దత్పాలనంబునఁ ♦ దనరువారు
బ్రహ్మలోకమునను ♦ బరఁగ నొక్కఁడు నాక
లోకమునను నొక్కఁ ♦ డాకసమున
నొకఁడు దెసల నలువు ♦ రుండి దివ్యత్వంబు
మొనసి నీదు సఖ్య ♦ మునఁ బొసంగి. ౩౮౩

క॥ ఇది నాయస్థితి మనప్పుడు, మది మెచ్చి మహేంద్రుఁ డంబ ♦ మానుగ నట్లా
నది యెల్లఁ గూర్తు నన స, మ్మదమున నద్దేవి పొదలె ♦ మత మెఱుకపడన్.

ఆ॥ సురలు సూనవృష్టిఁ ♦ గురిసిరి దుందుభు
లుమ్రోసెఁ బొగడి రఖిల ♦ మునులు వేడ్క
నెల్లలోకములకు ♦ నెసఁగె మే లింద్రుండు
దితికి వరము లొసఁగి ♦ తేర్చె నంత. ౩౮౫

వ॥ పదంపడి యమ్మానసీయం దోడ్కొని వాసవుండు దివంబున కరిగె నిప్పుణ్యచారిత్రంబు కతన నియ్యది పుణ్యస్థలం బయ్యె మనుపుత్త్రుం డిక్ష్వాకుం డలంబుస యందు విశాలుం డను సుపుత్త్రునిఁ గనియె నవ్విశాలయశుండును దన పేర నిప్పురీరత్నంబు నిర్మించి యిద్దాని రాజధానిఁ గా నొనరించుకొని యనన్యసాధారణధర్ముఁడై యిమ్మహీతలం బేలె దానం జేసియిది విశాల యనం బరఁగె నమ్మేదినీమహేంద్రునకు హేమచంద్రుండును నాతనికి సుచంద్రుండు నవ్వానికి ధూమ్రాశ్వుండును వానికి సృంజయుండు నతనికి సహదేవుండు నమ్మహాత్మునకుం బరమ

ధార్మికుండగు కుశాశ్వుండు నత్తేజోనిధికి మహాతేజుం డగు సోమదత్తుండు నయ్యు
ధిశ్రుతునకు జగద్విశ్రుతుండగు కాకుత్థ్సుండును జనియించి నాఁటంగోలె నిమ్మర్త్య
లోకం బమర్త్యలోకసమాకలనంబుగాఁ బాలనంబు సేసిరి మఱియునిక్కాలంబున.

క॥ కాకుత్థ్సుని సుతు డిన్నెల, పీకువలయమునకుఁ జంద్రుఁ ♦ డితండౌ యనం
బ్రాకటకీర్తిరుచులు దివిఁ, బ్రాఁక సుమతి యనెడు నతఁడు ♦ పరిపాలించున్.

వ॥ ఇక్ష్వాకువిభుని ప్రసాదంబునం జేసి వైశాలికులగు రాజశేఖరులు సర్వజ్ఞులు మహాత్ములు వీర్యవంతులు దీర్ఘాయువులు ధార్మికోత్తములునై నెగడొందు చుండుదురు. ౩౮౮

క॥ దినకరతేజు లీయి, క్కని నేఁటికి నిలిచి రేప ♦ కడఁ జని మిథిలే
శునిఁ గాంచెద మన నెల్లరు, వినమ్రులై యొలయ రామ ♦ విభుఁ డనుజుండున్.

ఆ॥ అమృతవార్ధి నోల ♦ లాడించితే మాని, చంద్ర; మమ్ము నీవ ♦ సాదలబ్ధి
నింక జాలు గరఁగు ♦ టెంతటి పని యను, చుండఁ దపసి మురియు ♦ చుండె నంత.

క॥ మతిమంతుఁ డాసుమతి యతు, లితతేజుఁడు తపసినెల స ♦ లీలాగతి సం
గతి విని హితమంత్రిపురో, హితముఖ్యుల తోడ వచ్చి ♦ యెలమి దొలంకన్.

వ॥ సోపాధ్యాయుండై సమ్ముఖంబు వడయం గని విశ్వామిత్రమునీంద్రునిఁ దోడి తపసులను సంకల్పపూర్వకంబుగా యథోక్తవిధానంబునం బూజించి కుశలం బడిగి మృదుమధురసల్లాపంబులం దేలుచుఁ బారవశ్యంబు పొనరుపడ నిట్లనియె. ౩౯౨

ఆ॥ ఏమి సుకృత మొకొక్కొ యింత ప్రొద్దున కిట్టి, పాదపద్మయుగముఁ ♦ బడయఁగంటి
ధన్యతముఁడ నైతి ♦ దైవతానుగ్రహ, లీల కాదె యింక ♦ లేమి గలదె. ౩౯౩

మ॥ అని యన్యోన్యసమాగంబున స్తుతి ♦ వ్యాపారసత్కారపూ
రనవోల్లాసమునం ♦ దనర్చుచు విధి ♦ ప్రాక్తైకసంప్రాప్యచి
ద్ఘనలీలాయితమూర్తిసంపదన ♦ వద్యస్ఫూర్తి శ్రీయోగభా
గనురజ్యన్ను యనప్రియాతిథియుగం ♦ బ్భిం ప్రశంసించుచున్. ౩౯౪

క॥ పలికె మునివరునితోఁ దోలుఁ, బలుకులఁ దులకించు మేలి ♦ భావం బెదుర
న్నిలిచెనొకో యనెడు భావన, తొలఁకఁగ నాపుడమితేఁడు ♦ తుహినాద్రిసుతా.

క॥ ఎందైనఁ గంటిమే యి, ట్లిందఱ కమృతోర్మికలన ♦ లెనయింపం జా
లెం దానె రుచులఁ ద్రిభువన, సుందర మీాబాలయుగము ♦ చూడ్కు లలరఁగన్.

సీ॥ పాలు గారెడు మోము ♦ పరికింప నమృతమ్ము, పంచిపెట్టిన ప్రోడఁ ♦ బలుకరించు
ముద్దు లొల్కెడు నవ్వు ♦ ముదలింప నెలతోడి, సిరి దక్కఁగొను కీర్తి ♦ స్వీకరించు
దిక్కు లేలెడు తేజు ♦ దిలకింప నాప్రొద్దు, వంగడం బిదె యంచు ♦ వావిఁ బెంచుఁ
దలము మీరెడు తీరు♦దలపింపఁ దన ప్రోపు,సాగరం బొలయించు ♦ చంద మెంచు

నబ్బ మయ్యెడు నయ్య; యీ ♦ వ్యక్తియుగల
మెట్లు గొని తెచ్చి తెందుండి ♦ యెటకుఁ బోవ
నేమి పని వెంట నిది యిట్టు ♦ లిట్టులనుచు
నీవ నేర్తువు మునివర్య ♦ నిర్ణయింప. ౩౫౭

క॥ అంబర మంబరమణి శశి, యుం బరఁగింతురు క్రమమ్ర ♦ యుక్తిన యవ్వా
రిం బురుడించెడు నివ్వా, రింబున వెలయించి రొకట ♦ నిద్దేశంబుల్. ౩౫౮

తే॥ అశ్వులో ; చంద్రసూర్యులో ; ♦ హరిహరాత్మ
జాతు లొక్కొ ; యింద్రోపేంద్ర ♦ భూతు లేమొ ;
ఖడ్గతూణీధనుర్బాణ ♦ కలితు లగుచుఁ
గాళ్ల నడకనె రా నేది ♦ కారణంబొ. ౩౫౯

క॥ సమగజసింహక్రమణో, పమలక్షితగమను లట్లు ♦ వ్యాఘ్రవృషభసం
యమదమనులు సుకుమారులు,యమళులొ యిప్పురుషవరులు♦వ్యవహితభవులో.

క॥ సముపస్థితయౌవనులు సు, సము లిటు దుర్గమపథమునఁ ♦ జనుదేంఁగ నే
యమరుల కిది యే కతమున, నిమంత్రితంబయ్యె నొక్కొ ♦ నేఁ గనఁ జాలన్.

ఆ॥ ఎవరి వారొ కాని ♦ యీ వరాయుధధరుల్, నీదు శిష్యు లగుచు ♦ నెఱసినారు
వెరవు మెయిఁ గనంగ ♦ వీరు మహావీరు, లనుచుఁ దేజ మింత ♦ లలవరించు.

తే॥ ఎందు నెలకొందు రచట నే ♦ నెఱుఁగ నైన
నెనసి రిటు నాదు నెలవు పా ♦ వనముసేయ
సమవయోరూపవిభ్రమ ♦ శౌర్యఘనులు
వీరి తెఱఁ గింక వివరింప ♦ వే మహాత్మ. ౩౬౩

క॥ అని యాదృతుఁడై యడిగిన, నినవంశ్యకుమారమణుల ♦ యెల్ల చరిత్రం
బనఘుఁడు మునివర్యుఁడు విని, చినఁ గొంగిటఁ జేర్చి వారి ♦ సిరి పెనుపొందన్.

ఆ॥ మత్కులీనులార ♦ మాయన్నలార; గు, ణాకరంబులార ♦ యజితులార
భద్రము లొప్పెసంగెఁ ♦ బఱతెంచి మాదృక్చు, కోరతతికిఁ దృప్తి♦ గూర్చు నెఱిని.

క॥ సిద్ధాశ్రమభృతికై మి, మ్మిద్ధార్మికుఁ డిట్లు సేర్ప ♦ నెంచె ననిన మే
లద్దా నామేలయ్యెఁ ద్రి, శుద్ధాత్మత నంటి మంటి ♦ సుకృతము కతనన్. ౩౬౮

క॥ అని సుఖవార్ధిం దేలుచు, ననఘుఁ డతం డెల్లవారి ♦ ననునయ మొప్పన్
గొని చని సత్కారంబులఁ, దనియించి కృతార్థుఁ డయ్యె ♦ ధరవరతనయా.

ఆ॥ అతని మందిరమున ♦ నానాఁడు సద్గోష్ఠి, మెలఁగుచుండి రెలమి ♦ మెయికొనంగ
ననిన మెచ్చి యగజ ♦ యవ్వలి చరితంబు, వినెడువేడ్కవిభుని ♦ వేఁడుటయును.

శిఖరిణీ॥ సురారాధ్యా శశ్వ ♦ త్సుమహితమహాభూద్రామవిభవా
సరాగశ్రీయోగా ♦ శ్రయజగదనధ్యాసితపదా
స్మరవ్యాసంగోద్య ♦ త్స్మయహృతిచణాత్మీయచరణా
నిరాధారా శుంభ ♦ న్నిఖిలభువనాధారగరిమా. ౩౬౯

క॥ పావితలోకా; బుధసం, భావితవిమలచరితాను ♦ భావ్యవివేక
శ్రీవర్తిష్ణురసాదృత, సేవకజనసుప్రసాద ♦ సిద్ధిప్రవణా. ౩౭౦

మంజుభాషిణీ॥ అమృతప్రదాననిపు ♦ ణానుశాసనా
విమతాక్షహాలహాల ♦ వేదనాదనా
ప్రమితిప్రమాణవిధి ♦ భాసిభాసనా
సమతీతతత్త్వపర ♦ సామగాయనా. ౩౭౧

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమున షష్ఠాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### —♦ సప్తమాశ్వాసము ♦—

—:(౦):—

శ్రీసముపేత విలాసో,
ద్భాసితలీలావిశేష ♦ భాసురపదవి
న్యాసనమాసాదిత శుచి
తాసుమహితనామరూప ♦ తాత్పర్యాఢ్యా. ౧

తే॥ అవధరింపుము సకలక ♦ లావతంసుఁ
డిట్టు లనె గౌరిఁ గని కూర్మి ♦ యెసక మెసఁగ
వింటె చంద్రాననా ; రామ ♦ విభుని చరిత
మనుపద రసోదయాంచిత ♦ మనఘ మిదియు. ౨

—♦ గౌతమాశ్రమ ప్రవేశము ♦—

ఆ॥ కార్య మెఱిఁగి రేప ♦ కడ నృపుఁ డోదకాం, తముగ ననుప సంత ♦ సమున నతని
వీడుకొలిపి యరిగి ♦ వేవేగ నానాఁడె, మిథిలఁ గాంచి రెలమి ♦ మేకొనంగ. ౩

ఉ॥ దాని వికాస మెల్లెడలఁ ♦ దార్కొని వింతలు సూప మానులన్
మానక స్తోత్రపాఠములు ♦ మానుగఁ గూర్చుచుఁ జేరఁ జేరువన్
గానన మొందు గన్పడినఁ ♦ గౌశికుఁ గన్గొని మానవాన్వయో
ద్యానవసంతుఁ డిట్లనియె ♦ నల్లన రాముఁ డనంతధాముఁడై. ౪

క॥ ఈ వన మతిరమణీయము, గా వెలసియు వెలయ దేమి ♦ కతననో ముని సి
ద్ధావాస మనఁగఁ బోలు న, సేవితమై యుండ నెట్టి చెడు గేర్పడెనో. ౫

తే॥ లలితఫలపుష్పభరితవే ♦ ల్లలతాని, కుంజతరువర మయ్యును ♦ మంజుగుంజ
దలిశుకాలాపపికరవ ♦ కలన లేల, లేక యిప్పాట నడవోవి ♦ లేమి గనెనో. ౬

క॥ భావించి యౌవనముఁ గనఁ, బో వేఁప్రాణు లటుగానఁ ♦ బోఁడిమి సెడెఁ గా
కావిబుధవనముఁ బోలదె, యీ విధమున కెద్ది మూల ♦ మేర్పఱపఁ గదే. ౭

వ॥ అనిన నమ్ముద్దులాని నెఱజాణతనమ్మున మొనయు నెమ్మొద్దు పలుకులు ముద్దు
సేయు మురిపమ్మున మురియుచు మునివరు లెల్లను విన నమ్మునికుల సార్వభౌముం
డిట్లనియె. ౮

## —♦ అహల్యా వృత్తాంత కథనము ♦—

చ॥ తివిరెదు వేడ్కమై నజుఁడు ♦ దిష్టము విష్టప మాత్రిధాత్వముల్
గవియఁగ నందు నేరి కెన ♦ గైకొనరాని యొయారము న్గళల్
దవులఁగఁ జేర్చి చేసె వని ♦ తామణి నొక్కతె లీల నొక్కెడన్
నవనవతాలసద్వికస ♦ నంబులుగా ప్రిభుచిత్తపద్మముల్. ౯

తే॥ హాలము రూపున నతివ సో ♦ యగము నందు
మొనయు వక్రిత కలిమిలే ♦ ములు గ్రహించి
దాని కభిధాన మొనరించెఁ ♦ బూని పద్మ
భవుఁ డహల్య యటంచొక ♦ భంగి రామ;. ౧౦

తే॥ మరుఁడు మునిచిత్తకర్షణ ♦ పరత మించి
హల్య కచ్చోటు చొరరాని ♦ దనుచు దీని
వలన నప్పని సాధించె ♦ వనిత దా న
హల్య యనఁ దగెఁ దత్కృతి ♦ హల్య గామి. ౧౧

శా॥ ఆ సౌందర్యము బాళి మేలిహరాయ ల ♦ య్యారే యటం చెల్లవా
రా సూనాస్త్రిని బారి కోర్వ కిదిమా ♦ కా నంచుఁ బ్రార్థించుచో
నాసం బాపెన కాని యేరికి నిడం ♦ డ య్యబ్జజుం డాయమన్
శాసించె న్నిజభావ మచ్చుపడ భా ♦ షాసార మొప్పారఁగాన్. ౧౨

తే॥ బ్రహ్మచర్యవ్రతోత్సంగ ♦ భంగి పొనర
నొక్క గడెలోఁ బ్రశస్త మై ♦ యొలయు భక్తిఁ
జెలఁగి జగతికిఁ బ్రదిఃప్రద క్షిణ మొనర్చు
నాతఁ డిన్నాతి పతి యవుఁ ♦ గాత మనుచు. ౧౩

ఆ॥ అది యెఱింగి కొంద ♦ ఱొడుగఱచిర కా
కొకని కొకట లోప ♦ మొదవి యుంట
నందు నెఱయ నేర ♦ రైరి భంగంబు పౌ
నఁగ మెంచి ముక్త ♦ సంగు లగుచు. ౧౪

తే॥ బ్రహ్మతేజస్సమృద్ధుండు ♦ బ్రహ్మమూర్తి
గౌతమమహర్షి యమ్మౌని ♦ కలన లరసి
యమ్మెయి పతివ్రతనంబున ♦ నజుని కన్నెఁ
బడయువాఁడ నటం చూహఁ ♦ బరఁగు నంత. ౧౫

క॥ కలహాశనుఁ డద్దైన కి, క్కల హాసగుచు ల్లోలంకఁ ♦ గా వచ్చి యిటీ
తలఁ పొప్పునె సంద్రము నీఁ, తల పొల్పున దాఁటె దోటు ♦ తాపసవర్యా. ౧౬

చ॥ అదె భవదీయ మాశ్రమము ♦ నందలి ఠా స్థలి నీనుచున్న ద
మ్మొద వల వేల్పుగిడ్డి నెఱి ♦ మున్కొనఁ జాలెడుదానిఁ జేరి వే
డ్కఁ దనరఁ ద్రిప్రదక్షిణము ♦ గ్రద్దన సల్పుము భూప్రదక్షిణం
బొదవెడు నొక్కఁ డొక్కటన ♦ నోయి ద్విథాముఖ యాచు నుండఁగాఁ. ౧౭

ఆ॥ దాన మెచ్చుఁ దాత ♦ తన్వి నీకిచ్చుఁ బో, యనుచు నారివేర ♦ మరయు తబిసి
పలుక నట్లొనర్చి ♦ ప్రభుదర్శనోన్ముఖుం, డయ్యె మునివరేణ్యుఁ ♦ డంతలోన.

శా॥ నే సామ్రాజ్యము నేలువాఁడ నను టు ♦ న్నీతంబు గాదెట్టు లౌ
నా సామాన్యులఁ బోల నోలి యిడి క ♦ న్యం గోర నాపోఁటి కం
చాసౌందర్యవిలాససీమ మొదలో ♦ నాటాడు నన్నైనఁ ద
ద్వ్యాసంగంబున నొక్కనాఁడు మఘవుం ♦ డర్థించె నద్దేవునిన్. ౧౯

సీ॥ జగదేకసామ్రాజ్య ♦ సంపత్తి కలిమి కీ, కల్యాణి దేవిగాఁ ♦ గలుగ వలదె
తలఁప నలభ్య చిం ♦ తామణి గూర నీ, స్త్రీరత్న మచ్చోటఁ ♦ జేర వలదె
అల సుధ కరతలా ♦ మలకమ్మై తొలఁక నీ, సరసురాలాచర్య ♦ జరుప వలదె
తన కుర్వశీముఖు ♦ ల్దాసులై మనుట కీ, హేలావతి ప్రమోద ♦ మొనయ వలదె
సురభి కల్పద్రుమ ల్మొదల్ ♦ శుభపదమ్ము
లమరి యుండంగ నిమ్మంగ ♦ శాంగి నాదు
చెంగట మెలంగ వలదె సా ♦ రంగదృశ నొ
సంగు మోదేవ ; యని వేఁడె ♦ శక్రుఁ డనఘ. ౨౦

చ॥ అన విని నవ్వి యవ్విధి య ♦ హా యిటు లాడకు మాత్మకన్య ని
వ్వనజదలాక్షి నొడ్లకిడ ♦ వాసవ మానిధనం బటంచు భా

వన వెలయించి యుంచు నొక ♦ పాట మహామహుఁ డాక్యభూషణం
బనఁ జను గౌతమర్షి యను ♦ నష్టె యొసంగె సతీమణి న్నృపా. ౨౧

క॥ సురపతి కీసని తపసికిఁ, దరలేక్షణఁ దార్చ్చె నెడఁ బి త్రామహు నెడ ను
స్తరము వివరింప జగతీ, శ్వర ; తనుఁబోంట్లకు వినాగ • సామాన్యులకున్. ౨౨

ఆ॥ ఏమనంగ వచ్చు ♦ నిందిరాదేవికిఁ, దోడనంగవచ్చు ♦ తొగలజేని
మోముదాని దాని♦మునిఁ గొని గార్హస్థ్య, మునుఁ బూనర్చెఁ బ్రేమ♦మొనసి రామ.

చ॥ నను బలుబ్రహ్మచర్యము ధ ♦ నమ్ముగ నిమ్మని కిచ్చెఁ దండ్రి యీ
యనఘుఁడు నాదు భాగ్యమున ♦ నయ్యె విభుం డని నమ్మి ప్రత్యహం
బును మహనీయభావగతిఁ ♦ బూజ లొనర్చుచు నుండు రూప మెం
దును గుణసూచకం బనెడు ♦ ప్రోవనుఁ బ్రోవ కహల్యసద్వహా. ౨౪

ఆ॥ పెక్కుహాయనములు ♦ జనుపొందు పొందిక, సాపదలకు నటు ని ♦ లింపు లలర
నెఱపె మానివరుఁడు♦నెఱి మించి గృహిధర్మ,తపము నిష్ఠ మునుల♦తలకు మిగుల.

చ॥ సురవరుఁ డంత నుస్పురని ♦ స్రుక్కుచుఁ జొక్కుచు నొక్కనాఁడు రా
త్రిరి రయమార మారకృత ♦ తిగ్మశరక్షతి కోడి కోడి నై
ఖరిఁ గని తాపసాశ్రమము ♦ గాంచి తదంచితవేది నూఁది కు
క్కురో యని కూసె సిగ్గడలి ♦ కుత్సిత మిట్టిదకా రఘూత్తమా. ౨౬

చ॥ అది వినినంత వేగుతఱి ♦ యయ్యెఁ గదా యని గౌతముండు నె
మ్మది నదిఁ గ్రుంకుతత్తఱము ♦ మాటఁగ నద్దెస కేగ నంతరం
బిదె యని మౌనిరూపు గొని ♦ యింద్రుఁడు లోఁజని తత్సతీమణిన్
మదనుని సంగరంబునకు ♦ మార్కొనఁ జేసె నిఁకేమి రాఘవా. ౨౭

తే॥ మగువ నిద్దుర మబ్బునై ♦ మగఁ డటంచుఁ
జెనఁగి యెనయించు కౌఁగిటఁ ♦ బ్రీతిఁ బొదలెఁ
గాని యమ్మాయజడదారి ♦ కలఁచు దారి
గానదా పూన్కి నెద నూనఁ ♦ గానదయ్యె. ౨౮

తే॥ ముద్దుపలుకులు నగవు మే ♦ ల్మురువు మేటి
వన్నెచిన్నె లొయారమ్ము ♦ సన్న తెలమి
కలియుఁ బుంభావరతము లే ♦ కయును వాని
ముంచి యెత్తె సుఖాబ్ధి న ♦ మ్మునుగుద కేళి. ౨౯

ఉ॥ ఎన్నఁగరాని ముజ్జగము ♦ లెక్కిన ప్రాభవ మెన్నఁడేని మా
ర్పున్నదిగాని వైభవ మొ ♦ హెూ యని పల్కెడు తోడఁబుట్టు వా
వెన్నుఁడు పూని భావగతి ♦ వేచు దగీట్టతి యిట్టి జిష్ణుఁడే
యెన్నియు మాని కామహతి ♦ నింతకుఁ బాల్పడె హా రఘూద్వహా. 30

ఆ॥ అంత నేటికెలని ♦ కరిగి యమ్మౌని చంద్రుఁ, డరసి వేళగామి ♦ యొరసి బెరసి
తడసి జలకమాడి ♦ తద్దయుఁ బ్రొద్దూహఁ, బెంచి ప్రలయవహ్ని ♦ నెంచి మించి.

ఉ॥ ముప్వురు మూర్తుల న్నలిపి ♦ మూరొకని వత్తునొ యా కృతాంతునిన్
జివ్వకుఁ బిల్చి చీల్చుదునొ ♦ చెచ్చెర నాఁ దగి ద్వారభూమికిం
జివ్వన వచ్చె నచ్చపలుఁ ♦ జేర మహామహుఁ డత్తపస్వి యిం
దెవ్వఁ డిటంచు నింకఁ దెగ ♦ నింద్రుఁ డటంచు సురాళి చేడ్పడన్. 3౧

క॥ అలుకుడు విని యతఁ డులుకుడుఁ, జులుకదనం బెంచి యాపె ♦ సురరా జనుచుం
దలఁచి తెలఁకియుం దలఁకని, పలుకుబడిన యిట్లు బలికెఁ ♦ బాద్రివతనయా. 33

క॥ నీ యంతవాని కిటులో, నా ; యాయెం బోమె నిప్పు ♦ డైనం దపసిన్
డాయక నీ నా యుసుఱుల, నే యనువున నేటుసేయ ♦ నెంచెదొ యనుచున్.

క॥ పడఁతుక నోడువఁగ నాతఁడు, తడఁబాటున వెడలి చనఁగఁ ♦ దటుకున ముని య
య్యెడఁ దోఁచి నిలువు మీ వె, వ్వఁడ వోరీ; యనుచుఁ బ్రౌఢ ♦ వాగ్గుంభమునన్.

ఆ॥ పిలువఁ జెలువ మేది ♦ పీనుంగు దశకుఁ బా, ల్పడుచు నగడుగుడిచి ♦ పాకవైరి
చెదరి పదరి తప్పు ♦ నేసితి క్షమియింపు, మమరవరుఁడ నిష్ఠి ♦ తాత్మ ; యనుచు.

తే॥ నిలువుసీరయ్యె ఘనతపో ♦ నిరతు స్నాతు, దేవదానవదుర్ధర్ష ♦ దీప్తతేజు
ననలకల్పు సమిత్కుశో ♦ ద్యత్కరు న్మ, హాత్ము నమ్మునిఁ గనినంత ♦ ననఘచరిత.

వ॥ సద్వృత్తసంపన్నుం డగు నత్తపోధనకులప్రదీపకుండు తపస్వివేషధరుండై దుర్వృత్తంబున కట్లు పాల్పడిన సహస్రాక్షు నంలక్షించి. 3౫

చ॥ వరుసనె యగ్గి నేయిడిన ♦ వైఖరి మీఱి బలారిఁ జేరి యే
మిర పరమానిభామలఁ దమిం జెలరేఁగి రమింపఁ బో యజుం
డిరవుగ ముజ్జగంబుల క ధీశు నొనర్చెను నిన్నుఁ గండకా
వర మిటు సేయుదో పలుక ♦ వచ్చితె నాయెదురం దురాత్మకా. 3౬

క॥ నినుఁ బోలు దుష్టు లున్నను, ననుఁబోంట్లకుఁ గీడు సేయ ♦ న్యాయపథమనన్
మనఁ గలదె యింకఁ గనుఁగొనఁ, గొనప్రాయం బొదవుఁ గాక ♦ కుత్సితకులకా.

తే॥ ఇంతి గరువంబు సేమెద ♦ నెగయుచుండ
గారవం బెట్లు దక్కు ని ♦ క్కారణ న్నిన్ను
మారణ మొనర్తు మామక ♦ మత మెఱుంగ
వేఱనే నింకఁ దోడ్పడ ♦ నేర్చి కొనుము. ౪౧

వ॥ అని యిట్టు లాఖండలునిం దూలనాడి వెండియుం దనదు నెమ్మనంబునం గొండొక
తడవు విచారించి యవ్విరించికల్పుఁడు. ౪౨

— ♦ గౌతముం డింద్రుని శపించుట ♦ —

తే॥ చావు మనఁ జచ్చుఁ గాక యి ♦ చ్చపలుఁ డిట్టి
పాతకుల కెల్లు నాన సం ప్రాప్త మగునఁ
గాన నిగ్రహయోగ్య మి ♦ క్కాల మనుచు
మఱిడి సురపతిఁ గాంచి య ♦ మ్మౌనధనుఁడు. ౪౩

శా॥ ఓరీ దేనికి నెన్నియు న్విడిచి యిల్లుత్సాహి వైనావొ కా
నీరా యంగములందు వ్రేలిడఁగ సం ♦ దెవ్వాట లేకుండ నీ
మై రోమించును వేయి యోను లటు స ♦ న్మానంబు దూలంగ ని
న్నారు ల్నవ్వుకొనంగ నండయుగి ఛి ♦ న్నుండవై పశుం గాంతేన్. ౪౪

తే॥ నిన్నుఁ బగతుఁడు తలఁబట్టి ♦ చెన్ను మంటఁ
గలిపి లంఘించి బంధించి ♦ కాల ఱాచి
కొంచుఁ బోయెడు నెడ నీదు ♦ క్రించుతనము
కావర మడఁగుఁ బొమ్మని ♦ కసరు నంత. ౪౫

శా॥ తానే యోనులు మేన నెల్లెడలఁ బా ♦ దుర్వెట్టెఁ గన్మాయ నా
లోనే యండయుగంబు వ్రీలి పడె స్వ ♦ ర్లోకంబువా రింక నే
నా నేమో మన మేమి సేయఁ గలమా ♦ హా చేటు వాటిల్లె నె
ట్లీనేతం గనువార మంచు వగ నెం ♦ తే నుల్ల మల్లాడఁగన్. ౪౬

ఆ॥ అగ్నిముఖులు దివ్యు ♦ లద్దేవుఁ జేరంగ, నరిగి యూరడింప ♦ నల్లనల్ల
వారితోడఁ బలికె ♦ వాసవుండే నిట్టు, లైతి సౌరకార్య ♦ మవధరించి. ౪౭

క॥ దేవపదచ్యవనంబున, కావిధమునఁ దపసి చేయు ♦ నట్టి తపంబున్
నా వెరవునఁ గెడపఁగఁ ద, ద్భావినిఁ గొని పాపమునకుఁ ♦ బాల్పడ నయ్యెన్.

ఆ॥ కినిసి నన్నుఁ దిట్ట ♦ వనితను వెగనాడ, నతని తపము పెంపు ♦ హ్రస్వ మగున
కాన నన్ను సఫలుఁ ♦ గా నొనర్పుఁడు చేరి, విధికి మద్విధంబు ♦ విన్నవించి.

ఆ॥ అనిన నట్లె వార ♦ లరిగి లోకేశున, కెల్లఁ దెలిపి రేత ♦ దిచ్చె దేవ
ముఖుఁడు పితృగణాగ్ర ♦ ముఖ్యులతో ననె, భావికార్యవిధివి ♦ భావనమున. ౫౦

క॥ జన్నము మేషము తగ నుప, పన్నమ కద దాని ఫలముఁ ♦ బరఁగింపుఁడు నేఁ
డిన్నేతకు మీ కయ్యది, యున్నప్పటి యట్లె తృప్తి ♦ యొదవుచు నుండున్. ౫౧

ఆ॥ అనుడు వారు వల్లె ♦ యని తెచ్చి యిచ్చిరి, స్వాంశ మేషపశువ ♦ రాండకోశ
మాన నిడిరి సురలు ♦ నానవో వ్రజి మే, పాంసుఁ డనఁగ నమ్యె ♦ నది మొదలుగ.

క॥ సఫలపశుఫలము దాతకు, నఫలాంశము పితరులకుఁ ద ♦ దాదిగ నెగడెన్
విఫలుఁ డయి శక్రుఁ డొదిఁగెను, సుఘటిత మునితపము గన్న ♦ సూనృతశక్తిన్.

క॥ సిగ్గు తను ముంపఁ జెంపలు, నగ్గల మగు శోకవహ్ని ♦ నగలెడు శక్రున్
డగ్గరి చల్లని చూపులఁ, బెగ్గలికము మాన్పి పలికె ♦ విధి నేర్పొలయన్. ౫౪

ఆ॥ దైవ మెందుఁ గడవఁ ♦ దరము గా దింక నీ
వడల వలదు మేనఁ ♦ గడలుకొనిన
యోను లెల్లఁ గనుల ♦ యోజ నెక్కొన సహ
స్రాక్షుఁ డనఁ బ్రసిద్ధి ♦ నందు మింద్ర. ౫౫

క॥ అని యానసేసి చనె నా, ఘనుఁ డాతం డూఱడిల్లఁ ♦ గా నాదట నా
ఘనవాహుఁడు రావణిచేఁ గనె నోటమి యనెడు గాథ ♦ గలదు కుమారా. ౫౬

## ♦ గౌతముఁ డహల్యకు శాపమిచ్చుట ♦

ఉ॥ అయ్యెడ వైష్ణవేష్టి నతఁ ♦ డయ్యజు నాజ్ఞ నొనర్చి నిష్ఠమై
జయ్యనఁ బాపపుంజముల ♦ సంగడము న్వడలించి మించె న
ట్లయ్యమి వాసవు స్గనిసి ♦ యాదట లోఁజని యింతిఁ జూచి నీ
కియ్యకొనంగ నయ్యె నెటు ♦ లియ్యఘవృత్తి యటంచు నుగ్రుఁడై. ౫౭

తే॥ శిలవు గమ్మిట నీచెంతఁ జేర రావు, ఖగమృగాదులు నిల్లె పో ♦ కాలు మింత
కన్నఁ దిన్నని కన్నెల ♦ మిన్న లవని, నెన్నికకు మీఱి జనియింతు ♦ రెగయ వలదు.

ఉ॥ ఇంతలు వింతసేయు నటె ♦ యింతులు జంతలు వంత లాఁగఁపుం
బొంతలు గ్రంత లవ్విసఁపు ముంతలుఁ బూరుషు లెంతలున్ సుఖ
భ్రాంతులు వారి పట్ల నిడి ♦ భ్రాంతతమైఁ జెడు టింతె కాక గో
రంతయు లేదు సౌఖ్య మిది ♦ యంతయు వీడక ముక్తి గూడునే. ౫౯

ఆ॥ ఆత్మ నెవ్వతె మగని ♦ యం దర్పణ మొనర్చి
ప్రేమ మీఱ ననుచ ♦ రించు సాధ్వి
నారకై నేనిఁ బతికిఁ ♦ గోరదు నాముష్మిక
మైహికంబు భిన్న ♦ మైనఁ దలఁగు. ౬౦

క॥ కావునఁ దగునె ముముక్షూ, శ్రీ వలగొను వాని కీర్తి చెనఁటుల కూటం
బేవేళ మన్ను మిన్నదఁ, గావరమునఁ గాన లేని ♦ కామికిఁ దక్కన్. ౬౧

క॥ అని పలికిన నుల్లము ఝు, ల్లనఁ జెల్లుఁగఁదూలి సోలి ♦ యబలామణి య
ల్లనఁ బతిపాదములం బడి, ఘనశోకభయార్తు లడరఁ ♦ గా నిట్లనియెన్. ౬౨

ఉ॥ పాపము గాన నీవు పద ♦ పద్మము లాన మదానఁ దాన త్వ
ద్రూపముఁ గొంచుఁ దత్తదను ♦ రూపత తోన బిరాన వచ్చి యి
ట్లీపని కియ్యకొల్పె నతఁ ♦ డేమను దాన నిదాన మెల్ల నీ
కోపి కనుంగొనంగఁ జన ♦ దో; ననుఁ గోననుఁ ద్రోయు నిమ్యోషన్. ౬౩

ఉ॥ ఏమనవచ్చు నివ్విధికి ♦ నే మన వచ్చు నిఁకెట్టు లయ్యెహా
యామెయిఁ గామకింకరుఁడ ♦ నై యొడిగట్టఁగఁ జేసెఁ జెట్ట నా
తామస మింత గూర్చె నెటు ♦ తాపసవర్య; భరించెదో కదే
యామొఁగిపుట్టు నోము గుమి ♦ కయ్యెనె యిట్టి ఫలంబు నేఁటికిన్. ౬౪

ఉ॥ అబ్బునె తావకీనచర ♦ ణాబ్జమరందవశంవదాత్మతన్
గొబ్బున నెన్నియు న్మఱచి ♦ కొల్వొనరించి యమేయలక్ష్మిమై
నబ్బురమౌ రసాస్పదము ♦ నందఁగఁ జాలు సహాలి భాగ్య మీ
సిబ్బితివో జను ల్గని యి ♦ సీ; యనఁ గాలెదు పనికిం బ్రియా ౬౫

క॥ దీనను నీదాననుఁ బోఁ, గాననుఁ నిను విడచి యడఁగలఁ ♦ గా నను వఱ బల్
కానను విడనూననుఁ జెడ, నా ననుఁగొను ముద్ధరింపు ♦ మంచితకరుణన్. ౬౬

తే॥ పిడుగు కన్నను నీపల్కు ♦ బెట్టిదంబు, గాన నెట్లు నమోఘంబ ♦ యే ననంగ
నేమి గలదు కటాక్షింప ♦ నెంచితేనిఁ, దనదు దురదృష్ట మొకపాటఁ ♦ దలఁగు నేని.

ఆ॥ యోగమహిమ నీవ ♦ యూహించి నాయెడ, నేరముంట యింత ♦ నేరకుంట
దెలిసి దీని కేమి ♦ తెఱవు గల్పింపంగ, వలయు నట్లు సేయ ♦ వలయు నాథ.

చ॥ అని మొఱపెట్టుచుం బతిప ♦ దాప్తి దృగంబువు లొల్క వెన్నునం
జనుఁ జదలేఱు పోలె పడి ♦ సాగ విభీతమృగాంగనావిలో

చన యెదఁ జుట్టు వేదన దె ♦ సం బలునోడి యెలుంగు వాఱ నే
డ్చెనుఁ గలకాకలీస్వనము ♦ చెల్వము మారుని నారి తీరుగన్. ౧౯

వ॥ ఇవ్విధంబున నెవ్వగలం బొగులు నవ్వనితామణిం గనుంగొని యవ్వాచంయమ వరేణ్యుండు జ్ఞానదృష్టిం దద్వృత్తాంతంబెల్లఁ బరికించి కించిచ్ఛమితరోషుండై కనరు దీఱ నెనరుమీఱ నల్లన నిట్లనియె. ౨౦

ఆ॥ ఎఱిఁగి యెఱుఁగ కెట్టు ♦ లేనిఁ బాపఁపుఁజేత
కాల్పకున్నె సతికిఁ ♦ గా దొకప్పు
డునుఁ బ్రమాదవృత్తి ♦ గాని యాడ నద్దానఁ
గాక యొండు తన్నుఁ ♦ గవియఁ గలఁడె. ౨౧

శా॥ తప్పెం గాలము దప్ప దిప్పలుకు మీఁ ♦ దం త్రేత విష్ణుండు శ్రీ
యొప్పం బృథ్వి జనించు దాశరథియై ♦ యోరామ ; యారాముఁడీ
త్రిప్పు ల్వాపునుఁ దత్పదాంబుజరజ ♦ స్త్వత్ప్రవేశర్ధి మే
ల్చెప్పన్ శక్యమె శాపపాపము లఱన్ ♦ శ్రేయంబె నీకబ్బెడిన్. ౨౨

క॥ ఆలో లోలాక్షి; తప, శ్శ్రీలక్ష్మస్థితిఁ గ్రమింతు ♦ చిద్గతలీలా
ప్రాలంబ వగుచు నెన్నియు, వే లబ్దము లవల నుక్త ♦ విధి సమకూరున్. ౨౩

ఆ॥ వాయుభక్షణంబు ♦ వర్తనంబున నిరా, హారవై తపఃప్ర ♦ చారమున న
నన్యదృశ్య వగుచు ♦ నధిరామనామయో, గాప్తి నిస్తరింతు ♦ వఘమహాబ్ధి. ౨౪

సీ॥ మునుల పాలిటి వాఁడు ♦ సనకాదిమహనీయ, భావగమ్యాత్మత ♦ త్త్వంబు వాఁడు
జగము లేలెడు వాఁడు ♦ జలజచక్రాబ్జధ్వ, జాదిలక్షణయుక్తి ♦ నమరు వాఁడు
మనువు వంశము వాఁడు ♦ ఘనశరాసనవిల, సనలక్ష్మి భుజభూమి ♦ ననుచు వాఁడు
మొలకనవ్వుల వాఁడు ♦ మోముచందురు బాళి, జనదృక్చకోరాళి ♦ మనుచు వాఁడు
పలికి బొంకని వాఁడు చే ♦ పట్టి విడని
వాఁడు వెలలేని గానముల ♦ వాఁడు కోస
లాత్మజాగర్భశుక్తిము ♦ క్తాత్మ వెలయు
వాఁడు శుభనామధేయంబు ♦ వాఁడు వాఁడు. ౨౫

తే॥ నీకు దర్శన మొసఁగుచో ♦ నెఱి ననర్ఘ్య, మైన యర్ఘ్యాదికార్హణ ♦ నతని భవ్య
పదనలద్వయిఁ గన్దోయి ♦ భక్తి నద్దఁ, గలుగు నంతటికన్న భా ♦ గ్యంబు గలదె.

తే॥ కీడులో మేలు నాకుఁ జే ♦ కూడె నిట్టి
నాఁ డనుచుఁ దోనె తత్పాద ♦ నలినములకు

సాఁగిపడి మ్రొక్కి యడిగె నా ♦ సాధ్వి మౌని
వరుఁ డరిగె నప్పు డచ్చోటు ♦ వాసి రామ. 22

క॥ చింతాక్రాంతత నెద్దియు, మంతనమునఁ దోఁప కెలమి ♦ మలఁగఁగ నొంటిం
గాంతారసీమలో న, క్కాంతామణి పొగులుచుండఁ ♦ గా దైవగతిం. 27

సీ॥ బలు శాపభార మి ♦ ప్పురుసునఁ దాఁకె నాఁ, దలపోఁతు మిన్నక ♦ దారసిల్లెఁ
బాపంబు నెమ్మనఁ ♦ బ్రాఁకె నిట్లన మేలి, రూపంబు వోఁ మాఁఱు ♦ రూప మొదవె
నియతి నిన్నిలుచు న♦న్నెఱి నెదురేగెఁ బో, మతి యన్న గతి బహి♦స్మృతి తలంగెఁ
బ్రాణనాథుని యుక్కి ♦ పట్టు గుట్టరసి న, ట్లనుపు లెట్లో చన ♦ నటమటించెఁ
దనకు భూపతి దక్కఁ జే ♦ తనులు తోడు
గారు వేఱగు వా రని ♦ కాంచె నామె
పదమె పద మన భువిఁ బడి ♦ ప్రకృతిభావ
మెడలి శిల యయ్యె గద యప్పు ♦ డే మహాత్మ. 28

తే॥ తృణము మేరువు మేరువుఁ ♦ దృణము సేయ
నీక కా దెప్ప నిను మేలి ♦ నియతిఁ దలచు
తరము వారికి నొసఁగెదు ♦ తావకీన
యశము గొనియాడ నొడ్లకు ♦ వశమె యీశ. 30

ఉ॥ ఆయమ యియ్యరణ్యపథ ♦ మందుఁ దవ్వదేకశరణ్యయై తనుం
బాయని పెక్కుబన్నముల ♦ పాలయి రూపఱ ధూళిధూసరం
బై యొడ లట్లుగాఁగ నిది ♦ యా నిది గాదను ప్రాపు లేక నీ
చాయ ఘనోదయం బచల ♦ చాడ్పునఁ గోరెడు నయ్య రాఘవా. 31

తే॥ ప్రోవు కరుణార్ద్రదృష్టుల ♦ ప్రోవు సేర్చి
యయ్యతివ మౌనిఁ గూర్పుమో ♦ యయ్య ; యింత
కన్న యశ మెద్ది యిడు మముఁ ♦ గన్న తండ్రి ;
దీనశరణంబ కావె న ♦ దీనశరణ ;. 32

## —♦ అహల్యా శాప విమోచనము ♦—

శా॥ రావే, కావవె, రామ ; రామ నని శ్రీ ♦ రాము న్దహారామము
న్వావే గూర్చి తలిర్చు వేడుక మెయి ♦ న్గనె న్గేలఁ గీలించి పెం
ద్రోవ న్వొంగి చెలంగి డాసి హరి కా ♦ త్రోవ న్నిరూపించె స
ద్భావుం డమ్మునిమౌనికాంత హాతపా ♦ పధ్వాంతగాఁ బార్వతీ. 33

తే॥ ఎవని కరుణార్ద్రదృక్కోటి ♦ నెనయు కోటి
యంశమునకు నెదుర్పడు ♦ నాతఁ డొందుఁ
బుణ్యగతి నట్టి ఘనుని సం ♦ పూర్ణదృష్టి
పదవి పాలయ్యెఁ జూడు మ ♦ ప్పడఁతి పొలఁతి. ౮౪

వ॥ అత్తెరువున నత్తపస్విసత్తముఁ డత్తెఱవ తెఱం గెఱుంగఁ జేసిన. ౮౫

సీ॥ గడుసు తిట్టున జాయి♦గాక ము న్మానహా, సికి మ్రాన్పడెనొ నాఁగ♦నెగడు దాని
నడవిపా ల్గాని య♦ప్పుడె పరాకృష్టమా, రూపు మార్చిన చొప్పు♦ చూపు దాని
నొంటి నిల్వఁ గలంక ♦ మొదవు నం చెడఁగి చే, తనఁబతిఁ దార్చె నాఁ♦దనరు దాని
నాతిపాహత యగు♦నాల్గోఁ బ్రియవియుక్తి, పొగులు చిచ్చంటె నాఁ♦బగులు దానిఁ
దనదు దుర్దశఁ దలఁగంగఁ ♦ దారకంబె
యాఁ గదా యని భర్తృవా ♦ క్యప్రసక్తిఁ
దెలిసి మునితఁ బ్రతీక్షించు ♦ తెఱవు దానిఁ
గనె నహల్య స్వసంపాల్య ♦ నినకులుఁ డుమ. ౮౬

క॥ శాప మన నశైనె సుమహిత, శాపాయుధు వాక్యసరణి ♦ సకలేశకృపా
ప్రాపకసమాధియోగ, ప్రాపణ మని కాక వేద ♦ పరమార్థజ్ఞా. ౮౭

తే॥ తొయ్యలి తగె న్సురాసుర ♦ దుర్నిరీక్ష్య, తతతపోయోగవిద్యోతి ♦ తప్రభాఢ్య
నిర్మలాత్మిక మునివరో ♦ న్నీయమాన, శాపలక్ష్మ్యపదేశప్ర ♦ సక్తి సుదృశ. ౮౮

క॥ శిల యయ్యె ననుట మాత్రమె, పొలఁతి యదృశ్యతన తనరి ♦ పూజించె హరిన్
దలఁపున నిడి మునివరు నుడిఁ, గలఁక దలఁగి వారి కపుడు ♦ గన నయ్యె సఖీ. ౮౯

తే॥ ఆ యహల్య మహాభాగ ♦ నమరరూప, రూపిణి నిరూపణ మొనర్చెఁ ♦ బాపహారి
శౌరి చేరి జతన డిని ♦ స్రష్ట దివ్య, మాయ జనమోహినిగ నిట్లు ♦ మలఁచె ననుచు.

క॥ సతుషార సాభ్రమై యా, వృత యగు చంద్రప్రభకుఁ బ్ర♦వృద్ధకుఁ గూర్పన్
బ్రతి యా ధూమపరీతో, ద్ధతదీప్తాగ్నిశిఖ కనుచుఁ ♦ దద్దయు నెంచెన్. ౯౦

క॥ తపసి సతి దురాధర్షం, దపనద్యుతి జలగతాహ ♦ తన్ గా మతిఁ దా
నుపమించి తత్తపోనిధి, తత్ప్రతిభ మెచ్చి పొగడె ♦ దాశరథి సుధీ. ౯౨

క॥ అన్నెలఁతుక వలనున నెన, రున్నిద్రతఁ బొదల ముగ్ధ ♦ నోజఁ దటిసి యా
పన్నుల మనిచిన బిరుదము, న న్నలినాక్షుండు తీర్పె ♦ న న్నెగ్గు మెయిన్. ౯౩

ఆ॥ మున్నుఁ గడలివెన్న ♦ వెన్నుఁ దన్ని జనించి, వన్నె గన్న కన్నె ♦ మిన్న తనదు
చిన్నితొడల మేలి ♦ చిన్నె లూర ధరించి, కొన్న శ్రీపదం బి ♦ డె న్నతాంగి.

క॥ హరిఁ దలఁచిన హరిఁ బొగడిన, హరినామావృత్తి మనిన ♦ హరి నే ననినన్
హరిపద మందుదు రనెయా, హరి యంఘ్రి కనాధ్యఁ జెద్ది ♦ యగరాజసుతా.

ఆ॥ పాడమె నేడి గంగ ♦ పుట్టిన చోటఁ బ్ర, హ్మాదు లెపుడు జేసి ♦ నవధరింతు
రెల్ల శ్రుతుల నొసట ♦ నల్లసిల్లెడు చెంది, రంపుఁ గలస ముదము ♦ నింపు నెద్ది.

క॥ ఆపదరజ మటు సోఁకిన, నాపదలు పదంబు వదలి ♦ యటుఁ జనఁగ సతీ
రూపము మునిశుభవాగను, రూపము గా వెలసె శాప ♦ రూక్షి తలఁగుటన్

ఆ॥ అలరు రూపసంజ్ఞ ♦ లహామహామిక నొక
త్రేపఁ దనకుఁ దోఁషఁ ♦ దెఱవ మెఱసె
నల తపాత్యయమున ♦ నగు సువృష్టిప్రాప్తి
వఱలు దావతప్త ♦ వనిక వోలె. ౯౮

ఉ॥ ఎక్కడనుండి వచ్చె నొకొ ♦ యింతికి మించు జెడంగుతళ్కులుం
జక్కని పైఁడిచేలమును ♦ జానగు కంచుక మాశ్యశోభఁ జే
రెక్కిన తారహారతతి ♦ యిమ్ములు సొమ్ములుఁ బాదధూళి తా
నెక్కటి సృష్టిసేయఁ గన ♦ నెట్టి తపంబుఁ బొనర్చె నెచ్చెలీ. ౯౯

చ॥ మొగడనళంపుఁ బువ్వు కొన ♦ ముద్దుకొనం గల స్నిగ్ధతం గనం
దగ సతి మేనుఁ జేటి తెగ ♦ ధర్మనరుఁ గాంచెఁ గచాళి రెంటి చా
యఁ గనియు వెన్నఁ బోని మన ♦ మానియు మానదు తొంటి యశ్మభా
వగతిఁ గుచద్వయం బహహా ♦ భాషిని దాని తపఃఫలం బొకో. ౧౦౦

క॥ కన్నా కమ్మెను సొబగుల, కన్నాకవధూటు లీషి ♦ నారసి తిరమై
కన్నాఁకట్టఁ గలాఁడె యిఁ, కన్నాకవిభుం డటంచుఁ గలఁగఁగ మగువా. ౧౦౧

ఆ॥ అన్న; నీదు భార్గిత ♦ యయ్యె బలారి త, న్నగడుపఱిచె నల్ల ♦ టంచు హరికి
విన్నపింపఁ గడఁగి ♦ వెలసిన మునియశో, లక్ష్మి నాఁగఁ దనరె ♦ లలన మహిల.

క॥ కనకాంగి చెలువు వెల కం, దని రతనఁవు సిరికిఁ గూర్చి ♦ దాన నదోషం
బను సురభిఁ బఱపె నన రా, ముని ఘటనకు సాటి గలదె ♦ ముల్లోకములన్.

తే॥ మున్నె కాంతి జగతిఁ బేరు ♦ గన్నవారి
కన్న వేయు గొనమ్మ లి ♦ క్కన్నె కొనఁగి
యున్న విధి సృష్టి కిదె మెఱుం ♦ గన్న రాముఁ
డన్నలువ కబ్బ యన రాదె ♦ వన్నెలాఁడి. ౧౦౨

ఉ॥ ఇంత శరుండె మౌని తన ♦ యింతి పయిం దయ యింత లేక వృ
త్రాంతకు జూడఁ జూడ నయి ♦ యాయమ ద్రోయునె యంచుఁ బల్కుట
ల్వింతలు సుమ్ము తా నెఱపె ♦ వేడుకనై నొకపాటి యోగులుం
గాంతు రనంగ రాని సిరిఁ ♦ గాంతకుఁ దా ననుకూలుఁ డెంతయున్. ౧౦౫

సీ॥ రాజయోగనిరూఢి ♦ రాజిల్లె నెమ్మోము, దృక్కులాకలనఁ బెం ♦ పెక్కెఁ గనులు
రసనిర్ణయస్ఫూర్తి ♦ రహి మించెఁ గెమ్మోవి, చెలఁగె భక్తిత్రయా ♦ కలనఁ గంఠ
మచలబోధాస్పదం♦బై యొప్పెఁ జనుదోయి,దృశ్యమిథ్యాత్వంబు♦దెలిపె నడుము
గురుమహత్త్వాప్తిఁ జే♦ కూనె నితంబపదంబు, నిరతిశయశ్రీల ♦ నెగడె నంఘ్రు
లమితకల్యాణవైభవం ♦ బందె మేను
దృష్టిఁ గనె శోకబంధంబు ♦ ద్రెంచి యాత్మ
ముని తపస్సిద్ధి వోలె రా ♦ ముని ప్రసాద
మున మెఱయు నా సతీరత్న ♦ మునకు సాధ్వి. ౧౦౬

చ॥ తన పతి నింద మోసె దురి ♦ తం బెనసెం జెడె మే న్గడంక న
మ్మునిసతిఁ బాసె నయ్యసురు ♦ ముంచునొ తేల్చునొ యంచు నేఁటికా
యన జఘు కొందు దాని నిఁకఁ ♦ డాఁగెఁ గదే యని దేవతాలి యొ
య్యనఁ గుఱియించె రాముపయి ♦ నా వెలఁ బూవుల వానఁ జానరో. ౧౦౭

క॥ రాము పదరజము కారణ, మై మగువ జనించె సతి బ ♦ లారి తలఁపఁ డిం
కేమి శుభ మెనయఁ గల మఱి, యామోదము తోడ నాడి ♦ రచ్చరలు సఖీ.

శా॥ వాత్సల్యంబు హృదంతరం బెనసి త్రో ♦ వ ద్రొక్కి శ్రీరాముఁ డా
సత్సౌభాగ్యనవాపతాంగరిమన్ ♦ జా నొంము మౌనీంద్రు ప్రో
ద్యత్సంపత్తి యహల్య యంఘ్రులకుఁ దా ♦ నర్పించెఁ గేల్మోడ్పు ల
స్మత్సాలోక్య మొసంగువాఁడ నని బా ♦ స ల్సేసె నన్నట్లుగన్. ౧౦౯

క॥ అంతిం బన కానతు లిడి, చెంత న్నిలువఁ బడి యున్న ♦ చిన్మయలీలా
సంతానితతను మహిమా, క్రాంతాఖిలభువను హర్ష ♦ ఘను శ్రీసదనున్. ౧౧౦

సీ॥ వెడఁద కన్గవ దారి♦ వెలిగ్రమ్మ నెన రిమ్ము,నగుమోము రమ సన్న♦ననుచు వానిఁ
దమము వారించు ని ♦ ద్రఁపుఁ జొప్పు కథ విప్పు,బలు వెలుంగు ననుఁ♦జూపట్టువాని
సిరి తూఁగుటుయ్యాల ♦ సరివచ్చు వెలపెచ్చు, సరుల మెచ్చై చ్చనవ ♦ క్షుంబువాని
నల కల్పశాఖ శా ♦ ఖల పెంపుదల నింపు, భుజల విల్లంబులం ♦ బొసఁగు వాని
లలితవేషుఁ గలావాసు ♦ లక్ష్మణాన్వి
తుని మహామహు శ్రీరాముఁ ♦ దొలిభవంపు

భవ్యసుకృతంబు కతన న ♦ ప్పడఁతి గాంచి
విస్మయాంబుధి మునిఁగె ను ♦ ర్వీధరిత్రతనయ. ౧౧౧

క॥ తెలివి గని తెలివి తానై, తెలివిం గలిగించు ఘనునిఁ ♦ దెలిసితి నని యా
చెలి యామోదామృతఝరి, తెలిదమ్ములఁ గొలుచు కనులఁ ♦ దేలెన్గ్లాడన్.

మేఘవి॥ మదీయప్రాణేశుం డటు మరలఁ దా ♦ మన్నఁ గాంక్షించువేళన్
సదంశం బేమంచుం జొనిపెఁ జెవి రా ♦ జత్కృపాసింధులీలన్
దదేకాత్మన్ లక్ష్మీధవుఁడె యిటు న ♦ న్ధన్యఁ జేయంగఁ దోఁచెన్
దుదిం గంటి న్గర్మస్థితి కని తగ ♦ న్బ్రోఁగె నానందవార్ధిన్. ౧౧౩

క॥ కను విచ్చుచు ముని మెచ్చుచు, జన విచ్చుచు నిలుచు దేవు♦చాయఁగనుచుభా
వనఁ ద్రచ్చుచుఁ దత్పూజన, మున నొచ్చుచుఁ బొచ్చెమెడలి♦మునిసతియంతన్.

ఆ॥ మేను పులక లుద్గ ♦ మింపఁ గోరకితక, దంబలతిక నాఁ గ ♦ రంబు మెఱయ
రాముఁ జుట్టి మ్రొక్కి♦రాణించు భక్తి ని, ట్లనుచుఁ బొగడఁ దొడఁగె♦వనజవదన.

—♦ అహల్యాకృత శ్రీరామస్తవము ♦—

క॥ వందనము లిడుదు సజ్జన, మందార; సురక్షితృస ♦ మాజశరణ; సూ
ర్యేందువిలోచన; కలితా, నందన; గోవింద; యోగి ♦ నందితచరితా. ౧౧౬

సీ॥ శరణు, శ్రీమానస ♦ సరసిజేందిందిర, శరణు, భక్తమయూర ♦ జాలజలద
శరణు, యోగిహృదబ్జ ♦ సారసబాంధవ, శరణు బుధాహ్లాది ♦ చంద్రవిభవ
శరణు, భవాబ్ధిసం ♦ తరణసుధీవర, శరణు, దుస్సహతాప ♦ సాధలేప
శరణు, పాపారణ్య ♦ శాతపరశ్వధ, శరణు, దుష్టదవాగ్ని ♦ సారవృష్టి
శరణు, గుణమణిప్ర ♦ చారరత్నాకర, శరణు, దైన్యతిమిర ♦ సాంద్రతేజ
శరణు, సర్వరుగ్గ ♦ జవ్యూహకేసరి, శరణు, రామ; దేవ ♦ సార్వభౌమ. ౧౧౭

చ॥ తొలిభవ మెంచి నా కెరఁగి ♦ తో; రఘునందన; నిక్కమిప్పుడా
యెల తొలఁగె న్భవదంఘ్రిరజ ♦ మియ్యెడ మజ్జనికారణంబుగాఁ
దలఁచితిఁ గన్నతండ్రి వని ♦ తావకకన్యక నింతె కాక యి
జ్జలజభవాండ మెల్లఁ గనఁ ♦ జాలితి వీవ కదే జనార్దనా. ౧౧౮

సీ॥ దేని తోఁబుట్టువునై ♦ దివ్యగంగాదేవి, బ్రహ్మాదుల నొనర్చెఁ ♦ బావనులను
దేనికిఁ బని గల్గుఁ ♦ దెరలక యతిశివ, శ్రీమానసముల రం ♦ జిల్లఁ జేయ
దేని కాసింతురు ♦ తివిరి యెందేని ని, ర్మలచిత్తులైన క ♦ ర్మఠులు ప్రీతి
దేని స్వరూపైక ♦ దేశంబు ముజ్జగ, మ్ములుఁగూర్చుసామగ్రి ♦ మూలపుటిక

దేని ధృతి శ్రేయ మందించు ♦ తెరు వటంచు
బ్రహ్మవాదుల సిద్ధాంత ♦ పఙ్క్తి మించు
నట్టి భవదంఘ్రినలరజం ♦ బానఁ గలిగె
నహహా యే నెంత సుకృతాత్మ ♦ నైతిఁ దండ్రి. ౧౧౯

మ॥ భవదీయాంఘ్రిసరోజము న్గొలుతు శం ♦ భల్లీల నెద్దాని భా
ర్గవి వక్షోరుహసీమఁ బ్రేమ దొలఁకం ♦ గా నుంచి లాలించు ము
న్నవరించెం ద్రిజగంబు లెద్ది యభిమా ♦ నం బింతయున్ లేని నూ
నివరేణ్యు ల్స్మరియింతు రేమఱక దే ♦ నిన్ దాని నెల్లప్పుడున్ ౧౨౦

మ॥ కలితాస్థ న్విధినారదాదు లెపు డే ♦ కల్యాణ లీలావతా
రలసద్గాథలు బ్రహ్మరోకమున శ్రీ ♦ రాణింపఁ గా నెంతు ర
క్కల నాత్మీయవిపంచి గొంచు మది వొం ♦ గ న్బాష్పము ల్జాఱ ని
ర్మలభక్తి న్వివరించు వాగ్రమణి యా ♦ భ్రాజిష్ణు ని న్వేఁడెదన్. ౧౨౧

సీ॥ ఏ లసచ్ఛ్లోకు క ♦ థాలాపకలనల, విలసిల్లు నల తొలుఁ ♦ బలుకు లెల్ల
నే దేవదేవుని ♦ యిల్లాలు మిన్నయై, తనరారు జగదేక ♦ జనని లక్ష్మి
యే లోకనాథు ను ♦ ద్వేలనాభి జనించి, చెలు వందు నమ్మేటి ♦ సృష్టికర్త
యే మహామహుని శ్రీ ♦ నామమంత్రరసాప్తి, నెగడొందు వరదుఁడౌ ♦ నీలకంఠుఁ

డవ్విరాణ్మూర్తి వచలుఁడ ♦ వవ్యయుఁడ వ
నాదినిధనుఁడ వీవె నె ♦ య్యమున నాదు
కనుల కెదురుగఁ గనుపట్టి ♦ కావ వచ్చి
తయ్య; నాభాగ్య మేమందు ♦ నయ్య; శ్రీశ. ౧౨౨

మ॥ నిజమాయాగుణబింబితస్థితి జగ ♦ న్నిర్మాతృతాచాతురిన్
భజియింప న్బరుడింప నయ్యెనుఁ బర ♦ బ్రహ్మంబ వౌ నీకు ని
ట్లజరుద్రాచ్యుతనామభేదకల లా ♦ హా; యాదట న్నీవె స
ర్వజగం బట్లు తదాశ్రయంబు నయి మే ♦ ర న్మిజితౌ నీశ్వరా. ౧౨౩

తే॥ కార్యకారణకర్తృత్వ ♦ కలితవివిధ
వస్తువాచకవాచ్యవి ♦ వక్షు లమర
మనెదు బహురూప యగు మాయ ♦ మలసి యుంటఁ
దద్విలాసము ల్దన యెందుఁ ♦ దవుల నభవ. ౧౨౪

సీ॥ పుట్టితి వజుఁడవు ♦ పొదలెద వచలుఁడ, వర్థాశ మెలఁగెద ♦ వస్పృహుఁడవు
సుగుణాప్తి నెగడెద ♦ వగుణుఁడ విన్ని సే, యంజాలితి వకర్త ♦ వనుభవింప

నేర్చి తభోక్తవు ♦ నియమింపఁ బడెదు స్వ, తంత్రుండ వటు దృశ్య♦తం బొసంగి
తఖిలసాక్షివి పల్క ♦ లాడెదు మతి కెదు, రొక్కనె దవాఙ్మానస♦ గోచరుఁడవు
ప్రాకృతుఁడవ పోలెఁ ♦ బరఁగెద వద్వయా
నందమూర్తి వేమ ♦ నంగ నీదు
చేష్టితంబు బహువి ♦ చిత్రంబు భక్తైక
పారతంత్ర్య మింత ♦ పరమె రామ. ౧౨౬

ఆ॥ ఆకసంబ పోలె ♦ నంతట నిండియుఁ, జేర కుందు వెందుఁ ♦ జిద్ఘనత్వ
మమర నైతి వొకఁడ ♦ వప్రమేయుఁడవు నోం, కారలక్ష్య మీవ ♦ కావె దేవ.

సీ॥ అటు గాన సత్య మ ♦ నంతంబు జ్ఞాన మ, ద్వయ మఖండంబుత♦త్పదముసమము
బుద్ధంబు శుద్ధంబు ♦ పూర్ణంబు స్వప్రకా, శంబు నౌ నీదు త ♦ త్త్వం బరయక
మాయావృతాత్ములై ♦ మానుషుం డనుచు ని, న్దలఁతు రెల్లరుయము♦ల్దక్కనిట్టి
మాయికు నిన్నె నే ♦ మానిని నజ్ఞాను, రాల నెవ్విధిఁ గనఁ ♦ జాలు దాన
నైన నాకుఁ జొరవ ♦ యబ్బె నీ యెడ మేలి
వ్రాతఫల మొకో; పు ♦ రాణపురుష
యోపి నంత లిడుదు ♦ నోంనమోనారాయ
ణాయ యనుచు నీకుఁ బ్ర ♦ ణతులు భక్తి. ౧౨౭

క॥ పరమదయానిధి నిన్నొక, వర మడిగెద నర్థి భక్త ♦ వరదుఁడ వగుటన్
గరుణింపు మయ్య దాన, న్దరియించెద నల్లనన జ ♦ ననసాగరమున్. ౧౨౮

సీ॥ చేలమిం చొగి మించ ♦ జిగిమే న్మొగిలు వెల్లి, కొల్లగాశుభములు♦గురియుచుండ
మోము దామరపువ్వు ♦ మ్రోల నాడెడు సిరి,పొదలికఁ జిఱునవ్వు♦పూనుచుండఁ
దమ్మిరేకులపైఁ బొ ♦ దలుతేనె పోల్కఁగ,న్నులఁగృపారసముజొ♦బ్బిలుచునుండఁ
బ్రొద్దువంగడ మాట ♦ కుద్దిగా నొక మేటి, తేజంబు దెస లొంటఁ♦దివియుచుండ
మేలి శరచాపములు భూష ♦ లోలి మెఱయ
వెలయు నీ దివ్యమంగళ ♦ విగ్రహంబు
మామకహృదంతరమున నే ♦ మఱక నిలువఁ
జేసి ననుఁ బ్రోవవే దయ ♦ సేసి రామ. ౧౨౯

క॥ అని యివ్విధంబునను వగ; లనుఁ దలఁగిన తెలివి తేట ♦ లాలిత్యము లౌ
నన నెక్కొను దక్కులున, వినుతింపఁ గఁ దగిన మేలి ♦ విధ మొప్పారన్. ౧౩౦

తోటక॥ త్రయి నా వినుతించెను ♦ రాముని స
న్నియతి న్మునిపత్ని య ♦ నిందిత వి
స్మయ మేమి తదంఘ్రిర ♦ జం బపు డో
మయి తచ్ఛిర మెక్క న ♦ హార్యసుతా. ౧౩౧

క॥ రాముని వలనం బొడమిన, రామ పరానందకలన ♦ రాజిలు టరుదే
నా మెఱయం గనిమెం గడు, నా మెఱుఁగుంబోఁడి పొగడు ♦ నయ్యెడఁ దన్వీ.

ఆ॥ అటు నుతించి సాధ్వి ♦ యన్న న న్నత్రింటి
కనువు మయ్యా నెయ్యా ♦ మలర నింకఁ
గొన్న మగని మౌనిఁ ♦ గన్నతండ్రిని నిన్ను
గొలిచి తలఁచి ముక్తిఁ ♦ గొందు ననిన. ౧౩౩

క॥ ఆ మునిసతి భక్తికి రఘు
రాముఁడు ముద మంది యభయ ♦ రమ నిడి యెపుడ
మ్మా; మము మఱవకుమా; చను
మా; మునిశుశ్రూష నెగడు ♦ మా; యనియె నుమా. ౧౩౪

ఆ॥ కలిగె నెన్ని జగతిఁ ♦ గంజాక్షు లీలావ, తారములు దలంప ♦ దాశరథికి
సాటి రా వటంచుఁ ♦ జాటుచు నబ్బోటి, గౌతమర్షిఁ గదియఁ ♦ గదలుటయును.

వ॥ అత్తపస్వి సత్తముండు నత్తఱిం దర్షప్రకర్షసమాటీకంబగు హర్షాతిరేకంబునం బొనరారుచుం బొడసూపి. ౧౩౬

క॥ ఆయమఁ గొనిరాముని పద, తోయజములఁ బూజసేసి ♦ స్తుతిపాఠము ల
త్యాయతములు గాఁ గూర్చి శు, భాయితుఁడై చనె ననుజ్ఞఁ♦బడసి గుణజ్ఞా.

ఆ॥ అగడు దలఁగెఁ బూజ్య ♦ యయ్యెఁ బావని యన
బరఁగె శుభము లోకటఁ ♦ బాలుపడఁగ
మగని మన్ననలను ♦ మానోంచె మానిని
రామపదపరాగ ♦ రమఁ బురంధ్రి. ౧౩౮

సీ॥ భక్తి నెవ్వఁడు రఘు♦పతి నహల్య నుతించి, నట్టియాశుభవాక్య♦లహరహంబుఁ
బఠియించి శ్రీరాము ♦ భావించి సేవించు, వాఁడు పాపౌఘము ♦ ల్వదలి బ్రహ్మ
పదము గాంచును దేనిఁ ♦ బడయ నెవ్వాఁ డెంచు,నదిస్వర్గమునను న్న♦నతనికబ్బు
లీలమైఁ బత్రిక ♦ లిఖియించి పూజించు, వానికి వైకుంఠ ♦ వాస మమరు

సడల కుందును లక్ష్మిస్మ యె ♦ ల్లెడల నాప
దలు తల లోకింత శెత్తక ♦ తలఁగి చనునఁ
గౌసలేయుండు మునిపత్నిఁ ♦ గాచినట్టి
కథఁ దలఁచునంత వికచపం ♦ కజదలాక్షి. ౧౩౯

—♦ విశ్వామిత్రుఁడు శ్రీరాముని బహూకరించుట ♦—

క॥ అంతలు సేసిన రాముని, వింతలు పోఁడుములు మదికి ♦ వేయు విధములై
సంతసముఁ బెనుపఁ బరవస, మెంతయు మేకొన నసీద్ర ♦ శేచ్ఛాంచితుఁడై.

క॥ కవ్రుఁగిటఁ బొదివి తపస్వి; ప్రవరుఁడు లలితదరహాస ♦ భాసురముఖుఁడై
వివిదిషుల మనుపు తలఁపున, నవప్రకారంబ పో యు ♦ సంగా ననియెన్. ౧౪౧

ఆ॥ పెద్దతపము సేసి ♦ పెనుపొంది నేఁడిట్లు, మేలుకొంటి నీను ♦ మెల్పు గొంటి
వాసిగంటి సాటి ♦ వారిలో నుత్తము, శ్లోకుఁ డనఁగ రఘుకి ♦ శోర; రామ;.

క॥ నాభాగు భాగ్య మట్టులె, నాభాగ్యముఁ బొగడ నయ్యె ♦ నాకేశున కిం
దేభాగ మర్థి నిడుదు మొ, శ్రీభామాచిత్తచోర; ♦ చిద్రససారా. ౧౪౩

క॥ ఇఁకఁ బుణ్యశ్లోకుండు జ, నకు జన్మము గాంతు మటఁచి ♦ నాకిశరాస
ప్రకటితవీర్యుఁడవై మ, మ్మకలంకసమజ్ఞులుగ స ♦ మర్థింపంగన్. ౧౪౪

సీ॥ జిగివెన్నెలలు చిల్కు♦నగుమోము నెల తెల్పి, కంబుజంబులు వికా♦సం బెనయుట
ప్రొద్దునట్టునఁ బుట్టి ♦ పొలుపొందు తేజానఁ, దివిరి చకోరము ♦ తృప్తి గనుట
పుడమిపై నడయాడు♦పుడుకుమ్రాఁకిది యని, నిలఁబడి మొఱుఁగుఁదీ♦వలు వలచుట
గమకించు నీలమే ♦ ఘచ్ఛాయఁ గని చొక్కి, హంసావళుల కుల్కు♦ లనువుపడుట
వింత లింతలు చూపు నీ ♦ విధము గాంచ
రమయె పలురూపు లెనసి తా ♦ రాఁ గడంగ
మగ లనఁగ నెంత యింతుల ♦ మాట యెంత
విశ్వమోహనచణ; రఘు ♦ వీర; రామ. ౧౪౫

ఆ॥ అనిన రాకొమారు ♦ లరుసం బెసంగ వి, నమ్రము లగుచు మౌని ♦ నాథుతోడి
నీడ లనఁగఁ దొడర ♦ నిమివంశవర్ధను, యజనశాలఁ బెరయ ♦ నరుగుచుండ.

శా॥ యాతాయాతజనంబు తత్క్రతునమ ♦ స్యావైభవం బెంచి య
స్తోతంకు న్నృపు మెచ్చి కన్నియల భా ♦ గ్యంబు ల్వితర్కించి ప్ర
ద్యోతుం డమ్మునిఁ గాంచి రాకొమరుల ♦ న్దోడ్తోఁ బ్రశంసించి శ్రీ
చేతోవల్లభు చిద్విలాస మెడఁదం ♦ జింతించి యుప్పొంగఁగన్. ౧౪౬

—♦ శ్రీరామ లక్ష్మణులు ముని పరివృతులై జనకుని యజ్ఞశాల కరుగుట ♦—

క॥ ప్రాగుత్తరదిశ కట పయి, నా గుణనిధు లేగి దేవ ♦ యజనస్థలిదా
సౌగుణ్యముఁ బరికింపఁగ, వే గడచిరి పథము శ్రుతివి ♦ విక్ష్వారజ్ఞా. ౧౪౮

ఆ॥ జనకు రాజధాని సౌరు తీరునకు న, దూర మగుచుఁ దోఁడు ♦ తోఁన పెరుఁగు
నభ్యుదయచయముల ♦ కాటపట్టగు క్రతు, వాటి సేరఁ జనిరి ♦ వార లగజ.

సీ॥ ప్రాఁబల్కు పడతుక ♦ ల్పడయు సౌభాగ్యంబు, విబుధసూక్తివిలాస ♦ విస్తరంబు
సంయమిప్రకరని ♦ స్తాప్రసాదోదయం, బెల్ల వేల్పుల పాల ♦ వెల్లి పెల్లు
యాచకాలిరసప్పృ ♦ హావసంతాగమం, బెలయు చుట్టటికంబు ♦ పొలము పంట
సకలకలాస్థాన ♦ సామ్రాజ్యయోగంబు, నిభృతామృతస్యంది ♦ నీఫలంబు
ప్రాంచితజ్ఞానవల్లిక ♦ పట్టుకొమ్మ, నిర్విశేషపరానంద ♦ నిర్వహణము
ధర్మమేఘము జనకు న♦ధ్వరము గాంచె, నాత్రయి జగత్త్రయావన♦వ్యగ్ర మగుచు.

క॥ ఆ సమయంబున రాముఁడు, శ్రీసంప్రజ్ఞానఘనుఁడు ♦ సిరి దళుకొత్తఁ
భాసురు మునిఁ గని యిట్లను, భాసము పేతదరహాస ♦ పరతంత్రముగన్. ౧౫౧

సీ॥ జనకు మహాత్ము య ♦ జ్ఞసమృద్ధి సాధ్వియై, తనరుచున్నది తపో ♦ ధనవరేణ్య
పలువేవు రగ్రజ ♦ న్ములు వేదమూర్తులుఁ, బరదేశవాసులుఁ ♦ బరఁగి రిచటఁ
గాన వచ్చెదు నవే ♦ కా ఋషివాటముల్, శకటీశతసహస్ర ♦ సంకులములు
నివసింతు మెచ్చోట ♦ నిర్ణయింపవె యెద్ది, యొరలేని యొఱపునై ♦ నుండఁగలదొ
యనిన మేలటంచు ♦ నట్టిదేశంబు ని
దేశమునకుఁ గూర్ప ♦ దిటవు గాంచి
రది వివిక్త మగుట ♦ నమృతోపమరసాప
యుక్త మగుట మెచ్చి ♦ యొలయు మతిని. ౧౫౨

ఆ॥ అచటి వార లవశ ♦ హార్దాకృతికచిత్త, నృత్తులై తదేక ♦ వేద్యకలనఁ
బెరయ జనకునకు ని ♦ వేదించి రందుఁ గొం, దఱు సముత్కులై ని ♦ తంబగుర్వి.

మ॥ అది యుత్సాహమొ యుబ్బొ వేడ్కయొ గుణా ♦ ఢ్యత్వంబొ సద్ధర్మమో
విదితంబో సుఖభావమో ధృతియొ ని ♦ ర్వేలప్రభావంబొ యె
య్యదియో యన్నియొ తోఁచ దాత్రయి యనన్ ♦ జ్యానాథుఁ డొప్పెం గడున్
బదిలం బౌఁ గద ప్రాజ్ఞచిత్తకలనా ♦ ప్రామాణ్య మిట్లెంతయున్. ౧౫౪

తే॥ వచ్చి రనునంతఁ దనపాలి ♦ వార లనియెఁ
జొచ్చి రనునంత మే లిల్లు ♦ సొచ్చె ననియె

మెచ్చి రనునంత విధి తన్ను ♦ మెచ్చె నని యెం
దనమ ప్రతిభ మెు గురుబోధ ♦ తత్త్వకలయు. ౧౫౫

చ॥ ముని నుడి విన్నదే మొదలు ♦ ముప్పిరిఁ దార్కొను కోర్కె లెల్ల నె
మ్మనమున నొక్కఁడై తదను ♦ మానపథంబున కెక్కి యాద్యభూ
మి నెసఁగు కూర్మిమై ననుప ♦ మేయపదం బిడె యంచుఁ బొంచు కా
మన కిటు నేఁటికిం గలిగె ♦ మంచిఫలం బనె భూపుఁ డత్తఱిన్. ౧౫౬

ఆ॥ తనదు కామ మటులె ♦ తద్దర్శనోత్సుక, తం బొసంగ రాత్మ ♦ తద్వయాంచి
తుం దపస్విశశి నె ♦ దుర్కొనె ధర్మార్థ, సహితమోక్షకలన ♦ త్త్వవిభుండు.

—♦ జనకుండు విశ్వామిత్ర ప్రభృతుల నెదుర్కొని పూజించుట ♦—

క॥ మునులను నృపసుతులనుఁ దో, డ్కొని వచ్చిన బ్రహ్మమూర్తి ♦ గురు విశ్వామి
త్రునిఁ దఱియఁ జనె శతానం, దునితో ఋత్విజులతో వి ♦ ధుఁ బ్రఖ్యముఖీ.

ఆ॥ దీక్ష తలఁగకుండ ♦ తెఱఁగున కగునంత, వట్టు సేర నరిగి ♦ వారిఁ గాంచి
మంత్రయుక్తవిధుల ♦ మహిజాని పూజించెఁ, దోడివార లన్ని ♦ దొరయఁ జేయ.

ఉ॥ ఉల్లము పొంగ మేనఁ బుల ♦ కోద్గమ మొప్ప ముదశ్రుసంతతుల్
కొల్లగ మోము చంద్రు సిరిఁ ♦ గొల్కొనఁ జేయ మహీంద్రుఁ డాదరం
బెల్ల స్వకాకృతిం బెరసె ♦ నేమొకొ నా మునిసార్వభౌము సం
పల్లలితంబుగా గురుస ♦ పర్యలఁదప్త నొనర్చె నయ్యెడన్. ౧౬౦

ఆ॥ ఆ మహాత్ము జనకు ♦ నర్ఘ్యంబు ధర్మ్యంబు
ధర్మసారవేత్త ♦ తపసి తేఁడు
గొని ప్రహృష్టుఁ డగుచుఁ ♦ గొనకొని స్వకయాజ
కాధ్వరముల కుశల ♦ మడుగుటయును. ౧౬౧

క॥ తానునుఁ గుశలప్రశ్నము, లా నెఱి నొనరించి మించు ♦ హర్షాకృతిఁ దో
డ్తో నందఱఁ గొని చని త, త్స్థానసుఖాసీనులుగఁ బ్ర ♦ సాధించుధృతిన్. ౧౬౨

క॥ ఓ భగవంతుఁడ మును లీ, శోభనమూర్తులును నిన్నుఁ ♦ జుట్టి త్వదీయ
శ్రీభద్రోదయములు నా, వైభవముల నిలువ నిలుము ♦ వరపీఠమునన్. ౧౬౩

క॥ నావుడు వారటు లెనయం, గా నెలసితి నేఁడటంచుఁ ♦ గల్యాణశ్రీ
భావించు భావవిలసిత, మావిష్కృత మగుచు నెగడ ♦ నతడు తదాజ్ఞన్. ౧౬౪

తే॥ అవధరించి సోపాధ్యాయుఁ ♦ డటు సహర్త్వి
జుండు స్వపురోగతపురోహి ♦ తుండు నగుచుఁ
దగిన నెలవుల నిలిచి త ♦ ద్దయుఁ బ్రశంస
లొలయఁ జేసెడు తన మది ♦ నూహఁ బెనిచి. ౧౬౫

తే॥ విసఁ గన నెఱింగి యన మన ♦ మునఁ బెనంగి
యున్న తత్త్వంబు పొడకట్టి ♦ యున్నతత్వ
మునఁ దనరఁ గాంచియు నృపుండు ♦ మునిసుధాంశు
పదసుధాధారఁ గాంక్షించి ♦ పలికె నిట్లు. ౧౬౬

క॥ స్వాగతవా క్కాశంసయ, శ్రీగురువర; త్వత్కటాక్ష ♦ సిద్ధియె కుశలా
భ్యాగమముల కాస్పదమై, యాగమమై ముజ్జగముల ♦ ననుపొందంగన్. ౧౬౭

ఆ॥ కులము వెలసెఁ గలుష ♦ ములు వోయె బన్నంబు
సన్న మయ్యె నసము ♦ మిన్ను ముట్టెఁ
గొఱఁత లేక పండెఁ ♦ గోర్కు లెల్ల ద్వితీయ
సృష్టికర్త నీదు ♦ దృష్టి కతన. ౧౬౮

క॥ మిముఁ బోంట్ల రాక కెది మూ, లము నా నాకేమి వేల్పు ♦ లకు నే నగునే
తమ భాగ్యమె విశ్వామి, త్రమహితపద మొప్పఁ జెప్పఁ ♦ దద్వివరంబున్. ౧౬౯

క॥ ఎక్కడ నే నెక్కడ మీ, రెక్కడ నిక్కంపుఁ బెరిమ ♦ నిట వచ్చుట కొం
డొక్కెడ నోమిన ఫల మి, ట్లెక్కు న్బరమైన కాష్ఠ ♦ కేమను వాఁడన్. ౧౭౦

ఆ॥ నేఁడె శుభసమృద్ధి ♦ నెగడె జన్మము వేల్పు, లిట్టిదాఁ గూర్చి ♦ రిష్టఫలము
లెల్ల సుకృతి ననుగ్ర ♦ హీతుండఁ దన కింక. గొఱఁతలున్నె కోర్కె ♦ కొసరవలెనె.

క॥ ఈ యజ్ఞోపసదనమున, కీయిందఱ తోడ నీవ ♦ యేతేరఁగ నా
కై యింత లింత లని నా, శ్రేయము వర్ణింతు నెట్లు ♦ చిన్మయమూర్తీ. ౧౭౨

క॥ నా చేయు క్రతువు మహితం, బై చేతనఁ గాంచె నమరు ♦ లలరిరి తృప్తిన్
నీ చేయు పూరణంబున, శ్రీచేతోహారుని కరుణ ♦ సేకురు టరుదే. ౧౭3

ఆ॥ బ్రహ్మమూర్తి ; యింకఁ ♦ బంద్రెం డహంబులు
గడవఁ బూర్ణ మగునుఁ ♦ గ్రతువరంబు
గాంతు వేలుపులనుఁ ♦ గల్యాణ మెలయింతు
నీదు వర్గ మీవు ♦ నెఱసి యొకట. ౧౭౪

—♦ జనకుండు రాజపుత్త్రులంగాంచి ముచ్చటించుట ♦—

శా॥ మే లిప్పాట ఘటిల్లెనయ్యది జయో ♦ న్మిశ్రంబు రాగాహితు
లోన్నేల న్నిరిట రాఁగ నెల్లశుభము ♦ ల్పొందుం ద్రిలోకాలియు
ప్రాలేయాంశుముఖు ల్దనుర్ధరులు శుం భత్తేజు లిబ్బాలకు
ల్లీలామూర్తులు వీరి రాక మునివరా ♦ కీ తెల్పి మన్నింపవే. ౧౨౭

తే॥ శుభము నీకగుఁ దేజున ♦ శూరు లనఁగ
శూరులే వీర లెట్లును ♦ వీరులే కు
మారులే మారులే మహా ♦ ధీరులే యు
ద్ధీరు లెందునుఁగా రిక్క ♦ మారు లహహా. ౧౨౮

సీ॥ తాల్తురు మేటి కో ♦ దండము ల్దండము, ల్తమకూర్చునవె యాట ♦ తక్ష నెగడ
ఘనపరాక్రమలీలఁ గనుపట్టుదురు పట్టు, మరు మిత్తి కుత్తుక ♦ దొడకర నొత్తి
యాశ్వినేయనికార ♦ మవధరింతురు ధరిం, తురు రూపసారము ♦ ల్తోరములుగఁ
జంద్రసూర్యుల దశ ♦ ల్ననరింతురు వరింతు, రుచితనిత్యప్రకా ♦ శోన్నతులను
బోలుదుర కాక యొండొరు ♦ లొప్పల్ప నొప్పు, గారు వీరల కెవ్వారుఁ ♦ గాకపక్ష
ధారులై యుండి జగదేక ♦ వీరు లనఁగ, వీరు గనుపట్టుచున్నారు ♦ వివిధగతుల.
ఆ॥ వచ్చి రమరు లిచ్చ ♦ వచ్చియి ట్లిలకన్నఁ, గాళ్ల నడక యేల ♦ గలిగె వీరి
కెలయు మర్త్యు లన్న ♦ నీరూప మీతేజ, మీప్రభావగరిమ ♦ మెందు గలదు.

తే॥ ఎందులకు వచ్చిరో వీర ♦ లే మహాత్ము
సుతులో యేనార లేవంకఁ ♦ జొప్పడచిరో
యేమనఁగ వచ్చు నావున్నె ♦ మిన్నెలవు న
లంకరింపఁ దోడ్తెచ్చె ని ♦ శ్శంకముగను. ౧౨౯

క॥ ఒక్కఁడె ప్రమాణ మింగిత, మొక్కఁడె చేష్టాప్రకార ♦ మొక్కఁడె ప్రాయం
బొక్కఁడె రూపం బొక్కఁడె, చక్కని చతురుండు బళిర ♦ చతురాననుఁడే. ౧౩౦

చ॥ నిగనిగలాడు మేను సిరి ♦ నీటుల చోటగు మోము తెల్వికిం
దగు జిగినవ్వు సారు రతి ♦ దక్కొన నేలెడు మేలిచెయ్వు లి
ర్తిగ మొగసాలపైఁ గులుకు ♦ తిన్నని కన్నియ జోడు గూడు న
మ్మగ డిటు జంటగూ పెనసి ♦ మాకనులం దనుపం దనర్చెనో. ౧౩౧

ఆ॥ చూడ మెన్ని కనులఁ ♦ జొక్కించె నెవి యెన్ని
దలఁప మెద్ది యెడఁద ♦ దక్కఁగొనియెఁ

బలుక మెద్ది పలుకు ♦ బాటఁ దాఁటె నిటేది
యయ్య; తెలుపు మిట్టి ♦ వ్యక్తియుగము. ౧౮౨

క॥ తనకై తానె యిటులు మొన, సిన సిరికిన్ రభస మేల ♦ చెనయఁగ వలె నాఁ
జన దెక్కడు పరవసముం, బొనరింపదె శ్రేయ మెప్డుఁ ♦ బుణ్యచరిత్రా. ౧౮౩

—♦ కౌశికుండు జనకునకు దాశరథుల వృత్తాంతం బెఱింగించుట ♦—

ఆ॥ అనిన నతని వినయ ♦ మాదరంబు మృదూక్తి
తెఱఁగు భావకలన ♦ తెలివి తేట
లరసి యెడఁద మెచ్చి ♦ యమ్మహాభాగుండు
పలికె నర్థయుక్తి ♦ భాసిలంగ. ౧౮౪

క॥ అన్నియు నక్కరములె కన, నన్నియుఁ బదములె ధరిత్రి ♦ నటు వాక్యములే
యన్నియు నన్నియు బాసలె, సన్నుత యొకచో రసప్ర ♦ చారము సుమ్మా.

ఆ॥ వఱలు స్వాశ్రయాప్తి ♦ వలన నయ్యవి తోయ
బిందునమితశక్తిఁ ♦ బెరసి పోలె
నదియు వీని వలన ♦ నలరు హారావలి
కలనఁ దరుణికుచయు ♦ గంబు మాడ్కి. ౧౮౬

క॥ నీకును నీపలుకులకును, నీకలిమికి నీమహిమకు ♦ నెగడెను యోగం
బీ కువలయమున నేరికి, నీకరణి ప్రతిష్ఠ యొదవె ♦ నే సుగుణనిధీ. ౧౮౭

ఆ॥ వింటిఁ ద్వచ్చరితము ♦ వీనులు దనియంగఁ
గంటి నిన్నుఁ గనుల ♦ కఱవు దీఱ
మంటి పో యమీంద్ర ♦ మానితసద్వృత్తి
గంటి లేదు నీదు ♦ గరిమ కెపుడు. ౧౮౮

క॥ ఏ కర్జంబునకై నా, రాకయొ యది నీయదియ ధ ♦ రావర; తెలుపన్
నాకొలఁది కంశభాక్త్వము, నేకూరెడు నీదు మదికిఁ ♦ జిక్కడె యిదియున్.

సీ॥ ఎవని మండలి నిల్తు♦రెలమి జగము లొనర్పఁగ మన్పఁద్రుంపనే♦శ్వరులుమువ్వు
రేవేల్పు ప్రాఁబల్కు ♦ టిగురుఁబోఁడులు మెచ్చు, కేలీవిహారని ♦ కేతరాజ
మెవనికిఁ గైమోడ్పు ♦ లిడుదు రీరేడులో, కముల వా రాస్థఁ ద్రి ♦ కాలములను
నే కర్మసాక్షి క ♦ లాకాష్ఠ లాదిగాఁ, గల ప్రొద్దు లెనయింపఁ ♦ గారణంబుఁ
దపసికన్నాప మెఱయించు ♦ దంట నాలు
గన్నులకు మీఁద నైదవ ♦ యగ్ని భువన

హితుఁడు నేదేవుఁ డతని సం ♦ తతి యనంగఁ
గోత్రిత్తగాఁ జెప్పవలెనె నీ ♦ కును మహీంద్ర. ౧౯౦

సీ॥ ఆలపోఁత్రైన జం ♦ భారి నెక్కి వృషాంకు. కడఁక రక్కసులఁ జ ♦ క్కడఁచె నొక్కఁ
డటు వాని మానించి ♦ హయమేధములు నూటి, కొక్కొండు దక్కఁగా ♦ నొప్పె నొక్కఁ
డిలఁ ద్రవ్వి కపిలదృ ♦ గ్జ్వలితులైన పితరుల, భసితంబులపై గంగఁ ♦ బరపె నొక్కఁ
డితవిశ్వజిత్తుఁడై ♦ ఋషి శిష్యునకు నెద, నేఁడుచే గురిపించె ♦ హేమ మొక్కఁ
డాక రొకరి మీఱు ధన్యులఁ ♦ బ్రకటయశులఁ
బొడమి రిటు లెంద ఱెందఱో ♦ పుణ్యమూర్తు
లిక్కులంబున దశరథా ♦ ధీశుఁ డాజి
జితకలి వహించుచున్నాడు ♦ క్షితిభరంబు. ౧౯౧

క॥ నీ కూర్చునతఁడ కా నగు, నాకేశసఖుండు జగతి ♦ నాయకుఁ డా సు
శ్లోకాఢ్యుఁడు శ్రీరాముని ప్రాకట మంశంబ కాక ప్రాకృతుఁ డగునే. ౧౯౨

క॥ తా నఱువది వేలేండ్లొక్కఁ, డే నేల భరించి సుతము ♦ ఖేష్టాకుతుకం
జేనెఱి మది దక్కొల్గొన, దానాదిపరత కృతార్థ ♦ త ఘటింపమికిన్. ౧౯౩

వ॥ చింతించి నిజకులగురుండగు వశిష్ఠమునిసార్వభౌముని యానతి వడసి ఋశ్యశృంగ నాముని మానివరేణ్యునిం దోడి తెచ్చి తదుపదిష్టమార్గంబున ననర్గళంబుగ నశ్వమేధంబుం బ్రసాధించి యనుపదంబ తత్సమష్టిం బుత్రకామేష్టిం బొనరించుచున్నంత. ౧౯౪

తే॥ ఇచ్చెఁ బాయసభరిత మా ♦ హేమఘటము
మెచ్చి యజ్ఞేశుఁ డతఁడును ♦ మిగుల గార
వించు సతులకు ముగురికిఁ ♦ బంచి యిడె భు
జించి గర్భిణులై వారు ♦ సిరిఁ బొసఁగిరి. ౧౯౫

ఆ॥ ఇంతవట్టు చరిత ♦ మే యన నేమగు
నెల్ల యెఱుఁగు నీదు ♦ హృదయ ముదయ
మెఱుక పఱచు నెడల ♦ నెడల సుమాళంబుఁ
బరవసంబుఁ గూర్పఁ ♦ బరఁగు టరుదె. ౧౯౬

క॥ శోభనసంపదలో శ్రీ, శోభనమూర్తులొ స్వకీర్తి ♦ సురుచిరరుచులో
నా భూమిపతి సతులు త్రి, య్యాభలు దివ్యాభ లొలయ ♦ నలరారి రటన్.

క॥ కనె నగ్రమహిషి యొక సుతుఁ, గనెఁ గైక యొకని సుమిత్ర ♦ కనె నిరువుర నం
దనకల్పచతుష్కముతోఁ, దనరు నృపుఁడు పారిజాత ♦ తరువుం బోలన్. ౧౯౯

క॥ ఘనుఁ డీతఁడు రాముఁడు నాఁ, జను లక్ష్మణుఁ డితఁడు ♦ భరతశత్రుఘ్నులనన్
దనరుదు రివ్వారల యను, జను లయ్యెడ ద్వంద్వమిటు పొ ♦ సంగెదు నెపుడున్.

ఉ॥ పెద్ద సహోదరావలినిఁ ♦ బెద్ద గొనంబులఁ బెద్ద విద్దెలన్
బెద్ద విలాసవైఖరులఁ ♦ బెద్ద ధనుష్మదుదూఢవిశ్రుతిం
బెద్ద త్రిలోకమోహన న ♦ వీనకలాంచితరూపరేఖలం
బెద్దలకెల్లఁ బెద్ద పృథి ♦ వీవర; రాముఁడు రాముఁ డన్నిటన్. ౨౦౦

క॥ ఈ మోహనాంగులను నే, నా మహిపతి వేఁడి యధ్వ ♦ రావనమునకై
ప్రేముడిఁ దోడి తెచ్చితి నీ, శ్రీమహితుఁడు వెలసెఁ దద్వి ♦ శేషప్రమితిన్. ౨౦౧

సీ॥ జము దుంత నే వచ్చి ♦ చవిచూతు నను జంతఁ, గుశిఁ దాటక నొక్క ♦ కోలఁ గూల్చె
మిత్తి కోఁజలు హత్తి ♦ మేలమాడు సుబాహు, బూది గాలికిఁ బోల్చు ♦ వోనొనర్చె
మారి నా జడదార్ల ♦ మడఁచు మాయల మంద, మారీచు మున్నీట ♦ మాటికైచె
సిద్ధాశ్రమము పొంతఁ ♦ జెలఁగు తపోధను, ల్మేలు మేలన మేలి ♦ మెచ్చువడసెఁ
గోరి నటులె నాదు ♦ కోర్కెల్ల ఫలింప
సవనరక్షణంబు ♦ జరిపెఁ ద్రోవ
నంఘ్రిరజముచే న ♦ హల్య నీపతికైక
పావనుఁడు మగని ♦ పజ్జ కనిచె. ౨౦౨

క॥ దంపతు లవ్వా రఁల్లుని, లింపులుఁ బూజింప దివ్య ♦ లీలాంచితస
త్సంపదల దీవి యీవిభు, పెం పసయుం గంటి నాదు ♦ పృథుభాగ్యమునన్.

క॥ అలరితి నేనును దశరథు, చెలువపున లగ్గయ్యె ననుచు శ్రీమహితాస్త్రా
వళు లిడి తోడితెచ్చితి గర, గళు విల్లు నయోనిజాతఁ ♦ గన్నెఁ గనుఁగొనన్.

ఆ॥ అనినఁ బొంగి పొంగి ♦ యాతఁడో యానంద
మో యనంగఁ బొనరి ♦ మునివృషాంకు
నకును రాకొమారు ♦ లకు నొడ్లకును వస
తులు ఘటించె నపచి ♦ తులు పొసంగ. ౨౦౩

క॥ మొనయించె నంతిపురికిని, జనకుం డమ్మేలివార్త ♦ సంయమి మహిమ
ల్వీన రాజసుతులఁ గనఁ ద ♦ న్మనముల నొక వింతమాద్రి ♦ మార్కొనె నంతన్.

## —♦ శతానందుఁడు విశ్వామిత్రునిఁ గొనియాడుట ♦—

క॥ తన జనని శాపమోక్షణ, మును విని గౌతముని కొడుకు ముని యమ్మౌనిము
ఖ్యున కెరఁగి శతానందుఁడు, జనకపురోహితుఁడు పొసఁగ ♦ సంభ్రమమెసఁగన్.

తే॥ జ్యేష్ఠుఁ డతఁడు మహాతప ♦ స్సిద్ధిపరుఁడు
శ్రేష్ఠుఁ డురుతేజుఁ డట్టు సంత ♦ సించు టరుదె
చిద్ఘనుఁడు మౌని తల్లి దు ♦ స్స్థితి దొలఁగఁ
జేసి యవ్వార్త తన చెవిఁ ♦ జేర్చుచుండ. ౨౦౮

క॥ ఓపి శుభం బొడఁగూర్చిన, క్ష్మాపాలతనూజులం బ్ర ♦ సాదసుముఖులన్
శ్రీపతినిభుల సుఖస్థా, నోపగతులఁ గాంచి పలికె ♦ యోగఘనునితోన్. ౨౦౯

సీ॥ కాన్పించితే నన్నుఁ ♦ గన్నతల్లిని ముని, శార్దూల; శ్రీరామ ♦ చంద్రుఁ జేర్చి
యర్చించెనే మాత ♦ యమల యశస్విని, యతితపస్స్తవ ♦ న్యార్ఘ్యములనుఁ
బూజించెనే జగ ♦ త్పూజ్య పాదాబ్జంబు, లంబ తేజస్విని ♦ యఘము లెడల
విసిపించితే పురా ♦ తనము మజ్జనని వృ, త్తము విధికృతమర ♦ ధ్వఘుఁ బ్రభునకు
నీకుఁ బున్నె మయ్యె ♦ నియతాత్మ యాయమ
యయ్యెఁ గొలిచి మనఁగ ♦ నయ్యె నయ్య
యిరువు రేకవృత్తి ♦ నిమ్మహామహుని సే
వించి రయ్య సుకృత ♦ మెంచి రయ్య. ౨౧౦

క॥ రాముని నర్చించెనె శ్రీ, రామునిఁ గా నెంచి తపసి ♦ రాణఁ బెరసి యి
ద్ధామ మెనసి సత్క్రియల, న్నేమము మెఱసెనె పురాత్త ♦ నిష్ఠ వెలసెనే. ౨౧౧

క॥ శాంతుండై మద్గురుఁడు ప్ర, శాంతుం డియ్యనఘు రాక ♦ చర్చించి సుఖ
స్వాంతుఁ డయి యేతదీయా, ర్చాంతము లభివాదనంబు ♦ లందం గనెనే. ౨౧౨

క॥ అనునెడ విశ్వామిత్రుం, డనుగుణవాక్యజ్ఞుఁ డనున ♦ యజ్ఞు శతానం
దునిఁ గాంచుచు నను వెంచుచు, ననె నిట్లని వికసితాన ♦ నాబ్జుం డగుచున్.

ఆ॥ కడచి చనఁగ నీక ♦ కర్తవ్య మంతయుఁ, జక్కఁ బఱచినాఁడ ♦ సాధ్వి తపసి
తోడి పొందికలనుఁ ♦ దులకించె రేణుక, భార్గవుని ప్రసక్తిఁ ♦ బరఁగినట్లు. ౨౧౪

క॥ ఏ కొఱఁతలు లే వింకిట, శ్రీకాంతుం డితని యంఘ్రిఁ ♦ జెనయు రజము స
శ్రీకము సేయుర నాకె త్రి, లోకీపావని స్రవంతి ♦ లోఁగొనఁ జాలెన్. ౨౧౫

క॥ అని యమ్మహాత్ముఁ డెఱిఁగిం, చిన విని సందియము వీడి ♦ చిత్కల లొలయన్
జనితానందుండై యి, ట్లనియె శతానందమౌని ♦ యానందమయిన్. ౨౧౬

ఆ॥ నా కొలమ్ము యశ మ ♦ నాథ మెంచితి మన్ని
తమ్ము నయ్యఁ గూర్చి ♦ యగడు వాసెఁ
బావనులకు నయ్యెఁ ♦ బావని యామె యి
ప్పుణ్యు పాదరజము ♦ పొలముఁ బొరసి. ౨౧౭

శా॥ అన్నా; యేమనువాఁడ నీమహిమ నేఁ ♦ డా వింతలా నీ పను
ల్గన్నారం గని స్రష్ట యేనిఁ దెలియం ♦ గాఁ జాలఁ డిట్లన్న నా
కు న్నాబోంట్లకు శక్యమా సకలద ♦ క్షు న్నిన్ను తింపంగ మా
పన్నా లెన్నియు నోపునా యవిరతా ♦ పన్నావనప్రోన్నతా. ౨౧౮

క॥ ఎన్నియొ మది నిడి యిపు డీ, విన్నరపతిసుతులఁ దెచ్చి ♦ తేవారికి నీ
పన్నుగడ ఫలముఁగని శా, కెన్నటికిని దెలియ నయ్యె ♦ నే విమలయశా. ౨౧౯

క॥ కందు నిఁక ముందు నెన్ని య, మందానందముల నేని ♦ మఱి నీదయ నా
కుం దెలిసె నింత స్వాశతా, నందపదము సార్థకతఁ ద ♦ నర్చు నని మునీ. ౨౨౦

వ॥ అని యెల్లరం గలయం గనుంగొని యందఱు నతంద్రులరై కనుచు వినుచు నామోదించుచు నుండ శ్రీరామచంద్రుని యండఁ జేరితినని గండుమీఱి హర్షోపాత్తంబైన చిత్తంబు తదేకాయత్తంబు గాఁ బరవశత్వంబునం దనరారుచు నిట్లనియె. ౨౨౧

తే॥ స్వాగతము నీకు రామ; నీ ♦ సత్త్వ మింత
వెలసెనే మద్గురుఁడు నీదు ♦ విహిత మెంచి
పూజసేసెనె తల్లి ని ♦ న్బాగడి పొగడు
గనెనె యిమ్మేటి పొత్తునఁ ♦ గలిమిఁ గంటె. ౨౨౨

ఆ॥ అరసి కాక యిమ్మ ♦ హర్షిసత్తము నప
రాజితుం బ్రసత్తి ♦ యోజఁ బెరసి
యరుగుదెంచితే మ ♦ హాత్మ; మే ల్మేలు మా
పాలి దైవమవుగఁ ♦ బ్రాప్తి వెలయ. ౨౨౩

క॥ తపమున బ్రహ్మర్షిత్వం, బుపరితనం బెనసె నసదృ ♦ శోజ్జ్వలతేజ
స్స్వపరీతభువనుఁ డిమ్మే, టి పరమ గతి యని యెదఁ గ ♦ టించెదె యెపుడున్.

తే॥ మలసె నెల్ల లోకముల ని ♦ మ్మహాత్ము మహిమ
మీ ఘను చరిత్ర మసదృక్ష ♦ మింత యొరయు
టరిది నీచిత్త మరయని ♦ యదియు లేదు
రామ; నినుఁ బోలు నెవఁడు ధ ♦ రాతలమున. ౨౨౪

క॥ జనియించితి రవికులమున, ఘనుఁడు వశిష్ఠుండు దేర్పఁ ♦ గాంచితి విదితం
బనఘ; తపఃపరకాష్ఠా, త్మ నిమ్మహామహునిఁ బెరసి ♦ దొరసితి శుభముల్.

—♦ శతానందుండు విశ్వామిత్రుని తపఃప్రకారం బుపన్యసించుట ♦—

క॥ ఇమ్మహనీయు చరిత్రం, బిమ్మెగ నా యెరసినంత ♦ లెఱిఁగించెద శ్రే
య మ్మగు స్మృతిమాత్రన పా, పమ్ములఁ బోకార్పఁ జాలుఁ ♦ బావనమదియున్.

తే॥ సుమహితుండు విధాతృని ♦ సుతుఁడు కుశుఁడు
నాఁ జనుఁ దదాత్మజుఁడు కుశ ♦ నాభుఁ డనఁగ
గలఁడు రాజర్షి యతనికి ♦ గాధి యొడమె
విశ్రుతుండు జగత్ప్రథి ♦ తశ్రుతుండు. ౨౨౮

ఆ॥ గాధి యొక్క కూఁతుఁ ♦ గని భార్గవుఁడు ఋచీ
కున కొసంగె నాపె ♦ కూర్మిఁ గొలిచి
యమ్మహాత్ము వేఁడె ♦ ననఘ; నాకును మదం
బకునుఁ బుత్రవరము ♦ వలతు ననుచు. ౨౨౯

క॥ అనిన నతఁడు పుత్రేష్టిం, బొనరించి చరుద్వయంబు ♦ పుత్త్రియ మొసం
గెను బ్రాహ్మంబును క్షాత్రం, బును నివి మీ కిరువురకును ♦ భోజ్యము లనుచున్.

ఆ॥ వారు శుద్ధ లగుచు ♦ వచ్చి యచ్చరువు ల
చ్చెరువు దోఁపఁ గొంచి ♦ మురిప మూరఁ
దల్లి బిడ్డ లెఱుక ♦ దప్పి తప్ప భుజించి
రలఁతి యగునె నియతి ♦ యధికృతంబు. ౨౩౧

చ॥ తపసి యెఱింగి పత్నిఁ గని ♦ తల్లి కొసంగిన దానిఁ గొంటి వి
వ్యాపకృతిఁ జేసి నీకొదవు ♦ నంగన క్రూరుఁడు క్షత్రియుండు నా
గృపఁ గను మిట్టి నీవలనఁ ♦ గీర్తితు బ్రహ్మమయాత్ముఁ గాక పా
పఁపుఁ గడి నెట్లు గందు నని ♦ పాదములం బడి యొత్తి వేఁడినన్. ౨౩౨

క॥ వనితఁ గరుణించి నీకొడు, కనఘుఁడు బ్రహ్మర్షి యౌఁ ద ♦ దాత్మజుఁ డగుచున్
ఘనుఁ డొక శూరుఁడు క్రౌర్యము, పెనఁగొన వర్తిల్లుఁ బిదపఁ ♦ బెనుపు వహించున్.

తే॥ నీ జనని గర్భమున నున్న ♦ నిసువు బ్రహ్మ
మూర్తి తేజోనిధి ప్రభావ ♦ మునఁ బ్రశస్తుఁ
డగు ననుచు నాఘనుం ♦ డప్పు ♦ డానతిచ్చె
వార లట్టులె కాంచిరి ♦ దారకులను. ౨౩౪

క॥ అగాధితనయుఁ డంచితుఁ, డై గుణనిధి యనఁగఁ దనరి ♦ యనవద్యకలా
యోగమున నొప్పెఁ గంటికి, వేఁగగు తేజంబు వింత ♦ విధ మెఱిఁగింపన్. ౨౩౫

క॥ అహమహమిక నిగమాగమ, రహస్యము లెన్నఁ బెరసి ♦ రాణింప నయో
ద్వహుఁడై యుద్వోఢయునై, గృహస్థధర్మంబు నెఱపెఁ ♦ గీర్తితవృత్తిన్. ౨౩౬

సీ॥ కీలుబొమ్మలు వోలెఁ ♦ గెలని సాములు తన, చేసన్నకై నిరీ ♦ క్షించుచుండఁ
గన్నబిడ్డల వీర ♦ లన్న యొడ్డిమి నెంచి, ప్రజ లెల్లఁ దన మేలు ♦ పాటఁ గూర్పఁ
జాంచల్య మెడలి ని ♦ శ్చలయై కలిమికన్నె, రాణబంగరుగుండ్లు ♦ రాసి పోయఁ
దోడి చేడియఁ బేర్మిఁ ♦ దోడరి పంటవలంతి, కొన్నుకొన్నన పెచ్చు ♦ గడనఁ జూప
దవిలి ధర్మువు నాల్గుపా ♦ దముల నిలువఁ
జిఱ్ఱుమని చీఁదు టీయన్ని ♦ చెఱఁగులందు
లేదనుచు నెల్ల నాడుల ♦ వాద మొలయ
రాజ్య మేలెను లోకైక ♦ పూజ్యముగను. ౨౩౭

క॥ బహువర్ష సహస్రంబులు, సుహవంబులు వెలయఁ బ్రథిత ♦ సూనృతవృత్తిన్
మహనీయధర్మ మెసఁగఁగ, బహుశ్రుతుం డెలమిఁ బ్రజలఁ ♦ బరిపాలించెన్.

క॥ తామరతంపముగా రవి, ధామము సుతశతక మొప్పఁ ♦ దనకుం దానొం
డే మాద్రి యన భువనర, క్షామహితాశ్రమమునం బ్ర ♦ శంసితుఁ డగుచున్.

తే॥ ఘనవరూథిని యోజస్విఁ ♦ గదిసి రాఁగఁ
గదలి పురములు రాష్ట్రము ♦ లద్రులు వనులు
గిరులుఁ దిలకించు వేడుక ♦ గిఱికొనం బ
రిక్రమించె వసుంధర ♦ శక్రసముఁడు. ౨౪౦

—♦ కౌశికుండు వశిష్ఠాశ్రమమున కరుగుట ♦—

క॥ అక్షౌహిణి తనుఁ గొలువఁగ, నక్షోభ్యుఁడు సుతశతంబు ♦ నట్టిదయై ని
ర్విక్షేపంబుగఁ బ్రబలము, పక్షంబై తోడుతోడఁ ♦ బరఁగుచు నుండన్. ౨౪౧

వ॥ హృద్యం బగు పరిచంక్రమణవర్తనంబునం బ్రవర్తిల్లుచున్నవాఁ డొక్కనాఁ
డనుస్యూతంబైన యూవినోదనంబునకుం దోడు మృగయావినోదంబునం దవులు
కొని కుతూహలాయత్తంబగు చిత్తంబునం బరాయత్తుం డగుచు దుర్గమారణ్య
ప్రదేశంబునం దిరిగి తిరిగి పరిశ్రాంతుండై కడలు వట్టిన సంతానసంతానంబును
విచ్చిచనిన చతురంగసేనావితానంబును నెట్టకేలకుఁ గూడముట్టుజాడన తోడ
నరుగుచెంచుచుండ దైవయోగంబునం జేసి నిజకులగురుండగు వశిష్ఠమహాముని
వరుం డుండు నయ్యాశ్రమపదంబు సందర్శించి. ౨౪౨

సీ॥ కలవృక్షములు కల్ప ♦ కసవృక్షములు గాఁగ, ఫలలక్ష్మ్యసంపద ♦ భాసిలంగ
వివిధమృగంబులు ♦ సవిధయోగంబులు, సుతనిర్విశేషత ♦ పెంపు నింప
సిద్ధచారణముఖు ♦ లిద్ధచారణు లౌటఁ, బలికి శుశ్రూషోప ♦ పత్తి నెఱప
బ్రహ్మర్షివర్యు ల ♦ జిహ్మర్షిచర్యు లం, చితతత్త్వగోష్ఠి సం ♦ గతిఁ జెలంగ
నగ్నికల్పులు జలభక్షు ♦ లనిలభక్షు
లనశనులు పర్ణమూలము ♦ ఖ్యాశనులును
నౌ తపస్వులు సుతపస్య ♦ లలవరింప
నవరు గాంచిన యమ్మహా ♦ స్థలము దొరసి. ౨౪౩

మ॥ జితరోషు ల్జపహోమవేదపఠనా ♦ చింత్యోద్యమ్ము లొక్కగని
ష్ఠితు లాత్మస్థితు లస్తరాగులు మహా ♦ సిద్ధు ల్ప్రసిద్ధు ల్తపో
వ్రతదీక్షాఖ్యులు వాలఖిల్యులు ఘను ♦ ల్వైఖానసు ల్ప్రీతిసం
తతులై సెక్కొన బ్రహ్మలోకధృతిసం ♦ ధానంబుమానంబుగన్. ౨౪౪

క॥ తా నెగడెడు నయ్యాశ్రమ, మానందపదకేతుచిత్తుఁ ♦ డై యయ్యెడి యి
ష్టానతపఃప్రణిధానము, దీనిం బోలునె పదములు ♦ దివ్యము లనుచున్. ౨౪౫

క॥ మించిన కౌతుకమున న, భ్యంచిత మద్దాని నెంచి ♦ యచ్చటఁ దదశ్రీఁ
పంచితదృష్టి యయి ప్రవే, శించి ప్రశంసించి యుచ్ఛ్వ ♦ సిత మొప్పారన్.

క॥ జపతాంవరుని వశిష్ఠుని, దపతాంవరుఁ డవ్విభుండు ♦ దర్శించి తగన్
సుపరమ ప్రీతి పొనర సం, ప్రపత్తిమైఁ బ్రణతిఁ గూర్చి ♦ ప్రాంజలి యగుడున్.

తే॥ పుడమి యొడయఁడు శిష్యుఁడు ♦ పుణ్యచరితుఁ
డేగుదెంచె నితం డని ♦ యెలమి మీఱ
నర్ఘ్యపాద్యాదు లొసఁగి య ♦ య్యనఘుఁ డర్థి
గౌరవించి పరిశ్రాంతుఁ ♦ గాఁ దలంచి ౨౪౬

వ॥ స్వాగతంబు సంప్రశ్నించి సమంచితాసనంబున సుఖోపవిష్టు నొనరించి ఫలమూలాద్యుపాహారోపహారంబున నేద దేర్చి పరితుష్టునిం గావించుటయు మించిన యుల్లాసంబున. ౨౪౭

క॥ వనవన్యపదార్థంబులఁ, దనశిష్యుల వలనునందుఁ ♦ దపసుల దెసలన్
మునివరు గురు పరమతప, స్యనుఁ గుశలం బడిగెఁ గుశిక ♦ సంభవుఁ డెలమిన్.

ఉ॥ వెండియు గాధినందనుఁడు ♦ విశ్వజనీనచరిత్రుఁ డాత్మదో
ర్దండపరాక్రమక్రమణ ♦ తర్జితశత్రుఁ డుదాత్తమూర్తి యు

ద్దండతపఃప్రతాపు ఘన ♦ తాపసవంద్యు నశేషయోగిరా
ణ్మండలశక్రు బ్రహ్మముని ♦ మానితవృత్తితఁ గొల్చి యుండఁగన్. ౨౫౧

సీ॥ కుశలమే నీకు సం ♦ కోచంబు లెడలింతె, యెడయక దోసంబు ♦ నీసడింతె
ధార్మిక ; ధర్మంబు ♦ తవులున వర్తింతె, యోమెదే రంజనం ♦ బొలయఁ బ్రజల
రాజవృత్తంబు ని ♦ రతిఁ గాంతె భృత్యుల, నలరింతె తా రాజ్ఞ ♦ మెలఁగువారె
యెల్లవైరుల గెల్చి ♦ తే, మేలె కద పుత్ర, పౌత్రసుహృత్కోశ ♦ బలము లందు
ననుచుఁ బ్రేముడి యంతంత ♦ కతిశయిల్ల
నడిగె సల్లలితంబు గాఁ ♦ బుడమిఱేనిఁ
జెలఁగుచు వసిష్ఠముని విరిం ♦ చిప్రభవుఁడు
జపతపోయోగనిష్ఠాప్ర ♦ శస్తుఁ డపుడు. ౨౫౨

తే॥ అన్ని యెడలనుఁ గుశలమే ♦ యమివరేణ్య ;
కొఱఁత లుండునె; నీకూర్చు ♦ కూర్మిఁ బెనుపు
గాంచు ననుఁబోఁటి కనుచు స ♦ మంచితముగఁ
బలికె సుమహితతేజుఁ డ ♦ వ్వార్థివుండు. ౨౫౩

ఆ॥ అట్లు సుచిరకాల ♦ మా ధర్మనిష్ఠు ల, భీష్టములు సెలంగ ♦ నెలయు వేడ్క
భాషణము లొనర్పఁ ♦ బరఁగుచుఁ దత్తత్క, థావసాన మొకట ♦ నంద గనిరి.

క॥ భగవంతుఁ డగు వశిష్ఠుఁడు తగుతెఱఁగున నిట్టు లనియెఁ ♦ దద్దయు నగుమో
మగణితగురుధర్మంబున, ప్రగుణత్వం బెఱుక పఱపఁ ♦ బ్రజ్ఞాంచితుఁడై. ౨౫౪

ఉ॥ నీకును నీబలంబులకు ♦ నేఁ డొక విందొనగూర్ప నెంచి య
స్తోకవికాస మొయ్యఁ గను ♦ చున్నగ డొందెదు నెమ్మనంబు సు
శ్లోకుఁడు మానసీయుఁ డగుఁ ♦ జూవె జగమ్మున ఱేఁడె యట్లునుం
గా కతిథిత్వ మంది కనఁ ♦ గంటి గురుక్రమపూజ్యభావమున్. ౨౫౫

ఆ॥ చెలఁగి దీని నిచ్చఁ ♦ జేర్చి ప్రతీచ్ఛసే, యంగ నోపు దెట్టు ♦ లైన నీవ
యున్మనీష; యనుచు ♦ నొలయుచు సంప్రీతి, జాలుకొనఁగ నెఱపఁ ♦ జాలుటయును.

ఉ॥ ఆ మతిమంతుఁ డర్థపతి ♦ యా నెఱి నిట్లనె నంత యేల కా
నీ మహనీయ భాషితమ ♦ యింతకుఁ జాలక యున్నె వన్యమై
కామదమా ఫలాదికము ♦ కల్పిత మైనది సర్వపూజ్యతో
ద్దాముఁడ వీవు పూజ లిడఁ ♦ దత్పరత న్మది నెంచు టల్పమే. ౨౫౬

ఆ అర్ఘ్యపాద్యముఖ్య ♦ యర్హాణ యర్హుండ, నెఱపి తార్తిఁ బాపి ♦ నెగడఁ జేసి
తింక నేగువాఁడ ♦ సీక్షింపుము దయోప, నమ్రదృష్టి నీకు ♦ నతు లొనర్తు. ౨౫౭

ఆ॥ అని ప్రయాణ మర్థి ♦ నడరించు నర్థేశు, నమ్మహాత్ముఁ డుంచి ♦ తాదరమునఁ
దొడరి మఱి నిమంత్రి ♦ తుం బొనర్చె నుదార, ధర్మ క్షేత్రశక్తి ♦ తప్రలు వెనువ.

—♦ వశిష్ఠుండు సాసీకుండగు విశ్వామిత్రునకు విందొసంగుట ♦—

క॥ ఔఁగా కని గాధేయుం, డాగురు నానతిఁ దలంగ ♦ కలె నిలిచె మహా
భాగుఁడు విధూతకల్మషుఁ, డాగామికమునకుఁ గూర్చె ♦ నటఁ గల్మాషిన్. ౨౬౧

వ॥ శబలా; యని పేరుపెట్టి యాహ్వానించిన మించిన హర్షరసాతిరేకంబునన వేల్పు
మొదవు డాయ వచ్చిన నద్దానిం గనుంగొని సకలసేనాసమన్వితంబుగ నిమ్మహీ
మహేంద్రునకుఁ బొందుగ విందుఁ గూర్ప నెట్టన సముత్కృష్ట నిక్కర్షంబునకుం
దొడరి నెరవేర్ప నొప్పు నేస్తు రెట్లు మన్మనోరథం బమోఘంబుగా నొనర్పం జాలు
దీవ యనుచుం గామదుఘ నయ్యోగివరేణ్యుండు నియోగించిన మంచిది పో
యని యద్దివ్యసురభి నిజాసాధారణసామర్థ్యంబున భక్ష్యభోజ్యచోష్యపానీయం
బులు మున్నుగాఁ గలుగు సర్వపదార్థంబులు రాజభోగార్హంబులుగ క్షణకాలం
బున నుత్పాదించి యెల్లవారలం బరితృప్తులం గావింపం దొరకొనె నయ్యవస
రంబున. ౨౬౨

ఆ॥ చెఱకులును మధువులు ♦ శీధుమైరేయవ
రాసవములు భక్ష్య ♦ రాసు లించు
లాజ లోగిరములు ♦ నోజమై సృజియించెఁ
గామగవి ప్రకృష్ట ♦ కామ యగుచు. ౨౬౩

క॥ ఉష్ణాఢ్యవరాన్నగిరుల్, తృష్ణాశమనములు పాన ♦ దివ్యరసము ల
త్యుష్ణానుష్ణేతరము ల, కృష్ణ ఘొసంగించె సురభి ♦ కృతి భోజ్యమ్ముల్. ౨౬౪

ఆ॥ సారిది మృష్టభక్త ♦ సూపాత్రము లుచ్చావ, చస్వరసనురస్య ♦ షాడబనదు
లధిక గౌడసదము ♦ లటు దధికుల్యలుఁ, బొడమఁ జేసెఁ బుడుకుఁ ♦ దొడుకు కడఁగి.

క॥ బహురూపంబులు గాని త, న్మహిమ వెలసె ననఁగ ద్విజకు ♦ మారులు మఱియున్
మహిలామణులును వడ్డన, లు హితంబుగఁ జేసి రెదిరి ♦ లోఁగాను నేర్మిన్.

చ॥ సమయముఁ బొంచి తత్తదను ♦ చారముఁ గాంచి ప్రచార మెంచి స
ర్వము సుఖసార మేకరస ♦ రస్యము గాఁ బొనరించి పారవ
శ్యము సమకూర్చు భోజన మ ♦ హో యన హాయి ఘటిల్లఁ జేయఁ దా
రమృతము నీసడించు జను ♦ లైరి సభాజన మంది యందఱున్. ౧౬౭

ఆ॥ హృష్టపుష్టజనవి ♦ శిష్టము సంతుష్ట, శిష్టలోక మధ్య ♦ భీష్టలాభ
నష్టకష్ట మగుచు ♦ నరనాథు బల మెల్ల, నుల్లసిల్లెఁ దపసి ♦ యోగ మరసి.

తే॥ విస్మయమ్మున మునుఁగుచు ♦ విభుఁడు హృష్టి
పుష్టు లొప్పార మునిసృష్ట ♦ పూజ లెనసి
యొలసె సాంతఃపురవరుండు ♦ హితపురోహి
తార్యసామంతమంత్రిభృ ♦ త్యాన్వితుఁడుఁ గ. ౨౬౯

క॥ అచ్చెరు వానందము మదిఁ, బెచ్చు పెరుఁగఁ గోర్కిగముల ♦ పెనఁకువఁ బడి వె
న్నిచ్చు వివేకము సురభిని, మెచ్చి యొడియఁ జూడ నృపుఁడు మేకొను వేడ్కన్.

ఆ॥ ఎల్ల భోగములకు ♦ నిదియె పుట్టిల్లు నాఁ, దనరె రాజ్య మేల ♦ తను వ డేల
దీనిఁ బడయఁ గనిన♦యానాఁడె జగ మేలు, వాఁడఁ గాక యిఁక న♦వశ్యముగను.

—♦ కౌశికుడు సురభినిమ్మని వశిష్ఠుని వేఁడుకొనుట ♦—

ఆ॥ అని తలంచి కనిన ♦ యద్దాని నెప్పాట, వీడ కునికి దొరకు ♦ వెరవటంచు
నెఱుకసేయు పగిది ♦ నెఱిఁగి యెఱిఁగి గురు, వరునిఁ జేరి ప్రార్థి ♦ వలను మీఱి.

క॥ పూజార్హుండవు నీచేఁ, బూజితసత్కృతుఁడ నగుచుఁ ♦ బోలు పొందితి నీ
యోజము తేజము నందే, యోజ న్వినఁ బడెనె యన్యు ♦ లొరయరె తపముల్.

క॥ నా పలుకు విను మనయునే, నీపలుకుం బడినిఁ బోల ♦ నెందేనియు హృ
త్తాప మెడలింపు మియ్యది, పాప మనక బ్రహ్మమూర్తి ; ♦ పరిపాటి మెయిన్.

తే॥ గోశతసహస్రము లొసంగి ♦ కొందు దీని
నీ శబల నిమ్ము నాకు నీ ♦ కేల వలయుఁ
బార్థివుఁడు రత్నహారి నాఁ ♦ బరఁగుఁ గావె
యిదియు నాయదె యీ న్యాయ ♦ మెదఁ దలంప. ౨౭౪

క॥ ఇచ్చెద నీశబలకు నీ, మెచ్చున కగు గోశతముల ♦ మేదిని నేనిం
బొచ్చెము లేకర్పించెద నచ్చఁపునెనరుమెయి నొసఁగు ♦ మయ్యా ; దీనిన్.

క॥ ఇది చేని కర్హ యగునే, యదనున నేని న్బదార్థ ♦ మనుపుపఱప నీ
మది నెద్ది తలఁతొ యయ్యది, పదిలపడున కాదె యిదియు ♦ భావింపు మెదన్.

క॥ పాయక వనవాసవ్రత, మే యకలంకముగఁ దలఁతు ♦ రీ రటు గాన
న్నా యొద్ద నుండు నిది నా, నీయెడ నెర వొకఁడు గలుగ ♦ నేర్చునె యనఘా.

తే॥ అనుచు వేఁడినఁ బుణ్యాత్ముఁ ♦ డకట; యీతఁ
డేలొకో యిట్లు లోలత్వ ♦ మెనసె నని మ
హాత్ముఁ డమ్మౌని బోధించె ♦ నల్లనల్ల
దాని నాన్యసామాన్యమా ♦ తత్త్వ మెల్ల. ౨౭౯

ఆ॥ నూర్లు వేలు కోటి ♦ నూఱులేనియు గోవు
లమితరత్నరజత ♦ హాటకాద్రు
లీ వొసంగ నైన ♦ నిది యీయఁ దగనిద
యాత్మవంతు కీర్తి ♦ యట్టు లెపుడు. ౨౮౦

తే॥ హవ్యకవ్యము ల్విహిత ల ♦ ర్చాలు ప్రాణ
యాత్రయును బలిహోమాగ్ని ♦ హోత్రములునుఁ
గామ్యకృతులు స్వాహావష ♦ ట్కారములును
విద్యలును దీని వశములై ♦ వెలయుచుండు. ౨౮౧

క॥ నా సర్వస్వం బిదె సు, మ్మే సత్యమ పలుకువాఁడ ♦ నిటు తుష్టికరీ
శ్రీసముపేత నొసఁగఁ బో, నీసన్నిధిఁ బాసి యదియు ♦ నేఁగ దెచటికిన్. ౨౮౨

క॥ అని భగవంతుఁడు ముని గురుఁ, డనఘుఁడు ధర్మస్వరూపుఁ ♦ డైన వసిష్ఠుం
డనితరముగ బోధించినఁ, దన కొదవిన తలఁపు ఱేఁడు ♦ దలఁపఁడు తలఁగన్.

క॥ పల్లమునకు వే చను జల, మల్లన మరలింప నొంటె ♦ కగు నెటు లెట్లుం
జెల్లింపన తలపెట్టెను, బల్లిదుఁ డతఁ డిచ్చఁగొనిన ♦ పంతం బంతన్. ౨౮౪

సీ॥ పలికె నీ కొసఁగెదఁ ♦ బదునాల్గు వే లెంచి, కరివరమ్ముల స్వర్ణ ♦ పరికరముల
నెనిమిదినూ ర్లిత్తు ♦ హేమరథములు స, స్వణికింకిణీకము ♦ ల్మహితహయము
లేకాదశసహస్ర ♦ మిచ్చెద సింధుజ, ముఖ్యకులీనాశ్వ ♦ ములఁ గడంగి
వివిధవర్ణ విభక్త ♦ ల వయస్థలం గూర్తు, నొకకోటి యాలఁ బీ ♦ నోధ్నుల నొగి

నిచ్చు వచ్చిన మేరకు ♦ నెన్నియేని
రత్నముల స్వర్ణరాసుల ♦ రహిఁ దలిర్ప
నర్పణము సేయువాఁడ నా ♦ యను వెఱింగి
శబల దీని నా కీవయ్య; ♦ సంయమీంద్ర. ౨౮౫

క॥ ఆత్రపడుచు నటు విశ్వా; మిత్రుఁడు తఱిమి తను వేఁడ ♦ మెయికొనఁ బోఁ డ
చ్ఛాత్రుని దెస చల మరసి ప, విత్రుఁడు గురువర్యుఁ డసిన ♦ విధి బల మసదే.

క॥ ఇదె రత్నం బిదె ధనచయ, మిదె సర్వస్వ మన నిద్ది ♦ యే జీవిత మి
యృదె దర్శపూర్ణ మాసము; లిదియే సహదక్షిణాక ♦ లిజ్యలు తపమూర్. ౨౮౭

ఆ॥ ఒరసి తెలుసుకొను మ ♦ హిమా కామదోహిని
దీని వీడ నొంకు ♦ తెఱఁగు గలదె
పెక్కుమాట లేల ♦ పృథివీశ; యిద్దాని
నీయఁ జాలఁ దలఁపు ♦ మెట్టులైన. ౨౮౮

క॥ అని స్పష్టముగా నొడివిన, మునితత్త్వ మరసియు విభుఁడు ♦ మోహావశుండై
జనితామర్షత భిన్నప, థనివిష్టస్వాత్మవృత్తిఁ ♦ దనరారుటయున్. ౨౮౯

ఆ॥ జేని భావ మరసి ♦ మాని యద్దాని నీ
వడిగి యిచ్చమెయిన ♦ యాఁచికొమ్ము
పొ మ్మనంగ నతఁడు ♦ పోదివి కొంపోవంగ
బలిమికలిమి నెంచి ♦ పట్టుకొనియె. ౨౯౦

—♦ విశ్వామిత్రుఁడు కామధేనువునుఁ నిర్బంధించి కొనిపోవుట ♦—

తే॥ అటు మహాత్ముఁడు ఱేఁడు త ♦ న్నాక్రమింప
నీయమాన యగుచు నా య ♦ నింద్య శబల
యార్తయై శోకకర్శిత ♦ యగుచు నెడఁద
నిట్లు దలపోసుకొనెఁ దప ♦ స్వీడ్య; రామ; ౨౯౧

ఉ॥ మానివరేణ్యుఁ డీసుజన ♦ మానితుఁ డేలొకో తన్ను వీడె నే
డేనను దుఃఖితాత్మ నయి ♦ ధృష్టులచేఁ బడి పోవు దాననే
యానతి మీఱి వర్తిలఁగ ♦ నైతినె యేమిటి కిట్టి నన్ను దు
ర్మానుల పాలుసేసె నో ప్ర ♦ మాణముఁ దప్పి చరింప నెంచునే. ౨౯౨

క॥ అని నిట్టూర్పులు విడుచుచు, ఘనతాపక్రాంత యగుచుఁ గనుకని నమ్మా
న్యునిఁ గాంచి కాని యరయం, జన దీవిప్లవ మటంచు ♦ సంభృతధృతియై.

క॥ కడిమి మెయి నృపతి మూఁకల, బడలుపఱిచి మునివరేణ్యు ♦ పజ్జకుఁ జని న
న్నెడలింపఁ దలఁతె యిక్కాల, బడుగులచేఁ బడ నొనర్పఁ ♦ బాడియె నీకున్.

ఆ॥ బ్రహ్మసుతుఁడ వంచు ♦ భగవంతుఁడ వటంచు
నిన్ను బలసి కొలిచి ♦ నెగడు చుంటిఁ
దోడఁ బుట్టు వల్లు ♦ ద్రోచి యీదుష్టుల
కొప్పఁ జెప్ప నేమి ♦ తప్పు దోఁచె. ౨౯౫

తే॥ అనుచు శోకసంతప్తాత్మ ♦ యగుచు సురభి
మాతృవత్పూజ్యమాన స ♦ న్మాన్యమూర్తి
మేఘదుందుభిరావంబు ♦ మెయిఁకొనంగ
బాదముల వ్రాలి యొప్పెడు ♦ పలుకుబడుల.  ౨౯౬

ఆ॥ అనుడుఁ బుడుకుఁదొడుకుఁ ♦ గని నాదు నేరంబు
గాదు పుడమిదొరకుఁ ♦ గడలుకొనిన
దుడుకుతనమ యేనుఁ ♦ దొడర లేకి ట్లుంటి
నతని ప్రాభవము స ♦ మధిక మగుట.  ౨౯౭

మ॥ బల మక్షౌహిణి తన్నుఁ గొల్వఁ బ్రబల ♦ ప్రాధాన్య మొప్పన్ సుతుల్
బలవంతు ల్తల మీఁక తోడఁ దొడరన్ ♦ బాలించునాతండె దు
ర్బలులం బాల్యుల వేఁప మత్తుఁ డయి ద ♦ ర్పం బొప్పఁ బై వచ్చినన్
గలదే తేర్కొను మార్గ మొండొకఁ డుపే ♦ క్షాకల్పకల్పం బిలన్,  ౨౯౮

ఆ॥ అని వశిష్ఠుఁ డనిన ♦ నాఘ్నృష్టి సంకష్ట, యై విసీత మనఁగ ♦ నైన వచన
వర్య మది సృజించె♦వచనజ్ఞ బ్రహ్మర్షి, ఘనరచనకుఁ బ్రతీవ♦చనము గాఁగ.౨౯౯

క॥ అమితప్రభుఁడవు నీవి, ట్లు మఱుఁగుపడ నాకె దేల ♦ [illegible]పెనయునె నీ
ప్రమితేతరమగు నోజము, సుమహత్తర మగుట యేనుఁ ♦ జూచి యెఱుఁగనే.

ఆ॥ బ్రహ్మమూర్తి బ్రహ్మ ♦ బలము మ్రోల సవెంత
క్షత్రబల మతండు ♦ క్షత్రియుండు
నిన్నుఁ బోల నేర్చు ♦ నే యెన్నటికి మరా
సదమ నీదు తేజు ♦ చర్చ యేల.  ౩౦౧

తే॥ ఓమహాభాగ ; త్వత్ప్రభా ♦ వోదితబల
నన్నుఁ బనుపు మొకం డెద ♦ నేన్న నేల
యాదురాత్ముని బల మెల్ల ♦ ననుపదంబె
నాశనముసేసి వచ్చెద ♦ నవయ వలదు.  ౩౦౨

—♦ కామగవి వశిష్ఠానుజ్ఞాతయై విశ్వామిత్రు బలంబుల నుఱుమాడుట ♦—

ఆ॥ అనుడు దానిఁ బీడి ♦ తాత్మకఁ గనుఁగొని
యామహాయశుండ ♦ హా మ్మటంచు
నడరు నలుకఁ జనుము ♦ తొడరుము నీ యిచ్చ
వచ్చినట్టు లనిన ♦ వలను మెఱయ.  303

చ॥ చని నృపుసేనఁ జొచ్చి మొయి ♦ సాఁచి విజృంభితశక్తి వేల్పుగి
డ్డి నెగడ దాని మేనునఁ గ ♦ డిందిమగల్ జనియించి రాస్త్రసా
ధను లగుచుం దురుష్కులు మ ♦ దప్రహితాత్ములు వేనవేలుగాఁ
గనలుచు వారలంద ఱిల ♦ గ్రక్కదలం గవియంగ నుద్ధతిన్. ౩౦౪

తే॥ వజ్రఁపుందునియలఁ బోలు ♦ వారి గిట్టి
నిహత యయ్యెను నృపుసేన ♦ నిమిషమాత్ర
నతఁడు కనుఁగంట నట్టిదౌ ♦ సగడు గాంచి
క్రుద్ధుఁడై యుద్ధమునకు సం ♦ నద్ధుఁ డగుచు. ౩౦౫

క॥ ఉచ్చావచవరశరముల, నుచ్చైశ్శ్వరవిజ్ఞుఁ డధిపుఁ ♦ డొగిఁ బప్లవులన్
గ్రొచ్చె సమయించె రోసం, బచ్చెరువుగ రూపు గొన్న ♦ యట్లగుచు వడిన్.

సీ॥ వెండియు గావించె ♦ వేల్పుటా వలుకమై, యవనమిశ్రితుల శ ♦ కాఖ్యభటుల
వారలతిప్రభా ♦ వంతులు చెలరేఁగి, యవని నాచ్ఛాదించి ♦ రలఁతిఁ బోక
యమ్మహావీరులు ♦ హైమకింజల్కాభు, లట్లు హేమాంబరు ♦ లసిముఖాస్త్ర
ధారులై క్రొచ్చు ♦ తెరమునఁ బొదివి ని, ర్దగ్ధఁ జేసిరి భూమి ♦ దయితు సేన
నడఁచి కౌశికుం డ ♦ హర్పతినిభుఁ డస్త్ర
వృష్టి సురభిబలము ♦ వెలయనీక
చెను పడంప గురుఁడు ♦ ప్రేరేప మఱిమఱి
సృష్టి గూర్చె నది ప్ర ♦ కృష్టబలుల. ౩౦౬

వ॥ అద్దాని హుంభారవంబు వలన భానుతేజులగు కాంభోజులు నూధస్సువలనం బప్లవులును యోనిదేశంబు వలన యవనులు శకృత్ప్రదేశంబు వలన శకులును రోమకూపంబుల వలన మ్లేచ్ఛులు హారీతులుఁ గిరాతకులునుఁ బొడమి శస్త్రపాణులై పొడచూపి జన్యంబున రాజన్యసైన్యంబు సపత్తికంబు సగజంబు సాశ్వంబు సరథంబునుం గాఁ బొడవడంచి మించిన. ౩౦౭

తే॥ దాని యీ సెంచి రోషించి ♦ తద్దయు బహు
నాధములు ధరించి యా ♦ క్ష్మాతలేంద్రు
సుతశతిక మేచి చుఱచుఱ ♦ చూచి పాఱు
తబిసి యాక్షేత్రుణాగ్నిచే ♦ దగ్ధమయ్యె. ౩౦౮

ఆ॥ పుత్రు లట్లు గాఁగ ♦ భూరిబలమ్ము వ
మ్ముగ నడంగి చనఁగ ♦ మురిప మొడయ
సిగ్గుపడి విషణ్ణ ♦ చిత్తుఁడై వగ సెడె
శక్రసన్నిభుండు ♦ జనవిభుండు. ౩౧౦

శా॥ నిర్వేగంబు మహార్ణవంబు పగిది ♦ న్నిర్భగ్నదంష్ట్రంబు ని
ర్గర్వంబౌ నురగంబు మాడ్కి నుపర ♦ క్తం బర్కబింబంబు నా
నర్వాచీనతఁ గాంచి నిష్ప్రభతమై ♦ నారాజవర్యుండు త్రో
న్నిర్వేదంబున కాస్పదం బనఁ దగె ♦ న్నెక్కోలు కోల్పోవఁగన్. ౩౧౧

ఆ॥ పుత్త్రు లురుబలంబుఁ ♦ బో జెక్కు లెడలిన, వహ్ని భాతి క్రిన ♦ భాను నివసె
నా ప్రజాధినాథుఁ ♦ డావేగ ముద్వేగ, మెుక్కఁడై సమీహ ♦ నోయుచుండె.

క॥ అంతట నలుక వెగచి తోలుఁ, బంతముఁ జెనుపంగఁ దనరు ♦ భ్రశ్యత కెడలోఁ
జింతించి తపసి పసి బలు, వింత గలదె యింక బ్రమకె ♦ యిస్సీ యనుచున్.

వ॥ హతావశేషమాత్రు నొక్కపుత్త్రు క్షత్త్రధర్మంబున ధాత్రిఁ బరిపాలింపు మని పనిచి వనవాసవర్తనం బవధరించి కిన్నరోరగముఖ్యసేవితం బగు హిమవన్నగపార్శ్వంబునకుం జని యచ్చోట నిరవుకొని తపోనిష్ఠాపరుండై నిస్తంద్రనియమాతిరేకంబున నంబికానాథునిం బ్రసన్నతాసనాథునిం గావించి వరమండను భక్తసులభుండు నగు నమ్మహాదేవుని వలన సాంగోపాంగాథర్వణోపనిషన్మంత్ర తంత్రప్రయోగ రహస్య వశ్యంబుగ ధనుర్వేదం బెల్ల నధిగమించి యఖిలదివ్యాస్త్రంబులు నింద్రియగోచరంబులై తన్నుఁ బరివేష్టింప మున్ను మిన్న నొక్కట నజుమం జాలివివర్ధమానం బగు వీర్యాభిమానంబునం బర్వంబున సముద్రంబట్లు పొంగి పొరలుచు ఋషిలోకగరిష్ఠుం డగు వశిష్ఠుం డింక మడిసినవాఁడ కాక యని తలంచుచు దర్పాతిశయంబున ననుశయం బెడఁ బాసి వాసి కెక్క నెంచి యమ్మునివిభావసుని యాశ్రమంబు దఱియం జొచ్చి యస్థానికై మహాస్త్రంబులం బ్రయోగింప సమకట్టిన. ౩౧౪

—♦ కౌశికుండు రుద్రప్రసాదలబ్ధాస్త్రంబుల వశిష్ఠునిపైఁ బ్రయోగించుట ♦—

తే॥ దగ్ధమయ్యెనుఁ దాపసో ♦ త్తమునితా త
పోవనం బెల్ల నొక్కట ♦ బూదిప్రోవ
నంగఁ గనుపట్టె నచట ని ♦ ల్వంగ రామి
మునులు శిష్యులుఁ దలఁగిరి ♦ మోస మరసి. ౩౧౫

ఆ॥ విద్రుతంబు లయ్యె ♦ వివిధపక్షిమృగాదు
లాక ముహూర్తమాత్రిఁ ♦ నురవు సెడఁగ
నించు నన్నివాస ♦ మిరిణసన్నిభ మయి
కానుపించె మేలి ♦ కలన లెడల. ౩౧౬

క॥ పో వలవ దేనుఁ గలుగఁ గఁ, జావున కగువారె యనుచుఁ ♦ జాటుచు వేవే
దా వచ్చెం గులపతి ని, ష్ఠావిలసితుఁ డప్పు డాత్త ♦ సంరంభుండై. ౩౦౮

ఆ॥ భాస్కరుం డివంబు ♦ భంగి వీని నడంతు
నడల నేల యనుచు ♦ నచటఁ జేరి
యోరి మూఢ ; మూర్ఖ ; ♦ యోదురాచారుండ
యింక బ్రదుకువాఁడ ♦ వేర లేర . ౩౦౯

క॥ చిరసంవృద్ధం బాశ్రమ, సురరే; యిటు పాడొనర్చి ♦ తది చాలదె నీ
గురుయోగనిష్ఠఁ బెనుపఁగ, మురియకు మిప్పాటి తెలివి ♦ మొగకొనఁ గలదే.

ఆ॥ అని నరేంద్రుఁ దిట్టి ♦ యాథర్వణస్ఫూర్తి
మూర్తిఁ దాల్చె ననఁగ ♦ ముట్టఁ గవిసె
జముని దండ మట్లు ♦ సంవర్తవహ్ని నా
నడరు బ్రహ్మదండ ♦ మవధరించి. ౩౧౦

-♦ విశ్వామిత్రప్రయుక్తాస్త్రంబుల వశిష్ఠుండు బ్రహ్మదండముచే గ్రసించుట ♦-

క॥ ఆ రాజేంద్రుఁడు నట్లు స, మారబ్ధుండగుచుఁ బ్రబల ♦ మాగ్నేయాస్త్రం
బారూఢిఁ దాల్చి మునిపైఁ, దా రభసము మీఱ వైవఁ ♦ దార్కొని కడిమిన్.

క॥ రమ్ము తడ వేల నను యు, ద్ధమ్మునఁ గెలువు మని పిలువఁ ♦ దపసి యతనికిన్
సమ్ముఖము సేసె నిఖిలా, స్త్రమ్ములకును మేటి బ్రహ్మ ♦ దండముఁ గడఁకన్.

క॥ దానిం గొని రోసంబున, మౌనీంద్రుఁడు మలయు మింక ♦ మా బ్రహ్మబలం
బీ నీ క్షత్రబలంబునుఁ, బూనిక మెయిఁ గాంతు గాక ♦ పోలునె తడయన్. ౩౧౩

ఆ॥ క్షత్రబంధుఁ డేయు ♦ శస్త్రంబు బ్రాహ్మణు, నెఱయ కున్నె నిన్ను ♦ నీశరమ్ము
నీ రొనర్చువాఁడ ♦ నే నోరి క్షత్రియ, పాంసనుండ యనుచుఁ ♦ బదరి పలుక.

క॥ నిలునిలు మని నృపుఁ డేయఁగ, నిలిచితి నిదె యంచుఁ దపసి ♦ నిష్ఠితుఁడగుచున్
జలమున నల దండమునం, జలమున నగ్ని నటు లనల ♦ శర మడఁగించెన్. ౩౧౪

వ॥ పదంపడి యమ్మహీజానిచేఁ గ్రమప్రయుక్తంబులైన యైంద్రవారుణ వాయవ్య ముఖ్యంబులగు దివ్యాస్త్రంబు లమ్మునివరేణ్యునిపైఁ గవిసి సంద్రమ్ము సొచ్చిన యేఱుల తీరున నా బ్రహ్మదండంబునంద యడంగినఁ గడంక మేకొనం గడంగి రౌద్రంబునుఁ బాశుపతంబును నైషీకంబును మానవంబును మోహనంబును గాంధర్వంబునుఁ బ్రస్వాపనంబును జృంభణంబును మాదనంబును సంతాపనవిలా

పనంబులును శోషణంబును దారుణంబును వజ్రాస్త్రంబును బ్రహ్మపాశంబునుఁ గాలపాశంబును వరుణపాశంబునుఁ బైనాకంబును దయితంబును శుష్కార్ద్రాశనులు రెండును దండాస్త్రంబునుఁ బైశాచంబును గ్రౌంచంబును బ్రలయవాయవ్యము మథనము హయశీర్షము శక్తిద్వయముఁ గంకాళము ముసలము వైద్యాధరముఁ గాలాస్త్రముఁ గాపాలముఁ గంకణము మున్నగు మహాస్త్రంబు లెల్ల నమ్మహామునిపైఁ బ్రయోగించు చుండ నాజపతాంశ్రేష్ఠుండైన బ్రహ్మపుత్రుం డవి యన్నియు బ్రహ్మదండంబునను గ్రసించుచుండం జూచువారల కందఱకుం బ్రభూతాద్భుతంబు దోఁచు చుండె నంత. 3౨౬

క॥ వాలినమగఁటిమి రుద్రుని, శూలము హరి చక్రము బల ♦ సూదను వజ్రం
బాలో యమదండము నతఁ, డాలోలత నైవ నదియ ♦ యన్నిటి మ్రింగెన్.

తే॥ మఱియు నృపుఁడాభిచారిక ♦ మంత్రతంత్ర
శక్తివిక్షేపముల నిజ ♦ శక్తి సూప
నవియుఁ బ్రలయరవిద్యోతుఁ ♦ డైన తపసి
కెలన ఖద్యోతముల యట్లు ♦ వెలను వయ్యె. 3౨౮

ఉ॥ అస్త్రము లెల్ల శాంతముల ♦ యైన చన నేమగు నింక నంచు బ్ర
హ్మాస్త్రము సంప్రయుక్తముగ ♦ నా ఘనుపై నెలకొల్పె సర్వది
వ్యాస్త్రవిమంథు గాధిసుతుఁ డంబరచారిసురర్షి ముఖ్యు లం
తత్రసనంబుమై జగము ♦ తల్లడ మందెడు నంచు నొంచగన్. 3౨౯

శా॥ ఘోరాకార మశేషసార మితరా ♦ క్షోభ్యంబు బ్రాహ్మంబు బ్ర
హ్మారూఢస్థితి బ్రహ్మతేజమున నా ♦ యస్త్రిచ్చె బ్రహ్మర్షిఁ డ
ట్లారాత్ప్రాప్తము బ్రహ్మదండము సము ♦ ద్యజ్జ్వాలమాలాకులం
బై రంహోరావణంబు లేర్పడ యుగాం ♦ తాగ్ని న్విడంబింపఁగన్. 330

క॥ మునిరోమకూపముల నె, ట్టన దోఁచెం బావకోత్క ♦ టస్ఫురితార్చుల్
ఘనుఁ డటు బ్రహ్మాస్త్రంబుం, దన తేజమునన్ గ్రసించు ♦ తఱి రఘుసింహా. 33౧

ఆ॥ క్రాలె నదియుఁ బ్రిలయ ♦ కాలదండము గాఁగ
నా తపస్వి మెఱసె ♦ నంతకుండు
నాఁగ సురలు మునులు ♦ నందితాత్ములు సేరి
శాంతిసంస్తవములు ♦ జరిపి రొదిఁగి. 33౨

తే॥ నీదు తేజంబున ధరింపు ♦ మీదురాస
దంబు తేజం బమోఘంబు ♦ దవిలి నిగ్ర

హింపఁ బడెఁ గౌశికుం డింక ♦ సింపఁ గనుము
జగములు గతాఘములుగఁ బ్ర ♦ సాదదృష్టి. ౩౩౩

క॥ అని వేఁడిన శాంతుండై, ఘనుఁడు తపోధనుఁడు సౌమ్య ♦ కలనం దనరెన్
మునులును వేల్పులు సంతస, మునఁ దనరారుచు యథేచ్ఛ ♦ మొనకొని రనఘా.

క॥ అంతట నరనాథుఁడు తన, మంతనమున విసువు దొడర ♦ బ్రమాన్పడి మలక
ల్పాంతమున నెగువఁ జేడ్పడి, చింతాడోలాధిరూఢ ♦ శీలుం డగుచున్. ౩౩౫

తే॥ ఇట్లు దలపోసికొనెఁ గార్య ♦ మెన్నఁ డేనిఁ
గారణము సొచ్చి బ్రదుకంగఁ ♦ గలదె తలఁప
నాదు జాడ్యంబ కాక యే ♦ నాఁడు బ్రాహ్మ
మెదురుకొని గెల్వ గొనె క్షాత్రి ♦ మిజ్జగమున. ౩౩౬

ఆ॥ బ్రాహ్మబలమె బలము ♦ పాడు క్షత్రబలంబు
బలమె సిగ్గు లేక ♦ పదరినాఁడ
నురక యుసిరొ యనుచు ♦ నుస్సులు గొట్టుచు
మఱియు నిట్లు తనదు ♦ మదిఁ దలంచె. ౩౩౭

క॥ ఆరంభింపరు విజ్ఞులు, కారామి నెఱింగి యెపుడుఁ ♦ గర్జము నెటులుం
బ్రారంభించిన యది విడఁ, గారామిఁ దలంచి విడరు ♦ గౌరవపరతన్. ౩౩౮

చ॥ తొడిఁబడఁ జొచ్చె మెచ్చుమెయి ♦ ధూర్జటి గూర్చిన యస్త్రశక్తి యి
ట్లుడరిన నింక నేమి ఫల ♦ మాఱడి యెక్కుడ తక్క నే క్షణం
బెడలఁగ నీక లక్ష్యగతి ♦ నేమఱఁ బోక తపం బొనర్తుఁ బా
ల్పడునది గాక బ్రాహ్మ మొక ♦ పట్టునఁ బోయినఁ బోవ నిత్తునే. ౩౩౯

—♦ విశ్వామిత్రుండు తపంబొనరింప వనంబున కరుగుట ♦—

ఆ॥ బ్రహ్మవర్చసమునఁ ♦ బ్రబలి యిమ్మునిఁ గెల్తు
నభవు చరణ మాన ♦ యనుచుఁ బ్రతిన
చఱచి రాజ్య మాత్మ ♦ జన్మున కర్పించి
సతియుఁ దాను వనికిఁ ♦ జనె నతండు. ౩౪౦

క॥ అందుఁ గనె మఱలఁ గొందఱు, నందనులనుఁ బ్రబలుఁ డవని ♦ నాథుఁడు తపముం
గొందలపడ కొనరింపుచు, ముందలఁ గొని తనదు చలము ♦ ముంగిటి కీడ్వన్.

వ॥ సత్యధర్మపరాయణు లనం జను హావిష్యందుండును మధుష్యందుండును ధృఢనే
త్రుండును మహారథుండును మున్నగు వనవాససంభూతులం బుత్రుల నెల్లరం
బురంబునకుఁ బోవం బనిచి దక్షిణంపు దిక్కున నొక్కం డాశ్రమంబున నెక్కొని
పరిశ్రమంబు సహించి యింద్రియంబుల నిగ్రహించి. ౩౮౨

తే॥ వేసవికి వానకును జలి ♦ వేఁడబమున
కింత యేనిఁ దలంకక ♦ యేకనిష్ఠఁ
జెనఁగెఁ బదునేనువేలేండ్లు ♦ జెక్కుడుమలు
గుడిచి కానని తెఱఁగునఁ ♦ గుశికసుతుఁడు. ౩౮౩

క॥ రాజర్షి వైతి వని విధి, రాజత్కృపఁ బలుకఁ బలుక ♦ రా దిఁక నని య
వ్యాజఁ దిరముపడి నిలిచెను, భూజాని తపంబు మున్నె ♦ పొలిసె నటంచున్.

ఆ॥ ఎన్ని పాట్లు పడియొ ♦ యేఁ జేయుతప మెల్ల
బూది పాలు గాక ♦ పొసఁగె నేని
బ్రాఁతి యగునె తన్ను ♦ రాజర్షి యనుట బ్ర
హ్మాదు లెనసి యిట్టు ♦ లనఁగఁ జెలిసె. ౩౮౫

క॥ అని సిగ్గుపడియుఁ దీరని, దని మనమును గట్టిపఱచి ♦ యఱవాయి గొనం
డనితరుఁడు మునివరుఁడు తప, మొనరించుచు నుండెఁ గడఁక ♦ నుజ్జ్వలభంగిన్.

క॥ కన్నుగవ నొక్క చూపున, వెన్నుని వలకన్ను పైని ♦ వెలయించి సుసం
పన్నుఁడు నెఱపెను ఘన మిది, యన్న నుడు ల్దోడర జలఘ ♦ లాశనుఁడగుచున్.

## —♦ త్రిశంకు చరిత్రము ♦—

వ॥ అట్టియెడ సవితృవంశసంభూతుండు త్రిశంకునామధేయుండు సత్యసంధుండు జితేం
ద్రియుండు ననం బొగడు గన్నవాఁడు సుసంపన్నుం డొక ప్రుడమిఱేఁడు సశరీర
స్వర్గమనంబునకై యొక్కండు మహాధ్వరం బొనరింప సమకట్టి స్వకులగురుండగు
వసిష్ఠు సంయమివరిష్ఠు వేఁడిన నయ్యది దుస్సాధం బగుటం గొండొకకాలంబు
వ్యవధి చూపి పూర్వప్రతిజ్ఞాతంబైన బృహస్పతిసవనంబు నిర్వహింపం జనిన నా
నృపతియుఁ జలంబు మెయి నప్పటికప్పుడ యా సప్తతంతువరంబు నిర్వర్తింపం
దలంచి దక్షిణాపథంబున కరిగి గాఢతపం బొనర్చుచున్న గురుసుతులం గాంచి
యవ్వాశిష్ఠులకు నమస్కరించి తనదు సంకల్పం బెఱింగించి భవద్గురుండు నాదు
జన్నంబుపై నిరాదరణంబు సూపి వేఱొంకు వలనికిం జనియె నిక్ష్వాకుకులంబున
కెల్ల మీరలు గురువులు పురోహితులు దైవతంబులునుం గావున నిద్దాని సమ
ర్థింపుఁ డని ప్రార్థించిన నవ్వార లెల్ల నేకముఖంబుగ నాతేనిం గనుంగొని. ౩౮౮

క॥ కానిపనిఁ బూని గురుఁ డటు, కాని దనుచుఁ గాల మొండు ♦ గడు విడెనని మ
మ్మే నాయమ్మున నడిగెద, వీ నేరమి కీవ చాలు ♦ దే మోప మనన్. ౩౪౯

ఆ॥ అదియుఁ దన కసహ్యా ♦ మగుడుఁ గొండొక్కని
వలన నాదు కోర్కి ♦ వలనుపఱచు
కొందు నట్టు లైనఁ ♦ గూడునే యన వారు
నడుమ విఘ్న మగును ♦ నడువు మనిరి. ౧౫౦

క॥ ప్రత్యాఖ్యాతుం డయి చని, యత్యయ మెన్నకయ యన్యుఁ ♦ డధ్వర్యుం డా
ప్రత్యయమున దీక్షం గొనె, సత్యాగ్రహ మంతవట్టు ♦ సమకూరంగన్. ౩౫౧

చ॥ కులగురుఁ డేగుదెంచి తనుఁ ♦ గూడని వానిఁ గనెంచి యట్లునేఁ
త లఘుత గాదె యంచన న ♦ తండు మునిన్ లఘుదృష్టిఁ జూడ బి
ట్టలుక మెయి న్మహాత్ముఁ డెర ♦ వౌ నృపతి న్వెస మాల వౌదు పో
యలరకు మంచుఁ దిట్టి చనె ♦ నాక్షణ మయ్యెను వాఁడు నట్లుగన్. ౩౫౨

ఆ॥ మాలకాకి నలుపు ♦ మసిబొంత జుంజుఱు
వెంట్రుకలునుఁ గలిగి ♦ వెక్కసంబు
దోఁపఁ జెలివి తలఁగఁ ♦ దోస్సుమాటలుఁ గొంగ
యఱపులును భయావ ♦ హములు గాఁగ. ౩౫౩

క॥ తలఁగు తలఁగు మను పలుకుల, కలుగక తన కర్మగతికి ♦ నలుకుచు మనికిం
బలుచఁదన మెంచి వనికిం, జులుకన యై చనియె నెడఁద ♦ శోకం బెగువన్.

వ॥ అట్లరిగి గాధి పట్టి యాశ్రమంబు పొంత నిలువంబడి యమ్మహామహునకుం దనదు దుష్కర్మం బెఱింగించి యుమ్మలికమ్మునం దెరలుచు వీఁక సెడి శోకమ్మున న్మనుంగుచుండ నమ్మునివరుం డాతని దెస సమాదృతుండై యడలకు మని యూఱడించి చండాలరూపధరుం డగు నాధరావరుం డుల్లసిల్ల నల్లన నిట్లనియె.

ఆ॥ వత్స; నిన్నెఱుంగు ♦ వాఁడ నైక్ష్వాకు స, ద్ధార్మికుఁడవు విధికిఁ ♦ దలఁక వలదు
నీకు స్వాగతంబు ♦ నే నర్థి శరణంబ, నైతి నెఱపఁ జూతు ♦ నధ్వరంబు. ౩౫౫

క॥ పుణ్యాత్ముల మునివరుల న, గణ్యాయశులఁ బిలువ నంపు ♦ నవ్వాలనున నా
గుణ్యులఁ గూడం గూర్చెద, గణ్యామ నా కింతవట్టు ♦ కర్జం బనఘా. ౩౫౬

క॥ గురుశాపకృతము రూపము, దరమున లేని దిటు నీకు ♦ దారసిలెం గా
వర ముడిగి వాకు వెఱపడ, వెరవున నిను సురపురమున ♦ వెలయింతు బళే.

ఆ॥ కరతలామలకమ ♦ కా నెంతు స్వర్గంబు, నీకుఁ గాక యిటు ల ♦ నేకులకును
నా తలంచు తలఁపు ♦ నం దీర్పఁ బోలము ని, లింపు లేనడింపఁ ♦ జొంపెనయునె.

క॥ నా యగ్గలికం గాంచఁగ, నాయెం బన్నిదముఁ బన్ని ♦ యలఁతిం జనునే
శ్రీయుత; శంకరకింకరుఁ, డాయము శ్రేయమునుఁ గాంచి ♦ యలరెద వింకన్.

క॥ అని యాతని యజమానుం, బొనరించి నిజాత్మజులనుఁ ♦ బుణ్యులఁ గని మీ
రొనగూర్పుడు సంభారము, లనుపొందఁగ నని విధించి ♦ యల వెంచి మదిన్.

వ॥ యాజకుండు దానై కొందఱు మునికుమారులుఁ దన వలని భయంబున కలిమికి
దక్కొని ఋత్విజులుగా నెల్ల మునివర్యులం బిలువం దన శిష్యవర్గంబుం బనిచి
యవ్వార లెల్ల వారలకు స్వకీయాజ్ఞ నెఱింగించి బహుక్రతులు బ్రహ్మవాదులు
నగు నా మునివరులం దోడ్తెర నమ్మహనీయుల నమ్మఖరాజమ్మున సదస్యులనుఁ
గా వివరించి వరించి తిరిగి వచ్చిన వినేయులం గనుంగొని యెవ్వ రెవ్వ రేమే
మనిరో యయ్యది యింతయుఁ దాఁపక యోపికమెయి నాకెఱింగించునది యని
తనపై నాన వెట్టిన గురునకు నెఱచి నివ్వెఱపోవుచు వార లిట్లనిరి. ౩౬౨

క॥ ఇచ్చ గల వార లెల్లరు, వచ్చిర కా కొండు వలుకు ♦ వారలు గాకే
సచ్చరితులు వాశిష్ఠులు, తచ్చన లాడి రవి వినిచె ♦ దము మునివర్యా, ౩౬౩

తే॥ అల మహోదయముఖ్యులై ♦ నట్టి శతక
మాడఁ దొడరెనుఁ గ్రోధప ♦ ర్యాకులాక్షు
రమ్ము వాశిష్ఠము సహింప ♦ రాని దయ్యె
దాని కీ క్రతుయోగవి ♦ ధాన మనఘ. ౩౬౪

ఉ॥ జన్మము మాల సేయు నటె ♦ క్షత్రియుఁ డౌ నటె యాజకుం డిఁకే
పన్నుగడ ల్ఫలింపనివి ♦ పాఱులు మున్నడి తృప్తులౌదు రం
దున్న సదస్యు లోటరులె ♦ యొప్పములే సుర లిట్టివెంట నీ
మన్నన చాలు మా కనతి ♦ మాత్రమె యాత్రములుం దలంగవే. ౩౬౫

ఆ॥ ఎంతలేసివార ♦ లేతెంతురో యట్టి, రెల్ల స్వర్గమునకు ♦ నిపుడ చనఁగ
స్వర్గు లల్ల మేలి ♦ చండాలహవ్యసం, పాదనంబొనర్పఁ ♦ బ్రబలరొక్కొ. ౩౬౬

క॥ అనుమాటల గ్రొచ్చినయ, ట్లనుబంధము సేసి రవల ♦ నావలఁ జనుడం
చని రనినఁ గ్రోధతామ్రా, నననేత్రుం డగుచుఁ గుశికనందనుఁ డధృతిన్. ౩౬౭

—♦ కౌశికుండు వాశిష్ఠులకు శాపం బొసంగుట ♦—

ఆ॥ పెద్దతపము సేసి ♦ పెనువు గాంచఁ దలంచు
నన్నదూష్య దూష్యు ♦ డన్న దేఁజె
లెన్నరాని యిడుమ ♦ లెనయువారింకిటఁ
బొడవడంగి భస్మ ♦ భూతులగుచు. ౩౧౯

తే॥ కాలపాశశతమ్ములఁ గట్టుపడి యు, మక్షయమ్మున కరిగి య ♦ దక్షు లగుచు
సప్తజాతిశతమ్ములు ♦ శవములఁ దిను, శ్వపచు లొదురు తా రవ ♦ శ్యముగ వీరు.

క॥ నిరనుక్రోశులు వికృతులు, విరూపులును నగుచు వీరు ♦ వెర వేది చెడం
దిరుగుదురు ముష్టికులునై, యరభసవర్తనముఁ బెరసి యా♦ యీ మొదలన్. ౩౨౦

ఆ॥ ఆ మహోదయుఁడును ♦ నౌను నిషాదుండు, ప్రాణిహింసనప్ర ♦ వర్తనముల
వర్తిలం గలాడు ♦ వాఁడు నన్దూషించి, దుష్టుఁ డఖిలలోక ♦ దూష్యుఁ డగుచు.

క॥ చిరకాల మిందఱును ని, స్తరణముఁ గన లేక దిక్కు ♦ గానక చెడువా
రిర వెడలి నాదు నుడి ని, బ్బరమే యగు నేని మరలఁ ♦ బడ కిటు లనుచున్.

తే॥ కోపమున శాప మిడి వారిఁ ♦ గూల్చి పగుల
కడరు పుట్టించి వేల్పులు ♦ నట్టు లలుక
బలుకరించెడు తరబడి ♦ పలుకుబడిన
యెల్ల వారల వినుకలి ♦ కిట్టు లనియె. ౩౨౩

—♦ విశ్వామిత్రుఁడు త్రిశంకుని క్రతు పూర్తిగావించి స్వర్గమునకు బంపుట ♦—

తే॥ ఇష్టుఁ డిక్ష్వాకుదాయాదుఁ ♦ డీత్రిశంకుఁ
డఖిలధర్మజ్ఞుఁడు వదాన్యుఁ ♦ డర్థి నన్ను
శరణు వేఁడెను మేనితో ♦ స్వర్గ మొనయు
నెఱికిఁ దగు నిజ్య మన మిష్ట ♦ నెఱప వలయు. ౩౨౪

ఆ॥ అనిన నగ్నికల్పుఁ డంతకుఁ ♦ డీతని, పలుకు గా దటన్న ♦ బ్రదుక నేర
మన్నిటికిని నితని♦దా తేజమే చాలుఁ, జొచ్చి యవలి తెఱఁగుఁ♦జూతు మనుచు.

క॥ వల్లె యనిన వారునుఁ దా, నల్లనఁ దత్క్రతువిధాన ♦ మారసి నడుపన్.
సల్లలితకల్పమై యది, యుల్లసిలెన్ సురలు స్వగతి ♦ కొఱకట మొందన్. ౩౨౬

తే॥ అంతటఁ బరంతపుఁడు మౌని ♦ యంతరంగ
మంతయునుఁ బంతముగ హావి ♦ రర్పణేచ్ఛఁ

బిలువ వేల్పులు రాకున్న ♦ బెట్టదల్చి
మెంచి గురుశాపహతునిత్రో ♦ నిట్లు బలికె. ౩౨౨

క॥ పంపెడ దివమున కిడె సికి, పొంపిరివో నాదుతపము ♦ ప్రస్నైము కలినిఁక
సంపాదింతు నఖిలము ని, లింపు లొడుఁగఁ గాంతు సౌఖ్య ♦ లీలాస్ఫూర్తిన్,

వ॥ అని తపోగర్వాం బఖర్వాంబుగాఁ గొనలువాఱ నుగ్గడించి. ౩౨౩

తే॥ ధ్రువము పైకెత్తిస్వర్గంబు చూఱకొందు, లెమ్ము నీనికి సుతపమ్ము ♦ లేశ మేని
లేక పోయెనె చూతము ♦ నాకసదుల, యజ్ఞపాలులు పాటులు ♦ నరసియొరసె.

క॥ నా మలసిన తపమున నిక్కి, నీ మేనున నిల్పె యిపుడె ♦ యిూ వేగ దివం
బాముకొనుము కావలసిన, నామీఁదటఁ గాచికొలు ♦ నను వొనగూర్తిన్.

—♦ త్రిశంకు నింద్రుఁడు దలక్రిందుగాఁ దన్ని త్రోయుట. ♦—

క॥ ముని యట్లు పలుకఁ బలుకును,మునుకొని యతఁ డెగసె స్వర్గ♦మున కటునవా
రును నిచటి మునులు నచ్చము, మొనయఁగ నెనరుఁగ బిరాన♦మునినుతచరితా.

చ॥ అనుస్మృతియోగశక్తి నతఁ ♦ డాతని నాకనికేతనంబు సే
ర్చినఁ బురుహూతుఁ డోర్వక యి ♦ సీ; యిటురా నెటు లయ్యె నీకు మా
లని కని తన్ని త్రోసెఁ బెర ♦ లం దలక్రిందయి వాఁడు మింటి ప
ట్టున మొఱపెట్టఁ గౌశికుఁడు ♦ డొంక కనంకితవైజసాత్మ్యుఁడై. ౩౨౩

—♦ విశ్వామిత్రుండు ప్రతి స్వర్గంబు నిర్మింపంబూనుట. ♦—

మ॥ నిలు మచ్చోటనె యొందు స్వర్గ మిదె నే ♦ నిర్మింతు నంచాగడం
బొలుకన్ దత్ప్రతిసృష్టికిం దొడరి సం ♦ యోజించె నక్షత్రమా
ల లలి న్మాలని కోలమై నిలువఁ జా ♦ లం డెట్టు లింక స్వర్గ
మ్ములఁ గ్రొత్త ల్గలిగింప నం చమరుల ♦ మ్మోనమ్ముఁ జింతించుచోన్. ౩౨౪

క॥ దక్షిణమార్గస్థుల నా, దక్షుఁడు సప్తర్షులను వి ♦ ధానించెఁ బొరిన్
నక్షత్రగ్రహగణముల, నక్షతయోగప్రభావ ♦ మచ్చుపడంగన్. ౩౨౫

ఆ॥ కూర్చి యింద్రు నన్యుఁ ♦ గూడ నేఁడ సృజింతు
లేక యుండ నైన ♦ నాక మిదియు
వెలయ కున్నె యనుచు ♦ వెలయింపఁగాఁ బూనె
స్వర్గసదుల నూత్న ♦ సర్గమునను. ౩౨౬

వ॥ అంతటం బరమసంభ్రాంతుల రగుచు సురాసురు లెల్లరు సర్షిసంఘులరై దరి జేరి విశ్వామిత్రుం దపోమయు సందర్శించి సవినయానునయంబుగా నిట్లనిరి.

సీ॥ గురుశాపహతుఁ డిట్లు ♦ కూడునే సశరీరుఁ, డై స్వర్గమునకు రా ♦ నంత్యజాతిఁ
బై కెక్కఁ జేయుదే ♦ బ్రహ్మణ్యమూర్తివై, పరఁగంగ నెంచెదు ♦ బ్రహ్మవేత్త
విశ్వాకుదాయాదుఁ ♦ డే యాతఁ డగుఁగాక, నేఁటిచండాలత్వ ♦ నియతి సెడెనె
ప్రభవింపఁ జేయుమ ♦ ప్పాటఁ గొండొకభంగిఁ,గర్మక్షయముననా♦కంబుఁ బొరయు
ననిన వారి తోడ ♦ నాతపస్వి ప్రతిజ్ఞ, చఱచి తలఁగ నాకుఁ ♦ జనునె యొక్కఁ
డేను వేఁడు వాఁడ ♦ నిది గూర్చి కూర్చిన,యట్లొనర్పఁడనుచు♦నర్థిఁబలికె. ౩౮౮

క॥ ఆతని కదె స్వర్గం బయ్యె, యాతంకము లేక నెఱయ ♦ నగుఁ గావుత మి
ట్లీతతి నా సృజియించిన, భూతము లచ్చోట నెపుడుఁ ♦ బొల్చెడు మొకటన్.

క॥ ధ్యానావనమ్రుఁ డగుచును, శ్రీనాథపదారవింద ♦ చింతాపరతం
దా నప్పదమున నిలువఁగ, నానతి సేయుఁ డటులైన ♦ నతఁడు తరించున్. ౩౯౦

ఆ॥ అనిన నట్టి మేలె ♦ యయ్యెడు మని యెల్ల
రతని మెచ్చి జేని కభయ మిచ్చి
ముక్తి యగు క్షయాంత ♦ మున వీని కిచ్చోట
నఖిలసుఖము లమరు ♦ ననియు మఱియు. ౩౯౧

వ॥ ఈత్రిశంకుప్రభుండు గురుశాపోపహతుం డయ్యు నీదు మహనీయ తపఃప్రభావంబునం జేసి వైశ్వానరమార్గంబునకు వెలుపటి దగు జ్యోతిర్మండలంబున నిస్సీమ యైన యవాక్ఛిరుండునుఁ గీర్తిమంతుండును స్వర్గలోకగతుండ పోలె నమరవర సదృశుండై తేజోమూర్తిత్వంబునం బ్రజ్వలితుం డగుచు మోక్షనిరీక్షణం బొనరించుచు నుండు వాఁడని మహామహులం డగు నమ్మహర్షిసత్తము నాశ్వాసించి యమ్మహాత్ముని చనవుఁ బడసి పనివినిన యనంతరంబ యాతండునుఁ దనదు నెమ్మనమ్మున. ౩౯౨

క॥ ఎప్పటి తప మప్పుడె చెడె, ముప్పులు నాపాలఁ బడియె ♦ మునుకొని దొసఁగుం
ద్రిప్పఁ లెడల నియతిం గను, తెప్ప గదల్పని నెఱానె ♦ టిన నిల్వ నగున్. ౩౯౩

క॥ అని కొని ప్రస్థితులగు న, వ్వనవాసుల మునుల శిష్య ♦ వర్గముఁ గని యి
ట్లనె నత్తపోధనుఁడు త, న్మనోగతం బాత్మభావ ♦ నకుఁ దోడ్పడఁగన్. ౩౯౪

ఆ॥ పెరిగె నిచట నుండఁ ♦ గౌశికుఁ డిమ్మీఁది దిక్కుఁ
బాసి యొండు దిక్కుఁ ♦ బోకెఁ బరఁగ
తప మొనర్చె నింక ♦ నపరిమితంబుగ
సంయమీంద్రులార; ♦ చలము మెఱయ. ౩౯౬

తే॥ అనుచుఁ బలికి ప్రతీచి క ♦ య్యనఘుఁడు ఋషి
వరులఁ దోడ్కొని యరిగి పు ♦ ష్కరసమాఖ్యఁ
బరఁగెడు ప్రసిద్ధ మగు తపో ♦ వనము నందు
నిలిచి సుఖవృత్తి నిజజప ♦ నిష్ఠఁ గొనిచి. ౩౯౭

ఆ॥ పడయు కందమూల ♦ ఫలజలాదుల నశ
నాయ దాయ గెల్చి ♦ శ్రేయ మెంచి
యొక్క మొగిన సలిపె ♦ నూరుప్రఁ బుచ్చక
తపము వేయునేండ్లు ♦ దాపసుండు. ౩౯౮

క॥ అంచిత మగు నేమమున జ, యించితి లోకముల నంచు నా ♦ ఋషి వైత్రవి ని
వంచు వెలయించి చనె విధి; కొంచెం బని తపసి పనిచెఁ ♦ గొనకొని తపముల్.

వ॥ అయ్యవసరంబున నయోధ్యాధినాథుం డంబరీషుం డను రాజశేఖరుం
డొక్కరుం డొకొక్కఁడు క్రతు వాచరించుచుండ యాగీయం బగు పశువు
నింద్రుం డపహరించిన యాజ్ఞికు లెల్లరుం జేరి విచారించి యజమానునిం గనుం
గొని నీదు దుర్నయంబు కతనన యిమ్మహాధ్వరాంగం బపహృతం బయ్యె నర
క్షితి యగు ప్రభువు స్వదోషంబునఁ బ్రణష్టుం డగుం గావున నీవిభ్రంశంబున
నేహానిం బొరయకుండెడు నట్లొక్క నరపశువుం బెట్టి యాగశేషంబు
నిరవశేషంబుగా నొనరింపవలయు నని యుపాధ్యాయ ముఖంబున దృఢనిశ్చ
యంబుగాఁ బలికిన నమ్మనీశుఁడు పశువు నొసంగువారికి కోక లక్షగోవ్రజం
బ్రత్యేకదక్షిణాన్వితంబుగ సమర్పించువాఁడ నని కట్టడ సేసి తగినవారల నెల్ల
దెసలకుం బనిచినఁ దదనుశంసితంబు ఫలశూన్యం బయ్యె నయ్యెడ భృగువంశ
మండలంబున. ౩౯౯

తే॥ అన యొకద్విజమిథునంబు ♦ నలముకొనినఁ
దండ్రి జ్యేష్ఠు నొసఁగ నన ♦ దల్లియుం గ
నిష్ఠు నీన నె నది విని ♦ నేతు నత్తు
ననియె మధ్యముఁ డనద తా ♦ నగు శుఁ జెంగి. ౪౦౦

ఆ॥ జ్యేష్ఠుఁడో నగఁడతఁడు ♦ స్థితికరుం డని తండ్రి
తల్లి పిన్న బిడ్డఁ ♦ దలఁగ ననియె
నిరువురకునుఁ గాని ♦ యీ వ్యర్థుఁ డిఁకేమి
పడయు వాఁడు బ్రదికి ♦ పార్థ్వ్రుండ. ౪౦౧

క॥ కావున నాకై వీరికిఁ, గోవ్రులు ధనమును నొసంగి ♦ కొంపోవుము న
న్నీవలని వాఁడ నై తిని, దీనరపకు మనుచు నతఁడు ♦ తెగనాడుటయున్. ౪౦౨

వ॥ పదంపడి వాని పసుపునం గ్రయధనం బెల్లఁ దల్లిదండ్రుల కొసంగి యంబరీషుం డాతనిం దన రథంబుపై నిడుకొని తోడ్కొని చనుచుండ మార్గమధ్యప్రదేశం బునం బుష్కరతీర్థంబునం దపం బొనరించుచున్న గాధిపుత్త్రు నయ్యకించనుండు సందర్శించి తన్ను ఋచీకపుత్త్రు శునశ్శేఫునిఁ గా నెఱింగించి జననీ జనకుల యనాదరంబునం జేసి యాగపశువుగాఁ దా నప్పుడమిఱేని కమ్ముడువోవుటయు వివరించి మాతులా ; యతులప్రజ్ఞుండ వీ వన విందు నియ్యాపదఁ దలంగఁ బెట్ట నిన్ను దక్కొండు శరణంబు గాన నని కన్నీ రొలుక దన యడుగులపైఁ బడి బడలుపడి బిట్టడలిన. ౪౦౩

ఆ॥ కనికరించి వానిఁ ♦ గాచెద నని పల్కి
సుతులఁ బిలిచి యొకనిఁ ♦ గ్రతుపశువుగఁ
బనుతు నవిన వారు ♦ భాగినేయునిఁ బ్రోవఁ
గొడుకుఁ జంపఁ దలఁతె ♦ కూళ; యనిరి. ౪౦౪

వ॥ అమ్మహాతేజుం డవ్వారల పలుక మెయిం గలఁకపాటిన నెమ్మనంబునం దెస గానని దృష్టి నీక్షించి మీర లెల్లరు నాపనిచిన కర్జంబు వలనున ననాదరంబు సూపి పెడనాడి యంతం బోవక నన్ను స్థితి సెడ దూషించితి రట్లుం గావున ననశ న్ములై శ్వమాంసభక్షణంబు గావించుచు నెన్నియేనిఁ బుట్టు లొందివాశిష్ఠు లట్టులె వినిహాతు లౌదురు గావుత మని శాపం బొసంగి యాశునశ్శేఫునకు నింద్రావరుణ దైవత్యంబులగు రెండు మంత్త్రరాజంబు లుపదేశించి యూపనిబద్ధుండ వగు నప్పట్టున నేమఱక యేకలక్ష్యంబున నిమ్మనువులం బఠింపుచుండుమని యాదేశిక వరుం డాదేశించి యనిచిన. ౪౦౫

ఆ॥ ఆతఁ డట్లు సేయ ♦ నమరులు దోఁతెంచి, యంబరీషునకు వ ♦ రం బొసంగి
పశువు విడిచి పుచ్చి ♦ పనివిని రవ్వాఁడు, గాధిసూను శిష్య ♦ కలనఁ జెరసె.

క॥ కొంత తపము సెడె నని తన, మంతనమున బిట్టు వగచి ♦ మౌని ప్రతిష్ఠా
వంతుఁ డయి పెనిచె నిష్ఠం, బంతము నెమ్మనము లోనఁ ♦ బరవశి సేయన్.

—♦ విశ్వామిత్రుని యొద్దకు మేనక వచ్చుట ♦—

ఉ॥ అంతము లేదు దీని కను ♦ నంతపు దీక్ష వహించి వేనవే
ల్వింతగ వర్షము ల్గడవ ♦ విశ్రుతమహా తప మాచరించుచోఁ
గంతుని పూవుటమ్ము నెఱిఁ ♦ గాడను దాని స్వమేనకాపదా
క్రాంతదిగంత నచ్చర నొ ♦ కర్తుక నింద్రుఁ డతంద్రుఁ డంపినన్. ౪౦౮

ఆ॥ మేఘమండలమున ♦ మెఱుఁగట్లు మిఱుమిట్లు, గొలుపఁ జాలుజగ్గు ♦ వలపువాలుఁ
జూపు లొప్ప మరుని ♦ తూపుల పస దప్పఁ, జేరు చెప్పి నిలుచు ♦ మెఱుపు వెలయ.

క॥ నరవర ; పుష్కరతీర్థము, వరజలమున స్నానకలన ♦ వర్తిలె నాసుం
దరమూర్తి హావభావ, స్ఫురణములు రుచిరము లెదిరి ♦ సోఁకుంపఁగన్. ౪౦౯

సీ॥ చూచి చూడని లేడి♦చూపుకోపులు తమ, యరిగాఁపులను చూటక్క♦లమరుదాని
నాడి యాడని చిల్క♦కూడుఁ బులుఁగుపుడి, గుఱివెట్టి గెల్చు మే♦ల్కురుల దాని
విచ్చి విచ్చని తమ్మి ♦ విరిమొగ్గ నెఱినిగ్గు, నొత్తఁకుఁ దెచ్చు చె ♦ మ్మోని దానిఁ
గూడి కూడని యాఁచి ♦ కో లెంచు జక్కవ, కవ మొట్టు చన్గవ ♦ కలిమి దాని
మొలకనవ్వులు సిలుకు కె ♦ మ్మోవి దానిఁ
దళుకు లీనెడు చెక్కుట ♦ ద్దముల దానిఁ
గులుకునడ దాని నెమ్మోము ♦ వలపు దాని
దానిఁ గని మౌని స్మరపర ♦ తంత్రుఁ డయ్యె. ౪౧౦

తే॥ చేయు జపము సమర్పణ ♦ సేయఁ జెలువ
డాయఁ జని వేఁడి యలు; గుల ♦ దాయ మరుఁడు
మాయురే యగలించెడు ♦ మాయలాఁడు
పాయఁ జాలఁ దలంగు మ ♦ పాయ మనుచు. ౪౧౧

క॥ నీదరిఁ జేరితి నచ్చర, వౌదువ కదె స్వాగతంబె ♦ యావతమణి ; త
న్నాదరదృష్టిం గొని చన, వీఁ దలఁతే యీ స్మరార్తి ♦ యెరగలిఁ దొలఁతే.

తే॥ నీకు శుభ మగు నిచ్చోట ♦ నిలువఁ జెలువ ;
జతన మొనరింపు మింకను ♦ జంకఁ బోకు
ముపకృతి ననుగ్రహించి న ♦ న్నోము గాము
కాము బారిఁ దలంగించి ♦ కరుణ మించి. ౪౧౨

వ॥ అని యిట్లు మోహపరీతం బయి యుత్తరపాటునం జిక్కిన చిత్తంబునం దత్తర పాటు గదురం బదరు నత్తబిసిచందురుం గనుంగొని దివ్యాంగనామణియు నిజాంత రంగంబు ముప్పోకలం బెరయ నుప్పొంగుచు. ౪౧౫

ఉ॥ ముంగిటి వేల్పుఁజెట్టుఁ గొన ♦ ముట్టఁగ నల్లిన కల్పవల్లి స
న్నం గరువారు నెమ్మొయి న ♦ నంగి పెనంగి యనంగు చెయ్వి లొ
ప్పం గల కాల ముల్లసిలు ♦ భంగికిఁ గా క్రొకటం దలంగు నీ
యెంగిలిసేఁత కంగనల ♦ నిట్టటు లాగి కలంపఁ జెల్లునే. ౪౧౬

వ॥ తపస్వివరులు మీరలు వలసినట్లు లోకప్పు డవధరించియుఁ దోడ్తోడన విడనా డుదు రమోఘవీర్యుల రగు మీవంటి యౌవనధ్వంసంబ కాని చిరకాలసౌఖ్యంబు పనుపడనేరదు వ్రతభంగంబై నను సుఖంబేనియుఁ దక్కవలయు నట్లుంగాన నిట్టి కర్జంబు భవదీయం బగు హృదయంబునకు సమ్మతంబ యేని నాయిచ్చవచ్చు నంతదనుక నెడయం జన దనిన నద్దానిదగు భావంబునంగల యర్థం బెల్లఁ దెల్లం బుగా భావించియు. ౪౧౭

క॥ పులక లెగయఁ జెలి తటితీ, పుల కొదిఁగి తదర్థితములఁ ♦ బూరింపుచుఁ దో
నలికిపడుచు వేఁడుచు న, క్కలికి యభీప్సిత మెఱింగి ♦ కౌఁగిటఁ జేర్చెన్. ౪౧౮

ఆ॥ తపము మాట మఱచెఁ ♦ దతి గామి మఱచెఁ బ్ర
తిజ్ఞ మఱచెఁ దెలివి ♦ త్రోట మఱచె
మాయలాఁడి యొఱపు ♦ మచ్చు పైఁ గ్రమ్మినఁ
దన్నుఁ దాన మఱచెఁ ♦ దాపసుండు. ౪౧౯

క॥ అన్యోన్యస్వభావబాధం, బన్యోన్యంబునకుఁ బ్రొత్త ♦ వై తమి రేఁపన్
సన్యస్తేతరకృత్యులై, మాన్యుఁ డతం డుండెఁ దన్వ ♦ మత్తపదమునన్. ౪౨౦

ఆ॥ కామయోగపరతఁ ♦ గామినిఁ గైకొని, యిష్టభోగముల మ ♦ హిచ్చఁ డతఁడు
గడపె నైదునైదుఁ ♦ గాఁ గల వర్షముల్, దివసములుగ స్మరని ♦ దేశమునను.

వ॥ ఇవ్విధంబున నా సంయమివరుండు పెద్దకాలంబు తిజకరసంబున నోలలాడు చున్నంత నవ్వెలనాగ గర్భంబుదాల్చి యొక్కకన్నియం గని తోరంబగు పుప్పొ టీరంబునఁ బుప్పొఁబోని తిన్నని యక్కసుఁగందు ననిచి వేల్పుజేని యాదరంబు గోరి తపసి వీడ్కొని దివంబున కరుగు నంత నబ్బాలిక కావు కావు మని యేడ్చు చుండ శకుంతమ్ములు తమఱెక్కలం గప్పి కాపాడుటం జేసి యయ్యది శకుంతల యనం బ్రసిద్ధి నొంది పైనయోగంబునఁ గాశ్యపుఁ డగు కణ్వమునీంద్రుని పెను

పునఁ బెనుపు వహించి పూరువంశసంభూతుం డైన దుష్యంతుం డను రాజశేఖ
రునకుం బత్నియై జగదేకవీరు భరతకుమారుం గాంచి భరతమాత యనం
ద్రిలోకపూజ్యమాన యయ్యె నగ్గాధితనయుండును. ౪౨౨

ఆ॥ మగువ తనదు పొత్తు ♦ మాని యింద్రునిఁ గొల్వ
నేగఁ జూచు టెంచి ♦ యింత సేయు
వారు వేల్పు లనుచు ♦ వారని సిగ్గున
మునిఁగి తేలి శోక ♦ మూఢుఁ డగుచు. ౪౨౩

క॥ ఆలోచించెను నెడ న, య్యాలోలేక్షణ భయార్త ♦ యై వడఁకుటయున్
దా లో నెంచి చెలువ మధు, కాలాపాసక్తిఁ దేర్చి ♦ యనిచె సువృత్తిన్.

క॥ ఊర్పులు పుచ్చుచుఁ జిత్తము, తీర్పనకుం దొడరు చుండు ♦ తెఱఁగున నా న
మ్మార్గ్పన మఱకువ నొఱకట, మేర్పడ దర్పమ్ముఁ బొరువు ♦ నెనయని బుద్ధిన్.

క॥ చెలి దివి కేగె ననుచు న, త్తలిరాకుంబోఁడిఁ దలఁచి ♦ తపముఁ దలఁచి చిం
తిలి కలఁక దేఱి మఱి ని, శ్చలుఁడై వ్రతనిష్ఠ నెఱపె ♦ జటు లౌ ననఁగన్.

క॥ ఉత్తరపశ్చాతమునకుం, దత్తరమున నరుగఁ దలఁచెఁ ♦ దా నైష్ఠికి యా
వృత్తి జితేంద్రియవర్తన, మత్తఱి నొడఁగూర్పఁ జాలి ♦ యలవడు చుండన్.

క॥ దిక్కుల రెండిటఁ దలఁచిన, యక్కఱ సెడె ననుచు నుత్త ♦ రాశాగతుఁడై
యెక్కుడు వెలుఁగు వెలయనుతి, కెక్కెన్ భాస్వంతుఁడతఁడో ♦ యితఁడో యనఁగన్.

తే॥ కౌశికీతీర మెసఁగి ని ♦ ష్కంటకముగఁ
దనదు తపమును రెట్టించెఁ ♦ దాపసుండు
పుణ్యభూమిప్రభావంబు ♦ భూరిశుభద
యాయమయు క్షేమయోగమ్ము ♦ లరయు చుండ. ౪౨౯

క॥ అఱమరకుఁ బోక చూడ్కి, న్నెఱి లక్ష్యము సేర్చి నిలిచె ♦ నియతి దనర న
త్తఱి వాయుభక్షియై య, క్కఱ తుది ముట్టకయ తెరలఁ ♦ గా దను దీక్షన్.

వ॥ విఘ్నంబులకుఁ జెరువీక యేకలక్ష్యంబున నత్తపోధనుండు చిరకాలంబు స్థాణు
భావంబు నిర్ణయంబు గైకొని యున్నంత. ౪౩౧

చ॥ సురలు భయార్తులై యతని ♦ చొప్పు దలంచి విరించి సన్నిధిం
బరువడి విన్నవించి మముఁ ♦ బాలనసేయు మదఃపరిశ్రమం
బరసి మహర్షి వైతి వని ♦ యాదర మొప్ప వచించి నావుడున్
వెరవున వారి పల్కు గొని ♦ విశ్వవిభుం డటు వచ్చి చెచ్చెరన్. ౪౩౨

ఆ॥ స్వాగతమ్ము వత్స ♦ సంయమివర్య; మహర్షి వైతి లెమ్ము ♦ హర్ష మొదవె
మహిమ తోడి దైన ♦ మహితర్షి భావమ్ము, నీ కొసంగినాఁడ ♦ నెగడు మనిన.

క॥ భగవంతుఁడ నే నీ దయ, నగణితము మహర్షిపదము ♦ నందితి నేనిఁక
సుగమమె జితేంద్రియత్వము, నిగమప్రణయీ; శ్రుతంబు ♦ నెఱయింపు మనన్.

ఆ॥ బ్రహ్మ పలికె నోయి ♦ ప్రాజ్ఞుండ విజితేంద్రి
యత్వమునకుఁ దగిన ♦ యత్నమున మె
లంగు మనుచు, ముని శు ♦ భంగమేచ్ఛుఁడు వారి
వీడుకొలిపి చిత్త ♦ వృత్తి మెలిపి. ౪౩౫

సీ॥ ఎండ నిల్చిన యట్టు ; లే నిల్చి వానకు, గాలికి నెదురయి ♦ గాసిఁ బడక
చలికి వడఁకక ♦ జలపాయియై ధూమ, పాయియై యటు లూష్మ ♦ పాయియనయి
పది పది నూరేండ్లుఁ ♦ బాటిల్లు ధృతి మించి, యూపిరిఁ బుచ్చక ♦ యొక్కవేయు
నేండ్లు మహానిష్ఠ ♦ నిట్టలమ్ముగఁ బెంచి, యపుడు పితామహుం ♦ డన్న మాట
కా, జితేంద్రియత్వ ♦ మా, కొఱంత యొకింత
యనకు డంచుఁ దోడి ♦ మునులు నసఁగఁ
బట్టుఁ బట్టి నిలిచె ♦ బ్రహ్మర్షినై కాని
మాన ననుచు వింత ♦ మార్గమునను. ౪౩౬

— ♦ ఇంద్రుఁడు కౌశికుని యొద్దకు రంభం బనుపుట ♦—

క॥ అప్పొయిఁ గడుఘోరమ్ముగ, నిమ్మునఁ దప మాచరించు ♦ టెఱిఁగి సురేంద్రుం
డుమ్మలికమ్మునఁ బొరలుచు, నెమ్మి కఱవు తోడు తోడ ♦ నెక్కొను చుండన్.

తే॥ అన్ని వేళలుఁ దన వేళ ♦ లనుచు నాతఁ
డాదరము చూడ్కి రంభపైఁ ♦ బాదుకొలిపి
దేవకార్యంబు దీర్ప నీ ♦ తెఱఁగువారు
లేరు నా కోరు కర్జంబు ♦ లేమ ; వినుము. ౪౩౭

క॥ కౌశికుఁడ మున్నె నేఁడీ, కౌశికుని తపఃప్రకాశ ♦ కలనల మఱియుం
గౌశికుఁడ నైతి సురలుం, గౌశికు లన నైరి. రాదు ♦ కడవఁగ మాకున్. ౩౩౯

ఆ॥ పెక్కు లేల బాల ; ♦ ప్రీతిమై నరిగి సం
యమిఁ గరంచి నెయ్య ♦ మలవరించి
మదను విధులఁ జొప్ప ♦ మార్ప మాతఁడు మధుఁ
డునుఁ ద్వదిచ్ఛ నెంటఁ ♦ బెనఁగువారు. ౪౪౦

వ॥ అని యుత్తెఱంగున నత్తెఱఁగంటిచేఁ దత్తెఱవమిన్న కనుజ్ఞ సేసిన. ౪౪౧

ఆ॥ సిగ్గొకింత యొంట ♦ సింగార మొక్కొంట, భీతి యొక్క వెంటఁ ♦ బెరయ నెదిరి
పలుక లేక పలికె ♦ భామినీమణి సహ, స్రాక్షు తోడ సాంత్వ ♦ లక్షితముగ.

క॥ ఒల్లమిఁ జూపిన వల పెటొ, చెల్లించినఁ గడకుఁ దపసి ♦ శీఘ్రక్రోధుం
డల్లాడఁ జేయుఁ గాని స, ముల్లాసంబున వెలార్పఁ ♦ డోపఁడ ; యెట్లున్.

క॥ నను మన్నించి ప్రసాదం, బెనయింపుము దేవ ; యనుచు ♦ నెలనాగ భయం
బున వేపమానయై తెఱఁ, గనుమానించుటఁ దలంచి ♦ యనెఁ బతి సుధృతిన్.

తే॥ ఎన్నఁ డేనియుఁ దలఁక వి ♦ శ్లేల బాల;
వేల నైతివి నీవేరు ♦ పెనుపుఁ గ్రాల
గెలుతు మధుమన్మథులు తోడ ♦ మలసి రాఁగ
మోహనాంగి ; పైఁ గా పేను ♦ మొనసి యాఁగ. ౪౪౫

క॥ సురకార్యము మచ్ఛాసన, మరసి నెఱపు మలఁతిఁ బోకు ♦ మా నీకు శుభం
బిరవు కొలుపు మీనాభా, స్వరరూపము సుందరాంగి ♦ బహుగుణితముగాన్.

తే॥ గండుకోయిల ధ్వని మొద ♦ గంటిపఱప
నిండు మనమున మాతోడ ♦ నీవు నెఱయ
జావ గాకుండ హరుఁడొ శ్రీ ♦ సఖుఁడొ కీర్తి
దడవు గొమ్మ లే తె మ్మని ♦ తఱుముటయును. ౪౪౭

క॥ సందేహించి తొలంగఁగ, సందేమియు లే దటంచుఁ ♦ జని శంబరజి
త్సందేశము పికరుతము ప, సందే యనఁ గూర్చెఁ దొలుతఁ ♦ జాన తపసికిన్.

వ॥ అనంతరక్షణంబున ననంతరక్షణ యగుచు నాలక్షణవతి సలక్షణంబుగ లోకవిల
క్షణమునిక్షణదాధిపతివీక్షణమార్గం బధిగమించి. ౪౪౯

సీ॥ వెలిచూపు గాని లోనఁ♦గల చూపు మరలించు, మోహనాకారమ్ము♦మొనయఁ జేసి
శ్రుతిపథంబున కెక్కు ♦ శ్రుతిపథం బనిపించు, శోభనగీతిమైఁ ♦ జొక్కు గూర్చి
తియ్యవింట స్ఫురించు ♦ తియ్యందనము తోడి, యుక్తిప్రయుక్తినో♦ రూరఁ దార్చి
మైదీవ పూవుల ♦ మలయించు తీవుల, దవ్వులాటముల మెత్తఁ♦ దనము సూపి
వలయు వలపుల నందిచ్చు ♦ వలఁతి గంధ
వాహు చెయ్వుల ఘ్రాణత ♦ ర్పణ మొనర్చి
యన్నెలఁతమిన్న గాధిజు ♦ నంత వాని
బంటకో త్సేఁతకై నిజ ♦ ప్రజ్ఞ మెఱసె. ౪౫౦

తే॥ కలఁకఁబాఱిన మది తోఁసె ♦ పలుకఁ బాఱె
నేమ మటు కామమునుఁ దన ♦ నీతిఁ బాసెఁ
గ్రోధ మే నే ననుచుఁ బయి ♦ కొనఁ గడంగె
డంబుగ రజోగుణంబు ద ♦ ర్పంబుఁ బెనుప. ౪౫౧

—♦ విశ్వామిత్రుఁడు రంభకు శాపంబొసంగుట ♦—

క॥ జాలిం బడి తపమునధృతిఁ, జాలించి తపస్వి సురల ♦ చాలెంచిన యా
కీ లరసి శిక్ష సేయఁగఁ, గీలించె న్మది, నమర్ష ♦ కీలితవృత్తిన్. ౪౫౨

ఆ॥ రహికిఁ దార్పఁ జూచు ♦ రంభ యారంభంబు
క్రోధదర్పములకుఁ ♦ గుదురు గాఁగ
దానిఁ గాంచి దాని ♦ దానించు నెఱి మాని
పూని పలికె మౌని ♦ పుంగవుండు. ౪౫౩

తే॥ చేడె యిటు లెల్లెడలఁ బని ♦ చెఱుపు లరయు
శైలి మీఱ కించుఁ గావున ♦ శైలికలన
వెరయుఁ గావృత మిఁకఁ బది ♦ వేలు వత్స
రంబు లటు లుండు మది పది ♦ లంబు గాఁగ. ౪౫౪

క॥ అని శాప మొసంగిన నబ, లనుఁ బరవతి ననఘు, చిత్క ♦ లానిధి; కరుణం
గని కాపు మనుచు వేఁడినఁ,జను నిది యొక ద్విజుని కతనఁ♦ జనుమనిమునియున్.

వ॥ అద్దాని నూఱడించె నదియు నవ్వనంబునం దొడ్డొన శిలారూపంబునం బస చెడి
పడి యుండె నంత. ౪౫౬

క॥ కోపము సంతాపమ్మున, కోపక యాపడఁతి నట్టు ♦ లుర వడఁచి తపో
రూపము సెడె నీపాపఁపు, శాపమ్మున ననుచుఁ దపసి ♦ సంభ్రమపడుచున్. ౪౫౭

ఆ॥ తనదు దర్ప ముడిగెఁ ♦ దద్దయుఁ గందర్ప
దర్ప ముడుప నెఱపు ♦ తామసమున
నెట్లు గలుగు శాంతి ♦ యింద్రియార్థజయంబు
లేని బ్రాహ్మ మెందు ♦ నేనిఁ గలదె. ౪౫౮

ఉ॥ పూనిన నేమ మెప్డు నిటు ♦ పోరచి గాఁ బఱికింప కేవిధిన్
గానని కాన్పు బ్రహ్మకలఁ ♦ గాంచెదు వాఁడ నటంచుఁ దామసం
బానఁగ నీక తూర్పుదెస ♦ కాతఁడు వే చని పెద్దకాల మె
ద్దానఁ జలింప కేకమతి ♦ తత్పరతాస్థితి మించు సంచునన్. ౪౫౯

ఆ॥ తప మొనర్చి నెట్టి ♦ తగులాటముల వంక
కేనిఁ బోని తగవు ♦ నూను పూను
దలనుఁ దలను మోచి ♦ తన మనంబు విరించి
పాదపద్మయుగము ♦ పాల వైచి. ౪౬౦

—♦ హరిశ్చంద్రోపాఖ్యానము ♦—

వ॥ అక్కాలంబున సుధర్మాస్థానంబున దేవవిభుండు బ్రహ్మణ్యులైన వాచంయముల సరసము లనఁబడు పలుకుబడుల వలని యరుసంబునం బొదలుచు నెవ్వలనున నేని సత్యం బెడలసీని చక్కని పుడమిఱేని నొక్కని నెఱింగించి యంచితం బగు శ్రుతిసుఖంబు సమకూర్పుడా యని పాయని వేడుకమైఁ దమ్ము వేఁడిన నయ్యర్థంబు సమర్థించు పొంటె నెల్లవారును విస్మితులు సస్మితులు నవుచుండ నంగిరః ప్రభృతులగు మునిపతులు మహనీయనిష్ఠాగరిష్ఠుండగు వసిష్ఠు నియోగించిన నయ్యోగివరేణ్యుం డవ్వారి నుడి సేకొని సంతసంబు మవ్వం బవ్వారిగా నొడలి చూపొడయనితో నెడయని తోరంపుఁబలుకుబడితో నిట్లనియె. ౪౬౧

ఆ॥ గొడ్డుపోదు నేల ♦ కొఱలేదు రాజుల
కెందు నేని సుకృతు ♦ లుందు రైన
దారు పోలఁ బోరు ♦ త్రైశంకవుని తోడఁ
బొడవు పడిన యట్టి ♦ భూమిపతులు. ౪౬౨

సీ॥ ఏడు ద్వీపములఁ బే ♦ రెక్కి తక్కిననేల, కాఁచికోలగు నెఱా ♦ రాచఱికము
రాజసూయముఖాధ్వ ♦ రహావిఃప్రసక్తి సీ, దివివిందు లరసిన ♦ తీయఁదనము
లేఁడు జోడితనికీ ♦ కేడు లోకముల నం, చను రోదసులకొక్కఁ♦డై నయసము
మిత్తి కోఱలఁ జిక్కి ♦ మిడికెడు ననద నేఁ, గాచెద నను మేలి ♦ కనికరమ్ము
నిత్యసత్యదృఢవ్రత ♦ నిష్ఠుఁడైన
యాతనికె చెల్లుఁ గాక, యే ♦ మనఁగ వచ్చుఁ
జాటి చెప్పెద నల హరి ♦ శ్చంద్రనృపతిఁ
బోగడ నేరఁడు. వేనోళ్ళ ♦ పొగిడ యేని. ౪౬౩

క॥ మును జనిన వారి నియ్యెను, పున నెలకొనుచున్న వారిఁ ♦ బొనరంగల వా
రినిఁ గనమో కనఁబోమో, కనము హరిశ్చంద్రు నెనయఁ ♦ గల రాజమణిన్.

ఆ॥ అంబరమణి ముజ్జ ♦ గంబులు వెలయించు
నటులె తత్కాలీను ♦ లనఁగఁ జెల్లు

నందుఁ జంద్రకీర్తి ♦ నా హరిశ్చంద్రునిఁ
జెప్పి లాఁతిఁ జెప్పఁ ♦ దప్పు గాదె. ౪౬౫

వ॥ అని యమ్మహానుభావుండు నిక్కంబ నొడివిన సభాసదులెల్ల రసనిష్యందపరీవాహంబునం బొదలుచుండ సహస్రాక్షుండును నపారసుఖపారవశ్యం బనుభవించుచుండె నంతం గలహాశనుని వలన నంతయు వింతయుఁగ విని గాధితనయుండు తనదు తపోనియమంబు చాలించి వశిష్ఠసంయమివరు నెడం గల చలపాదితనంబున. ౪౬౬

ఆ॥ పొగడవచ్చు నొక్క ♦ ప్రొద్దుండియునుఁ బక్ష
పాతమునను భట్టు ♦ పగిది నెట్లు
సేయఁ బోదు తన్నుఁ ♦ జెడుగు పౌరోహిత్య
మవని నొక్క మనుజుఁ ♦ డంత గలఁడె. ౪౬౭

క॥ అడ్డుపడుఁ గాక తానిట, గడ్డుపను ల్గూర్చి వానిఁ ♦ గారించెద నా
యొడ్డిన యురులం బడునో, దొడ్డు తనంబునఁ జెరల్చి ♦ త్రోవంగనునో. ౪౬౮

ఆ॥ ఓడునేని గురుఁడుఁ ♦ దోడుగాఁ దా నోడు, గెలుచు జగము లెల్ల ♦ గెలిచె నేని
నేలు నిందు నందు ♦ నేలికయై చతు, ర్దశమనుప్రభావ ♦ దార్ఢ్య మొప్ప. ౪౬౯

క॥ అని ప్రతినచఱచి చని క్రతు, ధన మని మనుజవిభు వేఁడి ♦ తద్దత్తం బా
యనఘుని యొద్దనె న్యాసం, బొనరించి విరించికల్పుఁ డొదవెడు వేడ్కన్. ౪౭౦

చ॥ మెకముల సృష్టిసేసి మితి ♦ మీఱిన వానిఁ జెరల్ప తేఁడు వేఁ
టకుఁ జనఁ బొంచి శాంబరము ♦ డంబర మొప్ప నిజాశ్రమానని
నికటవనిన్ శ్రమోపగతు ♦ నిం బొనరించి తపఃప్రభావభా
వుకకలనాప్రసక్తిఁ డని ♦ వోని చలంబు బలంబు గూర్పఁగన్. ౪౭౧

సీ॥ కొమరిత లని మాల ♦ గుబ్బెతల సృజించి, యధిపుపాలికిఁ బుచ్చ ♦ నతఁడు మెచ్చఁ
బాటపాడి వరంబుఁ ♦ బడసి యాచెడిపలు, పడుపు గోరినఁ బెడఁ ♦ బాయఁ జేయ
బిడ్డలఁ గొట్టితి ♦ పెంపేద నని తిట్టి, యాడి తప్పితి నను ♦ మని యదల్చి
కొమ్మలఁ గొమ్మని ♦ కొసరి ధర్మువు గాని, దాని నొల్లను రాజ్య ♦ మేని నొల్ల
ననిన ననఘు ; యట్టు ♦ లైన సప్తాంగము, ల్దారపోయు మంచుఁ ♦ దవిలి యొడిచి
వాని వెడల నడిచె ♦ వరసతీసుతులతోఁ, గట్టుపుట్ట మునిచి ♦ గాధిజుండు. ౪౭౨

వ॥ వెండియు నత్తపోధనుండు. ౪౭౩

క॥ చను నెడ రమ్మని న్యాసం,బు, ధన మిమ్మని యప్పు మోపి ♦ దండడి సేయన్
దన శిష్యు నొక్క కర్కశుఁ, బనిచె న్నెల గడువు సేసి ♦ పార్థివు తోడన్.

వ॥ అంత నమ్మానవనాథుం డాలుబిడ్డలుం దాను నొత్త్తారవునఁ దత్తఱపాటు లే కమ్మునిశిష్యునకు వివిధోపచారమ్ము లొనరించుచు నాతండు నిర్దయుండై పన్ను పఱచు బన్నంబులు పెక్కులు సహించుచు నాకలిడప్పుల కోటువోక దుర్గమాట విమార్గంబు వట్టి యరుగుచుండు నయ్యవసరంబున. ౪౭౫

సీ॥ దావాగ్ని సృజియించి ♦ తద్ధర్మపత్ని ప్ర, వేశింప నది యాఱు ♦ వెలుకఁ బాఱి
భేతాళుఁ బురికొల్పి ♦ పృథివీశు నసిధార, నాతండు దెగి కూల ♦ నదవదపడి
భేదతంత్రంబులుం ♦ బెనఁచి యవ్వారల, నైకమత్యంబున ♦ కంగలార్చి
ముప్పుత్రిప్పులఁ బెట్టు ♦ ముని బాలునిఁ ద్రిశుద్ధి, నోపి సేవించుట ♦ కోహటించి
కాశి చేరెదు నందాక ♦ గాసిచేసిఁ
గాని యామీఁద విశ్వేశు ♦ కరుణఁ దనదు
మోస మే మౌనో యని మౌని ♦ మురువు వాసి
వాసి గలవాఁడు వీఁ డని ♦ వాని మెచ్చె. ౪౭౬

క॥ అయ్యవసరమున ముని దన, డయ్యని చలమున మెలంచు ♦ డంబరము దెసన్
దయ్యమ్ము నెత్తికో లెటు, లొయ్యన వర్తిల్లఁ జూచు ♦ నో యనుకొనఁగన్.

క॥ విశ్వేశుని సేవించి మహేశ్వరనిభుఁ డినుడు బంధ ♦ మెడలె ననియెఁ గా
కాశ్వాసింపఁడు తన సిరి, శశ్వత్సుఖయోగి తుచ్ఛ ♦ సౌఖ్య మరయునే. ౪౭౮

ఆ॥ మహిపు సాధ్విఁ జంద్రి ♦ మతి దుర్ద్విజుని యింటి
దాసిఁ జేసి వడ్డి ♦ వాసె ననియె
నంటరాని కొలము ♦ నంటించి పతి నమ్మి
యప్పు దీఱె ననె మ ♦ హర్షి యపుడు. ౪౭౯

క॥ చండాలుని పనుపున నృపుఁ, డుండెను సుంకరిగఁ బిత్రువ ♦ నోద్దేశమునన్
జండి ద్విజసతిఁ గొలిచె న, య్యండజయానయు నిరంత ♦ రార్దిత యగుచున్.

వ॥ అట్లుండం గొంతకాలంబునకు విధుమర పౌరుషునం బోని మాత్సర్యాతిశయంబున. ౪౮౧

ఆ॥ పాముఁ గఱవఁ బనిచి ♦ పట్టి సీల్గినఁ దల్లి, వానిఁ గొని శ్మశాన ♦ వాటి కరుగఁ
గాటి సుంక మడుగు త్వన్నాథునకు దేవి, దర్శనంబు గూర్చెఁ ♦ దాపసుండు.

వ॥ అట్టిసన్నాహంబున సన్నాతితిలకంబు కల్కంబుల పులకం బగు శోకాతిరేక పరీపాకంబున. ౪౮౩

ఉ॥ చేరెడు నేలకుం దగఁడె ♦ శ్రీలకుఁ దానక మేడుద్వీపముల్
కోరి నిజాంకపీఠి కయి ♦ కోలున కుబ్బఁగఁ దాల్చు తేని కై
శోరకమూర్తి యీతఁ డవి ♦ శుద్ధచరిత్రను నేన నేఁటి కా
భూరమణీమనోహరుని ♦ పాం దెడఁ బాసియు బ్రమంద కుండుటల్. ౪౮౪

చ॥ అని పలవించు చున్న సతి ♦ నాతఁ డెఱింగి కలంగి కర్మముల్
చెనయఁ దొలంగ నేరి కగుఁ ♦ జేడ్రో ; మాడకు లేదె నీమెడన్
జను మది పెట్టినైన దొర ♦ సాని నోకించుక వేఁడి యైనఁ దె
మ్మనవుఁడు నాథ ; యి ట్లయితి ♦ వా ? యని హాయని సోలి చేడ్పడన్. ౪౮౫

ఆ॥ అతివ సేద దేర్చి ♦ యాశ్వాసిత నొనర్చి, ధర్మ వింత యేనిఁ ♦ దప్ప వలవ
దఁగి ర మ్మనంగ ♦ దరలాక్షి పురవీథిఁ, బోవు చుండ గాధి ♦ పుత్రుఁ డపుడు.

క॥ రాజద్రోహులఁ బొంగల, నోజం గల్పించి వారి ♦ యొనరించిన కీ
డాజవరాలి పయి దొరలఁ గాఁ జేసి సుమేధ్య వధ్యఁ ♦ గాగ ఘటించెన్. ౪౮౭

ఆ॥ కాని పోని యపఖ్యాతి ♦ గలిగె ననుచు
నిలువు నీర య్యెఁ దనలోన ♦ నీరజాక్షి
యందు నాత్మేశుఁ డధికృతుం ♦ డతని మూర్తి
నెంచుచుఁ వ్యజింతు నుసు ఱలం ♦ చెలమిఁ గనియె. ౪౮౮

ఆ॥ రాజశాసనమున ♦ రాజీవదలనేత్ర, వీరబాహుఁ డనెడు ♦ వింతమాల
వాని దాసుఁ డైన ♦ యాన్నపేందున్రిన కప్పు, డప్పగించి యరిగి ♦ రల తలార్లు.

ఉ॥ బిడ్డని పాటు గాంచి మదిఁ ♦ బ్రేయసి చేటుఁ దలంచి స్వీయమా
చెడ్డతనంబు నెంచి విధి ♦ చేసిన చేఁత స్మరించి నేలపైఁ
డడ్డము వచ్చు పెన్వగల ♦ నాఁగి తటాలునఁ గత్తి దూసి పై
నొడ్డెఁ బతివ్రతాతిలక ♦ ముగ్మలి బ్రేయఁగ నిశ్చలాత్ముఁడై. ౪౯౦

క॥ తోడనె పొడసూపి కడు, న్వేడబ మన నయ్యెఁ దనదు ♦ విధ మని మది నా
లోడన మెక్కుడుగా నే, జాడ న్మరలింతు వీని ♦ సంయమ మనుచున్. ౪౯౧

ఆ॥ తొడరు కత్తితోఁ ♦ దొర చేయి బిగఁ బట్టి, వలవ దింత తెగువ ♦ వనిత విడువు
మనుతపోధనునకు ♦ నంజలి సేసి యు, మ్మానధనుఁడు నిర్మ ♦ మత్వ మొదవ.

క॥ తలఁగు మనఘ ; నినుబోంట్లకు, వలనే యిట్లనఁగ నేలు ♦ వాని యనుజ్ఞన్
గలనేని నేను మఱవం, గలనే నాయాన యింకఁ ♦ గా దన నీశున్. ౪౯౩

వ॥ అని యత్తపస్వివరేణ్యు నివారించి చంద్రహాసం బమర్చ్చి కొని హరిశ్చంద్రుండు తన కోమలాంగి కంఠనాళంబు గుఱిసేసి వైవ నుంకించిన. ౪౯౪

సీ॥ సికమీఁది పూబంతిఁ ♦ జిందు మరందమా, చదలేటి వలపునఁ ♦ బొదలు ప్రోడ
సామేని చొక్కాట ♦ మే మెచ్చి తక్కిన, నెమ్మేని మఱపున ♦ నెగడు మేటి
యగ్నిశిఖాంచిత ♦ మగు చుక్కబొట్టున, మదను దర్పోద్ధతి ♦ మలఁచు దంట
తలమానికముల త♦ళ్కుల మించు పాపపే, రుల సంగడమ్మున♦ వెలయు వలఁతి
మునులు వేల్పులుఁ దన తోడ ♦ మొనయుదేర
వాగ్రమేశ్వరు లుభయపా ♦ ర్శ్వములఁ జెట్టఁ
బట్టి రా గట్లరాయని ♦ పట్టి చెలువుఁ
డట్టె చూపట్టె విశ్వేశుఁ ♦ డరుస మెసఁగ. ౪౯౫

క॥ అంత నడుచు కథ లన్నియు, వింతలుగా నాటకమున ♦ విధ మెఱుకపడన్
సంతసమున మ్రొక్కిన నృపుఁ, గంతు విమతుఁ డెత్తి తనదు ♦ కౌఁగిటఁజేర్చెన్.

క॥ వర మడుగు మన్న; యను న, వ్వరదయు వినుతించి భక్త ♦ వత్సల; శివ; నీ
శరణమునఁ జేరి నిన్నే, శర ణని సేవించి మనఁ బ్ర ♦ సాదింపఁ గదే. ౪౯౭

ఆ॥ అనుచు నృపుఁడు వేఁడ ♦ నభవుండు కౌశికు
దిక్కుఁ జూడ నతఁడు ♦ దేవదేవ
యీతఁ డేల వలయు ♦ నిలఁ జతుర్దశమను
కాలమితి మహేంద్రు ♦ గద్దె దరిని. ౪౯౮

క॥ నిల వలె నటు లన మేలని, పలికిరి సుర లీశుఁ డట్లె ♦ భావించి యనా
విల యగు నీకథ దివి భువి, విలసిల్లుఁ బ్రసక్తులనుఁ బ ♦ విత్రులఁ జేయున్.

తే॥ మోక్షమరచేతి బంతి నీ ♦ ముద్దులాఁడు
మూర్ఛ దేఱెను సాధ్వి యి ♦ మ్మగుడఁ గూడి
ప్రజలఁ బాలింపుము నిలింప ♦ భర్త తోడి
చుట్టఱిక మధ్వరంబుల ♦ సొంపు మీఱ. ౫౦౦

క॥ అని పలుకుబడుల యమృత, మ్మున మొనయింపుచునె రాజ్య♦మున నృపు నభిషి
క్తునిఁ జేసె నీశుఁ డమరులుఁ, ననల జడిం గొలిపి రెలమి ♦ నాయకుఁ డలరన్.

వ॥ అంతవట్టువారు మితిమీఱు సంతసంబునం బొదలుచు నారాజశేఖరుని సచ్చ
రిత్రం బుపన్యసింప నాతని నుపలాలింపం దనతోడివారల యగుచుండ నవ్వారల
తోడం గూడ రాజశేఖరుం డంతర్ధానంబు సేసెఁ బదంపడి వ్రడమియొడయుండును
స్వారాజ్యమణిపీఠం బలంకరించె వశిష్ఠకుశికనందనులుం దలఁ గడచు నానంద
మ్మునం దనరారు చుండియు నన్యోన్యలక్ష్యంబులగు మాత్సర్యంబుల నొండొరుల
నధిక్షేపించుచుఁ దపంబున పెల్లు పొల్లువోవం గడమబిడ్డలం గూడఁ జెంపుసం
జంపుకొనియుఁ దనివోక క్రౌంచరూపంబులం గైకొని బహువత్సరంబులుం
బోరాటంబులు సలిపి విసివియు విసువక విధిప్రేరణంబున నుడిగియు నుడుగక
యుడుకారు మనమ్ముల నొండొండ కెమ్ముకొనుచు నప్రమత్తుల రయ్యును బ్రమ
త్తుల భంగిన బ్రవర్తిల్లుచుండి రంత. ౫౦౨

ఆ॥ పెద్దకొడుకు శక్తి ♦ పెనురక్కసుని వాతఁ
బడినఁ జావఁ దలఁచి ♦ యొడలు మఱచి
యడవి త్రోవఁ బోవ ♦ నవ్వసిష్ఠుని కోడ
లడరు గదురఁ దోన ♦ యరుగుచుండ. ౫౦౩

వ॥ ఆయువతి గర్భవతియై యుంట నద్దాని గర్భంబున శమీగర్భసందర్భంబున సుద్భా
వితుం డగు బృహద్భానుం బోని యర్భకుండు నిర్భరుండై సంప్రదాయపరిశుద్ధం
బుగ శ్రుతిప్రచారం బొనరించుచుండ నయ్యది తనకొడుకు ఘణితి కనుగుణంబై
శ్రుతిసుఖం బొనగూర్ప నమ్మహాత్ముండు వెనుకకుఁ దిరిగి చూచి కోడలిం గనుం
గొని యవ్వా ; నీ వెవ్వతవే యని యడిగిన నాయమయు నతివేలంబగు మన్యు
సంపాతంబునం బొగులుచు నొగులుచుఁ దన్నెఱింగించిన. ౫౦౪

చ॥ నిలుకడఁ గాంచి తెల్విఁ గని ♦ విస్మృతశోకవిపాకబంధుఁడై
మలఁగి నిజాశ్రమంబున స ♦ మంచితనిష్ఠఁ దపం బొనర్చుచున్
బోలఁతుక గర్భపోషణముఁ ♦ బూర్ణమనస్కత నాచరించుచున్
దలఁగెను గాధిపుత్రు నెడ ♦ దద్ద గడంగు క్రుధాతిరేకమున్. ౫౦౫

ఉ॥ అంతటఁ గౌశికుండును న ♦ నంతము స్వీయతపఃప్రభావ మొ
క్కింతయుఁ దిక్క కోటుపడు ♦ సెంచి కలంచిన మచ్చరమ్ముఁ దా
మంతనమందు రోసి యొక ♦ మాటున నిల్చి తపఃప్రసక్తి భా
వింతును బ్రహ్మభూయ మని ♦ విస్తృతశాంతిరసప్రబోధుఁడై. ౫౦౬

ఆ॥ పరమదుష్కరంబు ♦ పరఁగించె నవ్రతి, మంబు దారుణంబు ♦ మౌననిరత
నైన తపముఁ దపసి ♦ యాసహస్రాబ్దంబు, లఖిలసురలు మునులు ♦ నలుకుచుండ.

క॥ ఆ వర్షసహస్రము లటు, గా వచ్చినఁ గాష్ఠభూతుఁ ♦ గనుకనిఁ బలువం
గా వలసె నతనిఁ గనుఁగొని, యేవిఘ్నములకును యేని ♦ వినకులతిలకా. ౫౦౮

క॥ క్రోధము దెరలెనుఁ గామము, పాధి మఱచె భంగములకె ♦ భంగ మొదవె న
ట్లాధివ్యాధులు పడకొఁ ద, పోధను మౌనవ్రతంబు ♦ పుణ్యం బెగునన్. ౫౦౯

ఆ॥ అట్టి దీక్ష పూర్ణ ♦ యౌ నెడ భుజియింప, నెంచి వాని పాక ♦ మంచితముగ
సిద్ధపఱచి నంతఁ ♦ జేరె నతిథిత్వంబు, నందియింద్రుఁ డన్న ♦ మన్ననుచు. ౫౧౦

క॥ ఒం డేమి యనక ద్విజున క, తం డొసఁగె భుజించె నతిథి ♦ తన కద్దెస నొ
క్కండు మెతుకేనియును లే, కుండఁగ నద్దాని కేనిఁ ♦ దనుఁకం డెదలోన్. ౫౧౧

క॥ ఆవల వర్షసహస్రం, బావిధ మౌనంబభుక్తి ♦ యద్ధ్యుచ్ఛ్వసితా
భావంబునుఁ జేకూరఁగఁ, బావనుఁడతఁ డుండె యోగ ♦ పరతంత్రుండై. ౫౧౨

సీ॥ ప్రాణవృత్తి బిగించి ♦ పరఁగ దశేంద్రియ, వ్యాపారములు మాన్చి ♦ యంతఁ బోక
మనమున వాక్కు న ♦ మ్మనము విజ్ఞాన మం, దదియు మహత్తత్త్వ ♦ మందుఁ జేర్చి
శాంతాత్మ నద్దాని ♦ సరగ లీన మొనర్చి, యధ్యాత్మలక్ష్మైక్య ♦ మలవరించి
ప్రణవంబు సావిత్రి ♦ బ్రహ్మరూపంబున, కనురూపముగ యోగ ♦ మవధరించి

బాహ్యవృత్తుల మఱచి యు ♦ బాహ్యశక్తి
కలిమి నుచ్ఛ్వాస నిశ్వాస ♦ ములును నిలుప
నిలిచె నటు వేయువత్సరం ♦ బులు మహాత్ముఁ
డాతఁడు తపఃప్రతిష్ఠాప ♦ మంచితముగ. ౫౧౩

ఆ॥ అట్టు లూర్పుఁ బుచ్చ ♦ కతడు వేయును నేండ్లు, నుండ మస్తకమున ♦ నుండి వెడలె
ధూమమండలంబు ♦ తోఁచెఁ ద్రైలోక్య మా, దీపితంబ కాదె ♦ దీన ననఁగ.

ఆ॥ అఖిలసురలు మునులు ♦ వ్యామోహితాత్ములై
మందరశ్ము లగుచు ♦ మలయు కశ్మ
లమున మునిఁగి తేలి ♦ విముఖులై యాపితా
మహుని నడిగి రాత్మ ♦ మౌన ముడిగి. ౫౧౫

సీ॥ అల్ల విశ్వామిత్రుఁ ♦ డాచరించెడు తపం, బంతకు మిక్కుటం ♦ బై తనర్చ
నొగి నంతరాయంబు ♦ లొదవించి చూచితి, మవి యెల్ల నైష్ఫల్య ♦ మందఁ గడఁగెఁ

క్రోధలోభము లందు ♦ గొనకొన వడు గిడ, మోహ మయ్యెడ గత ♦ మోహ మయ్యె
వృజిన మొక్కింతయు ♦ వెలయ దాఘను దెస, నే యుపాయము లింక ♦ డాయఁ గలవు
దేవ ; యాతండు గోరిన ♦ దివ్యపదము
బ్రహ్మపదమొ యొసఁగి చక్క ♦ పఱపవేని
ముజ్జగము లొక్క మొగినె సి ♦ ర్యాలములగుఁ
దరలు మయ్యా ; యాదుర్దశ ♦ దన్నులకుండ. ౫౧౬

ఆ॥ వ్యాకులంబు లగుచు ♦ వఱలవు దెస లంబు
ధులు గలంగె నచల ♦ ములు చలించెఁ
బ్రిదిలెఁ గదలెఁ బృథివి ♦ వీచె గాడ్పు భృశాకు
లుడుఁగ నయ్యె నిష్ప్ర ♦ భుఁడుఁగ రవియు. ౫౧౭

క॥ విభుఁడ ; క్షుభితమానసముగఁ, ద్రిభువనమును నాశ మెనయు ♦ దెఱఁగున క్రొ న్నా
యభ మొదవ కుండు నాలో, శుభ మత్తేజస్వి వెరయఁ ♦ జూచి నిలుపవే. ౫౧౮

ఆ॥ అగ్నిరూపుఁ డటు మ ♦ హాద్యుతి భగవంతుఁ, డును ననంగ నెగడు ♦ మునివరేణ్యు
సుప్రసన్నుఁ జేయఁ ♦ జూడుము కాలాగ్ని, కలన జగము లెల్లఁ ♦ గాల్పకుండ.

క॥ అని మొఱయిడ నిదె వచ్చెద, నని భక్తాభీష్టదాత ♦ యంబుజగర్భుం
డను వొప్పఁగఁ బ్రస్థానముఁ, బొనరింపఁ దలంపు నిండఁ ♦ బొదలుచు నుండన్.

క॥ అదనున మునియోగోన్నతి, యదనంబై స్థాణుమూర్తి ♦ తాస్పదమై త
త్పదలక్ష్యభృతినిభృతమై, కదల విడే మనుచు నలువఁ ♦ గలవరపఱచెన్. ౫౨౧

ఆ॥ బ్రహ్మరంధ్రమునను ♦ బరఁగు జ్యోతిర్లేఖ, లంచగఱుల కొనల ♦ నంది కొనఁగఁ
బ్రీతి వొనర నవ్వి ♦ రించనుం డగుదెంచె, నెల్లసురలు మునులు ♦ నెలమిఁ గొలువ.

—♦ విశ్వామిత్రుండు బ్రహ్మర్షి యగుట ♦—

క॥ హస్తము తన్మస్తకము స, మస్తజగత్కర్త సేర్చి ♦ మలయించిన నం
ప్రస్తుతుఁ డతఁడు వినతుఁడై, ప్రస్తుతుఁ గావించెఁ బద్మ ♦ భవునిఁ బ్రశస్తిన్.

తే॥ అందఱు సురర్షు లజుఁడు నె ♦ య్యము దలిర్పఁ
గదిసి బ్రహ్మర్షి ; నీకు స్వా ♦ గతము నీదు
తపము పెంపున సంతుష్టిఁ ♦ దనరె నార
మిందఱ మటంచుఁ బలికి ర ♦ ల్లయు మదిని. ౫౨౪

ఆ॥ బ్రాహ్మణత్వ మీవు ♦ వడసితి వగ్ర్య మ, గ్రంబునైన తపము ♦ కలిమి బలిమి
దీర్ఘమాయు వేనుఁ ♦ దివుటమైఁ గూర్చితి, నీకు శుభము స్వస్తి ♦ నెగడు మయ్య.

చ॥ అనుచుఁ బితామహుం డనిన ♦ యంతన యెల్లర కన్నియంతకున్
మన మలరంగ మ్రొక్కి ముని ♦ మాన్యుఁ డతండు విధాత తోడ ని
ట్లనె జగదేకవంద్య నను ♦ నంచితుఁ గాఁ బొనరించితేని బ్ర
హ్మనిరతిఁ గూర్చుఁ గాత నిగ ♦ మప్రణవప్రథిత ల్వషట్కృతుల్. ౨౮

ఆ॥ అనిన బ్రహ్మమూర్తి ♦ వైనప్డె యవి యెల్ల, వలచి నిన్నుఁ జేరెఁ ♦ దలఁప నేల
వేఱె యట్టు లైన ♦ వివరింతు గాయత్రి, నీవు ఋషివి గాఁగ ♦ నెగడు మింక,

తే॥ అనుడు గురుఁడు క్షాత్రబ్రాహ్మ ♦ ణాఖిలజ్ఞుఁ
డవ్వశిష్ఠుండు మహితుఁ డి ♦ ట్లనిన నాఁడు
గాని కానేర నని కట్టు ♦ గట్టి గాధి
పట్టి నోడువంగ విధి తన ♦ పట్టెఁ బిలిచి. ౨౯

క॥ మైత్రావరుణీ; యీతఁడు, మిత్రుఁడ వో విశ్వమునకు ♦ మే లెఱిఁగించెన్
మైత్రి నెఱపు మిఁక విశ్వా, మిత్రుఁ డనఁ బ్రసిద్ధిఁ గాంచు ♦ మేకొని జగతిన్.

వ॥ మీర లిరువురును నసమానతపోబలసమన్వితుల రట్లుం గావున మాత్సర్యం బన
భ్యర్హితం బనిన మహాత్మా; నీపనిచిన తెఱంగునన మెలంగుదు నని కుశికతనయు
నిం గౌఁగిలించుకొని వత్సా; మహనీయతపఃప్రభావంబున బ్రహ్మర్షి వైతి వింక
నుత్తమశ్లోకుండవుం గమ్మని కమ్మనిపలుకుల నుమ్మలికం బెడలించిన నామహామ
హుం డాగురువర్యునకుం బునఃపునఃప్రణామంబు లాచరించి పూజించి యపరాధ
క్షమం బర్థించి స్తోత్రపాఠంబులుం బన్ని మన్నన వడసె నట్టి సమయంబున. ౩౦

క॥ సుతనిర్విశేషుఁ డీతం, డతులితమహిమానుభావ ♦ మందం గనె వి
శ్రుత యయ్యెఁ గీర్తి తన కి, క్కృతన ననుచు గురుఁడు తృప్తిఁ ♦ గనె రఘురామా.

క॥ అచ్చర లాడిరి దివిని వి, యచ్చరు లరుసమునఁ గురిసి ♦ రలరులఁ గుశలం
బచ్చుపడె జగతి నెల్లెడ నొచ్చె మెడలి వార లోరిమ ♦ నోడఁబాటు గనన్.

ఆ॥ సురలు మునులుఁ దన్నుఁ ♦ జుట్టి రా బ్రహ్మ బ్ర
హ్మణ్యులైన వారి ♦ యర్చ లెనసి
యిరువురను సమృద్ధు ♦ లెలయుఁ డీ రంచు దీ
వించి మించు నిజని ♦ వేశ మొలసె. ౩౩

వ॥ బ్రహ్మర్షి శేఖరుండైన వసిష్ఠుండును దన యంతలుగా సుప్రతిష్ఠితుండైన శిష్యుని మేలెంచి యాశీర్వచించి యాతని వీడ్కొని ప్రమోదాతిశయంబునం బొదలుచు నిజాశ్రమపదంబునకుం జనియె. విశ్వామిత్రుండును తర్షంబు లెల్ల ఫలించె నిట్లని హర్షాయితాత్ముండయి తన యిచ్చ వచ్చినట్లుప్రవర్తిల్లుచుండె నియ్యది యిమ్మహానుభావుని బ్రహ్మర్షిత్వప్రాప్తినిదానంబైన తపశ్చరణప్రభావంబు. ॥౩౪

క॥ ఇమ్మహనీయచరిత్రం, బిమ్మెయి వెలసె జ్జగమున ♦ నెంతయుఁ బ్రీతిన్
నెమ్మది స్మరించు నాతం, డిమ్ముగఁ గను సిద్ధు లెనయఁ, డే పనిచెఱుపుల్. ॥౩౫

తే॥ రామ ; యీ వ్యక్తియె తపఃప ♦ రాయణము జ
పప్రసాదము సిద్ధిసం ♦ పత్తిసీమ
ప్రాంచితాధర్వయోగసాం ♦ ప్రాజ్యలక్ష్మి
బ్రహ్మవిద్యానిధానంబు ♦ ప్రాభవంబు. ॥౩౬

ఆ॥ ఈప్రభావమహితు ♦ నెనసి యీ రరుదేర, సిద్ధులెల్ల మిమ్ముఁ జేరి వరవు
డమ్ము సేయఁగాఁ గ ♦ రమ్ము రాగిల్లవే, రఘుకులాబ్ధిచంద్ర ♦ రామచంద్ర ;

క॥ అని యిట్లు శతానందుం, డినకులమణి లక్ష్మణాదు ♦ లెల్లరు సభ్యుల్
మునులును విన నెఱిఁగించిన, జనితానందుండు జనక ♦ జనపతి ప్రీతిన్. ॥౩౭

ఆ॥ దోసిలొగ్గి యిట్లు ♦ దొరసె శోభనలక్ష్మి, పేర్మి మత్కులమునఁ ♦ బెంపు నింప
నేను సుకృతి ననుగ్ర ♦ హీతుండ కాకుత్స్థ,మణులఁ గొంచు నీవు ♦ మలయ నూని.

తే॥ ఓమహాభాగ ; బ్రహ్మర్షి ♦ యోగివర్య ;
నేఁటికిఁ గృతార్థతం గంటి ♦ నీకతమున
వెలయవె గానమ్ము లెన్నియు ♦ విశ్వవిహిత
మనఁగ దనరెడు నీదుద ♦ ర్శనము పొనర. ॥౪౦

క॥ అను నెడ రాఘవుఁ డానం, దనవోల్లాసమునఁ బొదలి ♦ తాను ననుజుఁడున్
వినుతించిరి మునివర్యుని, వినుతకథాశ్రవణతృప్తి ♦ వెలయుచు నుండన్. ॥౪౧

వ॥ వెండియు రాజర్షివరేణ్యుం డగు జనకుండు సువిహితశుశ్రూషావిశేషంబుల నా బ్రహ్మతేజోనిధి సేవించుకొనుచుం దత్ప్రసాదంబు వడసి ప్రస్తావవశంబున. ॥౪౨

ఆ॥ దేవయజనభూత ♦ దివ్యచారిత్రంబు, దెలిసి యొండు సేయఁ ♦ దెలుఁగు లేక
యునికి శివశరాస ♦ ముంకువ గా నిడి, వేచి యుంటి ధీర ♦ వివర మరయ.

ఉ॥ ఎన్నిక గన్న వార లగు ♦ నేలిక లెందఱో తూలి యీాసునం
బన్నిన నిల్చి యేను నటు ♦ పాల్పడ స్వాన్యబలంబు లొక్కటన్
సన్న సెడన్ రిపు ల్దలఁగ ♦ సాయ మొనర్చిరి వేల్పు లాదృతిన్
బన్నము వో సహార మన ♦ పాయము నైన యనీక మేర్పడన్. ౫౪౪

క॥ సాంకాశ్యపురీశుఁడు ని, శ్శంకముగాఁ దొడర గెల్చి ♦ సంపద కేనుం
గొంకక మదనుజుఁ గూర్చితిఁ, బంక మరయుఁ గాదె రాజ ♦ పద్ధతి యెందున్.

ఆ॥ ఎన్ని పాటు లెట్టు ♦ లేనాఁడు పడిన నేఁ, డన్నియును శుభాన్వ ♦ యాంచితంబు
లయ్యె దాశరథుల ♦ ననుమతిఁ దోడితెచ్చి, శుద్ధమార్గ మీావు ♦ చూపు కతన.

క॥ అనఘా ; వేల్పుల కేనియు, ననయం బాశాస్య మైన ♦ యాదర మిస్మై
ననుఁ బొరయఁ జేసి తీ సీ, చన వన వర దేవతా ప్ర ♦ సాదమ కాదే. ౫౪౭

తే॥ అనుచు నొండొండ సమ్మదం ♦ బతిశయిల్ల
సరససల్లాపపారవ ♦ శ్యమునఁ బొదలు
చుండి రొరంత పొద్దున ♦ యుత్సుకతయు
భావిశుభసూచకస్థితిఁ ♦ బరగుచుండ. ౫౪౮

సీ॥ అంతట జనకుఁ డ ♦ త్యంతకౌతూహల, మ్మునఁ దనరారుచు ♦ మునివరేణ్యుఁ
గాంచి వెండియు ననుఁ ♦ గలదె సంతృప్తి భ, వత్తపస్తేజఃప్ర ♦ సత్తి నెగడ
వింటి నీనాఁడెల్ల విషయము ల్నేను స, సభ్యరాజకుమార ♦ చంద్రుఁడ నయి
యప్రమేయములు నీ ♦ యందుఁ దపోబల, వీర్యగుణౌఘము ♦ ల్వెలయుచుండ

నల పితామహునం దట్టు ♦ లా యుమేశు
నంద పోలెఁ ద్రివిక్రము ♦ నం దనంగ
బహువిశేషము ల్విలసిల్లు ♦ భద్రదములు
పొగడ నాకుం దరం బౌనె ♦ పుణ్యమూర్తి. ౫౪౯

ఆ॥ కర్మకాల మింకఁ ♦ గౌశికేంద్రా ; రవి, మండలంబు లంబ ♦ మాన మయ్యె
నీకు స్వాగతంబు ♦ నెఱి నొసంగు మనుజ్ఞ, యెల్లి దర్శనాప్తి ♦ నెలయువాఁడ.

క॥ అను డట్లు సేయు మనవుడు, జనకుఁ డుపాధ్యాయయుక్తి ♦ సంయమివరుఁ జు
ట్టి నమస్కరించి చనె వా, డును విడిదికిఁ జేరి రయుని ♦ రూఢి దలిర్పన్. ౫౫౧

క॥ అని వినిచినఁ జెలువునిఁ జెలు, వ నవోల్లాసం బెసఁగఁ ♦ బ్రార్థించెఁ బునః
పునరాలింగనకృతి తని, పున కవ్వలి చరిత మెనగ ♦ బోధింపంగన్. ౫౫౨

స్రగ్ధర॥ విశ్వాతీతప్రభావో ♦ ద్విలసితవిభవా ♦ వేల్లితప్రాభవశ్రీ
శశ్వత్సిద్ధస్వభావో ♦ చ్ఛ్వసితశుచియశ ♦ శ్చంద్రచంద్రాతపాఢ్యా
నిశ్వాసప్రాణనాంచ ♦ న్నిఖిలనిగమని ♦ ర్ణీతతత్త్వప్రకాశా
పశ్వాఖ్యోద్భాసిజీవ ♦ ప్రకరసుఖపరీ ♦ పాలనోద్యద్వికాసా. ౧౧౩

క॥ మునినందిత నిఖిలజగ, జ్జనిసాఫల్యప్రయుక్త ♦ సకలకలాబో
ధనచతురశ్రుతిసంస, ద్వినివేద్యాత్మానుభవవి ♦ విక్తవిచారా.. ౧౧౪

ఉపేంద్రవజ్ర॥ తపఃప్రచారానుగ ♦ తత్త్వసారా, విపాటితక్లేశవి ♦ వేకలభ్యా
ప్రపన్నసంరక్షణ ♦ బద్ధదీక్షా, విపాకసౌఖ్యావహ ♦ వృత్తివేద్యా.౧౧౫

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమున సప్తమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీరామకథామృతము.

## బాలకాండము.

—♦ అష్టమాశ్వాసము ♦—

—:(౦):—

శ్రీమదహిమకిరణాఽమృత
ధామాస్తమయోదయప్ర ♦ ధానవిశేష
భ్రామితకలామహూర్తా
ద్యామంత్రితకాలరూప ♦ తాంచిత ; దేవా. ౧

### —♦ సూర్యాస్తమయ చంద్రోదయాది వర్ణనము ♦—

తే॥ అవధరింపుము శీతన ♦ గాత్మజాత, చిత్త ముప్పొంగఁ గలధౌత ♦ శిఖరినిలయుఁ
డిట్టులను నంతరంగంబు ♦ మట్టుమీఱ, కుతుకపరివాహ మద్దెసఁ ♦ గొమరుసూప.

ఆ॥ సంయములును రాజు ♦ సల్లాపములఁ దేలు, టొలసి మత్కృతీనుఁ ♦ డోజ రాముఁ
డెల్లి శివశరాస ♦ మెత్తు వేగన వత్తు, ననుచు నస్తగిరికి ♦ నరిగె నినుఁడు. 3

క॥ అరుణుం డరుణుం డగు ట, బ్బురమే శబ్దైకగుణ న ♦ భోవీథియు న
ట్లరుణాత్వ మొనసె వారుణిఁ, గర మానినపట్ల రాగ ♦ కలనకుఁ గలవే. ౪

క॥ ఇనుఁడు నభోమణి యే యగు, టనుఁ దా నెటు మెఱయునటు వి ♦ డంబించు నభం
బునుఁ దత్రత్య యగుచుఁ దగు, ఘనరేఖయు నట్టిచాయఁ ♦ గైకొన కున్నే. ౫

ఆ॥ ఎన్ని వసువు లున్న ♦ నెంత త్రయీమూర్తి, యైన నెల్లక్రియలు ♦ నరయు చున్నఁ
దావు గాని తావుఁ ♦ దవిలి ప్రకాశింపఁ, డంతమాత్రఁ జనునె ♦ యతని విభుత.

ఉ॥ కూడి మెలంగియున్ మగని ♦ కూర్మి మెఱింగియు సంజఁ గాంచి వె
న్కాడఁ దొడంగెఁ జాయ యది ♦ యట్టిద కాదె సపత్ని వేర మా
జాడఁ దలంచి పల్కొమల ♦ సంగడ మొల్లకుఁ డంచుఁ జాటుచున్
వేఁడివెలుం గెటో చనియె ♦ విహ్వలుఁ డింతకు సాహసింపఁడే. ౭

తే॥ సతి తనదు వేఁడిమి సహింపఁ ♦ జాల కగుగ
శూన్య మగు నాకసం బింకఁ ♦ జూడ లేక
భోగవతితో వినోదింపఁ ♦ బోలు నని ర
సాతలము తెన్ను వట్టె నా ♦ జాఱె నినుఁడు. ౮

మ॥ మద మెచ్చం దఱి వేచి గుంపుగొని త ♦ న్మాంసాశను ల్తెన్నునం
గదియ న్నిట్ట పెరల్చి తద్రుధిరసి ♦ క్తస్వాంగుఁడై భోగిభూ
పద సారాపగఁ దోఁగ నేగె నన భా ♦ స్వంతుండు చాఁవొంద నె
మ్మదిఁ దేజస్విల సత్త్వ మెన్నరు గదా ♦ మందేహు లెప్పట్టునన్. ౯

ఉ॥ చాఁచిన ఱెక్కలం దిరిగి ♦ చక్కవిదుర్చుచు నిల్చి క్రిందికిం
జూచి మొదళ్లు మోడ్చి వడి ♦ ఝమ్మన డిగ్గున డిగ్గి వాసవ
ప్రాచిత దృష్టి నెక్కొన స్వ ♦ యంకృతనీడము సొంచెఁ గూయుచుం
దోఁచిన యమ్బరం దొరయఁ ♦ ద్రోవలు పట్టిన పక్కు లొక్కటన్. ౧౦

సీ॥ వారుణి తా నయ్యె ♦ వాసకసజ్జిక, పద్మిని ప్రోషిత ♦ పతిక యయ్యె
నటు విరహోత్కంఠ ♦ నధిగమించెనుఁ గోకి, కలహాంతరిత యయ్యె ♦ గగనలక్ష్మి
పాశ్చాత్యకమలిని ♦ పరఁగె ఖండిత యన, సంజ తారొక్కనె నభి ♦ సారిక యన
స్వాధీనపతికయౌ ఛాయ తోడనె చనె, విప్రలబ్ధాత్వంబుఁ ♦ బెరసెఁ బ్రాచి
యస్తశిఖరి వెనుక ♦ కా లోకబాంధవుం
డరిగినపుడ యింక ♦ నఖిలమునకు
నేన కా కొకొండు ♦ నెగడునే రాజంచు
నిరుల దొరయు దర్ప ♦ మెనసి మెఱసె. ౧౧

ఆ॥ సంజ గడవ విష్ణు ♦ సారూప్య మినుఁడు గై
కొంట కారణముగఁ ♦ గూరెఁ గృష్ణ
కలన యతనిఁ దెలియఁ ♦ గాఁ జాలమియుఁ దద్వి
భూతి భువనమెల్లఁ ♦ బొరయుటయును. ౧౨

తే॥ అబ్రమె విరోచనాత్మజు ♦ నపనయింప
మూడడుగులఁ దమోనత్తు ♦ మొనసె జగము

చిత్ర మిష్టు విరోచనుఁ ♦ జీరి తఱిమి
యొక్క యంజన జగ మెల్లఁ ♦ ద్రొక్కెఁ దమము. ౧౩

తే॥ త్రాళ్ళఁ బాముల నొనరించెఁ ♦ దవిలి స్థాణు
వులనె దొంగలుగాఁ జూపెఁ ♦ గలుఁగు మిఱ్ఱు
గన్ను మిన్నునుఁ గానని ♦ గతిఁ బొనర్చె
సంసృతియ కాఁ దమోవ్యాప్తి ♦ జనుల కెల్ల. ౧౪

ఉ॥ అన్నియు నీలఁపుం గిరులె ♦ యన్నియుఁ గృష్ణమృగవ్రజంబులే
యన్నియుఁ గప్పుమ్రాఁకులె మ ♦ అన్నియుఁ గాటుకపిట్టగుంపులే
యన్నియు భానుభూనదులె ♦ యా జను లెల్లరు శౌరిమూర్తులే
యన్నిటఁ దాన యయ్యె నిరు ♦ లౌనెటు కాలమహత్త్వ మెన్నఁగన్. ౧౫

తే॥ కప్పుటాపల్లెరంబునఁ ♦ గలయ జ్యోతు
లునిచి చీఁకటిదొరకు మే ♦ లొదవెడు మని
మించి యభిసారికలు నివా ♦ ళించి రనఁగ
నుప్పరంబున నటఁ జుక్క ♦ లుప్పతిల్లె. ౧౬

చ॥ గిరిశసుతుండు కొంచమలఁ ♦ గ్రేవ శరాహతిఁ దొల్చె నంచు నా
హరితనయుండు స్పర్ధ మెయి ♦ నాశుగము న్గొని పద్మజాండక
ర్పరపరసీమ నెల్లెడల ♦ రంధ్రచయం బిడె లోకజిత్వర
త్వరమఁ దలిర్చె నాఁ దదను ♦ వర్తిపరాభలు రిక్క లొప్పెఁగన్. ౧౭

తే॥ ఈవిమ్రాని సనలు గ్రుచ్చి ♦ యెత్తినట్టి
ముత్తెములు దోయిళులఁ జేర్చి ♦ మొనసి రాత్రి
భూధరాత్మజ తలఁబ్రాలు ♦ వోసె భవుని
శిరమున ననంగఁ జుక్కలు ♦ సెలఁగె మఱియు. ౧౮

సీ॥ తమ్మిపూదీవియ ♦ దైన్యంబున మునుంగఁ, దొగదీఁగె విరిజిగి ♦ దొరయ సాగె
జక్కవ లుస్సురం ♦ చుక్కువో సడలంగ, లలిఁ జకోరాలి కు ♦ ల్లాస మెసఁగఁ
జెరువరులకు గుండె ♦ దిగ్గుదిగ్గు రనంగఁ, జెక్కలికాండ్రకుఁ ♦ జెలివి వొడమెఁ
గాకిపిండువు గన్ను ♦ గానరా కొదుఁగంగ, గూబ లక్కజపుఁ జూ ♦ పుక్కలఁ బొసంగె
నిక్కువలకు జారు ♦ లిదె తఱి యని తారఁ
దక్కువారి కింటఁ ♦ దాఁగ నయ్యె
నొక్క యినుఁడు సన మ ♦ నొక్కండు రాజు రాఁ
జిక్కి యున్న నడిమి ♦ యిక్కటమున. ౧౯

తే॥ సమయమంత్రి నిజప్రజ్ఞ ♦ జలజహితునిఁ
దఱిమి యుదయాద్రిపదహర్మ్య ♦ తలము మీఁది
సుధను మెఱుఁగిడఁ జేసెఁ దా ♦ శుభ్రకిరణు
రాక కనినట్లు తెలిరంగు ♦ ప్రాచిఁ దోఁచె. ౨౦

క॥ మచ్చిక మీఱఁగఁ దన పతి, వచ్చెననుచుఁ బ్రాచి దెలుప ♦ వరలి రజని తా
నచ్చఁపు ముత్తియముల ప్రో,విచ్చెను మెచ్చి యనఁ దెలుప♦ హెచ్చె న్మతియుక్.

—♦ చంద్రోదయ వర్ణనము ♦—

చ॥ ఇవ మొలయించు వెల్గు జిగి ♦ కిక్కు చకోరము లుబ్బ పంట గెం
దావ గిలిగింతగా ట్టరుల ♦ త్రోఁపుడు తమ్ముల మోడ్ప వేల్పుబు
వ్వ వడఁ దెరల్చుపా లిరుల ♦ పట్టునఁ జెట్టిన చుట్టుగిట్టు పాం
థవితతి దావవహ్ని స్మర ♦ దర్పము దాఁకొనెఁ దూర్పుదిక్కునన్. ౨౧

తే॥ తఱినలువ తూర్పుముస్నిటఁ ♦ దనదు వీర్య
మమృతరశ్మిభువనహేతు ♦ వై తలిర్ప
విడువ నది యండపేశియై ♦ వెలసె రక్త
కలన ననఁ దోఁత్తు శశి దోఁచెఁ ♦ గావిచాయ. ౨౩

చ॥ తొలిమలకుండఁ దెల్విదధి ♦ తోన్కు భమార్గఁపుఁ గవ్వ ముంచి చు
క్కలు బయ లొందఁగా రజని ♦ కాంత మథించి తెమల్చి యెత్త శ్రీ
లొలికెడు వెన్నముద్ద యన ♦ నొప్పె సుధాంశుఁడు దొల్త మించు ర
క్తిలలితదీపదీప్తివిర ♦ తిం దగు నిద్దఁపుఁ దెల్పు దోఁపఁగన్. ౨౪

తే॥ దైవవైద్యాగ్రణి వశందు ♦ దరద మేర్చి
వారిజంపు ద్రవం బందు ♦ వడిచి నూఱి
యుర్విభావసురశ్ముల ♦ ననఁచి చేసి
నట్టి రసఘుటి శశిమించె ♦ స్వచ్ఛకాంతి. ౨౫

ఉ॥ ఆ యిదె మైథిలీపరిణ ♦ యం బని వేల్పులు బాణసంచుఁ గ
ట్టాయితముం బొనర్చి విభుఁ ♦ డౌనన మాద్రికిఁ గొన్ని గ్రాలఁగాఁ
జేయఁగఁ దొల్తఁ గెంపు నటఁ ♦ జెల్వగు వెల్లయు మించు మేల్మతా
బా యనఁ జంద్రుఁ డింపెనసె ♦ భాసిలెఁ జుక్కలు వెన్నముద్దలై. ౨౬

తే॥ సమయశిల్పి గగనశాల ♦ సంజ మగనిఁ
బోలెఁ దమి విభు భ్రమిఁ గూర్చి ♦ లీలఁ జెక్కఁ

జెక్కు లన రిక్కు లోదవె శ్రీ ♦ తెక్కె మూర్తి
లోనఁ గల మచ్చనాఁ గప్పు ♦ గానఁ బడియె. ౨౭

కం॥ నెల దల యెత్త జెలుఁగు వె, న్నెలయుం దలయెత్తె స్వాత్మ ♦ నికషగతశ్రీ
విలసన్మహాదాఖ్యానా, విలసత్త్వస్ఫురణ మన వి ♦ విక్తం బగుచున్. ౨౮

ఆ॥ ప్రొద్దు వసువు లిందుఁ ♦ బొరసెఁ బద్మిని సిరిఁ
గలువతీవె గొని వి ♦ కాస మొందెఁ
గాలకలన నిట్లుఁ ♦ గాడె యొక్కఁడు సెడ
నొకఁడు బాగుపడుట ♦ యుర్విలోన. ౨౯

ఉ॥ ఉబ్బాక సంద్రముం బెరసె ♦ నో యన రా దటు కల్వతెల్వి యుం
దిబ్బడి చందుఱాసొనల ♦ నెక్కుడు పాలొక డింక దానికిన్
ముబ్బడి గట్టివా యెదల ♦ మోసల బాలల గబ్బిగుబ్బలం
బ్రబ్బె నొకింత పైఁబడి స్మ ♦ రప్రభుమాతులదర్శనంబునన్. ౩౦

కం॥ తను వుబ్బెఁ జకోరములకుఁ, గను లుబ్బెను జక్కవలకుఁ ♦ గామినులకు నె
మ్మనము తనువు చను లుబ్బెం, గను లించుక యుబ్బె రతివి ♦ కాసము పేర్మిన్.

చ॥ ప్రియు నెడఁ బాసి కోకి తన ♦ పెంపు సెడం బొగులంగ నళ్లై తా
నయి మగఁ డొక్కచో నొదుఁగ ♦ హా యని పద్మిని గుందెఁ గల్వతీ
వియ స్మయ మొప్ప నవ్వె భువి ♦ విప్రతిపన్నులఁ గాంచి మంచిచే
డియ లటు లంగలార్తురు గ ♦ డింతురు మ్రుక్కఁడు లెక్కసక్కెముల్. ౩౨

కం॥ పొలయలుకల తోఁడుత సి, గ్గులుఁ బో మానినులు మగలఁ ♦ గూడి పెనఁగి రా
నెల ఱాలం గరఁగింపం, గల రా జెలనాగ లనఁగఁ ♦ గాసులా సురలో. ౩౩

## —♦ చంద్రికావర్ణనము ♦—

సీ॥ మొలకలై తల లెత్తి ♦ ముత్తలిరులు బోది, యలు జొంపములు పూల ♦ నెలవులు నయి
పలపలనై జాలు ♦ పడి పొంగి తరఁగల, మల్లడిగొని మీఱి ♦ వెల్లివిరిసి
మిన్కుమిన్కుమని క్రొ ♦ మ్మెఱుఁగాని తళతళ, మని మిఱుమిట్లుగొ ♦ ల్పి నలిరేఁగి
మొనసి కేల్సాఁచియుం ♦ కనము లొప్పించిచె, య్యూలు కళల్వలపులుఁ ♦ గలయనూఁది

వెల్లమ్రానిమేటి ♦ వల్లరు ల్మిన్నిటి
పొలఁతిమిన్న లచ్చఁ ♦ పుండెలిజిగి
మించుదీవె లాట ♦ మించుఁబోఁడులు నా భ్ర
మించెఁ జందిరికలు ప్ర ♦ పంచమునను. ౩౪

సీ॥ జళిపించె ముద్దులే • సరసంపుఁ బ్రాయంపుఁ, గోనాలనూనూఁగు కో • ర్కులెదఁ జొన్పి
యులికించె మగలరా • కలు వేచు జవరాండ్ర, బడిబడిఁ గలఁచిని • బ్బరమెడల్చి
వలపించెఁ బొలయల్కఁ • దొలఁకుకుల్కు మిటార్లఁ, దమి రేఁచి బండెకో • ల్తనము సూపి
మలయించెఁ దగులాట • ముల నిక్కవలఁ జొక్కఁ, జోటులఁ దత్తఱ • పాటుఁ గూర్చి

ప్రియుల జంట ననఁగి • పెనఁగు పూఁబోండ్ల యు
ల్లసనమునకుఁ గొంతె • గొనరు పెట్టి
పెచ్చుపెరిఁగె నిట్లు • వెన్నెల వెల యిడి
జగము లాముకొన్న • చందమునను. ౩౫

మహాస్రగ్ధర॥

సలిపె న్గోట్నాలవేడ్క • ల్సతుల వలిపెఁపుం • జాఱుపయ్యంటలం గు
ల్కులు దోల్క న్నిక్క లెక్కం • గుమగుమ మను మే • ల్గుబ్బపాలిండ్లపై మే
ల్కొలిపె న్మన్మోగ్గు సిగ్గు • న్గొనకొని మెలఁప • న్గుఱిక్కల్ క్రమ్మంగు ముగ్ధల్
చలవృత్తి న్భర్తృవక్ష • స్థలి నెలకొనఁగ • న్సాంద్రచంద్రాతపంబుల్. ౩౬

సీ॥ పెట్టిపోయని వట్టి • పేరాసలే కదా, యను నట్టు లోక క్రేవ • నవఘుళించి
కనుఱెప్ప లల్లార్పఁ • గా నేర నినుఁ జూచి, యనుప్రీతి నొకట నె • య్యంబు సూపి
తమి నిల్పఁ జాల నె • దం జేర్పు మన్నట్టు, లోకచాయఁ బైఁబడి • యొత్తియొత్తి
పలుకుపల్కన వడ్డి • పాఱవైతువె యను, విధమున నొక్కఁ దో • విఱ్ఱవీగి

వలిపెఁపుం బావడా ల్మొలి • పై తిణీలు
నిగనిగలు గొల్పు మేల్నిగ • ల్నెలవు మీఱు
చెఱ్ఱ్వల చకిచ్చక ల్గ్రమ్మఁచఁ • జెలువు గాంచు
వేశ్యలకుఁ దోడు చంద్రిక • వ్వాలసె నపుడు. ౩౭

తే॥ వెండిమెఱుఁ గిడినట్లు బ్ర • హ్మాండభాండ
మలము వెన్నెల నై గంధ • మలఁది తెలుపు
గట్టి మల్లియ లెల్లెడఁ • జుట్టి ప్రోడ
లెట్టెటో రహస్థలులు సేరి • రిచ్చ దొనఁక. ౩౮

సీ॥ మహిలాలలామల • మగల మాటల కఱి, గడి దాఁట నీయని • కట్టువిడ్డ
పొలయల్క దయ్యంబుఁ • బొలిమేర గడవంగఁ, దరలించు మంచిభే • తాళమనువు
సిబ్బితి చీడఁ జే • చేఁ దీసి వేయఁ బ్ర, ఖ్యాతి గన్నట్టి ది • వ్యౌషధంబు
శతులనేఁ గోమల క • న్సన్నలఁ ద్రిమ్మరఁ, జేయఁ జాలిన వశ్య • సిద్ధఘుటిక

దంపతిరహస్యలక్ష్యతం ♦ త్రప్రియసఖి
యైన నిద్దంపు మద్య మ ♦ త్యాదరమునఁ
జంద్రికలఁ జంద్రశాలలఁ ♦ జంద్రముఖులఁ
గూడి యానిరి మెచ్చుచుఁ ♦ గోడెకాండ్రు. ౩౯

చ॥ ఎది దలపెట్టిన న్వెనుక ♦ కీడ్వఁగ నీకఱ గాఁగ నెద్దియున్
వదలఁగ నీక పొంగి పెఁద ♦ వ్రాలఁగ హత్తికొనంగఁ జొక్కఁగాఁ
బొదలఁగఁ జేసె దంపతుల ♦ భోరునఁ దా స్మరసంగరంబునన్
మదనసహాయుఁడై మదుఁడు ♦ మంటికి మింటికి నొక్కరూపునన్. ౪౦

మంజుభా॥ సహకారిలాభమున ♦ శంబరారియు
న్విహరింపఁ డాఁ దొడరె ♦ విట్టవీగుచున్
బ్రహరించెఁ గొట్టుపడఁ ♦ బాంథసంతతిం
గుహనాగతి న్మొనసి ♦ కూటహేతులన్. ౪౧

క॥ అట్టియెడ మట్టుమీఱిన, యిట్టలఁపుం బసల రసల ♦ యేతరవృత్తిన్
గట్టిపఱచు వగ కళలం, బుట్టించెడు పరికరంబు ♦ పొడవుపడఁగన్. ౪౨

—♦ శ్రీసీతాదేవి యయోగ విప్రలంభ శృంగార వర్ణనము ♦—

తే॥ అంతిపురి జానకీదేవి ♦ యాత్మసఖుల
వలన విని రాముఁ బ్రతికృతి ♦ కలనఁ గాంచి
హరినవీనావతారమ ♦ యా నటంచుఁ
దలఁచె నెమ్మదిఁ గోర్కులు ♦ దండడింప, ౪౩

క॥ మును మున్నె మోహవల్లరి, పెనఁగొనె హరిఁ గూర్చి పూచెఁ ♦ బేర్మి న్నేఁడీ
తనుచందనయష్టియుఁ ద, ద్గుణవాసనలం దలిర్చి ♦ గొనకొన కున్నే. ౪౪

తే॥ కమలవాసిని తా నయ్యుఁ ♦ గంజనేత్రుఁ
డగు టెఱింగియు మానుష ♦ త్వాశ్రయణము
కతన లోకానుసరణంబు ♦ గాంచె నింక
నెద్ది సేయుదు భవబంధ ♦ మేరి నైన. ౪౫

క॥ కొనె సాధ్యాసాధ్యనిరు, క్తిని రాముని వల ధనుస్స్రు ♦ తిని బలుశంక
ల్మనమునఁ బెనఁగొనఁ గా ని, ట్లని తనలోఁ గోమలాంగి ♦ యారాటమునన్.

చ॥ పొడమరె రాచకన్నియలు ♦ పోఁడిమి నెక్కొన వన్నె కెక్కరే
తొడరి వరింపరే మగని ♦ దోసము మోసము లేక సంగడం

బెడలక సౌఖ్యవారినిధి ♦ నిట్టటు నీఁదరె నాదు కోర్కి కే
యడ పొడ నూఁదఁ బోదు ఫల ♦ మాఱడి యబ్బె ధనుఃపదంబునన్. ౪౭

సీ॥ తనకుఁ దానే యిట్లు ♦ దారసిల్లునె హరి, విడుచునే స్వీయమై ♦ వెలయు ధనము
నృపకుమారకు లింత ♦ నెగ డొందుదురె భువిఁ, గనునె నాకై జన్మ ♦ కర్మగతులఁ
గాదన్న నిట్టి చి ♦ ద్ఘనలీల యొసఁగునే, యంశమాత్రం బొల్ల ♦ నందఁ జనదె
యాచక్రఁదనమె యి♦య్యదియాతఁడునరుండె, తనువేఁచుమదనుఁ♦డిట్లైనయరాదె
గాధిసుతు రాక నుడియు సౌ ♦ ఖ్యము నొడువదె
భవు శరాసన మెక్కిడ ♦ వలయుఁ గాదె
యని వితర్కింపఁ దొడరె న ♦ య్యలరుఁబోఁడి
రాము వలగొని యంతఃక ♦ రణము పొనర. ౪౮

వ॥ వెండియు నమ్మత్తకాశిని కొండొక తడవు విచారించి. ౪౯

క॥ కాకున్న మన్మనోగతి, యేకతమున నిప్పురుషుని ♦ యెడ నేకతఁ దాఁ
గైకొనె నిర్మల యియ్యది, వైకుంఠునిఁ గాక యొల్ల ♦ వలచునె యెపుడున్. ౫౦

క॥ జనకుని సమయము నెఱి దన, కనుకూలం బగునొ విషమ ♦ మయ్యెడునో యే
మనవలె నయ్యనఘున కెది, పొనరింపఁగ రామి నిదియె ♦ బుద్ధిం దోఁచెన్. ౫౧

క॥ ఘనుఁ డమ్ముని వెనువెంటం, జనుదేరఁగ నైన కలిమి ♦ సరియోజింపన్
దన కందును సందియమే, పెనుపొందెడు నేమనంగఁ ♦ బోసఁగదు మదికిన్. ౫౨

చ॥ముని మహానీయుఁ డొం డలఁతి ♦ మున్కొనఁ బోఁ డనినన్ ద్రిశంకునిన్
గనికర మొప్పఁ గావ సమ ♦ కట్టి సువర్గ మొకొండు గూర్చెఁ ద
త్తనయుని పట్టునం బ్రతిన ♦ దార్కొన మార్కొని యష్టకష్టముల్
పొనరిచె మెచ్చి యింద్రపద ♦ పూజ్యు నొనర్చి తనర్చెఁ గ్రమ్మఱన్. ౫౩

క॥ కావునఁ జలపాది యితం, డేవిధికిం జొచ్చువాఁడొ ♦ యీసమయమునన్
భావిగతు లెఱిఁగి యెఱుఁగక, నా వెతలం గూర్చి యేమ ♦ నం గల దానన్.

తే॥ అనుచు శంకాలతాక్రాంత ♦ యగుచు నాత్మ
వృత్తి యుయ్యెల లూఁగ న ♦ వ్వేలఁది బేల
యట్ల పండువు గూడి రా ♦ నైన నతను
ధాటి కటు లోటుపడె విచి ♦ త్రముగ నగజ. ౫౫

క॥ మొనసె న్మనసిజదశ లవ్వనజాక్షికిఁ దొలుత కన్నుఁ ♦ బదిరె క్లైరా
మునిరాకఁ దన్నెఱింగిన, తనుధారులు గనని చరమ ♦ దశ దక్కంగన్. ౫౬

తే॥ ఉబ్బు ధృతిఁ బెంచు గంపించు ♦ నొదుఁగుఁ బొరలుఁ
గనులు మూయుఁ దెఱచు లేచుఁ ♦ గాంచు దెసల
గొణఁగు నిట్టూర్పుఁ బుచ్చు గ ♦ గ్గోలుపడు స్మ
యించుఁ బూసెజ్జపై నామె ♦ యిగురుఁబోఁడి. ౫౭

తో॥ వనితామణి సోలుచు ♦ వ్రాలుచు నె
క్కొనుమూర్ఛ మునుంగుచుఁ గోల్పడి క్రొ
న్ననదీవె నిదాఘమును ♦ న న్వాలెఁ జె
డ్కొనఁ దత్తఱపాటునఁ ♦ గూరి చెలుల్. ౫౮

మంజుభా॥ లలి మించు నై హిమజ ♦ లంబు సిల్కి మే
ల్వాలి జిందు చందన మ ♦ లంది కప్రపుం
బలుకుం బొడు ల్చెవులఁ ♦ బాఱ నూఁది యు
మ్మలిక మ్మొక్కింత వడి ♦ పట్టు సేయుచున్. ౫౯

తే॥ గాలిసోఁకొ నిశాచర ♦ గ్రహమొ ప్రేత
భూతమో యింక నిద్దాని ♦ లోఁతు పాతుఁ
గాన ములికిపడెడు జ్వర ♦ మౌనె రామ
మంత్రజప మిన్నిటికిఁ జాలు ♦ మగువ కనుచు. ౬౦

క॥ ముసిముసినవ్వులు నవ్వుచు, బిసరుహలోచనరొ; యేము ♦ పెరవారమె నీ
ముసరిన కోర్కులు మాచెవి, కస వెడలఁగఁ బలుకు టసదు ♦ కర్జమె యనుచున్.

—♦ జనకపుత్త్రి చెలులకు నిజాభిప్రాయంబు దెలుపుట ♦—

తే॥ కలసి మృదులాంగి నక్కునఁ ♦ గదియఁ జేర్చి
యమృతఁపుద్రవ మొలికెడు ♦ నట్టి పలుకు
లాడి యలరింప నమ్ముద్దు ♦ లాఁడి కొంత
స్వీయభావం బెఱింగించె ♦ సిగ్గు దొనఁక. ౬౨

ఆ॥ అమ్మలార; రామ ♦ యను నక్షరద్వయ
మెపుడు సోఁకెఁ జెవికి ♦ నిందుఁ డితని
యల్లుఁ డనలసఖుఁడు ♦ నైరొంట ముగ్గురు
నగ్గులే యనంగ ♦ నది మొదలుగ. ౬౩

ఉ॥ చూడరె వీని యాగడము ♦ చుఱుక్క చుఱుక్కను వాఁడిసూదులన్
జూడిన యట్లిదే ఘృణులఁ ♦ జొన్పెడు మేన నితండు చంద్రుడే

వేఁడినెలుంగు గాఁజె చలి ♦ వెగ్గె యుఁ కేమనుదానఁ బాప మీ
పాడికిఁ దోడుగాఁ దొడరు ♦ పండితు లుండిరె ము న్జగంబులన్. ౬౪

తే॥ కడలివెన్న యటందురు ♦ కాదొ యగునొ
యేల నేఁ జెప్పవలె నగ్ని ♦ నిడిన నేయి
యై పరిమళింపదే యమృ ♦ తాత్ముఁ డేమొ
సురలు దిన్నను మృతి జాడ ♦ చూడఁ బడమి. ౬౫

వ॥ అని యిట్లు చెలిమికత్తియల తోడ నుగ్గడించి. ౬౬

## —♦ చంద్రోపాలంభము ♦—

క॥ అన్నెలఁతమిన్న మున్నటి, కన్నన్నెటి మీఁటి వన్నె గని ♦ చెన్నొలయన్
మిన్నునడితెన్ను ముట్టిన, వెన్నెలదొరఁ గాంచి మొనయు ♦ విసువున ననియెన్.

తే॥ అకట హతవిధిసృష్టి బా ♦ గయ్యె విప్ర
యోగిజనమృత్యు వని కానఁ ♦ డోఁటు నిన్నుఁ
జేసె ద్విజరాజుగాఁ బంట ♦ చేనిలోన
నంధవృషభంబు దోలి న ♦ ట్లబ్జవైరి. ౬౮

చ॥ ఎడలదు నిన్నుఁ జేర భవ ♦ మెన్నఁడు నేని శరీరధారికిన్
దొడరెదు మారకర్మములఁ ♦ దోడ్పడఁ గాంతు ప్రదోషసంగతిన్
విడువదు కాలదోషగతి ♦ విశ్రుతమాత్రుయరోగ మోశశీ
యెడనెడఁ బొంగెదేమనుచు ♦ నే జడుఁడుం దన పిచ్చి మెచ్చుఁడే. ౬౯

తే॥ సుర లశనముగ నిన్గానఁ జూచి యత్రి
సతి గురుద్రోహి వీ వని ♦ సహన మొందెఁ
గాన ననసూయ నాఖ్యాతి ♦ గనెనుఁ బుత్రుఁ
డైన దోషాకరుఁడు గ్రాహ్యుఁ ♦ డౌనె చంద్ర. ౭౦

ఆ॥ అరరె బ్రాహ్మణం న ♦ హన్యా న్నచాత్రేయ
మనెడు స్మృతి ప్రసక్తి ♦ నడఁచెఁ గాక
పాలు పంచి తినియు ♦ బ్రదికింతు రఱుగ ని
న్జేయ లేరె సురలు ♦సితమయూఖ. ౭౧

చ॥ తగఁ బొలిమేర సత్తి నడి ♦ దారి నిలంబడి చచ్చువార లి
మ్మగ జనియించు వారు నను ♦ ముట్టి చన న్వలె నంచు నిక్కె ది

ప్పాగరున నిన్నుఁ బోల్జడుల ♦ ఘో నినుఁ బొందెడువార లాత్మరా
మగతి సుఖించు మేటు లెటు ♦ మార్మ్గ ముంచకపోరు నీదెసన్. ౭౨

తే॥ ఓషధీశుండ ; దేహమ ♦ హాపధిలత
లేన యలరింతు ననుకొందు ♦ వేమొ రామ
చంద్రు పక్షము వార మ ♦ స్మత్ప్రసాద
కథకు రేద్రిమ్మరులు కొఱ ♦ గారు సుమ్ము. ౭౩

శా॥ జన్నం బన్ననుఁ బొంగి పొర్లి చని ని ♦ స్సారించి తోడల్లునిన్
వన్నె ల్వోట్ట సహింప కాతఁ డెద ని ♦ న్దాటించెఁ బేసంబు దొ
న్కన్నాఁడే తగ ముష్టియుద్ధకథ వె ♦ న్కన్వేఁడి యమ్మోటి నె
త్తి న్నైకోన్క ల్గని కంటి విన్నారసి యు ♦ ద్దీపింపఁ దారాధిపా. ౭౪

ఆ॥ మొగము సెల్లె నోటు ♦ మొనసి వేఁడఁగ నీకు
నెత్తి కెక్కు మనఁగ ♦ మిత్తిగొంగ
కండెనేని సికయు ♦ నందనిచోఁ గాళ్లఁ
బట్టుకొంద్రు జడులు ♦ పద్మవైరి. ౭౫

మ॥ గురుఁ డిల్లేర్చినఁ దద్గృహస్థవిధికిం ♦ గోల్పోక గావించి సో
దరి కొంప న్మలుకంప వెట్టె ఖగమో ♦ దద్ధ్వంసముం జేయు ని
న్నారుఁడే మంచికి శీర్ష మెక్కు మనె భీ ♦ త్యార్తిత్వముం గోరియో
స్మరమైత్రిం బరికించియో గరలబా ♦ ష్ప్రశాంతికో యోశశీ. ౭౬

తే॥ విసపుమేఁతరి నినుఁ గొని ♦ వెగటుఁ బాపు
కొనఁ దలఁచి నీవు దానికిం ♦ గొసరు గాఁగ
స్వరసవాహినిఁ దాల్చి ని ♦ న్బయలఁ ద్రోయ
ద్రేలుకాడెద వాక కల ♦ వీడ లేక. ౭౭

తే॥ మొండియాయువు పోసె మై ♦ గండి యుడిన
సురలు కడికండలుగఁ జేసి ♦ చూఱకొనినఁ
బర్వమని పాము ద్రిమ్మిఁగినఁ ♦ బాంథు లెల్ల
నొక్కపెట్టునఁ దిట్టిన ♦ నుడుగ వుడువ. ౭౮

క॥ అవలక్షణములు గాంచియుఁ, గవు లొక్కెడ స్వార్థపరతఁ ♦ గని వర్ణనలన్
సవరించు చుందు రిటు నినుఁ,గువలయహితుఁ డనుట మెచ్చు♦కొఱకె తమీంద్రా

తే॥ కొన్ని మంచిగుణము లున్నఁ ♦ గొన్ని చెడుగొ
నములు గ్రమ్మందు నం దందు రా ♦ నాఁడు మొదలు
నేటికిని చెట్టమచ్చలే ♦ నాటుకొనియెఁ
జదివితివి యున్న తెలివియుఁ ♦ జన శశాంక. ౧౦

క॥ గురుభక్తి దైవభక్తియుఁ, గరమెక్కుడుగలుగువారె ♦ కద లోకమునం
బరమోత్తమ ధర్మంబునఁ, బరఁగుదు రవ్వారలఘుము ♦ పాల్కొన రెపుడున్.

చ॥ పలుకులు వేయు నేల నినుఁ ♦ బట్టిన భూతము కాముఁ డీగతి
న్మెలుపఁగఁ జొచ్చెఁ గాక యిటు ♦ మేల్వల నేరి కగు న్భవంబు పా
ల్కొలనున బావ యచ్యుతుఁడు ♦ కూరిమిసోదరి లచ్చి మెచ్చి యా
డల నిడువాఁడు శంకరుఁడు ♦ తథ్యము సత్పతి వీవు చంద్రమా. ౧౨

తే॥ అని. యవల నవ్వరారోహ ♦ మనసిజుండు
తన్ను వేధించు మార్గంబు ♦ దలఁచి తలఁచి
యుబుసు పోక కెదియు లేమి ♦ నోర్వరాక
పలికె నిట్లని గంభీర ♦ భాషణముల. ౧౩

క॥ తల్లి సిరి తండ్రి యచ్యుతుఁ, డల్లలితాత్ములకుఁ బొడమి ♦ తౌరా; స్మర; యా
ముల్లోకము మనుచు తటి, ద్వల్లీవనదముల నుండి ♦ పడు పిడుగు వలెన్. ౧౪

ఆ॥ నిఖిలలోకగురులు నీతల్లిదండ్రులు, భ్రాత యల జగద్వి ♦ ధాత ధాత
వారిఁ బోల కెల్ల ♦ వారిఁ బీడింపఁ బె, ద్దమ్మఁ బోలఁ బుట్టి ♦ తౌర మార ;౧౫

క॥ చచ్చియుఁ జావని భూతమ, వచ్చుగ శశి కొఱవి దయ్య ♦ మయ్యె బ్రదికియే
యిచ్చ మిముఁ గలసెఁ గరువలి, యచ్చఁపు మంత్ర మిఁక వెదక ♦ నగుఁ బంచశరా.

ఆ॥ ఒక్క త్రోవ మెలఁగ ♦ రొండ్లు స్త్రీయులు తోడు
నీడ యని తలంచు ♦ జాడఁ జూడ
మింతచల మదేమొ ♦ యిహాపరార్థము లున్న
లెక్క మీరు చేర ♦ లేదొ మదన ; ౧౭

ఉ॥ ఎందును లేరె దుష్టజను ♦ లెట్టిగొ పీడ లొనర్పరే భువిన్
గ్రమ్మందరె పుట్టరే యొకట ♦ మారి మసంగిన సన్న వేఁప నీ
కుం దగుఁ గాక యేక్రియలఁ ♦ గొంటివొ యియ్యధికార మీశునే
బంటెకుఁ దెచ్చితిం కొంకఁడు ♦ బ్రాఁతియె నీ తెగురీతి కోస్మరా ! ౧౮

ఆ॥ విల్లు తుంట యలుఁగు ♦ విరి యల్లెత్రా డళుల్, పిట్టజోదు లూరు ♦ పేరులేని
గాలి ధూళి సాయ ♦ కార్లనంగ; జడాత్ముఁ, గూడి చాలె దెట్లొ ♦ కొఱవి ద్రిప్ప.

ఉ॥ ఇచ్చక మాడి మెచ్చుల కిఁ ♦ కేమనుకొంటివొ మొండి తుండివై
వ్రచ్చుటఁ బూవ్రటమ్ము లెద ♦ గాడితి వయ్యాలికొత్తుఁ డల్లఁగాఁ
బచ్చని నీదు కాఁపురమె ♦ పాడగు పోబడి గాఁగఁ దోడుగా
వచ్చిరె నిన్నుఁ దూఁగు మని ♦ పైఁ గను వారలలోన నొక్కఁడున్. ౯౦

ఉ॥ గోడను వారు లేక రతి ♦ గొడ్డు సడిం బడి యేడ్చి యేడ్చి నీ
పోఁడిమి గన్నులం బడెదు ♦ పున్నె మెటో కనె నంగలార్చి న
న్వీడిన వారు వత్తు రొకొ ♦ వేడబ మున్నడి పాడి దప్పె నీ
పూడియుఁ బాంథకర్మఫల ♦ మూఁతగఁ ద్రిక్కొని యుక్కఁ గాంచుటన్. ౯౧

తే॥ ఎందు సర్వజ్ఞులునుఁ దమ ♦ హితము పొంటె
మెలఁగ నేర్తు రొకొండ్లమే ♦ ల్దలఁపఁ బోరు
నియమ మాఁగ శివుం డల్గి ♦ ని న్దహించెఁ
బొలఁతిఁ గవగూడు నెడ నింకఁ ♦ బోడము మనియె. ౯౨

క॥ హాసు మే నర సేసితివొ, స్మర ; త్రెళ్లియు మని యుమాప్ర ♦ సన్నత నంతః
కరణజుఁ డ వగుట నీపగ, విరమింపదు పితృవనప్ర ♦ వేశ మొదవినన్. ౯౩

శా॥ ఇచ్చెన్ స్త్రీలకు బ్రహ్మహత్య నిడుచో ♦ నింద్రుండు ని న్నిచ్చకున్
మెచ్చొ దక్షిణగా బుజం బెగువ నీ మేకొంట నచ్చోఁ దమం
బెచ్చె న్నిర్వృతి నెవ్వ రేసిఁ గనిరే ♦ యీనాఁటి కానాఁటి కో
ముచ్చా ; మూలమ వీవె పాపమునకు ♦ న్మోమోట మింకేటికిన్. ౯౪

సుగంధి॥ వావి సున్న నీకు నీచ ♦ వర్తనా ; జనించి తే
త్రోవ నెట్టి వేళ నోరి ♦ దోసకారి నేను శ్రీ
దేవు బాళి గోరు దానఁ దెల్వి మాలి తల్లి నె
ట్లావటిల్లఁ జేయుఁ జేతు ♦ లాడె శంబరాంతకా. ౯౫

ఉ॥ కూడినఁ గూడకున్న మది ♦ గుందినఁ గుందెడఁబాసి యున్న మై
వాడిన వాడకున్న భగ ♦ వంతుని యాకృతి యందె చిత్త మీ
పోఁడిమి తోడ నెక్కొనెడుఁ ♦ జో ; పెడవారల జాడ మమ్ము నా
టాడి యలంపఁ జూడకు మి ♦ హమ్ము పర మ్మొడ గాఁగ మన్మథా ; ౯౬

—♦ మలయానిలోపాలంభము ♦—

క॥ అని స్మరుఁ గూర్చి విసువుమై, వనజాయతనయన నొడివి ♦ పరిసరనలినీ
వనవిహరణపరభాగా, వనచణమలయపవనప్ల ♦ వనధుత యగుచున్. ౯౭

ఆ॥ పలికె గంధవాహ ; ♦ ప్రాణభూతుఁడ వైన
నీవె శత్రుకోటి ♦ నెనయు జాడ
యాత్మహాని గాదొ ♦ యగుఁ గాదనఁడొ యీశుఁ
డింత తెలివి మాలి ♦ తేల చెపుమ. ౯౮

ఉ॥ ఉండెనొ రూప మొక్కయెడ ♦ నుందువొ శూన్యము వంక నిక్కవో
మండెదునగ్ని నెక్కుఁ దఱు ♦ మం జనవో కనవో వికారముల్
దుండగివై కడ ల్గానవొ ♦ దూఱవొ పూపొదరిండ్ల నిన్ను బ్ర
హ్మాండమున స్బ్రిధానునిఁ గ ♦ నవ్విధి గూర్చె నెటో ప్రభంజనా. ౯౯

ఆ॥ విన్నఁదనము గూర్తు ♦ వెన్నంటి బడుగులఁ, బిడుగు లుండు నచటు ♦ పెరయవిట్టు
లెందుఁ జులుకఁ జూతు ♦ రింతింతగా నున్న, గారవింత్రు బలువు ♦ గాంచి యున్న.

మ॥ అలుఁగు ల్మొత్తమెఱుంగు దోఁప నుడివో ♦ కందిచ్చు మీఁదేనికిన్
ఖలుఁ డయ్యామని జోదు నీకొసఁగు వీ ♦ కం దుమ్ముదోయిళ్లు వె
ల్గెలయించు న్నెల పుల్గుబంట్లగుమి యొం ♦ తేఁ జేయుఁ గోలల్మహా
బల ; పాంథు ల్మిముఁ గాంచి తో నెడపరే ♦ ప్రాణాభిమానంబులన్. ౧౦౧

ఆ॥ విషముఁ బీల్తు వగ్గి ♦ వెలుఁగుఁ దోకొందువు
నిన్ను మ్రింగి పాము ♦ లెన్నరాని
యురువిషానలార్చు ♦ లుమియుఁ గారణగుణ
మెక్కుఁ గార్యకోటి ♦ కెపుడు శ్వసన. ౧౦౨

క॥ పిన్నతనంబున నుండియుఁ, బన్నగశయను నెదఁ జెట్ట ♦ పట్టితి హరి నా
విన్నప మాలింపఁగ నీ, పన్నకములు సాఁగఁ బోవు ♦ పదిలము పవనా. ౧౦౩

ఆ॥ అనుచు విసివి పలికి ♦ యావల వలతేని, ధాక చలివెలుంగు ♦ కాఁక యనిలు
వీఁక యెడఁద సోఁక ♦ వెలవెలఁ బోవున, కోమలాంగిఁ గాంచి ♦ కూర్మిచెలులు.

— ♦ ఉద్యానవనవిహారము ♦ —

వనమ॥ అమ్మ, యిటు జాలిఁబడ ♦ నౌనె యిఁక నీ రే
యిమ్మెయి నిలంబడునొ ♦ హేళిఁ గనఁ బోమో
పిమ్మటయె పీట్గానక ♦ పీఁట యిడునో రా
వమ్మ ; యెలదోఁటఁ దిరు ♦ గాడి తఱిఁ బుచ్చన్. ౧౦౪

వ॥ అనుచు నయ్యేలనాగ లయ్యగురుఁబోఁడి నియ్యకొలిపి నేర్పున నొయ్యనొయ్య నం
దోడ్కొని చని నిరంతరవసంతవిభ్రమ జరీజృంభమాణ మాకందకుసుమ మంజరీ
సందానితామంద మరందనిష్యంద సమాస్వాదన తుందిలసానంద మిళిందబృంద
మిథునతంతన్యమాన గానప్రబంధానుబంధంబును నవకిసలయవిసరగ్రసనరసోల్లసిత
రభసకలనావలమానలలనాకలిత కలకంఠకులకంఠకలనాదకుహూప్రధానవ్యాహార
విభావ్యమాన పరస్పరాలపన సమాహ్వానముఖవ్యాపారముఖరితంబును సవిధవివిధ
తరుసుధామధురతాధురంధరఫలద్రవరసాయనసంభారసమాహారహర్షిత శుకద్విజ
సూక్తిప్రసారసమంజసంబును స్వచ్ఛందసుఖవిహార రారాజితసారవల్లలితవల్గితాంచ
చ్చారికాపాలికావిరచ్యమానసమున్నమదలూలుధ్వనితలాంతలికారిమనోహారివాశి
తోపబృంహితంబును సంఫుల్లవల్లరీమతల్లికాతరుతల్లజపల్లవపుట సంపృక్తప్రసూనప
రాగలక్ష్యసానురాగ యువయువతీజనాన్యోన్యవిషయక ప్రేరణానుగృహీతచూర్ణ
ముష్టికావష్టంభసుభగంభావుకంబును పరిసరసరసీవరశీకరనికరగ్రాహి స్యందో
లితనలినోత్పలకుడుంగానుషంగిరజఃకణవాహి తరంగరంగదింగత్కలహంసకారండ
వలక్షణాదిజలవిహంగమగరుదంచలప్రచాలనోత్కలికావగాహి గంధవాహకుమా
రసమారబ్ధవసంతోత్సవదర్శనీయంబును ఏలాలవంగతాంబూలీగోస్తనీనవమాలికా
మల్లీప్రముఖవల్లీవితానసమావేల్లితరాజరంభాక్రముక సరసపనసరసాల కేసరసరల
సురపున్నాగనారికేరనారంగాదిప్రసంగరంగత్ప్రాసాదవితానసోపానతోరణస్తంభ
గోపురమండప లక్ష్మోపలక్షితచిత్రీయమాణ విశిష్టకలాభిరామంబును మృగనాభి
పంకావలేపశంకావహానోకహచ్ఛాయాంచితాధస్స్థలపర్యస్తపారిప్లవపలాశాంతరను
స్యూతసుధాంశులక్ష్మీస్మేరపర్యాయరంగవల్లీవిరాజితంబును నై శోభనభవనంబునా
డంబుమీఱు నయ్యుపవనంబునం బ్రవేశించి యందు. ౧౦౬

సీ॥ ఎనసి పైపైఁ బ్రాఁకి ♦ యింతలంతలుగాఁగఁ, బొరపొచ్చె మెడలియు ♦ ప్పొంగునవియు
నల్లిబిల్లిగ నల్లి ♦ యుల్లాస మెసఁగఁ గెం, జివురుజొంపము శ్రీలఁ ♦ గవియునవియుఁ
జిన్నారిపొన్నారి ♦ చిడిముడు ల్గనుపట్ట, జిలిబిలి మొగడలఁ ♦ జెనయు నవియుఁ
గలకలనగుసోయ ♦ గము దోఁపఁ బోరిపోరి, బాగుత్తు లసియాడఁ ♦ బొదలునవియుఁ

జివురుచివురు మంచు ♦ జిగితేనె గొని మెచ్చు
తేఁటి యులివు పాట ♦ తేటఁ గొసరు
నవియు నైన తీవె ♦ లంది మిన్నందిన
తరువు లొప్పఁ గాంచి ♦ తలిరుఁబోండ్లు. ౧౦౭

క॥ అయ్యె విశేషభావము, లయ్యవనిజ కెఱుకపడఁగ ♦ నాయమ యెడఁదఁ
నెయ్యము మిగుల మెలఁగి రటు, లయ్యలరుంబోండ్లు కాల ♦ యాపనపరలై.

వృషభగతిరగడ

కాంతరో; సురపొన్న మల్లియ, కాంచికాంచితలీలఁ జుట్టెనుఁ
గంతుకుంతము లెట్లు మొగ్గలు, గానఁగా నగుఁ జుట్టుముట్టెను
చాన; యీనవమాలికాళి ర, సాలసాలము పైకిఁ బ్రాఁకెడు
మానినీ; యది మీనపదు వల, మాను మానుడి వీఁక సోఁకెడు
కొమ్మకొమ్మకుఁ గోటి తేఁటులు, గూడె గూడెము గాఁగఁ బొగడను
జుమ్ముజుమ్మను మారు నారినిఁ, జూచెఁ జూ చెలి బిట్టు పొగడను
వనల సంపెఁగ తనరెఁ జంపక, నాస ; నాసరి గలదె యిల నని
మనసిజుని నలికముల గీ మది, మాటిమాటికి నొడివె దేమని
అలికుచసుమగుచ్ఛముల మన, సార సారసనేత్ర ; చూడుము
కేలియా యవి మారు బిఱుసుల, కీలికీలిక లింక వీడుము
అలరు లళులునుఁ గలయఁ దిలకము, లందు లం దులఁదూఁగెఁ గంటివె
మలయు కంతు రవ ల్తుపాకీ, మందు మందుల పాల వింటివె
గిల్కుగిల్కని మావికొమ్మలఁ, గీరగీరణనము పొసంగెడు
గల్కుకల్కన నును తెడల్చున, గాదు గా దురపిల నెసంగెడు
దలితస్ఫుతబీజములు చిలుకల, దాడి దాడిమఫలము లొప్పెను
గాలిపి రతనుఁడు గెలువ నెత్తురుఁ, గూడుఁ గూడునె దీనిఁ జెప్పను
ఆడఁ దొడరెడుఁ జూడు మదె గొన, బయ్యెఁ బయ్యెర పీవఁ దీవియ
పాడి విడి తా నన్నుఁ గని నగుఁ, బాటు పాటున నిక్కు తీవియ
మగువ పోదమె కమ్మపుప్పొడి, మన్ని మున్నిటఁ జాల నొప్పెడుఁ
దగఁ దుపానలరాశిఁ గని కని, తార తారసిలంగఁ జొప్పడు
మేలు క్రీడనశైలమణిరుచి, మించె మిం చెటు లట్లు వెన్నెల
తాళుతాళు దవాగ్ని యది సెగ, దాఁకదా కనరాదె చిన్నెల
సరసిజాక్షిరో ; చూడు మీకా, సారసారరమావిలాసము
సరసమా యది మారపరికర, సారసారవభూవికాసము
ఏమనం గల మింత విసువఁగ, నేలనే లలితాంగి ; షక్కికి
రామ రామ పొసంగ దెద్దియు, రామ; రా మన యింటి చక్కికి
పామరత్వము గాదు నాదెస, బాగు బాగుగ నెంచి మీమతిఁ
గామజనకుని నామమే గతి, గాన గానము సేయు డీగతి. ౧౦౯

క॥ అని పలుకుచుఁ గడు సోలిన, వనజేక్షణఁ గాంచి చెలులు ♦ వడిఁ గౌఁగిట నె
క్కొ్కన నూఁది పొదివి పదిలము, పనుపడఁ దత్తదనుభావ ♦ భాగనువృత్తిన్.

ఉ॥ ఆ మృదులాంగి యున్న తెఱఁ ♦ గయ్యెడ నయ్యెలనాగ లెంచి యా
రామవిహార మెక్కు డన ♦ రా దదసీయమనఃప్రచారమా
రామమయంబు పూర్ణ మను ♦ రాగము కాముని ధాక కిమ్మొయి
న్దామరపాకుపై జలము ♦ నా నొడ లొక్కటఁ గంప మొందెడున్. ౧౧౧

తే॥ కాన నుపచారకల్పన ♦ లూన నెట్టు, లెట్టులో వేగుఁబోక గా ♦ నీశుకృపను
మేలె కావచ్చు నని ధృతి ♦ మేలుకొలిపి, నిలిచి రాయా కృతుల వంక ♦ నీరజాక్షి.

—♦ శైత్యోపచారకల్పనము ♦—

సీ॥ ఘనసారమునుఁ గొంచుఁ ♦ గర్పూరగంధి రాఁ, జంద్రసంజ్ఞాస్మృతి ♦ జలదరించె
వెస మృణాలిక లంది ♦ బిసకల్పభుజ దెల్ప, విషవల్లరు లటంచు ♦ విసువుకొనియె
దమ్మిరేకు లిడఁ బ ♦ ద్మదలాక్షి దలపెట్ట, మదనశరాసార ♦ మతిఁ దలంకె
నిందీవరము లుత్ప ♦ లేక్షణ కూర్పంగ, నరిసనాథము లంచు ♦ నవలఁ ద్రోచె
నేమి శిశిరోపచారమో ♦ యెఱుఁగరాదు
కసటుపాలైరి తారుప ♦ కరణములును
నామె హరిచంద్రనస్పృహ ♦ యాళు వనెడు
స్థితి దెలిసి శైల్యిఁ దెల్ల వా ♦ ర్చికొన నేల. ౧౧౩

క॥ పీరణమూల మనుచు శుక, వీ, రణ చెలి యొర్తు దెలుప ♦ నే మనియొ మదిన్
సారసగామిని గాథవి, చారాసారప్రసార ♦ సరణిం దోఁగెన్. ౧౧౪

తే॥ అట్టిదగు సమయంబున ♦ నబల వలని
భావ మూహించుచు నె భావ ♦ భవవికార
కారణముఁ గూర్చి కూర్చు న ♦ త్యాకారములను
చారకానల్పకల్పప్ర ♦ చారములుగ. ౧౧౫

క॥ లలనాతిలకముఁ జల్లని, కలపంబులఁ గళల నుడులఁ ♦ గావ్యాలాపం
బుల నప్రమాదగతి నం, కిలి దేర్పఁ దొడంగి రా న ♦ ఖిజను లగజా. ౧౧౬

ఆ॥ ఆశిరీషకోమ ♦ లాంగి యనావృష్టిఁ, బైరు వోలె మిగుల ♦ వడలియును స్వ
జనకృతోపచార ♦ సంసేక మొక్కింత, దేర్ప నుచ్ఛ్వసితము ♦ దిటవ్రపడఁగ.

—♦ సీతాదేవి చెలికత్తెలతోఁ దన యవస్థల నుగ్గడించుట ♦—

క॥ తెప్పిఱిలి పలికె నిట్లని, యప్పొలఁతుకమిన్న చెలియ ♦ లారా; మదికిం
జొప్పడ కెద్దియు నూతం, గుప్పునఁ గూలి నటు లుండెఁ ♦ గ్రూరుఁడు విధిగాన్.

చ॥ కలయునుఁ గాష్ఠయు న్మొదలు ♦ గాఁ గల కాలముఁ గూర్చి కాలవే
త్తలు కలకాల మేకగతిఁ ♦ దత్పరులై వచియింతు రేలొకో
తలఁపఁగఁ బోల దీరజని ♦ తారసిలె న్దన పాల నేమనం
గల దిది కల్పమో యుగమొ ♦ కాదన నొక్కఁడు హేతువుండునే ౧౧౯

ఆ॥ తావుఁ దఱియు దైవ ♦ తంత్రంబు దలఁగినఁ
గూర్చునవియు శత్రు ♦ కోటిఁ గవియు
నవియ మఱలఁ దనకు ♦ ననుకూలములు గాఁగ
నెద్ది యేఁ బొసంగు ♦ నింతనిజము. ౧౨౦

ఉ॥ ఈ మలయానిలుండు మన ♦ కెగ్గొనరించెనె మున్ను నేఁడె యీ
సోముఁడు గానుపించెనె వి ♦ శుద్ధుఁడు గాఁడె తలంచి యుంటిమే
యామని వంకఁ జెట్ట లివి ♦ యంచుఁ బ్రపంచముఁ దాన యేలెనే
కాముఁడు కాలకర్మగతిఁ ♦ గారణభావము గాంతు రందఱున్. ౧౨౧

క॥ తల నిడి మెచ్చఁ దగిన పూ, వుల బూమెల వంక నింత ♦ వులు గన నయ్యెన్
దలఁపునఁ గల తలఁ పొక్కఁడు, తలమెత్తిన నెద్ది యేనిఁ ♦ దలపడ కున్నే. ౧౨౨

తే॥ కోకిఁ గమలిని నను వలెఁ ♦ గూర్చె వెతకుఁ
గుముదినిఁ జకోరిఁ దమిఁ బోలఁ ♦ గొలిపె ధృతికి
సరసులనె పక్షిభేదంబు ♦ సలుపు విధికి
బీదసాదుల యెడ లేదె ♦ భిన్నవృత్తి. ౧౨౩

సీ॥ రేయెండయే యెండ ♦ యై యొం డదరఁ గాయఁ, గాయంబు బలుకాఁక ♦ గాసిలంగ
మలయాద్రినిలయాహి ♦ గళయాపితసమీర, మీరణ మైచాయ ♦ కెసరిడంగ
సదనాప్తమదనావ ♦ సదనార్థవహహేతి, హేతిస్ఫురణఁ జిత్త ♦ మెరియుచుండఁ
దలదిమ్ము కొలఁది న్మి♦గుల దిమ్మను ద్విరేఫ, రేఫస్వనము శ్రుతు ♦ వ్రీలఁ జేయఁ
జింత మెయి వెంచి నెమ్మదిఁ జిక్కువఱప
నెన్నఁ డని కోర్కి తలకెక్కి ♦ యెగయఁ బోవ
జీవితం బాస పట్టున ♦ జీరుకాడ
నున్న నేఁ గందు నొక్కొ భా ♦ నూదయంబు. ౧౨౪

మ॥ ప్రియసంప్రాప్తికిఁ దక్కఁ జక్రి యొకటం ♦ బెంపేద నేనెట్టుల
మ్మెయిఁ జిక్కన్వగ స్రుక్కు దుష్టవిధికి ♦ న్మేకొన్న దొడ్డంచుఁ జి
న్న యటంచు న్నయమార్గ మింక నయిన ♦ న్మాభాగ్యశేషంబునన్
బయలౌనందం జనదా విభావసుఁడు సం ♦ పన్నప్రభావోన్నతిన్. ౧౨౫

చ॥ అడరెడు నీనిశాచరుని ♦ హాపడిఁ ద్రోపడి యున్నదన్నుఁ దాఁ
దొడిఁబడి కాంచి నావెతకుఁ ♦ దోడ్పడు పద్మినిఁ గల్వ నవ్వఁగాఁ
దొడరెడుఁ జూడుఁ డిట్టిమొఱ ♦ దొట్టికిఁ జెప్పుకొనంగఁ బోలున
న్నడిఁ గలకాల మిట్లగునె ♦ చక్కటి మిత్రుఁ డెలర్పకుండునే. ౧౨౬

ఉ॥ పుట్టఁగ నేల నేల ఘన ♦ పుణ్యుని ప్రోపున మించ నేల చే
పట్టెద శ్రీశు నన్న బడిఁ ♦ బన్నఁగ నేల సురర్షిముఖ్యుఁడుం
గు ట్టెఱిఁగింప నేల జన ♦ కుం డిదె యాగ నని గట్టు విల్లుగాఁ
బట్టిన దిట్ట విల్లు గొని ♦ పందెము వెట్టఁగ నేల యింతకున్. ౧౨౭

ఆ॥ ఆడుపుట్టు వధమ ♦ మగు నైనఁ దలఁపునఁ, బెట్టి యున్న మగనిఁ ♦ జెట్టఁ బట్టి
యతఁడు గూర్మి మిగుల ♦ నక్కున లాలింప, భక్తిఁ గొల్చు భాగ్య ♦ వతియు లేదె.

ఆ॥ ఎట్టి పుట్టు పుట్ట ♦ నేమి యెమ్మెయిఁ దగు, చుట్టఱికము పెంపు ♦ చూడ నేమి
తనదు భాగ్యరేఖ ♦ తరమిడి కూర్చెడు, దశకుఁ గలదె యన్య ♦ థాత్వ మెందు.

తే॥ హెచ్చు చోటున ఫలమున ♦ కెగయఁ జూచు
టెందు నీచైర్గతులకు వి ♦ నిందితంబ
కాదనఁగ నెట్టు లెది యెట్లు ♦ గాఁగ నున్న
మొదలి సిగ్గుపోబడి తల ♦ మునుక గాదె. ౧౩౦

ఉ॥ ఏమని పొంగుదు న్గలదె ♦ యెల్లి శుభం బను నిశ్చయంబు తా
నా మిహిరాన్వయప్రభవుఁ ♦ డచ్యుతుఁ డే యనన్నై స్మరారి వి
ల్లా ముని యాన నెక్కిడఁగ ♦ నాదట మూఁగయుఁ బల్కనేర్చు నిం
కేమనఁ జాల నమ్మ; ధృతి ♦ నేమఱఁ జూడకుఁ డమ్మ; నెచ్చెలుల్. ౧౩౧

క॥ అని పలికి పద్మలోచన, తన మది వలఱేని దుడుకుఁ ♦ దన మెక్కుడుగాఁ
గని నిలువరింప నేరక, జనితార్తిం దూలఁ జెలులు ♦ సత్వర లగుచున్. ౧౩౨

తే॥ హిమరసాసారము హిమతేక్షు ♦ లెనయఁ జల్లి
చందనద్రవశీతల ♦ చర్చ తోడఁ

బలుకుగ ప్రంపుఁ బలుకులుఁ ♦ బఱపి సేద
దేర్చి రామహితనయ బో ♦ధితలుహితలు. ౧౩౩

క॥ పదఁపడి యిట్లని రేలకొ, సుదతీమణి ; యింక బిట్టు ♦ సొలసెద వార్తిక్
విదితము గెలువదొ మదన, ప్రదరగత మొకప్పు ప్రీతి ♦ పద మనఁ దగదో. ౧౩౪

ఉ॥ కాయయొ పండో యంచు ధృతి ♦ గాన వమాయికవృత్తి నేఁటి కే
మాయెఁ దలంపు మెల్లి శుభ ♦ మాను రమాయితమూర్తి వీవు ని
న్నాయఁగ రాని కూర్మిఁ గను ♦ పట్టె శుభాయితుఁ డీతఁ డెన్న నా
రాయణుఁడే యనం దగు న ♦ యాలి ఫలాయిత యయ్యె మైథిలీ. ౧౩౫

సీ॥ మోహనాకృతిరుచి ♦ ముంచి యెత్తి త్రిలోకి, సింగారముం గూర్పఁ ♦ జేతకాదొ
కువలయేశుం జేర్చు ♦ కొని కొన్న భిక్షుగా, నిజ్యాకలనఁ బుట్టు ♦ వెనయ లేదొ
యంజదువ్వ మునియి ♦ ల్లాలి శిలాత్వంబు, నిరసించె నను వార్త ♦ నిలువఁ గాదొ
క్రతు వాఁగు చెట్టర ♦ క్కసిగండ్ల వధవిధి, గన్నవారల పల్కు ♦ గానివాదొ
గాధి పట్టి గరల ♦ కంతు పిల్లెత్తు మా, రాముఁ డనుట సాక్షి ♦ ప్రాలు గాదొ
వేయు నేల ప్రొద్దు ♦ వెలుఁగున కీవెల్గు, నూటి యగు టొకింత ♦ చూడరాదొ.

తే॥ వలదు సందియ మిఁక వల ♦ వంత మాను
మమ్మ ; నీమెచ్చిన యతండె ♦ యౌఁ గదమ్మ
తలఁకు మొనయుకు మమ్మ ; యా ♦ ధనువు గినువు
రాముఁ డుంకింప లెక్కకు ♦ రాని దమ్మ. ౧౩౬

క॥ ఓచెలి మా నోముగుమియుఁ, బూచె న్ఫలియించుఁ బంట ♦ పొల మనఁ దగుఁ బో
ప్రాచినతంగెడు నాఁదగు, నీ చెలువముఁ గాంచి ముఱియు ♦ నెఱె గంటి మిఁకన్.

క॥ పౌరాణికవాక్యంబుల, సారము గన్నార మదియు ♦ జతపఱె యుంటన్
శ్రీరాముఁడె నీ దేవుం, డీరాముని కతని కెర వో ♦ కింతయుఁ గలదే. ౧౩౮

తే॥ చెలి ; నిమిత్తములును మేలు ♦ వలనుపఱపఁ
జాలు నట్టివ లేలెమ్మ ♦ సదనమునకు
రమ్మ నిజసత్వము వహింపు ♦ మమ్మహాత్ముఁ
డొడరు మర్చింప నెదబూవు ♦ దోఁటలోన. ౧౪౦

క॥ పరమేశ్వరు భజియించినఁ, బరఁగు నఖిలభద్రములునుఁ ♦ బాపము లేయం
తరములు దొరకొన నేరవు, తరలాక్షి రొ ; నీ యరయని ♦ తత్త్వము గలదే.

క॥ అన స్ఫాటికమణి వోలె ల, లన యంకిలి వీడ స్వామ ♦ లత మైఁ జూప
ట్టిన మనికికిఁ దోడ్కొని చని, రనుమోదిత లగుచుఁ జెలు ల ♦ హార్యతనూజా.

ఉ॥ ఆ నవమోహనాంగు లటు ♦ లమ్ముని యానతి సాంధ్యకృత్యము
ల్మానుగఁ దీర్చి మైయెందవశి ♦ లామయ వేదిక దైవ్వతమన్మథ
శ్రీ నలువొంది చూపరుల ♦ చిత్తము లుత్కలికం దలిర్పఁ బూఁ
దేనియ లట్లు లేనగవు ♦ తేటయు మాటయుఁ దోడుపాటుగన్. ౧౮౩

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునితోఁ జంద్రునిఁ గూర్చి ముచ్చటించుట ♦—

క॥ పెనఁగొన సల్లపనంబులఁ, దనరెడు నెడ రాముఁ డనియెఁ ♦ దమ్ముని తోడన్
గనఁ దగె హరితనయు సుద, ర్శన మన శశిబింబ మభ్ర ♦ సరణి మెఱయుచున్.

సీ॥ ఇది పాలకడలి పోం ♦ గెసఁగఁ బైఁ దోఁచి రు, చు ల్పొనరించెడు ♦ జున్నుగడ్డ
యిది విధివిరచితా ♦ భీప్సితావహవిబు; ధావలిపేయర ♦ సాయనఘుటి
యిది యొక్కప్రొద్దుల ♦ నిగిరెడు రేవెల్గు, పులుఁగులఁ దనియించు ♦ పుట్టతేనె
యిది కల్వ చెలి రవి♦కెదుర నీటఁ గృశించి, కూర్చు సమాధి గై ♦ కొన్న సుఫల
మిది యపరచక్రభేదస ♦ మీహితార్థ, దైవకృతహీరమణియంత్ర ♦ దర్పణపద
మిది తమస్థాపనిర్వాణ ♦ హేతుభూత, మహితదివ్యౌషధము చంద్ర ♦ మండలంబు.

తే॥ ఓషధీశుండు ద్విజరా జి ♦ తోదయుండు
శివజటాజూటతటరస ♦ సిద్ధఘుటిక
వేల్పుటోగిర మిన్నెల ♦ విబుధు లెల్లఁ
గువలయప్రియుఁ డనుట పై ♦ కొసరు గాదె. ౧౮౬

ఉ॥ శ్రీలకుఁ దానకంబు సిరి ♦ చేరువ చుట్ట మఖండసిద్ధు లీఁ
జాలిన తే జధీశ్వరుఁడు ♦ శంకరుఁ డౌదలఁ దాల్చు కల్కిసొ
మ్మేలిక భూసురావళికి ♦ నెల్ల సుధాంబుధిఁ బుట్టినాఁడు మే
ల్మే లిటువంటి సత్కళల ♦ మించిన జేఁ డొకఁ డుండునే భువిన్. ౧౮౭

సీ॥ లలి నల్లకలువన ♦ నల జిల్గువలువ మే, ల్వల నొప్పు నింగిఁ జ ♦ ప్పర మొనర్చి
పటికంపు టద్దాల ♦ పనిపెంపు గల దీప, కలికలుగా భమం ♦ డలులు దార్చి
యెడనెడ జిగిపూవు ♦ టెత్తులు ముత్తెఁపుం, గట్లుగాఁ జిన్నచు ♦ క్కల నమర్చి
రేయెండ సుధ మెఱుం♦గై యుండ భద్రగృ, హంబు డంబున నజాం♦డంబుఁ గూర్చి
నెలపులుఁగు బువ్వఁపుంబంతు ♦ లెలమి వెలయ
గల సురర్షినృపులు సభ్య ♦ కలన నిలువఁ

బెండిలి నొనర్చుచున్నాడు ♦ పేర్మి సమయ
వేత్త యారాత్రివిధులకు ♦ విశ్వ మలర. ౧౪౯

తే॥ శారదానూనసంపత్తి ♦ సహితుఁ డగుట, జీవసృష్టికలన దన్నుఁ ♦ జెనసి యుంట
సర్వతోముఖభావప్ర ♦ సక్తిఁ గనుట, బ్రాహ్మణప్రభు వీతండె ♦ బ్రహ్మ సుమ్ము.

తే॥ కలితలక్ష్మీవిలాసవి ♦ కాసముననుఁ
గువలయావనగుణితసా ♦ గుణ్యముునను
వరతమోనోదనక్రియా ♦ వైభవమున
నితని విబుధులు విధుఁడను ♦ టెట్టిఁగీ కాదె. ౧౫౦

మ॥ గిరిపై నెక్కొనుచుంట దక్షతనయా ♦ కేళీపరుం డౌట భా
స్వరశుక్లద్యుతి గంట నభ్రతటినిం ♦ బ్రాపించుటన్ మేలిసీ
లరుచిం బైపయిఁ గొంట సద్గణవిశా ♦ లశ్రీలఁ దార్కొంట శం
కరుఁ డీతం డన రాజె భానభవసం ♦ స్కారప్రథం గాంచఁడే. ౧౫౧

సీ॥ ఇది పదునేనింటి ♦ నేలు పదాఱవ, కల కెక్కుడై శ్రీలఁ ♦ గ్రాలుచుండు
నిది మహేశ్వర మూర్తు ♦ లెనిమిదింట నొకండు,గా రసప్లుతి ముజ్జ ♦ గంబునిలుపు
నిది రక్షణార్థిర ♦ మేశు చల్లని మేలి, దృష్టియై సృష్టికిఁ ♦ బుష్టిఁగూర్చు
నిది తమోనుద్రశ్మి ♦ లెనసి యాతపతప్త, జీవకోటులఁ బట్టి ♦ సేదదేర్చుఁ
బవ లొనర్చు కృతికి జోడు ♦ భారవాహి, కాలకలనావినోదవి ♦ కాసి భవ్య
హేతులక్ష్మీసహోదర ♦ మిట్టి చంద్రమండల మనంగ సామాన్య ♦ మండలంబె.

తే॥ తెలివికిని ధర్మమునకుఁ గీ ♦ ర్తికిని జ్ఞాన
మునకు నిందీవరాక్షుల ♦ మోముసిరుల
కుపమితికిఁ జాలె దేనియొ ♦ క్కొక పదంబె
యట్టి జాబిల్లి వర్ణింప ♦ నలవి యగునె. ౧౫౩

సీ॥ బొండుమల్లియ పూలు ♦ పూచిన ట్లీకాంతి, వల్లరు ల్జగ మెల్ల ♦ నల్లుకొనియె
నలరుదేనియజడి ♦ యమరిన ట్లీ రస, వాహిని వెల్లువ ♦ వాఱ సాగెఁ
గోదమతేఁటులు గుంపు ♦ గూడిన ట్లీ నైల్య, కలన సింగారంబు ♦ కడలకెక్కె
మొలకతెమ్మెర వల ♦ పులు గ్రమ్మిన ట్లీ మ, హామోదసంధాన ♦ మావహిల్లెఁ
గప్రపుటనంట్ల రజము పైఁ ♦ గవియునట్టు
లీ జిలుగుచల్వల విపాక ♦ మెసక మెసఁగెఁ
జంద్రబింబమొ యిది ద్యోష్ఠ ♦ చారుకుంజ
మో తెలియ నౌన గతిలీల ♦ మొనయ దేని. ౧౫౪

తే॥ రజనిముఖయోగవర్ధన ♦ ప్రాణపదమె
యేల కాదు వియోగుల ♦ కెదురుచుక్క
తమ్ముఁడా ; తఱుఁ గొరగు లే ♦ కిమ్మహీజన
రమణ మొనరింపఁ జాలిన ♦ రాజు గలఁడె. ౧౫౫

తే॥ ఏది యెటు లున్న మరున కీ ♦ యత్తేజుఁ
డొక్కరుఁడె చాలు జగ మెల్ల ♦ డక్కఁ గొనఁగ
నెందును సహాయసంపన్నుఁ ♦ డేకచక్రి
భారము వహించుఁ దలపూవు ♦ వాడ కుండ. ౧౫౬

క॥ ఈయిరువు రొక్కఁ డగుచు, న్నాయింపరె యెండ రేలఁ ♦ గలఁగఁడె విధి తా
రేయెడ సర్వజ్ఞులె కల, రే యాజ్ఞ వహింపకుండు ♦ రే యెటులేనిన్. ౧౫౭

ఉ॥ పువ్వులు లాజలుం గలిపి ♦ పొల్పుగ సేసలు చల్లినట్లు శ్రీ
ల్నివ్వటిలంగ ముత్తెములు ♦ నేర్పున రాసులు వోసినట్లు మే
ల్పువ్వుబంతు లెల్లెడలఁ ♦ బోఁడిమి మీఱ ఘటిల్లఁ జేసిన
ట్లివ్వసుధాతలంబు వెల ♦ యించెడు వెన్నెల కంటె లక్ష్మణా. ౧౫౮

* క॥ తుర్యాతీతకలోదిత, మార్యాధిపసంప్రసాద ♦ నాభ్యర్హిత మా
దార్యాధరిసాధ్యము సం, ధార్యం బిత్తేజ మూర్జి ♦ తం బని యెడఁదన్. ౧౫౯

తే॥ వెండిమెఱుఁ గిడినట్లు శ్రీ ♦ వెలసినట్లు, పారదము వెల్లి విఁసి పైఁ ♦ బ్రాఁకినట్లు
పున్నెఁపుంబైరు పూచిన ♦ పూతయట్లు, నెల యసం బట్టు వెన్నెల ♦ నిండె జగతి.

—♦ లక్ష్మణుండు రామునిఁ బ్రశంసించుట ♦—

క॥ అని యివ్విధమున నినకుల, వనధిసుధానిధి సుధాప్ర ♦ వణవాక్సరణిన్
దన యనుజుని మన మానం, దనిమగ్నోన్మగ్నతాప్తిఁ ♦ దనరించుటయున్. ౧౬౧

ఉ॥ ముద్దులు గుల్క హాసరుచి ♦ మోము దొలంకఁ గలంక దీర్పనౌ
పెద్దఱికంబు దోఁపఁ గడుఁ ♦ బేర్మి సుధాంశునిఁ గూర్చి వర్ణన
ల్దిద్దయుఁ గూర్చు నగ్రజునిఁ ♦ దాఁ గని యిట్లనె లక్ష్మణుండు పె
న్నుద్దితనంబు మీఱఁ గళ ♦ లూర రసస్రుతి జాలువాఱఁగన్. ౧౬౨

శా॥ అన్నా ; భావము వొంగ నీ పలుకుప ♦ ల్కాలించిన న్నోముఁ డే
ని నైర్మల్యంబు భరించుఁ గాక మరుఁడే ♦ ని న్మోహపారమ్య మం
దౌన్నత్యంబు వహించుఁ గాక కవులా ♦ రా ; యంద్రు గా కాదృతిన్
సన్న ల్పూసెడు నింక మాదృశులకు ♦ న్సాహిత్యవద్యాప్తికిన్. ౧౬౩

క॥ అందము చందము జగదా, నందనసౌజన్యరమ ల ♦ నం దనరెడు మే
 ల్కొందువలు కళలు నీయవి, కందమ వన్నిటికి నీవ ♦ కావే రామా. ౧౬౪

క॥ పొగడుదురు పగఱ నేనియు, విగుణుల దెనఁ గొంద్రు సుగుణ ♦ విఖ్యాపనముల్
 బ్రిగుణులఁ గొలుతురు గురు లని, స్వగుణోన్నతు లెన్నఁ బోరు ♦ సౌజన్యనిధుల్.

ఆ॥ చంద్రుఁ డతఁడు రామ ♦ చంద్రుండ వీవు క
 లంకి యతఁడు నిష్క ♦ లంకమూర్తి
 వీవు పవలుకళల ♦ కెనరాఁ డతం డేక
 కలన రేయుఁ బవలు ♦ వెలయు దీవు. ౧౬౬

తే॥ ఇంతవఱకేని సందియ ♦ మింక నెట్లు, శివశరాసనహృతికీర్తి ♦ సిరుల మాట
 కంచుఁ బోలంగఁ దన కళ ♦ లన్ని గూర్చి, యభ్యసించెడు రేయొడ ♦ యందు నేఁడు.

తే॥ ఇతఁడు నీముఖకాంతి జో ♦ డెనసె నెకొ
 కోరి నీన వ్వతని సిరిఁ ♦ గూడె నొకొ
 లేక నీకీర్తి యాతని ♦ జోక యేక
 మతి జగము లెల్ల లోఁగొన ♦ మలసె నొకొ. ౧౬౮

శా॥ కాకున్న న్నిరి నిట్లు పొల్చెనె నిశా ♦ కాంతుండు ము న్నెన్నఁడున్
 రాక ల్గొన్నియు రాక మానినవియే ♦ రాణింపవే వెన్నెలల్
 ప్రాకట్యంబు వహించె నీతఁడు భవ ♦ ద్భాగ్రిజిష్ణుత నాంచుటం
 జేకూరుం గదె సజ్జనాశ్రయణల ♦ క్ష్మిన్ సిద్ధు లెవ్వానికిన్. ౧౬౯

క॥ కాని మ్మటు లది చంద్రున, కేనెఱినేని న్గుణాగ్రి ♦ హేచ్ఛ్వత మేలే
 తా నిటు శ్రీ నలువొందుట, చే నీభావిశుభఫలముఁ ♦ జెప్పక చెప్పెన్. ౧౭౦

—♦ శ్రీరాముఁడు ధనుర్భిషంబున సీతావిషయ కానురాగంబు వెల్లడించుట ♦—

ఆ॥ అనిన రాముఁ డనియె ♦ నన్న ; సౌమిత్రి నీ, మైత్రికలన నిట్టి ♦ మాట లాడె
 దింతె శివశరాస ♦ మెక్కుడు నంతట, నన్న రాముఁ డనుము ♦ నయము గనుము.

క॥ వ్యాజన్య కీర్తి సుమ్మీ, యోజ న్వరియింపఁ జూచు ♦ నో యీశుని యు
 వ్యాజకృప ధర్మకోటికిఁ, దాఁ జేరిన దానిఁ గొని ము ♦ దం బెనయ నగున్.

ఆ॥ అనినఁ దమ్ముఁ డనియె ♦ నన్న ; నీసన్న లె, ఱింగినాడ వాక్య ♦ భంగి నిపుడు
 గంటి భావగతివి ♦ కాస మయోనిజ, యార్య వలను దవిలి ♦ యమరి యుంట.

కం॥ అనఁ గొండొకొండు భావిం, చిన వాని వలె నటించి ♦ శ్రీజాని ధృతిన్
దన డెందము జానకి వల, గొను చంద మొకింత మఱుఁగు ♦ గొన నిట్లనియెన్.

కం॥ ఆపాతతఃప్రసక్తత, నేపార వె మంగళైక ♦ హేతువులు శ్రుతుల్
శ్రీపద్యలు కవిభావ, వ్యాపారము దానఁ గృతి న ♦ పారమ కాదే. ౧౭౫

తే॥ కోర్కి యొక్కండు నెమ్మదిఁ ♦ గుదురుకొనఁగ
నేది పొడకట్టిన వికార ♦ హేతువ యగుఁ
గాక చంద్రాదు లెపు డప ♦ కార మొంటఁ
జేయనున్నారె విధిసేయు ♦ చేత లేదె. ౧౭౬

సీ॥ వగఁ బూవుటెత్తుదో♦డుగ బాహు వెత్తియు, ల్లసఁగాంతు గళదేశ♦మునకుఁ దార్చు
హారదీప్తులు దర ♦ హాసలక్ష్మికి జతఁ, బతి పేరురమున నే ♦ ర్పడ ఘటించు
శుభకథాంశము మేలి♦సొబగు నొక్కట విభు, ప్రోల నిల్చియు దిక్కు♦లేలఁ బనుచుఁ
బొడము కోర్కులుగూర్మి♦బొదలు చూపులునాథు, వలగొనియెడ నెడ♦వఱలఁ జేయు
నీవ నేనను భావంబు ♦ నెరపుఁ బిదపఁ
దమముఁ దెరలించి తెఱుము మో ♦ దము నొసంగుఁ
జిత్త మనురక్తి నిగురొత్తఁ ♦ గ్రొత్తపెండ్లి
కూఁతు రనఁ గీర్తి కాంత రా ♦ కొమరులకును. ౧౭౭

కం॥ ఏయది యెటు లున్నను ముని, దా యశముం గోరి యిట్టి ♦ దానికిఁ దార్చెన్
జేయఁ దగు కృతికిఁ బొల్పడ, నా యెడ విధి దేనిఁ దలఁపు ♦ నం దిడువాఁడో.

ఉ॥ ఉల్లము జల్లుజల్లను ము ♦ హుర్ముహురుచ్ఛ్వసితాప్తి గల్గు మై
నెల్లెడ స్వేద మొప్పు ధృతి ♦ హీనత సేకురు వేగకంపముల్
పెల్లుగ సంఘటిల్లు నటు ♦ పిక్కటిలుం గరుపాటొకప్పు డే
బల్లిదుఁడేని మేలి కృతి ♦ భారము నెమ్మన మందుఁ గూర్చినన్. ౧౭౯

సీ॥ చిన్నారిపొన్నారి ♦ జిలిబిలిపల్కులు, చెవిఁ జేర్చి శ్రుతిసుఖ ♦ శ్రీ ఘటించి
యటునిటుఁ బొడగాంచు ♦ నంతలో నెల్లెడఁ, దానయై దృక్ప్రీతిఁ ♦ దనరఁ గూర్చి
నిజకథాఽమృతఝరి ♦ నెఱికి నోరూరంగ, హాయిగ రసతృప్తి ♦ నందఁ జేసి
కౌఁగిట నొదుఁగు వే ♦ డ్కఁ దను మేను గరుపాఱఁ, ద్వాచహర్షస్ఫూర్తి ♦ నాచరించి
కూడి గుమగుమవాసన ♦ ల్గుప్పి ఘ్రాణ
తర్పణం బనఁ దగి మదిఁ ♦ దరము మీఱు
సంతసము సంతతం బిడు ♦ సతియ పోలె
లలిత సత్కీర్తి రాజపు ♦ త్రులకు నెపుడు. ౧౮౦

చ॥ ప్రౌఢమువికారము ల్దలఁగఁ ♦ బొల్చువికాసము సమ్మదంబు పా
ల్పడు యశ మబ్బు మేలిధృతి ♦ పాదుకొను న్నెఱజాణ వృత్త మే
ర్పడు రసభావతత్పరత ♦ భాసిలు సత్కృతిభారవాహి యె
ప్పుడు కృతకృత్యతం గని వి ♦ భుత్వము గాంచెడు నాత్మణంబునన్. ౧౮౧

శా॥ నా భాగ్యం బటులే ఫలించునొకొ య ♦ న్నా; లక్ష్మణా; యింక నేఁ
డాభావం బెదఁ గూర్చ నుత్కలిక యై ♦ య్యా స్మితా వై కారిక
శ్రీ భావింపఁగ నయ్యె భానుఁ డుదయ ♦ శ్రీ మించి తా మజ్జయ
శ్రీ భాసిల్లఁగఁ జేయునో; కడఁగి ని ♦ ర్లేపత్వముం గాంచునో. ౧౮౨

క॥ అజితునకు నేని నెమ్మది, విజితత్వమె తోఁచుచుండు ♦ విధిశక్తివిపా
కజము ఫలము తోడ్పడ భా, వజవ్యథం దొలఁచి సిద్ధి ♦ పనుపడు దనుకన్.

ఆ॥ అర్థసిద్ధి వివిధ ♦ మై తగుఁ బూర్ణార్థ, భాగభేదకలనఁ ♦ బ్రభుఁడ నే నొ
కండ ననఁ గలంశె ♦ యొం డీశ్వరుఁడు సత్య,కాముఁ డయ్యుఁ గాల♦గతికి వేచు.

క॥ ద్వివిధం బీకృతినిఁ బరా, భవ మద్దానిఁ దలఁగించు ♦ నర యోగశ్రీన్
సవరొందు దైవసాహా, య్యవిలాసం బెల్లి నేఁ డ ♦ యచ్చాప్యకృతమై. ౧౮౫

ఆ॥ కార్యగౌరవంబుఁ ♦ గాశిక జతనంబుఁ, బ్రాక్తనప్రతిష్ఠ ♦ స్వప్రసక్తి
నెంచి భావిగతిఁ జ ♦ రించువాఁడఁ దలంచు, నెట్టు లీసఁ డదియు ♦ నెడప నగునె.

క॥ పరమేశానుగ్రహమే, పర మగు సాధనము జీవ ♦ భావపరులకున్
నిరుపమశక్తిస్ఫురణా, కర మగు నద్దాన మేలు ♦ గన నగు వత్సా. ౧౮౭

క॥ అని యిట్లు రాముఁ డుల్లము, జనకజతో జతన మొనయ ♦ జనమాత్రుం డ
మ్మనసిజున కగ్గమాగతి, ధనురాకర్షప్రసక్తిఁ ♦ దద్దయు నొడువన్. ౧౮౮

—♦ లక్ష్మణుండు రాముని యభిప్రాయంబు శుభోదర్కంబని విన్నవించుట ♦—

ఆ॥ అన్న భావగతుల ♦ నాతం డెఱింగి యి, ట్లనె విలాసవికసి ♦ తాస్యుఁ డగుచు
నీ తలంచుపనికి ♦ నెఱిపోక విశ్వజ, నీనచరిత ; కలుగు ♦ నే ధరిత్రి. ౧౮౯

క॥ ఎఱుఁగుదు సకలము నీ కృతి, నెఱి నిలుచును ముజ్జగములు ♦ నీ వజతుఁడ వ
క్కఱ నీయది గెలువదె యి, త్తఱి నొండు దలంప నేల ♦ తరణికులమణీ. ౧౯౦

శా॥ పాటు ల్నిర్జరకోటిపాలను మహా ♦ బాహు న్సుబాహు న్స్వమా
ర్గోటంకారహతాత్ముఁ జేయుటయొ మా ♦ రింబోని మారీచు ము
న్నీట న్మాటుటయో విపాటితజగ ♦ న్నిర్ఘాటకం దాటక
న్గోట న్మీటుటయో తలంకె స్మరజి, త్కోదండ ముంకింపఁగన్. ౧౯౧

క॥ సావష్టంభుఁడ వై నీ, వావెరవున నిలిచితేని ♦ నఖిలాధిప ; యీ
భూవలయం బల్లాడదె, భావజహరు విల్లు చేతఁ ♦ బట్టుట పనియే. ౧౯౨

ఆ॥ అఖిలలోకపతి వ ♦ నంతశక్తి వనామ, యుండ వీశ్వరుండ ♦ వూర్జితుండ
వీవ నీకు రుద్రుఁ ♦ డరవె లోకము మన్నఁ, గంటి జన్మకర్మ ♦ గతుల నిట్లు.

సీ॥ వేల్పుఁజెట్టులఁ గల ♦ విరులెల్లఁ దెచ్చి ది, వౌకసు ల్వర్షించు ♦ నంతలోన
తాలమానక్రియా ♦ ర్థము లనర్ఘములు గా, నచ్చర ల్నటియించు ♦ నంతలోన
కంచుగీజనయట్లు ♦ గదియంగ దేవఢ, క్కావలి తా మ్రోయు ♦ నంతలోన
కుంచె చేఁబూని వి ♦ పంచి పాడ విరించి, యాత్మజుం డాటాడు ♦ నంతలోన
హరుని ధను వీవు గైకొన్న ♦ యంతలోన
నవనవోల్లాసవిలసితా ♦ నంద యగుచు
వరణమాల్యము గొని డాయ ♦ వచ్చి నిన్నె
క్ష్మాకుమారి వరించు ని ♦ క్ష్వాకుతిలక. ౧౯౪

తే॥ ఐశచాపంబు మరుని వి ♦ ల్లొఁ గదయ్య
ముజ్జగంబులఁ ద్వత్కీర్తి ♦ మొనయునయ్య
యీయయోనిజ యార్య నీ ♦ యర్థ మయ్య ;
యసదృశానందవైభవం ♦ బందు మయ్య ;. ౧౯౫

క॥ అని తమ్ముఁడుత్త భవ్యం, బనువాదింపంగ రాముఁ ♦ డానందఘురం
బునఁ దోఁగి తద్విశేషం, బనఁ దగు మందస్మితమున ♦ నలరుచు నుండన్. ౧౯౬

తే॥ దక్షిణాక్షిభుజోరువు ♦ ల్దాశరథికి, నట్టు లటు వామములె స్పంద ♦ మొనసె సీత
కఖిలభావిఫలప్రకా ♦ రైకలక్ష, కములు శకునము లవి సూచ ♦ కములు గావె.

క॥ అయ్యెడ నియ్యెడ నెయ్యము, లియ్యము దులకించిమేల్మి ♦ తీరు వెలయఁగా
నయ్యేఁ గన నెల్లరకుఁ దా, నొయ్యన భావిఫలయోగ ♦ ముత్పలనయనా. ౧౯౭

చ॥ శుభశయనం బొనర్ప ముని ♦ సూచనసేసిన యంత దస్రిస
న్నిభు లగువారు మేలని వి ♦ నీతిమెయి న్దతిఁ గాంచి నిల్వ దుం
దుభియుతభద్రగీతు లటఁ ♦ దోఁప విలాసవికాసమూర్తు లౌ
చు భవనగర్భసీమ ధృతి ♦ శోభితులై పవళించి రద్రిజా. ౧౯౯

క॥ రాముఁడు న్సహాభాముఁడు శ్రీ, రాముఁడు శుభధాముఁ డించు ♦ రహిఁ దనరె సుశ
య్యామహితుం డయి మందిర, సీమాధ్యుఁడు శేషశాయి ♦ చెలువం బొప్పన్.

క॥ అని శంకరుండు వినిచిన, విని గౌరీసతి ప్రమోద ♦ విలసన మొద నె
క్కొన వల్లభు గాథాలిం, గనసుఖమునఁ దనిపి మీఁది ♦ కథ యడుగుటయున్.

మేఘవి॥ నిరస్తాశేషాత్మప్రకృతివికృతీ ; ♦ నిర్మలానందమూర్తీ ;
చిరత్రోక్తిస్ఫూర్తిశ్రితజనశుభ ♦ శ్రీప్రదానానువర్తీ ;
వరత్రాసత్రాణాధికృతదివిష ♦ ద్వ్యాప్తైశ్వర్యకీర్తీ ;
స్థిరశ్రేయఃప్రాప్తిస్థితిపదమహా ♦ శ్రీపురీచక్రవర్తీ ;. ౨౦౨

క॥ సత్తాప్రకాశతామస, వృత్తినిరాకరణచణవి ♦ వేకశ్రుతసం
సత్తివిశేషశ్రీసము, పాత్తపదాత్మీయజనవ ♦ శా ; సకలేశా ;. ౨౦౩

భుజంగ॥ మహాయోగసామ్రాజ్య ♦ మాన్యాభియోగ
స్పృహావద్విధేయాను ♦ చింత్యాత్మయోగా
మహస్సత్ప్రమేయప్ర ♦ మాణాధియోగా
వహస్స్వప్రకాశత్వ ♦ వాంఛాప్రయోగా. ౨౦౪

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనళిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండమునం దష్టమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథామృతము.

## బాలకాండము.

### నవమాశ్వాసము

:(o):

క. శ్రీవాణీగిరిజాదిక
లావిలసత్ప్రకృతియోగ ♦ లలితసమరసో
ద్భావితజగత్త్రియార్థ
స్వావిర్భూతాద్యదియోజ ♦ నా; పరమాత్మా. ౧

తే॥ అవధరింపుము జంగమ ♦ హైమవల్లి, సకలసాధ్వీమతల్లి యా ♦ జగముతల్లి
డెంద మానందలక్ష్మికి ♦ మందిరముగ, భువనజనకుఁడు శివుఁ డిట్లు♦పూనెఁ దెలుప.

### సూర్యోదయప్రస్తావము

శా॥ వింటే పర్వతరాజనందిని గుణా ♦ విర్భూతిచాతుర్య మే
వెంటం గాంచిన పీట రామపదమే ♦ వేయేల యానంద మే
యింట న్నెక్కొన దట్టు లంతిపురి సౌ ♦ హిత్యంబు హేలాగతు
ల్గంటం బాయవు నాఁ డమేయసుఖలీ ♦ లాడోలికాందోళనల్. ౩

తే॥ తనివు సన కర్ధరాత్రంబు ♦ దనుక నట్లు
ముచ్చటల మున్గి తేలుచు ♦ మొనయు సౌఖ్య
పరవశత్వంబుననొ పక్ష ♦ పాతముననొ
నిద్ర నొక్కింత గాంచిరి ♦ నిఖిలజనులు. ౪

చ॥ మొనసిన కూర్కుపాటొ విధి ♦ మోహనలీలయొ యోగశక్తియో
మనసిజు తంత్రమో లలిత ♦ మానసభావమొ హర్షలక్ష్మియో

గొనబుల మేర పెండ్లిపయిఁ ♦ గూరిన కూరిమి కూర్చు చొక్కు యి
ట్లని యనరాని యాప్రకృతి ♦ యందఱకుం దని వొప్పఁ జెప్పఁగన్. ౫

మ॥ మనము ల్వ్యాకులు మేను లొక్కఁడుగ సం ♦ భావించుచు న్గామతం
త్రనవోల్లాసవికాస మొప్ప రతితా ♦ త్పర్యంబునం జొక్కువా
రును నిద్రాసుఖవీచిడోలికల నా ♦ రోహించు వారుం గదా
తన సౌభాగ్యము గాంతు రెవ్వరనుచుం ♦ దర్లంగ నా రాత్రికిన్. ౬

తే॥ ఎల్లియో నేఁడో జనకుడు ♦ హితపుఁ బెండ్లి
దారసిలె నంచుఁ గోర్కులు ♦ దందడింప
భావినులఁ గూడి దీపాల ♦ పళ్లెరములు
పట్టుకొని వత్తు నని రాత్రి ♦ బయలుదేఱె. ౭

క॥ అప్పొలఁతిమిన్న యొప్పుల, కుప్ప గదే జనకకన్య ♦ గూడె శుభము మా
త్రిప్పు లెడలె నని యైంద్రియు, నొప్పారఁగ ముఖవికాస ♦ మొయ్యనఁదోఁచెన్.

తే॥ సిరికి నెలవయి నెమ్మోము ♦ చెలువ మొందఁ
బద్మిని వరించు నింకిట ♦ భాను ననుచు
నపరభాగోపలక్షితుం ♦ డగుట నున్న
మెయిన వెల్వెలఁబాఱెఁ ద ♦ మీవిభుండు. ౯

ఉ॥ శోకము లార్పఁ దమ్ము లటు ♦ గుంద వికాసము లేక పాంథు ల
స్తోకవిపాక మొంద బలు ♦ దోసము లింతకుమున్నె సోఁకి నా
పీఁకకు లేకఁ గూర్చె నిఁక ♦ వేడబ మీయిను బ్రోలఁ బోల దం
చాకలితాంకుఁ డంతఁ దన ♦ యంతన జాఱఁ దొడంగె నేర్పునన్. ౧౦

క॥ సుమనోభిరాముఁ డయ్యును, విమలస్థితి మనియు ఖ్యాతి ♦ వెలసియు శశి యం
దముఁ బాసె నపరదిశఁ బ, శ్చిమ నెనసిన జేని కెందు ♦ సిరి సెడ కున్నే. ౧౧

సీ॥ అలవడు రొద లెల్ల ♦ నాలించి యాలించి, మెడ సాఁచి మోసాలఁ ♦ దడవి తడవి
నెలవెల్లుగనిచూడ్కి ♦ మరలించి మరలించి, యుస్సురం చొకయెడ ♦ నొదిఁగి యొదిఁగి
తలఁపుల నొండొండఁ ♦ దరలించి తరలించి, యసువులపై నాస ♦ లడఁచి యడఁచి
తమ్మితీఁగెలఁ దల ♦ దవిలించి తవిలించి, యటు నిటుఁ గని కొంత ♦ యాఁగి యాఁగి
నలినకలితాలిదీనస్వ ♦ నము విని విని, వేగుఁజుక్కకు నొక్కింత ♦ వేచి వేచి
ధవునిఁ బాసి యతని వెత ♦ ల్దలఁచి తలఁచి, సలిపె జాగర మివ్విధిఁ ♦ జక్రవాకి.

తే॥ ఆరథాంగవితతి పైఁ ద ♦ యార్ద్రచిత్త
మునను పెండిలి యుల్లాస ♦ మునను యినుని
రాకఁ గాంచి ప్రసన్న యా ♦ ప్రాచి గుస్తు
సూపె నన మేలిరుచి వేగుఁ ♦ జుక్క వొడమె. ౧౩

క॥ జారుల మతి సెడఁజెడె ధృతి, చోరుల కటు రతి గృహస్థ ♦ సుదతులకుఁ జెడెన్
జారుల వృతి సెడె నౌరా, తోరంబగు వేగుఁజుక్క ♦ తొలిదెస మెఱయన్. ౧౪

సీ॥ ఇదె వత్తు ననుమాట♦యెడఁ దోఁపఁ దల ద్రిప్పి,తమవార లే యంచుఁ♦దల్లడిలుచుఁ
బైగాలి సోఁకినఁ ♦ బడె దెబ్బ పోయంచు, మైగంప మానంగ ♦ మ్రానుపడుచు
నటుచూడు మదెదారి♦యన నెవ్వరో తమ్ము,గుర్తించి రని బిట్టు♦గొణఁగుకొనుచు
నిఁక నొల్ల దీని ఘాం ♦ దే నన్న విని చేటు, గూరె నెట్లని కల ♦ గుండుపడుచు
విటులఁ గలసి యెటో వారి ♦ విడచి కూడ
దిప్పని యటంచు నెమ్మది ♦ హెచ్చరించి
యో; యనఁగఁ జాటుచాటున ♦ నొదిఁగి యొదిఁగి
చేరి రభిసారికలు గృహ ♦ సీమలకును. ౧౫

తే॥ ఆకసఁపుఁ బువ్వుటీరము ♦ నందుఁ జుక్క
పూవు లొండొండఁ జిదిమి పూఁ ♦ బోఁడి ప్రాచి
ప్రొద్దుఁ బూజింప నటఁ గుప్ప ♦ వోసె ననఁగఁ
గాంతి యచ్చోటఁ జెరఁగె రి ♦ క్కలును దఱఁగె. ౧౬

తే॥ యంత రథికుఁడుఁ గాశ్యపు ♦ లట్టు లిరువు
రరుణు లొకఁ డం దనూరుఁడై ♦ నంత నేమి
తెలివి వెలయించెఁ దా మున్నె ♦ దెసల రాగ
కలనఁ దేజస్వి లిట్టిర ♦ కారె జగతి. ౧౭

సీ॥ సౌరమంత్రజపంబు ♦ సలిపి చక్రతతి వే, ల్వ వెలుంగు పావక ♦ జ్వాల యనఁగ
నా వేగుఁజుక్క ద ♦ క్షాపత్య మవమాన,మీఁగఁ దార్చు తపోగ్ని హేలయనఁగఁ
బద్మిని శశి తన్ను ♦ బాధింపఁ బతిరామి,మ్రోలఁ జేర్చిన చిచ్చు ♦ లీల యనఁగఁ
బాంథసాధ్వీమణీ ♦ ప్రకరం బతనుఁ దిట్టఁ, గ్రాలు శాపానల ♦ కీల యనఁగ
హరుని విల్లెత్తు మారాముఁ ♦ డనుచు సురలు
కలుగు వాద్యవిశేషము ♦ ల్గాఁపు గూర్చ
మలయఁ జేసిన శిఖిశిఖా ♦ మాల యనఁగఁ
బరఁగు నౌపసరాగంబు ♦ ప్రాచిఁ దోఁచె. ౧౮

ఉ॥ తమ్మికొలంకులం దవిలి ♦ తార్కొని పుష్పాదులం గదల్చుచుం
గమ్మనితావు లందుకొని ♦ కార్కొను భృంగతరంగహంసనా
దమ్ముల మే లెఱింగి సుఖ ♦ దానవశంవదము ల్ప్రభాతపుం
దెమ్మెర లల్లనల్లన వి ♦ ధేయతఁ జూపఁ దొడంగె నత్తఱిన్. ౧౯

ఉ॥ కోకిలరావ మొప్పె ధృతి ♦ గూరెను వాయసపాలి కెట్టెటో
కోకము కోకిఁ గన్గొనె వి ♦ కుంఠత గన్గెఁ జకోరపఙ్క్తి క
ట్లాకృకవాకుశబ్దనివ ♦ హంబు బయల్పడెఁ గేకికేకలున్
బ్రాఁకె దివంబుఁ గాలగతి ♦ భాసిలు నయ్యరుణోదయంబునన్. ౨౦

చ॥ కలకలరావ మొప్పఁ బయిఁ ♦ గన్గొని ఱెక్కలు విప్పి కాలిసం
కెల లగు పిల్లల న్నిమిరి ♦ గెఱ్ఱున దాఁటి కులాయము ల్కలం
కులఁ గల జాతిలోఁ గలసి ♦ కూడిక వీడక దారిఁ బట్టి ది
క్కుల బయనంబు సేసె నెరఁ ♦ గోరి పులుంగులు చాలుచాలుగన్. ౨౧

మ॥ తమ గూర్పేర్పడ నింద్రుఁడింతికయి ము ♦ న్దాఁగూసి వంచించె గౌ
తముఁ డల్గం జెడి దిర్వ్య రామెఁ బరిశు ♦ ద్ధం జేసి మాజాతిమో
సముఁ బాపె న్రఘుకల్పకం బిది ప్రశ ♦ స్తం బంచు నా తామ్రచూ
డము లత్యాదృతిఁ గూర్చె మాగధుల జం ♦ టన్ స్తోత్రపాఠంబులన్. ౨౨

ఉ॥ తేనియ లొల్కు పల్కు జిగి ♦ తెల్వియుఁ దేటయుఁ బెంపు సొంపు స
న్మానితసద్గుణాలి రస ♦ మార్దవ మంచదలంక్రియావిలా
సానుగమంబు వ్యంజనల ♦ నందిన భావము లొప్పఁ గావ్యల
క్ష్మీనవమూర్తులో యన ర ♦ చించిరి వందులు స్తోత్రబంధముల్. ౨౩

సీ॥ సరిగమపధనిస ♦ సంజ్ఞస్వరంబుల, బొలుపారు శ్రుతిచయం ♦ బుల నమర్చి
రసవిశేషాసక్తి ♦ బొసఁగ వసంతాది, రాగవిభాగాను ♦ రక్తి దార్చి
తాలమానక్రియా ♦ ర్థవిలాససంయుక్తి, తనర లయానుబం ♦ ధం బొనర్చి
షడ్జాదికగ్రామ ♦ సక్తిఁ దత్తన్మూర్ఛ, నామోహనాహ్లాద ♦ నంబు గూర్చి
కలితపరివాదినులు మున్ను ♦ గా విశిష్ట, సాధనంబుల గల వరి ♦ శ్రమ మెసంగ
వల్గుగీతానువృత్తికి ♦ జూ ల్గరంగఁ, బాడఁ దొడఁగిరి సంగీత ♦ పాఠు లపుడు.

సీ॥ తవిలి యుదాత్తాను ♦ దాత్తస్వరితవృత్తు, లెంచుచు శ్రుతులు ప ♦ ఠించు వారు
నల ప్రకృతిప్రత్య ♦ యాదివిచారణ, లెసలఁగ వ్యాకృతిశిక్ష ♦ మలయు వారు
ద్రవ్యగుణాదికా ♦ ర్థవిశిష్టతర్కసం, ఖ్యానువాదంబుల ♦ నడరు వారు
విధివిధేయాంగాది ♦ వివిధభావాన్విత, తంత్రచర్చాసక్తిఁ ♦ దనరు వారు

బ్రహ్మవిద్యాప్రసంగసం ♦ పత్సమేతు, లై యమేయసుఖావాప్తి ♦ నలరు వారు
వర్ధమానర్ధు లటు శిష్య ♦ వరులు గురులు, మెచ్చ నధ్యయనశ్రీల ♦ మెలఁగి రపుడు.

మ॥ గురుశుశ్రూషలఁ బొల్చు శిష్యతతివా ♦ గ్గుంభంబులు న్దీవితే
శ్వరు శుశ్రూషల మించు భామినుల దీ ♦ వ్యద్వాక్యలీల ల్హావి
ర్ధరు శుశ్రూష లొనర్చు శ్రోత్రియుల శ్రౌ ♦ తస్మార్తనిత్యక్రియా
చరణోత్సాహములుం దలిర్చె నటుభా ♦ స్వంతుండు రా మున్నుగన్. ౨౬

సీ॥ వెలిచట్టుపలపులుం ♦ గులు మూఁగ దరి నిడ్డ, ధౌతాంశుకంబులు ♦ దడవి కొనుచుఁ
గెలనఁ గెంజాయవా ♦ జులు గూడఁ దోమి ని, ల్పిన రాగికూజాలు ♦ వెదకి కొనుచుఁ
గప్పడాల్పక్కలు ♦ గదియ నచ్చోటఁ గృ, ష్ణాజినంబుల నెటో ♦ యరసి కొనుచుఁ
బసుపుపిట్టలు చుట్టు ♦ బలసినఁ బచ్చని, పట్టుసాలులు చూడ్కిఁ ♦ బరపి కొనుచు

మహితవారుణపవమాన ♦ మంత్రయోగ
రాజదఘమర్షణాద్యుప ♦ క్రమము దనర
సరసుల నదీనదముల సు ♦ స్నాతులై ద్వి
జాతిముఖ్యులు సేరిరి ♦ సదనములకు. ౨౭

ఉ॥ సారసుధానుసారిగుణ ♦ సంగతసంపద నుల్లసిల్లు సం
భారవము ల్నెలంగ నవ ♦ వత్సము లందలి వత్సలత్వ మిం
పారఁగ మోర సాఁచి కను ♦ నాలకుఁ గ్రేపులఁ గూర్చి నేర్చుసం
సారులు క్షీరము ల్గొనిరి ♦ చయ్యన నయ్యరుణోదయంబునన్. ౨౮

ఉ॥ పాల్కడలి న్నయించు దధి ♦ భాండము మట్టున నిల్పి కవ్వముల్
జుల్కఁగ నూఁచి రజ్జువుల ♦ జోగము నెక్కొనఁ ద్రిప్పుత్రా డటం
గుల్కుచుఁ గూర్చి కామినులు ♦ ఘుంఘుమరావము లుల్లసిల్లఁగాఁ
జిల్కిరి చల్ల లప్డు మణి ♦ శింజితకంకణము ల్నటింపఁగన్. ౨౯

క॥ అంతయుఁ బ్రబోధమయముగఁ, సంతమసము పీడఁబాఱు ♦ సరణి మనస్సం
క్రాంతము సంతస మెగువఁగ, స్వాంతతరం బనఁ దనర్చు ♦ నక్కాలమునన్. 30

సీ॥ చెలి నాఁగఁ జెలివితే ♦ ట లెసంగ నెట్టన, దమతమ పని వంకఁ ♦ దార్చువాఁడు
తండ్రినాఁ జందమం ♦ దముఁ దోఁప శ్రేయంబు, గూర్చుసత్క్రియకు మే ♦ ల్కొలుపువాఁడు
తల్లి నా వత్సల ♦ త్వమున నసారోగ్య, మెడలించి సుఖపుష్టి ♦ నిడెడువాఁడు
గురువు నాఁ దమము మా ♦ ర్కొననీ కడంచి ప్రబోధకలనఁ దేర్పఁ ♦ బూనువాఁడు

ఆత్మత త్త్వము నాఁగ స్వ ♦ యంప్రకాశ
మద్వయ మఖండ మానంద ♦ మవ్యయంబు
నై నిగమలక్ష్య మగు రూప ♦ మమర వెలయు
వాఁ డుదయ మొందె వెలుఁగుల ♦ ఱేఁడు నాఁడు. ౩౧

ఉ॥ ముక్తికి దారి జక్కవల ♦ మోదము వెల్గుల పుట్టువ ట్టిరుల్
మొత్తుబెడంగు కల్వ సిరి ♦ మోడ్పు తమీహ్యతి వృష్టిపుష్టిసం
పత్తి సరోజినీసుకృత ♦ పాకము లోకవివేక మాత్రయై
పత్తనలక్ష్మి గ్గ వ్యోమమణి ♦ భానుఁడు నెక్కొనెఁ దూర్పుదిక్కునన్. ౩౨

తే॥ ఉదయగిరిపద్మరాగప్ర ♦ భోజ్జ్వలుండు
పద్మరాగవిశేషవి ♦ భాసురుండు
కుటిలమందేహర క్తసి ♦ క్తుండు నైన
యరుణుఁ డుదయించెఁ దొలుదొ ల్త ♦ నరుణుఁ డగుచు. ౩౩

క॥ కమలలతఁ బాసి నిశిఁ దాఁ, గుముదిని వెలయించె దానిఁ ♦ గూల్చి మఱల నీ
కమలినిఁ గూడఁ దొడరె నీ, కమల విసంవాద మిట్టి ♦ గతిఁ గనవయ్యెన్. ౩౪

ఆ॥ కమలకోశగర్భ ♦ గతి బంధ మెడలక
సన్నఁ బాసి యున్న ♦ షట్చరణము
తమము దుల్చి తెల్వి ♦ దయఁ గూర్చు నా త్రయీ
మూర్తి దర్శనమున ♦ ముక్తిఁ గాంచె. ౩౫

చ॥ తళతళ మంచు జట్టుపలఁ ♦ దార్కొను వెల్గులఱేని వెల్గులన్
నెలకొను పైఁడివన్నె గని ♦ నేమము గాంచి రుత మ్మెఱింగి చూ
డ్కులఁ దనియించి చేరి తమి ♦ గూరఁగ మోమున మోము దార్చి యి
మ్ముల రతికేళికి న్మలసి ♦ మోదమిడె న్పతి చక్రవాకికిన్. ౩౬

క॥ విమన స్త వాయ సంయో, గ మయోగము కాలగతివి ♦ కల్పిత మని డెం
దము లూఱటఁ బొందింపుచు, సమరసభావమున మెలఁగె ♦ జక్కవకవ దాన్.

సీ॥ జిగినగుమోముసో ♦ యగ మల్ల విరిదమ్మి, పూల విస్ఫురణమ్మె ♦ బోధసేయ
నెమ్మేని మించు డా ♦ ల్గ్రిమ్ము కమ్మిక జక్క, వల టెక్కుల కడాని ♦ వన్నె తెలుపఁ
దళుకుబెళ్కొలయుచూ ♦ డ్కులయొయారము గండు, మీలయుచ్చలనంబు ♦ మేల్మిసూప
లావణ్యలహరీక ♦ లాపూర్తి సరసీత, రంగరింగద్రవి ♦ రశ్మి నొడువ

భృంగగీతులు కవివాక్స ♦ సంగములు శు
చిచ్ఛదచ్ఛదచామర ♦ శ్రీలుఁ దనర
నసదృశసహస్రపత్రసిం ♦ హాసమున
నిండు కొలు వుండెఁగలుముల ♦ నెలఁత యపుడు. ౩౮

క॥ ఇనుఁ డన్యుఁ డుదయ మొందెడుఁ, దన బలఁగము వంక హీన ♦ దశ తారసిలెఁ
జన దింకిట నిల నని తగు, మనికికి శశి పశ్చిమాద్రి ♦ మఱుఁగున ♦ కరిగెన్. ౩౯

సీ॥ మిత్రాయ జగదేక ♦ మిత్రాయ తే నమ, స్తేనమో రవయే న ♦ మోనమోస్తు
సూర్యాయ నమదఖి ♦ లార్యాయ తే నమ, స్తేనమో భానవే ♦ తే నమోస్తు
ఖగపదా యాపవ ♦ ర్గపదాయ తే నమ, స్తే నమః పూష్ణే న ♦ మోనమోస్తు
గర్భితాండ హిరణ్య ♦ గర్భాయ తే నమ, స్తేనమోస్తు మరీచ ♦ యే నమోస్తు
మా మవాదిత్య సవిత ర్మ ♦ మ వ్యపనయ
పాపచయ మర్క భాస్కర ♦ పాహి పాహి
యనుచు మ్రొక్కుల నామ్రొక్కు ♦ లయ్యె కెలమి
దానఁక సర్పింతు రపుడు స ♦ జ్జనులు భక్తి. ౪౦

సీ॥ తమ మంతరితమహః ♦ తమ మట్టు లాగుడ్లఁ, గూబపిం డెన గాఁగ ♦ గుహ నడంగె
జడభావ మఖిలస్వ ♦ జ్జడభావ మనఁ బడో, పాధ్యత్వు నకు జత ♦ నస్తమించె
విధికృత్యతతి యల్ల ♦ విధకృత్యతతి నాఁ బ, కాశము తోడ జ ♦ గమున నిండె
శ్రుతిచయం బవికల ♦ శ్రుతిచయంబన నంగ, విద్యామహిమ గూడి ♦ విస్తరిల్లె
భయము వదలె నిఖిల ♦ భద్రము ల్పొదలె ని
రస్తమయ్యె నఘ మ ♦ పాస్త మయ్యె
నామయంబు సర్వ ♦ మానందమయ మయ్యె
నుదయశిఖరి భానుఁ ♦ డొప్పు నంత. ౪౧

—♦ విశ్వామిత్రుండు రామలక్ష్మణుల మేలుకొలుపుట ♦—

ఉ॥ అంతట ముస్నె కౌశికుఁ డ ♦ హంకృతిదూరుఁడు మేలుకాంచి శ్రీ
మంతుల రామలక్ష్మణుల ♦ మానసపద్మము లుల్లసిల్లఁ దా
నెంతయు మించు వేడుక న ♦ హీనవచోరచనోచితిం బ్రియా
మాంత మెఱుంగఁ జేసె నిటు ♦ లాదర మొప్పఁగ భూధరాత్మజా. ౪౨

తే॥ పాలమున్నీటి సెజ్జపైఁ ♦ బవ్వళింపఁ, గెలన సనకాదు లెవనికిఁ ♦ గింకరత్వ
కలన మెలఁగుదు రతనికి ♦ గాధి సుతుఁడు, సౌఖశాయనికత్వంబు ♦ జరుపు టరుదె.

తే॥ రాత్రి నడిపె శశాంకుండు ♦ రమణఁ బవలు, సేయ వచ్చెడు నిదె సర ♦ సిజహితుండు
రాత్రిపవలన నఖిలసం ♦ రక్షణంబు, నీ తలనె నిల్చి యున్నది ♦ నియతి రామ.

తే॥ మేలుకొను మన్న ; కరుణ మ ♦ మ్మేలుకొనుము
మేలు గను మట్లు జగముల ♦ మేలు గనుము
బాలభానుప్రకాశంబు ♦ లీల నీదు
మేలి పౌరుష మెల్లెడఁ ♦ గ్రాల మనుము. ౪౫

సీ॥ ముచ్చురక్కసు వార్ధిఁ♦జొచ్చి వచ్చి శ్రుతు ల్వి, ధాత కర్పించిన♦తాత; లెమ్ము
గిరి మోచి తరికాంప్ర♦కృతి గాచి యమరుల, కమృతమ్ము గూర్చిన♦యయ్య; లెమ్ము
మహిఁజాఁప చుట్ట చు♦ట్టి హరించుకూళనో, య్యనఁగూల్చి నెఱిగన్న♦యన్న లెమ్ము
హరిఁ జూపు మని పట్టి♦నలఁచు హంత నగల్చి, భక్తుఁ గాపాడిన ♦ బాబు; లెమ్ము
పుడమి లోయ బలికి స్వర్గ ♦ పురము హరికిఁ
దార్చ గిటకవడుగు వైన తండ్రి ; లెమ్ము
దొరలఁ ద్రుంపంగ మనుపఁ దో ♦ డ్తోన రామ
నామగుణనికఁ గొన్న మా ♦ నాన్న ; లెమ్ము. ౪౬

శా॥ భ్రాజిష్ణుత్వము చక్రపాలనకలా ♦ ప్రావీణ్య మవ్యాజరా
రాజద్వీర్యవికాస మస్తతిమిర ♦ ప్రారంభసంరంభ మా
రాజోత్తేజనలీలయుం గని స్వగో ♦ త్రశ్రీలు వర్ధిల్లు నీ
యోజం బెల్లుగ నంచు భానుఁడు స్వకీ ♦ యోత్సాహముం జూపెడిన్. ౪౭

సీ॥ తన త్రయీమూర్తితఁ ♦ దనరాకఁ బెనుపొందు, సిద్యాధ్యయనగోష్ఠి ♦ వెల్లడింపఁ
దన కర్మసాక్షితఁ ♦ దనరాకఁ దనరారు, సత్క్రియాయోగంబె ♦ సన్నుతింపఁ
దన జగన్నేత్రతఁ ♦ దనరాక వలనొప్పు, నిఖిలశిజ్ఞానంబు ♦ నిర్ణయింపఁ
దన లోకబంధుతఁ ♦ దనరాక నెఱి మించు, వివిధచక్రసుఖాప్తి ♦ విస్తరింపఁ
దన యనంతమణితఁ ♦ దనరాక మిఱిమీఱు, దివ్యధామకలన ♦ తేటపఱుపఁ
దన సురోత్తమత్వ ♦తత్త్వంబు మెఱయ నె, క్కొనెడుఁ బ్రాచి రవి ర♦ఘుప్రవీర;.

ఉ॥ పక్కులు మేలుకాంచి వెసఁ ♦ బాఱఁ దొడంగెడు నల్లనల్లనన్
రిక్కలు జాఱెఁ బద్మినులు ♦ శ్రీ నలువొందెడు బాటసారులే
దిక్కునఁ దార కా నడువఁ ♦ దెల్వి వహించిరి కర్మనిష్ఠులుం
జక్కఁగ స్నాతులై చనిరి ♦ చక్కికి నిత్తఱి రాఘవోత్తమా. ౪౮

ఉ॥ దొంగలఁ దోలి జారధృతిఁ ♦ ద్రోచి యిరు ల్వాడలించి గోరముల్
ద్రుంగఁగఁ జేసి పాపములఁ ♦ ద్రుంచి యివంబు దొలంచి తెల్విఁ

దేటం గలిగించి రాత్రిచర ♦ డంబరము ల్ద్రోలఁగించి పోఁచు మే
ల్సంగతి లోకబాంధవతఁ ♦ జాటదె యీయిను వంక లెంకగన్. ౫౦

శా॥ సౌగంధ్యాదిగుణత్రియంబు వలనన్ ♦ జానొంది హంసాదివా
గ్భాగాంచన్నుతః లుల్లసిల్ల సుమలి ♦ ట్సాలీరవాలీకసు
శ్రీగీతిక్రిమ మొప్ప సర్వశుభల ♦ క్ష్మీస్రయుక్తి నీ సేవకుం
దాఁ గాంక్షించి మెలంగు గంధవహుఁ డే ♦ తన్మాత్రుఁడే రాఘవా ;. ౫౧

మ॥ కను మీ నీనగుమోము మేల్సిరికి ల ♦ క్ష్యం బౌటకున్ లజ్జ నె
ట్టన మున్మున్న మునింగి కొండచఱి బా ♦ టం జాఱె రేఱేఁ డటం
చను మోదించుటఁ బద్మినీసతి నిజా ♦ స్యస్మేరదృష్టిప్రసా
రనవోల్లాసిత ప్రీణయై తెలిపెడిన్ ♦ రామా ; జగన్మోహనా ; ౫౨

శా॥ స్ఫీతోత్సాహమునన్ రఘుప్రవరుఁడే ♦ శ్రీకంఠు విల్లెత్తి మా
సీతం బెండిలియాడుఁ గావుత మహా ♦ శ్రీ మీఱ సంచు న్హిమ
వ్రాతస్నాయినియై ధరారమణి దే ♦ వప్రీతి కయ్యాపన
జ్యోతిం జేకొని భాస్వదాహ్వయమహో ♦ జ్యోతి న్వెలింగించెడిన్. ౫౩

సీ॥ ఒక రశ్మికలకేని ♦ నొగి సాటిరాని రి, క్కల నుహోబిలమునఁ ♦ గాఁపువెట్టి
యొకమాత్ర నెదిరి ని ♦ ల్వక వెల్లఁబోవు రే, ఱేనిఁ బశ్చిమగిరి ♦ కోన డాఁచి
యొక చాయ డాయఁబో ♦ నుదిలపడెడు తమః, పటలంబు ఘూయని ♦ పాఱనూఁది
యొకతాఁకు దాఁకఁ గొం ♦ కక బింకమాడు మం, దేహుల దేహర♦క్తేరఁ దోఁగి

యొకట ముసరి విజృంభింప ♦ నురుకరముల
నివము దివమున కెగయంగ ♦ నెత్తి వైచి
యొకఁడె జగములఁ ♦ దా నయి యుదితుఁడయ్యె
నీదు కూటస్థుఁడా హేలి ♦ నియతి రామ;. ౫౪

క॥ దిక్కుల కొదవఁ దెలివి సుర, లక్కజముగ సిరులు గాంచి ♦ రానందము పెం
పెక్కెను ముజ్జగముల కిటు, లొక్కట నర్యముఁడు నీవు ♦ నుదయ మెనయుచోన్.

శా॥ సావిత్రీపదమంత్రలక్ష్యకలనా ♦ సంస్థాన మానందల
క్ష్మీస్రవాసంబు త్రిమూర్తికూటము మహో ♦ శ్రేయఃపథం బవ్యయ
శ్రీవిద్యానిధి చిద్విలాస మగు రో ♦ చిస్స్వామి యాయాస్థితిన్
నీవే తానను భావముం దెలిపెడి ♦ న్నిర్వ్యాజుఁడై రాఘవా! ౫౬

సీ॥ ప్రణవారవము జాడఁ ♦ బలు తెఱంగుల శుక, శారికాదికరుత ♦ సరణి సూపఁ
బ్రాణముఖ్యమరుత్ప్ర ♦ భావమ్ము మెలకువ,కమ్మ తెమ్మెర యూర ♦ జమ్ము నొడువఁ
జిత్ప్రకాశకలావి ♦ శేషం బశేష మ, య్యాపసరాగంబె ♦ యనువదింప
మోహావరణవిని ♦ ర్మోకంబుఁ దసకుఁ దాఁ, దరలిపోయెడు తమ ♦ స్తతియ తెలుపఁ
బ్రాంచదానందతృప్తిప్ర ♦ పంచ మఖిల, భూతసంభూతసౌఖ్యాను ♦ భూతి వలుక
హంసమూర్తియ కా ద్వాద ♦ శాత్ముఁడొప్పె, దావకతదాత్మతాస్థితిఁ ♦ దవిలి రామ.

మ॥ మనసార న్మన సారసాప్తుఁడు జగ ♦ న్మాన్యుండు గా నిష్ఠ ప
ద్మిని మేలై మ్రొఁ గరుపాఱఁ దార్చి ధృతి మే ♦ ల్మిం గూర్చి లాలించు శో
భనలీలాకరము ల్కరమ్ము లటు నీ ♦ పై మోపు నాలోన యా
యన నీనందన మందఁగా వలచె నె ♦ య్యం బొయ్యనొయ్యం దగన్. ౫౮

సీ॥ వారిజమ్ములు తమ ♦ వారియాననములు, లక్ష్మీవిలాసోప ♦ లాలితములు
ధ్వాంతౌఘములు నిజ ♦ పక్షజాడ్యమ్ములు, దరుణప్రకాశవి ♦ ధ్వంసితములు
దృష్టోద్యమమ్ము లా ♦ త్మీయవిఘ్నమ్ములు, ప్రథితప్రభావవి ♦ భ్రంశితములు
విద్యానుగమములు ♦ స్వీయయోగమ్ములు, పృథులప్రబోధోప ♦ బృంహితములు
కర్మతంత్రమ్ములు స్వకీయ ♦ కౌశలమ్ము
లవిరతానందనవవవో ♦ ద్యద్గుణములు
గాఁగఁ దనరెడు మిగుల భా ♦ స్కరుఁడు నీదు
భద్ర మెద నెంచి మమతావి ♦ నిద్రుఁ డగుచు. ౫౯

తే॥ స్వీయమనుకులసురతరు ♦ శ్రీవిశేష
మిది ఫలం బిదు ముద మబ్బ ♦ నింకఁ దన క
టంచుఁ గాంచెడు ధృతి నిట్టు ♦ లరుణుఁ డోర
చెట్టు ముద్దును మఱపించుఁ ♦ జివురుముద్దు. ౬౦

సీ॥ తా నైంద్రచాపంబు ♦ ధరియించు వడువున, నైశకోదండ మీ ♦ వవధరింపఁ
దన ప్రతాపస్ఫూర్తి ♦ తరము మీఱుప్రసక్తి, నీదు తేజము దెస ♦ ల్నెఱసి మెఱయఁ
దన వృష్టి జగములఁ ♦ దనుపుచందంబున, ననవాన నీకృతి ♦ మొనసి వెలయఁ
దన ఖ్యాతి యెడలేక ♦ తనరారు తీరున, నీయసం బతిలోక ♦ నియతిఁ బొసఁగఁ
దన కరగ్రహలక్ష్మిఁ ♦ బద్మిని తలిర్చు
సిరికిఁ దోడుగ సీత నీ ♦ చెట్టవట్టి
గొనబుమించు హరాయ ల్గనఁ ♦ గోరి యున్న
సన్న సూపెడుఁ జూడు భా ♦ స్కరుఁడు నేఁడు. ౬౧

క॥ ఏమహనీయుని కరుణా, శ్రీ మహితులు మితము గాని ♦ శ్రేయము గాంచం
గా మదిఁ గోరుదు రా రవి, నీమే లెదఁ గోర నిట్లు ♦ నెగడెదు వత్సా. ౬౨

సీ॥ ముజ్జగమ్ములఁ దిక్కు ♦ మొనరించు తాటకఁ, బూఁట కగల్చిన ♦ ప్రోడతనము
తపసినట్టులు బిట్టు ♦ తఱవు నమ్మారీచు, మారీచుమ్మ లడంచు ♦ మంచితనము
జేజేల గుండియ ♦ ల్చివికించెడు సుబాహు, బాహుదాహ మొనర్చు ♦ బంటుతనము
గాన నుక్కఱి దిక్కు ♦ గానని మునికల్కి, కల్కుమెడల్చిన ♦ కల్కితనముఁ
గన్నులారంగఁ గంటి ము ♦ క్కంటివింటి
పట్టునఁ దలిర్చు నీనాఁటి ♦ పౌరుషంబుఁ
గందు మావారివంక నే ♦ కందు సందు
గలుగ దని మిన్నుముట్టె భా ♦ స్కరుఁడు రామ. ౬౩

ఆతఁడె కర్మసాక్షియె య ♦ నంతమణిస్ఫురణాఢ్యమూర్తియే
యాతనిఁ బోల సాక్షివె య ♦ నంతమణిస్ఫురణాఢ్యమూర్తివే
యీతఱిఁ గాంచెనే యెఱుఁగఁ ♦ డేమును నిజ్జగతీప్రభుత్వముం
సీతవిశేషము న్బ్రథిత ♦ చిత్ప్రవిలాపితభక్తతామసా. ౬౪

సీ॥ సింగారఁపుంగళ ♦ ల్చెలువొందె నిట్లు గా, దేని నీసొగసుండు ♦ నే యటంచు
బీరంపుసిరి మగ ♦ బిరుదందె నిట్లు గా, దేని నీపగ టొప్పు ♦ నే యటంచు
నక్కటికఁపుఁగల్మి ♦ వ్యాపించె నిట్లు గా, దేని నీయస మబ్బు ♦ నే యటంచు
నబ్రఁపుంగారవం ♦ బనువొందె నిట్లు గా, దేని నీహాయి యెచ్చు ♦ నే యటంచు
స్వాంతజన మెన్న విని విస్మి♦తాదిభావ,కలిక లొప్పార నిజహార్ద ♦ కలన లూర
నున్న సీత వరించు మే♦ల్సన్న లరయు, జోక రవి మిన్నుఁబ్రాఁకె ని♦క్ష్వాకుతిలక.

క॥ వందన మొనరింపఁగఁ దఱి, వందారుసురద్రు వీ వి ♦ భావసునకు నీ
ముందుగ నెలయించెడు నా, పొందిక మాబోంట్ల గుఱికిఁ ♦ బొసఁగున కాదే.

తే॥ తెమ్ము నాతండ్రి ; యోల జా ♦ లమ్ము నీవుఁ
దమ్ముకుఱ్ఱయు నగుమోము ♦ దమ్ములు సిరి
కిమ్ములుగ మేలి కాల్యకృ ♦ త్యమ్ము లొఱపు
గ్రిమ్మఁ దీర్పుఁడు వేవేగ ♦ సమ్మదమున. ౬౭

చ॥ అని ముని వల్కుచుండఁగ న ♦ హర్పతితేజులు రామలక్ష్మణుల్
గొనబు గొనంబులు న్వెలయ ♦ గొబ్బున మేల్కని మౌనియంఘ్రిల

న్ననుగనుదమ్ముల న్గొలిచి ♦ నూత్నకళ ల్దళుకొత్తఁ జూపుస
న్నన పులుదీఱి ముత్తైముల ♦ న న్నలువొందిరి మేనకాత్మజా. ౧౯

క॥ ప్రాతస్సంధ్యోపాసన, లాతరణిద్యుతులు దీర్చి ♦ రటు సావిత్రిం
బ్రీతి మెయి జపించిరి ప్ర, ద్యోతనునకు మ్రొక్కి రనుప ♦ మోద్యమ మొప్పన్.

క॥ సమిదాధానం బొనరిం, చి మహీంద్రుని తనయు లమిత ♦ సిద్ధిప్రదముల్
సుమ్మృడీకములు మునిప్రో, క్తములుం బఠియించి రాత ♦ త్ప్రత్యయులై. 20

మ॥ జనకక్ష్మావిభుఁ డంత సంతసము ని ♦ ష్యందంబు లేనవ్వ మో
మున దళ్కొత్తఁగఁ గ్రొత్తపాకమున సం ♦ మోదం బటం జెల్ల వా
రును భావింపఁగ భావనాప్రహిత మా ♦ రూఢంబు గాఢంబుగా
గనుఁ బ్రాతస్సవనాదికావన ముప ♦ క్రాంతక్రమం బేర్పడన్. ౨౧

క॥ తీర్చి కడమ విధు లెల్లం, బేర్చినకుతుకమున నెఱపి ♦ పృథుతేజు సమ
భ్యర్చితు ముని నినవంశ్యులఁ జర్చించెం బిలువ సంప్ర ♦ సాదము పొసఁగన్. ౨౨

మ॥ హితసామంతపురోహితాదు లెలమిన్ ♦ హృద్యస్థితిం గూడి రాఁ
దతగీతిస్తుతిపాఠమంగళకలో ♦ ద్దామక్రమం బొప్ప సం
గతుఁడై మానికి మ్రొక్కి రాకొమరులన్ ♦ గారాముసం గాంచి స
మ్మతి నాస్థానికిఁ జేర్చె మైథిలుఁడు స ♦ న్మానం బనూనంబుగన్. 23

ఉ॥ మంగళవాద్యము ల్మెలఁగ ♦ మాగధశోభనగీతు లొప్పఁ బ
ణ్యాంగన లాడఁ బుణ్యసతు ♦ లాదృతి సేసలు సల్ల సద్ద్విజుల్
పొంగుచుఁ బ్రానుడు ల్నొడువఁ ♦ బొల్పగు మేల్సిరి గూడె నప్డె య
య్యంగజమోహనాంగుఁడు మ ♦ దంచితచాపముఁ జూడ రా న్సఖీ. ౨౪

సీ॥ ప్రాంచదానందుఁడై ♦ పరఁగు శతానందుఁ, డల బృహస్పతిపద ♦ మధిగమింప
జనకు నట్లు ప్రజాళి ♦ మనుచు నాజనకము, హీంద్రుఁ డిం ద్రైశ్వర్య ♦ మెనసి వెలయ
శ్రితకల్పకప్రథా ♦ శ్రితులు సామంతు లా, శాపాలకశ్రీల ♦ శోపి నిలువ
మాన్యతాభూత్యసా ♦ మాన్యులౌ పండితు, ల్విబుధమండలి తోడి ♦ వెరవు సూప
భూతలసుధర్మయై తగు ♦ పుడమిఱేని
మేలిసభఁ జేరి యాత్రియి ♦ మిలితయౌ త్రి
వర్గసంపద చెలువంది ♦ వఱల నిలిపె
నధిపుఁ డర్హాణ లొప్ప న ♦ ర్హాసనముల. ౨౫

క॥ ఘనులు శతానందాదుల, కనుఁ దగు పీఠముల నునిచి ♦ కువలయపతి తా
నును దదనుమతిఁ బవిత్రా, సనమునఁ గూర్చుండె సలువు ♦ జాల్కాన నంతన్.

తే॥ రఘుకిశోరశరీరవి ♦ రాజమాన, భాసముజ్జ్వలమై సభా ♦ భాగభూమి
యొక్కచాయన కనుపట్టె ♦ దిక్కు లెల్లఁ, దెలివితేటల దీప్తులై ♦ తేజరిల్లె. ౭౭

సీ॥ ఆ నగుమోముల ♦ యందము ల్గని నెల, దమ్ముల పగమాన్పఁ ♦ దలఁచువార
లమ్మేటి తేజమ్ము ♦ గ్రమ్ము టారసి భాను, వహ్నుల నొకలెక్క ♦ వ్రాయువార
లమ్మహావిభవమ్ము ♦ లమర నూహించి యిం, ద్రోపేంద్రు లని భక్తి ♦ నోదుఁగువార
లాక్రొత్తసొబగుల ♦ యనువు గైకొని యాశ్వి, నేయుల నెరసుల ♦ నెమకువారు
నగుచు విషయాంతరంబుల ♦ యదను మఱచి
తత్పరత గూర ప్రతిపత్తి ♦ తరము మీఱ
రాకొమారుల మరగి ని ♦ రాకరించు
దృక్కుల మరల్ప సభ్యులు ♦ దెలియరైరి. ౭౮

మ॥ అకలంకం బిది చంద్రమండలయుగం ♦ బౌరా; పవ ద్దోఁచె భ
వ్యకలాపూర్ణము కాంతిపూరితము స ♦ ర్వాహ్లాదకం బంచు వా
రకి తెప్పార్పక కాంచు టొక్కఁడ క్రియా ♦ రంభం బెదం దార్పఁ డం
డొకఁడేని స్జనకక్ష్మాపిభుమతం ♦ బూహించెదే భావినీ. ౭౯

తే॥ చిత్తరువునందు వ్రాసిన ♦ చెలువు చెలయ
స్పంద మేనియుఁగనరాక ♦ సభ్యులుండ
కువలయేశుండు హర్షాను ♦ గుణ్యఫణితి
నమ్మహాముని తోడ నిట్లనియెఁ ♦ బడఁతి ౮౦

ఆ॥ స్వాగతంబు మౌని ♦ శార్దూల; యింకేది
యాజ్ఞ సేయుదో మ ♦ హాత్మ; యెలమి
భగవదీయ యదియె ♦ భవదీయ యౌ దాని
గాని మెలంగువాఁడఁ ♦ గోర్కి మెఱయ. ౮౧

తే॥ అనుచు దమృతంబుఁ జిలికిన ♦ యట్లు గులుకు
పలుకుబడిఁ గూర్చు నాతేని ♦ ప్రతిభ కలరి
కుశికతనయుండు హర్షాను ♦ కూలకలనఁ
బలికె నిట్లగు గంభీర ♦ భాషణముల. ౮౨

మ॥ జనకక్ష్మాపతి మీధనుస్సమయ మీ ♦ జ్యా మేల్కొన న్నాటఁగో
లె నసాధారణులౌ నృపాత్మజులు బా ♦ ళిం గూరి యాత్మీయము
ల్పనిపాట ల్నెడ రిత్తవోవుటయ చూ ♦ పట్టెం గదా నేఁటికో
క్క నిమేషం బటు గూర్పఁ బంపు మది చ ♦ క్కంగాంచు మారాముఁడున్. ౮౩

క॥ ముక్కంటిధనువె కద యా, దిక్కనసిన ప్రతిన తీర్పు ♦ తెల్లమె కద మీ
చక్కటిధృతి యెక్కుఁడె కద, యిక్కమలదలాక్షుఁ డరయు♦నిన్నియు నెడఁదన్.

చ॥ అన దరహాసచంద్రిక హసిం ♦ య మ్తగ రాముని మోము చంద్రభా
వన నె ధృఢీకరించె సభ ♦ వారికిఁ బొల్పడఁ దెల్పి మైథిలుం
డను విడె యంచుఁ బెల్లరుస ♦ మల్గులఁ బొఱఁ దెమల్చుకొంచు ని
ట్లనెఁ దనమంత్రులం గని మ ♦ హావిభవం బలరార న త్తఱిన్. ౮౪

తే॥ కలిగెఁ బండువు మనకు ని ♦ క్కాలమునకుఁ
జాలఁ డెంతకు నివ్వాని ♦ జాల మేల
ధనువు దెప్పింపుఁ డింక య ♦ త్నము దనర్ప
నవల నీశుని కృప గల ♦ దన్నిటికిని. ౮౫

క॥ అని జనకనృపతి సమ్మద, మనువొందఁగఁ బలుక సచివు ♦ లబ్బుర మొదవన్
విని కౌతూహల ముల్లముఁ, బెనఁగొన నిట్లనిరి కూర్మి ♦ పేర్మి తలిర్పన్. ౮౬

క॥ నాయక ; నీయభిమత మా, నా; యకలంకేతరంబు ♦ నాయమె కద యా
సాయకపద మీసుమన, స్సాయకనిభుఁ డరసి కొనుట ♦ సమయోనుకృతిన్.

చ॥ అని పలువేవురం దగు మ ♦ హాబలశౌర్యుల యోధవర్యులం
బనిచిన వారు వేడ్కమెయి ♦ బాహుసపారత మీఱఁ బూని యే
యనఃవ్రననో వహించి బలు ♦ వానఁగ నల్లన నాసభాంగణ
మ్మున మొనయంగఁ జేర్చి రట ♦ మోసము వాసె ధరాధరాత్మజా. ౮౯

సీ॥ తపనీయధరమన్న ♦ ధర్మంబ యగుఁ గాదె, జ్యాలింగనేచ్ఛకుఁ ♦ బాలుపడుట
రజతశైలమటన్న ♦ నిజపదం బగుఁ గాదె, వైశద్యవిస్ఫూర్తి ♦ వఱలుచుంట
శేషాహి యన శ్రీవి ♦ శేషంబ యగుఁ గాదె, మణికింకిణీశబ్ద ♦ మహిమ గనుట
సాగరం బనిన ని ♦ షంగాత్త మగుఁ గాదె, శరధిపదార్థసం ♦ సక్తి గొనుటఁ
గాన శైవార్థతాయోగ ♦ గరిమ దీని, కొదవె నంచు సభాస్తారు ♦ లోలి నొడువ
లాఁతివారలు భయవిహ్వ♦లత్వ మొందఁ, బొసఁగె నమ్మేటిధను వట్లు♦బిసరుహాక్షి.

క॥ ఏనాఁటి కేని నెది యే, వాని ధనం బగునొ యదియు ♦ వానికె దక్కన్
మానితు లెవ రెటు పోరలిన, మానితగుణజాల యింత ♦ మానదు సుమ్మా.

క॥ ఆతని సాధన మేఁగొన, నాతఁడు మత్సాధనంబు ♦ నందఁ బొసఁగు నె
ట్లో తలిరుఁబోఁడి యొడ్లకు, బ్రాఁతి యనం గాక యుండుఁ ♦ బరు వెటు దక్కన్.

తే॥ అంత నొక్కింత యనరాని ♦ వింత ప్రోడి
సంతసం బెల్లరకుఁ దమ ♦ మంతనముల
మల్లడిగొనంగ నయి పయి ♦ వెల్లివిరియ
నొల్లఁబోవుచుఁ బోవక ♦ యొదుఁగుచుండ. ౯౩

సీ॥ చాల్పు వెడ లొప్పి ♦ జానకీసుఖజని, స్థానమై పుడమినాఁ ♦ దనరుదాని
శరవీచికలు మించ ♦ జగదండకలితమై, జలమూర్తి విస్ఫూర్తి ♦ వెలయుదానిఁ
బ్రణిహితరూపమై ♦ పటువీరవిఖ్యాతి, హేతువై తేజస్స్వ ♦ మెనయుదాని
స్పర్శగమ్యంబై య ♦ శక్యాప్తిమై మహో, బలసారసంపత్తి ♦ నలరుదాని
శబ్దలక్షితంబు ♦ సత్కలాకీర్ణంబు, నగుచు గగనలక్ష్మి ♦ నమరుదానిఁ
గనెఁ బ్రపంచ మల్లె ♦ కార్ముకోత్తమము శ్రీ, రాముఁ డొప్పతింప ♦ రాలలామ.

క॥ అట్టిదె సమయం బనఁగా, నట్టిరు విక్రమధను ల్మ ♦ హామహు లెందున్
గట్టియ నిపించుకొన కు, న్నట్టులె యుందురె ప్రభావ ♦ మాఱడిపోవన్. ౯౫

చ॥ కనుఁగవఁ బిన్ననవ్వు దొనఁ ♦ క రఘురాముఁడు కార్ముకంబువం
కన తనివోక నూల్కొని వి ♦ కస్వరమై తగు తమ్ముకుఱ్ఱచూ
డ్కి ని నునుజూపు లాఁగ నెటే ♦ గీల్కొనఁ గన్గొని తోన సిగ్గు మొ
గ్గును గరువంబుఁ దోఁప నొక ♦ క్రొత్తయొయారము దెల్పె నంగనా. ౯౬

తే॥ ఆయొయారము గనుఁగొన ♦ వేయుఁగనులు
హాయిరే యని యూఁపంగ ♦ వేయుఁదలలు
బాయకున్నఁ గదా యెడఁ ♦ బాయకున్న
కాయజానందపూర మో ♦ కాయజకల. ౯౭

క॥ ఆయూరు క్రొత్త దానికి, నాయధిపుఁడుఁ గ్రొత్త యతని ♦ కంతిపురియు న
ట్లే యయ్యెఁ గ్రొత్త యామెడ, నాయానందాబ్ధి పొంగి ♦ యటు నిటుఁ జేయన్.

సీ॥ నవనీతగోళ మిా♦నవమోహనాంగు లే, యొడలు వేఁడెఁ గరంగు♦నో; యటంచు
నమృతంబుబుగ్గ యి♦య్యకలంకమూర్తి నె, మ్మోము కం దెనయునే♦మో యటంచు

విరిపూవుదండ లీ ♦ విశ్వాతిశాయి బా, హువు లింక పసివాఁడు ♦ నో యటంచుఁ
గమలంపు రేకు లీ ♦ కారుణ్యపాథోధి, నునుగను ల్వాడఁ జొక్కు ♦ నో యటంచుఁ
రఘుకిశోరము సౌకుమా ♦ ర్యమునఁ జెలఁగు
చెలువ మీక్షించి సీత మే ♦ ల్మిరుల నెంచి
వింటిచేవఁ దలంచి య ♦ వ్వీటిప్రజలు
మించు జనకుప్రతిన సీస ♦ డించి రపుడు. ౯౯

మ॥ తలఁపుం దీవియ లల్లిబిల్లిగొనుటం ♦ దర్శించు విల్గాంచు ని
ర్మలభావంబున మించు రాట్సుతుల గా ♦ రామొప్ప వీక్షించు శ్రీ
నెలయు న్నేఁడని సంతసించు నిఁక నే ♦ విశ్వాతిశాయిత్వముం
గలవాఁడం గద యంచు నెంచు జనక ♦ క్ష్మానాయకుం డత్తఱిన్. ౧౦౦

ఆ॥ ఐదువేలసంఖ్య ♦ కగు సుభటులు మోచి, తెచ్చినట్టి వింటి ♦ తీ రరసియుఁ
దఱిసి రామదేవ ♦ తత్త్వరహస్యప, వేదరసికుఁ డనఁగ ♦ వెలయువాఁడు. ౧౦౧

ఉ॥ కౌశికుఁ డంత మైథిలునిఁ ♦ గన్గొని పల్కె ధనుఃప్రసక్తి ని
ర్దేశ మొనర్పు మెల్లరకుఁ ♦ బెల్లము గాఁగ నృపాలవర్య; యా
దేశము చొప్పున న్మెలఁగుఁ ♦ దీరుగ నీరఘుసింహశాబకం
బాశలఁ గీర్తి నింప మది ♦ నాశ వహించి చరించుఁ గావునన్॥ ౧౦౨

సీ॥ తమ నఖశరపాలి ♦ దనుజమత్తగజౌఘ, విదళనోత్సవముల ♦ విఱ్ఱవీఁడఁ
దమ క్ష్వేళల ప్రసక్తి ♦ దర్పవద్రిపుమార్గ, దీనస్వరవిముక్తి ♦ కాన యిడఁగఁ
దమ లఘుప్లుతిలీల ♦ తతవేగభటసత్త్వ, కలితోర్ధ్వదృష్టుల ♦ గాసివఱుపఁ
దమ రాజపదరూఢి ♦ తామ్యన్నప్రతిజంతు, పాలనవ్యాపృతి ♦ ప్రథ వహింప
వఱలు రఘుసింహములు దిశా ♦ వలయు మెల్ల
విక్రమక్రమసంపత్తి ♦ నాక్రమించి
మించు ప్రఖ్యాతి జగతి గా ♦ ణించు రహి స్వ
భావసిద్ధము సుమ్ము క్ష్మా ♦ పాలతిలక. ౧౦౩

క॥ తామసము వలదు తెలుపుము, నీమదిఁ గల కామితంబు ♦ నెఱిఁ బ్రాజ్ఞులు తా
రేమెయి శుభకృత్యమునకు, జామి తగ దనంగ వినమె ♦ సన్నుతచరితా. ౧౦౪

ఆ॥ నీదు ప్రతిన తెలఁగు ♦ నిష్ఠితంబు ప్రసక్తి
యును నొకింతయేని ♦ యునుఁ దలంగ
నీక యెల్లవార ♦ లేఁకటమై విన
నెఱుక సేయుటయు న ♦ నీదృశంబ. ౧౦౫

క॥ ఆదట రాకొమరులు తమ, పాదుకొనిన పౌరుషంబు ♦ ప్రతిభయు నెఱపన్
నేదిష్ఠం బగుఁ గృతిఫల, మాదివ్యులు నరులు మెత్తు ♦ రఱమర లెడలున్. ౧౦౬

క॥ అనినం దన యానతికిం, దనుజారియు వెఱచు ననఁగఁ ♦ దప్పఁ దలఁప నె
వ్వని తరము మునివతంసము, వినిచెద వినుఁ డింక వినుచు ♦ వేడుక పొసఁగన్.

సీ॥ మున్ను దక్షాధ్వర ♦ మ్ము నడంప రుద్రుండు, ధనువు సారించి యు ♦ ద్ధతిదొలంక
నమరుల తోడ ని ♦ ట్లనియె మద్భాగమ్ము, హరియింప నెంచితి ♦ రాకతమునఁ
జెక్కెద మీ మేను ♦ లుక్కఱ శాతశ, రాసారమున నున్న ♦ యాన లెడల
ననుడు భీతాత్ములై ♦ యందఱు దేవేశ, శరణంచు వేఁడి ప్ర ♦ సన్నుఁ జేయ
వారి కభయ మొసఁగి ♦ వరదుఁ డిష్వాసంబు
నిమికి షష్ఠుఁ డగుచు ♦ నెగడు గనిన
దేవరాతుఁ డను వి ♦ దేహరాజన్యున
కిచ్చె న్యాసయుక్తి ♦ యొసక మొసఁగ. ౧౦౮

క॥ అంచితులది మొదలుగఁ బూ, జించి వెలసి రిక్కొలమ్ము ♦ క్షితినాథులు సే
వించితి నేను నభవు భా, వించుచు నీనాఁటివఱకు ♦ విధియుక్తముగన్. ౧౦౯

క॥ ఇమ్మేటిక్రతు వొనర్పఁగ, నెమ్మది దలపెట్టి క్షేత్ర ♦ నిశోధనమున్
సమ్మతిమై నొనరించితి, సమ్ముఖమై నాదు పుణ్య ♦ చయ మొప్పారన్. ౧౧౦

ఆ॥ దున్నుచుండ సీతఁ ♦ దోఁచిన యిక్కన్నె, సీత యనెడు పేరు ♦ సేర్చి పెనిచి
నాడ భూమిజాత ♦ ననుచు ప్రేముడి నౌర, సాతిశాయిలక్ష్య ♦ మలరుచుండ.

తే॥ వీర్యశుల్క యటంచు నే ♦ వెరవు మెఱయ
పావని పరిగ్రహముఁ ♦ గూర్చి పలికినాడ
నీయయోనిజఁ గొన నెంచు ♦ నెవఁ డతనికి
హరశరాసన మెక్కిడు ♦ టవసరముగ. ౧౧౨

క॥ ధను వెత్తన చాల కకిం, చను లైరి సురాసురు ల్ప్ర ♦ సక్తిఁ దఱియనై
ఘను లుర్వీపతులుఁ బలువురు, చని రురక నిరస్తులై వి ♦ చారము దొనఁకన్.

తే॥ క్రమ్మి రాదటఁ బ్రబలరో ♦ షమ్ము కతన
నొక్కఁడై యెల్లవారలు ♦ నుక్కు మీఱ
మిథిల శిథిల నొనర్పు మె ♦ మ్మొయిని వీని
సంగరము సెల్లునో యంచుఁ ♦ జక్కనగుచు. ౧౧౪

ఆ॥ ఒక్క యేడు గోరి ♦ రుర్విం దుగ్ర లోర్వమి
దమ్ము ముంపఁ గడఁగఁ ♦ దలఁగ కటిమి
సర్వసాధనములు ♦ సమసె మదీయంబు
లేను దుఃఖితత్వ ♦ మెనయఁ గాంచి. ౧౧౫

చ॥ తపమున నెల్లవేల్పులఁ బ ♦ దంపడి వేఁడితి సుప్రసన్నులై
యపరిమితంబు సంద్రృఢము ♦ నౌ చతురంగబలంబు గూర్చి న
న్నృపఁ బ్రబలుం బొనర్చి రటఁ ♦ గీడ్పడి యమ్మెయి పాపభూపతుల్
వ్యపగతులైరి దుర్ధర మి ♦ హార్థ మటంచు విరక్తిఁ బెంచుచున్.౧౧౬

తే॥ యక్షరక్షోగణేశు ల ♦ ట్లలమి యెంద
ఱెట్టులేనియు ధనువుపై ♦ నిట్టలంబు
పౌరుషము సూపి రని కాని ♦ భద్ర మెనయఁ
బోరు రోపణతోలన ♦ పూరణముల. ౧౧౭

క॥ మనుజు లిటఁ జక్కఁగన రా, రెనయురు పరు లిట్టిదైన ♦ యీయుత్కటమున నే
ననుగతము ధర్మ మర్థం, బన చెస నెటు బెసుకనీని ♦ బుద్ధి మెలఁగుచున్. ౧౧౮

ఉ॥ నాఁడ పొనర్చినాడ ముని ♦ నాయక; యీసమయంబు దిక్కులం
బాడినపాట యయ్యెఁ గద ♦ పాల్పడె నేఁటికి మంచిమాట యే
వాడుక లెంచ నేల రఘు ♦ వల్లభుఁ డీశివకార్ముకంబునన్
గూడిన యల్లెత్రా డపర ♦ కోటిఁ దవిల్చి ధరాజఁ గైకొనున్. ౧౧౯

క॥ నామే లిటు లేఁజది వెడు, నేమము దారసిలెఁ బూర్వ ♦ నియతి కతన నిం
కేమందు నెల్లశుభములు, నామెత లానదింప మీర ♦ నై యుండంగన్. ౧౨౦

క॥ ఆనతి మై నెఱిఁగించితిఁ, బూనిక యిది యిట్టి దనుచు ♦ బోధఘనుల రి
క్లా నెఱి గని యోజింపుఁడు, భూనాయకు వంగడంబు ♦ పోలు పెట్టిదోకో.

—♦ విశ్వామిత్రుండు శ్రీరాముని హరశరాసనంబు గొనం బురికొల్పుట ♦—

చ॥ అని నరదేవమౌళి యన ♦ నాంతరమై తగు సంతసంబు పైఁ
దోనఁకె నసం దరస్మితము ♦ తోరఁపుసృక్వలఁ దొంగలింప న
మ్మునికులసార్వభౌముఁ డటు ♦ ముచ్చట మీఱఁగ రాము మోము గ
న్గొని నెఱజాణలక్షణము ♦ నూత్నవికాసముఁ దోఁప నిట్లనున్. ౧౨౨

చ॥ సుర లసురు ల్భరం బనుచు ♦ స్రుక్కఁగఁ గన్గొని యొక్క కేల మం
దరగిరి నెత్తి యంబునిధిఁ ♦ దార్చియుఁ దేల్చియుఁ ద్రచ్చియు న్విజి
త్వరరమఁ బొల్చి కల్మిచెలిఁ దత్పరతం గొని కీర్తి గన్న యా
హరిఁ దలఁపింపు మయ్య; తటి ♦ యయ్యెను సీతఁ బరిగ్రహింపఁగన్. ౧౨౩

క॥ అనునెడ నుల్లాసమునం, దనరుచు విల్లెనయఁ జూచు ♦ దాశరథి మన
మ్మున తత్త్వ మరసి తేనిన్, దన వంకకుఁ దార్చి మౌని ♦ తద్దయు వేడ్కన్.

క॥ కని రాము కేలు దన కే, ల్కొనఁ గీల్కొనఁ జేసి తోడు ♦ కొని యెల్లరఁ గ
న్గొని యిటు లనె మునిశశి నె, మ్మన మానందామృతాబ్ధి ♦ మగ్నతఁ బొదలన్.

ఉ॥ ఏమఱపాటులేక క్షణ ♦ మేయెడఁ జూడక కాంచుఁ డింక మా
రాముఁ డుమేశు చాప మిదె ♦ రాణ నెఱుంగొన నున్నవాఁడు మీ
కీమహనీయకృత్యమున ♦ నింతలు దాల్మి వహింతు రేనిఁ దా
నేమగునో, యెఱుంగ నగు ♦ నీధను విట్లని యేల చెప్పఁగన్. ౧౨౬

క॥ అని యనవరతాభ్యుదయము, దన కూర్చిన యదియ కాఁగఁ ♦ దపసినెల సభా
జనము సభాజనమున కి, ట్లన నోంస్వస్తి యని పలికి ♦ రందఱు నొకటన్. ౧౨౭

ఉ॥ రామునిఁ బ్రేముడి న్మదికి ♦ రా ముని కౌఁగిట నుంచి మించు గా
రామున బుజ్జగించి రఘు ♦ రామున కీపొదు వొప్పు నయ్య; నీ
రామున నీవె కైకొనఁగ రా ♦ మనసార నటంటి మయ్య లే
రా, మును తేండ్లు ని న్పొగడ ♦ రా మును లంచు రసోక్తు లాడుచున్. ౧౨౮

క॥ పురికొలిపి మురిసి బిడియఁపు, నెరి చక్కఁగఁ దీర్చి కృత్య ♦ నిర్ణయ మిటుదా
సరగఁ బొనరించి రాముని, వెరవరిఁ గావించె ముని వి ♦ వేకం బనదే. ౧౨౯

ఉ॥ ఒక్కెడఁ గన్నవార లటు ♦ లుండ సుర ల్మును లిట్టిమే లెటో
నెక్కొను నంచుఁ దాలిమి వి ♦ నేయత నిచ్చలుఁ గొల్చుచుండ నో
చక్కఁబొమ్మ; యాచనవు ♦ సంయమివర్యుఁడు గాధిసూనుఁడే
దక్కఁగొనె న్గదే యతని ♦ దైవఁపుఁ గల్మి గణింప శక్యమే. ౧౩౦

— ♦ శ్రీరాముఁడు శివుని ధను నెత్తుట ♦ —

మ॥ మొలదట్టీ బిగియించి కొండిసిగ నె ♦ మ్ముద్దారఁ గాఁ గట్టి యి
మ్ముల సొమ్ము ల్సవరించి మేలికవచ ♦ మ్ము న్శీర్షకమ్ము న్దగన్
బలుసింగారము బీర మొక్కఁడుగఁ జూ ♦ పట్టన్నెఱిం గాంచి పె
ద్దలఁ గన్నన్నన గారవించి పృథుసం ♦ ధాతృత్వ మొప్పారఁగన్. ౧౩౧

సీ॥ తన వారి విచికిత్స ♦ వెనుకంజ యిడఁ గొన్నిఁ,యడుగు లేర్పడముందుఁ♦దొడరినడిచి
తన త్రివిక్రమలీల ♦ గనుపట్ట నమ్మూర్తి, చుట్టు మునమ్రాలు దాఁ ♦ జుట్టి వచ్చి
తన ధర్మనిష్ఠతా ♦ త్పర్యంబు పొసఁగ నా, ఘనసాధనమునకు ♦ వినతి గూర్చి
తనకు నాతను భేద ♦ మనరామి యనువొంద,స్వీయార్థముగఁ జెంతఁ♦ జేరి నిమిరి
తనదు కీర్తిలోఁ గనుఁగొను ♦ ధన్యు లివియ
మేటి తేజం బనుచు చాట ♦ సూటి మెలఁగఁ
దగిన పట్టునఁ బట్టె నె ♦ త్తమ్మిఁ బోలెఁ
దాల్చెఁ గెంగేల ధనువు శ్రీ ♦ ధరుఁడు నగజ. ౧౩౨

క॥ అప్పటి కప్పుడె మోములు, విప్పారెడు తమ్ము లయ్యె ♦ వివిధోత్సవముల్
చొప్పనయ సాగె గుసగుస, లొప్పెం బురి నంతిపురిని ♦ హాయి లెక్కడుగన్.

ఉ॥ అంతకు రెట్టి యయ్యె ధృతి ♦ యాదట నద్రి తృణంబ యయ్యె వి
భ్రాంతి గనె న్నృపాలసభ ♦ పాల్పడె భీతి కరాతికోటి ప
ర్యంతవిభుత్వ మంది రతి ♦ రా జటు తాఁ దటి వేచి యుండె శ్రీ
మంతుఁడు పూన్పుచెత్తు గతి ♦ మామకచాపము దాల్చునంతటన్. ౧౩౪

క॥ సిరి మించు మత్తకరి నిజ, కరమునఁ బెకలింప నొదుఁగు ♦ కమలిని గతి కా
కర మయ్యె ధనుర్లత రఘు, వరు కరమున నిమిడి వికచ ♦ వనజదళాక్షీ. ౧౩౫

ఉ॥ కౌతుకిత న్సుర ల్మునులు ♦ గాధిజసూత్రిత మీపబ్రంధ మ
ట్లాతతిఁ గాంచుచున్ దివము ♦ నందు నిలంబడి రాము చేష్టితం
బూఁతగఁ గొంచు సాత్వికఁపు ♦ టుయ్యెల లూఁగుచు సంతసంబునం
బూత మనంగ నొక్కఁ డిదె ♦ పో ; తగు నంచు నుతించి రొక్కటన్. ౧౩౬

చ॥ మునిహృదయంబున న్ముదము ♦ ముబ్బడి యయ్యె నటన్న సభ్యుల
న్మొనసెను దాని కిబ్బడిగ ♦ మొల్లముగా ధరణీంద్రు నొందె న
ట్లనఁగి పెనంగె నన్నగరి ♦ నంతిపురి న్మఱి రెట్టి రెట్టి భూ
తనయను సర్వ మొక్కఁడుగఁ ♦ దార్కొనె వింతె కుటుంబినీమణీ. ౧౩౭

తే॥ మున్నె చింత యొకింతయు ♦ మొనయ దబ్బ
మిపుడుఁ దోఁపదు స్మితలక్ష్మి ♦ యిపుడు నపుడు
మోముదమ్మి మెలంగెడు ♦ రాము మహిమ
లక్ష్మణుఁ డెఱుంగు రామ ; కల్యాణసీమ ;. ౧౩౮

క॥ జ్యావల్లిక చిక్కెడలఁగ, తేవన్ సారించి కొని క ♦ డిందిమగఁటిమిన్
గావించె ధనుఃకోటి, శ్రీవిలసితగా జితారి ♦ చెలఁగుచు గారీ. ౧౩౯

క॥ కాఁగల కర్జం బింతకుఁ, గాఁ గలిగె న్గలఁక మానఁ ♦ గాఁ గలిమికి మే
ల్గాఁగల దైనను వేడుక, యూఁగుసె యాగరిమ కట స ♦ దాగమవినుతా. ౧౭౦

శా॥ ఓంకారాఖ్యమహాగుహాంతరవిహా ♦ రోల్లాసి దివ్యద్గుణా
లంకారుం డకలంకమూర్తి వృతలీ ♦ లామానుషస్ఫూర్తి ని
శ్శంకాతంకుఁడు రాముఁ డుచితపద ♦ స్థానస్థితిం దద్ధను
ష్టంకారం బొనరించె సర్వజగదా ♦ శ్చర్యం బవార్యంబుగన్. ౧౭౧

సీ॥ సారించి యుంచిన ♦ నారదాదుల మేలి, వీణియ ల్సంగీత ♦ విధుల నడువ
సురదుందుభులు కోణ♦నిరపేక్షముగ హృద్య, వాద్యతానక్రియ♦ల్వాలఁ జేయ
రమణీయకృతి నచ్చ ♦ రలు గూర్చు రూపక. ప్రస్థానసామగ్రి ♦ పరిఢవిల్ల
దిశ్యదంతావలో ♦ దీర్ణస్వకర్ణతా, లాకీర్ణశబ్దంబు ♦ లనువుపడఁగ
నందనవనంబునం గల ♦ నవఁ జిదుము, దలఁచు జేజేల కెంకల ♦ తావ మెడల
నున్న విరు లెల్ల నొక్కట ♦ నురల మ్రోసె, జ్యాలతిక రామకరతలా♦స్ఫాలనమున.

శా॥ శ్రీకాముండు నికామభక్తగణస ♦ చ్చింతామణిస్ఫూర్తి లో
కైకత్రాణుఁడు రాముఁ డుల్లసిత మౌ ♦ య్యారంబు గూరం దిరిలో
కీకల్యాణపరంపర ల్నిజమహోహా ♦ తీక్ష్ణస్థితి స్మిఱఁ దా
నాకర్ణాంతము మార్వి పర్వ ధనువ ♦ ట్టాకృష్టముంజేసినన్. ౧౭౩

—♦ రఘురాముని యాకర్షణంబున హరుకార్ముకంబు భగ్నంబగుట ♦—

లయగ్రాహి॥
దిక్కు సెడి రక్కసులు, మొక్కపడి రావణుని
చక్కి నిది యేమొ యని, యక్కజము గూరన్
మొక్కలఁపుఁ జెయ్వులకుఁ, దక్కి మది స్రుక్కి సుర
లెక్కి ధృతి మాకనుచు, నిక్కి వినువీథిం
జక్కనిలఁ గార్యగతి, చక్కఁబడు నంచు మును
లెక్కుడు స్మయం బొలయ, నెక్కొనుసుఖాప్తిం
జొక్క గిరికందరలఁ, గ్రిక్కిఱిసి యక్కడలఁ
బిక్కటిలి పెల్లనుచు, నొక్కధ్వని పుట్టెన్. ౧౭౪

ఆ॥ పిడుగు లురలె ననఁగఁ ♦ బృథ్వీధరేంద్రజుల, బ్రద్దలయ్యె ననఁగ ♦ బ్రబలు దాన
భూమికంప మొదవెఁ♦బొల్లువోనై రెల్లఁ,రినుఁ డినాన్వయులును♦ మునియుఁ దక్క.

ఆ॥ అదియ సురకదంబ ♦ కాగమార్గం బయ్యె, నపగమార్గ మయ్యె♦ నసురతతికిఁ
గాన విధివిశేష ♦ కలితఘంటానాద, మనఁగ నొప్పె వికసి ♦ తాబ్జవదన. ౧౭౫

శా॥ బగ్నం బయ్యెనుఁ గార్ముకం బపుడె చే ♦ వం బాసి రాట్సంసదు
ద్విగ్నత్వస్థితితో విదేహపతిసం ♦ దేహంబుతో భూసుతా
లగ్నోల్లాసవిపత్తితో దనుజలీ ♦ లాస్ఫూర్తితో బంధని
ర్మగ్నామర్త్యసతీవితీర్థదశతో మానింపనై యొక్కటన్. ౧౪౭

క॥ వినుతశ్రీ వెలయు ధను, ర్ఘనరేఖఁ ద్రాఁచంగి జనకు ♦ రహి రాణింపన్
మునిశారదసమయస్థితి, జనరంజన మెసఁగ రామ ♦ చంద్రుం డొప్పెన్. ౧౪౮

మ॥ పులక ల్మేనఁ దలిర్చెఁ గౌశికునకుం ♦ బొల్పారెఁ గ్లేదంబు రా
జులకు న్బాష్ప మెలర్చె శూరతతికిం ♦ జూపట్టెఁ జో క్కా-బుధా
వళికిం గల్గె విపక్షభూభృదచల ♦ త్వం బిట్లు నేకూరె స
త్త్వాలసన్మూర్తి ప్రసక్తి నెల్లరకుఁ ద ♦ త్తత్సాత్త్వికశ్రీ సతీ. ౧౪౯

—♦ దేవతలు పుష్పవృష్టి నెలకొల్పుట ♦—

శా॥ మున్నే తెల్పితిఁ గొంత తద్వివృతికి ♦ న్మోదప్లుతిన్ జాల మ
య్యె న్నాకేశుని యానతి న్దివిజు లా ♦ యీచోట్లు నా రాక సం
పన్నత్వంబునకు న్సరాసరిగఁ బా ♦ ష్పంబై సుధాయోగతః
క్లిన్నం బౌ జడి గొల్పి రమ్మిథిలపైఁ ♦ గేళీపరత్వంబునన్. ౧౫౦

సీ॥ మేళవించిన వీణ ♦ మెయి వొంగ నది శొంగి, మహతిగా నంససీ ♦ మనుఘటించి
మునుకొన్న తన సుఖ ♦ మూర్ఛనలకు స్వర, మూర్ఛనల్తగ వాని♦మురిపమెంచి
రహి శౌరి వలగొను ♦ రాగలక్ష్మికిఁ దోడు, రాగరసాబ్ధిసా ♦ రము గ్రహించి
ముంగాలి చిఱుగజ్జె ♦ లం గేలితాలంబు, లం దాలమానంబు ♦ లందఁ గాంచి
కనుఁగొనల సమ్మదాశ్రువు ♦ ల్గ్రిమ్మ దేఱ
మొనయు రామకథాఽమృత ♦ మున నె స్వీయ
గేయబంధంబు గూర్చి సం ♦ గీతకేళి
సలిపెఁ గలహాశనుండు ని ♦ ర్జరులు పొగడ. ౧౫౧

సీ॥ నహిభయం జహిరయం ♦ నాకనాయక; తిష్ఠ,సానంద మానంద ♦యస్వమనుచు
రఘుసింహశిశునా ని ♦ రస్తాని భవథ భో, రక్షాంసి రక్షావి ♦ లక్ష మనుచు
అస్తిదాశరథిర్ద ♦ యాశరథిర్వ్యాథ, శరధిర్ధృతాశర ♦ శ్శరణమనుచు
సేయం వృణోతి స♦ర్వేశ్వరీ శ్రీ రముం,మహితో మహా న్మహో♦త్సాకమనుచు
స్వర్గ; విజయస్వ రచయ రం ♦ జన మటంచు
మ్రోసె వినువీథి నిరపాయ ♦ ముగ సురేంద్ర.

మానసోల్లాసకలనాను ♦ మాపకములు
దేవదుందుభు లత్తఱి ♦ దివిజవినుత. ౧౫౨

శా॥ వేయుంగన్నుల బాష్పము ల్దొరఁగ ని ♦ ర్వేలప్రహర్షప్లుతిన్
హాయిం గాంచి బలారి నేఁటి కిపు డా ♦ హా యబ్బె సానందల
క్ష్మీయోగం బిటు లంచుఁ గౌశికునకుం ♦ గేల్మోడ్చి నిత్యోదయా
మాయామానుషవేషధారి రఘురా ♦ మా; యంచుఁ గీర్తింపుచున్. ౧౫౩

ఆ॥ ఇంక నోదిఁగి యుండ ♦ నేల యం చనినట్లు
సురలు మునులుఁ దన్నుఁ ♦ జుట్టి కొలువ
రాణఁ జదల నిలిచి ♦ రాముని పోఁడుము
లనులపండువుగనుఁ ♦ గాంచుచుండె. ౧౫౪

ఉ॥ ఉత్తరు విచ్చు నంతపని ♦ యొక్కఁడు నేఁటికిఁ గల్గె నింక మా
క్షోత్రవిలాసము ల్గనుఁడు ♦ కూరిమి మీఱ నటంచు నచ్చర
ల్మాత్రములై స్ఫురద్భువన ♦ మోహనన్రుత్తవిశేషమాధురి
న్మత్తిలఁ జేసి రవ్విబుధ ♦ మండలి నత్తఱి నుత్తమామణీ. ౧౫౫

శా॥ సింగారంబున కాటపట్టు సిరికిం ♦ జేయూఁత దీనాళికిన్
బంగారంపు నిధాన మాశ్రితగృహ ♦ ప్రాంచన్మహాకల్పకం
బంగిత్వోచిత నీతివిద్య యగు మా ♦ యారాము విస్ఫూర్తి నే
నుం గంజాసనుఁడుం గనం గనులు ము ♦ న్నోమె న్మనీషావతీ. ౧౫౬

క॥ అత్యయ మెడలఁగ నెల్లరుఁ, బ్రత్యాశ్వస్తు లయి విగత ♦ భయు లయి యుదిత
ప్రత్యయు లయి రఘునాథా, పత్యం బిది యల్ల లక్ష్మి ♦ పతి మూర్తియనన్.

—♦ విశ్వామిత్రుండు రామునిఁ గౌఁగిటం బొదివి బహూకరించుట ♦—

క॥ ముని కౌఁగిటఁ గ్రుచ్చిన జన, ఘన కెడ పడె ననఁగఁ నోరులు ♦ గొసరఁగ నేమా
మునుపటి ముదమె శతానం, దునకుం దలమునుక లయ్యె ♦ దోయజనేత్రా.

తే॥ ఏమి చెప్పుదుఁ గాంతాల ♦ లామ; యింక
గాధితనయుని సందిటఁ ♦ గందువాఱు
నేమొకో ముద్దులల్లుని ♦ గోమెసంగు
మే ననుచు మామ గ్రుక్కిళ్లు ♦ మ్రింగుచుండె. ౧౫౯

ఉ॥ కౌఁగిట నుండె బిడ్డఁ డని ♦ కల్గదొ తెల్వి సుఖానుభూతిమై
నాగరలక్షణంబు గహ ♦ నస్థితికిం దగు మార్పు నొందెనో;

యో గజగామినీమణిరో ; ♦ యున్నటు లుండెనుఁ గొంతవట్టు దా
యోగివరేణ్యుఁ డాత్మసుకృ ♦ తోజ్జ్వలసత్పరిపాకసంగతిన్. ౧౬౦

ఉ॥ అంతట నత్తపోధనుఁ డ ♦ హా ; యిరహోయిర తాటకాంతకున్
సంతస మొప్పఁ గాంచుటయ ♦ చాలదె యింకఁ దపంబు లేల యం
చాంతరతృప్తికిం దగిన ♦ యట్లుగ నాడుచు రాము మోమున
న్వింతగ మోము సేర్చి తన ♦ విశ్రుతభావము దోఁప నిట్లనున్. ౧౬౧

చ॥ అరులునఁ బెచ్చువత్సరము ♦ లచ్చఁపుకోములు నోమి కన్నవా
రరుసము గాంచుచుండు తఱి ♦ నడ్డము సొచ్చి తెరల్చి తెచ్చి తెం
పరినయి చెట్టరక్కసుల ♦ పైఁ బడఁ దోలితి నన్ను దూఱు నీ
వెరవున మాసె నాకిపుడు ♦ విశ్వజనీనచరిత్ర ; రాఘవా. ౧౬౨

తే॥ కలుగుఁ జిన్నారిపొన్నారి ♦ కందుముద్దు
లెందుఁ దలిదండ్రులకు నెట్లొ ♦ యిట్టిమేలు
గన్నవారలె బిడ్డలఁ ♦ గన్న వారు
దశరథుఁడె పుత్రవంతుఁ డీ ♦ ధాత్రియందు. ౧౬౩

తే॥ అప్పృథుని కన్న గర్భర ♦ త్నాకరమున
నిన్నెలమిఁ గన్న కోసలు ♦ కన్నె కన్న
భాగ్యవంతుండ నైతినీ ♦ పరువు మురువు
రహిఁ చనవుఁ గాంచుకతన శ్రీ ♦ రామచంద్ర. ౧౬౪

క॥ సిరిపొత్తు గనుము హాయిగఁ, జిరకాలము మనుము కడఁగి ♦ శ్రీకరు లరిభీ
కరులగు కొమరులఁ గనఁ గను, మరుణకులాంచత్ప్రదీప ♦ కా ; రఘురామా.

వ॥ అని యిట్లు సంయమివరేణ్యుండు నెయ్యంబు దొనఁక నక్కుమార రత్నంబు నక్కునం జేర్చియుఁ జెక్కిలి పుణికియు నెమ్మొద్దుమోమున మోముసేర్చి ముద్దాడియు, శిరంబు మూర్కొనియు శ్రుతిప్రతిభటంబులగు వాగ్విశేషంబు లందించి యాశీర్వదించియుఁ బెక్కుతెఱంగులం గొనియాడుచుఁ బెద్దఱికంబు సూపి లక్ష్మణునిం గూడ నుచితప్రకారంబున గారవించె జనకమహీమహేంద్రుండును నంతకు నినుబడిగాఁ దనదు సంతసంబు వెలయ వారల నభినందించి మునికులోత్తంసునకు దోసిలొగ్గి తాపసోత్తమా ; మహనీయంబగు నీయనుగ్రహంబు పెంపునం గదే యిప్పాటం గృతార్థతం గంటి భవదనిమిత్తవాత్సల్యం బింతయొప్పునే యని

తీయని పలుకుల నగ్గించి యమ్మహామహుని యనుమతి వడసి స్వయంవరణార్థంబు భూపుత్త్రిం గైసేసి తోడ్తేఱ నంతిపురి పరిజనంబుల కెఱుక సేయం దగువారల నియోగించి చతురంతయానం బొకండు పుత్తెంచి మంగళసంవిధానంబులం గూర్ప నమాత్యవర్గంబుతో ముచ్చటించి వారునుం దగినహెచ్చరికమై మెలంగఁ దానును సభ్యులునుం గుశికగౌతమాత్మజులును రామలక్ష్మణులం బురస్కరించుకొని హర్ష పారావారతరంగితంబులగు తత్కాలోచిత సరససల్లాపంబులం దేలుచు నప్పతిం వర రాకకై నిరీక్షించుచుండి రంత. ౧౬౬

—♦ శ్రీరాముండు సీతా ప్రవేశంబు నిరీక్షించుట ♦—

సీ॥ ముద్దులు గులుకు నె ♦ మ్మోము కాముని చంద్రు, నీవె నేనని చన ♦ విడకమున్నె
వరణస్రజము రస ♦ పరత నమ్మరునారి, కోదమ తేంట్లనుఁ గూర్చ ♦ కొనకమున్నె
బెళుకుఁ జూడ్కులు నిట్టఁ ♦ బెరసి మారుపతాక, వఱలువాలుగకుఁ దో ♦ డ్పడకమున్నె
యంగీకరించితి ♦ ననుప ల్కతను చిల్క, పలుకుల మొన నిలఁ ♦ బడక మున్నె

మృదులసకలాంగసుమరమా ♦ మ్రేడనంబు
కంతుని వసంతలక్ష్మికిం ♦ గాకమున్నె
కలితరసభావకలికావి ♦ కాస యగుచు
సీత రాముని చిత్తాబ్జ ♦ సీమఁ గానియె. ౧౬౭

సీ॥ ఉదుటురాయంచల ♦ యులివు త్రోఁడిద యగు, నడకతోఁచిన మేన ♦ వడఁకుదోఁచె
నెమ్మి గ్రమ్మఁగఁ జాలు ♦ నెమ్మి పించెము విప్పు, చొప్పుగన్పడ మోహ ♦ ముప్పతిల్లెఁ
బుప్వటీరములపైఁ ♦ బొలయు తేఁటుల మేటి, పాట వాటిల నెద ♦ బీఁటవాఱె
గండుకోయిలపిండు ♦ గదిసికూప్పునెలుంగు, గసరు దార్కొనజాలి ♦ ముసరుకొనియెఁ

జెలువ రాక మెలపు ♦ సింగారఁపుంగల్మి
తనదు తలఁపులోనఁ ♦ దవిలి యుంట
నెద్ది యెదుటఁ బొసఁగె ♦ నేనియు నదియ కా
నుండె హరి కహోహో మ ♦ హోత్పలాక్షి. ౧౬౮

తే॥ చూడఁ దలఁచుఁ దివురుఁ గొంకుఁ ♦ జొక్కుఁ దడయు
ఏలొకో యని లో నెంచు ♦ నెఱుక గాంచు
నొక్కగడె పెక్కు లుగము లం ♦ చుదిలపాటు
నొందె రఘురాముఁ డో కర ♦ భోరు; వింటె. ౧౬౯

### —♦ శుద్ధాంత కాంతలు భూజాత నలంకరించుట ♦—

క॥ అంతట నంతఃపురస్త్రీ, మంతిను లక్ష్మీవార్త ♦ మానుగ విని యిం
తింత యనరాని సంతస, మంతఃకరణములఁ బొంగి ♦ యలుఁగులఁ బాఱన్.

శా॥ శృంగారైకనివాసభూమి ధరణీ ♦ శ్రీగర్భరత్నంబు సా
రంగాలోక మతంగజక్రమణ స ♦ ర్వస్వాపహృద్యాన స
న్మాంగల్యావహ మంగలాంగి రఘురా ♦ మస్వామి దేవేరి మే
ల్రంగారం గని పేర్మి పెద్దఱిక ము ♦ ల్లాసంబు భాసిల్లఁగన్. ౧౭౧

తే॥ ఒండు కౌఁగిటఁ జేర్ప వే ♦ ఱొండు గోరు
నొకతె ముద్దిడుచో మఱి ♦ యొకతె కొసరు
నొక్క సతి తన యంక మం ♦ దునిచి కూర్మిఁ
జొక్కనెడఁ దక్కి తక్కిన ♦ సుదతి వేఁడు. ౧౭౨

క॥ వెల కందని రతనము తన, కల లున్నటులున్నఁ బైఁడి ♦ గలసెడు నాఁడే
వెలయుఁ గద సిరుల కిరవుగఁ, గలకంఠీమణి; నితాంత ♦ గౌరవ మెసఁగన్.

తే॥ మొత్తమయి సీత వలగొను ♦ మురిప మెల్లఁ
దారకా వార లత్తఱి ♦ దరము మీఱు
ముచ్చటలఁ దేలుచుఁ బ్రమోద ♦ మూర్ఛనలకుఁ
దావలము నాఁ బలికి రిట్లు ♦ తరలనయన. ౧౭౪

ఉ॥ తియ్యని పానకంబు తఱి ♦ తీపుల మేలికొటారు వియ్యఁపు
న్నెయ్యఁపుఁ బంటచేను నెఱి ♦ నీటులు మీటగు చోటు వీఁకమై
డయ్యని పాలబుగ్గ మరు ♦ డంబరఁపుం బస భాగ్యలక్ష్మి మా
కియ్యలినీలవేణి జగ ♦ మియ్యకొనం దగు భర్తఁ గూడెడిన్. ౧౭౫

తే॥ ఎన్ని నోములు మును నోమి ♦ యున్నవార
మెన్ని పున్నెమ్ముల న్నెఱి ♦ గన్నవార
మట్లు గాకున్న నమరునె ♦ యమ్మలార
యమరుల కలభ్య యగు నిట్టి ♦ యమృతధార. ౧౭౬

తే॥ జాగు వల దంచుఁ గొందఱు ♦ వేగిరంబు
గూడ దేకర్జమున కంచుఁ ♦ గొందఱందు
రింతకు విమృశ్యకారిత్వ ♦ మే శుభంబు
లందఁజేయు నటంచు సి ♦ ద్ధాంత మయ్యె. ౧౭౭

సీ॥ తన మించు బెడఁగున ♦ కనుబంధముగ నిట్టి,ఘనుమోహనాకారు♦నెనయఁగనుట
తన శ్రీవికాసంబు ♦ తనరుట కీభవ్య, తనుఁ డచ్యుతవిలాస ♦ మున బొనరుట
తన బుద్ధిసంపద ♦ మెనయు విఖ్యాతి కీ, యనఘు సద్గురుభావ ♦ మనువు పడుట
తన కలావైభవ ♦ మ్మునఁ గన్న తెల్వి కీ,యిను చంద్రపదయోగ♦మనుఁగునుట
వనజముఖి సీతయే ధన్య ♦ యనఁగ నేల
మనము ధన్యాత్మకలము గా ♦ మనఁగ నెట్లు
జనకరాజాన్వయాబ్ధి పా ♦ వనము గాఁగ
జనన మందెను నిజము మా ♦ జనని యిట్లు. ౧౭౮

క॥ అని ముద్దు మురిపె మూరఁగ వనజాక్షులు జనకకులశు ♦ భంయుజనిం జే
కొని మంగళప్రసాధన, మునకుం ద్వరపడిరి చంద్రి ♦ మోహాసివదనా. ౧౭౯

తే॥ మంగళారాత్రికలఁ జూపి ♦ మానితముగఁ
బాటపాడుచు సరసంపుఁ ♦ బలుకు లొప్ప
దీవన లొసంగి చెయ్వుల ♦ తీయదనము
వెలయ మెలఁగిరి నెయ్యంపుఁ ♦ జెలులు నగజ. ౧౮౦

ఉ॥ చంపకనాస లక్కొమకు ♦ సంపెఁగనూనియ లంటి వాసనల్
పొంపిరివోవఁ బుష్పొడులఁ ♦ బుష్పసుగంధి నలుం గమర్చి శ్రీ
సంపద లుల్లసిల్ల గుణ ♦ శాలకు గొజ్జఁగెనీట మజ్జనం
బింపు ఘటిల్లఁ గూర్చిరి స ♦ హేలముగా మహిలాశిరోమణీ. ౧౮౧

తే॥ కురుల తడి యార్చి దూపము ♦ ల్గూర్చి వైలు
కీలుముడి వైచి చేర్చుక్క ♦ గీలుకొలిపి
చెందిరఁపుబొట్టు దిద్ది యిం ♦ దిందిరములు
ముసరఁ దోలుచు విరిసరు ♦ ల్మొనయఁ జేర్చి. ౧౮౨

క॥ వెలకందరాని సొమ్ములు, లలితాంగి కలంకరించి ♦ లత్తుక చరణం
బులఁ దీరుగఁ దీర్చిరి శ్రీ, కలనలకుం దానకముగఁ ♦ గల్యాణవతీ. ౧౮౩

తే॥ ఖంజనేక్షణ లిడిరి కా ♦ లాంజనంబు
గలికి కన్నుల కొకవింత ♦ నలువు మీఱఁ
గువలయ మొకొండు చెవిప్రక్కఁ ♦ గూర్చి రత్న
హారములు పొందుపఱిచి ర ♦ హార్యతనయ. ౧౮౪

క॥ అమ్మేటి యలంక్రియ నే, నెమ్మెయిఁ బొగడంగ నేర్తు ♦ నీవె యెఱుఁగు మా
సొమ్ములు తదంగకమ్ములు, నెమ్మె లోలయు రుచుల భేద ♦ మేర్పడ కునికిన్.

ఆ॥ పట్టుచీర గట్టి ♦ భాసిల్లు హారంబట్టు
మేలి కంచుకంబు ♦ గీలుకొలిపి
షోఁకముడియు రైక ♦ ముడియుఁ గట్టిగ బిగి
యించి నగిరి చెలులు ♦ చంచలాక్షి. ౧౮౬

క॥ హేలావతి తద్భావము, వాలాయ మెఱింగి కూర్చు ♦ వారల దెసకున్
లీలాకమలము సూపి స, లీలముగాఁ గోపగించె ♦ లీలావతిరో. ౧౮౭

శా॥ తాటంకార్కయుగద్యుతు ల్ముఖలస ♦ త్తారాధిపుం జెంద లా
లాటాభిఖ్యలు జ్యోత్స్నలై తిమిరగా ♦ శగ్రాహముం జూప స
త్స్ఫాటీరాంచితచర్చ సర్వశుభము ♦ ల్వాటిల్లఁగాఁ జేయ స్వ
ర్వాటీమోహ లయారె యంచన ధరా ♦ పత్యంబు వొల్చె న్సఖి. ౧౮౮

శా॥ విద్యుల్లీలయొ చంద్రరేఖయొ కలా ♦ విఖ్యాతియో సర్వసం
పద్యోగంబొ విచిత్రసృష్టిరససా ♦ భాగ్యంబొ లక్ష్మీవిలా
సద్యోతంబొ సరోరుహేక్షణు కటా ♦ క్షస్ఫూర్తియో నాఁగ స
మ్యాద్యద్భద్రగజేంద్రయాన నిజసా ♦ మ్రాజ్యంబు దెల్పె న్సతీ. ౧౮౯

శా॥ అంతర్మోద మహావికాసకలనా ♦ వ్యాహారి యా కీతి న
య్యంతు ల్సీత నలంకరించి లలితా ♦ భీష్టంబు లుప్పొంగ శ్రీ
మంతున్ రామునిఁ జేరి మ్రోల నిలువ ♦ న్మాన్యత్వ మూహింపఁగన్
జెంత న్నిల్పిరి నిల్వుటద్దము వచ ♦ శ్శ్రీపాండితీమండితా. ౧౯౦

ఉ॥ సిగ్గరి యయ్యుఁ జిత్తమునఁ ♦ జేర్చిన రాముని మూర్తి భ్రాంతిమై
డగ్గఱు రూపునం దపులు ♦ డంబరముం బరికించి పగ్గె పె
న్నిగ్గుగ నోర నిల్పి తన ♦ నీ టొక చోటునఁ గాఁగఁ జూడ్కులన్
దిగ్గునఁ జెల్వు చెల్వునకు ♦ దీటగు తేట గణించె నద్రిజా. ౧౯౧

క॥ లలితాంగి యిట్లు మండన, కలితనవశ్రీఁ దలిర్చి కల్యాణాంచ
త్కల నాఁగఁ దనరి జననికి, జెలువారఁగ మ్రొక్కి నిలిచె ♦ సిగ్గు దొనంకన్.

ఉ॥ కౌఁగిటఁ జేర్చి ముద్దిడి య ♦ కల్పితహర్షఝరప్లుతి న్మహా
భాగ నటించుఁ బొంగి సుత ♦ భాగ్యము మెచ్చుచు మేలిదీవెనల్

బాగుగఁ గూర్చి సీతలఁచు ♦ భంగి ఫలించెఁ గదమ్మ నోము లీ
శ్రీ గనఁగంటి నమ్మ ధృతిఁ ♦ జేరి ప్రియు న్వరియింపు మమ్మరో. ౧౯౩

కం॥ అని బుజ్జగించి సెలవిడె, జనకవిభు పురంధ్రి యవల ♦ సఖు లచ్చర ల
వ్వనజాలయ వననిధిశయు, మొనయించు విధంబు దోఁప ♦ మునుకొను వేడ్కన్.

కం॥ కమ్మని తావులు దెసలం, గ్రమ్మఁగ మరుమార్విఁ బెనఁచు ♦ రహిఁ దేం ట్లొగి జుం
జుమ్మని ముసరఁ దగు మధూ, కమ్ముల మేల్దండ నొసఁగి ♦ కామినిఁ గొనుచున్.

సీ॥ చతురంతమహి నేలు ♦ చతురు రాణి యటంచుఁ, జతురంతయానప్ర ♦ సక్తి నునిచి
రత్నగర్భాత్మజా ♦ రత్న మంచు మహార్హ, రత్నాంచితాతప ♦ త్రము ధరించి
రమణీమణి శ్రితామ ♦ రమణి శ్రీరమ యంచు, రమణీయతరచామ ♦ రములు పూని
జనకామితానంద ♦ జనక మీపద మంచు, జనకాంక్ష లూర సం ♦ స్తవము గూర్చి

పసిఁడి బెత్తంబు మొత్తంబు ♦ మిసిమి పసలు
దెసలను గ్రసింప మోసాల ♦ ముసరు జనము
వెస బరాబరి సేయంగ ♦ విభవ మొప్ప
నప్పతింవర రాజస ♦ భాంగణమున. ౧౯౬

తే॥ చేర్పఁ గుసుమేషుభటసాహ ♦ సిక్యమునకుఁ
బ్రథితమందాక్షయోధప్రి ♦ భావమునకుఁ
దలఁకుమెయి నితికర్తవ్య ♦ తావిమూఢ
యగుచు నొయ్యన నొదుఁగు ♦ నొయ్యారిఁ దారి. ౧౯౭

కం॥ వేదండయాన లిరువురు, కైదండ యొసంగి తలఁకఁ ♦ గా నగు నమ్మా
నీదయితుఁ జేరఁ జన నని, యాదరమున వరు వరించు ♦ హారు వెనయింపన్.

సీ॥ ఘనరేఖఁ దొఱఁగి ది ♦ గ్గనఁ దోఁచు నెలరేక, హొయలొప్ప యానమ ♦ ట్లొరడించి
కెలనల వైశాఖ ♦ కల సఖిద్వయి గూడఁ, జాంద్రలక్ష్మివిశి ♦ ష్టతకుఁ గూర్చి
లలిమించు తొలుకారు ♦ బలుమించు పగమీఱు, మెయిదీవెనిలుకడ ♦ మేలుసూపి
నడయాడు పసిఁడిపి ♦ న్నాణంపుఁ గీల్బొమ్మ, పడువున నొకవింత ♦ నడకుఁదొడరి

మదనుఁ డలుఁగుల పొది నుండి ♦ మఱు వెడల్చి
వింట సంధించి వెలుఁగులు ♦ వెలయ నూఁది
విడువ మొన రాము నెద గాఁడి ♦ వెలిఁ దలిర్చు
మోహనాస్త్రము నా సీత ♦ మ్రోల నిలిచె. ౧౯౯

శా॥ చిత్తం బుత్కలికం జనర్చె ధృతి భా ♦ సిల్లె న్మహావ్యగ్రతా
యత్తం బయ్యెఁ గటాక్షమండలము దా ♦ వ్యాపించెఁ గల్యాణసం
పత్తిస్ఫూర్తి యపత్రపాకలిక పా ♦ ప్పత్రీఁ గనెన్ సాత్త్వికో
పాత్తం బయ్యెను భావవైభవ మహో ♦ జ్యావృత్తి కప్పట్టునన్. ౨౦౦

మ॥ కలికిం గన్నులఁ గాంచె రాముఁ ♦ డొకప్పై కన్పట్ట నౌ నామె పై
తళుకు ల్దిక్కులఁ గ్రమ్మఁ జక్కఁగన నౌ ♦ దాస్యంబొ క్రొన్నెస్తఁపుం
గలయో సభ్యసమక్షదోషమొ స్మర ♦ క్రాంతిప్రకారంబొ యొ
క్కలసల్లీల ముహూర్తమాత్ర మెసఁగెన్ ♦ గల్యాణరేఖాంచితా. ౨౦౧

తే॥ కాంక్ష లివి యంచు నెంచఁడు ♦ కడఁగి కాంచు
తీరెఱుంగఁడు తలఁపఁడు ♦ చిత్తవృత్తియు
నూరకయ పరవస మొంది ♦ యున్న మెయిన
యుండె రఘురాముఁ డపు డో మ ♦ హాత్మలాక్షి. ౨౦౨

ఆ॥ మనసిజుండు రామ ♦ మానసానందార్ణ
వమున మునిఁగి తేరలి ♦ వసుమతీజ
కుచతటంబు లూఁత ♦ గొని పట్టెడలఁ దత్త్ర
పాబ్ధిఁ గూలి యోల ♦ మరయుచుండె. ౨౦౩

మ॥ చెలి; యీసీమఁ గటాక్షము న్నెఱపుమా ♦ సిగ్గియొడం గూడ దం
చలినీలాలక బుజ్జగించి చిబుకం ♦ బట్టోరగా నెత్తఁ దా
తెళుకుం జూడ్కులు గొన్ని దార్చె విభుపై ♦ సీలట్లు దోఁప స్త్వాళా
వాళిఁ గంతుం డెఁక రంతొనర్పఁడె స్వక ♦ వ్యాపార మేపారఁగన్. ౨౦౪

సీ॥ చెలి గేలి నాఁగఁ గూ ♦ ర్చిన భ్రూత్రికుటియు తన, మధ్యేధనుర్ముష్టి♦మహిమ కోప
మోముదమ్మి గదల్ప♦మొరయు తేంట్లాగిఁదన, నారిఝాంకృతిమిగాఱు♦తీరు దెలుప
విప్పుకన్గవ వెల్లి ♦ విరియు చూడ్కులు తన, యంపవాన నిగుడ్చు♦తెంపు నొడువ
నెరయు భూషణమణీ ♦ నిక్వాణములు దన, భటజయేత్యాదికా ♦ ర్భటి గణింప

సీత వల నెద్ది గనుపట్టుఁ ♦ జెలువ మదియు
తనదు దర్పోద్ధతిగ మాఱ ♦ దర్పకుండు
మొనసి జగదేకవీరు రా ♦ ముని జయించె
సాధనాంతరనిరపేక్షఁ ♦ జలరుహాక్షి. ౨౦౫

ఉ॥ రాముని సోయగం బొకఁడె ♦ రాముఁ గరంపదొ, తద్యశంబు త
ద్ధామముఁ జాలవో తలఁపఁ ♦ దా బలహీనుఁడొ కాముఁ డాత్రిపా
రామ జయింప నోడి యధ ♦ రస్థితిఁ గ్రైకొనెఁ గాక యింక స్వో
ద్దామతఁ జూపఁడే సమయ ♦ దార్ఢ్యము రాముఁడె తెల్పెఁ గావునన్. ౨౦౬

తే॥ మదను గెలిపింప జానకీ ♦ హృదయసీమ
కెక్కి రతి వ్రీడ నెట్టెటో ♦ దక్కఁగొనియె
దాన నవ్వాని కబ్బె నం ♦ తరము నేర్తు
రాఁడువారి మఱల్పంగ ♦ నాఁడువారె. ౨౦౭

మ॥ రతిప్రోత్సాహము వ్రీడ కేరడముతో ♦ రామామణి న్వేఁప న
య్యతిచంద్రాస్య పతి న్వరింపఁ గర మొ ♦ య్యం జాఁప సంకోచఁపుం
గతికిం బాల్పడు వల్లభు న్గన నుపే ♦ క్షం బూనఁగా రాక వి
స్తృతచాంచల్య నొనర్చు దృగ్భ్రమ నధి ♦ శ్రీపాలికా ; బాలికా. ౨౦౮

తే॥ ఇంగిత మెఱింగి నెచ్చెలి ♦ యెలమి దొనఁక
బాలికామణి కెంగేలు ♦ గేలఁ బొదివి
కఱపె రఘువీరు కంఠోప ♦ కంఠ మెనయ
దాన నెఱి గగ్గె మరు కుంటు ♦ తనము వాసె. ౨౦౯

తే॥ వరణమాల్యము గొని సాగి ♦ వరముఖాళి
వఱలు నవ్వనరుహపాణి ♦ పాణి మెఱసె
మారుఁ డవ్వీరు లోఁగొన ♦ మలఁచినట్టి
యుచ్చు పైఁ గల గలరజ్జు ♦ వో యనంగ. ౨౧౦

క॥ మరుఁడు తన శరము లైదిటఁ, దరలాక్షిఁ గలంచి వశ్య ♦ తరఁ గా వరుఁ గాం
చురహి నొనగూర్చి తద్దృ, క్ఛరముల నాధీరుఁ బరవ ♦ సంబునఁ దేల్చెన్.

ఆ॥ మేను లెఱుఁగ కెట్లొ ♦ మెలఁగి రవ్వా రప్డు
స్మరపరాక్రమప్ర ♦ సక్తిఁ జేసి
వధువు రతియ కాఁగ ♦ వరుఁడు కాముఁడ కాఁగఁ
దోఁచె నెల్లరకును ♦ దోయజాక్షి. ౨౧౧

క॥ చెలి ప్రేరణమో మరు నె, చ్చెలి ధారణమో మనోజు ♦ సిరి కారణమో
లలితాంగి చూడ్కి రాముని, వలగొని నిలఁబడ నొనర్చె ♦ వారిజనేత్రా.

తే॥ మగువ దూర్వాంచితమధూక ♦ మాలిక నిడె
సమయ మను నట్లు కంఠదే ♦ శమున విడువ
విభుఁడు సవరించుకొనె దాని ♦ వివశభావ
మచ్చుపడఁ బ్రేయసిం బలె ♦ నాదరించి. ౨౧౪

ఆ॥ మోహమునకు లేదు ♦ మొదలుం దుదియు నెందు
రాము కంఠసక్తి ♦ రమణ గలిక
పులక లొప్పఁ గాంతిఁ ♦ బొలుచు మాలికఁ గాంచి
కాంచె నీర్ష్య సీత ♦ కమలనయన. ౨౧౫

క॥ వంచన వారింపఁగ మది, నెంచియ కాకేల తోన ♦ యేణాక్షి గుణా
భ్యంచితు శ్రీరాముని వరి, యించితి నని యెఱుకసేసె ♦ నిందునిభాస్యా. ౨౧౬

ఉ॥ అక్కరము ల్నిజమ్ము నన ♦ లై తగ వ్రాసిన యుత్తరమ్ము నం
దక్కృతి నీకటన్న నుడి ♦ దా మును గాంచియు రాముఁ డామెదన్
జిక్కడలింపఁ జూచు తఱిఁ ♦ జెల్వ రసోక్తి ప్రమాణవాక్యమా
ఫక్కిఁ దనర్చె నింక నిజ ♦ భావము భావజుఁడే యెఱింగెడిన్. ౨౧౭

ఉ॥ నాతి కటాక్షపఙ్క్తియొ స ♦ నాతని యా వనమాలయో గుణో
ద్భూతయశస్స్రజంబొ ధృత ♦ పుష్పశరాశుగపాలియో మహా
భూతివికాసలక్ష్మియొ ప్ర ♦ భూతకలాంచితరేఖయో యనన్
ఖ్యాతి వహించె రాముఁ డెదఁ ♦ గైకొని నంతనె పూలదండయున్. ౨౧౮

క॥ తన మదిఁ గల తలఁపులొ విధి, మును జల్లిన విత్తనంపు మొలకలొ వలరా
యని మొనములుకులొ యనరహిం,బొనరఁగఁగనకాంగి మేనఁ♦బులకలు వొడమెన్.

ఆ॥ ఆలతాంగి కరకి ♦ సాల మా శ్రీరాము
పావనాత్మయుక్తి ♦ తేవఁ గనియుఁ
గంప మొందె నదియ ♦ కదె సాత్త్వికాదర్శ
మభినయంబు వికసి ♦ తాబ్జనయన. ౨౨౦

తే॥ ఆఘనుని రాము వరియించి ♦ యతని ప్రోల
నవనిజ కదంబలత నాఁగ ♦ నందగించె
నవయవస్ఫూర్తి పులకాఢ్య ♦ యై తలిర్చె
నలరులఁ బలాశములఁ గూర్చ ♦ నగతనూజ. ౨౨౧

క॥ కన దొండు విన దొకొండును,జనఁ దొడరదు నిలువఁ జూచు♦చాయ మొనయద
మ్మనసిజుని యాన నున్నటు, లనె యుండె మహీజ సత్క ♦ లాలలితాస్యా.

తే॥ స్వకరసార్ణవబిందుచం ♦ ద్రకితపాణి
కమలలక్ష్మీస్మవిలాసనం ♦ కాంత నాఁగ
స్విన్నకంటకితాంగి యా ♦ సీత తెలిపె
నచ్యుతుఁడు రాముఁ డగుటఁ బ ♦ ద్మాయతాక్షి. ౨౨౩

క॥ ఇఁక నేమి సేయఁ గలఁడా, మకరాంకుఁడు హిమకరాది ♦ మండలి తోడక
గకవికలు సేసెఁ దానిటఁ, గకవికపాలైన నగునుఁ ♦ గాక మృగాక్షీ. ౨౨౪

తే॥ కాముఁ డాచార్యక మొనర్పఁ ♦ గడఁగి రాము
విశ్వమోహనకలనాప్రి ♦ వీణతఁ దన
యంతవానిఁగఁ జేసి పూ ♦ జార్ధ మిడు ప్ర
సిద్ధ సుమశరవేది నా ♦ సీత మెఱసె. ౨౨౫

ఆ॥ అవనిజాత వల్లి ♦ యాయమ పొదలు ట, య్యవనిభృద్వరేణ్యుఁ ♦ డచలుఁ డగుట
యును నిసర్గజంబ ♦ యొగిఁ జిత్ర మయ్యె న, ట్లతని కం ప్రభావ ♦ మంబుజాక్షి.

సీ॥ తలలెత్తుఁ దలఁపు లీ ♦ దారి నం చెఱిఁగించు, సంచున మించె రో ♦ మాంచకలన
మును స్తంభమునఁ బుట్టి ♦ మనిన జెట్టి యితండె, దంభంబు గాదనె ♦ స్తంభలక్ష్మి
యిది హర్ష వారధి♦యితఁ డబ్ధిశయుఁడు ద, యాసింధు వనియె స్వే♦దాంబులహరి
తగ మోహినీకీర్తి ♦ నగు నీమె యను సిగ్గు, పాటంచుఁ దెలిపె వై ♦ వర్ణ్యలీల

సత్త్వనిష్ఠుం డగుట సర్వ ♦ సాత్త్వికరమ
మలసె నిట్లంచు బుధు లెన్న ♦ మానితగతిఁ
బూవుఁబెత్తటు మేటి సీ ♦ తావధూటి
పాణి రఘురాము మై సోఁక ♦ భావలతిక. ౨౨౬

తే॥ చిత్త మానందతృప్తిమైఁ ♦ జెనయ దొండు
గానఁ దద్దోష మేమియుఁ ♦ గానఁబడదు
కనుల తృష్ణకుఁ బారమా ♦ కాన నేర
మవ్వధూవరవిలసనం ♦ బజుఁ డెఱుంగు. ౨౨౭

తే॥ ఇవ్విధంబున హరి వరి ♦ యించి యిందు
వదన సిరి మీఁటి చెంగట ♦ వఱలు నంత

సర్వ మానందమయ మయ్యె ♦ జనకు నగరు
సారపుర మట్లు మాంగల్య ♦ సదన మయ్యె. ౨౨౯

క॥ మంగళ వాద్యము లొక్కట, ఖంగున మ్రోయంగఁ దొడరె ♦ ఖచరకృతతథా
సంగతి యా వెలిగారము, బంగారము నెట్టు లట్టి ♦ పద్ధతిఁ బెరసెన్. ౨౩౦

తే॥ అ య్యనంతాస్పదం బొక్కఁ ♦ డగుట సార, పౌరక్లుప్తు లప్పట్టునఁ ♦ బట్టువడవు
సౌమనసవృష్టి సంతోష ♦ సస్య మెసఁగె. నింతకు ధరాతలంబున ♦ నిందువదన.

క॥ ఇంటింటనుఁ గల్యాణపుఁ, బంటయె చూపట్టె మేలి ♦ వహి రతిధృతు లే
వెంటఁ గవగూడి వెలసెనుఁ, దంటా లెడలంగ భూత ♦ ధాత్రియు మెఱసెన్.

క॥ కొనియాడుటలకు మితి లే, దనువారును వైభవముల ♦ కద నిదె యను వా
రును నెంత సుకృతవంతుల, మనువారును నైరి పురి మ ♦ హాజను లెలమిన్.

క॥ ఆయాలోకం బనరా, కాయాడిత యీహ తమక ♦ మందించు నెడన్
సాయ మొనరించె రామ, శ్రేయోలాభంబు సకల ♦ సిద్ధిప్రదమై. ౨౩౪

క॥ సేసలు చల్లిరి పుణ్యాలు, శ్రీసముపేత లయిదువలు ♦ సిద్ధవచస్కుల్
భూసురు లమ్మెయి నక్షత; లాసుర తానఁగ నెరపి ♦ రాయిరుపురిపై. ౨౩౫

ఆ॥ వారి యుద్యమములు ♦ వఱలెఁ దత్ప్రథమంబు
తానఁగ మంగ ♦ ళాంచితములు
వాద్యకలనసూన ♦ వర్షణప్రభృతులు
ధృతులు భృతులు సర్వ ♦ దేశ్యములుగ. ౨౩౬

క॥ కౌశికముఖ్యులు వారల, కాశీర్వాదము లొసంగ ♦ నంతఃపురయా
నాశాస్య మట్లు గూర్చె బు, ధాశాస్యచరిత్ర కధిపుఁ ♦ డౌచితి తనరన్. ౨౩౭

తే॥ జనకు నానతి సభ్యసం ♦ జ్ఞానమును స
ఖీజనాహ్వానమును నొక్క ♦ కెలనునఁ దన
నాన యొక్కటఁ బ్రేరేప ♦ నయ మెలర్ప
మోహనాంగి యచటు వీడ ♦ నూహ గొనియె. ౨౩౮

తే॥ పరవసంబునఁ గాకట్టి ♦ పట్టునను మ
హాజనసమత్కు మనక నె ♦ య్యమున మగనిఁ
గలికి కనుదోయి మెలఁకువ ♦ గారవింప
నేర్చునే యొడ్లు మెత్తురే ♦ నేరమిడరె. ౨౩౯

మ॥ తలమెత్తెం బ్రియవృత్తి రాము నెడ మో ♦ దం బాప్రమోదంబునై
వెలసె న్నబక్షయుగంబు ప్రీరతిక్రృతి ♦ న్వోయేల యానందసం
వలనం బొప్పెఁ దదాత్మభావకలనా ♦ వ్యాపారపారీణతం
జెలులం దట్లు స్వపుచ్ఛభావపరసా ♦ క్షిం గ్వోన్నతు ల్సెల్లవే. ౨౮౦

క॥ చెలి యొరిగ మోమిడి యు, వ్వలని కరుగఁ దలఁచు వేళ ♦ వర్ధిల్లెనుఁ జూ
డ్కులఁ జాంచల్యం బడుగుల, నలసత్వం బెడఁద జడ న ♦ హంయుత బుద్ధిన్.

సీ॥ ఎడపెట్టియును భావ ♦ మెలయించు మందాక్షు,మతనుదర్శనదోష♦మూడి విడువఁ
గుదియించి వెనుకటి ♦ గుటిఁ బాఱు ధీవృత్తి, చెనఁటి యాఱిడిఁ జుల్కు♦నేసినెగడ
నెదురుకో ల్గొనెడు ప్రా ♦ ణేశు మోహనరూప,మడరు పశ్చాత్తాప♦మపనయింప
సెలవుల వలనొప్పు ♦ సిరిమీఱు చిఱునవ్వు,స్వకృతార్థ తార్థ సూ♦చకము గాఁగ
సహజమందగమన ♦ సాహిత్య మప్పాట
మలఁచు వలపు మీఁద ♦ మాట మోపఁ
జెలులు దండగొనుచుఁ ♦ జేరిరాఁ జతురంత
యాన మెనసె సీత ♦ యానతాంగి. ౨౮౨

తే॥ మెఱుఁగుఁ దీవియ గాకేమి ♦ మెఱుఁగుఁబోఁడి
తా మెఱసె నట్టు లాఘన ♦ శ్యాము మ్రోల
నిలుకడయు వింత యయ్యెఁ బో ♦ మలయకున్నె
యాన మొలసియుఁ బ్రకృతిభా ♦ వానుగమము. ౨౮౩

క॥ మున్నెటు లటు లన్నెలఁతుక, మిన్నను సఖు లందలమున ♦ మేలుగ నిడుచోఁ
గన్నులు వేలో లక్షలొ, కన్నొరగొను మహని సాయ ♦ కము లన ప్రాలెన్.

సీ॥ తరలాక్షి దెస కింత♦ తలసూపెనో లేదొ, తలఁతు రందల మెత్తఁ♦దారు మున్నె
కొమచాయకై మేను♦కుదురుకొల్పెనొ లేదొ, కుదురఁజూతురుయాన♦కూబరంబు
భావినిఁ బిలువంగఁ ♦ బలు విచ్చెనో లేదొ, పరఁగింత్రు పలువిచ్చు ♦ పలుకుబడులు
చెలిబాట నాఁగ దృ ♦ ష్టులఁ బంచెనో లేదొ, పంచి యిత్తురు నేల ♦ పాదములకు
రామునెడ నంత చలమున్నఁ ♦ గామునకె వి
మానధుర్యుల కేల వి ♦ మాననాస్థ
తానె తద్రూపముల నట్లు ♦ దాల్ప నోపు
వాఁడు రఘువీరు వెఱపింప ♦ వామనయన. ౨౮౪

తే॥ అంతిపురి సేరె నంతలోఁ ♦ బంత మలర
విభుని తలఁపుల లోఁగొన్న ♦ వెలఁదిమిన్న
చాయఁ బతిమ్రోల నిలిపి వి ♦ శ్రాంతి గోరి
జనకు నింటికి మును జన్న ♦ సంజ్ఞ వోలె. ౨౪౮

క॥ చంద్రుఁడు సభ వెలయింపఁగఁ, జంద్రిక నగ రెలయఁ జేయఁ ♦ జాలె నపుడు ని
స్తంద్రముదావిర్భావము, చంద్రానన ; కువలయాను ♦ సంగత మయ్యెన్.

ఆ॥ విభుఁడు విభుఁడు గాఁడు ♦ వెలఁది వెలందియుఁ
గాదు భావభవవి ♦ కారకలన
యుగము లయ్యె క్షణము ♦ లోర్పు లూర్పులు వచ్చెఁ
గలదె యిట్టి నెఱి జ ♦ గంబులందు. ౨౪౯

క॥ ఎడపెట్టని తాద్రూప్యము, లెదఁదలఁ బొడకట్టు టొకఁడె ♦ హేతువు వారా
యెడఁ బెండిలి తఱితీపునఁ, దొడిఁబడ కెట్టెటులో ధైర్య ♦ ధుర్యు లగుటకున్.

క॥ ఆదట జనకుఁడు గాధిసు, తాదుల యనుమతి మహార్హ ♦ లగు మర్యాదల్
పాదుకొనఁ గుమారుల మహి, తాదర మొప్పారఁ జేర్చె ♦ నటు విడిదలకున్.

శా॥ సాదు ల్సాము లొనర్ప మాగధులు సు ♦ శ్రావ్యప్రబంధంబుల
న్మోదంబు ల్ఘటియింప సేన లిడి స ♦ త్పుణ్యాంగన ల్మేలన
న్వాదిత్రంబులు మ్రోయ నర్తకుల స ♦ న్నాహంబు లొప్ప న్మహా
శ్రీ ద్వైవార నివేశభూక్రమణల ♦ క్షిప్రం బొల్చి రా రాట్సుతుల్. ౨౫౧

క॥ ఆడఁ దొడరి రచ్చరలకు, నీడనఁ దగు వారకాంత ♦ లిదె తఱి యని యా
వేడబము తమ్ముఁగేరెదు, జాడగ నవ్వార లెఱిఁగి ♦ సంభ్రమపడఁగన్. ౨౫౨

క॥ మారసుకుమారు లైన కు, మారుల పోఁడుములు గనుచు ♦ మానులు నృపుడున్
వారి నటఁ జేర్చి ముద మ, వ్వారిగ విలసిల్లి రపుడు ♦ వారిజనయనా. ౨౫౩

తే॥ పెండ్లి చదు రదె మొద లయ్యెఁ ♦ బేర్మిఁ గన్న
వా రవారితులై కళ ♦ ల్వాఱలఁ జేయఁ
జేయఁ జాలెదుఁ గదె యయ్య ♦ జేయు చరిత
మెంద తెందఱినైనఁ దా ♦ నింతవట్టు. ౨౫౪

క॥ అందఱును శతానందులె, యందుము గా కనిన మేలె ♦ యగు జనకగురుం
డం దొకఁడె పేరు వడసిన, చందము వింత యగుఁ గాదె ♦ చందనగంధీ. ౨౫౫

సీ॥ ఆప్లవనము గ్రొత్త ◆ యన హర్షవారిధి, నోల మాసింపక ◆ యోలలాడి
రామకథామృతం ◆ బాముఖస్ఫూర్తిగా, రహిఁగ్రోలి యజరామ ◆ రత్వ మంది
వైభవం బిదె యంచు ◆ వాగ్మితాప్రతిపత్తి, సీతామహాదేవి ◆ చెయ్వు లెంచి
జనకు మందిరమె శ్రీ ◆ జనకు మందిర మంచు, నచ్యుతోన్మేషాప్తి ◆ ననువదించి

రాజుఁ గాంచి చెలఁగి ◆ రాణమై దశరథు
సహకుమారు సబలు ◆ జాల మేల
పిలువఁ బంప వలయుఁ ◆ బ్రియమంత్రులం గూర్చు
విప్రవరుల ననియె ◆ విబుధవినుత. ౨౫౮

క॥ ఆలోచన లొనరించి మ, హాలోచనుఁ డతఁడు గాధి ◆ జానతి మేలా
మే లొనగూర్చెడు గుణాల, శ్రీమ్మలలితముహూర్తకలన ◆ మెలఁకువఁ గూర్చెన్.

క॥ వెండియు మునికులమండనుఁ, డండ యగుచుఁ దనకుఁ గాశి ◆ కాజ్ఞ సుధృతినొం
డొండ సమకూర్ప భూమ్యా, ఖండలు నుద్బుద్ధుఁ జేయఁ ◆ గా నెలకొనుచున్.

తే॥ శుభపరంపర లేమేమొ ◆ సానిపెఁ జెవ్వల
వారి యోజన లెఱుఁగంగ ◆ వారికె చనుఁ
గాని మొడ్లకుఁదోఁప వా ◆ ఘనులు దొలుత
ననుజునిఁ గుశధ్వజునిఁ బిల్వ ◆ నంపి రపుడు. ౨౫౯

శా॥ ఉత్సాహాప్లుతుఁడై పురోహితుఁ డతం ◆ డూర్జస్వలం బాప్తసం
పత్సారం బగు రాష్ట్రి మెల్లెడల మే ◆ ల్వాటింపఁ జాటింపఁగా
వత్సా; పంపుము చారుల స్థితకృతి ◆ ప్రాగ్భారుల న్బారమాఽ
దిత్సం బెంపుము నవ్యభవ్యకలనా ◆ దీవ్యద్గుణవ్యాపృతిన్. ౨౬౦

క॥ అని మంత్రులఁ గనుఁగొని మీ, రనుపమశుభదార్థనిచయ ◆ మందిచ్చెడు ప
ట్టున సురమంత్రులకాఁ దగు నను హెచ్చున హెచ్చరించె ◆ నాయా విధులన్.

క॥ ఆనందమహితుఁ డానృపుఁ, డానందోన్మిషదుపోప ◆ హారాంచితుఁడై
యానందని శుభవిధిని శ, తానందానుజ్ఞతోడ ◆ నొదలఁ దాల్చెన్. ౨౬౧

ఆ॥ గాధిపుత్రుఁ గాంచి ◆ కౌతుకాప్తి న్మించి
చనవుఁ బెంచి జనక ◆ జనవిభుండు
పలికె నిట్టులంబు ◆ బ్రహ్మాభ్యాయం బన్న
నదియు కాక యన్య ◆ మగునె యనఁగ. ౨౬3

సీ॥ నీప్రసాదంబున ♦ నేమంబు నెగడొంద, బ్రహ్మమూర్తి; మేలు ♦ పడయఁ గంటి
దృష్టవీర్యుం డయ్యె ♦ దేవతుల్యుఁడు రాముఁ,డది దశరథు పున్నె ♦ మనఁగఁజెల్లు
నత్యద్భుత మచింత్య ♦ మ ట్లతర్కిత మిది, యోఁగాని సామాన్య♦మగుట యెట్లు
జనకకులంబు పా ♦ వన మొనర్చెను బ్రాణ, భూత మదీయాత్మ ♦ జాత సీత

యిమ్మహాత్మునిఁ గొలిచి తా ♦ నెలమిఁ గాంచుఁ
గావుత మొసంగువాఁడ సం ♦ గరము సెల్ల
ననుమతి ఘటింపు మోయయ్య ; ♦ యనుచువాఁడ
నధిపుఁ డోడ్డైఱ నగువారి ♦ ననువు మీఱ. ౨౬౪

క॥ అని యడిగిన మేలట్టులె, యొనరింపు మటంచు నమ్మ ♦ హాద్యముఁడు తపో
ధనుఁ డానతి సేసిన న, మ్మనస్విసత్తముఁడు నృపుఁ డ ♦ మాత్యాన్వితుఁడై.

మ॥ తగవారం దగువారి నల్వుర రఘూ ♦ త్తంసు న్వహిం దోడితే
ఱఁగ రాగోల్లసనంబునం గలిమి మీ ♦ ఱ న్మాన్యుఁ డమ్మేటి మే
లగు సందేశము దేశకాలగుణవి ♦ ద్వైశ్వర్యసంపత్కలా
నుగుణంబై వెలయంగఁ బంపె విలస ♦ న్మోదప్రసాదాఢ్యుఁడై. ౨౬౬

ఉ॥ ఉత్తరకోసలేశ్వరుల ♦ యొప్పుల కొప్పగు నట్లు సత్కళల్
క్రొత్తగఁ గూర్చు వారలకుఁ ♦ గోరిన యర్థము లిత్తు నంచుఁ దా
నత్తఱిఁ జాటఁ బంచె మిథి ♦ లాధిపుఁ డానకు వేయిరెట్లుగాఁ
బత్తనలక్ష్మి మేల్మిఁ గను ♦ భంగి నొలంగిరి తదు లద్రిజా. ౨౬౭
జ్ఞు

సీ॥ మణితోరణస్తంభ ♦ మార్జన ల్పచరించి, వైజయంతులకు మే ♦ ల్వాలువ లొసఁగి
వైదూర్యదీపికా ♦ వాళితంబు సవరించి, మగఱాల గోడల ♦ మాపు మాపి
పచ్చల వేదిక ♦ ల్పస రెక్కఁగాఁ దోమి, నీలఁపుంగొణికల ♦ నిగ్గు దేర్చి
పగడాల దూలము♦ ల్పరిఢవిల్లఁ బొనర్చి, పసిఁడికుండల మెఱుం ♦ గెసఁగఁ దుడిచి

స్ఫాటికాదర్శముల కాంతి ♦ చక్కఁ గూర్చి
పద్మరాగగవాక్షము ♦ ల్పదిలపఱచి
పుర మలంకారరమకుఁ గాఁ ♦ పురము గాఁగఁ
గ్రొత్తసేసిరి తత్కలా ♦ వేత్త లపుడు. ౨౬౮

క॥ మున్నున్నవి వింతలు సే, యు న్నూతనసృష్టి గొంత ♦ యనువుపఱుప సం
పన్నత్వము ఫలయోగం, బన్నఱి నెఱయించి రెల్ల ♦ రాదృతి సుదతీ. ౨౬౯

ఆ॥ కవుల ప్రతిభ చిత్ర ♦ కారుల తేఁకువ, వందిబృందముల సు ♦ వాక్సమృద్ధి
మించె వారిదైన ♦ మేలెంచి యామంచి, యొండుచోట్లఁ ♦ గనునె నిండుదఱను.

సీ॥ పూపవన్నియ తేట ♦ చూపట్టు నచ్చోట, జిగిమెఱుం గొకయింత♦ చేర్చి చేర్చి
ముదురురంగు బెడంగు♦మొక్కలం బగునెడ, దూదిపింజె నొకింత♦ దుడిచి తుడిచి
యొండుడా లందమం♦చూహించుపట్టునఁ, దీర్పుచొప్పునఁ గొంత♦మార్చి మార్చి
మిట్టుపల్లముల యె♦మ్మెలు దార్చు నెలవులఁ, దళుకునీట మఱింత♦మెలఁచి మెలఁచి
జీవకళ లెల్లతావుల ♦ సిద్ధపఱచి
నవవికాసానుభావస ♦ న్నాహ మొప్పఁ
బూర్వరాజకథాంశము ♦ ల్వ్రాసఁగఁ గూర్తు
రత్తఱినిఁ జిత్తరువులు సౌ ♦ ధాంతరముల. ౨౭౧

క॥ ఒక ముత్తెఁపుఁ గోవకు జో, డొకనీలఁపుఁ గణిక గాఁగ ♦ నొగిఁ బన్నుదు రె
న్నిక మీఱఁ జాందినీ లా, త్మకలాన్యాసమున కది ని ♦ దర్శన మబలా. ౨౭౨

క॥ మున్నె పతాక లందిన, యన్నగరికి మేల్పతాక ♦ లాయెడ నమరెఁ
గొన్ని యన నేల బిరుదము, లెన్నియు నేర్పడె మహీప ♦ తీహిత మెలయఁ.

సీ॥ చలువ లందిచ్చు ర ♦ చ్చలు వహిం దార్చిరి, చంద్రాస్యల మనఃప్ర♦సాద మెసఁగఁ
గదలిక ల్దళుకొత్తఁ ♦ గదలిక ల్నాటిరి, రంభోరువులు మెచ్చు ♦ రాణ లమరఁ
బొదలు పుష్పాదుల పూఁ♦బొదలు హత్తించిరి సుకుమార్ల నవవింటి♦జోదు గదుమ
వలపు గీల్కొలుపు తీ♦వల పురు ల్వైనఁచిరి, రతి లతాంగుల నట్టి♦కృతికి మెలుపఁ
జాలెఁ బైపై చ్చనఁగఁ జాంది ♦ నీలు పాల
కీల వంకల ముత్యాల ♦ జాలెలు నెల
తాల తిన్నెలు మేలిదీ ♦ పాలు నందుఁ
జాలఁ బొల్లిచ్చి మురు వట్లు ♦ జాలుకొనఁగ. ౨౭౪

క॥ ఏయెడఁ గాంచిన మంచెలె, ఛాయాగృహములె ప్రపాన్న ♦ శాలలె శుభల
క్ష్మీస్రయోగగరిమ గిఱికొన, నాయధిపుని పురి మఱింత ♦ యై విలసిల్లెఁ. ౨౭౫

క॥ అంతఃపుర మని పురమని, యింతయు భేదం బొకొండ్ల ♦ కెఱుకపడదు మే
ల్బంతుల సయ్యాటల విరి, బంతీ; యది నాట్యశాల ♦ పరువున మెఱసెఁ. ౨౭౬

తే॥ కళల కావాస మన నర్థి♦కల్పక మన, నిగమలక్షిత మన రత్న ♦ నిలయము నన
నదియె రత్నాకరంబు డి ♦ ద్ధాదిగణన, నబ్ధిరత్నాకరపదం బ ♦ పార్థ మయ్యె.

చ॥ పురి మృగనాభిసారములఁ ♦ బొంపుగ నింపెడు వేళ గాలి చం
దురుఁడును భీతి స్వీయమృగ ♦ దుస్తరసంయమ మెంచి దాఁచి వ
చ్చిరొ యకలంకుఁడయ్యె శశి ♦ చిక్కెను గంధవహుండు మందుఁడై
దురిత మొకొండె భిన్నఫల ♦ ధూర్వహ మియ్యెడ భాగ్య మాఁగదే. ౨౮౮

సీ॥ పూచిన మంజరు ♦ ల్పూచినట్టులె యుండెఁ, గల్పవల్లికలతోఁ ♦ గలసె నేమొ
నెఱసిన తేనియ ♦ ల్నెఱసినట్టులె యుండె, నమృతంపు బుగ్గల ♦ నందె నేమొ
యాడిన కొదమ తేం ♦ ట్లాడినట్టులె యుండె, సిరివెల్లువల భ్రాంతిఁ ♦ జెందె నేమొ
కులికిన నెమళులు ♦ కులికినట్టులె యుండె, ఘనసంపదల యొప్పు ♦ గాంచె నేమొ
పొదలిన మరాలరాజము ♦ ల్పొదలినట్లె
యుండెఁ దామరవిరిపొద ♦ లొరసె నేమొ
సారపురి పురి యచ్చర ♦ ల్చాన లనెడు
జాడఁ గననీని యమ్మహా ♦ త్సవము గదియ. ౨౮౯

ఉ॥ గొజ్జఁగెసీటి కాల్వలు ని ♦ కుంజపుఁ దేనియసోనదొనె లా
పజ్జన పూపలేదలిరు ♦ వల్లరు లల్లిన పూవుదిండ్ల మే
ల్సెజ్జలు నోలగమ్ముసిరిఁ ♦ జెల్వగు గద్దెలు నొప్ప నప్పురం
బొజ్జల కొజ్జ యయ్యె స్వర ♦ సొజ్జ్వలసత్పరిపాక సంగతిన్. ౨౯౦

తే॥ ఆటపాటల కొమరెలు ♦ నాటకమ్ము
పాత్ర లుడిగంపుఁ జేడెలు ♦ పడుపుటాండ్రు
ననువుఁగత్తెలు మెలఁగెడు ♦ ననువు దోఁప
మేలిశిల్పంపు నేరిమి ♦ మేల్మి గాంచె. ౨౯౧

సీ॥ పచ్చతోరణలు జొం ♦ పము లట్టు లాముక్త సురభిపుష్పశ్రీల ♦ శోభిలంగ
మణిదీపికోల్లోచ ♦ మండలం బధిచంద్ర, మండలాంచితకలా ♦ మహిమ నెగడ
గానవిద్యాస్థాను ♦ లానటద్భృంగలీ, లానూనవిలసన ♦ మనువదింప
వందిమాగధసూక్తి ♦ బంధము ల్శుకపికా, ద్యాలాపసంపద ♦ నతిశయిల్ల
కలితలక్షణ లుపకారి ♦ కలు నికుంజ
మండపరమాప్తి గనఁ బాంథ ♦ మానసములఁ
దివియు శోభనలక్ష్మి మ ♦ వి ♦ దేహరాజ్య
మతనుసామ్రాజ్యవైభవం ♦ బంది మెఱసె. ౨౯౨

క॥ పదవతి; జనకనివాసము, మదనోల్లాస మనఁ దనరె ♦ మాయురె! శ్రీమ
న్మదనజనకసువిలాసము, లదనున నెమ్మొయి వికాస ♦ మందం గలవో. ౨౮౩

సీ॥ రవికి సంబంధిమ ♦ ర్యాద నంబరవీథి, వైజయంతికలు పీ ♦ వనలు వైవ
నటు సాగరుని తృప్తి ♦ కై కాంతిఝరి సారధుని యెన్నుకొనికొన్న ♦ చనవుగోర
మఱియునింద్రును పేంద్రు ♦ మహామెల్లియనిమంగ, ళాత్తోద్యరవమురఁ ♦ మ్మనుచుఁ బిలువ
నంతయు నీయదే ♦ యని పద్మ నిల తమ్మి, పూలగద్దియ సేర్చి ♦ బుజ్జగింప
జతురలంకారసంగ్రహ ♦ చతుర యగుచు
నమరి హర్షపరీవాహ ♦ మమరఁ గన్నె
మిన్న జానకికన్న ము ♦ న్మున్న మనికి
కలికి పెండిలి యన మహో ♦ త్కలికఁ దనరె. ౨౮౪

తే॥ చెప్పఁ దొడరిన రస మింక ♦ నుప్పతిల్లుఁ
గాని తుది మొద లెందునుఁ గాంచు టరిది
యాదిశిల్పికలావల్లి ♦ కాలవాల
మదియ కా నొప్పె నప్పుడ ♦ బ్జాయతాక్షి. ౨౮౫

క॥ పెండిలి తఱితీపున వా, రుండిరి జగ ముండె వేల్పు ♦ లుండిరి నాఁ డీ
వుండుట చూపట్టెడు నిపు, డండజయానరొ; రుచింప ♦ దాలస్య మిఁకన్.

క॥ వివరింతు సంగ్రహమ్ముగ, నవనవ మున్మేష మొంది ♦ నగ రమ్మొయిమా
నవనాథమానసాధ్వ్యము, కవివరహృద్దేశ మనఁగఁ ♦ గనుఁగొన నొప్పెన్. ౨౮౬

ఆ॥ అతిశయోక్తు లొరయ ♦ వటు పునరుక్తులు, చొర వసంగతులకుఁ ♦ జొరవ లేదు
సత్యకామసర్వ ♦ జనకామ్యరామసీ, తాకథాప్రథాభి ♦ ధానమునను. ౨౮౭

క॥ కవిసుకృతపరీపాకము, స్వవితాఖిలలోక మధిర ♦ సాలోకము స
త్వవివేకము హతశోకము, రవికులమణిసద్గుణాక ♦ రశ్లోక ముమా. ౨౮౮

క॥ అమ్మొయి నలంకృతిం గని, యెమ్మె లొలుకు నగరి విభవ ♦ మీక్షించి విభుం
డిమ్మా యమ్మ కటాక్షం, బిమ్ముగ విలసిల్లె ననుచు ♦ నెదఁ బొదలెఁ జెలీ.

మ॥ పురము ల్పల్లెలు రాజధానియుఁ గలా ♦ పూర్ణోదయం బంద మం
దిర మొక్కం డన దేశ మెల్ల మహితా ♦ దేశంబునం జెన్నుగాం
చి రమాదేవికిఁ బుట్టిని ల్లగుచు భా ♦ సిల్లన్ రసార్మిన్ గుణో
త్కరరత్నాకరుఁ డొప్పె నాజనకుఁ ♦ డాకల్పాద్యనల్పస్థితిన్. ౨౮౯

కం॥ గురుల యనుజ్ఞలు వడయుచు, గురులఘుభావంబు లరసి ♦ కొనుచు మలయు భా
సురలలితకలాస్ఫూర్తికి, సుర లచ్చెరు వందఁ గూర్చె ♦ శోభనపదముల్. ౨౯౨

కం॥ బంధువులఁ బిలువ సద్గుణ, బంధురుఁ డతఁ డంపెఁ దగిన ♦ వారల వారా
బంధుప్రియుఁ గాంచిరి శుభ, సంధాన మెలర్ప స్వజన ♦ జాలము గొలువన్.

కం॥ సాంకాశ్యాధీశ్వరు సుర, సంకాశుఁ గుశధ్వజు న్స్వ ♦ శంకట తేజున్
శంకాతంకరహితు నక, లంకు ననుజుఁ గాంచి యయ్యి ♦ లాపతి పొంగెన్.

ఉ॥ ఆతనిఁ గౌఁగిలించుకొని ♦ యాదృతిమైఁ గుశలం బెఱింగి స్వీ
యాతతభద్రలక్షణము ♦ లయ్యవి నెయ్యము మీఱఁ దెల్పి తా
నాతఁడు విందుల న్బహువి ♦ ధార్వాణలం బెనుపారు మాధురిం
బ్రీతులఁ జేయుచుం దగుని ♦ వేశము లంద ఘటించి రద్రిజా. ౨౯౫

ఆ॥ అన్న గొదవినట్టి ♦ యాశాస్యవాహిని, కతఁడు పొంగి లక్ష్మి ♦ యనఁగ నిదియ
యంచు ముచ్చటించి ♦ యక్కొమారులఁ గాంచి, యనుపదప్రమోద♦మందు చుండె.

కం॥ జనకమహీపాలుఁడు స, జ్జనకవిగాయకకలాప్ర ♦ చారం బదనై
యనుపద ముప్పొంగఁగఁ దన, యనుపమసామ్రాజ్యయుక్తి ♦ కలరుచు నుండెన్.

కం॥ కుడిభుజ మనుజుఁడు నటు ద్రో, ఢ్వడ మనుపటికన్న వేయు ♦ భంగుల నెందుం
దొడిఁబడక మాంగలికముల, నెడఁదఁ బ్రోడము తలఁపు లట్టు ♦ లేర్పఱచె సఖీ.

తే॥ కలసి చుట్టాల యక్కఱ ♦ ల్గనుచుఁ గూర్చు
కొని కుమారుల కూరిమి ♦ గొసరి కొనుచు
మలసి యతిథుల మునుల సే ♦ వలఁ దనుపుచు
కోసలేశ్వరు రాకఁ బే ♦ ర్కొనుచు నుండె. ౨౯౯

కం॥ అని శివుఁ డెఱిఁగించిన శివ, విని యీ వనినదియ పెండ్లి ♦ వినఁ గోరెద ని
ట్లనఁ బునరుక్తియె యనుచుం, జనవుఁ బెనఁచు పలుకులను ర♦సం బెలయించెన్.

చ॥ అమృతమయాత్మ; చిన్మయ; మ ♦ హాశయ; యీశ; స్వయంప్రకాశ; ని
త్యమహితసత్త్వ; తత్త్వపర ♦ తాంచితసార; వికారదూర; ని
ర్మమ; నిరపేక్ష; నిష్క్రియ ని ♦ రాకృతభేద నిరామయా సుసం
యమియమవిఘ్నభంజన ని ♦ రంజన భక్తజనానురంజనా; ౩౦౧

క॥ మాయామానుషయోగ, చ్ఛాయాచ్ఛాదితజగత్త్ర ♦ చారణచతురా
త్మీయవిలాసశ్రీభర, ద్రాయితలీలాభిరామ; ♦ దైవలలామా;. 302

పంచచా॥ సకర్మయోగబంధముక్తి ♦ సాధనప్రసాధన
ప్రకారకాత్మధర్మలబ్ధి ♦ భావనానుఖేలనా;
వికారమూలకృంతనాను ♦ విద్ధలక్ష్యయోజనా
ప్రకృష్టధీరసైక్యసత్త్వ ♦ బంధనిత్యశీలనా. 303

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండంబున నవమాఽశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శ్రీ రామ కథా మృ త ము.

## బా ల కాం డ ము.

—♦ ద శ మా శ్వా స ము ♦—

—:(o):—

—♦ శ్రీ మై థి లీ ప రి ణ య ము ♦—

శ్రీకల్యాణగుణాంచ
త్ప్రికామ్యవిభూతిలక్ష్య ♦ పావనచరిత
శ్రీకారితప్రపన్నజ
నాకారితపరమపదమ ♦ యాత్మవికాసా.

తే॥ అవధరింపుము కౌతుకం ♦ బతిశయిల్ల
శైలరాజన్యకన్యతో ♦ శశికలాక
లాపుఁ డిట్లనుఁ గొనుము వి ♦ లాసినీ ; యి
లాసుతోద్వాహవైభవో ♦ ల్లాసరసము.

—♦ దశరథుని యొద్దకు జనకమంత్రి ప్రముఖు లరుగుట ♦—

తే॥ అమ్మహోత్సవ మెల్లఁ దా ♦ రనఁగ వార
లమరు మానసగతిమార్గ ♦ మతిగమించి
సంభ్రమం బొప్పఁ జూచిరి ♦ సకలశుభని
కేతనం బనుపేరి సా ♦ కేతనగరి.

క॥ కాంచి కమలాసతీమణి, కాంచిక యనఁదనరు దాని ♦ కలన లెఱిఁగి కా
న్పించువల నరసి నగర, భ్యంచితులై సొచ్చి నరవ ♦ రాస్థానమునన్.

శా॥ సామంతు ల్మిత్రులుం బురోహితులుఁ బ్ర ♦ స్తావంబులం దేర్ప భా
వామందస్ఫురణంబు సత్కవు లుప ♦ న్యాసంబులం గూర్ప శ్రీ
భూమోల్లాసులు గాయకు ల్శ్రుతిరసో ♦ ద్భూతిన్ రహిం దార్ప ని
త్యామోదోదయ మైన యాసభను మే ♦ లౌ సింగఁపుంబీఠికన్. ౫

ఉ॥ మెత్తని చిత్తముం దవిలి ♦ మేకొను మేలితలంపు లాత్మజా
యత్తతఁ బైఁ బరామరిక ♦ యాఱు పదాఱుగఁ జేయుఁ గన్ను లా
వృత్తికె పాల్పడ న్బెరిమ ♦ వెల్లి మునుంగుచుఁ దద్గుణోత్కరో
పాత్తము లౌపరిసంగముల ♦ నల్లనఁ బ్రొద్దుఁ గ్రమించు టెంచుచున్. ౬

సీ॥ సిరి పల్లుచెలియు నాఁ♦జెలియ రిర్వురు చామ, రలు కీర్తు లనఁదాల్చి♦కెలనఁ గొలువ
జగదండధారి భు ♦ జగ మట్టు లోకజెట్టి, యాతపత్రముఁ బూని ♦ యవల నిలువ
సన్నిధి సేసిన ♦ శంఖచక్రములు నా, నల కుమారద్వంద్వ ♦ మరుస మొసఁగ
రవిచంద్రమూర్తిస్ఫు ♦ రణ లన్న తేజఃప్ర, సాదము లనుసన్న ♦ లూఁది వెలయ
మొనసి వలనొప్పు సద్గుణ ♦ మ్ములు వడువున
నిగనిగల మేలిమగఱాల ♦ నగలు మెఱయ
దశరథాఖ్యుఁడు దగిన భూ ♦ దయితు నతని
నయ్యమాత్యులు గని విస్మ ♦ యం బెలర్ప. ౭

తే॥ వృద్ధుఁ డయ్యుఁ గుమారత ♦ వెరవుసూపు
వాని మానవుఁ డయ్యు దే ♦ వత్వమహిమ
పేర్మిఁ దులకించువాని వి ♦ భీషణుండ
యయ్యు నభిరాముఁ డగువాని ♦ నందఁ గాంచి. ౮

—♦ జనక మంత్రులు దశరథునకు శుభలేఖనొసంగి వార్త లెఱింగించుట ♦—

ఉ॥ భద్రము నేను నే ననెడు ♦ పట్టుదల ల్గనుపట్టఁ దొల్త నా
భద్రముఖుండు మెచ్చఁగ శు ♦ భం బని పాత్రమహాదయార్ద్రని
ర్నిద్రుఁడు వాఁడు నేటుకొన ♦ శ్రీముఖ మంగళలేఖ భాగ్యసం
పద్రమణీయరేఖఁ గను ♦ భాతిఁ గనుంగొనఁ జేసి రద్రిజా; ౯

తే॥ మఱియుఁ గస్తురి కపురంబు ♦ మలయజంబు
మున్నుగాఁ గౌతుకపదార్థ ♦ ములు నమూల్య
ములు మహారత్నములు ♦ నూత్న ♦ ములు గరండ
మున వెలయ దానిఁ గానుకగా ♦ మొనయఁ జేసి. ౧౦

వ॥ వినయవినమితోత్తమాంగులరై నిలువంబడి యవధారు దేవరవారు చిత్తాను వర్తిని యగు సంపత్తి తోడం గుమారరత్నంబుల పెండిలికి మీ యిచ్చ మెచ్చిన సంగడీఁడును మిథిలేశ్వరుండు నగు జనకరాజేంద్రు మందిరంబునకుఁ జనుదేఱం బ్రార్థ్యమానుల రనవుడు నప్పురుషోత్తముండునుఁ బ్రసాదసుముఖుండై తగిన యర్హణాల నవ్వారల సంహృష్టాంతరంగులం గావించి యర్హాస్థానంబులం గూర్చుండ నియోగించి మంగళదేవతానుగ్రహలేఖ యనం దగు నమ్మంగళలేఖ నందుకొని మహాపద్మంబునుం బోని నిజాంజలిపుటంబున నిపుణంబుగ నునిచికొని కనుదమ్ములం బూజించి యానందాతిరేకంబున మించి కుమారాభ్యుదయానుమేయం బగు నిజ భాగధేయంబును ననన్యసామాన్యం బగు విదేహరాజ సౌజన్యంబును ననితరజనసులభం బగు కుశికతనయ కటాక్షవిక్షేపవిశేషలాభంబునుఁ బ్రశంసించి వేర్వేఱ నవ్వారల కుశలంబు లడిగి యక్కల్యాణపత్రికాకుసుమమంజరి మ్రోలనాడు సభాజనతావీక్షణమధుకరపాలికి శ్రుతిగమ్యసభాజనమనోహరంబుగ వింతసంతృప్తిం బచరింపం దలంచి యపారపారవశ్యంబున జనకరాజ భూమిక నలంకరించిన వాఁడపోలెఁ దదీయసముపేయవాచనికరసపూరప్రణాలిక చాలికకై వాచస్పత్యంబొప్పార సారస్వతనియోగం బుపయోగించి. ౧౧

—♦ శుభలేఖ ♦—

శుభము, శుభము, రవికులతిలక; శ్రీమన్మహారాజ; దశరథేంద్ర; మహేంద్ర సఖుండవు కలికామనిగ్రహదక్షుండవు విచక్షణుండవు నవు నీకు ముజ్జగంబుల వారును మ్రొక్కులిడుదు రన నాసమర్పించు నమోవాకం బంగీకృతం బగుట సాధారణం బయ్యు నయ్యది మాకు శ్రేయస్కరంబు యశస్కరంబునై యుండు నిత్యాభ్యుదయోపేతుని కుశలం బరయుటయు విధేయున కవశ్యావధేయంబు గాకుండదు గదా భవదాశీర్వాదభాజనంబుల మగు మాకు నిరంతరం బెల్లెడల ననామయం బవ్యాహతంబే యగు నింక నాపొనరించు విజ్ఞాపన మవధరింపుము.

శా॥ ఆయుష్మంతులు రామలక్ష్మణు లుపే ♦ యంబైన నీయాన గా
ధేయానుగ్రహపాత్రతన్ గ్రతుసమా ♦ ధివ్యాధులుం దీర్చి వి
ద్యాయోగంబునఁ బేర్చి యొక్కసతి శా ♦ పాంతంబు సంధించి ని
ధ్యేయం బంచు మదీయమిష్టము సమ ♦ ర్థింపన్ యశస్కాములై. ౧౩

క॥ సద్గురుఁ డమ్మునికోనిరా, మద్గేహము కోలముజగము ♦ మాంగలిక రమాం
చద్గృహములై వెలయ నజ, హద్గుణు లొక్కమరు లిచటి ♦ కరుదెంచుటయున్.

ఆ॥ భాగధేయ మిట్లు ♦ బహురూపధేయాప్తి, వఱలనోపు నంచు ♦ వారిఁ బ్రీతి
యొక్కరూప కాఁగ ♦ నొగి నుపచర్యలు, గూర్చి కూర్మిఁ గొసరి ♦ కొనుచు నుంటి.

క॥ శ్రుతిగోచరమూఁ గద నై, జతపఃఫల మిష్టిభూమి ♦ సంభవ సిరి మా
నిత సీత యనఁగ మత్సుత, మతిమతి రూపవతిఁ బెనుచు ♦ మార్గం బెల్లన్. ౧౬

ఉ॥ ఆయమ వీర్యశుల్క యన ♦ నయ్యెనుఁ దొల్తనె నిశ్చయంబు భ
ద్రాయితమూర్తి రాముఁ డటు ♦ తాపసవర్యనియుక్తి శైవ మ
త్యాయత మర్హణీయముశ ♦ రాసన మెక్కిడి చిక్కవాపె బో
ధాయిత తా వరించి కొనెఁ ♦ దామరసాక్షు దృగుత్పలంబులన్. ౧౭

వ॥ అట్లుంగావున నే నిందుఁ గార్యకర్త నందునేని నసంభావ్యసంభావనయునుఁ బ్రయో
జయిత నందునేని వృథాభిమానంబును హితోపదేష్ట నందునేని ధార్ష్ట్యంబు,
నుదాసీనుండ నందునేని ననాదరంబును నిజాదేశప్రార్థయిత నందునేని సోత్ప్రాసం
బును మున్నుగాఁదోఁచు నాయపరాధశతమ్ముల మన్నించి సకుటుంబ సపరివారం
బుగ మహావిభవాంచితుండవై శోభనసంవిధానవిధానంబు లాలయం దరలి
వచ్చి వైవాహిక లక్ష్మీసలక్షణ మాహాత్మ్యవానందం బభినందించి యమేయ
సంతృప్తి ననుబంధించి నన్ను నావారి నెల్లరం గృతార్థుల నొనరింప వేఁడుకొను
చున్నవాఁడఁ "చిత్తగింపు మిట్లని విన్నవించుకొను విధేయుండు, జనకనృపతి"—

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ. ౧౮

వ॥ అని విస్పష్టంబుగాఁ జదివి యాచదువరుల మేటి కుతూహలంబుతోడి హర్షపూరో
త్కర్షంబున నెడలేక పొడమిన మనోరథాంకురంబులకలిమి శాద్వలంబనందగు
మానసాంగణంబునఁ జిట్టాడు వివరణేచ్ఛలపేరి లేడిపిల్లలయుల్లాసంబులకుఁ దోడు
నీడలగు స్మేరకటాక్షస్ఫురణంబు లపేక్షించు సభాసదుల కపూర్వామోదం బాపా
దింపుచు నిట్లనియె. ౧౯

ఉ॥ వింటిరె సభ్యులార ; శుభ ♦ వృత్తము వేడుకమీఱ నెయ్యఁపుం
బంటవలంతికాఁపు గుణ ♦ బంధురుఁ డా మిథిలేశుఁ డన్న ము
క్కంటికిఁ గూర్చు సన్మహిమఁ ♦ గంటికి మింటికి నెక్కి యొక్కెడన్
గొంటనరాని కీర్తి మను ♦ కోవిదుఁ డాతఁడె ముజ్జగంబులన్. ౨౦

క॥ వైనయికం బలరారం, గా నౌపయికంబు పేర్మి ♦ కల్యాణపద
శ్రీనిహితార్థతయు నెగడఁ, దా నంపినలేఖ నను ము ♦ దంబునఁ దేల్చెన్. ౨౧

తే॥ ఆత్రయీదేవి తనపురు ♦ షావతార
మున మొనసినట్లు గాధినో ♦ ముల ఫలంబు
తపసి నాసుకృతము పిల్వఁ ♦ దారసిల్లి
యిల్లుసొచ్చిన నాఁడె మే ♦ లిల్లుసొచ్చె. ౨౨

సీ॥ మెలివెట్టు సందియ♦మ్ములఁ ద్రెంచి యెదనేల, మొలక లెత్తఁగఁజేయు♦లలితకళలఁ
జీడపీడల నట్లు ♦ చెడుతలంపులఁ ద్రోఁచి, పరువంబునకుఁ దెచ్చు ♦ భావలతలఁ
జెలివితేటల మోడ్పు♦దొలఁచి విప్పునఁ గూర్చు, మవ్వంబు గుణపుష్ప♦మంజరులకు
నారితీఱిన నుడి ♦ కారంపుఁదేనెల, రహి దార్చు బుధమధు ♦ వ్రతవితతుల
కైహికాముష్మికఫలంబు ♦ లంది యిచ్చు
నంద మానందమును నొక్కఁ ♦ డగుచు నిచ్చఁ
దవుల నివురొత్తు తృప్తికి ♦ దాపుకా పు
సిరికి సత్సంగ మన నోపు ♦ చేనికాఁపు. ౨౩

—♦ దశరథుండు వసిష్ఠునితో ప్రసంగించుట ♦—

క॥ తలమానికము తపసులకు, తలఁపుల మానికము దనకుఁ ♦ దా నానాఁ డీ
వలను గురుం జెఱిఁగింపక, వలగొనునే యిట్టిమేలు ♦ వారని పేర్మిన్. ౨౪

తే॥ తొలుత నిక్ష్వాకుకులవృక్ష ♦ దోహదప్ర
ణేత జడదారిరాయంచ ♦ ప్రీతి గాంచ
వలయుఁ దోడ్తెండు గురువర్యు ♦ మలయు నవక
మెలయు మానసతృప్తి ప్ర ♦ హేలికలకు. ౨౫

క॥ ఇదె ప్రియ మిదె మోదం బి, య్యదియె ప్రమోదంబు నిదియె ♦ యానందము ని
య్యదె బ్రహ్మానందము ని, య్యదనున నిది యది యనంగ ♦ నలపియె నార్తన్.

చ॥ అన విని మంత్రిముఖ్యులు ను ♦ హాత్మ; ప్రసాద మటంచుఁ దారె యొ
య్యనఁ జని మ్రొక్కి వేఁడుకొని ♦ యామునిముఖ్యునిఁ దోడితెచ్చి ర
య్యనఘుఁ డిలామహేంద్రవిహి ♦ తార్హణ లంది యలంకరించె బో
ధనవనవస్ఫురాసిత సు ♦ ధర్మ బృహస్పతి యట్టు లాసభన్. ౨౭

క॥ అంజలి దలఁగ నిటలఘటి, తాంజలియై రాము సేమ ♦ మట ధరణీభృ
త్కుంజరుఁడు వినిచి గురుఁ డెద, రంజిల లేఖ నిడి సురుచి ♦ రంబుగఁ బలికెన్.

శా॥ అన్నా; యిన్నిటి మేలు గూరె నిది నీ ♦ యాజ్ఞావిలాసంబె కా
కెన్నం గొండొకఁ డుండునే నొడువఁగా ♦ హేతూక్తి నాయయ్య పెం
పు న్నేర్మి న్వెలయించి తీ విటు లిఁక ♦ న్బోధింపు మీమేల్మి గ
న్నన్నం దన్మిథిలేశసంగడము శ ♦ స్తంబే కదా యన్నిటన్. ౨౯

క॥ నీయనుమతికి నిరీక్షం, జేయుచునున్నాఁడ నేమి ♦ సెల విత్తఱిఁ దా
నీయుత్తమవార్తకు మిథి, లాయిత మయ్యె మది నా న ♦ లరి ముని యనియెన్.

—♦ వసిష్ఠుండు మిథిలాప్రయాణంబున కనుజ్ఞ సేయుట ♦—

తే॥ శుభము, శుభము, మహారాజ; ♦ సూనృతంబ
కాదె నీమతలం పటు ♦ గాదె పలుకు
సర్వతస్సంగతంబు ప్ర ♦ శస్త మిదియ
లెమ్ము పయనమ్ము శోభన ♦ లీలఁ గూర్ప. ౩౧

క॥ తలకట్టు రాజనయవే, త్తల కట్టులు జనకుఁ డాత్మ ♦ తత్త్వజ్ఞుల కొఁ
గలఁడె యతని కతఁడే కా, కిల నొండొకరుండు సాటి ♦ హృద్యవిచారా. ౩౨

తే॥ తనదు సుకృతమొ క్ష్మాదేవి ♦ తత్పరతయొ
నీదు సౌజన్యసారమో ♦ నియతి రామ
దేవు సామ్రాజ్యలక్ష్మియో ♦ దేవయజన
భూత సీత యనఁ దదాత్మ ♦ జాత యయ్యె. 33

మ॥ కల వాలోచన లెన్నియేని నడుపం ♦ గల్యాణలీలాప్తివే
డ్కలకుం దానక యింకఁజెల్ల దిటు లు ♦ ద్గాతృప్రబంధంబు మే
ల్వల నొప్పం దగు నెల్లి రేపట మహా ♦ వ్యాహారసంబోధి మై
థిలు దర్శింపఁగఁ జాలె వేలయు గుణో ♦ దీర్ణస్ఫుర ద్వేలమై. ౩౪

ఉ॥ చుట్టలఁ బిల్వనంప శుభ ♦ సూనృత మెల్లెడఁ జాటఁ బంప మే
ల్పట్టులు సంస్కరింప నటు ♦ పత్తనలక్ష్మి నలంకరింప బ
లిట్టల నేర్పరించి చను ♦ దేఱఁగ వెంబడి యేగు దేఱఁగాఁ
గట్టులు గట్టిసేసి బలఁ ♦ గంబుల కాన యొనర్చు మిత్తఱిన్. ౩౫

క॥ అనిన గురుని యనుశాసన, మును వింటిరె సచివులార ; మునుకొని తద్వా
గనుబంధమునను మెలఁగుట, మనపని సుం డింతవట్టు ♦ మలయుఁడు వేడ్కన్.

ఉ॥ కూర్పుఁడు మేలివస్తువులు ♦ గోరిక లీరిక లెత్త సత్కృతు
ల్దార్పుఁడు పూజనీయులకు ♦ దైవతపూజలు దోడుగా స్మృతిం

జేర్పం డనీకిని న్వలను ♦ శ్రీ నలువారంగ నెల్లవారెదం
దేర్పెడు స్వస్వకృత్యముల ♦ తీర్పు ప్రకాశిల నేంట రేపటన్, 32

ఆ॥ కళలపెంపు మాట ♦ కారుల సొంపు నొ
య్యార్ల పొంపు గాయ ♦ కాళి యింపు
నింపం దలంపుం జెలమి ♦ నేడు వీనులు గన్ను
లొక్కమొగిన తృప్తి ♦ నొంద వలయు. 35

క॥ ధనరత్నాంబరగోవా, హనచయములు మఱియుం బెరప ♦ దార్థంబులు స్వం
దనములం గొల్లలుగా నిం, ప నగుం దరలింప నగు సు ♦ మాళి మ్మొలయన్.

క॥ నాయరదము రథ్యంబుల, శ్రీ మొప్పారంగం బూన్చి ♦ చెచ్చెర నేండే
యాయితము సేయ నగు జా, గీమెడ వలదనుచుం దెలుపుం ♦ డీ యెల్లరకున్.

క॥ రామునిం గొని చనునెడ వి, శ్వామిత్రగురుండు గూర్మి ♦ వఱలంగం జెలిపెన్
దామసము వలదు మేలగు, నేమమున మెలంగు టొకండ ♦ నీకగు ననుచున్.

సీ॥ కందునో, యేనాండు ♦ గనులపండువుగ నా, కల్యాణమూర్తి సిం ♦ గార మనుచు
విందునో, యేనాండు ♦ వీనులు దనియ నా, విద్యావినోది వా ♦ గ్విభవ మనుచుం
గొందునో, యేనాండు ♦ కోర్కులు దీర నా, చంద్రాస్యు స్మేరప్ర ♦ సాద మనుచు
నుందునో, యేనాండు♦హాయులు నెక్కొనంగ నా, కరుణాబ్ధి దృక్కలా♦కలన ననుచు
నరయు నది త్ర్యకటిరియొ షటి ♦ క్షటిరియొ కాని
పాయ కున్నది నామదిం ♦ బాదు కుదుర
నేంటి కమ్మంత్రిము ఫలించె ♦ నియతి సతనిం
గాంచి ముద మందుటే దీనం ♦ గల ఫలంబు. 40

—♦ దశరథుండు కొలువుకూటము చాలించి యంతిపురి కరుగుట ♦—

వ॥ అట్లుగావున నెల్లిప్రయాణంబు సునిశ్చితంబు వసిష్ఠవామదేవజాబాలి కాశ్యపమా ర్కండేయకాత్యాయను లీవివాహయజ్ఞంబున నాచే వరింపబడిన బుత్విగ్వరు లవ్వారలం దోలుదొ ల్త నరుంధతీపురంధ్రిపురస్కారపురస్సరంబుగా మనస్కా రంబు లొప్పారం దగిన భద్రియానప్రవరోద్దేశంబుల సన్నివేశం బొడగూర్చి కూర్చుకొని ప్రస్థానమంగళ సమాచారంబు నెరవేర్చునది యంగేశ్వరుండు మున్నుగాం గల బాంధవుల సందర్శించి యిమ్మేలివార్త ఘర్మితపఱప నర్హులగు వారిం బుత్తెంచి యవ్వారలనందఱ నమందానందుల శాంతాబుశ్యశృంగులం గూడం దోడ్కొని యనావిలంబుగ వైశంబ విచ్చేయుటకునుం దడయ నగుచో

నంతవట్టువారలెల్ల మిథిలానగరంబునం గలియ నేతెంచునట్లును సమయం బొన ర్చునది కొదవపడునన్నిసముచితసంస్కారంబులం బ్రవర్తిల్లుచుంటకుం బురదుర్గ రక్షణంబుల నప్రమత్తులరగుటకుం దగువారలనియోగించునది మఱియును సంత రింపం దగుసంతనల నన్నిటంజాగరూకులరై నాయభీప్సితార్థంబు సానుబంధం బొనరింతు రనుటనేఁడనేల యేనాఁడును మీయదియ కదా యని సుమంత్రి ప్రముఖప్రధానముఖ్యుల కెఱింగించి సముల్లసిత మానససారసులం గావించి యాచార్యవర్యునిం దక్కంగలజడదారియెకిమీండ్లను సబహుమానంబుగఁ బ్రార్థించి యామంత్రిణంబు సంధానించి జనకరాజమంత్రిప్రభృతులం దగిన చోటున విడియించి బహూకరించి కొలువుకూటంబు చాలించి యమ్మహీజాని తనయంతిపురికిం జనియె నంతకుమున్న యన్నెలవునఁ గోసలేంద్రుని కన్నెయుఁ గుమారాభ్యుదయంబును శుభకార్యప్రసంగంబును విని యెఱుకసేసిన పరిజనంబున కమూల్యాభరణాంబరంబు లొసంగి మన్ననలుసూపి సుమిత్రిమున్నగు తోడి చెల్లెండ్రతో నమందానందపారావారంబునం దనివోని ముచ్చటలం దేలుచున్న యవి హృదయేశ్వరునిరాకకు నుల్లసిల్లి యనర్ఘ్యంబులగు నర్ఘ్యాదిసపర్యావిశేషం బుల సవిశేషంబుగాఁ బన్నపఱచి సంతుష్టాంతరంగు నొదవించి కుశలప్రశంస సేసి స్వకీయమధురవాక్ప్రచారసమాచారంబునకై ముచ్చటపడుచున్నయంత నన్నారీ వతంసంబు తెఱం గుపలక్షించిదశరథుండు కౌతూహలాతిరేకంబున నిట్లనియె.

—♦ దశరథుండు కౌసల్యతో మేలి ముచ్చట లాడుట ♦—

క॥ వింటే చల్లనిపలుకులు, గంటే మది సమ్మదంబు ♦ కలిమిఫలము గై<br>
కొంటే గౌరవపరవై, నుంటే జగమెల్ల వీర ♦ మాత యనంగన్. ౨౨

మ॥ ముని ప్రేరేప దొసంగుల న్గెడపఁ దా ♦ మున్నాడి చన్నప్డు నా<br>
మన మెట్లున్ననుఁ గన్నకానుపు ధృతి ♦ న్మాఱుంపదా ; నాఁటికే<br>
మనినం దృష్టి ఘటిల్లఁబో దనుటయు ♦ న్సైయ్యంబ పో నేఁటిశో<br>
భనవార్తాఽమృత మంతరంగపరితా ♦ పం బార్పనే భావినీ. ౨౩

ఆ॥ రాచవారిబిడ్డ ♦ రాణింపఁ జెందుఁ గై<br>
సేసి ప్రోలఁ జెక్క ♦ చెదరకున్న<br>
నవలఁ గన్నవారి ♦ దఱె కా యదృష్టంబు<br>
మఱలి తొలుతమాద్రి ♦ మఱయఁ గనుట. ౨౪

వ॥ ఇంక మనోరథారూఢ ఫలసిద్ధివైభవప్రసాదంబున వర్ధిల్లు మనిన నద్దేవి స్మేరవదన యై యిట్లనియె. ౨౫

తే॥ ప్రాణనాయక ; సన్మాన ♦ వకులమునకుఁ
దిలకమై పుట్టి నీపట్టి ♦ తెరలి మరలి
కుసుమమంజరితోఁ గూడు ♦ గుఱి రసాల
సురుచి నా మది కెక్కె న ♦ శోక మయ్యె. ౪౯

క॥ మును వీరపత్ని యనఁగా, మనఁ గంటిని నేఁడు వీర ♦ మాత యనెడువా
క్కును వింటినిఁ బురుషోత్తము, నినుఁ గొలువ గొఱంత యగునె ♦ నెలఁతుక కొకటన్.

వ॥ అని యిట్లు ప్రసంగసామరస్యంబునం దేలుచు నాదంపతులు మాంగలిక ప్రస్థాన సమయసమావేశంబునఁ గులదైవతంబులం బూజించియు గ్రహశాంతులు సంతరించియుఁ బితృదేవతారాధనలు గావించియు దేవాయతనోత్సవాదు లమేయంబులుగా ననుసంధించియు నసంఖ్యాతంబులగు గోహిరణ్యాది మహాదానంబుల భూసురోత్తముల సంతృప్తి నొందించియు నుల్లసనంబు గొసరువారల కెల్ల విసువక పసదనంబు లొసంగ నెడఁబొదలుచు నెడలేక మనోరథసంతానకంబులు చివురొత్త సంతానశుభసంధాననిమిత్తవర్తనంబులం గ్రొత్తవార లనం బ్రవర్తిల్లుచుండిరంత. ౫౦

తే॥ అధిపునానతి కానతు ♦ లగుచు నెగుచు
నెగుభుజంబులు గల వార ♦ లెల్లఁ బల్ల
వించునుల్లంబు లభిరామ ♦ విలసనంబు
లంబుజంబులె యనెడు ని ♦ జంబు వెలయ. ౫౧

వ॥ అమాత్యవరేణ్యులుం దక్కువారును దమ యింట మేలుకొనిన మేలకా నెల్లెడల మేలనంబును మెలఁకువ మేలిమియుం జెలువార నయ్యాశాస్యంబు లన్నియు నొక్కసన్నన ముద్రాయంత్రణంబునం జెనుపారం గూర్చి యచ్చొత్తిన తెఱంగునఁ దెఱవుపఱచియుఁ జిత్తరువునం జేర్చి దిద్దితీర్చినతీరు మెఱయ మేలిరంగున మెఱుంగువెట్టియు నునుసానఁ బట్టిన విధంబునం గ్రొందళుకులొదవించియు నాటపాటల చర్లాటలకు బాసటగాఁ బెండిలిపనులెల్లఁ బ్రయాణమంగళసామగ్రీ సన్నాహంబులతో నిరుమూడునాళ్లకు సన్నద్ధంబులం బొనరించి యారాజశిఖామణి కెఱుకసేసి రందు. ౫౨

తే॥ వీటిరహి వింతయయ్యె నా ♦ నాఁటిసూటిఁ
గోటికోటులు మెఱుఁగులు ♦ గోట లెక్క
మాటిమాటికిఁ గళ లట్లు ♦ గోట మీటు
చోటుల యొయారముల తేట ♦ లోట గొనునె. ౫౩

మ॥ అలకాభిఖ్య రహించి యంబరముపై ♦ నంతంతగాన్పించి యి
మ్ముల నాభోగవతీత్వముంచి దివిష ♦ త్పూరర్చన గ్గాంచి భా
సిలు నెప్డుం బురి సత్యలోకసులభ ♦ శ్రీమించుఁ బో నాఁటిపూ
జలఁ గ్రొత్త ల్గనినాథు మన్ననల ని ♦ చ్చ ల్పొత్తు రబ్జాననల్. ౫౪

సీ॥ తలఁపుటూ ల్నెక్కొను♦తలమునా మణిభూమి, మించులు బయ లాక్ర ♦ మించి ప్రాఁక
మెలపుమేలిమి గూర్చు♦ పొలము నాఁ బైఁడిమే, డల వన్నె సిరులు గ♦ డల్గొనంగ
వలపుదీవియ లల్లు ♦ నెలవునా మేలిపూ, వుల పొద ల్తావుల ♦ వలనుసూప
సొలపుఁబైరుల పంట ♦ చోటునాఁ బణ్యవీ, థుల సకలార్థసి ♦ ద్ధులు రహింప
నాటపాటలు కళలుః స ♦ య్యాట లటుచొ
కాటఁపుంగలయిక లొప్పఁ ♦ గలిమి మీఱి
మిథల వియ్యఁపురా లని ♦ మెఱుఁగు లొలయు
రీతి వెలయించె నలరి సా ♦ కేతనగరి. ౫౫

మ॥ తళుకు ల్బెళ్కు లలంకృతు ల్కుతుకము ♦ ల్తాత్పర్యము ల్నెయ్యము
ల్గళ లొయ్యారము లారజంబులు లస ♦ ద్దానక్రమంబు ల్మహో
త్కలిక ల్కావ్యరసప్రసంగములు వా ♦ ద్యశ్రీసముల్లాసము
ల్వెలసె న్నాఁటికి నాఁడె వింతలుగ బా ♦ లి న్మెచ్చు ప్రోల్లచ్చికిన్. ౫౬

తే॥ ఏలి రాద్యులు దశరథుం ♦ డేలుచుండె
నేలఁబోయెడుఁ బో; రాముఁ ♦ డింకఁ గూర్మి
నింతలో నింత వేగిరం ♦ బేల ప్రోలు
పొలఁతి బాళికి వరుసవా ♦ వులునుఁ గలవె. ౫౭

క॥ పెండిలి వార్తకె తా నిటు, లుండం గలియునెడ నేమొ ♦ యువిదరొ; ధరణీ
మండలమండనకలనా, ఖండైశ్వర్యరమ మెలపు ♦ గని యెటు తగునో. ౫౮

తే॥ పవలు రేఁగూడునెడ సిరిఁ ♦ బ్రబలు నుపవ
నమ్ము వాసంతలక్ష్మిశ్రీ గొ ♦ నములఁ దనరుఁ
గలికి తేజవ్వనము రా ర ♦ కంబు మించు
నట్లు గదె వీటికలిమి మే ♦ లందుబలిమి. ౫౯

చ॥ కలుముల పంటచేను నెఱి ♦ కందువ నెయ్యఁపుఁబుట్టినిల్లు వే
డ్కల నవకంబు దోహదము ♦ కామకలాకలనంబు గాయకో
త్కలికల నాట్యశాల కవి ♦ కర్ణరసాయన మానె రాము పెం
డిలిపయిన మ్మయోధ్య కిడె ♦ కీవికిఁబై నొకరీవి భావినీ. ౬౦

క॥ పుర మెల్లఁ బచ్చతోరణ, లిరవొందెడు మేలిపూవు ♦ లెత్తులు లలితా
గురుధూపవాసనలు గ, ప్పురఁపునివాళులుఁ దలిర్పఁ ♦ బొలుపు వహించెన్.

ఉ॥ చెప్పినఁ జెప్పఁగా నగును ♦ జెల్వరొ; యింక నయోధ్యచెల్వ మ
ట్లొప్పెడుఁ గాదె మేలగు ప్ర ♦ యోజనఁపుంగుతుకంబున న్గళ
ల్సెప్పిన యంత రాజకుల ♦ శేఖరుఁ డందఱ గారవించి మే
ల్గుప్పలు గారె యంచు నుతి ♦ గూరఁ బ్రయాణము గోరుచుండఁగన్. ౬౨

తే॥ హితులు భాంధవు లతిసన్ని ♦ హితులు గొంద
ఱఖిలవైభవముల తోడ ♦ నరుగుదేఱ
వారిఁ దోడ్కొని చని తగు ♦ వసతు లందఁ
జేసి సత్కృతిఁ బ్రీతిల్లఁ ♦ జేయుచుండె. ౬౩

తే॥ అంగపతి శాంతయును ఋశ్య ♦ శృంగమునియు
విభవ మొప్పారఁ జనుదేఱ ♦ విభుఁడు ప్రీతి
నెదురుకొని కొనివచ్చి మా ♦ నీంద్రుభక్తి
దనరఁ బూజించి యొడ్డ మ ♦ స్ననలఁ దనిపి. ౬౪

క॥ ఇంతయు భవత్ప్రసాదం, బింతలు మేలొదవె నింక ♦ నెల్లి పయన మం
చాంతరతృప్తికిఁ దగునటు, మంతనమున నోడిపి వారి ♦ మదిఁ గరఁగించెన్. ౬౫

చ॥ అనఘులు వామదేవముఖు ♦ లౌ మునిముఖ్యులు గూడిరా సమ
ర్చన లెసఁగ న్వశిష్ఠయమి ♦ బ్రహ్మవిలాసము గాన నయ్యె ని
ట్లనఁగ నరుంధతీసహితుఁ ♦ డై కనుపట్టె మఱి న్మహాత్కృతం
బెనఁగొను కోర్కు లెల్లఁ బెద ♦ వింబడి శోభనవాక్కులై తగన్. ౬౬

ఆ॥ వారి కెరఁగి వేఁడె ♦ వసుమతీశుఁడు క్రొత్త, హాఱు కుతుక మెల్ల ♦ వారు మెచ్చ
వారు నట్టె రగుచు ♦ వర్ధిల్లఁజేసి రా, శీఃకలాసమృద్ధి ♦ సేర్చి చేర్చి. ౬౭

క॥ మంగళముహూర్తసమయం, బంగజనిభుఁ డరయఁ గని బ ♦ యలుదేఱఁగ ను
ప్పొంగుచు సెలవిడ సచివులు, సంగతముగ విభుని యాన ♦ చాటఁ బనిచిరన్.

సీ॥ సిరి గిలిగింత గే ♦ సరపజంబున గగు, ర్పాటు వాటిల మించు ♦ వారువములు
దానలక్ష్మీస్మయుక్తిఁ ♦ దతకరాదిస్విన్న, తాశోభితము లౌ మ ♦ దావళములు
జయరమాంచితకలా ♦ శ్రయత స్తంభాదికా, మందశోభనము లౌ ♦ స్యందనములు
వీరసంపత్సన్ని ♦ వేశపేశలసమ్మ, దాశ్రుసంగతు లౌ ప ♦ దాతితతులు

విభుని చతురంగసైన్యము ♦ ల్వెల్లివిరిసి
స్వీయ మహోత్సాహితకముఁ బెంపు ♦ సేయునవియు
సాత్త్వికశ్రీవిలాసంబు ♦ సామయికత
వెలయ రాముని పెండ్లికి ♦ వెడలె నపుడు. ౧౯

శా॥ సొమ్ముల్ దిద్దెడువారు ముద్దుమొగము ♦ ల్బూవుపట్టౌ నా కల్మి క
ద్దమ్ముల్ ల్బార్కొనఁ జేయువారు చెలులం ♦ దాత్పర్య మొప్పార రా
రమ్మా యం చనువారు పెట్టెలఁ బదా ♦ ర్థమ్ముల్ దగం బెట్టువా
రిమ్ముల్ గ్గావరు లంద భద్ర మనువా ♦ రిమ్మేటి సంభ్రమ్ముగన్. ౨౦

సీ॥ ఒయ్యారి గాని వచ్చు♦నోజఁ దాఁ దులకించు, రాము రాజస మెంచు♦రాణఁదవిలి
రాజమందిరలక్ష్మి ♦ రహి గాంచఁ దోఁ తెంచు, విందుల నెలయించు♦వేడ్క మిగిలి
పలుదెఱంగుల మేల్మి ♦ వాటించు పూరమఁ, బాయఁ జాలనిపేర్మి ♦ వలనుఁజిక్కి
విభునానఁ బనితీర్పు ♦వెరపునఁ గలకోఱం, తలఁ జక్కపఱచురీ ♦ తులఁ దలంచి
కొంద ఱుత్కంఠ బారి గ ♦ గ్గోలుపడర
కాని సర్వ మొకండు గాఁ ♦ గలిమి మీఱ
మిథిలతోఁ బో త్రైనసి కూర్మి ♦ మెలఁగఁ గోర్కె
లెగువ ఱెక్కలు గొదకొన ♦ నెగయ కన్నె. ౨౧

మ॥ కలుము ల్పుణ్యరసంబున న్దడిపి భా ♦ గ్యక్షాత్రస్థలిం జల్లినన్
మొలక ల్పైకొని వృద్ధి గాంచి కలికా ♦ మోదంబు చెన్నార స
త్ఫలసంప్రాప్తిఁ దనర్చెఁ బౌరశుభలి ♦ ప్సాసస్యముల్ రాము ల
క్ష్మణుల పేర న్దార పాల్గొనం గడమ ద ♦ క్కం గాబె యవ్వారికిన్. ౨౨

క॥ ఆభాగ్య మయోధ్యాజను, లే భాగప్రాప్తి నంది ♦ రింతియ చూ, త
త్సౌభాగ్యమునం దిడుభి, క్షాభాగము నొందు నొడ్ల ♦ సంపద లెల్లన్. 23

శా॥ సింగారంబున కాటపట్టులు నిజ ♦ శ్రీ ల్గొల్పి త్తతా వేషము
ప్రంగారం గనుపట్టుపోఁడుము లమూ ♦ ల్యప్రాంచదానందల
క్ష్మిం గై కొన్న విలాసము ల్పెనఁచుక ♦ ల్మి న్పుప్పురిం గాంచు మే
ల్బంగిం బొల్చిరి పౌరు లప్పయన మొ ♦ ప్పం గూడు నప్పట్టునన్. ౨౪

సీ॥ విన్న కన్నియ మేలి ♦ విధ మోలిఁగన నేమొ, కనులుపీనుల ఘొత్తు♦గాంచఁగనుట
కొన్న యూచెలి చెల్మి ♦ గుఱుతువెట్టఁగ నేమొ, తనువట్లు పులకల ♦కనువుపడుట
యున్న ముద్దియ జిగి♦నొగిఁ దీపరయనేమొ, రసన యువ్విళులూరు♦చెనఁబొరయుట
కన్న చేడియ ఠీవి ♦ కాన్క లందఁగనేమొ, మనముత త్సామ్రాజ్య♦మున మొనయుట

మన్న యాకొమ్మ తావులు ♦ మలయ నేమొ
ఘ్రాణ మెర వయ్యె నిన్నిటి ♦ గలసి కొనుట
యనఁగఁ బెండిలి వేడుక ♦ లలర వెడలి
రైదువలు పువ్వువిలుకాని ♦ కైదువులుగ. ౨౫

ఉ॥ చిప్పిలు పల్కుఁదేనియలు ♦ చిల్కుపెర ల్సునుకైతపానకం
బుప్పతిలంగఁ జేయు స్వర ♦ సోజ్జ్వలయంత్రము లాసరస్వతిం
జొప్పిలు భావపూరములు ♦ సూనృతదేవత లూర్జితు ల్కవుల్
చొప్పడు వందిమాగధులు ♦ చుట్టుకొన న్బొడసూపి రయ్యెడన్. ౨౬

క॥ పండితులు వాక్కలోదయ, మండితు లతిదేశయాప్య ♦ మానవిధేయా
ఖండలగురు లరుదెంచిరి, ఖండనఖండనులు శిష్య ♦ గణములు గొలువన్. ౨౭

క॥ వైణికు లత్తఱి నంత, ర్వాణులు నానన వినేయ ♦ వర్యులు వీణా
పాణు లయి కొలువఁ జేరిరి, వాణీలీలావిశేష ♦ వైభవ మెసఁగన్. ౨౮

మ॥ రసము ల్వృత్తులు గూడిమాడి విలస ♦ ద్రాగాంబుధిం దేల భా
వసముల్లాసము పొంగ సాత్త్వికరమా ♦ వ్యాపార మొప్పారఁ గై
వసమై తద్జ్ఞుల చిత్తభూమి మలయ ♦ న్వల్గుశ్రుతిం బాడి శా
రసికు ల్మంగళగాయకు ల్స్వరకలా ♦ రంభప్రియంభావుకుల్. ౨౯

క॥ అమ్మొయి మంగళతూర్యము, లెమ్మె లెసఁగ మ్రోసె నొకట♦ నిజె తఱి యని మో
ద మ్మొదవఁగఁ గూడిరి పయ, నమ్మున కగువారుఁ గనుఁగొ ♦ నం గల వారున్.

సీ॥ చంద్రాస్య యొకరిత♦చతుర పో; నగవువె, న్నెలఁ గందొవల కందు♦వలు ఘటింప
సుమవల్లరి యొకర్తు ♦ సురస పో; జిగి యిక్కు, వల మేలివలపుల ♦ వలపు లిడఁగ
నలివేణి యొక్కర్తు ♦ వలఁతి పో; యెలదోఁట, మేటతేనియబాటఁ ♦ బాట గూర్ప
సారసక్రమ యొర్తు ♦ జాణపో; కులుకుల, కూటువ ల్దగునాట ♦ నాటలాడ
ననుచు మినుకుల యారజ ♦ మ్మొనసి కూర్పు
నేర్పు దళుకొత్తఁ దమలోన ♦ నేర్పడంగఁ
బిలుతు రత్తఱి రాముని ♦ పెండ్లివేడ్క
వేల్పుసానుల నులికించు ♦ వెలవెలఁదులు. ౩౧

ఉ॥ వారునుఁ గూడి రింకఁ బెర ♦ వారునుఁజేరిరి కౌతుకంబు పెం
పారఁగ సర్వ మేకరస ♦ మై కనుపట్టెఁ బ్రయాణభేరికా

వారము మంగళధ్వనులు ♦ వల్లుగతి న్దనుపార మీఱు కా
సారవిహారమట్లు విక ♦ సత్కమలోల్లసనంబు గూరఁగన్. ౮౨

మ॥ అరదంబు ల్చతురంతయానములు వా ♦ హంబు ల్గజంబు ల్సమా
దరణీయు ల్గనిమెచ్చ నిల్పి యెదురం ♦ దత్తత్పదార్థౌఘ మా
సరణి న్వారులు దీరెబండ్లపయిఁ బ్రా ♦ సంగోన్నతశ్రీకల
ల్కర మొప్పార విచిత్రచిత్రఘటనా ♦ కల్పోపకల్పస్థితిన్. ౮౩

మ॥ ప్రకటశ్రీవరరత్నకోటులు సువ ♦ ర్ణంబు ల్మహార్హాంచితాం
శుకరాసు ల్సకలాఢ్యదీపకలికా ♦ స్థూణాసనార్చాదులా
సకలార్థంబులు శాకటాయనగతి ♦ న్సాల్పొంద శోభిల్లె నాఁ
టికి క్షోణీంద్రుని భాగ్యభోగ్యవనవా ♦ టీమంజరు ల్మంజులా. ౮౪

సీ॥ తమ యనురాగత ♦ త్త్వము లక్షింపవలపున, కుంకువ యనఁ జాలు ♦ కుంకుమములు
తమ సువర్ణస్ఫూర్తి ♦ దమకంబు గౌరిమా, ర్తికిఁ గూర్ప నేర్చుహ ♦ రిద్రకములు
తమ నిర్మలత పల్కు ♦ కోమ కీర్తి కొప్పున, కప్పు వ్రేలిడి చూపు ♦ కప్పురములు
తమ దానకలన నం ♦ దనశాఖితతికి మె, ల్పొంద బోధించెడు ♦ చందనములు

వలచు కస్తురి పునుఁగు జ ♦ వాది వట్టి
వేరులు కచోరకములు ప ♦ న్నీరుబుడ్లు
నత్తరువుపేటికలు వల ♦ నగు తెఱఁగుల
మంగళరమాప్తమూర్తు ల ♦ నంగఁ బెరసె. ౮౫

చ॥ ముగుదల పూపలేమొలక ♦ ముద్దుకుచంబుల నాఁగు పూగముల్
సొగసుమిటార్ల చెక్కులకుఁ ♦ జుట్టలు నాగలతాదలావలుల్
జిగిజవరాంద్ర నవ్వుల హ ♦ సించెడు ముత్తెఁపుసన్నసున్నముల్
తగఁబరికింతు రిమ్ములిడు ♦ తమ్ములఁపుంబరివర్గ మాద్యతుల్. ౮౬

క॥ యాచనకభాగ్యరేఖలు వాచంయమముఖ్యహర్ష ♦ వర్ధను లతను
శ్రీచాతురీచణలు సుక, లాచిక లొప్పారె నటు క ♦ లావతుల మొగిన్. ౮౭

క॥ అంతిపురివార లటఁ దగు, నంతలుగా బయలువెడలి ♦ రధిపతి యాజ్ఞన్
సంతసము వెల్లివిరియఁగ, నింతింతనరాని విభవ ♦ మెసక మెసంగన్. ౮౮

క॥ ఉపచారికాసహస్రం, బపరిమితోత్సాహకలన ♦ నరుదేఱఁగ న
ట్లుపకారికాసహస్రం, బుపయానశ్రీలఁబయన ♦ మొప్పఁగఁ దరలెన్. ౮౯

ఉ॥ పిన్నకుమారు లిర్వురును ♦ బెద్దటికం బలరార మేలిక
న్నన్నలఁ దేరులెక్కి మహి ♦ జానికి గన్నుల విందు సేసి రా
చిన్నె లెఱింగి నాగరులు ♦ శీఘ్రమె పెండ్లికొమారు లాదురీ
యన్నలు నంచు భావము బ ♦ యల్పడ వేడుకమాటలాడఁగన్. ౯౦

సీ॥ ఇనుమండలము చక్కిఁ ♦ దనరు నన్నెఱి మించు, తమ తేజుజన్మసం ♦ స్థను వచింప
గొంటుకాండ్ర చలంబు ♦ గొఱకొను శౌర్యంబు, బాడబశక్తివై ♦ భవము సూపఁ
గలువకంటుల చూడ్కి ♦ గముల విందులు ముఖ,కళలిందునలికిమం♦దులుఘటింప
మణిరత్నసంక్లృప్తి ♦ మకరకుండలదీప్తి, యజ్ఞభాగార్థిప ♦ దార్థ మొసఁగ
స్వాశ్వినేయకుమారన ♦ వావతార
గరిమ లొప్పార ముచ్చట ♦ గ్రమ్మ దేఱఁ
గొమరుగని తోడి పెండిలి ♦ కొమరు లనఁగ
భరతశత్రుఘ్ను లమరిరి ♦ పయనమునకు. ౯౧

మ॥ కళ లిమ్ముద్దుమొగమ్ముల న్వనదరే ♦ ఖల్కాకపక్షంబుల
స్నలలక్ష్మ్మ ల్నయనంబులన్ శుభగతు ♦ ల్యానావిశేషంబులన్
గలితానందవిభూతు లాంతరముల న్గైకో ల్గనె స్మేఁద నే
మెలనాగ ల్వారియింపఁ జూ పిడరు తా ♦ రీభంగిఁ జూపట్టఁగన్. ౯౨

క॥ అను శోభనలీలాయుత, మనువాదము పొసఁగ నెసఁగు ♦ నను మోదమునన్
జనపతిసుకృతవిశేషం, బన నందనయుగల మట్టు ♦ లలరారెఁ జెలీ. ౯౩

క॥ ఆదటఁ దగువారల మ, ర్యాదలు దనరారఁ దగిన ♦ యానములం గే
లూఁది యునిచి యనుమతిఁ గొని, యాదర మొప్పార నృపతి♦యరదం బెక్కెన్.

మ॥ తమత్యాగధ్వజ మాపతాక ♦ స్వయశో ♦ దామంబు శ్వేతాతప
త్రము వింజామర లాత్మధర్మములుగా ♦ రాజిల్ల రాగిల్లి శ్రీ
మమతం జొక్కెడు భూపతి న్మలయనొ ♦ మత్తేభవిక్రీడితం
బమరం దాన నరదంబుపైఁ దనరె నిం ♦ ద్రాప్తుం డతంద్రాళుతన్. ౯౪

సీ॥ అంగరాగంబు మె ♦ ఱుంగునిగ్గులు మేను, మైకొను వళులఁ గ ♦ న్మఱువుసేయ
మణికిరీటప్రభా ♦ మండలం బెడసాచ్చి, పలితంబు నెరసుల ♦ ప ట్టెడల్ప
స్వర్ణకుండలకలా ♦ సంధానసంపత్తి, వదనకాంతిస్ఫూర్తి ♦ వాడు దేర్ప
రంగారుహారంబట్టు ♦ రింగుల తళతళ, లవయువావళికి మా ♦ ర్దవము గూర్ప

రాజ్యభారంబు జరకు దొ ♦ రల్తు ననెడు
సంతసము సన్న గన్న వే ♦ సంపుబలిమి
నాక సంతానశుభదర్శ ♦ నప్రసక్తి
మాట కాన్పద్ధనృపతి కు ♦ మారుఁ డయ్యె. ౯౬

తే॥ నెలవు గావంగఁ దగువారి ♦ నిలిపి సైన్య
నాయకులు మంత్రిసత్తము ♦ ల్నలువు మిగుల
వెలయ వెన్నాని నిలిచి ర ♦ వ్విభుని చిత్త
మలర నాయెండ కవి నీడ ♦ లనఁ దనర్చి. ౯౭

—♦ దశరథుండు సపరివారుండై మిథిల కరుగుట ♦—

క॥ ఘనులు వశిష్ఠాదులు శా, కునములు పఠియింపఁ దోన ♦ కూర్చుశకునశో
భనములు గని యినుఁ డనుగుల, కనుతోషం బెలయ నడుప ♦ నానతి సేసెన్.

తే॥ సర్వతోభద్రసారప్ర ♦ చార మగుచు, నడిచెఁ బెండిలిబలఁగంబు ♦ నను పెలర్ప
నూరివారికి మిథిలలో ♦ నున్నవారి, కెపుడెపుడు గూడ వచ్చునం ♦ చెడఁద పొదల.

ఆ॥ మిథిల యెక్కు డగునొ ♦ మించునో సాకేత, మనఁగ రాదు కూర్మి ♦ ననఁగు వేళ
నొండొకొండ్ల మీఱు ♦ టుజ్జ్వలభంగి గా, కెచ్చు తగ్గు లొడ్ల ♦ కెఱుకపడునె.

చ॥ ఎడనెడఁ బేరెము ల్నడలు ♦ హెచ్చరిక ల్నుడివిప్పు లూఱట
ల్వడయనియాటపాటలు వి ♦ లాసఁపుఁ బోతరము ల్ప్రసంగముల్
విడుమర లేని యక్కఱలు ♦ వియ్యఁపు నెయ్యఁపుఁ బ్రోహ లొప్ప మే
ల్వడువునఁ ద్రోవ మెండుకొనె ♦ వావిరిఁ బెండిలివారి సైన్యముల్. ౧౦౧

క॥ చాయలు గలిగి గొనములం, బాయని పయ్యెరలు గొలువ ♦ ఫలపుష్పభర
శ్రీయుతలు లత లొలయ వని, కాయామవిహార మనఁ బ్ర ♦ యాణం బొప్పెన్.

తే॥ చలువపందిళ్లు తోరణ ♦ ల్కలవడములు
మున్నుగ నమర్చి కాన్కలు ♦ మొనయఁ జేసి
యెందటెందటో కనవత్తు ♦ రీశు నెలమి
మేలివిడిమట్లు లరయుచుఁ ♦ బాళెగాండ్రు. ౧౦౩

ఉ॥ చిక్కనిపాలు మీఁగడలు ♦ చేర్చిననాఁడెకరంప వాసన
ల్గ్రిక్కదలం దలిర్చు నవ ♦ కంబు ఘృతంబులు మేలిపెర్వులుం

జొక్కఁడు పానకంబులు వి ♦ శుద్ధపరీమళవస్తుపఙ్క్తులుం
జక్కఁగ నేర్చి తెత్తు రటు ♦ జానపదు ల్విభుఁగాంచు వేడుకన్. ౧౦౪

ఉ॥ కూడెడువారిమెచ్చు లటు ♦ గూడినవారలపోఁడుము ల్కళల్
ల్వీడనివారియొద్దికలు ♦ విందులుసేయనరేంద్రుభాగ్య మా
జాడ నయోధ్యదొట్టి ♦ కొని జాల్కొనె నామిథిలాపురంబుగా
వేడుకకేరికిన్ విలువ ♦ వేయుఁదరంబగునే ; తలోదరీ. ౧౦౫

తే॥ జనకునకు లోకజననియై ♦ సంగినట్టి, యాయదృష్టంబకాక మా ♦ ర్గాంతరమున
నారవికులీనుసేవించి ♦ నర్థిఁజెరయు, వచ్చువా రెల్ల వియ్యాల ♦ వారమైరి. ౧౦౬

క॥ ఎందరిగిన నటు విందుల, పొందులె కనవచ్చు మేలె ♦ పొసఁగు సుమాళం
బొందఁ బొనరుమన్నన ల, య్యిందుసహోదరి విలాస ♦ మిట్టిద కాదే. ౧౦౭

ఆ॥ వచ్చువారి గౌర ♦ వము పేర్మిఁగని చన
విచ్చి సేమ మరసి ♦ ముచ్చటించి
యనుచుచుండు నర్వ ♦ లగువారిఁ గొని ప్రయా
ణం బొనర్చు నోడయఁ ♦ డంబుజాక్షి. ౧౦౮

క॥ నాలుగు పయనంబులలో, నాలలి నాలలితుఁ డలరె ♦ నటుఁజని మిథిలా
లీలాయితమధురకలా, పాలీనాలీకనిలయ ♦ పసదము దోఁపన్. ౧౦౯

ఆ॥ మిథిలఁ గదిసి రట్లు ♦ మెయిమెయి మైవడి
గదిసె నదియు వలపు ♦ గడలుకొనఁగ
నల వసంతు బలఁగ ♦ మారామలక్ష్మియుఁ
గవియఁ జెరయు కొత్తు ♦ కంబునెఱయు. ౧౧౦

ఉ॥ ఇమ్మగు కమ్మతెమ్మెరల ♦ హెచ్చరిక ల్దమయంతఁ గూర్చు సూ
నమ్ముల మేళనమ్ములు గొ ♦ నమ్ములు సూపు మరాలకేకిభృం
గమ్ముల వాద్యలాస్యతత ♦ గానములుం గనుపట్టె నప్డు వి
య్యమ్మునవా రెదుర్కొనఁగ ♦ నమ్మెయిరాకకు సూచకమ్ములై. ౧౧౧

క॥ పెండిలిబలఁగ మనుత్తమ, మండనమై యొలయు మిథిల ♦ మవ్వమెసఁగఁ దా
నుండె శరదాగమంబున, నిండారెడు నంచపిండు నెఱిఁ ♦ గమలిని నాన్. ౧౧౨

తే॥ ఎంత యామ్మలమైన న ♦ య్యినకులీను
సేనఘాటికిఁ బురి మేలి ♦ సిరిఁ దలిర్చె

నొండు చలివెల్లును సహింప ♦ దుష్టమైన
మిత్రతేజం బెనసి తమ్మి ♦ మెఱయు నెపుడు. ౧౧౩

మ॥ కడలెల్లం దనరూపకా దశరథ ♦ క్ష్మానాథు సైన్యంబు ప్రే
ముడిఁ బైకొంటకుఁ బుచ్చుకీక యయి యి ♦ మ్ములొప్పంగఁ జెల్వొందు మై
నొడఁబాటు న్వెలయంగఁ జేసెఁ బురి తా ♦ నూహింప మున్నాడి చొ
ప్పడదో వాసకసజ్జికార్జవము సం ♦ ప్రాప్తోత్తమాలంకృతిన్. ౧౧౪

తే॥ వ్యూహపరిభోగమునఁ జాల ♦ నొత్తువడియు
నొరయు గుర్తుల యొఱపున ♦ నొప్పె మిథిల
కన్నెతత్పూర్వసంసర్గ ♦ ఘటనఁ జెక్కు
చెదరియుఁ దదేకమండన ♦ శ్రీ వెలయదె. ౧౧౫

మ॥ దివి కెక్కం గమకించు తేరులు గిరు ♦ ల్ద్రిప్పంగ నూహించి హ
స్తవిలాసం బొలయించు హస్తివితతు ♦ ల్సప్తాశ్వరథ్యంబులం
గవియం బాదము లెత్తి పైఁగను తురం ♦ గమ్ము ల్దెసల్గ్రమ్ము సా
దివితానంబులుఁ ద్రోపుచూప వెటు సా ♦ ధీయ స్త్వ మొప్పారెనన్. ౧౧౬

క॥ పెండిలివారే తెంచిరి, పండె నోములను పలుకు ♦ బడు లెల్లెడలన్
నిండె సుధాంశూదయమున, మెండగు మున్నీటి తెరల ♦ మేలి యులివులన్.

—♦ జనకుండు దశరథు నెదుర్కొని పూజించుట ♦—

మ॥ తొలుదొల్తం దనవారు వచ్చి తెలుపం ♦ దోడ్తోన యవ్వారివా
రలు గన్పట్టఁ గడంగి వాద్యరమణల్ ♦ రాణింప వెన్వెంట ది
క్కులఁ గ్రొందళ్కులుఁ బ్రాఁక నాపయిఁ గలా ♦ కోటీసమాటీకనో
జ్జ్వలసంబంధిబలప్రచార మెలయన్ ♦ సంతోషితస్వాంతుఁడై. ౧౧౮

సీ॥ కప్రఁపుంబొడులు బా♦గాలు తమ్ములఁపుటా, కులు ముత్తియఁపుసున్న♦ములు లవంగ
ములు జాజికాయలు ♦ మున్నగు శోభన, పరికరమ్ములు మేలి ♦ పచ్చడములు
పల్లాంబట్టుసాలు ల ♦ ట్లొఱపైనసొమ్ములు, రతనము ల్మొదవు ల్తు ♦ రంగమంబు
లాము లేనుఁగుగున్న ♦ లరదంబులును నర్థి, మైఁ గొంచు బాంధవు ♦ ల్మలసిరాఁగ
మాంగలికగీతవాద్యక్ర ♦ మంబు లొలయ
నలశతానందముఖ్యుల ♦ యనుమతమునఁ
గలుసుకొని యమ్మహీంద్రుఁ డై ♦ థిలుఁ జెలర్చు
పూజలఁ దలిర్పఁ జేసె నం ♦ భోరుహాక్షి. ౧౧౯

క॥ ఆనాఁడు మత్పురస్కృతు, శ్రీనాథాంచితు విరించి ♦ శ్రీమంతుఁడు చి
ద్భానుఁడు త్వజ్జనకుఁడు స, న్మానించిన యత్తెఱంగు ♦ మానిత మయ్యెన్. ౧౨౦

తే॥ ఉబ్బి వలగొని యిదెమహా ♦ యోగ మని మ
దీయసుకృతంబు ఫలితంబు ♦ దీవి యిదియ
యని యనన్యసులభ్యంబ ♦ యని వశిష్ఠ
ముఖ్యుల నమస్యలఁ గరంచె ♦ మోదకలిక. ౧౨౧

మ॥ చన వర్ధింపుచు ముచ్చట ల్నెఱపుచు ♦ న్సౌహిత్యము న్గొల్పుచున్
ఘనమర్యాదలఁ గూర్చుచు న్సభకృతు ♦ ల్గానప్రబంధాళు ల
ల్లనఁ దోడ్తో మలయింపుచు న్బహువిధో ♦ ల్లాస్యంబులం దేల్చుచు
న్గొనివచ్చె న్బురిలోని కమ్మహిమహేం ♦ దు్రి న్బారిబర్హాంచితున్. ౧౨౨

—♦ జనకుండు పెండ్లివారిం దగువిడుదుల విడియించుట ♦—

సీ॥ రతనాలకల లక్క ♦ రములుగా హరిదశ్వ, వంశకథాంశము ♦ ల్వ్రాఱఁ జేసి
కీర్తిప్రతాపము ♦ ల్గీర్తించు పాంచాలి, కావిశేషముల చా ♦ క్కట మమర్చి
యుడిగఁపు న్నెఱనేర్మి ♦ నోటలేక చరించు, మంచి జంత్రఁపుబొమ్మ ♦ సంచు వార్చి
జయజయపదయుక్తి ♦ చాతురి నలరించు, మేలిపతాకిక ♦ ల్గీలుకొలిపి
వింత పనిమెచ్చులను వైజ ♦ యంతమునకు
నోహటింపని దని మది ♦ నూహ వెనిచి
కూర్చి యునిచిన ప్రాసాద ♦ కూట మార
ఘూద్వహమ్మృగేంద్రునకు నిడె ♦ నొడయఁ డగజ. ౧౨౩

క॥ అల తబిసి నెలలు సామం, తులు మంత్రులు విభునిఁ గదిసి ♦ తోడ్తో నిలనా
వలనున కనుకూలంబుగ, నెలవ్రులు ఘటియించి యునిచె ♦ నిమికులుఁ డెలమిన్.

మ॥ బలఁగంబు ల్విడియింపఁ బంచి వసతు ♦ ల్వాటించి సంభారము
ల్వల నొప్ప న్మలయంగఁ జేసి మధురా ♦ లాపంబు లొప్పార మం
త్రులుఁ దా నొక్కఁడు గాఁ బరామరికమైఁ ♦ దోడ్తోఁ బ్రవర్తింపుచు
న్గలి సంబంధుల చిత్తము ల్గొనె ననూ ♦ నప్రేమవిత్తంబునన్. ౧౨౪

క॥ ఒక్కొకనికి నొక్కొకఁడుగ, లెక్కకు సరిపోలు నట్లు ♦ లెంకల నిడి యే
దిక్కున నేమన్ననలకుఁ, దక్కువపడనీక మెలఁగెఁ ♦ దాత్పర్యమునన్. ౧౨౫

క॥ అంతటి శుభోదయంబున, సంతమసము జాడఁ జనని ♦ సంతస మొఱపొ
వింత పరవసంబున నొ, క్కింత మఱపు గూర్చు టుచిత ♦ మే యగు మగువా.

క॥ మొనయింతు సమావేశ, మ్మున సుఖనిర్వేశము పర ♦ ము విచారింపన్
గొనములగని యద్దానం, గొనకొను జనినఫలతాను ♦ కూల్యపరతయున్. ౧౨౮

క॥ కౌశికగౌతమసుతులు ప్ర, కాశముసేయ రవికులుఁడు ♦ కైమోడ్చిడె వా
రాశీర్వదించి రెలమి మ, హాశయుఁ డెలయించె వారి ♦ నభ్యర్హణలన్. ౧౨౯

తే॥ వారును వశిష్ఠముఖ్యుల ♦ గారవమునఁ
గాంచి యాచారమర్యాదఁ ♦ గలిపి కొనిరి
శోభనోద్యమముల వెంట ♦ సొరగి విభుఁడు
విడిదిమట్టున చదురున ♦ వెలయునంత. ౧౩౦

—♦ రామలక్ష్మణులు తండ్రిని సందర్శింప వచ్చుట ♦—

క॥ ముద్దులమూటలు బీరఁపుఁ, బద్దులు సింగారఁపుంగ ♦ వలపుట్టులు శ్రీ
యొద్దికలు రామలక్ష్మణు, లద్దిర; యనఁ దండ్రిఁ గొలువ ♦ నరుదెంచి రటన్.

ఆ॥ అర్హణీయు లనుచు ♦ స్వాచార్యముఖ్యుల
నరసి ప్రమొక్కి రాముఁ ♦ డనుజుఁ గూడి
వఱలు పరవసమున ♦ వారు దీవించి రం
శ్లలయు వలను కలిమి ♦ చెలిమి దెలుప. ౧౩౨

క॥ కరచరణాద్యవయవములు, సురుచిరములు సోఁకఁ బుడమి ♦ సొక్కఁ బెరసియు
వ్వరలక్షణుండు తండ్రి క, విరలఁప్రభక్తి మెయి నెఱఁగె ♦ వేడుక లూరన్. ౧౩౩

శా॥ అమ్మౌనం దులకించు క్రొందళుకు ల ♦ య్యామోద మమ్మార్దవం
బిమ్ము ల్సోఁక స్మరించె సో మొదలి సౌ ♦ హిత్యంబె యీనాఁటి మే
ల్గ్రిమ్ము ల్సీతనో పృథ్వి గంధవతియై ♦ రాగిల్లి శోభిల్లె నా
యెమ్మెల్ గన్గొన నేర్చువారి కగుఁబో ♦ హేలామహేలామయీ. ౧౩౪

క॥ పదఁపడి వినయము బహుసం, పదలు పొదలు మేలిపైరు ♦ పంట పొలము నా
నదనున ముదమిడ మదిమది, ముదల యగుచు నిలిచెఁ దోడు ♦ మొనకొననంతన్.

సీ॥ మొనయు సింగారంబు ♦ మోహనరూపంబు, యశముకాఁదులకించు ♦ హాసరుచియు
నటు ప్రసాదము మన్కి ♦ నలరు ముద్దులమోము, నెనరుసంపదలమే ♦ ల్గొనెడుచూపు
లనురాగలక్ష్మిస్త్రనె ♦ య్యము దెల్పు నెమ్మోవి, విద్యావిలాసంబు ♦ వెరవు పెంపు
బలునేటి తేజమ్ము ♦ బలఁగమ్ము క్రొమ్మించు, శోభనస్ఫురణలు ♦ సూపు హొయలు

నొక్కఁడుగ మధురము లెల్ల ♦ నొలయ రామ
నామమున దైవ మమ్మహీ ♦ నాథు కనుల
కింత యనరాని సంతృప్తి ♦ సంతరింప
నాయితముసేసె మేలి ర ♦ సాయనంబు. ౧౩౬

క॥ అయ్యెడ లక్ష్యంబునఁ గల, తియ్యఁదనము లక్షకంబు ♦ తీ రయ్యు భయం
బియ్యకొలుపఁ జాలిన సిరి, నెయ్యము వినుతింప నలువ ♦ నెలఁతకుఁ దరమే;

శా॥ మున్నే రాముని గాంచి యొడ్లఁ గన నా ♦ మోదింప వమ్మేటి మే
ల్గన్నుందమ్ములు తమ్మియింటినవలా ♦ కైకోలునం బోలు నా
యన్నుం గన్గొని చొక్కున న్మలయుచో ♦ హాయిం గనం బూను నా
సన్నాహం బెటు మాను నట్టిఁ డగుచి ♦ త్తం బన్యఁథాయత్తమే. ౧౩౮

మ॥ మనమో భాగ్యమొ హర్షమో శుభమొ స ♦ న్మానమ్మొ వాత్సల్యమో
తనుఁ బ్రేరేపఁ గవుంగిలించె నృపుఁ డా ♦ తత్త్వంబు వాఁ డన్యులుం
గనఁగాఁ బోల రెఱుంగునేమొ పులక ♦ ల్కల్యాణపుం బాష్పముల్
దనర న్మేకొను పారవశ్య మొకఁడే ♦ తా లో వెలిం జాటెడిన్. ౧౩౯

తే॥ అభ్యుదయము విజయము క ♦ ల్యాణవిభవ
మొక్కొకండును రససాగ ♦ రోర్జితములు
రాముపరిరంభమునఁ గల ♦ రసము రసము
కన్నతండ్రికి విదిత మ ♦ క్కాలమునను. ౧౪౦

సీ॥ పనిఁబూని స్వరసవా ♦ హినిఁ బడ్డ యవ్వానిఁ, దెలివిమై దరిఁజేరఁ ♦ దివియఁ జాలి
యానందభరమున ♦ నట్టిట్టు లగు మది, కాన ముప్పతిల వె ♦ న్నాని నిలిచి
వృత్తిలేకొదిఁగి ని ♦ వ్వెఱపాటు గను చూడ్కి, కంజనం బయి లక్ష్మిస్త ♦ నందఁ జేసి
జడ నొప్ప నేమెప్పుఁ ♦ బడయని యొడలికి, సాత్త్వికశ్రీవిలా ♦ సంబు దార్చి
యాయదృష్టంబె యెల్లెడ ♦ నరయఁ దాన
యగుచు మహిజాని కల్ల ర ♦ సాయనమునఁ
గూర్చె నెడలేని సంతృప్తి ♦ గొఱలఁగ నజ
రామరత్వంబు చుట్టం బ ♦ నామయంబు. ౧౪౧

—♦ దశరథుండు కొమారులఁ గౌఁగిటంబొదివి యుపలాలించుట ♦—

క॥ తెప్పిటిలి యెలమి ధృతి నెత్తి, ముప్పిరికొన రాము మోము ♦ మోమున నొకఁడా
చొప్పునఁ గలిపి పరవసం, బుప్పతిలం బలికె రవికు ♦ లోద్భవుఁ డంతన్. ౧౪౨

ఉ॥ కంటిని మేలిమేలు నెఱేఁ ♦ గంటి జయప్రసవంబు కీరితిం
గంటి మహాప్రభావము వి ♦ కాసము జోడుగఁ దమ్ముకుట్టితో
గంటి యొకింత లేని యెస ♦ కంబున నేఁటికి డాయ వచ్చి నా
కంటికి లక్ష్యమై వెలయఁ ♦ గా నగుభాగ్యము గాంచి నంతటన్. ౧౮౩

క॥ నీ ముద్దుమోము జిగి సిరు, లీమెయిఁ గన నయ్యెఁ గొంత ♦ యెడసేసియు నా
నోములు ఫలింపఁగా వి, శ్వామిత్రాయితుఁడు విధి శు ♦ భమ్ములు వెనుపన్.

క॥ రామాదృక్కువలనిశా, రామా ; మారీచముఖవి ♦ రామా ; ప్రేమశ్రీ
రామా ; శ్రితజనకల్పా, రామా ; జగదేకశాభి ♦ రామా ; రామా ; ౧౮౫

ఆ॥ అనుచు నుబ్బి యాడి ♦ యన్మెయి లక్ష్మణుఁ
గదియఁ జేర్చి యన్న ; ♦ కంటె యన్న
కుడిభుజంబ వగుచుఁ ♦ గూరిమి నెరపంగ
నని కడంగి కుశిక ♦ తనయుఁ గాంచి. ౧౮౬

క॥ నాయన్న ; గాధినందన ;, నా యన్వయ మెల్లఁ బావ ♦ నము సేయన కా
కాయుద్యమమున వచ్చితె, మాయురె, భవదభిజనాభి ♦ మానం బసదే. ౧౮౭

ఉ॥ నేర్చితి వక్కట ల్నెఱప ♦ నేర్చితి పాపవనౌఘు మెల్లఁ బో
కార్చు తెఱంగు, నీ నెనరు ♦ ఖ్యాతికిఁ గాపరి గాఁగ నిట్లు న
న్నర్చితుఁ జేయు పొంబెఁ గన ♦ నైతివి నాఁడును నేఁడు సర్వలో
కార్చిత నీప్రయత్నమున ♦ కజ్జయుఁ గల్గునె ముజ్జగంబులన్. ౧౮౮

క॥ కులగురుని పలన నెఱిఁగితిఁ, గలకార్యము మర్మ మెల్లఁ ♦ గాదన నెటు నా
కులగురుఁడ వీవు నటు లా, కులపా టెడలంగఁ జేసి ♦ కూర్చితి శుభముల్. ౧౮౯

ఆ॥ అనినఁ గుశికతనయుఁ ♦ డన్న ; నీసౌజన్య, మసదృశంబ యొక్కఁ ♦ డనఁగ నేల
గొనము లెల్ల నీక ♦ కూర్చు దానికిఁ దగు, ఫలము గంటి భద్ర ♦ కలన మంటి.

క॥ పావనుఁడు గురువరుఁడు స, ద్భావనఁ బెనుపొందఁ జేయ ♦ భాసిల్లితి వి
ట్లీవలనువార లుండిరె, నీవలన జగము మనెడు ♦ నెఱిఁ గనె ననఘా. ౧౯౦

చ॥ అని యరుసంబున న్బ్రిదలు ♦ న త్తఱిఁ దానును ముత్తరంగితం
బననగు చిత్త మొప్ప మిథి ♦ లాధిపుఁ డల్లనఁ జేరి యాదరం
బినుమడిగాఁగఁ గోసలమ ♦ హీశ్వరు నెయ్యము గోరి వియ్యఁపుం
జనవునఁ గూరి సద్గుణవి ♦ శాలత చక్కటి మీఱ నిట్లనున్. ౧౯౧

క॥ వచ్చితె యర్మిలిమైఁ గన, నిచ్చితె చన విట్లు వెలయ ♦ నెలయుమనమునన్
హెచ్చితె మద్బాంధవ్యము, మెచ్చితె యోప్రియవయస్య ; మిహిరకులమణీ.

ఆ॥ పెద్దఱికము గంటి ♦ పెనువున గొనములఁ, బెద్దవైతి వసము ♦ పెరిమ మంటి
మనిచి తెల్లవారి ♦ మంటికి మింటికి, నొకఁడ దొర యనంగ ♦ నోజ మెఱసి.

క॥ ఈనాఁటివాఁడనే నే, నీ నెనరునఁ గాదె యింత ♦ నెగడితి నిఁక నే
యానతి నెటు పొనరించెదొ, నానీయెడ నంతరంబు ♦ నా నొకఁడున్నే. ౧౫౫

ఆ॥ అనిన దాత్రధీన ♦ మహా దాన మేము ప్ర, తిగ్రహీతలము వి ♦ ధిప్రసాద
మిదియె గుణనిధీ ; త్వ ♦ దిష్టంబు వెంట మె, లంగువార మిందు ♦ లాఁతి గలఁడె.

చ॥ అన విని కోసలేశ్వరుని ♦ యప్పటి వియ్యఁపుఁ దియ్య మెంచిన
జ్జనసుత మర్థసంగతము ♦ సత్యము ధర్మ్యముఁ గాఁగఁ బల్కె- నీ
జనవిభుఁ డద్దిరా , సుకృత ♦ సంభృత మియ్యది యంచుఁ బొంగె
నజ్జనకమహీంద్రుఁ డప్పటిప్ర ♦ సంగ మభీష్టసుసంగతంబుగన్. ౧౫౭

సీ॥ ఒండొండ్ల నెనసిన యోజ ♦ మర్యాదల, కనువుగా మునులు హ ♦ ర్షాబ్ధిఁ బొదల
సుతుల మహామహా♦స్సుభగాకృతులరఘూ,ద్వహుఁడొందిరసపార♦వశ్యమొలయ
మంత్రిపుంగవులు స ♦ న్మాన్యులు బాంధవు,ల్చుట్టఱికము మేల్మిఁ♦జొక్కఁగాంచ
ననయంబు నయయుక్తి ♦ నర్చన ల్నెఱపుచు, జనకుండు నిజభాగ్య♦మనుగణింప

వెలసె నానాఁడు విభవంబు ♦ వేయునోళ్లు
గలుగు నాతండె పివరింపఁ ♦ గాఁ గలండు
నాఁగ నాగౌరవంబున ♦ ననుచు వేడ్క
నూని శయనించి రానిశ ♦ నొలసి జనులు. ౧౫౮

ఉ॥ జన్మము కృత్యము ల్నెఱపు ♦ సంయమ మర్థము ధర్మమున్ సుసం
పన్నములం బొనర్పఁ దన ♦ బాట నొకించుక దాఁట కమ్మహా
భ్యున్నతిఁ గాంచి మైథిలుఁ డ ♦ నూద్యమపద్య నలంకరించుచున్
సన్నుత నన్నిశం గడపి ♦ సంభృతకల్యకృతిప్రసన్నుఁడై. ౧౫౯

ఆ॥ మునుల తోడి గోష్ఠి ♦ మొనసి శతానందుఁ, దన పురోహితప్ర ♦ ధానుఁ గాంచి
ధార్మికాగ్రగణ్యుఁ ♦ దమ్ముఁ గుశధ్వజుఁ, దోడితేఱఁ బనుపు ♦ మీఁడితముగ.

క॥ నా తోడివాఁడ యీసం, ప్రీతిఁ బెరయ నిక్షుమతి ద ♦ రిన్ సాంకాశ్యా
ఖ్యాత పురి నేలు నేర్పరి, యాతఁడు పుష్పకవిమాన ♦ మైంద్రమ పోలెన్. ౧౬౧

క॥ మద్యజ్ఞగోప్త గురుసం, పద్యుక్తుఁడు వాఁడు రాఁ బ్ర ♦ పన్నతఁ గర్త
వ్యోద్యమము వెంట మెలఁగెద, సద్యస్సంభృతకలాప్ర ♦ సక్తి వొసంగన్. ౧౬౨

ఆ॥ అనిన వల్లె యనుచు ♦ నాతనిఁ దోడ్తెఱ, ననిచె మునివరేణ్యుఁ ♦ డర్హులైన
వారి వారితాఘు ♦ వర్తనుఁ డింద్రాజ్ఞ, నాయుపేంద్రు నట్టు ♦ లరుగుదెంచె ౧౬౩

క॥ అన్నకు గురునకు మ్రొక్కె శు, భోన్నతుఁడు ప్రసక్తి వెలయ ♦ నొగి సభ్యసమ
ర్చ న్నెఱపె నెల్లవారును, మన్ననసేసి రితఁ డఖిల ♦ మాన్యుఁ డటంచున్. ౧౬౪

ఆ॥ తగు శుభాసనమునఁ ♦ దదనుజ్ఞ నెలకొనె, నంత స్వాంతమైన ♦ మంతనమున
హార్దమున సుదామ ♦ నాభిఖ్యు సన్మంత్రిఁ, గాంచి యిట్టులనియె ♦ క్ష్మావిభుండు.

క॥ గురుమర్యాదలతో నీ, వరిగి మహాతేజు నర్య ♦ మాన్వయలక్ష్మీ
కరు సగురు సుతామాత్య స, పరివారుం దోడితెమ్ము ♦ ప్రతిభ దలిర్పన్. ౧౬౬

తే॥ అనుడు వాఁ డుపకార్య క ♦ ట్లరిగి రఘుకు
లోద్వహుం గాంచి సంతోష ♦ మొలయ నిన్ను
దేవ; కొనితేఁ బనిచె వై ♦ దేహనృపతి
ససుతసుహృదు నుపాధ్యాయ ♦ సహితుఁ గాఁగ. ౧౬౭

క॥ అని మంత్రిశ్రేష్ఠుం డటు, లనుపమఫణితి మెయిఁ బిలువ ♦ నారాజేంద్రుం
డనుపద మలంకరించెను, జనితోత్సాహమున నట్లు ♦ చని యాగోష్ఠిన్. ౧౬౮

క॥ ఆ రెండయులరతన ముపా, ధ్యాయముఖులతోడ నట్లు ♦ దనరి విదేహ
శ్రేయస్కరు నృపుఁ గనుఁగొని, శ్రీయుతుఁ డిట్లనియెఁ బలుకు ♦ చెలువారంగన్

ఆ॥ ఎల్ల నీ వెఱుంగు ♦ దిక్ష్వాకుకులదైవ, తము వశిష్ఠమౌని ♦ తనరుమదిని
మేలు గూర్చునెడల ♦ మెయికొని పలుకు ఁే, మాన వలని వార ♦ మై మెలఁగుట.

ఆ॥ గురుఁడు మునులతోడఁ ♦ గూడి విశ్వామిత్ర
గురునిఁ గూర్చుకొనియుఁ ♦ గూర్చు నిచట
నెట్లు పలుకు నటులె ♦ యేము వర్తింతుము
నీకు నదియ పొసఁగు ♦ నిమికులీన. ౧౭౧

క॥ అని మిన్నకుండె నాసభ, ననుపమసంప్రజ్ఞుఁ డధిపుఁ ♦ డామునివరుఁడుం
జనకవిభుని సపురోహితుఁ, గని వాక్యజ్ఞుండు పలికెఁ ♦ గౌతుక మొప్పన్. ౧౭౨

సీ॥ బ్రహ్మాయవ్యక్తప్ర♦భవుఁడు శాశ్వతుఁ డయి,నిత్యుఁ డవ్యయుఁడునా♦నెగడుచుండు
బరఁగె మరీచి యా ♦ ప్రభున కమ్మునికిఁ గా,శ్యపుఁ డాతనికి వివ♦స్వంతుఁడొదవె

ఘనుఁడు వైవస్వత♦ మను వమ్మహామహు,వలనఁ దోఁచెనుఁ బ్రజా♦పతియునతఁడె
తొల్లి దా నిక్ష్వాకు ♦ దొడరించి యామను, వతని నయోధ్యాధి ♦ పతినొనర్చె
కుక్షి యామహిజానికి ♦ కొడుకు వాని
కయ్యె సుతుఁడు వికుక్షి త ♦ దాత్మభవుఁడు
బాణుఁడు ప్రతాపఖని యావి ♦ భానురుఁ డన
రణ్యుఁ గనె నావిభుఁడు పృథు ♦ గణ్యుఁ గాంచె. ౧౭౩

వ॥ పృథుని వలనఁ ద్రిశంకుండును వానికి దుందుమారుండు నయ్యువనాశ్వునకు మాంధాతయు నాపృథివీపతికి శ్రీమంతుండగు సుసంధియు సుసంధికి ధ్రువసంధియుఁ బ్రసేనజిత్తు నను నిరువురు కొమారు లందు ధ్రువసంధికి సద్గుణయశోభరితుండగు భరతుం డుదయించె నయ్యభిజాతున కసితుం డాత్మజాతుం డయ్యె.

ఆ॥ అసితుఁ డవని నేలు ♦ నంత సమంతత
శ్శత్రుసమితి సమితి ♦ సంతతయుగఁ
బోరఁ దొడరె నతనిఁ ♦ బొరసి యవ్వాఁ డోర్చెఁ
గొంతవఱకు బలిమిఁ ♦ గొఱఁతపడక. ౧౭౪

తే॥ హైహయులు తాలజంఘులు ♦ నత్యుదగ్రు
లైన శశిబిందులును నొక్క ♦ డయి కడంగి
యసితునిఁ బ్రవాసితు నొనర్చి ♦ రధికు లగుచు
దైవబల మోజఁ దమ యిచ్చ ♦ దారి మెలఁగ. ౧౭౫

తే॥ ప్రబలుఁ డాతం డబలుఁ డల్ప ♦ బలుఁడు నగుచుఁ
జేరె హిమవన్నగం బల ♦ క్ష్మీకుఁ డనక
తోడివా రయి మంత్రులుఁ ♦ దొడరి రాఁగ
నిరువు రబలలఁ గొంచు ధా ♦ త్రీశ్వరుండు. ౧౭౬

క॥ అస్ర మొలుకుకనుల భృగు, ప్రస్రవణంబున వసించెఁ ♦ బృథివీదయితుం
డుస్రము లెడలఁగ మిహిరుఁడు, ఘస్రము వీడ్కొని ప్రదోష ♦ గతిఁ గాంచె ననన్.

తే॥ అతని భార్యలు గర్భిణు ♦ లై తనర్చి
రం దొకతె కొండొకతె సగ ♦ రాన్న మొసఁగె
ననఘుఁ డరుదెంచెఁ జ్యవనుఁ డ ♦ త్యాదరమున
మహితసానువు హిమసాను ♦ మంత మెనయ. ౧౭౮

క॥ ఆభార్గవున కెఱఁగి కొమ, స్వాభాగ్యం బెఱుకసేయ ♦ యమివరుఁడు సమ
జ్ఞాభాసితుఁ డిట్లనె సు, శ్రీ భావుని యోగదృష్టిఁ ♦ జెనయఁగ నగుటన్. ౧౮౦

సీ॥ ఓమహాభాగ , నీ ♦ యుదరంబులో నున్న, సుతుఁ డక్షరుండు సు ♦ శ్లోకుఁ డతఁడు
జనియించు గరయుక్తి ♦ సగరుండు నా నొప్పు, పేరునఁ బేరునుఁ♦ బెనుపుఁ గాంచు
నమితబలుండు మ ♦ హావీర్యుఁ డతితేజుఁ, డవ్వాఁడు పొడమి మీ♦యఘు మడంచు
నేలు భూమండలం ♦ బేకాతపత్రంబు, గా నబ్ధి గొనఁగు సా ♦ గరసమాఖ్య
వంశమునకు వన్నె ♦ వాసియుఁ గలిగించు, సుప్రతిష్ఠితుండ ♦ చూవె యింక
నడల వలవ దబల ♦ యచిరంబ మేలొందు, దనిన భక్తి నమ్మ ♦ హాత్ము గొలిచి.

క॥ నారీమణి వర్తిల్లఁగ, నారీతిం బొడమెఁ దనయుఁ ♦ డానగరుఁడు సు
శ్రీ రాణింపఁగ నెగడుచు, ధారుణిఁ బాలించెఁ గలిత ♦ ధామనిధియ కాన్.

వ॥ ఆసగర చక్రవర్తి కసమంజుం డారాజన్యున కంశుమంతుం డాశ్రీమంతునకు దిలీపుఁ డాశతక్రతుకలాకలాపునకు భగీరథుండు భాగీరథీప్రణేతయైన యామహారథునకుఁ గకుత్స్థుం డయ్యుత్తమపదస్థునకు రఘు వాలఘూకృతమఘువునకుఁ బ్రవృద్ధతేజుం డగు పురుషాదకుం డాకల్మాషపాదునకు శంఖణుం డా సింహప్రేంఖణునకు సుదర్శనుం డాశుభదర్శనున కగ్నివర్ణుం డాసుపర్ణవేగునకు శీఘ్రగుఁ డానరవ్యాఘ్రునకు మరు వామరున్నిభునకుఁ బ్రశుశ్రుకుం డాసుశ్రీవున కంబరీషుం డాజితశంబరజేషునకు నహుషుం డాసత్పురుషునకు యయాతి యాశివతాలికి నాభాగుఁ డామహాభాగున కజుం డాసుప్రజునకు దశరథుండునుఁ బొడమి నెగడి రాయతిరథశ్రేష్ఠుం డీసుగుణగరిష్ఠులగు రామలక్ష్మణుల సలక్షణులం గనం గాంచె. ౧౮౩

ఆ॥ ఆదివంశశుద్ధు ♦ లధికృతు ల్ధర్మాత్ము, లలఘుబలులు సూనృ ♦ తాఢ్యులైన
యినకులీను లంద ♦ నీదృశు ల్వేరికి, సుతల నొసఁగి మేలి ♦ సుకృతి వగుము.

క॥ అని పలుకు మునికి జనకుం, డనుపమునకు మొక్కి యిట్లు ♦ లనె భద్రము నీ
కనఘ ; తపోధన ; మత్కుల, మునుఁ బరివర్తితముఁ దెలుప♦ మొనగొనువాఁడన్.

ఆ॥ మునివరా ; ప్రదాన ♦ మునఁ గులజాతుచేఁ
గుల మశేష మెఱుక ♦ గూర్ప వలయు
నదియ కాన వినుతు ♦ నదియు నారసి యర్హ
మైన దాని నెన్న ♦ నగుదు వీవ. ౧౮౬

క॥ ముజ్జగముల నెగడొందె జ, గజ్జేత సుధర్మపరుఁడు ♦ ఘనసత్త్వుఁ డితం
డజ్జా యనుచు సుజను లే, పజ్జనుఁ బొగడంగ నిమి ప్ర ♦ భావమహితుఁడై.

క॥ ఆ రాజర్షి సుతుఁడు మిథి, యారాధితుఁ డతఁడు మిథిల ♦ యని తన పేరన్
శ్రీరాజఁ దనరు నిప్పురి, ధీరాగ్రేసరుఁడు నిర్మి ♦ తిం బొనరించెన్.

ఆ॥ ప్రథమజనకుఁ డనఁగఁ ♦ బరఁగునావిభువల్ల, నావహిల్లె ఘనుఁ డు ♦ దావసుండు
వాని కొడవె నంది ♦ వర్ధనుం డావంశ, వర్ధనుఁడు సుకేతు ♦ వఱలఁ జేసె.

వ॥ ధర్మానపేతుం డగు సుకేతునకు దేవరాతుం డారాజర్షివర్యునకు మహాప్రథన ధుర్యుం డగు బృహద్రథుం డాయతిరథశ్రేష్ఠునకు శూరప్రతాపోదారుం డగు మహావీరుం డాధీరలోకాధారునకు ధృతిమంతుం డగు సుధృతియు నాసత్యవిక్రమునకు నాసత్యప్రతీతుం డగు దృష్టకేతుం డాసుధార్మికునకు రసోర్మిమాలి యగు హర్యశ్వుం డాహర్యశ్వకల్పునకుఁ మరువ య్యాశ్రితకల్పతరువునకుఁ బ్రతింధకుం డాప్రతిభటేంధనజ్వలనునకుఁ గీర్తిరథుం డాసురథునకు దేవమీఢుం డాధర్మరూఢునకు విబుధుం డాసుబోధునకు మహీధ్రకుం డామహీమహీధ్రవిపక్షునకు మహాబలవిఖ్యాతుం డగు కీర్తిరాతుం డాత్రిజగన్నుతునకు మహారోమ ప్రభుం డయ్యుమాప్రభుప్రతిభునకు స్వర్ణరోమరాజేంద్రుండు ధర్మజ్ఞుండు సుస మజ్ఞుండు మహాత్ముండు నగు నారాజచంద్రున కిరువుర మేము సుతుల మం దేను జ్యేష్ఠుండ దనుజారిసన్నిభుండగు నీతండు మదనుజుండు కుశధ్వజుండు. ౧౯౦

సీ॥ నను రాజ్యపీఠంబు ♦ నను నిల్పి మాతండ్రి, తమ్ముని మత్పరతంత్రుఁ జేసి
వనవాసము నొనర్చి ♦ వాసవకల్పుండు, దివి కేగ వృద్ధుం డు ♦ దీర్ణుఁడు నగు
గురుని యానతిఁ గొని ♦ కూర్చుసోదరు వీనిఁ, గడుఁ బేర్మి నెకొన్న ♦ గాంచుచుంటిఁ
గొంతకాలమునకుఁ గుచ్చితమున మహా, వీర్యుండు సాంకాశ్య ♦ విభుఁడు గిట్టి
మిథిలఁ జుట్టి విడిసి ♦ మేకొని యల సుధన్వుండు వార్త నెఱపెఁ ♦ బోర నొదొ
శివశరాసనంబు ♦ సీతతోఁ దన కిచ్చి, తలఁగఁ దలఁతొ యనుచు ♦ ధార్ష్ట్యమొప్ప.

క॥ ఇచ్చుట ధర్మువు గాదన, నచ్చపలుం డడరి తొడరి ♦ యాలంబున మ
మ్మిచ్చమెయి వేపఁ జొచ్చెను, సచ్చరితము వీడి పాప ♦ సంరంభుండై. ౧౯౨

ఆ॥ అంత ధర్మదేవ ♦ తానుగ్రహము తన్నుఁ, బ్రబలుఁ జేయ వానిఁ ♦ బ్రథనమున నె
దిర్చి పొడవడంచి ♦ తేఁకువఁ దద్రాజ్య, మితని కొసఁగినాఁడ ♦ నెలమి దొనఁక.

ఆ॥ మదభిషిక్తుఁ డగుచు ♦ మద మోహమానదం, భముల పొరువుఁ గనని ♦ మానసమున
నేలుచున్నవాఁడ ♦ సీదృశుం డీతఁడు, పిన్నవాఁడు నేను ♦ పెద్దవాఁడ. ౧౯౪

క॥ రామునకు సీత నొసఁగెద, నోమునివర యిచ్చువాఁడ ♦ నూర్మిళ నటులే
శ్రీమహిత లక్ష్మణునకుఁ గొని, సామయికానందసంప్ర ♦ సాదన మెసఁగన్. ౧౯౫

క॥ ఈ రాజచంద్రు కోడం, డ్రే రామామణులు వీర ♦ లిరువురు సుగుణో
దారు లగు నీకుమారుల, కారూఢి నొసంగినాఁడ ♦ నరయుదు ప్రీతిన్. ౧౯౬

క॥ అని యెల్లరు విన మునితో, నని యినకులమణిని గాంచి ♦ యమరును భద్రం
బనఘ; శుభకృత్యముల వెంటను మెలఁగఁగ వేడ్కమైఁ గ♦డంగుము పొసఁగన్.

ఆ॥ నేఁడు మఘయు కాఁగ ♦ నెగడు నుత్తరఫల్గు, నీవిశిష్ట తిథి శు ♦ భావధాన
గాన నెల్లి పితృవి ♦ ధానము ల్నెఱపు మావల మెలంగ నగు వి♦వాహకృతుల.

చ॥ అన విని కోసలేశ్వరుఁడు ♦ హర్షఝరిం దెరలాడుచుండ స
ద్వినుతు వసిష్ఠుఁ గూర్చుకొని ♦ ధీరవరేణ్యుఁడు కౌశికుండు మే
లని తన కౌశలంబు వెను ♦ పార విదేహజనేశుతోడ ని
ట్లనెఁ గుశలప్రసాదకల ♦ నాంచితహార్దవివర్తమూర్తియై. ౧౯౯

—♦ విశ్వామిత్రుండు జనకునితో సంబంధవిశేషముం గూర్చి ప్రసంగించుట ♦—

ఆ॥ మిథిలరేఁడ; యప్ర ♦ మేయంబు లచింత్య, ములును నాఁగ నెగడె ♦ మొదటనుండి
యీవిదేహకులము ♦ లిక్ష్వాకుసంతతుల్, వీరి బోలువాఁడు ♦ విపుల లేఁడు.

ఆ॥ ధర్మసంబంధ మటురూప ♦ సంపదయును
సదృశ మీయుభయమునకు ♦ సంగతంబ
యయ్యె నియ్యెడ దశరథా ♦ ధ్యక్షు సుతుల
కిరువురకు నీసుతలఁ గూర్చు ♦ టేర్పడంగ. ౨౦౦

ఉ॥ ద్వైవికమా శుభం బెనసి ♦ దారి మెలంగుటకన్న మిన్నయా
భావముఁ బంటితుండు ప్రతి ♦ భాప్రతిపత్తి మెలంచి కాంచు నీ
త్రోవయు నట్టిఁడే యయినఁ ♦ దోఁచిన మే ల్వివరింపఁ బోలు ని
ట్లీవిధి యెల్లవారికి స ♦ మీహితమై యెలరారుఁ గావునన్. ౨౦౨

క॥ అర్థించెద మేమది నీ, యర్థము జగదేకమంగ ♦ ళార్థము శ్రుతవా
గర్థముగ దానిఁ గూర్పస, మర్థుఁడ వీ వెల్లగతుల ♦ నతులచరిత్రా. ౨౦౩

క॥ తొలి నీచేసిన ప్రతినం, గలితశ్రీ లక్ష్మి సీత ♦ గాదిలికన్నై
వెలయిడఁగ రాని విభవము, గల రామున కొసఁగఁ ♦ గాంచి కాంచితి శుభముల్.

మ॥ మిలదానందరసోర్మి సద్గుణ సము ♦ న్మీలద్యశోజ్యోత్స్న నూ
ర్మిల సౌమిత్రి కొసంగి తౌరసిఁగుమా ♦ రిం గూర్మిమై నీదు గా

దిలిసోదర్యుని బాలికామణుల శ్రీ ♦ దీవ్యత్కలాశ్రేణుల
న్గలి రామానుజలక్ష్మణానుజుల క ♦ న్యా; యర్థి నర్పింపుమా ౨౦౫

తే॥ వెలయు నూర్మిల లక్ష్మణుఁ ♦ గలిసి భరతు
నెనసి మాండవి తనరారు ♦ నెలయుఁ గీర్తి
రూఢి మన శ్రుతకీర్తి శ ♦ త్రుఘ్నుఁ బెరసి
కలిమి మహిజాతఁ బోలఁగాఁ ♦ గలరు తారు. ౨౦౬

క॥ జగదేకవీరు లంచితు, లగణితగుణరత్నరాసు ♦ లాగమచయపా
రగులు వసిష్ఠవినేయులు, నగు నీకొమరులకు సాటి ♦ యవనిం గలరే. ౨౦౭

ఆ॥ రూపయౌవనప్ర ♦ రూఢులు లోకపా, లోపములు మహోమ ♦ హోజ్జ్వలాంగు
లాదిదేవవిక్ర ♦ మాఢ్యు లిట్లగు వీరి, బాంధవము కృతార్థ ♦ భావ మొసఁగు.

తే॥ కోరి యీరఘుసింహాకి ♦ శోరములకు, దారలై త్వత్కుమారిక ♦ ల్దారసిల్లి
చారుశీలతఁ దగ నిర్వి ♦ చారుఁడవు ను, దారుఁడవునై మెలంగుము ♦ ధీరవర్య.

క॥ అక్కయుఁ జెల్లెండ్రును నొకట, నెక్కొను విభవములఁ జెలఁగు ♦ నెఱి గని విని నీ
నిక్కపుఁ దపము ఫలమున, నక్కాలము ధృతిసమృద్ధి ♦ నందెదవనఘా. ౨౧౦

ఉ॥ సీత యయోనిజాత కద ♦ శ్రీమతి యూర్మిల యాత్మజాత త్వ
ద్భ్రాతృసుతామణీయుగి వి ♦ భక్తకలోదయవేలఁ గూర్ప నో
నాతత మంచితాభ్యుదయ ♦ మబ్బె సుమిత్ర కొమాళ్ల కొప్పుఁ ద
ద్భ్రాతల భిన్నమాతృకత ♦ తా సమకూర్చెను యోగ మిమ్మెయిన్. ౨౧౧

క॥ అని యమ్మునిభాస్కరు మో, మున వాక్స్ఫురణంబు దోఁప ♦ మొనసె వికసనం
బనుపదమె చదురుకొలనున, కనె విధిజని మౌనిహంస ♦ మాదటఁ బ్రీతిన్.

ఆ॥ పొనరఁ దెలిపె గాధి ♦ తనయుఁ డిమ్మెయి మేల్మి
గాంచు మయ్యు ముజ్జ ♦ గములు వొగడ
హితమ యెల్లరకు వి ♦ హితమ యౌ నిది మేలు
బంతి వైతి శుద్ధ ♦ భావమునను. ౨౧౩

—♦ జనకుం డనుజపుత్రికల భరతశత్రుఘ్నుల కొసంగ నిశ్చయించుట ♦—

క॥ అనునంతనె జనకమహీం, ద్రున కాతనిసోదరునకుఁ ♦ దోడ్తోఁ బొడక
ట్టిన బోధేందూదయుల, క్షీణ నమందానందమును స ♦ ఖీ వినుతింతుక . ౨౧౪

శా॥ బ్రహ్మానందవిలాస మిమ్మొలఁకువ ♦ న్బ్రత్యక్ష మయ్యె న్బళీ
బ్రహ్మర్షిప్రవరు ల్మహాత్ము లిటు సం ♦ బంధాపదేశంబునన్
బ్రహ్మద్వ్యంబు జగంబు మెల్మి గన మ ♦ త్ప్రాక్పుణ్య సంతానకా
జిహ్మశ్రీకఫలోదయం బెసఁగ నా ♦ శీర్వాదము ల్గూర్పఁగన్. ౨౧౫

మ॥ కరుణాపూరము చిత్ప్రచారము మిల ♦ త్కల్యాణలక్ష్మీప్రసా
దరసాసారము హర్షసారము వృష ♦ ద్రాఘిష్ఠసంస్కారమో
యరుదేఱం జను మానులార భవదీ ♦ యాత్మానుసంధానపుం
గరిమ న్నన్నుఁ గొలంబుతోడ గురుదీ ♦ క్ష న్ధన్యునిం జేయఁగన్. ౨౧౬

మ॥ కృతకృత్యుం బొనరింప మేలికృతికిం ♦ గీల్కొల్పి యాజ్ఞాపుర
స్కృతుఁ గావించితి రార్యులార ; యిదె నే ♦ శిష్యుండ మీభావనా
స్థితి కెడ్డేయది తోఁచు నట్లు గఱపన్ ♦ జింతింపుఁ డింకం బదా
శ్రితు న న్బజ్జ్కరఘు న్గటాక్షరచనా ♦ శ్రీఁ గాంచుఁ డొక్కండుగన్. ౨౧౭

క॥ పలుబాములుపడి జెజే, లలజడివాపంగ మెలఁగ ♦ నై యేనాఁడే
వలనున నింక శుభోదయ, మెలయునొకో యనుచు నుంటి ♦ నిమ్మెయి మంటిన్

ఆ॥ వేయునేల యింక ♦ మీయుపదేశంబు, కలిమి కేను మేను ♦ గాన్క గాఁగ
నిచ్చినాడ మీఁద ♦ నేపనుల్గాన మీకు, వలయు నట్లు పోలు ♦ వలను పఱప.

తే॥ నాయదృష్టంబ కాదె యీ ♦ నాఁటి కిట్టు
లిమ్మహాత్మునితో వియ్య ♦ మెనయఁ గనుట
రాఘవాన్వయయోగాప్తి ♦ రాణఁ దనరె
నిమికులము పావనంబయి ♦ నెగడఁ గాంచి. ౨౨౦

క॥ అని పలికి దశరథునిఁ గనుఁ, గొని యింతకుఁ ద్వత్కటాక్ష ♦ గోచరమై నేఁ
బనుపడు నెల్లశుభంబులు, నెనయఁగ దరిఁ జేరఁ గంటి ♦ నినకులతిలకా. ౨౨౧

క॥ అనుకూలంబై ధర్మం, బనుభూతం బయ్యె నింక ♦ ననుమానము లే
దనితరము ఫలము గంటిని, జనిసాఫల్యమున కొండు ♦ జతన వలయునే. ౨౨౨

క॥ భగదేవతాక యుత్తర, యగు ఫల్గుని యెల్లశుభము ♦ లందఁగఁ జేయం
దగినయది పెండిలికి స, ర్వగుణాంచిత ముదయ మెల్లి ♦ రాణఁ బొసంగున్.

ఆ॥ అవధరింపు మధిప ♦ యర్థిమై సుగుణావ, లంబముగ ఁసత్క ♦ లాసమృద్ధి
మలయఁ ద్వత్కుమార ♦ మణుల మత్కన్యకా, మణుల నొగి శ్రుతక్ర ♦ మమునఁ గూర్తు.

క॥ నలువురి పాణిగ్రహణము, నలువురు సేయుదురు గాత ♦ నలువున మీ మా
కలిమికిఁ గాపులు లోకము, కలిమికిఁ బ్రాపులును గా వి ♦ కాసము పేర్మిన్.

ఆ॥ ప్రోది సేయు దేవ ♦ తాదికారాధన, ల్మున్ను గాఁగ నెరపి ♦ మొనయఁ జూడ
మెదురు చూచు చుండు ♦ మేము నట్లమ్మెయి, విధుల వెంట మెలఁగి ♦ వేడ్క లాలయ

క॥ అని పలుకు జనకు పలుకుల, కలరుచు మునిమండలము త ♦ థా స్తనె సభ్యు
ల్నెల వరసి పొగడి రమరులు, విలసిల్లిరి మేలు తమకు ♦ వెలసె నటంచున్.

—♦ దశరథుం డానందపారావారంబున నోలలాడుట ♦—

తే॥ కల మనోరథపఙ్క్తి లో ♦ క్కఁడుగఁ బెరయు
వలనుకలనల కలరారి ♦ పఙ్క్తిరథుఁడు
మేలుమే లని యుప్పొంగి ♦ మెప్పు గదురఁ
బలికె హర్షాబ్ధితరఁగల ♦ యులివు లెలయ. ౨౨౭

మ॥ కడలిం దోఁచిన నాఁటి లక్ష్మి చతురా ♦ కారంబుల న్నీదువం
గడఁపుం బాల్కడలిం గడంగి వెలయం ♦ గాఁ గాంచు నాచొప్పు చో
ప్పడఁ గాన్పించిన కన్యకామణుల స ♦ ద్భావ్యంబు మద్భాగ్య మే
ర్పడఁ గోడండ్రుగఁ గూర్చి కూర్చితె సుమి ♦ త్రా; మిత్రవాత్సల్యమున్.

ఆ॥ ఇంత మేలు సేసి ♦ తీర్వరఁ బురుడించి, తనముఁ బెనిచి తరుస ♦ మధిక మమ్మ్యో
నిమ్ముఁ బొగడ నేల ♦ నీభాగ్య మననేల, నా యదృష్టరేఖ ♦ నయము సూప.

క॥ ధర్మ మిరుమేనులం దన, ధర్మము వెలయింప నన్న ♦ దమ్ములరై యా
నిర్మలత నెరపఁ గంటిరి, మర్మము లే దొండు నాదు ♦ మాటల వరుసన్. ౨౩౦

మ॥ ఇదె సత్కృత్యము లాచరింతు మిటపై ♦ నేతెంతు మాశాస్యసం
పద లొప్పారఁగ నెల్లి మద్గురులు నే ♦ మంబు ల్గటాక్షించి చూ
ప దరస్మేరముఖాబ్జ ముల్లసితకా ♦ వ్యశ్రీక మానందయో
గదయామిత్రిము భద్రిమండపము జా ♦ గ్రిద్భద్రిముం జేరఁగన్. ౨౩౨

క॥ అని యసదృశ మగు నది యిదె, యనఁ దగు నుడి నోడివి కోస ♦ లాధీశుఁడు తా
ననుమతి సేయఁగ మిథిలా, జనపతి పనివిని యొఁ జదురు ♦ చాలించి యటన్. ౨౩౩

తే॥ తా నతని వీడుకొని ధృతి ♦ దశరథేంద్రుఁ
డింద్రు నోజఁ దనరఁ దన్మ ♦ నీంద్రయుగపు
రస్కృతి తలిర్పఁగ సహస్క ♦ రప్రభాఢ్యు
డగుచు విడిమట్టునకుఁ జేరె ♦ నగకుమారి. ౨౩౪

—♦ దశరథుం డాభ్యుదయికంబు లొనర్చుట ♦—

క॥ నిలయ మెనసి శ్రాద్ధాదిక, మలఘుఁడు రఘువరుఁ డొనర్చె ♦ నానాఁడు విని
ర్మలుఁడై మఱునాఁటి యుదయ, మొలసి శుభాశంస లెలయ ♦ నుల్లాసమునన్.

శా॥ గోదానాఖ్యవిధిప్రకాశమున నా ♦ గోరాజమిత్రుండు దా
గోదానంబులు భూమిదానములు ప్ర ♦ గ్భ్యాపానువర్ణాంబర
శ్రీదానంబులుఁ జేసెఁ గొల్లలుగ న ♦ ద్విశ్రేణికిం బ్రీతి న్వ
ర్యాభదేవోత్తము లెల్ల మేల్బళి యన ♦ న్బుత్రాభివృద్ధ్యర్థమై. ౨౩౬

తే॥ నాల్గు లక్షల గోవుల ♦ ననుచు వాని
స్వర్ణశృంగల వత్సప్ర ♦ సక్తల వర
కాంస్యదోహనలను భూమి ♦ కాంతుఁ డొసఁగె
ద్విజుల కొండొంట సంప్రీతి ♦ వెలయ నపుడు. ౨౩౭

తే॥ బహువిధ మ్మగు విత్తమ్ము ♦ పంచి యిచ్చెఁ
బుడమివేల్పుల కమ్మేటి ♦ పొసఁగు ప్రీతి
ననుచు గోదానకృతిలక్ష్య ♦ మునను బు
త్రవత్సలుఁడు పుత్రహితకామ్య ♦ వఱలుచుండ. ౨౩౮

క॥ కృతగోదానసుతవరీ, వృతుఁడై భాసిల్లె నృపతి ♦ వృతదిక్పాలుం
డతులితవిభవుండు జగ, త్పతి భాషాపతియు నాఁగఁ ♦ బరఁగుచు సుధృతిన్.

—♦ యుధాజిత్తు దశరథుం జేరవచ్చుట ♦—

క॥ ఆసమయంబున సంతస, మాన మెయిన్ మెయికొనంగ ♦ నదె నేనను న
ట్లాసంజితుఁ డమ్యేనుఁ జి, ద్భాసురుఁ డొక బాంధవుండు ♦ పఱతెంచి వడిన్.

ఉ॥ కేకయరాట్సుతుం డతఁడు ♦ కీర్తివిశేషవిభాసితుండు భా
గ్యాకర మట్లు పెండ్లిగను ♦ నాదృతిఁ గూడె యుధాజిదర్థసీ
మాకలితాత్ముఁ డాభరతు ♦ మాతులుఁ డూర్జితమాతులుండు ల
క్ష్మీకరుణాకటాక్షభృతి ♦ సిద్ధసమగ్రఫలోపభోగియై. ౨౪౧

ఆ॥ చేర వచ్చి రాజు ♦ స్తిమితౌజు దర్శించి, కుశల మడిగి కలువుఁ ♦ గోలుతనము
నెగడ నిట్టు లనియె ♦ నీమామ కేకయ, విభుఁడు కుశల మడిగె ♦ వేఱువేఱ.

క॥ నీమనమున నెవ్వారి శుభ, మామనిత మొనర్తొ వారి ♦ కందఱ కచటన్
నేమమున ననామయ మో, స్వామీ; యామీఁదఁ దత్ప్ర ♦ సక్తి వినిచెదన్.

శా॥ నామేనల్లునిఁ గాంచుకామన మహీ ♦ నాథుండు న న్గాతుక
శ్రీ మీఱం బనుపంగఁ జేరితి జగ ♦ త్సేవ్యంబు సాకేతముం
మీ మా భాగ్యము పంట పెండిలికి స ♦ మ్మేలమ్మున న్గూర్చునీ
సేమం బాయ్యన వింటి సంభ్రమమునన్ ♦ క్షిత్యచ్యుతా ; వచ్చితిన్ ౨౪౪

కం॥ నారాక సఫల మయ్యెను, మీరాకడ నెఱిఁగి తెలిసి ♦ మెలఁకువమై రా
నీరాచకొల మొలసి వి, శ్వారాధితభాగ్యయోగ ♦ మందం గంటిన్. ౨౪౫

ఆ॥ అన నుపస్థితుం బ్రి ♦ యాతిథిఁ గనుఁగొని, యలరి దశరథుఁడు మ ♦ హామహుండు
పరమసత్కృతులఁ బ్ర ♦ వరవాక్తతుల వానిఁ, బూజనీయు నోజఁ ♦ బూజ సేసె.

ఆ॥ నెమ్మిఁ గౌఁగిలించె ♦ నృపుఁ డాతని నతండుఁ, బరఁగ గ్రుచ్చియెత్తె ♦ భాగినేయు
నచట వందనంబు ♦ లాశీర్వచశ్శ్రీతు, లాదరమునఁ బెరసె ♦ నగ్గలముగ.

కం॥ ఒండొరుల కలుము లరయుచు, నొండొరులం బొగడికొనుచు ♦ ముదితామోదం
బొండొరుల నోలలార్పఁగ, నుండిరి శోభనకలాస ♦ ముత్సుకులు నృపుల్. ౨౪౮

ఆ॥ పున్నెముల ఫలంబు ♦ పూజితం బారేయి, తనర నెమ్మినమ్మ ♦ దమ్మి నెఱయఁ
దమ్మి జాగరూక ♦ తత్కాలార్థులఁ గాఁగ, నెన్నుకొనుచు నెగడి ♦ రేనరసత.

కం॥ ఆతతశుభలీల సువి, ఖ్యాతుం డటురాత్రిఁగడపి ♦ కడఁగి ప్రభాతా
కూత మరసి తత్కాలో, పేతకృతు ల్దీర్చి స్వక మ ♦ భీప్సిత మొసఁగన్. ౨౫౦

—♦ దశరథుండు సుతుల, నలంకృతులం బొనర్పఁ బనుచుట ♦—

కం॥ పెండిలివేసంబులు కుల, మండనులకుఁ గూర్పఁగా సు ♦ మాళము జగతి
న్మెండుకొన నాన యిడె భూ, మండలశక్రుఁడు శ్రితాలి ♦ మండలి కెలమిన్.

ఉ॥ సంగతగీతము ల్సెలఁగఁ ♦ జానలు హారతు లెత్తి రష్ట వృ
ద్ధాంగన లర్థి సేసలిడి ♦ రాదృతి విప్రులు స్వస్తివాక్కులు
ప్పొంగుచుఁ గూర్చ నిర్జరులు ♦ పూవులు జల్లనఁ జల్లఁగా జగ
న్మంగళవేషధారులు కు ♦ మారుల కభ్యుదయంబు గూరఁగన్. ౨౫౨

సీ॥ తలఁపు లుల్లము లంటఁ♦దలలంటుదు రొయార్లు,వలపుసంపెంగనూ♦నెలఁ బొసంగ
స్నేహంబుగొను నిచ్చఁ♦జెనయింత్రు పూఁబోండ్లు,మేలిపుప్పొడుల నె♦మ్మేలుదలిర్పఁ
గాల్యసంపద లందఁ ♦ గాలేయకము గూర్తు, రంగన లంగరా ♦ గాప్తి వెలయ
మెలపుమెఱుఁగు లీన ♦ మెఱుఁగుపిండి ఘటింత్రు, మెఱుఁగుబోఁడులు మేని ♦
మెఱుఁగు మెఱయ

యోష లోషధిరసము సం ♦ తోష మట్లు
చిలుకరింతురు తలకొని ♦ పులక లొలయ
మేటిగొజ్జంగి నీట స ♦ య్యాట లమరఁ
గోమలు జలకమ్ము లార్తు ర ♦ క్కొమరులకును. ౨౫౩

మ॥ తడి యొత్తన్మెఱుఁగారు ధూపసురభు ♦ ల్దాకొల్ప శ్రీగొల్పు కొ
మ్ముడులుం గూర్ప విరు ల్సరు ల్సువసన ♦ మ్ము ల్సొమ్ములుం దార్ప మే
ల్నిడువాల్గస్తురిరేక లుంచ శుభకృ ♦ న్నీరాజన ల్బూనఁ జొ
ప్పడె నప్పట్టున నొప్పులాఁడులకు సౌ ♦ భాగ్యంబు యోగ్యంబుగన్. ౨౫౪

ఉ॥ భాగ్యమ కాదె యప్పరమ ♦ భాగవతుల ల్గని కేలు మోడ్తు రా
ఋగ్యజురాది యా శ్రుతి య ♦ నేకత నిట్టటు లేర్పఱించు సౌ
భాగ్యముకల్మిఁ గల్మిచెలి ♦ భావవిహారముల న్మెలంగుఁ బో
యోగ్యతమత్వ మాకొమల ♦ కోజ ఘటిల్లెను నాఁడు వింతగన్. ౨౫౫

మ॥ దరహాసద్యుతు లుల్లసిల్ల ముఖచం ♦ ద్రశ్రీలఁ ద్రైలోక్యసుం
దరమూర్తు ల్నిజచంద్రహాసములఁ జొ ♦ ద్యద్బింబసంబంధల
క్ష్మ్రరహీం గైకొని తృప్తిఁ గాంచిరి కలా ♦ సేవాసముల్లాసిరా
జ్యరమావల్లభతాప్రసంగమున నా ♦ య్యారంబు గన్పట్టఁగన్. ౨౫౬

సీ॥ కాంతిలో రసముబ్బెఁ ♦ గాఁబోలుఁ గాదుపో, రసముపైఁ గాంతి నీ ♦ రంధ్ర యయ్యెఁ
గళలఁ దెల్వి దలిర్చెఁ ♦ గాఁబోలుఁ గాదుపో, తెలివిపైఁ గళల బో ♦ దెలు పొనర్చెఁ
గలిమి కందము గల్గెఁ ♦ గాఁబోలుఁ గాదుపో, యందమ్ముపై గల్మి ♦ యతిశయిల్లె
ఖ్యాతిమైఁ దేజొప్పెఁ ♦ గాఁబోలుఁ గాదుపో, తేజుపై ఖ్యాతి యు ♦ దీర్ణతఁ గనె
నను వితర్కంబు లటు నిట్టు ♦ నలముకొనియె, వీరలక్ష్మీ శ్రుపుమవతార ♦ విహితుఁ డాత్త
కాముఁ డారఘురాముని ♦ ఖడ్గగింబ, దర్శనోల్లాసకల్యాణ ♦ దర్శనమున. ౨౫౭

శా॥ కల్యాణోచితవేషధారి యగుచు ♦ న్గన్పట్టె నిష్కాసితా
హల్యాపంకకలంకభవ్యపదవి ♦ న్యాసుం డధీశుండు సా
ఫల్యశ్రీ ఫల మందె దృష్టృజనదృ ♦ క్పాండిత్యసాంగత్య మా
కల్యం బొప్పె జగత్త్రయైకరసనా ♦ కల్యోల్లసత్కల్యమై. ౨౫౮

—♦ అంతఃపురస్త్రీలు సీతాది కన్యల నలంకరించుట ♦—

క॥ అట్టియెడ రాజహంసల, గుట్టుబయల వైచు నడల ♦ కులుకులఁ గలుకుల్
చిట్టాడు వేడ్క నగర, న్మట్టు న్మీఱిన శుభోక్తి ♦ మంజిమ మెసఁగన్. ౨౫౯

సీ॥ పల్లవించెడుఁ జూడు ♦ పద్మరాగము నేఁడు, పద్మాయతాక్షి తో ♦ డ్పడుట కంచుఁ
బరిమళింప దటమ్మ ♦ బంగారుబొమ్మ యీ, కనకాంగి మేని సం ♦ గతి నటంచు
నెగుపుఁ జూపెడుఁ గదే ♦ యీగిమ్రా నిది వాడె, పవడంపుఁదీవె చో ♦ ప్పడుట కంచు
రవళి నెక్కొలుపుఁ బో ♦ రత్నాకరమ్ము బో, రన రసవాహిని ♦ రాక కంచుఁ
గన్నియలఁ గాంచి వరుల చొ ♦ క్కటము లెంచి
ప్రాప్తవేలాక్రియార్థసం ♦ పద పొసంగ
సరసఁపుంగోష్ఠి నెట్టన ♦ జరిపి రెలమి
రామ లొప్పారెడు విదేహ ♦ రాజు నగర. ౨౬౦

ఉ॥ ముచ్చట లెన్నియో మొలక ♦ ముద్దు లిఁ కెన్నియొ జుంటితేనెలం
దిచ్చెడు మేలిపల్కుబడు ♦ లెన్నియొ పన్నిన భావజీవనం
బచ్చుపడంగఁ జేయు రస ♦ హావకలాస్ఫురణంబు లెన్నియో
హెచ్చె వియచ్చరాంగనల ♦ యెన్నికకుం దగు వారి చేరికన్. ౨౬౧

సీ॥ ఈయుత్పలేక్షణ ♦ నెలమిమై నెలయింపఁ, జంద్రరేఖయ నెఱ ♦ జాణ యనుచు
నీపద్మముఖి వికా ♦ సేందిరాప్తిఁ బొదల్ప, భానుప్రభయ చాలఁ ♦ బ్రౌఢ యనుచు
నీకాంచనాంగి శ్రీ ♦ హెచ్చు సంపాదింప,మణిమాల యొక్కటి ♦ మహిత యనుచు
నీవిచికిలగంధ ♦ యింపు సొం పెనయింప, నలివేణి యొక్కర్తు ♦ వలఁతి యనుచు
సీతమున్నగు కన్నెలఁ జేర్చుకొనుచు,గూర్చు నెచ్చెలు లటువంతు ♦ గూర్చుకొనుచు
వెలయు సింగారఁపుంగల్మి ♦ వింతయనఁగ, లలిఁ దొడంగిరి పెండ్లి క ♦ లంకరింప.

తే॥ తివుటమైఁ దమ్ము భూషింపఁ ♦ దివురుధాత్రి
కలనె భూషించె మహిజాది ♦ కన్యకాచ
తుష్టయి కలాప్తిఁ గవిహృద్గ ♦ తుల నతుల ప
రాదివాచాచతుష్టయి ♦ యట్ల పోలె. ౨౬౩

చ॥ పొనరుపడంగ శోభనఁపుఁ ♦ బోఁడుము లెల్ల రసోదయంబు పెం
పున ననుభావసంపదలఁ ♦ బొంపిరివోవ నిలింపయోషల
న్మనవికిఁ దేఱఁ జాలు గుణ ♦ మాన్యల ధన్యలఁ గన్యలం గనం
గని యిటు లెన్నరాని సిరిఁ ♦ గన్నఁ గదా జనకప్రభోన్నతుల్. ౨౬౪

తే॥ వెలయు నందనవనసార ♦ మలఁతిపడుట
కచ్చరలు సిగ్గువడఁ గన్ని ♦ యల తలంట్లు
కలరు తావుల దెసల కొ ♦ య్యన విదిర్చు
వింతనూనియ ల్గూర్చిరి ♦ వెలఁదు లపుడు. ౨౬౫

క॥ తలిరుంబోఁడులు కన్నెల, తల లంటెడువేళ మేలు ♦ దలకొన రక్షా
కలన లొనరించి శోభన, ములు హారతు లెత్తి పాడ ♦ మొనకొని రొకటన్.

తే॥ తనరు స్నేహంబు స్నేహంబు ♦ దవ్వులుకొలుప
గంధమును గంధ మొకఁడుగాఁ ♦ గవియుదేఱఁ
బాఱె నోర్తు రఘూద్వహా ♦ బాల్యచరిత
మోటుపడి వీణ తన బాట ♦ దీటుకొనఁగ. ౨౬౭

క॥ నెఱవాదు లైన గాయను, లెఱిఁగి, యెఱుకసేయు రాఘ ♦ వేంద్రుని కథలే
ర్పెఱఁ గరఁచు జాల నన న, క్కఱపడు కన్నియల నెంత ♦ గాఁ జేయు నొకో.

క॥ భాగ్య మొకట నమ్మెయిఁ గృతి, యోగ్య మగుచు మెయికొనంగ ♦ నుత్కటమా సౌ
భాగ్యము వివరించెడు కవి, వాగ్యోగ మమృగ్యలక్ష్మి ♦ వఱలక యున్నే.

సీ॥ కవియఁ బాఱెడుచూడ్కి ♦ గమికి బారలుచాఁచి, నెఱికురు ల్నెయ్యంపు ♦ నెఱికిఁబోదలఁ
బ్రోపుగోరెడు హాస ♦ రుచుల తత్త్వ మెఱింగి, మైచాయ లెదురేగి ♦ సుమతసూప
గమకించు నిశ్శ్వాస ♦ గంధవాహున కవ, యవసుమావళి గంధ ♦ మందఁజేయ
వైయాత్య మొసఁగు భా♦వప్రపంచోక్తుల, కరువొప్పఁ బులక లు♦త్తరములిడఁగఁ
గన్నియలకుఁ దగిన ♦ గాదిలినెచ్చెలు, లరుస మొసఁగ శిరసు ♦ లంటువేళ
నొఱపు నెఱపె వారి ♦ యుత్సుకత్వంపు సం, పద్విలాసకలన ♦ పద్మనయన.

క॥ మెత్తని నూనియవలపులు, మెత్తనిలొద్దుగరజముల ♦ మేల్మి సవరనా
మెత్తని మేనుల పరువం, బొత్తుడుపడనీక నలుఁగు ♦ లొగి నిడి రబలల్. ౨౭౧

తే॥ అంగముల స్మరజంబు స్వే ♦ దాంబులవము
ముగుదల త్రపాగరిమఁ ద్రోవ ♦ మొనయుదేఱ
నంగనలు కాచుకొనఁగ గో ♦ జ్జంగెనీట
జలకమార్తు రవ్వాఁకి ♦ సంభ్రమమున. ౨౭౨

తే॥ మెఱుఁగుబోఁడుల నెఱుల క్రొ ♦ మ్మెఱుఁగు మొగిలు
చాయలకు వ్యతిరేకంబు ♦ చాటఁ దలఁపు
మలయఁ దడియొత్తి ధూపధూ ♦ మముల వలపు
లొలయఁ జేసిరి చేడియ ♦ లుత్పలాక్షి. ౨౭౩

క॥ నీలాల కూర్పుజిగిబిగి, వేళాకోళం బొనర్చు ♦ వెలఁదుల కురులన్
లాలించి మెఱుఁగునిగ్గుల, కీలుముడు లైవ్వాచి రెలమి ♦ గీల్కొనఁగఁ జెలుల్.

ఉ॥ నాణెమెఱింగి చెందిరము ♦ నం గలనేరిమి మీఱ గౌరిక
ల్యాణపు బొట్టు లుంచిరి మ ♦ హాస్ఫురణం బలరారె నద్దపై పూ
బోణుల కాంతరంగికప్ర ♦ బుద్ధయు నౌ రతి స్వీయలక్ష్మి స్త్రవి
న్యాణము నూత్నచంద్రకల ♦ న న్నగుమోములఁ జేర్చెనో యనన్. ౨౬౫

సీ॥ అంజనం బిడ నొక్క ♦ యలినీలకచనేత్ర, ఖంజనంబులకు శ్రీ ♦ కలన దనరఁ
జందనం బలఁదెఁ గం ♦ జాతగంధి యొకర్తు, గాత్రయష్టులఁ బుల♦కలు దలిర్ప
లాక్షారసం బుంచె ♦ లలితాంగి యొకరిత, పదలక్ష్మి స్సామ్రాజ్య♦పదవి వెలయఁ
బత్రరేఖలు దీర్చె ♦ భావినీమణి యొర్తు, గండస్థలుల యొప్పు ♦ గ్రమ్మ దేఱఁ
గమ్మకస్తురి పసుపు క ♦ ప్రమ్ము రజము, రోచనాదులు తత్తదు ♦ రోజముఖవి
శేషసంశ్రయణమున మే♦ ల్సిరులు గూర్పఁ, గన్నెల నలంకరించిరి♦కాంతలపుడు.

తే॥ మేలిరతనాల నగలు నె ♦ మ్మేనిమించు, తానకమ్ముల నల్లనఁ ♦ దవులుపఱచి
చెలులు గాంచిరి సృష్టివై♦ చిత్ర్య మప్పు, డుభయశిల్పివిశేషమ్ము ♦ లూహఁ బెరయ.

క॥ అలకాళులు విరిమల్లెల, కలయికఁ గాంక్షించు టరసి ♦ కర్ణోత్పలముల్
లలిఁ జూడ్కి బేడిసల పొ, త్తొలయ మలయు నెఱిఁగి కూర్చి ♦ రుడురాజముఖుల్.

మ॥ నెలరాకం దులకించు వెన్నెలలు నా ♦ నెక్కొన్న ముంగొంగురిం
గుల మేల్పైఁటచెఱంగులం దొడరి ప్రాఁ ♦ కు ల్వెట్టు నూనూఁగురో
ములు హాసద్యుతి మీఱు మోముసిరికిం ♦ జుట్టాలుగాఁ బెండ్లికూఁ
తుల ధౌతాంబరము ల్ధరించు నెఱి కిం ♦ తు ల్గాస్తు రప్పట్టునన్. ౨౬౯

తే॥ పులు దొఱఁగిన మదనుని ♦ పూవుటమ్ము
లెదిరి లక్ష్యమ్ము సేయు న ♦ య్యెడకుఁ దార్పు
నంతలో మఱు వవసర ♦ మనిన యట్లు
కంచుకమ్ములు దొడిగి ర ♦ క్కన్నియలకు. ౨౭౦

క॥ నీరజముఖు లత్తఱి శుభ, నీరాజన లెత్తి రెలమి ♦ నెలకొనఁ గన్నెల్
తా రవధరించు పెండిలి, తోరఁపు వేసముల దృష్టి ♦ దోసము తెరలన్. ౨౭౧

క॥ నవనవతారుణ్యోన్మే, షవిశేషము సహజరూప ♦ సంపత్కలనన్
సవరొందఁగ నక్కన్నెలు, చవిమించిరి పెండ్లివేడ్క ♦ సదలంక్రియలన్. ౨౭౨

మ॥ కళలూరన్ దొలుకారుమించుజిగిచా ♦ క్కారంపుఁజొక్కారతిం
దలపింప న్వలపింపఁ జాలి రిదె ని ♦ ద్దాసోయగం బద్దిరా ?

కలరే యిట్టిరు ముజ్జగంబుల ననం ♦ గా నంగన ల్పెండ్లికిం
కలరూ పెంతయు వింతసేయు నెఱసం ♦ కల్పంబు కల్పంబుగన్. ౨౮౩

సీ॥ పదవిలాసం బర్థ ♦ పరిపుష్టి వెలయించు, వింత యొయ్యారంబు ♦ వెరవుసూప
లలితశోభనకలా ♦ లంకారసామగ్రి, తళుకు లీను నొడళ్లఁ ♦ దరముమీఱ
మహనీయగుణలక్ష్మి ♦ సహసముద్భాతాభి, రూపసంపన్నతా ♦ రూఢి నెగడ
భావగమ్యరసప్ర ♦ భావంబు శ్రితకాంతి, పూరచాంద్రస్ఫూర్తి ♦ పొలుపుఁ బెనుప
జీవనాడులు వ్యంజన ♦ ల్సెలఁగ నమృత, సేచనంబున నాయక ♦ స్థితి వచింప
కైశికీముఖవృత్తులు ♦ కావ్యమట్లు, గన్నె లెలయించి రయ్యెలా ♦ కాంతు నగరు.

—♦ దశరథుండు పెండ్లికొమారులతో, గల్యాణమండపంబున కరుదెంచుట ♦—

తే॥ సుప్రభాతంబుగఁ బ్రభాత ♦ శుభవిధు ల్నా
నర్చి ఋషుల పురస్కృతు ♦ ల్ననుచు వేడ్క
నెఱపి పుత్రులతో రఘు ♦ నేత నెగడు
యజ్ఞవాటంబుఁ బెరయఁ బ్ర ♦ యాణ మయ్యె. ౨౮౪

క॥ భ్రాతలతో రాముఁడు కృత, కౌతుకమంగళకలాప ♦ కల్యాణకళో
పేతుఁ డగుచు విజయాఖ్యం, బౌ తఱి గురుసన్నిధాన ♦ మం బెఁ బురంధ్రి. ౨౮౫

ఆ॥ అంతలోన యాయ ♦ నంతరత్నకులీన, కులగురుండు పెండ్లి ♦ కొమరు లెలమి
నెదురుచూచు చుందు ♦ రిమ్మగు కైసేఁత, దనర ననుచుఁ దెలుపఁ ♦ దక్షిణమున.

ఉ॥ తానునుఁ గృత్యశేషములఁ ♦ దద్దయుఁ దీర్చి ముదం బెలర్ప సం
దానితశోభనక్రమవ ♦ ధాని పురస్సృతమాని శ్రీముఖ
ధ్యానియునై ముహూర్తసమ ♦ యస్థితి నెంచి విదేహధారుణీ
జాని సుధానిధాన మన ♦ జానగు పూనిక దెప్పె నంతటన్. ౨౮౭

ఆ॥ స్వస్తివాచనములు ♦ శాకునమ్ములు దన, తోడివారి తోడఁ ♦ గూడి పఠన
సేయఁ దోడరి యాజ్ఞ ♦ సేసె నరుంధతీ, జాని పెండ్లి కెనయ ♦ సమయ మనుచు.

తే॥ సిద్ధమునివర్యమంగళా ♦ శీఃప్రసాద, సంపదయు నాఁగ నిజశుభా ♦ శంస లొప్ప
ధవహృదయవృత్త్యరుంధతి ♦ తారసిల్లెఁ, బెండ్లి వెలయు నరుంధతి ♦ ప్రీతితోడ.

క॥ రాజీవాక్షు లెలమి నీ, రాజన లిడి శోభనోక్తు ♦ లలు వాక్కులచే
జేజే లద్ది శుభం బని, రోజం బెండ్లికొమరులకు ♦ నుత్సుకత దగన్. ౨౯౧

ఉ॥ తోన చెలంగె మాంగళిక ♦ తూర్యము లొక్కట దేవదుందుభి
ధ్వానము ఘూర్ణిలెం దగి ♦ దాశరథోల్లసనంబు మీఱ నిం
ద్రానుగమా జగత్త్రియము ♦ నట్టిద కాఁ గనుపట్టెఁ దమ్ములుం
దానును రామచంద్రుఁడు ము ♦ దంబునఁ బెండిలి కేగు నయ్యెడన్. ౨౯౨

క॥ శ్రీకరము లియంహిత్రీ, ర్యేకరిణ ఇతి శ్రుతిప్ర ♦ హితగుణలక్ష్మీ
వ్యాకృతహిరణ్యమణియో, గాకృతిలక్షణసమన్వ ♦ యాంచితములునై. ౨౯౩

క॥ నలువొందు హస్తిరత్నము, లలరెడుసాత్త్వికపుఁ గలిమి ♦ హర్షితసిరిదా
నలువురిఁ గొలువఁగ నాల్గై, వెలసె ననన్ నిలిచె వేడ్క ♦ వెల్లి గొనంగన్.

తే॥ గురువులకు మ్రొక్కి రఘుకులాం ♦ కూర మొలయు
తమ్ములునుఁ గూడి రాఁగ ము ♦ దమ్ము వెలయ
శుభపరంపర నాఁ దగి ♦ చూడ్కిఁ దనుపు
నిభపరంపర కైకోలు ♦ నెనసి మెఱసె. ౨౯౪

సీ॥ ముద్దు లొల్కెడు మోము ♦ ముంజేతికంకణం, బని యెల్ల సింగార ♦ మనువుపఱప
మిసిమిక్రొమ్మెఱుంగుల ♦ మెయి వెంచు మకుటంబు, చింతామణిస్ఫూర్తి ♦ చెలువు పెలుపఁ
జెమరుము త్తియముల ♦ సిరి మించు పులకలు, వేయుఁగన్నుల సిరి ♦ వెల్లడింపఁ
బయిపయి నైదువ ♦ ల్పరఁగించు సేసలు, వేలుపుంబువుజడి ♦ వెరవు సూపఁ
దనదు వైభవమున నొప్పు ♦ తమ్ము లెలమిఁ
దోడిదిక్పతు లన నోలిఁ ♦ గూడి రాఁగ
నభ్రగజమున నమరేంద్రు ♦ నట్టు లమరె
భద్రగజ మెక్కి శ్రీరామ ♦ భద్రుఁ డపుడు. ౨౯౫

క॥ జను లెల్లరు విబుధులె యం, గన లెల్లరు నచ్చరలె స ♦ కలవస్తువు ల
య్యనువున స్వర్గీణములే, యన నయ్యది యింద్రవిభవ ♦ మనరాని దశే. ౨౯౬

సీ॥ రతనంపునగలు హా ♦ రములు సువర్ణము, ల్మణిపేటికలు నిండ ♦ మానుకొలిపి
హొంబట్టుసాల్వుల ♦ త్యుత్తమాంబరములు, కౌశేయములు దిండ్లు ♦ గా నమర్చి
నాగవల్లీదల ♦ పూగకర్పూరాది, సామగ్రిఁ బాత్రలఁ ♦ జక్కఁ గూర్చి
రంభారసాలనా ♦ రంగలాంగలిముఖ్య, ఫలములు గంపలఁ ♦ బదిలపఱిచి
వలచుపసుపులు కుంకుమం ♦ బులు పసిండి, పళ్లెరంబుల నిడి హిమ ♦ వారిపూర
కమ్రహరిచందనాగురు ♦ కలితకలశి, కలునుఁబెనుపొందఁ బెండ్లిసా ♦ రెలు ఘటించి.

క॥ మితి మీఱు సంపదఁ బురో, హితహితసామంతముఖ్యు ♦ లేతేఱఁగ భూ
పతి పెండ్లికొమరులం గొని, మతిమంతుఁడు తరలె రాజ ♦ మార్గము మెఱయన్.

శా॥ పొంగె న్నేసలపెల్లు వెల్లివిరిసెన్ ♦ బుణ్యాంగనాశంస లొ
ప్పెం గౌతూహలవాక్ప్రచారకలన ♦ ల్పెంపొందె వందిస్తుతుల్
రంగారం గనుపట్టె మాంగలికతూ ♦ ర్యశ్రేణిసారస్య మా
సాంగత్యంబునఁ జాత్రశోభనధృతిన్ ♦ క్ష్మానాథుఁ డేతేఱఁగన్. ౩౦౦

క॥ కొమరుల మున్నిడుకొని సిరి, కొమరారఁగ వచ్చు నజుని ♦ కొమరుని భాగ్యం
బమరులకు దూర మనఁ ద, న్నిమేషగతివిరతిఁ బొగడి ♦ నెగడరె పౌరుల్.

మ॥ మణిభూషాద్యుతు లైంద్రచాపరుచిశం ♦ పాస్ఫూర్తులం గూర్ప వీ
రణము ల్గర్జితవైభవాకలనమై ♦ రాణింప నీలాబ్దపూ
రణలక్ష్మి న్దగు రాము నాముకొని క్ష్మా ♦ రాముండు సౌవర్ణవ
ర్షణముం దార్చెఁ గవు ల్నుతింప నిజప ♦ ర్జన్యత్వ మొప్పారఁగన్. ౩౦౨

సీ॥ పఱచినవిరులపై ♦ పైఁ గ్రమ్ము పూజడి, కుసుమాకరము సిరి ♦ కొమరు దెలుప
నగవుమల్లెల విప్పు ♦ నవహర్షబాష్పాప్తి, గ్రీష్మశృంగారల ♦ క్ష్మిని గణింపఁ
జలువపందిళ్లు నీ ♦ డలు ముత్తెముల సరు, ల్వర్షాగమము కల్మి ♦ వలనుసూప
గొడుగులు చామర ♦ ల్నిడములు పద్మాది, సంపత్తి శారదై ♦ శ్వర్య మొసఁగ
నెలయు ఫలసమృద్ధి ♦ హిమరసస్ఫూర్తి హే, మంతశిశిరకళల ♦ సంతరింప
గూర్మి ఋతువు లాఱుఁ ♦ గూడి యప్పట్టునఁ, బెండ్లివారిఁ గొలుచు ♦ పెనుపు దోఁచె.

క॥ ఆరాచకొలము పెండిలి, కారాజపథమున రాఁగ ♦ నటఁ దగె నుత్కం
ఠారాజిత లగు నగరీ, తారాధిపవదనలకుఁ ద ♦ థావిధచేష్టల్. ౩౦౪

ఆ॥ ఆటలాడు వెలది యొ ♦ య్యార్ల చాపల్యంబు, మాట కేమి తద్వి ♦ మానగతులు
మెఱుఁగుఁదీవె లెలయు ♦ మెలఁకువ లందలి, యక్షణప్రభాత్వ ♦ మబ్బ మయ్యె.

## ♦ పెండ్లివారిం గాంచు నొయ్యారుల వివిధచేష్టావర్ణనము ♦

క॥ చెలి యొర్తు మోముదమ్మిఁ గ, దల సిరి వేనలియకాఁ బొ ♦ దలు నలిపఙ్క్తిన్
గలితధ్వని మదనజ్యా, కలనకుఁ దేఱంగఁ జెలిమి ♦ కత్తియఁ బిలిచెన్. ౩౦౬

ఆ॥ ఒకతె మేను మఱచి ♦ యులికిపాటున వచ్చి, దృష్టితంతువులన ♦ తిప్రసక్తి
నక్కుమారవరుల ♦ హారువు లూఁతలు గాఁగ, నల్లఁ దొడరె లూతఁ యనువు దోఁప.

ఉ॥ తత్తఱపాటుదం గదురఁ ♦ దామరసాక్షి యొకర్తు సేరి తా
బిత్తరిచూపుల న్నకియఁ ♦ బిల్చుచు వారలపై విదిర్చె నేఁ

డెత్తిన విల్లు దింప నని ♦ యేడ్తెఱ మారుఁడు సంకు వొత్తుచున్
దత్తనువు ల్కలంబముల ♦ దాటున మాటుట కందుపాటుగన్. ౩౦౯

ఆ॥ పసిఁడిగిండ్ల నొరయు ♦ పాలిండ్లపై నుండి, యుక్కుమారవరుల ♦ నాక్రమించు
దృక్ప్రభారసమునఁ ♦ దెలువ కే తెలిపె న, తనురమాభిషేక ♦ తత్త్వ మొత్తు.

సీ॥ రవిరశ్మ లెనసి పై♦గవియు హారముల త, ళ్కులు చిఱునవ్వుతోఁ♦గలయఁ దార్చి
కెంపుఱాకమ్మల ♦ గిఱికొను క్రొంజిగి, కెమ్మోవి రుచులతోఁ ♦ గీలుకొలిపి
నీలఁపుంగణికెల ♦ నెఱి మించు పతకమ్ము, జగ్గుల కైశ్యమ్ము ♦ చాయఁ జేర్చి
యవయవావలిఁ గుసు♦మాశ మూఁగు మదాలి, యులిఫుకంఠశ్రుతి♦మలయఁ జేసి

కూర్చు నేసలు దీపప ♦ జ్యోత్కలుఁ దదీయ
ధూమలతికలు భద్రగీ ♦ తులును వెలయ
వాలుఁజూపుల తోడ ని ♦ వాళు లొసఁగఁ
గొమ కొమలఁ గూడి యొర్తు రా ♦ కొమరులకును. ౩౧౦

ఉ॥ నిద్దురలేచి యొక్కతె వి ♦ నిద్రతి వారలఁ గాంచునప్పు డ
మ్ముద్దుల మోము కన్గవయు ♦ మోహవశంవదతం దలంగ న
మ్ముద్దియ పాణిపద్మములు ♦ మున్నుగ నీవి నొకండు వేసలిం
బద్దుగ నొండుఁ దాల్చి యభి ♦ మానము గానఁగఁ జాలె నత్తఱిన్. ౩౧౧

శా॥ వీణం బెట్టిన తుంబికాయ కుచము ♦ ల్వీగంగ రాగిల్లి తాఁ
బ్రాణం బూనిన సన్నఁ దెల్ప స్వరస ♦ ప్రావీణ్య మొప్పారఁ గాఁ
బాణిం దాని నమర్చి గీతికలన ♦ ల్పాటింపుచు న్వచ్చెఁ బూఁ
బోణిం గూడి యొకర్తు వారిఁ గన సం ♦ ఫుల్లాస్య నేత్రాబ్జయై. ౩౧౨

క॥ పువ్వులదండల నొడిఁ గల, పువ్వుల వారిపయిఁ ♦ జల్లెఁ బూఁబోఁడి యొక
ర్తవ్వలనున నిజభావము, మవ్వమునం దనరి తా నె ♦ మాటాడంగన్. ౩౧౩

ఉ॥ రాగము వెల్లిగొల్పెడు స ♦ రాగము సూపె నొకర్తు వారి పై
పై గమకించు దృష్టితతిఁ ♦ బట్టఁగ నేరక చేర వచ్చి త
త్ప్రాగనుబద్ధరంజనము ♦ పాదయుగం బటు మోవ లాక్షికా
రాగము తత్ప్రదేశముల ♦ రంజిల నా వ్యపదేశ మేర్పడన్. ౩౧౪

సీ॥ కనులఁ గాటుక దిద్దు ♦ కలనమై నరుదెంచె, నొకరిత యొయ్యార ♦ ముట్టిపడఁగ
దిలకంబు మోమునఁ ♦ దీర్చుచుఁ జనుదెంచె, నొక్కతె శ్రీ రంగ ♦ మెక్కి మెలఁగ
వేనలి గూర్చున ♦ వ్వేరపున నేతెంచె, నొక్కర్తు సింగార ♦ ముప్పతిలఁగ
హారము ల్దాల్చు న♦య్యనువునఁ దోఁతెంచె, నొకతె లావణ్యమ♦భ్యుదయ మొనయఁ

గలపము లమర్చె నెఱిఁగోన ♦ కదిసె నోర్తు, శోభనోద్యమఫలితవి ♦ స్ఫురణ తనర
నకుమారులఁ గనుఁగొన ♦ నాసపడెడు, మంగళాంగుల వేడ్క స♦న్మాన్య మగజ.

క॥ ఆరాచబిడ్డలం గని, యారామునిఁ గాంచి మరల ♦ వారామల దృ
క్సారసములె సారసములు, సారసముఖి! వారి భాగ్య ♦ సంపద యసదే. ౩౧౬

ఉ॥ త్రిప్పని చూడ్కి మై నొకతె ♦ తేఁకువ రామునిఁ గాంచి కాంచి తా
నప్పటియట్ల యుండె నతఁ ♦ డచ్చటు వాసి చరించె నేనియుఁ
జెప్పె గురూపదేశమునఁ ♦ జెల్వగు యోగనిరూఢి లక్ష్యముం
దప్పని చిత్తవృత్తి యవ ♦ ధానపు సంపద నాపె యొడ్లకున్. ౩౧౭

చ॥ కలుముల కల్మి రావె సిరి ♦ కందువ గావె శుభాళి రావె ము
ద్దులమురహారి రావె గుణ ♦ తోయధి రావె స్ఫురత్కటాక్షసం
వలనము యిందు రావె రస ♦ భావవిహారమ రావె యంచు న
ర్మిలి చెలిఁ గూర్చు మర్మమునఁ ♦ బ్రేముడి నొక్కతె పిల్చె రామునిన్. ౩౧౮

ఉ॥ కన్నులు గావొ యొడ్లు నిటు ♦ గన్గొన నేరరొ పండు వెల్లఁ దాఁ
బన్నిడి గుత్తకుం గొనెనొ ♦ ప్రాణపదం బనఁ జాలి యుండెనో
మున్నిది యిట్టిదం చెఱుఁగ ♦ ముద్దర వేసెనొ యంచుఁ గాంచుచోఁ
ద న్నడసేయు దాని నొక ♦ త న్గదియించె నొకర్తు వాక్కులన్. ౩౧౯

ఉ॥ చిల్కను మేలిపల్కుబడిఁ ♦ జిల్క పడంతుక కుల్కు చుల్కఁగన్
గల్కిమిటారి యోర్తు తన ♦ కల్మికి నీడగు చేడియల్ రసం
బొల్కెడు నమ్మచెల్ల యని ♦ యోలిమికం గవియంగ మొల్కరా
చిల్కలమేటి రాముకథ ♦ శ్రీనలువారఁ దదేక తానతన్. ౩౨౦

సీ॥ పోలఁతి; కాంచితె మేల్మి♦పోలము కోసలుకన్నె, పసిఁడి పువ్వులపూజ♦పంటపైరు
చెలి; కంటె పున్నెంపు ♦ సిరి పఙ్క్తిరథక్లప్త, హవనాప్తచరుపాయ ♦ సాన్నసార
మతివ; చూచితె గాధి ♦ జానందసంధాయి, రేఁద్రిమ్మరుల సూడు ♦ రేవెలుంగు
పడఁతి; కన్గొంటె త ♦ పసి కుటుంబవియోగ, తాపనిర్మోకమ్ము ♦ తమ్మికొలను

జనకుని తపఃప్రభావమ్ము ♦ శైవచాప, ఖేలనక్రమవిక్రమ ♦ స్తోమ మవని
జామనోభీష్టసిద్ధిసం ♦ స్థాన మరయు,మమ్మ నయనోత్సవమ్ము గై♦కొమ్మకొమ్మ.

తే॥ ఒండు పలికిన పలుకె వే♦ఱొండు పలుకు,నొకత మెచ్చిన సంస్థాన♦మొకతె మెచ్చు
నందఱకు భావరూఢి వే♦ఱనఁగ రాదు, భాగ్య మట్టిద కాదెయో♦ పద్మనయన.

క॥ పలికిరి మఱిమఱి చిలుకల, కొలుకులు సమ్మోదలహరి ♦ కూలంకషమై
పలువెఱఁగుల నెకొ్కని స, త్ఫలసంపద కెల్ల నాల ♦ పట్టుగ నంతన్. 3_౨౩

చ॥ తతిగొను వజ్రపుం గళల ♦ తళ్కులఁ దారొ్కను మేనికాంతు లు
ప్పతిలెడు వేయుఁ జూడ్కు లటు ♦ పాల్పడఁ దమ్ములు నెమ్మిఁ దోడిది
క్పతు లనఁ గూడిరా నెగడు ♦ భద్రగజమ్మున సభ్రిమాస్త్రిపై
నతులితుఁ డింద్రున ట్లమరె ♦ నమ్మరొ యాతఁడు వైభవమ్మునన్. 3_౨౪

సీ॥ ముద్దుముద్దునఁ గాఱు ♦ మోముచందురు సుధఁ, గ్రోలఁగానేర్చుచ ♦ కోరనేత్ర
పలుకుపల్కునఁ దొన్కు ♦ వాక్ప్రవ్వరసనార, మానఁగాఁజాలు మ ♦ త్తాలివేణి
విప్పువిప్పునఁ బొల్చు ♦ వివిధానయవకమ, లాకర మెద మెచ్చు ♦ హంసయాన
తాఁకుతాఁకునఁ దోఁచు ♦ తనుచందనానిలు, దాక్షిణ్యమరయు ప్రో♦ద్యల్లతాంగి

కలిమియొయ్యారి గా కొండు ♦ గలదె జగతిఁ
గలికి యిమ్మోహనాంగు సం ♦ గతి మెలంగఁ
గాంచె నాయమ యవతార ♦ కలన మేటి
భావగుణరత్నపేటి సీ ♦ తావధూటి. 3_౨౫

క॥ ఒకనిఁ గని యొండు గనుఁగొన, మొకమోటమి పుట్టఁ జిత్త ♦ మోహావశతన్మై
సకలము మదనవిలాసము, సకలాగమసారతత్త్వ ♦ సంగ్రహము య్యెన్. 3_౨౬

తే॥ కంటి కీనల్వ రొక్కండు ♦ గాఁగఁ దోఁచు
దోఁచెడు శ్రుతిక్రమమునఁ జ ♦ తుష్టయముగ
నట్టి జగడంబు పరికింప ♦ నలవిగామి
మనము పరవశభావ ని ♦ ర్మగ్నమయ్యె. 3_౨౭

ఉ॥ పున్నెమ కాక యొండనఁగఁ బోలునె యన్నకుఁ దోడు తమ్ములా
పున్నమ నాఁటి చందురుని ♦ పోఁడిమి లాంఛన మెత్తి కేరునా
తిన్నని మోము సోయగము ♦ తీరున నొప్పెడు వారు గంటిరే
యెన్నఁగ నిట్టు లుండ వల ♦ దే సుమబాణు విలాస మొక్కటన్. 3_౨౮

చ॥ మగలకు మేటి సంపదల ♦ మండన మాశ్రితకల్పకంబు భా
వగరిమ మూలకందము న ♦ వప్రతిభాసి మహాత్సవంబు శ్రీ
సుగమరసానుబంధము ప్ర ♦ సూనవిశేషవిలాస మాఁ గదే
జిగినగుమోము చెల్వమునఁ ♦ జెల్వగు రాచకొలంబు చెల్వరో. 3_౨౯

సీ॥ చూడ్కి సోఁకినఁ జొక్కు♦చొక్కారమిక్కగాఁ, బాలుగారు కపోల♦భాగములకు
నరచందు పుట్టున♦ట్టనఁ గాంతిఁ బూరించు, చక్కని యలికసం ♦ స్థానములకు

నల పవడంపుఁదీ ♦ వల పండ్లొ యివినాఁగ, రసముబ్బు మోవుల ♦ రాణువలకు
నవనవోన్మేషావ ♦ యవలక్ష్మిఁ జెన్నారు, కల్పద్రుమవిశేష ♦ కల్పనలకు
నెంతలావణ్యసామగ్రి ♦ యెక్కటి గొన
నెట్టి జతనంబు వలసె వా ♦ ణీశునకును
భువనమోహనరూపము ♦ లొప్పందుపడఁగ
నొక్కపరి వీరి సృజియింప ♦ నూహఁ బెంప. 330

తే॥ కలిగెఁ గన్గంటఁ గన్నులు ♦ గల ఫలంబు, చాలు నాకల్ప మాకల్ప ♦ సంస్తవంబు
నుడికి మదికిని వలయు వే ♦ రోళ్లఁ బొగడ, నేఁటికిద్యోడ జని నిడ్డ ♦ నియతి నియతి.

క॥ శ్రీసముపేతం బెయ్యది, యాసేచనకంబొ దాని ♦ నరయుట కన్నన్
భాసురశాస్త్రవిశేషా, భ్యాసఫలము గలదె శ్రేయ ♦ మన నది గాదే. 33౧

తే॥ ఎఱుఁగమే సీత నూర్మిల ♦ నింతవట్టు, వారి కెటుఁ దీసిపోయెడు ♦ వారు గారు
మాండవియు శ్రుతకీర్తియు ♦ మహితసుగుణ, రూపవిభ్రమలక్ష్మిని ♦ రూపణమున.

ఉ॥ ఆనవమోహనాంగులను ♦ నవ్విధి నొక్కటఁ జేర్చి యుంచి న
ట్లీనవమోహనాకృతుల ♦ నివ్విధి నెక్కటి సేర్చి మించి యీ
శానుని మెచ్చికోల్వడయ ♦ శారద కూర్మి మఱింది కూర్చెఁ గా
దేని రసాబ్ధితావహద ♦ సీదృశసంపద యుల్లసిల్లునే. 33౪

క॥ అక్కయుఁ జెల్లెంద్రును జిగిఁ, జక్కని చుక్కలలమరుని ♦ సాంద్రబాణులు దా
రొక్కెడఁ గోడం డైరన, మిక్కిలిపున్నెముల కలిమి ♦ మేల్మి మెఱయదే.

ఆ॥ ఏమినోము నోమ ♦ రెవ్వార లెప్పాట, నెందునేని ఫలము ♦ లెనయ రెట్లు
జనకుయోగసార ♦ సంపద గాకున్న, నిట్టిభాంధవంబు ♦ పట్టుపడునె. 33౬

క॥ అనుచు నెడముడికిఁ బుటభే, దన మొదవ రసోదయంబు ♦ దలకొనఁ బుటభే
దననారీమణు లటులా, దినుసుసుఖోర్మికల మునిఁగి ♦ తేలుచు నుండన్. 33౭

సీ॥ మినుముట్ట నెదురుకో ♦ ల్గొని తూర్యరవణాలి, కైంద్రవాద్యశ్రేణు ♦ లర్చలొసఁగ
నాటకత్తెల యాట ♦ పాటతేటల హంగు, లచ్చర ల్గన్నుల ♦ నద్దుకొనఁగ
స్తుతిపాఠకచయవా ♦ చోయుక్తిపటులీల, లెంచి గీష్పతి గుర్తు ♦ లుంచి పొగడఁ
దులకించు వేత్రహ ♦ స్తుల హెచ్చరికలకై, యెలమిదిక్పాలు ర ♦ త్తెత్తి చూడఁ
గోసలాత్మజ నోము పే ♦ రొక్కన్న ఫలము
కలిమిచెలువ యొయ్యారమ్ము ♦ కందళమ్ము

వెరసెఁ గల్యాణమండప ♦ పరిసరస్థ
లమ్ము దమ్ములతో సుమా ♦ ళమ్ము వెలయ. ౩౩౮

క॥ అయ్యవసరమున మేలున, తియ్యఁదన మ్మిట్టు లనఁగ ♦ దేవుని తరమే
నెయ్యఁపురసమున సోనలు, డయ్యక ప్రవహించె రిత్త ♦ డంబర మెడగన్. ౩౩౯

తే॥ సగరవంశ్యుల బలఁగంబు ♦ సాగరంబు
నాఁ జనుం గద జనకు జ ♦ నతకు నట్టు
లబ్బె సారస్వతవిలాస ♦ మనఁగ నెదురు
కొనియె నొండొంటి సిరి మీఱి ♦ కుధరతనయ. ౩౪౦

తే॥ పలికె నవ్వేళ ముద మొప్ప ♦ బ్రహ్మపుత్త్రుఁ
డనఘుజనకునిఁ గాంచి వి ♦ న్ననువు దోఁప
శుభముహూర్తము దోఁతెంచె ♦ సొరిది మేలి
కృత్యములు గూర్ప వలయు ని ♦ రత్యయముగ. ౩౪౧

క॥ అనిన నతఁ డనియె నేరిమి, ననఘా; యఖిలార్థమునుఁ ద్వ ♦ దాయత్తమనె
మ్మనమున నయోధ్య నట్టులుఁ, జను మిథిలం జూడ సమర ♦ సంబలరారన్.

తే॥ మంగళాచారపూతలై ♦ మహిత లగుచు, నాదు కన్నియ లున్నారు ♦ వేదిసన్ని
ధానమున దేవతార్హణా ♦ ధానమునఁ బ్రశస్తిసంస్కృతహుతవహ ♦ జ్వాలనఁగ.

క॥ మీ యనుశాసనమున నెది, యేయనువున నెరప వలయు ♦ నేనిఁ దదేకా
ర్థాయత్తుఁడనై మెలఁగెద, మా యెడ నవధానమునఁ బ్ర ♦ మాణం బీరల్. ౩౪౪

మ॥ అనినన్ సంతస మంది మందిరము డా ♦ య న్వచ్చు నవ్వారిఁ జం
దనలాజాక్షతపుష్పమౌక్తికముఖా ♦ ర్థవ్యాపృతి న్నేసలుం
దనుఁ బోలం గలవారి దీవనలు మో ♦ దం బొప్పఁ గూర్పించి తా
ననుమోదించె శుభప్రవేశ మిదె యా ♦ నంచున్ సుసిద్ధార్థుఁడై. ౩౪౫

వ॥ విశ్వామిత్ర శతానందులం బురస్కరించుకొని తక్కిన తపోధనులంగూడఁ గలిసి
కొని. ౪౩౬

క॥ అభ్యుదయహోమకృత్యము, లభ్యర్హితుఁ డట నొనర్చె ♦ నంచితముగఁ ద
త్సభ్యులు మేలని పొగడఁగ, నభ్యుచ్ఛ్రపదారురుతుఁ ♦ డతఁ డగతనయా. ౩౪౭

క॥ అంత మహోచ్చైర్విభవం, బంతకు నంతకు ననంత ♦ మై యలరారన్
సంతసము పేరి సంద్రము, వింత వెలయ వెల్లివిరియు ♦ విధ మేర్పడఁగన్.

సీ॥ తన యుపేంద్రతకుఁ గూ♦ర్చిన నందనంపు శి, ల్పఁపు బోదెలొ ప్పార♦వఱలుదానిఁ
దన సౌర మగు సౌరు ♦ దగ మగరాల త, ళ్కుల మిఱుమిట్టులు ♦ గొలుపుదానిఁ
దన సాగరంబు పొం♦పున నింపుసింగారఁ, పుం బూరమునఁ దెర♦ల్వొలయుదానిఁ
దన యభిరామచం ♦ ద్రపదంబున నసంబు, కలన లేవెన్నెల ♦ ల్గాయుదానిఁ
దనదు శోభనకై శోర ♦ కనవలక్ష్మిఁ
గొ్రింబనుల చిత్తరువుల నె ♦ క్కొనెడుదానిఁ
గనియెఁ గల్యాణశాల రా ♦ ఘవుఁడు ముద్దు
లొలుకు నగుమోముతోడఁ ద ♦ మ్ములును మొనయ. ౩౪౯

క॥ సమయజ్ఞులు మునులు శుభో, ద్యములు కుమారు లటు మంగ ♦ ళాయతనము సే
ర మలయ నయంముహూ ర్త, స్సుముహూర్తోఽ స్తనిరి మహిత♦సూనృతకలనన్.

క॥ కైదండ యొసఁగి శుభసం, వాదము లలరారఁ గుసుమ ♦వర్ష మొసఁగ నా
మోదము పొసఁగఁగఁ బరిణయ, వేదిఁ బ్రవేశింపఁ జేసి ♦ వేదోక్తవిధిన్. ౩౫౧

తే॥ జనకుఁ డధికశతానంద ♦ సహితుఁ డయ్యు
నల శతానందుఁ డాదేష్ట ♦ యై యెలర్ప
శౌరిచతురంశమూర్తిస ♦ త్కార మెంచి
ధర్మపత్నీసమేతుఁడై ♦ ధర్మరతిని. ౩౫౨

ఆ॥ ఘను వశిష్ఠుఁ గాంచి ♦ కల్యాణమూర్తి శ్రీ, రాము లోకరాము ♦ రాణ దనరు
వైభవంబు తోడి ♦ వైవాహికిం గ్రియ, నడుపుమయ్య విధిస ♦ నాథముగను.

మ॥ అన నౌఁగాకని యామహామహుఁడు నె ♦ య్యం బొప్పఁగా గాధినం
దనముఖ్యు ల్మునిముఖ్యు లమ్మెయి శతా ♦ నందుండుఁ దోడ్పాటున
న్మొనయం గూర్చు ప్రపాంతరస్థ యగు స ♦ మ్మోదావహ న్వేది నొ
య్యన గంధాక్షతపుష్పసారశుభల ♦ క్ష్యార్చానుచర్చారతిన్. ౩౫౪

వ॥ అలంకరించి మఱియు సువర్ణపాలికలు సాంకురంబులగు ఛిద్రకుంభంబులు సదం కురాఢ్యంబులగు శరావంబులు సుధూపకంబులగు ధూపపాత్రవిశేషంబులు శంఖ పాత్రిలు సుస్రిక్స్రువంబులు స్వర్ఘ్యాభిపూరితంబులు లాజపూర్ణంబులు సక్షతాభి సంస్కృతంబులు నగు పాత్రికాగ్ర్యంబులు నెలకొలిపి సమదర్భసమాస్తరణంబు లెలయించి విధివన్మంత్రపూర్వకంబుగ నవ్వేదికపై జాతవేదునిం బ్రతిష్ఠించి వేదోక్తవిధానంబున హోమానుసంధానం బొనరించి జనకరాజేంద్రుని కెఱిం గించిన నమ్మహాత్ముండు సహపత్నీకుండై శుభాత్మికలు స్వలంకృతలునగు కుమారికామణులం గూర్చుకొని. ౩౫౫

తే॥ అంకురార్పణవిధి దేవ ♦ తానయనము
మున్నుగా స్వస్తివాచన ♦ మ్ములునుఁ గూర్చి
మారగురు లనఁ దగు నక్క ♦ మారవరులఁ
గోరి పూజించెఁ గోర్కులు ♦ గొనలువాఱ. 3౫౬

శా॥ పాద్యార్ఘ్యాంచదనర్ఘరత్నవిహా ♦ ప్రాజ్యాసనాఢ్యంబు సం
పద్యోగోచితగోచయాంబరమణి ♦ ప్రాగ్భారభూషోజ్జ్వలం
బుద్యన్మంత్రకలాకలాపమునివా ♦ క్యోదారసంభావనా
హృద్యంబౌ మధుపర్క మిచ్చె నృపరుం ♦ డిష్టాప్తి నల్లుంద్రకున్. 3౫౭

సీ॥ ప్రామిన్కకోమలు పా ♦ పట నుంతు రెద్దాని, కోమలారుణరజః ♦ కుంకుమంబు
సంతరింతురు దేని ♦ శాపాయుధశ్రేష్ఠు, లంతరంగంబున ♦ ననవరతము
దన పావనత్వంబు ♦ దరము మీఱఁగ యన్మ, రందమై పొడమె స్వ ♦ ర్గస్రవంతి
చిన్నారి పొన్నారి ♦ చేతుల లాలించుఁ, దొడలపై నిడి దేనిఁ ♦ గడలికన్నె

యదె యహల్యాఘహారి పా ♦ దాబ్జయుగల
మబ్బెఁ దన కని సహచరీ ♦ హస్తదత్త
కనకకలశోదకంబులఁ ♦ గడిగి తాల్చె
నతఁడు శిరమునఁ దత్తీర్థ ♦ మగతనూజ. 3౫౮

క॥ పాటిల్లు పున్నెముల పరి, పాటి వివిధసూ తదీయ ♦ పదజలలబ్ధిన్
నాఁటికి నేనే ధన్యుఁడ, నేఁటి కితం డొండు గలిగె ♦ నీరజవదనా. 3౫౯

క॥ సంకల్పసిద్ధుఁడు మహా, సంకల్ప మొనర్చి సత్ప్ర ♦ సవపుష్పహిర
ణ్యాంకితశయుఁడై జనకుఁడు, శంకాతంకములు తలఁగ ♦ సంయుసుపరతన్.

శా॥ అవ్యక్తప్రభవుండు బ్రహ్మ యని య ♦ ట్లర్కుం బ్రశంసించి త
ద్దివ్యశ్రీజనితాన్వయంబున మహా ♦ తేజోఽర్థు లైక్ష్వాకులన్
భవ్యాత్మస్థితి నెంచి స్వాత్మనిమిన ♦ ద్వంశంబుఁ గీర్తించి చి
ద్భావ్యశ్రీ రఘురామ; దేవ; తఇమాం ♦ దాస్యామి యం చాదృతిన్. 3౬౧

వ॥ ఆనందసాగరోన్మజ్జనజనితామేయపారవశ్యంబునం బొదలుచు. 3౬౨

తే॥ సీత సర్వాభరణవిభూ ♦ షితఁ గృశాను, సన్నిధిం జేర్చి యధిపుఁ డా♦సత్త్రిరాఘ
వాభిముఖుఁ డయి యాక్షణ ♦ మని యొఁ గోస, లాత్మజానందవర్ధను♦నను వెలింగి.

—♦ శ్రీ మైథిలీపరిణయఘట్టము ♦—

ఉ॥ ఈయది సీత నాసుత స ♦ దీడిత త్వత్సహధర్మచర్యకుం
బాయక నిల్చు సాధ్వి పర ♦ భాగమహోన్నత చాయ వోలె ని
న్నేయెడఁ గొల్చు భద్ర మిఁక ♦ నింతి కరంబుఁ గరంబునం బ్రహ
ర్షాయితవృత్తిఁ గైకొనుము ♦ సంపద పొంపెసలారు చుండఁగన్. ౩౬౪

మ॥ కృతకృత్యుం డన నేన మత్కులము సం ♦ కీర్త్యంబు మున్నాడి శ్రీ
పతి; సీతత్త్వము దెల్పె నారదుఁడు స ♦ ద్భావంబున న్నేఁటికి
య్యతిలోకోదయలబ్ధి మంటి నినుడా ♦ యం గంటి లోకావన
ప్రతిభాసిత్వము నంటి యీవలను సం ♦ భావించు త్వద్భావనన్. ౩౬౫

ఆ॥ అనుచు ధార వోసె ♦ నగ్నిసాక్షికముగ, సీత కరము రాము ♦ చేత నునిచి
ధరణినాథుఁడు సహ ♦ ధర్మాచరణసత్ప్రతిజ్ఞ రాముఁ దెలమిఁ ♦ దేటపఱప.

క॥ సాధువచనాప్తి సభ్యు ల, సాధారణకుసుమవృష్టి ♦ స్వస్సదనులు న
మ్మైథిలుని భాగ్య మెంచ స, మేధితతూర్యస్వరవ మెసఁగె ♦ నిందును నందున్.

మ॥ బహుజన్మార్జితకర్మబంధనివహ ♦ ప్రక్రాంతి నర్థించి ల
క్ష్మి హరిం గూర్చుటగాఁ దలంచి యిలస ♦ శ్రీకు ల్గృహు ల్కన్నెలన్
సహధర్మంచర యంచు వోఢ కిడి స ♦ త్సంపత్తిఁ గైకొందు రా
సుహితత్వం బిటు గన్న యానృపతి సు ♦ శ్లోకత్వ మింతింత యే. ౩౬౭

మ॥ తను నొప్పింప సురాసురు ల్గడఁగి మో ♦ దం బేఢ ఘోషింపుచున్
గని లక్ష్మిన్ జలబుద్ధి శౌరి కొసఁగం ♦ గాఁ డబ్ధి చేచేతులన్
దన యజ్ఞక్షితి పండె నాఁ దనరు సీ ♦ తాలక్ష్మి శ్రీరాముఁ బే
ర్కొని యర్పించెఁ బ్రహర్షియై జనకుఁ డో ♦ క్కండే కృతార్థుం డిలన్. ౩౬౮

తే॥ అమ్మెయిని లక్ష్మణున కిచ్చె ♦ నాత్మజాత
నూర్మిల సలక్షణునకు ర ♦ సోర్మి భరతు
న కల మాండవి శత్రుఘ్ను ♦ నకు సమృద్ధిఁ
దనరు శ్రుతకీర్తిఁ గీర్తించె ♦ ననుజుఁ డొసఁగ. ౩౭౦

ఆ॥ నామకీర్తనంబు ♦ నలువొంద నందఱఁ, బేర్మిఁ బిలిచి సుతుల ♦ పేరు లుగ్గ
డించి పాణు లందుఁ ♦ డంచు లాలించి య, ర్పించె జనకనృపతి ♦ ప్రీతి పొనర.

క॥ అందఱును సౌమ్యమూర్తు ల, నం దనరారితిరి చరిత ♦ నంద్యవ్రతతం
బొందితి రింపొందితి రం, కం దగు పత్నుల గ్రహింపఁ ♦ గాఁ దడ వేలా. ౩౭౧

ఆ॥ అనెడు జనకు పలుకు ♦ లర్థిఁ గ్రహించి ప్ర, తిగ్రహించి రాది ♦ దేవకల్పు
లక్కుమారవర్యు ♦ లాచార్యమతధృతి, ధుర్యులై కడంగి ♦ తొడరు వేడ్క.

క॥ సమయంబన నదె కాదే, సుమబాణోజ్జీవనార్థ ♦ శుద్ధౌషధి; త
త్క్రమ మరసి శుభోదయమున, నమరగురుప్రతిభు లట్టు ♦ లానతి సేయన్.

మ॥ కలితస్వస్త్యయనోక్తులై దువల స ♦ త్కల్యాణకౌశాస్యరీ
తులు వైతాలికసంస్తుతుల్ కవివచ ♦ స్స్తోత్రాయ్యమానేతివృ
త్తలసన్మంగళగీతవాద్యయుతన్ప ♦ త్ప్రక్రియారంభగుం
భలహార్యుత్సవరంగభంగులుఁ దగె ♦ న్భావప్రభావోన్నతిన్. ౩౨౫

తే॥ మెలఁతుకల వాతెఱలకు నె ♦ మ్మోని కాంతి
పూరముల పెందెరలు మించు ♦ పోఁడుములకుఁ
దెఱఁగువడు కన్నుఁదాటింత ♦ తెరలఁ జేయఁ
దెర ఘటించితురు మరున కే ♦ త్తైఱ వోసంగ. ౩౨౬

క॥ ఇంబుగ నద్దంబుల బిం, బంబులు గనని మరుని ♦ పాడిసిలుఁగునన్
బింబాధరులు తదిద మి, త్థం బను నిర్ణయము లేమిఁ ♦ దలఁకుచు నుండన్. ౩౨౭

తే॥ అప్పనం బొనరింపంగ ♦ నపుడు చూఁచి
నట్టి కన్నెల కేల్దమ్ము ♦ లలరువిలుతుఁ
డెగిచి తమపై నిగిస్చిన ♦ యిషువు లనుచు
వరులు లోలో దలంచుచు ♦ వడఁకుచుండ. ౩౨౮

మ॥ తని వొప్పం బులక ల్దలిర్చె మది సం ♦ త్రాసంబుతో సంతసం
బెనసెం దత్తరపాటు దోఁచెఁ బెరసెన్ ♦ హ్రీవృత్తి యుత్కంఠతోఁ
బెనఁగెన్ రాగరసోదయంబు తలఁపు ♦ ల్పెల్లూరెఁ జీకాకు మే
కొనె మారుం డొఱపై వధూవరులపై ఘూర్ణిల్లు నప్పట్టునన్. ౩౨౯

తే॥ రమణ గుడజీరకాదిధా ♦ రణము పొంచు
శుభముహూర్తంబు ఘటికలు ♦ చూచి పోసఁగ
నమ్మునిత్రయ మొరులు స ♦ మంచితప్ర
పంచితాశాస్యకలనోప ♦ పత్తి మించి. ౩౩౦

క॥ సవిధములగు విధులకుఁ ద, త్సవిధస్థితి వలని వలను ♦ జానొంద ధ్రువం
ధ్రువ మనుచుఁ దదావరణము, వివరణ మొనరింపఁ జేసి ♦ వేడుక లూరన్.

క॥ సంయమము పొనరఁ జేయ శు, భంయువిధిజ్ఞులు మహాను ♦ భావులు నవ్వా
చంయములితరేతరదృ, క్సంయోగవిధానసంప్ర ♦ సాదముఁ గూర్పన్. ౩౫౨

సీ॥ శ్రుతిపథంబున కెక్కు ♦ సూనృతంబగు వాక్ప్ర, మాణంబు ధాటికి ♦ మ్రానుపడుచు
జనకాన్వయాబ్ధిసం ♦ జనితామృతస్యంద, మన ననుమానంబుఁ ♦ బెనుచుకొనుచుఁ
బద్మగంధుల వాసిఁ ♦ బాటిల్లు నుపమ యు, త్తమజాతిఁ దలఁపింపఁ ♦ దనివెనయుచు
నర్పించుతఱిఁ జూచి ♦ నట్టి కే ల్ఫలపుష్ప, వతి కల్పలతిక గా ♦ భ్రాంతమగుచు
నున్న పెండ్లికొమారుల ♦ యుల్ల మప్పు
డెరవులే కెల్ల తానె యా ♦ నీక్షణమునఁ
గన్న ప్రత్యక్షమున ధృతి ♦ గాంచి మించెఁ
గొఱఁత లన్నియుఁ దీఱంగఁ ♦ గువలయాక్షి. ౩౫౩

క॥ పొలివోని తళుకు లొకఁడై, చెలఁజేగె వధూవరములు ♦ సిరి నలువారన్
గలసి పరస్పరదృక్కుల, నలు వెదచల్లంగ ననువు ♦ నం చగు వేళన్. ౩౫౪

ఉ॥ ఆసలు దొడ్డ లైనను స ♦ భాంగణ మయ్యది మోహనాంగు ల
భ్యాసము క్రొత్త భావజుఁడు ♦ భాసురుఁ డాఱని క్రౌర్యమూని స్వీ
యాసురవృత్తి సూపుఁ బ్రప ♦ యట్టిటు సేయును వారిచిత్తవి
న్యాసము వారికే తెలియ ♦ నొఁ గదె యత్తఱి మత్తకాశినీ. ౩౫౫

సీ॥ చరణాబ్జముల వ్రాలి ♦ సంభ్రమంబున రస, మానలే కటునిటు ♦ నాసఁ బెనఁగుఁ
బైఁ బ్రాఁకు వెట్టంగ ♦ భావించి తడఁబడి, మొదలి కందువ సేరి ♦ ముడుఁగఁ బాఱు
నూనూఁగు గఱు లట్టె ♦ నూల్కొల్పి దెసలకై, యుంకించి యొకక్రేవ ♦ నొత్తిగిల్లుఁ
దెగి మెట్టకేలకుఁ ♦ దివిరి పైకొనఁ బోయి, యెదిరితాఁకునఁ గాంచు ♦ నుదిలపాటు
సారిది గొండొక్కతావందఁ ♦ జొక్కినిలుచుఁ
దనియు నొక్కింత దార్ఢ్యంబు ♦ పనుపడంగఁ
గన్నియల కన్గవల తొలి ♦ కాన్పుచూపు
తేఁటిపిల్లల దాటు వెం ♦ బాటు గదుర. ౩౫౬

తే॥ నాఁటి చూపున మెలఁకువ ♦ నేఁటి మఱపు
నొక్కఁ డయ్యెనుఁ బ్రతియోగి ♦ యోగశక్తి
మేటి గాఁడొక్కొ రాముండు ♦ బోటిమిన్న
యలఁతియో యానె పారవ ♦ శ్యంబు మహిమ. ౩౫౭

క॥ మేలున మేలే తోఁచునఁ గాలోచిత మగుచు నట్లు ♦ గా దన నిత్య
శ్రీలాలితు లాదంపతు, లాలోలతఁ గాంచు టబ్ర ♦ మగరాజసుతా. ౩౮౮

సీ॥ తన యంఘ్రులకు సాధ్వి ♦ తనుపార మ్రొక్కిన, శిరమున నప్పాట ♦ సేస లిడుచు
నుచితసంవాహన ♦ యుక్తిఁ బ్రేముడి సూప, ముఖచంద్రలక్ష్మిపై ♦ మోహపడుచు
నెద వ్రాలి నీదాన ♦ నేనంచు రుచిఁ బెంప, నాసాసఁ గౌఁగిట ♦ నలముకొనుచుఁ
దటి వేచి మోమునే ♦ స్తమున కక్కఱపడ, గిలుకుటందెల సడి ♦ కలుకు గనుచు
నొలపు మెయిఁ గ్రిందుమీఁదుగా ♦ నొండొకొండ్ల
కలికిచూపుల వ్యాపార ♦ గరిమ మీఱఁ
దత్పరత గూర నేత్రావ ♦ ధాన కేళి
సలిపె జానకితో రామ ♦ చంద్రుఁ డపుడు. ౩౮౯

ఉ॥ కన్నులు గల్గిన న్ఫలము ♦ గల్గదు దేశము కాల మొక్కఁడై
మున్నొడఁ గూడు నాసుకృత ♦ ము న్ఫలవంతముఁ జేయ మేలిమే
ల్గన్నదె కాన్పు గాక యెది ♦ గన్నను గానుపె యమ్మహోత్సవం
బున్నటు గన్న వారలదె ♦ యుత్తమజన్మ మనుత్తమక్రియా. ౩౯౦

వ॥ పదంపడి యవ్వధూవరచతుష్టయంబు విధిజ్ఞం బయ్యునఃవిధితనయబోధితం బగుచు
సంకల్పపూర్వకంబుగ వైవాహికకల్పప్రయుక్త తంత్రవిధానంబునకుం దలకొని
దీక్షితంబై యగ్నిసమక్షంబునం బాణిగ్రహణం బొనరించి యోక్త్రమాంగల్య
ధారణంబు నక్షతారోపణంబు మున్నగు సదాచారంబులు నిర్వర్తించి ప్రధాన
హోమం బాచరించి సప్తపదవిన్యాసోపక్రమంబున సాప్తపదీనసఖ్యంబు సంపా
దించి జాతవేదునకుం దత్సోదర్యుండగు నాచార్యవర్యునకుం బ్రదక్షిణంబుగా
వించుచు నేతెంచి శమీపల్లవాజ్యాదిసమ్మిశ్రితంబులగు లాజల నంజలిం గైకొని
ప్రదక్షిణజ్వాలాభ్యంచితుం డగు హవ్యవాహునకు సమంత్రకమ్ముగ ముమ్మాఱు
సమర్పించి యమ్మెయిన కడమప్రయోగంబునుఁ గడపి మహాజనాశీర్వాదంబులం
గ్రహించి జగత్త్రయమంగళాచరణానుసరణంబున నభ్యర్హితం బయ్యె నయ్యెడ.

క॥ దీపాలపళ్లెరము లు, ద్దీపితరుచిజాల లగుచు ♦ దివ్యాంగనలన్
రూపించు మంగళాంగులు, ప్రాపింపఁగఁ జేసి పలుకు ♦ బడు లొప్పారన్. ౩౯౨

తే॥ విశ్వజనని వివాహంపు ♦ వేడ్కనేని
గౌరి కల్యాణ మనుచు మం ♦ గళము లెలమిఁ
బాడఁ దొడఁగిరి సర్వతో ♦ భద్రముగను
సర్వమంగళ ; నినుఁ బోలు ♦ చాన గలదె. ౩౯౩

ఉ॥ పువ్వులుచల్లి సేసలిడి ♦ పున్నెఁపుఁ గ్రపఁపు దివ్వె ధూమము
ల్మవ్వము మీఱఁ గేల్గవల ♦ మ్రొక్కొని కన్నులనద్ది దీవనల్
నివ్వటిలంగఁ జాలు ఫల ♦ నిష్ఠలఁ బోల నొసంగి రుత్తమల్
జవ్వను లయ్యరుంధతి ప్ర ♦ చారము మున్నుగ భవ్యమూర్తులై. ౩౯౪

తే॥ దవ్వుదవ్వుల నున్ననుఁ ♦ దవిలి కొలిచి
ప్రార్థన లొనర్తు రేసాధ్వి ♦ భద్ర మొసఁగ
నయ్యరుంధతి కోరితా ♦ నరుగుదెంచి
సేసలిడె నింక నామేలు ♦ చెప్పఁ దరమె. ౩౯౫

మ॥ పునరుక్తం బనరాదు నారదముఖు ♦ ల్వీఁదేనె లొల్కించి పెం
చిన గీతిక్రమ మచ్చర ల్పెనఁచు సు ♦ శ్రీనృత్తవైచిత్రి ది
వ్యనవోత్సాహవిధేయవాద్యచయసా ♦ భాగ్యంబు రామావనీం
ద్రుని కల్యాణమహోత్సవంబుననుఁ దో ♦ డ్తో నట్లు గన్పట్టఁగన్. ౩౯౬

క॥ సౌమనసము మానుషమును, సౌమనసాసారమున నె ♦ సరియగు ననరా
కామెయిఁ దార్యత్రికవి; ద్యామహితత్వమునఁ గూడ ♦ ననసై మొనసెన్.

మ॥ మతి నుప్పొంగు హితు ల్కరంబు లిడు సా ♦ మంతుల్ శుభస్వస్తిసం
శ్రుతిఁ జూపట్టు పురోహితు ల్వరసను ♦ శ్లోకావధాను ల్కవుల్
స్తుతిగీతాఢ్యులు మాగధుల్ రసికచే ♦ తోనాయకు ల్గాయకుల్
మితికి న్మీటి తలిర్చి రెల్ల విబుధు ♦ ల్మేలంచుఁ గీర్తింపఁగన్. ౩౯౮

సీ॥ క్రొత్తక్రొత్తగఁ జేర్చు ♦ కొన్న విన్యాసంబు, లనుమతభేదంబు ♦ లనువుపడఁగ
విమలగేయాంశంబు ♦ వెరవున రసభావ, కలిక లొండొండ ము ♦ కాచరు గాఁగ
నంగహారస్ఫూర్తి ♦ లంగహారవిశేష, కలనల దెసలకుఁ ♦ గాంతు లొసఁగ
నాకేకరాదిదృ ♦ గ్వ్యాపారములఁ గల్వ, పూల దీర్చిన చాంది ♦ నీ లెసంగ
లలితనేపథ్య మొకవింత ♦ వలపు గూర్పఁ
గలికితన మెన్న నలువకుఁ ♦ గా దనంగఁ
జదురుచదురునఁ జూపిర ♦ చ్చరల కెలమి
బాట వెలయింప నేర్చిన ♦ పణ్యసతులు. ౩౯౯

ఆ॥ మనము వాక్కు రామ ♦ మయములై కవగూడఁ
దాలమానగతుల ♦ లీల లొలయ
మాను లా ననంగ ♦ మానితస్థితి నాడెఁ
జేటగీతి నొక్క ♦ యాటవెలఁది. ౪౦౦

తే॥ అమృతపరమాణువులు దురి ♦ తాపహములు
శోభనాలంకృతివిశేష ♦ సురుచిరములు
లలితలలితము లగు పద ♦ ములను రాము
కథలు వర్ణించి రపుడు స ♦ త్కవులు ప్రీతి. ౪౦౧

సీ॥ క్షీరసాగరశయ ♦ నా; రామ; యనుచును, దేవగాంధారిని ♦ ద్రేశ మొప్ప
నన్నుఁ బాలింపంగ ♦ నడిచి వచ్చితివో ధ, రణి కంచు మోహన ♦ ఫణితి దనర
ధన్యు లెందఱో యిందు♦దాశరథీ; యంచు, మలయమారుతలీల♦లోలయుచుండ
నిటు గొనియాడు నా ♦ యెడ దయ యనుచుఁబుం,స్కోకిలధ్వనిపై ని♦కొసరుసూప
సంప్రదాయవిశేషప్ర ♦ సక్తు లూను, గతిగమకగీతు లానంద ♦ కలన లీన
గాయకులు నేర్మి నెరపిరి♦కఱకుఱాలు, గరఁగ రాముని పెండ్లి వే♦డ్కలకుఁగరఁగి.

క॥ ఇమ్మై నిఖిలసుఖమ్ముల, కిమ్మై నిమివంశపావ ♦ నేచ్ఛాసఖమై
యమ్మైథిలీవివాహమ, హ మ్మైథితవిష్టపోద ♦ యమ్మై వెలయన్. ౪౦౩

—♦ బువ్వముబంతి వర్ణనము ♦—

క॥ వియ్యఁపు బువ్వము బంతులు, నెయ్యము తియ్యము దలిర్ప♦నెలకొల్పుటయున్
సయ్యాట లుప్పతిల్లఁగ, నయ్యుభయము పరిజనములు ♦ హర్షాఢ్యములై. ౪౦౪

వ॥ తమతమ పనుల వలనుల మెలంగు నప్పుడు. ౪౦౫

క॥ మజ్జనము లాడువారు న, మజ్జనములఁ బిలుచువారు ♦ మండనకలనా
సజ్జతఁ బొనరుపడెడు వా, రజ్జగజట్టున సుమాళ ♦ మగ్గల మయ్యెన్. ౪౦౬

తే॥ ఋత్విగాచార్యముఖ్యు లౌ ♦ ఋషివరేణ్యు
లగ్రగణ్యులు ద్విజులుఁ గృ ♦ తార్థు లగుచు
నొకనివేశనమున ను త్త ♦ మోత్తమక్ర
మాంచితాభ్యర్హణావాప్తి ♦ నలరుచుండ. ౪౦౭

తే॥ పెండ్లికొమరులు వియ్యఁపుం ♦ బెద్ద లైదు
వలునుఁ బెండ్లికొమార్తెలు ♦ వరుస లొప్పు
మీఱి నర్హాసలంబుల ♦ మించు మణిమ
యాసనంబులఁ గూర్చుండి ♦ రనువు మెఱయ. ౪౦౮

క॥ వచ్చెడువా రాశాలలు, చొచ్చెడువా రర్హణలకుఁ ♦ జొక్కెడువారై
పెచ్చుపెరిఁగె విభవము పెం, పచ్చుపడఁగ నమ్మహామ ♦ హాతిథ్య మొగిన్.

తే॥ ఆత్మజనములు దూరదే ♦ శాగతు లను
నా విభేదంబు లేక మా ♦ న్యత్వమును స
మత్వమునఁ గూర్చి యర్చించు ♦ మైథిలునకు
నిచ్చ నివుణోత్తు తలఁపు లి ♦ ట్లెన్ని గలవొ. ౪౧౦

తే॥ మున్న గొన్నికథాలత ♦ ల్మొనసె జొంప
ములనుఁ బుష్పించెఁ బదఁపడి ♦ వెలసె రసము
ఫలము లొప్పారె నిప్పాట ♦ భావినిఁ; ర
ఘూద్వహావివాహావాసంతి ♦ కోత్సవమున. ౪౧౧

క॥ పావనులౌ జనులు సుసం, భావన తనరార రత్న ♦ భాజనముల నిం
పావహిలఁగ వడ్డన లు, ద్భావించిరి ప్రాతలేందు ♦ భావము పొంగన్. ౪౧౨

సీ॥ నెల తప్పులెంచి వె♦న్నెలయొప్పుమించి చె, న్నగుమోములు నగుసో♦యగము లమర
రతి చిన్నె గేరి భా ♦ రతి వన్నె మీఱికు, ల్కులు పలుకులు కోటి ♦ కోటి సేయ
వలతేని విలిచి చి ♦ ల్వాలతేని గెలిచి చూ, వులు కోపులును సోల ♦ వులు ఘటింప
రసరీతిఁ బెట్టి సా ♦ రసజాతి గిట్టి మో, వులు మెలపులు స్ఫుర ♦ ణలఁ బొసంగ

గిలుకుటందెల రవళుల ♦ కలిమి వలని
బాళిఁ గంకణక్వణనము ♦ లేఁకలు సాఁప
వడ్డన లొనర్చి రపుడు మా ♦ ఱొడ్డి వేల్పుఁ
గన్నియలఁ దక్కఁగొనఁ జాలు ♦ కరిగమనలు. ౪౧౩

క॥ ధ్యానావనమ్రములై యీ, శానార్హాణలం బొనర్చి ♦ సలలితహారిగీ
తానాదమాధురీసు, ధానాఢ్యముగా భుజింపఁ ♦ దలకొని రంతన్. ౪౧౪

ఉ॥ రామకథాఽమృతోచితము ♦ రస్యమునౌ రన ముప్పతిల్ల త్యా
గాముఁడు గూర్చె నట్టి గుణ ♦ రమ్యములైన పదార్థము ల్మహా
ద్దామతఁ బాకశుద్ధిఁ గని ♦ తత్పరత న్దనివందఁ జేసె వి
ద్యామహితాత్ములౌ విబుధు ♦ లందఱు మేలని యుబ్బియాడఁగన్. ౪౧౫

సీ॥ తన పల్లుబడితీయ ♦ దన మట్లు రూపించు, మధుధార లొలయించి ♦ మంజువాణి
తనదు కెమ్మోవి క ♦ మ్మని గాట వివరించు, మధురోష్ఠి యతిరసా ♦ ల్మొఱుసూపి
తన మెచ్చు వలపుచం♦దము నందముం దెల్పుఁ, జున్నుఁబాలొనగూర్చి♦చిన్నెలాఁడి
తన పాకవిలసితం♦బునఁ గ్రొత్త లెఱిఁగించు, మొనయు పాకగుణోక్తి♦మోహనాంగి

తమతమరసాలసత్త్వంబు ♦ తరతమత్వ, మెలయఁ గోకిలస్వనముల ♦ వెలయఁ జేసి
రసికు లానన సత్పదా ♦ ర్థమ్ము లేర్చి తనియ వడ్డింతు రత్తఱిఁ ♦ దలిరుబోండ్లు.

మ॥ లలిఁ జాటూక్తులు హాస్యకల్పనలు లీ ♦ లాలాలనోల్లాసముల్
లలితప్రస్తుతు లర్థపూరణము లా ♦ లాపప్రచారంబు లు
జ్జ్వలవక్రోక్తివిభావనల్ రసపరీ ♦ వాహంబులై యొప్పెఁ బెం
డిలిబువ్వంబున వేడ్క లెల్లఁబరిపా ♦ టి న్మేలుకొన్నట్లుగన్. ౪౧౭

తే॥ కీలుబొమ్మల నెడనెడఁ ♦ గీలుకొలిపి, సరసముగఁ బలికించిరి ♦ జాణ లప్పు
డేర్పఱింపక ప్రతివాక్య ♦ మిడెడువారిఁ, గాంచి నగి రోరమోములఁ ♦ గళలు వెలయ.

మ॥ వడియమ్ము ల్వడియమ్ము లంచొకకలా ♦ వాణి తా డాసిన
న్నడిఁ దద్యోజితదృక్ప్రసారములఁ గం ♦ దర్పాస్త్రభావంబుమై
వడిఁ దోఁపం జలియించువారి ధృతికై ♦ వాణ్లింగనీ కప్పుడా
ల్జడియం జాలెదు నంచుఁ గొంద ఱెలమిన్ ♦ లాలింతు రవ్వారలన్. ౪౧౯

తే॥ కాఁచువడియమ్ము లక్కఱ ♦ గలవొ యాకు
మడుపు లక్కఱగలవొ నీ ♦ మతము దెలుపు
మనిన నింతియు కద యిది ♦ యడుగవలెనె
యనియె నొకఁ డొక్కనికి నొంటి ♦ నడ్డుసేసి. ౪౨౦

తే॥ ఒక్కలావణ్యసీమ భూ ♦ షోజ్జ్వలాంగి, యగుచు మేలిరసాయన ♦ మనుచు రిత్త
కుంభ మొలికించి జిగిజాలు ♦ కొనఁగ నెదిరి, సిగ్గుపడఁ జేసె ధారచేఁ ♦ జిక్కకుండ.

ఆ॥ తెరువటంచు రత్న ♦ దీపపాంచాలికా
బుద్ధిఁ గలికి నొండు ♦ పొడివి నొత్తి
యోర నిలుపఁ బోవ ♦ నూహూ ; యటం చది
మొరసె నొడ్లు నగిరి ♦ మొత్తములుగ. ౪౨౧

మ॥ రసపాకమ్ముల మెప్పు లొప్పె వలపుల్ ♦ రాణించె సౌగుణ్యమా
యసదృక్షం బన నమ్యో దోషవిరహం ♦ బౌచిత్యముం బొల్చెఁ గా
వ్యసమభ్యున్నతి భూషితం బగుచుఁ బ్రా ♦ జ్యంబైన యాభోజ్య మే
రసికు ల్మెచ్చరు మైథిలీపరిణయా ♦ రంభంబున న్భావిసీ. ౪౨౩

తే॥ భోజనము లొనరించి క ♦ ప్పురఁపువిడెము
లంది మిన్నంది సయ్యాట ♦ లందు మెలఁగి
సరససాహిత్యసంగీత ♦ సంప్రదాయ
గోష్ఠుల సనిష్ఠముగ రసా ♦ కూత మరసి. ౪౨౪

వ॥ ఉభయపక్షసామంతబంధుసుహృజ్జనంబులును౯ బౌరజానపదదూరదేశాగతులును నమ్మహోత్సవసుఖార్ణవ రసపరీవాహంబున నోలలాడుచుండి రత్తఱిఁగున.

—♦ విశ్వామిత్రుండు శ్రీరాముని వీడ్కొని తపంబున కరుగుట ♦—

క॥ ఆనందముపై పెచ్చిది, నానందము చంద మొప్ప ♦ నవ్వైకరస
శ్రీ నాయికముగ సీతా, శ్రీనాయిక పెండ్లి దనరె ♦ శ్రితకల్పలతా. ౪౧౬

తే॥ లలి వివాహదీక్షాంతమ్ము ♦ వెలయఁజేసి
నిరుపమానసత్కృతు లంది ♦ నెగడఁ గాంచి
మించుమేలెంచి దీవించి ♦ మేల్మి మెఱయఁ
దగినవారలవలని నే ♦ స్తమ్ముఁ బెనిచి. ౪౧౭

వ॥ పోయివచ్చెద మని యెఱింగించి శ్రీరామచంద్రుని నెమ్మొద్దుమొగమ్మున దృక్ప్రసారమ్ము నెలకొలిపి యనిర్వచనీయం బగు స్నేహాతిరేకంబునం బొదలుచు జగదేకమంగళాదర్శం బగు పునర్దర్శనంబున నెన్నండేని నొక్కనాఁడు తనకు నేత్రపర్వం బొడఁగూడుం గావుత మని సంభావనాపూర్వకంబుగ నామంత్రణం బొనరించి గాధితనయుండు తోడివారిం గూడి యుత్తరపర్వతంబునం దపం బాచరింపం జనియె నంత. ౪౧౮

—♦ జనకుండల్లుండ్రకుఁ గూఁతులకుఁ హరణంబు లొసంగుట ♦—

శా॥ సింగారంబున రంగుమీఱితి నవల ♦ క్ష్మిం గొన్న చెల్వంబు పొం
గం గై సేసిన మేనొయారముసకుం ♦ గాణాచిగా నంగనా
సాంగత్యంబున మేలుసూపఁ గఁ గలా ♦ స్వామ్యం బసామ్యంబుగా
రంగత్సుంగవలీల నొప్పెఁ గడు శ్రీ ♦ రాముండు రామామణీ. ౪౧౯

వ॥ పెండ్లికూతులం గుమారులం దోడ్కొని చని యచిరకాలంబునన నిజపుర ప్రవేశమహోత్సవంబునం బ్రవర్తింప వేడుకపడుచున్న దశరథమహీంద్రుని భావబంధం బెఱింగి యమ్మిథిలేశ్వరుండును౯ దొలుదొలుత నాచార్యముఖ్యులగు వసిష్ఠవామదేవాది మునివరేణ్యులఁ బూజోపహారంబుల సంతుష్టాంతరంగులం గావించి తక్కంగల యగ్రజన్ములం గూడ నమ్మెయిసత్కరించి మంత్రిసామంతహితపురోహితబంధువర్గసమేతంబుగా నవ్విశ్వంభరరాజాని నమేయరాజోపచారంబులం బహూకరించి యంతవట్టుసారల కనర్ఘ వస్తువాహనాంబరాభరణంబు లొసంగి వరణీయోత్తమగ్రామశతంబులును మాననీయపండితావలీ సహస్రంబులును గణనీయదాసదాసీలోకాయుతంబులును మహనీయభద్రలక్షణదంతిలక్ష

లును, వర్ణనీయజవనాశ్వకోటికోటులును, రమణీయమణిమయస్యందనార్బుదంబులును, దర్శనీయామూల్యరత్నశలాకికాబృందంబులును, స్పృహణీయసురుచిరగోనిచయానంతంబులును, వేర్వేఱ నల్లుండ్రకు హరణంబు లొసంగి కూర్చుకూరిమి నక్కూఁతుల కందఱకుం దన యిచ్చ వచ్చినట్లెల్ల మేలిపదార్థంబులు నేర్చి యిచ్చి శోభనప్రస్థానసన్నాహంబు సమకూర్చి యంతట. ౪౩౦

తే॥ సతియుఁ దానును నవరోధ ♦ జనముఁ గూర్చి
కూఁతులను బారవశ్యంబు ♦ గొనకొనంగఁ
గాఁగిటం జేర్చి బోధించి ♦ గారవించి
యనిచిరి కలంకఁ దేర్చి దీ ♦ వనలు గూర్చి. ౪౩౧

తే॥ మేలిశుభవాద్యరవణము ♦ ల్మిన్నుముట్ట
లలి నవోఢలఁ గొంచు వో ♦ ఢలు కుమారు
లెలమిఁ దనతోడ రాఁ గోస ♦ లేశ్వరుండు
చేరె నుపకార్యలకుఁ జెల్మి ♦ చెలువు చెలఁగ. ౪౩౨

{ దశరథుండుఁ గొడుకులఁ గోడండ్రం దోడ్కొని యయోధ్యకు పయనంబగుట }

క॥ ఆరేయిఁ గడపి ముద మల, రార నుషఃకాలమునఁ బ ♦ యన మయ్యెను భద్రారంభుఁడు మునిశుభవా, క్సారమున ససారుఁ డగుచు ♦ సబలానుగుఁడై.

తే॥ కొంతదూరమ్ము దోడ్తోడ ♦ గూడి నడిచి
యెలమి నామంత్రణ మొనర్చి ♦ యేగెఁ బురికి
జనకుఁ డానందయోగసం ♦ జననమునఁ ద
దీయవిరహాక్లమం బెడఁ ♦ బాయుచుండ. ౪౩౪

క॥ నంతటఁ నరశార్దూలుఁడు, సంతసమున నరుగుచుండె ♦ శాకునములు ధీమంతులు మునులు పఠింపుచు, సాంతత్యం బెడలకుండ ♦ సహపుత్రకుఁడై. ౪౩౫

వ॥ అయ్యవసరంబున. ౪౩౬

— ♦ భార్గవరామాగమనము ♦ —

తే॥ మొనసె మొదల నభోమము ♦ ల్మమస్కారముగఁ
బులుఁగు లొండొండ ఘోరవా ♦ క్కులు ఘటిల్ల
నెనసె మృగములుఁ దోడ్తోనె ♦ హితము మెయిఁ బ్ర
దక్షిణక్రమ మొప్పారఁ ♦ దలముఁ బెరసి. ౪౩౭

తే॥ అట్టు లన్యోన్యవిమతంబు ♦ లైన సూచ
నములు సూచించి యున్నర ♦ నాయకుండు
మది గలంగెడు నిది యేమొ ♦ మర్మ మరసి
తెలుపవే యన గురుఁ డిట్లు ♦ పలికెఁ దెలియ. ౪౩౮

క॥ తొడరుఁ దొలుత ఘోరంబుగ, నడ రవ్వల నెడము పడక ♦ యగు శుభ మిట్లీ
వెడలక్షణముల కెడలో, నడలక దిటవుపడి నిలువు ♦ మవనీనాథా. ౪౩౯

ఆ॥ అనుచుఁ బలుకు చున్న ♦ యంతలోఁ బెడిదంపు
గాలి పుట్టెఁ బుడమి ♦ గదలె చెట్లు
వ్రాలె దెసలు తెలివిఁ ♦ బాసె భానునిఁ గప్పెఁ
దమము దూళి నెఱసెఁ ♦ దద్బలముల. ౪౪౦

క॥ తపసులు వశిష్ఠుఁడును భూ, మిపతియు సుతులు నొకభంగి ♦ మేకొని నిలువన్
వ్యపగతచేతను లట్టులు, విపర్యయము నొంది యొడ్లు ♦ వ్రేలుచునుండన్. ౪౪౧

సీ॥ నిట్టనిల్వున నింగి ♦ నెఱయుచుఁ గుపితకే, సరిభావగతి సటా ♦ చ్ఛటలు నొడువ
ఘనరాజవంశాలిఁ ♦ గాల్చుచిచ్చిది యంచు, నురుకుఠారజ్వాల ♦ యుగ్గడింప
మూడుకన్నులవాని ♦ మొదలిముట్టడిఁ బినా, కముఁ బోని ధనువుతా ♦ ర్కాణ సేయ
దైత్యారిలీలావ ♦ తారమ్ము ముచ్చట, నుల్లోక మగు తేజ ♦ మొత్తిపలుక
సంతతైరమ్మదస్ఫురా ♦ శంసి దివ్య, శర మొకఁడు కేల బాడబ ♦ శక్తిఁ దెలుపఁ
దోఁచె నాకస్మికముగ ని ♦ ర్ఘాతబహుళి, పక్షదోఃప్రాభవుం డగు ♦ భార్గవుండు.

తే॥ అమ్మహోమహుఁ గాంచి భీ ♦ తాత్ము లగుచు
నొదిఁగి రొయ్యన నొడ్లుచే ♦ యునది లేక
జపము హోమము మానస ♦ శక్తి నెరపి
రల వశిష్ఠప్రముఖులు య ♦ తాత్మ లరసి. ౪౪౩

క॥ అందఱుఁ జేరి తదీయా, స్యందన మీక్షించి రూక్ష ♦ గతికిఁ దలఁకి సం
స్పంద మొకయింత యాఁగుచు సందానితచిత్తవృత్తి ♦ సంయములగుచున్.

ఉ॥ గండరగండఁ డీతఁడు ప్ర ♦ కాశితతేజుఁడు దుర్నిరీక్షుఁ డొ
క్కండ చరించె క్షత్రవధ ♦ కాంక్షఁ బితృప్రాణవిముక్తి కిమ్మహిం
గొండొకశాంతికిం దొడరి ♦ క్రుద్ధత మానెఁ గడంగి నాఁటియు
ద్దండతఁ జూప వచ్చె నొకొ ♦ దాక్ష్య ముదీక్ష్య మటంచు నెంచుచున్. ౪౪౫

తే॥ అతని వలగొని కేల్మోడ్చి ♦ యర్ఘ్యపాద్య
ముఖ్యపూజనములఁ దృప్తి ♦ మొనయఁ గూర్చి
రామ; రామా; యనుచు మధు ♦ రముగఁ బలికి
తత్ప్రసాదంబు గోరి ర ♦ త్తపసు లపుడు. ౪౪౬

ఉ॥ వార లొసంగు పూజఁ గొని ♦ వారని యుక్కున రాముఁ జేరి దు
ర్వారము నీప్రతాపము ది ♦ రం బని వింటిని వింటిచేతయున్
భోరన మిన్నుముట్ట నిఁకఁ ♦ బోరున నన్ను జయించు టొక్కఁడే
పో రవివంశ్య; తక్కె ననఁ ♦ బొక్కుచు నాజి సదుఃఖరాజినై. ౪౪౭

—♦ దశరథుండు పరశురామునిం బూజించి వేఁడుకొనుట ♦—

క॥ పాదములు పట్టుకొని సం, పాదితపూజార్ఘుఁ డగుచు ♦ బహువిధసేవా
నూదితదైన్యవశంవదుఁ, డై దిట వేదంగ వేఁడె నవశత పేర్మిన్. ౪౪౮

చ॥ శమదమముఖ్యసంపదల ♦ సన్నుతమా భృగుసంయమీంద్రువం
శమున జనించి తీశపరి ♦ చర్యల సర్వముఁ గంటి పైతృక
ర్ణము దలఁగంగ దుష్టనృప ♦ రాజి వధించితి వెల్లభూమి ధ
ర్మము వెలయంగ నిచ్చితి తి ♦ రమ్ముగఁ గశ్యపమానిమాలికిన్. ౪౪౯

తే॥ వాసవుఁడు వేఁడ క్షత్రియ ♦ వధఁ దొఱంగి
శాంతతపహించి సత్తప ♦ శ్చరణమున మ
హానుభావుండ వైతి వ ♦ నూనకీర్తి
గంటి వటు స్వర్గసోపాన ♦ కల్పనమున. ౪౫౦

క॥ దమమున లోక మలోకం, బమలముగాఁ జేయఁ దేజ ♦ మందితి విదపన్
శమము వహించిత కాదే, శమధను లౌననఁ బ్రతిజ్ఞ ♦ చఱచి మహాత్మా. ౪౫౧

ఉ॥ ఈమెయి నల్కమై మఱచి ♦ యీ వరుదెంచితి విట్టిధాటి నీ
రాముని కెగ్గు గల్గ భృగు ♦ రామ నశించెద మెల్లవార మే
మేమొ తలంప కాదరణ ♦ మేర్పడ మా కభయం బొసంగవే
శ్రీమహితాత్మనామ; పరి ♦ శీలన సేయవె స్వీయధర్మమున్. ౪౫౨

తే॥ పసుపుదుప్పటివాఁడు నా ♦ పట్టి నేఁడు
గావవె దయార్ద్రదృష్టుల ♦ గారవించి
పరమధర్మ మహింస య ♦ న్పాడి వెలయ
భృగుకులాంబుధిసోమ; భ ♦ వ్యగుణధామ. ౪౫౩

క॥ అంజలి గూర్తు భవద్భ్రూ, కుంజాతకృపార్ద్రదృష్టి ♦ కలనలచే నా
నెంజిలి దెరల్పు మాగః, పుంజములఁ దోలంచి పుణ్య ♦ పురుషోత్తంసా. ౪౫౪

తే॥ అనుచుఁ బ్రార్థించు నృపతి న ♦ నాదరించి
రాముఁ జెరసెను భార్గవ ♦ రాముచెయిద
మన్య మొల్లక యిట్టట్టు ♦ లటమటించి
యినుమయస్కాంతసాన్నిధ్య ♦ మెనయు నట్లు. ౪౫౫

క॥ చుఱుకుదన మెనయుచూడ్కులఁ, జుఱచుఅరఘురామదేవుఁ♦జూచుచుఁ దనయ
క్కఱ వివరింపఁ దొడరె న, త్తఱి నాచుఱుకరియుఁ దగవు♦తగులుఁబెనఁచుచున్.

—♦ భార్గవరాముండు శ్రీరాము నెదిర్చి సంభాషించుట ♦—

క॥ నాగురుని విల్లు విఱిచితి, నాగురుసత్త్వుఁడ వటంచు ♦ నాకుఁ దెలిసె వే
వేగ మగఁటిమికి నిఁక నీ, వే గతి యన నివియుఁ గొను మ ♦ హీనవిచారా.

సీ॥ ఈవిల్లు నీచేతఁ ♦ జేవఁబాసిన విల్లు, వెరవుమై నిర్మించె ♦ విశ్వకర్మ
హరిహరులకు నిచ్చె ♦ నవి రెండు నద్దాన, త్ర్యంబకుం డేర్చెఁ బు ♦ రంబులంతఁ
గొండొకతఱి సుర ♦ ల్గోరిన వాణీశుఁ, డవ్వారి కొదవించె ♦ నంతరంబు
పోరిలోనఁ బినాకి ♦ పోగిలె నించుక యంచు, వేల్పు లెల్ల జయించె♦విష్ణుఁడనిరి
కనలి శంకరుఁ డపుడు సిం ♦ గాణి విడిచె, దేవరాతున కిచ్చిరి ♦ దివిజు లరసి
జనకు నింటనుఁ జిరకాల ♦ మునికిఁ జేసి, ప్రాఁతవడి యది నేఁడిల్లు♦భగ్నమయ్యె.

ఆ॥ పరపురంజయంబు ♦ ప్రబల మియ్యది దీని
హరియు భార్గవుఁడు మ ♦ హాత్ముఁ డగు ఋ
చీకునకు నొసంగె ♦ నాకృతి నాతండ్రి
కిచ్చె నతఁడు నాకు ♦ నిడి కడంగి. ౪౫౯

క॥ వరణీయతపోనిష్ఠా, గరిష్ఠుఁడై యుండ నొక్క ♦ కారణమున మీఁ
దరయక వధించె నర్జునుఁ, డురుబలమున దుష్టబుద్ధి ♦ యుచిత మెఱుఁగునే. ౪౬౦

తే॥ తండ్రిఁ జంపిన పగచిచ్చు ♦ తవిలి కాల్ప
వాని నవ్వాని హరల ♦ వసుస క్షత్ర
కులము ముయ్యేడుమాఱు లు ♦ క్కున వధించి
శాంతి నొందితి యజనమ్ము ♦ సంతరించి. ౪౬౧

క॥ కాశ్యపున కవని నిడి యు, త్పశ్యుఁడనై యున్న నాదు ♦ తలఁపున మఱలన్
దృశ్యం బయ్యె వికారం, బోశ్యామలదేహ; నీస ♦ ముద్ధతి వలనన్. ౪౬౨

ఉ॥ కాంచెద నీదు క్షాత్రబల ♦ గర్వ మఖర్వ మటంచు లోన ము
న్నెంచినదానికి న్సరిగ ♦ నేఁడిదె నీవిలుగొమ్ము దీన ని
య్యంచితమౌ శరమ్మిడి స్వ ♦ కార్ముకటి సూపితి వేనిఁ బోర న
న్మించెదొ యోసరిల్లెదవొ ♦ మీఁద వచించెద నీప్రతాపముల్. ౪౯౩

ఆ॥ అనుచు జామదగ్న్యుఁ ♦ డడరిన వెడనవ్వు, బీరమునకు మేలి ♦ బిరుదు గాఁగఁ
బలికె దాశరథియుఁ ♦ బ్రాగల్భ్యమున గురు, సన్నిధాన మని ప్ర ♦ చారముడిగి.

—♦ శ్రీరాముఁడు భార్గవు నుడులకుఁ బ్రత్యుక్తులిచ్చుట ♦—

తే॥ తండ్రి ఋణమునుఁ దీర్చితి ♦ తద్ద నాకుఁ
బ్రియమ యయ్యది క్షాత్రంబు ♦ పేర్మి నెడఁగ
నాడి తద్దాని కేనియు ♦ నలఁతి పలుకు
పలుక బ్రాహ్మణు లెట్లు ను ♦ పాస్యు లగుట. ౪౯౪

క॥ నాపైన వాత్సల్యంబున, నే దైన్యం బనక వేఁడె ♦ నిత్థచరితుఁ డీ
క్ష్మాదయితుఁ డితని నుడుల న, నాదరముం జూపి తిట్టె ♦ తదియే చాలున్.

తే॥ రఘువు నెఱుఁగరొ; మాంధాత ♦ రావు గనరొ;
యల కకుత్స్థు ప్రతాప మి ♦ ట్లెఁగ వినరొ;
యెంద ఱెట్టిరొ; రవివంశ్యు ♦ లెన్నటికినిఁ
దమకుఁ దారు పొగడుకోలు ♦ దశకు రారు. ౪౯౫

మ॥ నికృతిం గూర్పఁ దలంపు పూని రని యే ♦ నిర్దోష పై కొన్నహా
త్యకుఁ బాల్పై రని యేనిఁ గూలి రపుడ ♦ ట్లాగుబ్బుగా హైహయుల్
సకలం బొక్కఁడు గాఁగ క్షత్రకులముల్ ♦ సంహార మొందించు నీ
కకటా; యొక్కఁడ యేనిఁ బుణ్యపురుషుం ♦ డయ్యాపదం దోఁపఁడే. ౪౯౬

క॥ తిట్టుదురు వాక్కుబలిమిన్, మెట్టుదురు తపంబు కలిమి ♦ మేలాఁ గీడా
నిట్టట్టు సేయ నొల్లరు, చుట్టంబు లటంచు భూమి ♦ సురుల న్నృపతుల్. ౪౯౭

ఆ॥ నాఁడె యనఁగ నేల ♦ నేఁడేని బాడబ, ద్రోహమునకు నింత ♦ దొడరఁ బోము
నీదు మానసమున ♦ నెలకొల్పినది యెద్ది, సేయుమనెద వదియ ♦ చేయువాఁడ.

క॥ అనుపలుకులు ములుకుల క్రియఁ, దన మది నాటుకొనఁ జెదరి ♦ త న్నెదిరి గనుం
గొననీని యలుక వొడమిన, నసె భార్గవుఁ డడుపు గొన్న ♦ యహి నెరి దోఁపన్.

ఉ॥ చంపినవాఁడ నెందఱినొ ♦ చంపక వీడితి నీదు తండ్రి నా
జంపున నేఁటి కీవలని ♦ చాలమి నాచెవులార వింటి నా

ఫం బొనరించువాఁడవటె ♦ పాపము గాదననేల యిట్టిని
న్నుం బెదనుత్తమస్థితికి ♦ హాయిగ నెమ్మన మారఁజిల్లఁగన్. ౪౭౨

తే॥ మఱియు మిగిలిన క్షత్రియ ♦ మండలంబు
గాల్చెదనుఁ దోఁకచిచ్చు నాఁ ♦ గవియఁ జొచ్చి
శాంతి గైకొన్న మెత్తురే ♦ శౌర్యఘనుని
ధరణిఁ గేవలనీతి కా ♦ తరుఁడ కాఁడె. ౪౭౩

క॥ అని పైని దుముకు నాతనిఁ, గని రఘురాముండు కన్నుఁ ♦ గవఁ గెంపెనయన్
మునుకొని నిలఁబడి తోఁ ని, ట్లనె బీరము తనదు ధనమ ♦ యై నలువొందన్.

ఆ॥ తాపసుఁడ వటంచు ♦ ధరణీసురుఁడ వంచు, గాధి పుట్టిఱికము ♦ గంటి వంచు
వదలినాఁడ నింత ♦ వట్టు మాట లిఁకేల, తెమ్ము విల్లు నమ్ముఁ దెంపుసేసి.

—♦ శ్రీరాముఁడు భార్గవుని విల్లందికొనుట ♦—

చ॥ అని శరము న్శరాసనము ♦ నాక్షణమే కొని మార్విఁగోటిఁ గ్ర
క్కునఁ దవిలించి యమ్ములికి ♦ గ్రొమ్మెఱుఁగు ల్వెడల న్ఘటించి చూ
డ్కున జగమెల్లఁ గాల్చునఱి ♦ కి న్నెఱబీరము సారమొప్ప ని
ట్లని వివరించె భార్గవుఁ డ ♦ హంకృతి వోఁ వెఱఁగందు చుండఁగన్. ౪౭౬

ఉ॥ మోఘము గాదు దివ్యశర ♦ ముఖ్యము వైష్ణవ మిట్టిదీనికి
న్నీఘనపుణ్యలోకముల ♦ నెట్టన గూర్తువొ పాదము ద్రెగన్
రా ఘటియింతొ బ్రాహ్మణుల ♦ ప్రాణముల న్గెడపంగఁ జూడరీ
రాఘవు లెన్నఁడున్ మది ది ♦ రం బొనరించి వచింపు మిత్తఱిన్. ౪౭౭

క॥ అనుచుండ రాముఁ గనుఁగొన, మునులును దివ్యులును నలువ ♦ మునుకొనిచదలన్
ఘనపుష్పకముల నిలిచిరి, కనుఁగవ లానందబాష్ప ♦ కణముల నీనన్. ౪౭౮

క॥ సురదుందుభులు మొరసె న, చ్చర లాడిరి పుష్పవృష్టి ♦ సంభృతయయ్యెన్
సరపి రఘురాము చరితము, సరసముగాఁ బాడె దేవ ♦ సంయమి వేడ్కన్.

—♦ పరశురాముండు శ్రీరాముని స్తుతించుట ♦—

తే॥ అంత రామునిఁ గమలాయ ♦ తాక్షు స్మేర
వదను రుచిజితమదను శ్రీ ♦ సదనుఁ గాంచి
పూర్వవృత్తాంతమునుఁ దల ♦ పోసి కొనుచుఁ
బొగడె జమదగ్నితనుజుండు ♦ నగతనూజ. ౪౮౦

ఆ॥ నినుఁ బురాణపురుషు ♦ నిఖిలలోకేశ్వరు, నజు ననాదినిధను ♦ నప్రమేయు
నక్షరస్వరూపు ♦ నానందఘను విష్ణుఁ, గంటి దామసాబ్ధిఁ ♦ గడచి మంటి. ౪౮౧

క॥ మాయాదూరుఁడ వయ్యును, మాయామనుజుఁడవు యోగ ♦ మాయాహ్వయల
క్ష్మీస్త్రీ యుతుఁడవునై యిట్టి, శ్రీయముఁ బొడసూపితే వి ♦ ధుంతుదదమనా.

సీ॥ మును ఘోరతపమున ♦ మొనసి యే నర్థింప, సాక్షాత్కరించి నే ♦ స్తమ్ము సూపి
మద్యోగశక్తి ని ♦ న్మలయునప్పగటున, నని దుర్నిరీక్షత ♦ నంది తొలుతఁ
గృతవీర్యసంతతి ♦ గీటడంచి కడంగి, దుష్టుల నమ్మెయి ♦ ద్రుంచి వెలయు
మేను దాశరథినై ♦ యెలమిమై సీతతోఁ, గూడి దర్శన మిడి ♦ కోర్కెలెల్లఁ
దీర్తు నని చనె నమ్మహా ♦ తేజ మీవ, యీవ గెలిచితి నన్నుసి ♦ గ్గేల నాకు
నాంబలువు గొంటి వింకఁది♦న్నని తెరువున, మెలఁగఁ గాంచెద నీదయ♦వలనరామ.

తే॥ బ్రహ్మ మున్నగు వారునుఁ ♦ బడయలేరు
ప్రకృతి కవ్వలనగు నిన్నుఁ ♦ బరమపురుష
యడె త్వదాధార త్వద్విష ♦ య యగు మాయ
చేరి యెల్లకార్యమ్ములు ♦ సేయుచుండు. ౪౮౪

తే॥ లేవు గమనాదు లవ్యాప్తి ♦ లేదు వికృతి
లేదు పుట్టు మున్నగు నాఱు ♦ లేవు నీకు
నీట నురుఁ గగ్గి ధూమంబు ♦ నెఱి నజాండ
కోటి నీయందుఁ దోఁచు జం ♦ జాట మభవ. ౪౮౫

క॥ లే దాత్మకు సంసారము, లేదు జడము మదికి జ్ఞాన ♦ లేశము నెన్నం
డాదోయి గూండు జీవుఁడు, తాఁ దోఁచెడు నెఱుక మఱపుఁ ♦ దవులనధీశా.

తే॥ జడము చిద్యోగమున సంప్ర ♦ సాద మొందుఁ
జిఱియు జీవభావంబునఁ ♦ జెనయు జడత
జలము నగ్నియు నన్యోన్య ♦ సంప్రయోగ
మున నొకొండు విపాకంబు ♦ మొనయునట్లు. ౪౮౭

మ॥ అవిచారోదిత విద్యసూడగు నవి ♦ ద్యాయోష దేహాదిసం
భవ మొందించి త్వదీయఁ జిత్కల గ్రిహిం ♦ పన్ జీవసంజ్ఞుండు దోఁ
చి వివేకోన్నతిఁ బాసి దేహహృదవి ♦ చ్ఛిన్నాభిమానంబునన్.
గవియున్ గర్తృత భోక్తృతన్ సుఖము దుః ♦ ఖం బంచు భావించుచున్.

క॥ సద్గురుబోధామృతమున, హృద్గతదోషములు తెరల ♦ నీశస్వైక్యో
ద్యద్గుణయోగకలాసం, పద్గమ్యం జెడయు జీవ ♦ భావము రామా. ౪౮౯

సీ॥ ఏనాఁడు నెవ్వాఁడు ♦ నీనామము స్మరించు, భాగ్యవంతుల పడి ♦ పంచకాపో
యేవేళ నేవాఁడు ♦ నీ విశ్వజనహిత, చారిత్రవాదుల ♦ సంగడీఁడో
యేకాల మెవ్వండు ♦ నీ కామ్యవర్షి మం, త్రావృత్తిపరుల దా ♦ యము బలఁగమొ
యేముహూర్త మెవండు ♦ నీమూర్తికై ంకర్య, మించువారల యింటి ♦ యిల్లటమ్మొ
వాఁడు దరిఁజేరు నవ్వాని ♦ వలచు ముక్తి
వానికి లభించు గురుబోధ ♦ వాఁడె గురుఁడు
వాని మొనయదు మాయావి ♦ వాద మట్టి
వాఁడు నీవాఁడు లోకైక ♦ వంద్యచరణ. ౪౯౦

క॥ కాన భవత్పదభక్తివి, హీనుల నెప్పాట నైన ♦ నెనయవు మోక్షం
బేనిం దత్త్వజ్ఞానం, బేని న్సుఖమేని సర్వ ♦ హితసంచరణా. ౪౯౧

ఆ॥ నీకుఁ గేలు మోడ్తు ♦ లోకాధినాథ ; క
ల్యాణమూర్తిధర ; ద ♦ యాసనాథ ;
యభయ మొసఁగు మిమ్మ ♦ హాశుగమున నాకు
పుణ్యలోకచయముఁ ♦ బొలియఁ జేసి. ౪౯౨

వ॥ అక్షతత్రిలోకంబుగా లోకం బంతయు జయించి యొక్క-మహోద్ధ్వరంబునం బుడమి యెల్లఁ గాశ్యపునకు దక్షిణగా నొసంగిన నాతండు నాకెగ్గు దలంచి యిమ్మహితలమ్మున నాయునికినేనియు సమ్మతింపం డయ్యె నది కారణంబుగా ననుదినంబు నెచ్చోట మెలంగియుం బ్రదోషకాలంబు వెరయునంతకు మున్న మహేంద్రాచలంబునకుం జేరుచుండెడువాఁడ నట్లగుటం జేసి. ౪౯౩

క॥ గతివిచ్ఛేదం బైన న, గతికత్వం బొదవుఁ గానఁ ♦ గాదది నీవే
గతి యని కొలిచి తరించెద, వితతము సంసారవార్ధి ♦ విశ్వాధీశా. ౪౯౪

ఆ॥ అనిన నట్లొనర్చి ♦ యతని స్మేరాంకూర
మొలయఁ గని రఘూద్వ ♦ హుండు వేఁడు
మెద్ది యేని సంయ ♦ మీంద్ర ; నీకొసఁగెద
నెరదు లేదు సుంత ♦ నీకు నాకు. ౪౯౫

క॥ అనినఁ గృతార్థుఁడ నైతిని, మనము భవత్పాదభక్తి ♦ మకరందమునన్
మనఁ గలిగినఁ జాలునుఁ బే, రొక్కనఁ జాలనుఁ గోర్కు లిఁక వి ♦ కుంఠాధిపతీ.

క॥ నా పొనరించిన యీ స్తవ, మేపురుషుఁడు చదువు వ్రాయు ♦ నెఱిఁగించు నతం
డా పుణ్యుఁడు నీపురమే, కాఁపురముగ నిలుచుఁ గాత ♦ కలకాలంబున్. ౪౯౭

ఆ॥ అనుఁడు రాముఁ డట్టు ♦ లయ్యెడు మనఁగ భా
ర్గవుఁడు వలగొనంగ ♦ రాఘవుండు
పూజ సేసెఁ దపసి ♦ పూజ్యుం డితం డని
యలరె జామదగ్న్యుఁ ♦ డధికతృప్తి. ౪౯౯

క॥ వెండియు నాతఁడు రాముని, నిండుమదిం బొగడి ♦ నెగడు నేటుకొనఁగ నా
ఖండలవందితు పీఠ్యాని, చండిమ మెడలఁగ యథేచ్ఛఁ ♦ జనియె మహేంద్రా.

వ॥ దిశలు విదిశలు వితిమిరత్వంబునం బ్రసన్న లగుటయుఁ దానునుఁ తిమిరంబుఁ బాసిన మనంబుతోడ సుప్రసన్నతం జూపట్టుచు దశరథాధీశుండు నవవధూమణి యగు సీతామహాలక్ష్మికిం దోడుగ సమరవిజయలక్ష్మిం బరిగ్రహించి యంచి తామోదోదయంబున మించు తనయునిఁ బ్రహితనయుని రఘురామునిం జేరి పరవసంబున మీఱి. ౫౦౦

క॥ ఆలింగన మొనరించె ద్రు, ఢాలింగితుఁ జేసె దయితు ♦ నవనిజ కనులన్
జాలఁగఁ బులకలు చాల్కొన, మేలని పొగడిరి వసిష్ఠ ♦ మిలితులు మునులున్.

చ॥ దివి భువి సంస్తుతు ల్మొనసె ♦ దేవవిభుం డభ్ర నంచు మెచ్చె వా
ద్యవితతు లోలి బూరటిలె ♦ నాధి జగజ్జగతీశులం దొఱం
గి వెడలె క్షత్రియాంతకుఁడు ♦ గిట్టి బడల్పడి నమ్రుఁడై రఘు
ప్రవరు యశఃప్రతాపములఁ ♦ బాడుచు నాడుచుఁ బోవఁ బార్వతీ. ౫౦౨

తే॥ అత్తఱి నదృశ్యుఁడై సమ ♦ నంతరమున
నున్న వరుణున కాధను ♦ వొసఁగె రాముఁ
డెరఁగె మునులకు జనకున ♦ కిట్టు లనియె
నతని యుమ్మలికం జెల్ల ♦ నాత్మఁ దలఁచి. ౫౦౩

ఉ॥ చాతకపఙ్క్తి వారిద మొ ♦ సంగు జలం బటు నీదు శాసనం
బీతఱిఁ గోరుచున్నది య ♦ ధీశ; భవద్భృత సేన నేఁడె సా
కేతముఁ గాంచువేడ్క నడఁ ♦ కించిన భార్గవుఁ డేగె నెల్లరన్
బ్రీతులఁ జేయుమన్నఁ బృథి ♦ వీపతి రీతి నహించి క్రమ్మఱన్. ౫౦౪

ఆ॥ సుతునిఁ గౌఁగిలించి ♦ చొక్కుచు శిరము మూ
ర్కొనుచుఁ బులక లెగయ ♦ ననుచు హర్ష
వారి గడలుకొనఁగ ♦ వల్లెయం చానతి
సేసె వైభవంబు ♦ చెలఁగ నంత. ౫౦౫

క॥ చేరి రయోధ్యకుఁ బెండిలి, వా రంతటిలోన పురము ♦ వారు నెదురురా
నైరి మహోత్సవ మయ్యెది, సారంగాక్షీ; యదృష్ట ♦ శాలుర కబ్బెన్. ౫౦౬

సీ॥ సిరి మించు పడగల ♦ చేలాంచలముల సం, చలనంబు లల పైఁట♦చలనములుగ
నెఱినొప్పు బలుచాంది ♦ నీల రింగుల తళ, త్తళలు కుచ్చెళ్ళపై ♦ తళతళలుగఁ
దులకించు బహురత్న ♦ తోరణంబుల కలా, స్ఫురణ లాభరణవి ♦ స్ఫురణములుగ
లలి మీఱు కలువడ♦మ్ముల చాల్పునఁ బొసంగు, హాసమ్ము లుల్లాస♦హాసములుగఁ
బూలపఱపు చొక్కారంపుఁ ♦ బోఁడుములును
మంగళాతోద్యరవణప్రి ♦ సంగములునుఁ
దీపగుపదార్థముల తఱి ♦ తీపులునుఁ జె
లంగఁ జూపట్టెఁ బురి శోభ ♦ నాంగి యగుచు. ౫౦౭

—♦ పురప్రవేశాది వర్ణనము ♦—

తే॥ పురిఁ దిరిగి వచ్చి తో నంతి ♦ పురికిఁ జనిరి
కూడి కైక సుమిత్రయుఁ ♦ గోసలాత్మ
జాతయునుఁ దమతోడికం ♦ జాతనేత్రి
లెలమి రా నెదురై మహా ♦ త్కాలిక లొలయ. ౫౦౮

క॥ నీరాజన లెత్తి శుభా, చారంబులు నెఱపి సత్ప్రి ♦ సంగము లెసఁగన్
గూరిమి గృహప్రవేశన, మారంభము లెల్ల జరిపి ♦ రయ్యోవిధులన్. ౫౦౯

తే॥ అట్లు కులదేవతాపూజ ♦ లాయతనస
మర్చనాజపహోమము ♦ ఖ్యములు గూర్చి
వరుస నంతర్గృహమ్ముల ♦ వారిఁ జేర్చి
రంచితామోదకలికాప్ర ♦ పంచితముగ. ౫౧౦

ఆ॥ గురుల కేర్పడంగఁ ♦ గూర్మిమై మ్రొక్కించి, యఖిలదానశతము ♦ లర్థి ద్విజుల
కటు సువాసినులకు ♦ నందించి యాశీర్వ, చనము లొలయఁ జేసి ♦ సంభ్రమమున.

క॥ ఆచారపూతు లటు వి, ద్యాచతురులు నగుచు నెగడు ♦ నాదంపతులన్
బూచినతంగెడు లట్టిస, మాచారము లెలయఁ జేర్చి ♦ రంతి పురులలోన్.

ఉ॥ బంగరుకోళ్ల మంచములు ♦ బాగగు రత్నమయోపధానముల్
రంగగు హంసతూలికలు ♦ రాణల దంతపుఁ గీలుబొమ్మ లా
సింగపుమోముపీఁట లటు ♦ చెల్వగు మేలిమితూఁగుటుయ్యెలల్
హంగు లెసంగ వారి హృద ♦ యంగమకేలిగృహాలి గోలిమిన్. ౫౧౩

క॥ తను తమ పత్నులతోను, త్తము లారాకొమరు లెలయు ♦ తవులున నిజధ
ర్మము మీఱక సుఖయించిరి, ప్రమదలహరి నెపుడు గురులు ♦ పాయక దోఁగన్.

సీ॥ మొలకనవ్వులు సిగ్గు♦లొలుకు మోముల విప్పు, తవులాటములతోడి♦తనివు నొడువ
నోరచూపుల నొత్తు ♦ నొడికారపుంజోక, యెడలేని తమకంబు ♦ హెచ్చరింప
నెయ్యమ్ముతియ్యమ్ము ♦ నెఱపల్లుబడి తీరు, మెలఁచు సౌభాగ్యమ్ము ♦ మెచ్చుసూపఁ
దొడిఁబాటుజడనులఁ ♦ దొడరు నొయ్యారంబు, వెలపెచ్చు నెఱి కచ్చు ♦ వెల్లడింప

విరియఁబడు క్రొత్తకోడండ్ర ♦ విలసనములు
కొడుకుకుఱ్ఱల కూర్చుసా ♦ కూతములును
దల్లిదండ్రుల యుల్లము ♦ ల్తద్ద పొంగి
పొరలి పూర్వజన్మంబులఁ ♦ బొగడ నడరె. ౫౧౫

క॥ జగమెల్ల నేలువారలై, సుగుణోపేతులు నలువురు ♦ సుతులును స్నుషలున్
దగవుమెయిఁ గొలుచువారలై, యగణితవిభవం బనంగ ♦ నడె కాడె చెలీ.

ఉ॥ చిత్తములం దలంపు లొగిఁ ♦ జేరక మున్నె ఘటింప నెంచుచున్
దత్తఱపాటులే కెలమి ♦ దారసిలంగ మెలంగ నేర్చుచున్
హత్తినప్రేముడి న్గురుస ♦ మర్హ్వాణలం బురికొల్పుచు న్నభా
యత్తలఁ జేసి రత్తలు స ♦ మాదృతలై స్నుషలన్ హిమాద్రిజా. ౫౧౬

తే॥ తమ్ము లెవ్వేళ నిజశాస • నమ్ము పేచి, నిలువ రాచకర్జంబుల ♦ నిర్వహణము
తండ్రి మదికెక్క హర్షసం♦ధాయకముగ, నెరపె రాముండు ప్రజలెల్లఁ♦ నేర్చిపొగడ.

సీ॥ సీతాసరోజినీ ♦ శ్రీరాజహంసంబు, జానకీవదనాబ్జ ♦ షట్పదంబు
పృథ్వీసుతాధర ♦ బింబికాఫలశుకం, బవనిజాలతికాశ్రి ♦ యద్రుమంబు
మైథిలీమల్లికా ♦ స్మయతపాగమము నై, దేహీవయస్సరి ♦ ద్దృప్తగజము
నిమివంశవర్ధనీ ♦ నియమఫలము దేవ, యజనభూ తాసంద ♦ నామృతంబు

రాముఁ డటు సహధర్మిణీ ♦ రాగవాహి, సీమహాఘార్మిరసార్ణవం ♦ బామరాస్త
కామతాశ్రీముఖము హిత♦కామ్యకాము, దీమహాము నా నెగడె శైల♦దేవతనయ.

క॥ సీతారామవివాహం, బో తలిరుంబోఁడి మనన ♦ మొనరించు గుణో
పేతులు భద్రపరంపర, లాతతముగఁ గాంచి శ్రేయ ♦ మందుదురు తుదిన్.

ఉ॥ రామకథాసుధార్ణవత ♦ రంగభృతిం బెను పొందుచున్న శ్రీ
రామకథాఽమృతం బిధి వి ♦ రామ మొకింతయు లేని భక్తి నే

శ్రీమహితాత్ముం లానుదురో ♦ చిత్సుఖభూమమహాహ్లాదయంబులు
ద్దాములు వారి కబ్బుఁ జుమీ ♦ తారకమంత్రరస్సైకతావరతన్. ౧౨౧

శా॥ ద్రాక్షాపాకము నారికేరరసముం ♦ దార్కాణగాఁ దేనె పుం
డ్రేక్షుస్ఫూర్జితసారముం బెరయ కే ♦ క్లేపాటి మాధుర్యమా
నక్షుద్రిం బెటులో సుధాద్రివ మసు ♦ త్యాగార్థనాన్వేషణన్
దీక్షన్ రామకథాఽమృతంబు వెలుతు ♦ ల్దీప్చన్ రసోల్లాసినీ. ౧౨౨

ఆ॥ అనుచు వివరముగ మ ♦ హాదేవుఁ డెఱిఁగింప, నమ్మహేశి తత్క ♦ థాఽమృతాబ్ధి
నోలలాడు చుండె ♦ నోరంతప్రొద్దుఁ ద, ద్రసవిశేషతత్వ ♦ రత్వమునను. ౧౨౩

కవిరాజ విరాజితము.

శివగురుశంకర ♦ చిత్తవశంకర ♦ చిన్మయరూపవి ♦ శిష్టపదా
భవహరతత్త్వద ♦ భావితలక్ష్యవి ♦ భాసిపరాత్పర ♦ భావపరా
కవివరవర్ణిత ♦ కావ్యకథాఽమృత ♦ కాంక్షిజనశ్రితి ♦ గమ్యరసా
ప్రవిమలదృక్కవి ♦ రాజితవృత్తక, భక్తసుఖప్రతి ♦ పాద్యయశా. ౧౨౪

క॥ మోహనలీలాముద్రిత, సాహంకృతిలోకలోక ♦ నాతిగవృత్తీ
సోహంభావసమరసా, ధ్యాహ్యాత్మ్యుపలభ్యనిజమ ♦ హాసంపత్తీ. ౧౨౫

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీదసఖమాధవవి ♦ రించిపదలక్షితవి ♦ శిష్టమహిమాధికృతియోగా
భేదవిహితప్రకృతి ♦ భేదినిగమాంతవిని ♦ వేదితచిదాత్మపరభాగా
సాదరకృతాదరని ♦ హంతృహతకాంతకస ♦ మాహితసమాహితధృతిశ్రీ
మోదముఖయుగ్మపరి ♦ ముక్తవినమజ్జనస ♦ మూహావృతమంగళమహాశ్రీ. ౧౨౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునందుఁ
బాలకాండంబున దశమాఽశ్వాసము.

బాలకాండంబు బరిసమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః

# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౨౦ | శుకుగ | శుకుఁగ |
| ,, | ౨౨ | హన్తా | హస్తా |
| ౪ | ౭ | పోతవో | పోఁతవో |
| ,, | ,, | పోత | పోఁత |
| ౫ | ౫ | లకు | లకుఁ |
| ,, | ౭ | ♦ నియ్య | ని ♦ య్య |
| ౬ | ౧౨ | డుపీన | డుఁబీన |
| ౧౦ | ౨౩ | హార్రి | హాత్రి |
| ౧౨ | ౧౩ | యఫా | యథా |
| ౧౩ | ౧౬ | వెనో | వెనొ |
| ౧౫ | ౫ | నవిది | న ♦ విది |
| ౧౭ | ౧౩ | కానుబ్ర | కానుప్ర |
| ౧౮ | ౧౨ | ల్స్వన | ల్సమ |
| ,, | ౧౪ | సరయు | నరయు |
| ౧౯ | ౨౦ | రహాహః | రహాహ |
| ౨౧ | ౧౧ | సుపధ | సుపథ |
| ,, | ౨౪ | బ్రహ | బ్రహ్మ |
| ౨౩ | ౧౪ | సెవు | సెపు |
| ,, | ౨౮ | ప్రాజు | ప్రాజ్ఞు |
| | ౩౦ | నాఁడుగ | నాఁడుఁగ |
| ౨౫ | ౧౦ | గాగిక | గాశిక |
| ౨౭ | ౮ | కావే | కావె |
| ,, | ౨౦ | తనయా | తనయ |
| ౨౮ | ౮ | నిపుణా | నిపుణ |
| ,, | ౧౬ | యగునే | యగునె |
| ,, | ౧౮ | తండ్రీ | తఁడ్రి |
| ౨౯ | ౨౯ | జిగిఁకొ | జిగిఁగొ |
| ,, | ౩౦ | నయ | నయన |
| ౩౦ | ౨౪ | మూర్తీ | మూర్తి |
| ,, | ౨౬ | హారీ | హారి |
| ౩౨ | ౨ | నయ్యా | నయ్య |
| ,, | ౧౮ | లోకొ్క | లోకొ్క |
| ౩౫ | ౨౨ | కాదే | కాదె |
| ౩౬ | ౧౦ | పధ | పథ |
| ౩౮ | ౧౭ | న్నతి | న్నతిం |
| ౩౮ | ౧౮ | పులం | పులఁ |
| ,, | ౨౩ | ర్వఁతి | ర్వతి |
| ౪౧ | ౫ | నదటి | నచటి |
| ౪౫ | ౩ | బాహ్లి | బాహ్లి |
| ౪౮ | ౨౪ | తాంగీ | తాంగి |
| ౪౯ | ౧౪ | గోష్ఠీ | గోష్ఠి |
| ౫౪ | ౭ | మొదవె | మొదిఁగె |
| ౫౭ | ౩౦ | నేటుకొనసగు | నెకొ్క♦నంగను |
| ౫౮ | ౧౬ | నఁజనె | నచనె |
| ౬౦ | ౧౫ | యునే | యునె |
| ,, | ౨౫ | కంటే | కంటె |
| ౬౧ | ౧౮ | ముక్తుడా | ముక్తుఁ ♦ డా |
| ౬౨ | ౫ | సతి | నతి |
| ౬౬ | ౧౨ | వ్రతఁగ్ర | వ్రతగ్ర |
| ౭౩ | ౨౫ | సంగితా | సంగితో |
| ౭౫ | ౧౫ | జిహ్నాం | చిహ్నాం |
| ,, | ౨౨ | నెమ్మ | నెమ్మ |
| ,, | ౨౩ | వుబో | వుఁబో |
| ౮౩ | ౨ | పధా | ప్రధా |
| ౮౭ | ౨౩ | తను | దను |
| ౧౦౦ | ౨౮ | నుతింవ | నుతింప |
| ౧౦౩ | ౩ | తృ_ఁ | తృప్తిఁ |
| ౧౦౫ | ౪ | త్సల | త్యల |
| ౧౦౬ | ౫ | * | అనథరింపుము కొండరాచూలికి శశిఖండ మాలి యఖిలాండ నాయకు చారిత్రంబిట్లువినరింపందొడరె |
| ౧౨౩ | ౨౦ | స్తుత్వా | స్తుత్యా |
| ౧౩౩ | ౨ | గము | గమ్మ |
| ,, | ౨౦ | దన | డన |
| ౧౫౦ | ౧౫ | శేయ | శేశయ |
| ౧౬౫ | ౧౦ | మోము | మోవి |
| ౧౬౭ | ౧౬ | ♦ బల్ల | బల్ల ♦ |
| ౧౭౮ | ౨౬ | నంచ | నంజ |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౭౩ | ౩ | దుట | దట |
| ౧౯౨ | ౧౨ | ద్ధై తా | దైవతా |
| ,, | ౧౩ | పండుపు | పండువు |
| ౨౦౦ | ౨౫ | సర్వ | సర్వ |
| ౨౦౨ | ౩౦ | తల్ప్ర | తాప్ర |
| ౨౨౯ | ౨౧ | యున్న | యున్నె |
| ౨౪౧ | ౮ | జాడ | జూడ |
| ౨౬౦ | ౧౭ | ♦ గంగా | గం ♦ గా |
| ౨౬౪ | ౫ | లలడు | లడు |
| ౨౬౮ | ౨౮ | సది | నది |
| ౨౬౭ | ౧౯ | —♦ సముద్రమథనము ♦— | |
| ,, | ౨౮ | ద్ధరం | న్ధరం |
| ౨౮౧ | ౨౧ | చుఁడ | చుండ |
| ౨౮౪ | ౨౧ | చట | చటు |
| ౨౭౪ | ౨౭ | పద్యము లేదు క౦॥ ధన్యవుసు వదాన్యపుసా, జన్యకలాభ్యంచి తాత్మ ♦ సామ్యవికాసా నన్యవుబుధమాన్యవుత, త్క న్య వు నైనిమీంఁదనన్న ♦గలసెదవనినద | |
| ౨౭౮ | ౧౬ | తేటి | తేఁటి |
| ౨౯౯ | ౩ | పోఁతై | పోతై |
| ౩౦౫ | ౨౭ | జనీస | జనీన |
| ౩౦౦ | ౧౮ | పోసు | పోసి |
| ౩౧౪ | ౨౨ | నిష్ఠి | నిష్ఠి |
| ౩౧౬ | ౫ | మలక | మలఁక |
| ౩౨౩ | ౨౭ | నేతు | నేను |
| ౩౪౯ | ౧౦ | పఁడాఁ | పఁదాఁ |
| ,, | ౨౩ | పత్వా | వ ♦ త్వా |
| ౩౫౪ | ౧౫ | -♦ మన్మథోపాలంభము ♦- | |
| ౩౫౬ | ౧౨ | వీకం | వీఁకం |
| ౩౮౪ | ౭ | రుణో | రుణో |
| ౩౮౭ | ౨ | లనన | లనక |
| ,, | ౩౦ | తెల్వి | తెల్విఁదే |
| ౩౮౯ | ౧ | దేటంగ | టంగ |
| ౩౭౧ | ౩ | మొనరిం | మొనయిం |
| ౩౭౨ | ౨౩ | ప్రథా | ప్రథా |
| ౩౭౩ | ౨౫ | దమృత | నమృత |
| ౩౭౮ | ౨౮ | నర్తు | నర్తు |
| ౩౭౭ | ౧౪ | లఁగుచుద | లఁగెదద |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౭౯ | ౬ | వేద్కద | వేద్కద |
| ,, | ౧౭ | నిన్పొ | నిన్చొ |
| ౩౯౧ | ౨౮ | జుల | ముల |
| ౪౦౦ | ౨౮ | దెక | దేక |
| ౪౦౩ | ౧౮ | వారధి | వారిధి |
| ౪౦౫ | ౨౩ | ర్చెనో | ర్చెనో |
| ౪౦౭ | ౨౧ | గొణి | గణి |
| ౪౦౯ | ౧౩ | ముస్నె | ముస్నె |
| ,, | ౧౯ | బెపె | బైపె |
| ౪౧౨ | ౧౩ | మహి | మహీ |
| ౪౧౫ | ౨౭ | ♦ నూత్న | నూత్న |
| ౪౧౭ | ౨౭ | అంజి | నెంజి |
| ౪౧౯ | ౨౩ | సంస్కృ | సంస్క |
| ౪౨౦ | ౨౩ | పబడి | పఁబడి |
| ౪౨౧ | ౬ | ధావ | ధాన |
| ౪౨౩ | ౪ | ల్వొత్తు | ల్వొల్తు |
| ౪౨౪ | ౨౫ | గింతగే | గింతఁగే |
| ౪౨౯ | ౪ | వృద్ధ | వృద్ధ |
| ౪౩౦ | ౩ | ల్కళల్ | ల్కళ |
| ,, | ౭ | వించి | వింప |
| ౪౩౪ | ౧౧ | న్యఁథా | న్య థా |
| ౪౩౯ | ౨ | భావుని | భావిని |
| ,, | ౯ | డాన | డాస |
| ౪౪౫ | ౧౪ | బు | బుత్రి |
| ,, | ౧౫ | త్రవత్స | వత్స |
| ౪౫౦ | ౬ | యష్టు | యష్టు |
| ,, | ౨౭ | నిద్దా | నిద్దా |
| ౪౫౧ | ౨ | కల | గల |
| ,, | ౮ | చింప | చింపఁ |
| ,, | ౭ | కైశ | గైశ |
| ౪౬౧ | ౨౧ | తారుం | తార్థం |
| ,, | ౨౬ | తుల | తల |
| ౪౬౩ | ౧౧ | తేఁగె | రేఁగె |
| ౪౬౫ | ౧౭ | తెల్ల | రెల్ల |
| ౪౮౦ | ౧౪ | ఘుండుఁ | ఘుండు |
| ,, | ౧౫ | కుపయ | కుఁబయ |
| ౪౮౧ | ౧౬ | లిలా | లీలా |
| ౪౮౨ | ౮ | భోరన | భోరున |
| ౪౮౪ | ౧౮ | పొగడు | పొగడి |

# విజ్ఞాపన.

శ్రీరామకథామృతమను నీ గ్రంథరాజమును ప్రశస్తములైన గ్లేజు కాకితములపైని ముద్రింపించి ౨౮ వేల పద్యములను నైదు వాల్యములుగ కాలికో బైండులు చేయించుచున్నారము. విక్రయించుట కిష్టములేక చందాదార్ల సహాయముచే యిక్కార్యమును నెరవేర్చుచున్నారము.

యీ గ్రంథము యొక్క వాల్యము లైదును మఱికొన్ని గ్రంథములు షుమారు పదియును రు. ౨౦-౦-౦ లిచ్చు చందాదారునకు బంపెదము. చందాను ముందుగా పంపవలయును. యెప్పుడు తయారైన పుస్తకముల నప్పుడు వీ. పి. ద్వారా చందాదార్లకు పంపెదము. వీ. పి. ఖర్చులు మాత్రము చందా దార్లే భరింపవలెను.

వలయువారలు :—

మానేజరు,

తాతా ప్రెస్, నిడుబ్రోలు.

అనిగాని -

గ్రంథకర్త :

తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి,

చందవోలు,

బాపట్ల తాలూకా, గుంటూరు డిస్ట్రిక్టు.

అని గాని వ్రాయవలెను.